

SRIMAN NELATURU RAMADAS AYYANGAR

*VYĀKHYĀTĀ*

శ్రీ

శూద్రకమహాకవి విరచితమ్

# మృచ్ఛకటికనాటకమ్



సంస్కృతమూలముతోను

నెల్లూరి

శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారి

తెలుఁగు రసాస్వాదినీవ్యాఖ్యతోను

ముద్రితము





ప్రకాశకులు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనము, సైఫాబాద్, హైదరాబాదు - 4

# అవతారిక

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారి ప్రోత్సాహమున కీ. శే. శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారు సంస్కృత వాఙ్మయమునకు రత్నశిఖరములవంటి నాటక రాజములైన ఉత్తర రామచరిత్ర ముద్రారాక్షస మృచ్ఛకటికములకు చక్కని వ్యాఖ్యలు రచించిరి. తత్పూర్వమే వీరి అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్య వెలువడి యుండెను. కీ. శే. శ్రీ అయ్యంగారు మాతాతగారు శ్రీ వేదము వేంకట రాయశాస్త్రిగారికడ చెన్నపురి క్రైస్తవ కళాశాలలోను తర్వాత కొన్ని సంవత్సరములును అంతేవాసిగా నుండి సంస్కృతాంధ్రము లను, అందును సంస్కృతనాటక రహస్యముల నెన్నింటినో గ్రహించియుండిరి. వానినెల్ల ఈ వ్యాఖ్యలలో నిక్షేపించినారు. వట్టి టీకాతాత్పర్య అలంకారాది నిర్వచనములతోడి విద్యార్థి మాత్ర ప్రయోజనము నుద్దేశింపక ప్రౌఢ పరిశోధకోపయోగి నాటక ప్రయోగరహస్య, తచ్చరిత్రోద్ఘాటన పూర్వకములైన వ్యాఖ్యలు రచించిరి. పైగా చరిత్రాచార్యులునుంగాన చారిత్రకభాగములను కూడ చక్కగా చర్చించిరి. అభిజ్ఞానశాకుంత లోత్తరరామచరిత్ర వ్యాఖ్యలలో చాలభాగము తాతగారి యభిప్రాయములపైనే ఆధార పడినను ముద్రారాక్షస మృచ్ఛకటికములలో తమ యమూల్యాభి ప్రాయముల నిచ్చియున్నారు. ఈ మృచ్ఛకటిక ముద్రణమును సొంతముగా కన్నారంగాంచు భాగ్యము వారికి లేకపోయినది. అకాడమివారు ముద్రణకార్యమును నా కప్పగించినందున, అక్షర ముల కూర్చి ప్రూఫులు దిద్ది చివరి ప్రూఫులు వారికి పంపుచుంటిని.

అందులోను వారేవో తమకుతోచిన మార్పులు చేయుచుండిరి. ఉపో ద్ఘాతమున కూడ ఏదో చేర్ప దలంచియుండిరి. కాని సగమునకు పైబడిన గ్రంథమును చూచి వారు ఆకస్మికముగ తమ 83వ యేట పరమపదించిరి. ఇందువలన నా బాధ్యత ఇనుమడించినది. వారి రచన ననుసరించి మూలముతో సరిచూచుకొని సాధ్యమైనంత జాగరూకతతో ముద్రణస్ఖాలిత్యములు రాకుండ, నాశక్తికొలది నిర్వ హించితిని. బాగోగులకు సహృదయులే ప్రమాణము.

ఇట్టి నాటకరాజములకు వ్యాఖ్యలు వ్రాయించి, మహాపండి తులను పోషించి ఆంధ్రవాణికి మహత్తరమైన సేవ చేయుచున్న ఆంధ్ర సాహిత్య అకాడమీవారు ఎంతయు సంస్తుతి పాత్రులు.

16-4-1974 శాస్త్రి మనుమడు

మదరాసు వేదము వేంకటరాయశాస్త్రి

# విషయసూచిక

# ఉపోద్ఘాతవిషయసూచిక

# మృచ్ఛకటికము

## ఇందలి పాత్రలు - పురుషులు

సూత్రధారుఁడు.

చారుదత్తుఁడు - నాయకుఁడు

రోహసేనుఁడు - బాలుఁడు

మైత్రేయుఁడు - విదూషకుఁడు

వర్ధమానకుఁడు

సంస్థానకుఁడు - శకారుఁడు

విటుఁడు

స్థావరకుఁడు

ఆర్యకుఁడు - క్రొత్తరాజు

శర్విలకుఁడు

సంవాహకుఁడు

మాథురుఁడు

దర్దురకుఁడు

ద్యూతకారుఁడు

కర్ణపూరకుఁడు

అధికరణికుఁడు

శ్రేష్ఠి

ధనదత్తుఁడు - కాయస్థుఁడు

చందనకుఁడు

వీరకుఁడు

వసంతసేన విటుఁడు

కుంభీలకుఁడు

చండాలురు

శోధనకుఁడు

## స్త్రీలు

వసంతసేన - నాయిక

ధూత - చారుదత్తుని పత్ని

వృద్ధ - వసంతసేన తల్లి

మదనిక

రదనిక

## ప్రస్తావితులు

పాలకుఁడు - రాజు

రేభిలుఁడు

సిద్ధుఁడు

స్థలము - ఉజ్జయిని. కాలము - నాలుగు దినములు.

ఇందలి ప్రాకృతములు - శౌరసేని, అవంతి, ప్రాచ్య, మాగధి, అపభ్రంశములు.

శ్రీ

# మృచ్ఛకటికమ్

(రసాస్వాదిని)

## ఉపోద్ఘాతము

### ౧. వ్యాఖ్యావతరణిక

మా సాహిత్యవిద్యాగురువు, కవిసహృదయ చక్రవర్తి, కీ. శే. వేదము వేంకటరాయ శాస్త్రిలవారు హర్ష ప్రియదర్శిక నాటికకు సంస్కృతటిప్పణిని సంపూర్ణాంధ్రటీకను 1909 లో రచించి ప్రకటించినారు. దాని ముద్రణమున పుటలో పై సగమును మరల నిలువుగా రెండు సగములు చేసి అందు ఎడమతట్టు మూలమును కుడితట్టు సర్వగద్యముగా ఆంధ్రానువాదమును కూర్చినారు. క్రింది సగమున సంపూర్ణాంధ్ర వ్యాఖ్యయు, కూర్చినారు. అంతకును ముందు ఇది యొక క్రొత్తపద్ధతిగా శారదారంజనారే పండితుఁడు శాకుంతలమును పుటక్రిందిసగమున తనసొంత సంస్కృతవ్యాఖ్యయు, పైసగమున ఎడమతట్టు సంస్కృత మూలమును కుడితట్టు ఆంగ్లానువాదమునుంగా ప్రకటించెను. దానింగాంచి శాస్త్రిలవారు ఆ తెలంగున తామును సంస్కృత నాటకములను తెలుఁగు వ్యాఖ్యాదిలో తెలుఁగువారికై ప్రకటింపవలయునని మోజుపడిరి, అందుల తొలి ప్రయత్నముగా ఆ ప్రియదర్శికం బ్రకటించిరి. ఆ 'రే' పండితుని మార్గమునే అవలంబించి శాకుంతలమునే, గజేంద్ర ఘడ్కారులను పండితులు పుటక్రింది సగమున సొంత నూత్న సంస్కృతవ్యాఖ్యయు, పైసగమున ఎడమతట్టు సంస్కృత మూలమును కుడితట్టు ఆంగ్లానువాదమునుంగా ప్రకటిం

చిరి. వారికిని ఆవిధము ప్రియమయ్యెను. అది 1920 లో. 1916 లోనే శ్రీ శాస్త్రిల వారు వేంకటగిరి మహారాజాగారికి తమ యార్థికస్థితింగూర్చి ఒక జాబువ్రాయుచు తెనుఁగు సేవకైన తమ యుద్యమములం దెలుపుచో 'మన్ముద్రితగైర్వాణ ప్రియదర్శికా నాటకముద్రణ మార్గమున సంస్కృత నాటకములం బెక్కింటిని శాకుంతల మాలతీ మాధవ మహావీరచరి త్రోత్తర చరిత్రాదులను మూలవిరుద్ధార్థముగా ఆంధ్రీకృతములై యున్నవానిని వాస్తవార్థబోధకముగా వ్యాఖ్యాసమేతముగా భాషాంతరీకర్తృ కృతరస భంజన భంజనముగా ప్రకటింప వలసియున్నది.' అని వ్రాసిరి. ఘటకర్పరుల ప్రకటనం గూర్చి - 'అది యొకటి వచ్చినది' అని శిష్యులు వారితో అనఁగా, అన్నియు నాకు కోరి కలుగానేయుండఁగా వానికి ఇతరులు కార్యరూపముం గలిగించుచున్నా రని నిరాశ దుఃఖము చెందిరి, మఱి యేనుఁగు వారెక్కడ దోమను నేనెక్కడ! - అను నంతవాసి మాకు కలిగియున్నను ఈ నాటకవ్యాఖ్యాకార్యమును నామిత్రులైన వారి మనుమల చేతను ఇంకను పలువురిచేతను ప్రేరితుఁడనై, శాకుంతలమునకు రసాస్వాదిని యను నొకవ్యాఖ్యను, వారివద్ద నేర్చుకొన్నదానినే, గ్రంథము చేయువాఁడనై రచించి ఆ మను మలకే 1957లో ఒసంగితిని. మిత్రులు మరలనుం బ్రోత్సహింపఁగా ఆ యతిశాకుం తలమగు ఉత్తరరామచరితకును శ్రీ శాస్త్రిలవారికడ నేర్చుకొన్నదానినే తద్రసాస్వాది నిగా నొక వ్యాఖ్యవ్రాసి ఆ ప్రజానురంజనపాలన దీక్షా చరితమును భారత ప్రజానురం జక మహామాత్య నెహ్రూపండిత స్మారక సమర్పణ సేయంగా దానిని ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి యధ్యక్ష డాక్టరు-గా. బెజవాడ గోపాలరెడ్డి దొరగారియు తత్కార్య నిర్వాహక శ్రీ రామానుజరాయనింగారియు ఆదరమున అకాడమి ప్రకటింప అంగీక రించినది. అది వారిచే అట్లు 1965లో ప్రకటింపఁబడినది. ఇట్లు శ్రీ శాస్త్రిలవారి యుద్య మమైన నాటకవ్యాఖ్యా ప్రకటన కొంత సాఁగినది. అంతట ఆ యకాడమీవారే ఇంకను గొప్ప ప్రాచీన సంస్కృతగ్రంథములను సవ్యాఖ్యానముగాఁ బ్రకటింపఁ గోరియున్నారని యెఱింగి, నేఁటి భారత స్వరాజ్యమున సాధుకార్యదీక్షయు స్వార్థత్యాగమును లోక శివంకరాభినివేశమును సత్కారుసమవేతులకు ప్రజాహితపరాయణతయు, రాజ్యమును స్వతంత్రమును సొంతముం జేసికొన్నప్రజకు దానిని శాంతముగాను భద్రముగాను ఉంచుకొను తత్పరతయు నేర్పును వలంతి యగును అని రాజనీతి ప్రయోగ చతురమగు ముద్రారాక్షస నాటకమునకుంగూడ నేను శ్రీ శాస్త్రిలవారికడ నేర్చుకొన్న సాహిత్య మార్గమున వ్యాఖ్యవ్రాయఁగా దానినింగూడ ఆ మహనీయులే అకాడమీ తర పున ప్రకటింప గ్రహించి నన్ను ధన్యుం జేసినారు. అంతట ఆ మార్గముననే మృచ్ఛ

కటిక నాటకము మిక్కిలి యితివృత్త వైచిత్ర్యము పాత్రవైవిధ్యము కలిగి తక్కిన నాటకములకన్న పలుతెఱంగుల వేఱు తీరుదై విశ్వనాటక కవియగు షేక్స్పియరుం దలఁపించుచు వానికి వేయేండ్లు పూర్వగామి యైనట్టిది, ప్రయోగమున ప్రేక్షకుల మనసును ఎంతయు చూఱగొనునట్టిది కాఁగా, పదియంకముల పొడవుగల దానికిని ఆ మహనీయులయు ఆపరిషత్తుయొక్కయు ఆదరమును ఆశ్రయించి యథామతిగా ఇట్లే వ్యాఖ్య రచించితిని. ఇంతట మా గురువుల యుద్యమమును కొంత నిర్వర్తించిన వాఁడనైతినని ధన్యంమన్యుఁడనైతిని.

## ౨. మృచ్ఛకటికము క్రొత్తరకపు నాటకము

మృచ్ఛకటికము గీర్వాణమున పలుతెఱంగుల అనన్యాదృశమైన నాటకము. దశరూపకములలో ఇది ప్రకరణలక్షణ లక్షితమగును.

'ఆత్మశక్త్యా కవి ర్యత్ర కథాంనాయక మేవ చ
ఔత్పత్తికం ప్రకురుతే తద్ధి ప్రకరణం విదుః
ద్విధా ప్రకరణం తత్తు శుద్ధం సఙ్కీర్ణ మేవ చ
కులస్త్రీ రచితం శుద్ధం సఙ్కీర్ణం వేశ్యయా కృతమ్.'

భరతనాట్య.

'భవేత్ ప్రకరణే వృత్తం లౌకికం కవికల్పితమ్,
శృఙ్గారోఽఙ్గీ, నాయకస్తు విప్రోఽమాత్యోఽథవా వణిక్
సాపాయధర్మకామార్థపరో ధీరప్రశాన్తకః
నాయికా కులజా క్వాపి వేశ్యా క్వాపి ద్వయం క్వచిత్.'

సా. ద. vi 224-6.

మృచ్ఛకటికము నిజముగా ఏ తల్లక్షణలక్షితముగా నున్నది. ఇందు అంకములు పది. ఇందు వివిధ రసములున్నను శృంగారము అంగిగానున్నది. ఇతివృత్తము పురాణ బృహత్కథాది పూర్వాకరములనుండి గ్రహింపఁబడినది కాదు, మఱి కేవలము కవికల్పితము. నాయకుఁడు పుట్టువుచే బ్రాహ్మణుఁడు, వృత్తిచే వర్తకుఁడు-'ద్విజసార్థవాహుఁడు.' అతఁడు ధీరశాంతలక్షణములు గలవాఁడు - నాయిక భోగముది, కులజయు ఒకతె కలదు. కావున ఇది సంకీర్ణ ప్రకరణమగును.

ఇట్లు వట్టి లక్షణపారాయణ మాత్రమున మృచ్ఛకటియొక్క నిజమైన తత్త్వము తీఱు తెలియరాదు. ఈ శాస్త్రమును గ్రహించి యనుసరించుచునే శూద్రక కవి దానిని ఉల్లంఘింపఁ దివురును. అతనికి క్రొత్త మార్గములమీఁదనే కన్ను. నిజముగా నతఁడు ఒక క్రొత్త తెలుఁగు నాటకమునే రంగమునకు తెచ్చినాఁడు.

శూద్రకుఁడు సంప్రదాయనియమసేతువును బహువిధముల ఉల్లంఘించినాఁడు. ఇందు శాస్త్రముబడి, ప్రత్యంకమును 'ఆసన్ననాయకము'గాదు. ఎన్నింటనో నాయకుఁడు అగపడఁడు వినఁబడఁడు. నిద్రంబోని యసాధారణ దృశ్యములు నిద్ర జోరావరి (బలాత్కారము) జగడములు మొదలైనవి రంగాన చూపక మానవలసినది అని భరతానుశాసనము. మఱి శూద్రకకవి యీ యసాంప్రదాయికముల నెన్నింటినో ప్రదర్శించినాఁడు. ఇట్టి యుల్లంఘనమునకు భాసుఁడు ఇతనికి కొంత మార్గదర్శకుఁడు కానోపును. శృంగారమునను ఇందు నాయకుఁడును నాయికయు రంగాన నొండొరుల గాఢాలింగనము చేసికొందురు. శాకుంతలమున ఒక్క అధరచుంబనమును మాన్పు కవి యెంతో నైపుణి చూపినాఁడు. అయినను ఇట నాయిక వేశ్యయగుటచే అది కొంత మర్షణీయము కాఁబోలును. తన నాటకమునకు పేరిడుటలోను క్రొత్తదనము ఉన్నది.

## నూత్నవిధ నామకరణము

'నాయికా నాయకాఖ్యానాం సంజ్ఞా ప్రకరణాదిషు' అన్నది శాస్త్రము. నాయికా నాయకుల పేరులంబట్టి పేరిడఁదగును అని. మఱియిందు ఈ మృచ్ఛకటిక - చిన్న మట్టిబండి—నాటకమున ఎక్కడనోవచ్చు నొకయలంతి ప్రస్తావము. దాన నీ పేరు గృహీతము. ఐనను నాటకములకు గర్భితార్థప్రకాశముగా పేరుపెట్టఁ దగునన్నారు. శాకుంతలమున అభిజ్ఞానముంబట్టి కదా పేరు. ఐనను అది నాయికపేరునకు తగులు కొనియున్నది, ఈమట్టిబండి ప్రస్తావమును ఇందు కథలో గొప్పప్రయోజనమునే సూచించును. శూద్రకుని సూత్రధారుఁడు సంస్కృతభాషణమునే తొడంగి తటాలున ప్రాకృతభాషణమునకుం దిగును. అందులకు కారణముం జెప్పును—'కార్యవశాత్ ప్రయోగవశాత్ చ'—అని. తనభార్యకు ప్రాకృతము సుబోధమగును, మఱియు ఇంటను బయటను ఎక్కువగా ప్రాకృత భాషణమే ఆకాలమున వాడుకయై పోయినది. అది ప్రేక్షకులకు సులువుగా తెలియున దగును, అని. ఇందు నాటకములం గూర్చిన శూద్రకుని యభిప్రాయమును కొంత మనసునకు వచ్చుచున్నది. అంతకు పూర్వము

ప్రాయికముగా నాటకములు 'ఆర్యమిశ్రులకోసము' 'విద్వాంసులకోసమును' వ్రాయఁబడుచుండినవి. అట్టివారే నాటక ప్రధానప్రేక్షకులు. భవభూతి యుత్తరచరితమున 'కాలప్రియనాథస్య యాత్రాయాం' అని యా తిరునాళ్లలో ప్రయోగింపఁబడునని, యాత్రిక సామాన్యజనమును ఉద్దేశించినట్లు తోఁచునుకాని, 'యత్ప్రౌఢత్వ ముదారతా చ వచసాం యచ్చార్థతో గౌరవం' అని తన నాటకపు భాషంగూర్చి చెప్పికొన్నందున అది పైయంతస్తు పండితులకే ఉద్దేశింపఁబడినదని తోఁచును. అది యట్టిదే. మఱి మృచ్ఛకటికము సామాన్యజనమునకు పామరుల మూఁకకు వీధినో ప్రహసనమునో చూచుచుండిన వారికిని బోధపడి హృదయంగమముగా నుండవలయునని కవియుద్దేశము కానోపును. ఇఁక నితరప్రేక్షకులకును దర్శనీయమే యనుటను వేఱుగా చెప్పవలయునా?

ఇట్లు నాటకమును మూఁకకును అందుపాటు చేయఁగోరిన శూద్రకకవి అందులకు కేవలము సర్వనూతనవస్తువుం గొనుట సరిగాదు. అప్పటికే కొంత పేరుగన్న చారుదత్తనాటకమునకు క్రొత్త చేర్పులు మార్పులు తీర్పులు ప్రజామోదావహ మగునట్లు చేయుట లెస్సయగునని దానికి తన ప్రజ్ఞపరుసమును (=పరుసవేదిని) సోకింపఁ గోరినాఁడు. అట్లు ఈ ప్రకరణము రచించి తన యభీష్టమును సాధించుకొన్నాఁడు.

నియమసేతువు త్రెంపులు

మృచ్ఛకటికమున వస్తువు కవికల్పిత లౌకిక వృత్తమే. ఇందు నాటక సంప్రదాయనియమసేతూల్లంఘనమును కవి కడు ధీరముగా కావించినాఁడు. ఇందు రెండవయంకమున జూదరులు వీధి కెక్కి జగడమాడి కొట్టులాడుదురు. ఆఱవ యంకమున పోలీసధికారులు వీధిలో తీవ్రముగా పరుసములాడుకొని కాలితో తన్నుకొందురు. అట్లే మూఁడవ యంకమునను ఇంటికి కన్నముపేసి చొచ్చి దొంగ నగలను నిద్రించుచున్నవాని చేతినుండి దొంగిలించుకొని పోవును. ఎనిమిదవ యంకమున ఒక యప్సరసం బోనిది వనిత వసంతసేన ఒక ఘాతుకునిచే నిండు ప్రాణాన గొంతుపిసికి చంపఁబడును. తొమ్మిదవయంకమున ఒక నిరపరాధియగు బ్రాహ్మణుఁడు కొఱుత వేయంబడుటకై రాజమార్గమున కొలచోటికి మసనమునకు గుంపులుపడిన జనము నడుమ చాటింపులతో నడిపించుకొని పోఁబడును. కత్తితో మెడనఱుకను పూనఁబడును. అట్లే ఒక పతివ్రత చితాగ్ని జ్వాలలలో పడనుఱుకును. ఇట్టి దృశ్యములు నాటక రంగాలలో ఎంతయు నరుదు.

## లోకసామాన్య పాత్రములు—చేష్టలు

అట్లే "మృచ్ఛకటికమునందలి పాత్రములంబోనివి సాంప్రదాయిక నాటకములలో అంతగా అగపడునవి కావు. ఆ నాటకములలో మామూలుగా రాజులు రాణులు వారి కంచుకులు దౌవారికులు పరిచారకులు దాసీజనము మంత్రి సేనాధిపతి - అందఱును లోకాన పై అంతస్తులవారు - ప్రాయికముగా లక్షణానుగుణముగ కూర్పఁబడినవారు, లోకమున సాధారణముగా జీవముతో అగపడునట్టివారు కానట్లు తోఁచుచుందురు. కాళిదాసుని చెంబడివానిని పోలీసులను పోలినవారు అరుదు, వారగపడిన యాకొన్ని నిమిషములయాట సామాన్యజనమునకు కానక కానక కన్నదాని సంతసముం గూర్చును గదా. శూద్రకుని స్థావరక చేటుఁడు చాలక్రిందితరగతి బానిస, అయినను వాని పరలోకభీతి, ఆర్జవము, ఒక నిరపరాధి ప్రాణముంగావ తన ప్రాణమును ఒడ్డి మేడపైనుండి నడివీధికి దూఁకుట; మదనిక బోగముచేటి, పుట్టుబానిస, తనసానికి ఎంతయుం గూర్చునదయ్యు, బజారితనము మానుకొని ఒక సాహసిక బ్రాహ్మణయువను వలచి, వానిగుండ తన బానిసతనమును వెలయిచ్చి పోఁగొట్టుకొనం గోరుటయు, వాఁడు వెలకాఁగలదని బంగరు నగను కన్నపు దొంగతనమునం గొనిరాఁగా అది దైవికముగా తనసానిదై ఎందో యిల్లడయుంచినది యని కనిపట్టి అది పనికిరాదని, తనకు దాన స్వేచ్ఛకలుగు ఏకైక మార్గము రుద్ధమగునని తలంచి ఓడక దానిని సానికి ఇల్లడ తీర్పుగా మరల ఇప్పింపఁగోరిన సత్యనిష్ఠయు ఔదార్యమును; కొలమాదిగలును జీవహింస చేయని స్వభావము గలిగి, రాజాజ్ఞనిర్వాహ మాత్రమునకు యథావిధిగా, వధసేయ వలసినవారమని తమ పరలోకభయమును దైవచింతను చెప్పికొనుటయు; పోలీసు వీరకుఁడు తన నౌకరి ధర్మమందలి నిర్వహణతత్పరతలో తన నాయననైనను నాయనయని చూడనను సర్కారు సేవాదీక్షయు; ఇట్లు హీనజాతిజనమందును మేలుములు గలవని చూపి శూద్రకుఁడు తన నాటకమునకు జనాకర్షకతఁ గూర్చినాఁడు. అట్లే రాజపరివర్తనము ఇందలి యంతర్నాటకవస్తువున ఎట్టి పాత్రలం గూర్చి సామాన్య ప్రేక్షకులను చమత్కరించినాఁడు! దర్దురకుఁడు ఆఱితేఱిన జూదరి, ఇట్లు నడివీధిలో జూదగానితో కొట్లాట పర్యంతము జగడమాడును, అటు రాజపరివర్తనకైన పితూరీలో వీరుఁడును అగును. శర్విలకుఁడు కులముచెడిన బ్రాహ్మణుఁడు ఇట్లు తా వలచిన తన్ను వలచిన బోగము దానిని భార్యగా విలుచుకొను ధనమునకై ఒక యింటికి నేర్పుగా కన్నము వేయును, అటు ఆపితూరిలో ప్రధాననాయకుఁడై మొన నడుపును. ఇటు

దొంగ అటుదొర. ప్రధాన నాయకుఁడును బ్రాహ్మణుఁడు, కోమటి వృత్తి గలవాఁడు ఓకారియైన ఒకనాఁటి లక్షాధికారి - మఱి బిచ్చమెత్తఁడు, పరువు ప్రతిష్ఠలకు ప్రాణము ఒడ్డును. నాయిక వసంతసేనయు భోగముదియయ్యు కులాంగన యనిపించుకొనుటకుం జాలిన మనసిచ్చినరాగము పాతివ్రత్యముంజూపి, కాంతునికై పరునిచే గొంతు పిసికించుకొను ధీర యగును. మైత్రేయుఁడును వట్టి యెద్దె విదూషకుఁడుగాక నాయకుని సర్వకాలమిత్రమై అతనికోసము జగడమాడి శకారుంగొట్టి తానును దెబ్బలుతిని, మిత్రుని చావును విననొల్లక తాను ప్రాణత్యాగమునకు ఆతని పతివ్రతభార్యతో చిత నిప్పులో పడ నుంకించును. వీరందఱి కల్పన ఒకయెత్తు శూద్రకుని శకారకల్పన ఒకయెత్తు. వాని యెద్దెతనము, అహంకారము, క్రౌర్యము, పశువృత్తి - అరరే! అందఱును జీవము తొనుకాడు నిజమైన మానుసులు - బ్రాహ్మణుని యెత్తునుండి మాదిగయంతటి క్రిందివఱకు ఎన్నియంతస్తులవారు ఎన్నితెగలవారు పాత్రములు! ఎవరికి వారే, మఱి పోలికలు లేనివారు.

## కృత్యములు

మఱి కృత్యములో ? షోదాలు, విటులు ఒక విలాసినిని నడివీథిలో తఱుముదురు. అది యొకరియింటఁ దూఱి తప్పించుకొనువఱకు-జూదగాఁడు జూదగానిని, ఓడి పందెముకట్టక నడివీథిలో పరువెత్తినవానితో జగడమాడి కొట్టును, వాఁడు ఒక యింట దూఱి తప్పించుకొనును - ఒక దొంగ రాత్రి ఒకరియింట కన్నమువేసి దొంగిలి వీథిలో పరువెత్తును. అనురక్త భోగముదానిని విలుచుకొని ఒకఁడు బండిలో ఎక్కించుకొని పోవును, నాయిక ఉఱుముల మెఱుముల వానలో సందెచీకటిలో వీథిలో కాంతుని అభిసరించును, వీథిలో బండ్ల మాఱుపాటు, పోలీసుల జగడము, ఒక తోఁటలో భయంకరమగు స్త్రీహత్య. కచ్చేరిలో ఒక దుఃఖకరమైన పిర్యాదు విచారణ. దోషిని చాటింపులతో కొలమసనమునకు దానింజూచ గుంపులు వడ్డ ఊరిజనుల నడుమ నడిపించుకొనిపోవుట,—ఎన్నిదృశ్యములు! ఎన్నిభావములు! సంతోషము దుఃఖము ఎగతాళి నిర్వేదము ఎత్తిపొడుపు - ఈ పదియంకముల పొడుగు ప్రకరణమున ఎన్ని యెట్లు కల్పించి నానా రసవాహిగా చిత్రించినాఁడు కవి! బ్రహ్మ సృష్టి సంతతిని అట్లే నాటకాన ఇమిడ్చినాఁడు.

## హాస్యప్రాచుర్య వైవిధ్యములు

ఈ క్రొత్తనాటకమున హాస్యమును వాస్తవికతయు ఎంతేని నిండియున్నవి - మాటలహాస్యము, పాత్రల హాస్యము, సంవిధానములందోఁచు హాస్యము - ఎన్నియో తెఱంగులది. అది సామాన్యముగా గొప్ప నాటకములలో అరుదు, కాళిదాసు నాటకములలో వానియంత స్తుకు తగినది సరసమైనది మెండుగానే కలదు. తక్కినవాన అట్లు తోఁపదు. 'మూనా'ను దిద్దినట్లు తోఁచును, మోటుగా నుండును. శూద్రకుని హాస్యము మెండుకొని నవ్యముగాను సరసముగానే యుండును. మఱి ప్రహసన మనిపించుకొనదు. వాస్తవికత పచ్చిది దిద్దుడు సోఁకనిది మన సాంప్రదాయిక నాటకాలలో అరుదు. శూద్రకుని సభికద్యూతకరులు ద్యూతము జగడము మొదలైన దంతయు పచ్చివాస్తవము, మఱెందును దొరకనిది. పాచికలు వేయుట, వాని గలగల, ఓడినవాఁడు పరువెత్తి యొకదేవళాన దూఱి విగ్రహముగా దాఁగుట, వానిని పట్టుకొని బజారున అమ్మఁ జూపుట, జగడము, సభికుని కండ్లలో వీధి దుమ్ముకొట్టుట - వీనిలో దాఁగితోఁచు రాజ్యముయొక్కయు ప్రజలయు స్థితిగతులు, ఇదెల్ల పచ్చి వాస్తవికతయే, నగరమందలి రాత్రి జీవితము-వీథులలో రాజవల్లభులు వారి తోడువారు అనుచరులు విశృంఖలముగా తిరుగుచుండుట, పోకిరితనము చేయుచుండుట, దారింబోవు స్త్రీలను తఱుముట, పిఱికి బ్రాహ్మణులను హేళనము చేయుట, కన్నపు దొంగ కృత్యముల పూర్తి వివరము, కారాగార బద్ధుఁడు సంకెల పగులగొట్టుకొని విడివడి ఒకకాల తగులుకొని వ్రేలు సంకెల తునుకతోడనే పరారియయి దాఁగి తప్పించుకొనుట, వీథిలో బండ్ల సందడి, వాని యెడ్లను బండివాఁడు డిర్ డిర్ అని తోలుట, వీథిలో 'టామ్ టామ్' చాటింపులు, ఇవియు ఇట్టివియు ఆ వాస్తవికతకు దాఖలాలుగా ఉజ్జయిని వీథులను మనకనుల యెదుట ఎంతచక్కఁగా నిలిపినాఁడు కవి!

## కవి వ్రాఁత రీతి

శూద్రకుని వ్రాఁతరీతిలో కాళిదాసుని విపంచీస్వరసౌభాగ్యముతోడి విలాసము కాని భవభూతి ప్రౌఢికాని లేకున్నను, కల్పనలలో ఉపమలలో ఉత్ప్రేక్షలలో ఉఱుముల మెఱుముల గాలుల జల్లుల వర్ణనలోను నవ్యత సూటి చమత్కారము నిండియున్నది. అతని శ్లోకములలో సామెతలై పోయిన వాచోయుక్తులు లెక్కలేనివి కలవు. అలతియలంతి వాక్యముల గద్యపద్యముల పాత్రోచిత భాషితములు,

సాంప్రదాయిక నాటకము రానురాను పేరునకు దృశ్యమయ్యు అనుభవమున రంగాన నడ చలనము నటన లేని కేవలపఠనముగా పరిణమింపఁ జొచ్చినది. మఱి మృచ్ఛకటి ప్రతిక్షణచలన నిపుణాభినయ సమృద్ధము.

ఇట్లు ఎల్లతెలుంగుల మృచ్ఛకటికము సాటిలేని ఒక క్రొత్త మోస్తరు నాటకము.

ఆటను సామాన్య జనమునకు అందించుట.

శూద్రకుఁడు ప్రతిభయు ఉపజ్ఞయుగల మహాకవి. ఉన్ననాటకముల తీఱు సరిగా లేదని గ్రహించినాఁడు. రాజసభలలోనుండి నాటకమును సామాన్య ప్రజల యందుబాటునకు లోకాన దింపి పఱపవలసిన దని తలంచినాఁడు. అందులకైన తన నక్షికి చారుదత్తము భాసునిది కర ముపయోగపడునని తలంచినాఁడు. అతనికి ఎంతేని లోకజ్ఞానము శాస్త్రజ్ఞానము పురాణ బృహత్కథా కావ్య నాటకముల జ్ఞానమును గలదు. షేక్స్పియరు మహాకవియొక్క గొప్ప నాటకములు ఎన్నియో అతనికి ముందు ఏదియో యొక యాకారమున నున్నవే. మఱి యతఁడు ఆయినుమును సత్తును రాగినే సువర్ణము చేసినాఁడు. అట్లే శూద్రక కవియు. గణికలు బాపలతామై కామించిన ప్రసంగ మందందు కథాసరిత్సాగర దశకుమార చరితాదు లందు ఉండెను. దేవళాన విగ్రహ ముగా దాఁగికొనుటయు కలదు. గోపాలపాలకు లనురాజకుమారులు వాసవదత్త తోఁబుట్టువులు - కావున ఆపేరులు లోకాన ఉండినవే. చారుదత్తమునందలి భాషితములయు శ్లోకములయు ప్రతీకములు మృచ్ఛకటికమున నున్నవే యన్న, కథాసరిత్సాగరమందలి గద్య పద్య ప్రతీకములు తన్మూలకమగు హర్షనాగానంద రత్నావళీ ప్రియదర్శిక లందుఁ గలవు. షేక్స్పియరునందును అతని పూర్వులవి గలవు. "Emerson's essay on Shakespeare - 'Great men are more distinguished by range and extent than by originality.' It is one of the common places of criticism that Shakespeare's works are not remarkable for originality of plot and incident ... .. .. Delineation of character, with the treatment of incident as a medium of characterisation is primarily what constitutes his supremacy." Verity.

చారుదత్తము దొరకినముక్క అసమగ్రమని తోఁచినను ఆయసమగ్రతయే శేషము కలదనుటకు తొలిసాక్ష్యము. ఇంకను ఇతరము ఈ దొరకిన చారుదత్తమున లేనివియు భోజునియు అభినవ గుప్తునియు లక్షణ గ్రంథములందు చారుదత్తములోనివి

యనఁబడు ఉదాహరణోద్ధారములును అట్లే సూచించును. వామనుఁడును చారుదత్త మును మృచ్ఛకటికమును వెవ్వేఱుగా నిర్దేశించినాఁడు. అట్లే నాట్యదర్పణ మనుదాని యందును దరిద్రచారుదత్తమును మృచ్ఛకటికమును రెండును ఉదాహరణముం గన్నవి. చారుదత్తముననే దొరకినదానియందే-ఎవఁడో మఱి యొకఁడు చేసిన నేరము దరిద్రునిపైన మోపఁబడును (i-6). అనుటయు శకారుఁడు విదూషకునిచే చారుదత్తునికి చెప్పిపంపిన బెదరింపును (i) ఉత్తరకథ హత్యయు అధికరణమున అభియోగమును- చారుదత్త నాటకపూరణము వేఱు ఉండవలయు నని సూచించును. వసంతసేన వాక్యమును 'నేను చారుదత్తుం గలసికొన నభిసరించునపుడు నగలను ధరింతును' (iv) అనుటయు, చారుదత్తుఁడే దారిద్ర్యముం దెచ్చిన విధాతయే మరల ఒకనాటికి సంపద తేఁగలఁడు. (i) అని పలుకుటయు - అట్లే సూచించును. కావున భాసుని చారు దత్తము, సంపూర్ణమైనది ఉండియుండఁదగును. అతని నాటక చక్రమున కంతటికిని ఏదెయో దెబ్బ తగిలినది. తఱుగులు విఱుగులు అసలునకే మోసములు కలిగినవి. అంతియకాక చారుదత్త మందలి ప్రాకృతమునకన్నను మృచ్ఛకటికమందలి ప్రాకృ తము తరువాతి దగుటయు, చారుదత్తరచనకన్నను మృచ్ఛకటికము నాణెముగా నుండుటయు రాజపరివర్తనరూపాంతర్నాటకము మెలఁకువతో నాటక కథతో పెనఁపఁబడి యుండుటయు కాలమునను కార్యమునను చారుదత్త మృచ్ఛకటికము లకు గల సంబంధమును స్పష్టపఱుచును.

శూద్రకునికి ఒక చారుదత్తమ కాదు, భాసనాటక చక్రమంతయు సుపరి చితము. భాసుని ప్రయోగములు ఉపమలు భావములు ఎన్నియో మృచ్ఛకటికమున మెఱుఁగుతోను మార్పుతోను దొరలి అగపడుచునేయుండును.

జూదరుల వృత్తమును, రాజపరివర్తనమును, హాస్యవైచిత్రిరామణీయక ములును శూద్రకుని సొంతము.

ఇట్లు శూద్రకుఁడు అంతయు తనసొంత నగిషీగా ఈయసాధారణ నాటక రాజమును వెలయించినాఁడు. 'నా స్త్యచౌరః కవిజనః' అన్నారు. వ్యాస వాల్మీ కులకును వేదములయందు ఉద్బోధకసామగ్రి ఒకపాటి యుండెనేమొ. ఐనను ధ్వని మార్గముంబట్టి కవుల ప్రతిభాగుణము ఆనంత్యము పొందుననియు,

'అతో హ్యన్యతమే నాపి ప్రకారేణ విభూషితా
వాణీ నవత్వమాయాతి పూర్వార్థాన్వయవ త్యపి'

అని క్రొత్తరచయితలకు ఉత్సాహము కూర్చునవే ధ్వనికారుఁడు 'అస్మిన్ అతి విచిత్ర కవిపరమ్పరావాహిని సంసారే కాలిదాస ప్రభృతయః ద్విత్రాః పఞ్చషా వా మహాకవయః' అని యీ లోకాన కాళిదాసప్రభృతులు ఏయిరువురు ముప్వురో ఏవు రార్వురో - మహాకవులు అనిపించుకొందురు అన్నాఁడు. శూద్రకుఁడు ఆ యేవురార్గు రిలో లెక్కకువచ్చువాఁడ యనఁదగును.

మఱి చారుదత్తము, (లేక దరిద్ర చారుదత్తము) అని యిటీవల ప్రకటిత మయిన భాసనాటకము మృచ్ఛకటిక ప్రకృతిక మనియు, దానిని తక్కిన భాసనాటక ములంబోలె ప్రదర్శనమునకుం దగినట్లు కత్తిరింపఁగా, అది ఆ దొరకిన విధాన నున్నదనియు చెప్పువారు లేక పోలేదు. ఐనను మృచ్ఛకటికమందలి భాషితములును శ్లోకాలును కొన్ని చారుదత్తమున మార్పులేకయే యున్నట్లు తోఁచినను, ఏదియో కొంత భేదముగల వానియందు నిజముగా మృచ్ఛకటికమందలివానియందమును మెఱుఁగును డిందుపడియున్నవి. మఱి కత్తిరింపులు సవరణలు వాని మట్టుకైనను మృచ్ఛకటిని మించియో, దానిపాటిగానో ఐన నుండక తక్కువపడుట ఆ తత్ ప్రకృతిక మనువాదమునకు సరిపడదు. మఱియు ఆ చారుదత్తమందలి ప్రాకృతము మృచ్ఛకటి ప్రాకృతమునకన్న పాతదిగా తోఁచుటయును అందులకు విరోధమే. మఱియు కొన్ని యెడల భాషితములు ఇందు లేనివిగా అతి విస్తరముగాను, ఇందు లేని శ్లోకములుం గలిగియు ఉన్నది. కావున ఆ రెంటికిని ఏదియో సంబంధము కలదని చెప్పనే వలసియున్న చారుదత్తము మృచ్ఛకటికముగా సంస్కరింపఁబడిన దనుటయే సమంజసముగాఁ దోఁచును. అంతియకాక చారుదత్తము అదే దరిద్రచారు దత్తమని, భాసునిదే ఈయున్నతీఱుది అసమగ్రవస్తువు. అట్టిది సమగ్రమగు నొక నాటక ముండెనని పెక్కుకారణములచే తలంపఁదగియున్నది. వామనుఁడు రెంటిని వెవ్వేఱుగా పేర్కొని తన కావ్యాలంకారమున ఉదాహరించి యున్నాఁడు. అభినవ గుప్తుఁడు నాట్యశాస్త్ర వ్యాఖ్యలో అభినవభారతిలో 'అత ఏవ దరిద్ర చారుదత్తాది రూపకాణి తద్విషయాణి' అని దానిని నామగ్రహణపూర్వముగా సూచించినాఁడు. అట్లే రామచంద్ర గుణచంద్రులు తమ నాట్యదర్పణమున దరిద్రచారుదత్తమును మృచ్ఛకటికమును వేర్వేఱుగా ప్రక్క ప్రక్కనే పేరులతో ఉదాహరించియున్నారు. మఱియు భోజదేవుఁడు సరస్వతీకంఠాభరణమున విటుని గుణములం జెప్పు నొక శ్లోకమును ఉదాహరించినాఁడు. అది శకారునితో పలుకఁబడినట్లును, తాను ఎట్లును

పాపకార్యముం జేయను అన్నమాటగాను ఉన్నది. అది మృచ్ఛకటిలో ఉండునది కాదు. కావున, చారుదత్తములోనిది కదా కావలయును: అట్లు భోజవాక్యము చేతను సమగ్ర చారుదత్తము ఉండినదనుటను ఊహింప నగును.

'శకార కిం ప్రార్థనయా ప్రావారేణ మిషేణవా
అకార్యవర్జం మే బ్రూహి కిమభీష్టం కరోమి తే?'

దీనినే మృచ్ఛకటిలో గద్యవాక్యముగా విటుఁడు చెప్పియున్నాఁడు—'బాఢం కరోమి, వర్జయిత్వా అకార్యమ్.' అని. మఱియు సాగరనందియనువాఁడు తన నాటక లక్షణ రత్నకోశమున దరిద్ర చారుదత్తమునుండి ఉదాహరించి యున్నాఁడు—అవ శకునపుఁ గాకి కూఁతవర్ణన.

'శుష్క ద్రుమగతో రౌతి ఆదిత్యాభిముఖం స్థితః
కథయ త్యనిమిత్తం మే వాయసో జ్ఞానపణ్డితః.'

ఇది మృచ్ఛకటికమునందలి సమసంవిధానపు భాషితాదిని ఎంతయు పోలియున్నది. పోలుటయే కాని, మఱి అది వేఱే. సాగరనంది మృచ్ఛకటిం గూడ నెఱుఁగును. అందుండియు ఉదాహరణములం గైకొని యున్నాఁడు.

ఈ యుద్ధారములంబట్టి చారుదత్తము—పెద్దదే బహ్వంకముల నాటకమే యగుననియు, అచ్చుపడి దొరకినది ప్రయోగార్థమై సంకలితమైన దాని తునుకయనియు ఏర్పడును గదా.

మఱియు ఈతునుక లోనివి—

'చారు - పాపం కర్మ చ యత్పరైరపి కృతం తత్తస్యసంభావ్యతే'

'శకారః - మా తావ త్తవచ మమచ దారుణం కలహో భవతు ఇతి.'

'సంవాహకః - కో హి నామ ఆత్మనా కృతం ప్రత్యుపకారేణ వినాశయతి'

'గణికా - యదా ఆర్య చారుదత్తః అభిసారయితవ్యః తదా మణ్డయిష్యామి ఇతి.'

'చారుదత్తః - భాగ్యక్రమేణ హి ధనాని పునర్భవన్తి'—

'ఇతరులు చేసిననేరము బీదవాని మీఁదికి బనాయింపఁబడును.' శకారుని బెదరింపు అధికరణపు విచారణయంతయు కాఁగలదని సూచించును. సంవాహకుఁడు తాను

ప్రత్యుపకారము చేయు నవకాశము దొరకునా అనుకొనుటయు, తాను వసంతసేనం బ్రదికింపఁగనుటను సూచించును. 'అప్పుడు నేను అలంకరించుకొందు ననుట' వసంతసేన యభిసరణమును సూచించును. చారుదత్తుఁడు 'దారిద్ర్యము వచ్చినట్లే భాగ్యవశమున మరల సంపద కలుగవచ్చును'—ఈ భాషితపు తునుకలన్నియు ఆ దొరకిన వస్తువు కొఱతయనియు తరువాతి కథ యెంతయో యున్నదనియు, పెద్ద శేషమే ఉండునని సూచించుననియు - గ్రహింపఁదగును.

అట్టి చారుదత్తము ఉండఁగా దానిని శూద్రకుఁడు మృచ్ఛకటిగా పెంచి మార్చి చేర్చి మెఱుగిడి చాల గొప్పనాటకముగా తన నేర్పున రచించి తీర్చెననుట సాధువగు నూహయే యగును.

## ౩. నాటకవ స్త్వంగాం గ్యనురూపత

యథా శాస్త్రపు సంధిబంధ విమర్శగాఁగాక వస్తువున అంగాంగుల కుదిరికను కొంత విచారింతము. ఇందలి యితివృత్తమును కవియే నేర్పుగా రెండు శ్లోకాల సంగ్రహించినాఁడు. ప్రస్తావన 6, 7.—

" అవన్తిపుర్యాం ద్విజ సార్థవాహో
యువా దరిద్రః కిల చారుదత్తః,
గుణానురక్తా గణికాచ తస్య
వసన్తశోభేవ వసన్తసేనా,
తయోరిదం సత్సురతోత్స వాశ్రయం
నయప్రచారం వ్యవహారదుష్టతామ్
ఖలస్వభావం భవితవ్యతాం తథా
చకార సర్వం కిల శూద్రకో నృపః."

రాజు శూద్రకుఁడు చారుదత్తుఁడను ఉజ్జయినియందలి యొక బీద ద్విజ సార్థవాహ యువకుని యొక్కయు, అతనిని గుణములకై వలచిన వసంతశోభంబోని వసంత సేనయను బోగముదానియొక్కయు సత్సురతోత్స వాశ్రయమగు కథను నాటకము చేసినాఁడు. మఱి యందే (రాజపరివర్తన ఫలకమగు) నీతి ప్రచారమును, అధికరణమున ఫిర్యాదు అధర్మముగా తీర్మానింపఁబడుటయు, ఒక్క ఖలుని స్వభావ సిద్ధమగు నెత్తు గడలును, అట్లే కడకు భవితవ్యత సర్వనిర్ణయమును జేయుటయు —కూర్పఁబడినవి— అని.

కాఁగా ఈవస్తువున కథ మూఁడు పురులతో నిపుణముగా పేనఁబడినది. చారుదత్త వసంతసేనల శృంగారము, శర్విలక మదనికల దాసీ నిష్క్రియ శృంగారము, రాజ పరివర్తన వీరాయితమును. ఈ దాసీ నిష్క్రియ శృంగార కథ ప్రధాన శృంగార కథలో అంతర్భవించునదే. రాజపరివర్తనకథకు వానితో అంతగా సంబంధము తోఁపదు. ఇది శూద్రకుఁడు క్రొత్తగా చేర్చినది. చారుదత్తమున దీని పొడయు లేదు. రెండు కథలలోను దైవపుబలిమి దుర్వారము.

చారుదత్త వసంతసేనల శృంగారకథలో ఇంచుక అసాధారణత కలదు. మన్మథుని దేవళము తిరునాళ్ళలో ఒండొరులం జూచుకొని వారు చక్షుఃప్రీతి పొందినారు.* కాని, కలయికకు సాధారణముగా నాయకుఁడు నాయికను అరయునట్లుగా కాక ఇందు వసంతసేనయే వానిని చూడను కూడను వచ్చును. అది నాయిక గణిక యగుటచేతను నాయకుఁడు దరిద్రుఁడైనను నిజాభిమానమును వీడమిచేతను, సదృశమే యగునేమో, చారుదత్తుఁడు దరిద్రుఁ డగుటచే తా వెనుదీయునేమో యని శంకించి అతనియందు తనకు నమ్మకము గౌరవము కలదని ఉపాయములం దెలిపి నేర్పుతో ఆత్మప్రవణుం జేసికొని, వానలో అభిసరించి వచ్చి, నాయిక నాటకమునడుమ ఆరాత్రి ఆతనిం గూడి రతులందేలును. మఱుసటి యుదయము అతనిని మరల నతఁడు పోయిన తోఁటలో కలసికొని విహరింపఁ జరిగిన యేర్పాటుమేరకు రోహసేనునికి మట్టిబండిలో తన నగలుపెట్టి యిచ్చి తరలి, బండ్ల మాఱుపాటున దారితప్పి, వసంతసేన శకారుని చేతికి చిక్కి, వానిం దిరస్కరించి కాలఁదన్ని, ఆతనిచే గొంతుపిసికి వేయఁబడును. శాకుంతలమున శృంగార కథ దుర్వాసఃశాపముచే పెడదారిం బట్టినది. శాపము అమానుషపు దెబ్బ. దాని కల్పనకు కాళిదాసుని ఎంతేని మెచ్చుకొనువారు

* మాలతీ మాధవమునను 'సకల నగరాఙ్గనా ప్రవర్తిత మహోత్సవాభిరామ కామదేవోద్యాన యాత్రా ప్రతినివృత్త మన్యాదృశమివ భవన్త మవధారయామి.' అని మాలతీమాధవులు కాముని తిరునాళ్లలోనే తొలిమాఱుగా ఒండొరులం జూచుకొని చక్షుఃప్రీత్యభిలాషలు పొందిరఁట. మఱియు ఆ తిరునాళ్లలో అంగనలు ఎక్కువగా పనివడుదురనియు సూచితము, తనయింట సొంతముగానే ఒక కాముని గుడి పెట్టుకొనియున్న వసంతసేన మాట చెప్పవలయునా; విశేషముగా ప్రతిదినము ప్రాతఃస్నానముచేసి సొంతముగా దేవతాపూజాదికమును ఇంట చేయు భక్తశీల! మఱి ఆయుత్సవాన యెట్టి పాలుగొన్నదో, ఆ శరణాగత్యభ్యుపపత్తులు ఎట్లు పొసఁగినవో.

కలరు, ఐనను శాపమేమిటి—అని దుష్యంతుని అసత్యవాదిగా భారతమూలమునే నమ్మి ఉదాత్తతనుండి దింపువారును కలరు. బండ్ల మాఱుపాటును ఎంతయు సహజ మార్గమున ఎంతయు విశ్వసింపఁ దగినట్లు కల్పించినాఁడు శూద్రకుఁడు. శాకుంతల మున ఉంగరము దొరకి అభిజ్ఞానశాకుంతలముం గావించినది. మృచ్ఛకటికమున సొమ్ములు దొరకి చారుదత్తుని హత్యానేరము రుజువుచేసి అతనికి ప్రాణాంతకరము లైనవి. మృచ్ఛకటికమున ఎట్టి యమానుషానుప్రవేశము లేనందున చారుదత్తుఁడు కొలమాదిగవాని కత్తికి మెడవంచియు అప్పుడు దానిని దైవమే తప్పించినందున కొఱ్ఱుమీఁదికి ఎత్తఁబడుచుండఁగా అప్పటికి వసంతసేనయే బ్రదికి రావలసి వచ్చినందు నను చారుదత్తునికి చావు తప్పుటయు ప్రియాపునఃసంయోగము కలుగుటయు చాల ఆలస్యముగా ఊపిరాడని భయముతోడి విసుకును తోఁచిన తర్వాత ఘటిల్లినది.

చారుదత్తుఁడు దరిద్రుఁడయ్యు కులాభిమాన గర్వితుఁడు ఆ తిరునాళ్ళలో వసంతసేనం జూచినప్పుడు, చక్షుఃప్రీతిం బొందినాఁడు. దాని చూపునందును తనకు వలపుమతి కలిగినదిగాని నిశ్చయము ఎఱుఁగవలసి యున్నది. తన దారిద్ర్యముం బట్టి తన్ను ఆ జనము ఎట్లు తలంచునో, పరువునకు ప్రతిష్ఠకు వెలితిగా తలంచిన తాను ఒల్లఁడు. వసంతసేనకును తన్ను ధనముకోరు వట్టిబోగముదానింగా తలఁచునో, అట్లు తలఁచిన అతఁడు తనవద్ద అది లేదేయని జంకునేమో, తాను ధనమునకుం గాక గుణమునకు వలచునది యని అతఁడు నమ్మవలదా - అని వారు అన్యోన్యవిస్రంభము కలిగించుకొన వలసి యున్నది. తనకు ధనము గడ్డిపరకయే యనియు చారుదత్తునందు తనకు ఎంతేని నమ్మకము గలదనియు, అతనికి అన్నివిధాల జంకు తీర్పవలయు ననియు వసంతసేన కోరిక. అతఁడు దానిపై తనకుఁగల కోరికకు ఎట్లో అని మనసు ననే కుందు చుండును. తొలియంకమున ప్రదోషమున శకారవిటాదులు తన్ను వీథిలో తఱుమఁ జొచ్చిరే. తాను ఎక్కడినుండి ఎక్కడికి పోవుచుండెను? ఇందులకు గమ కము సులువుగా నాటకాన అగపడదు. అదియు చారుదత్తునింటికే కానోపును. 'ఏషా గర్భదాసీ కామదేవాయతనోద్యానాత్ ప్రభృతి తస్య దరిద్ర చారుదత్తస్య అనురక్తా' అను శకారుని మాటవలన ఆ చెలువ అతనియింటికే పయనమైన దనుకొనవలయును. 'అతనికడ కెందులకే, నాతో రావే' అని అతని యభిప్రాయము. 'వామత స్తస్య గృహం' అని శకారుఁడనుటయు 'యత్సత్యమ్ అపరాధ్యతాపి దుర్జనేన ఉప కృతమ్; యేన ప్రియసఙ్గమః ప్రాపితః' అని వసంతసేన యనుకొనుటయు తాను బయలుదేరినది యిక్కడికే అని సూచించును. తా మొందొరులం జూచుకొన్నది తిరు

నాళ్ళ త్రయోదశి. ఆదినమునకు 5, 6 దినములైనవి, ఒండొరులం జూచుకొని. ఏ జంకుననో అతఁడు అగపడకపోవచ్చును, తానే మరల నొకమాఱు పోయిచూతును గాక అని తరలినది. మౌగ్ధ్యము పూనని యీ ధీరత వేశజాతిసులభము. ప్రావారకపు జాజివాసనం జూచి - అతఁడు రసికుఁడు, పేద వడినను ఉదాసీన యౌవనుఁడు కాఁడు - అని తనియును. అతఁడు విసరిన ఆ గుడ్డచేత ఆ మేఘము కమ్మిన చంద్ర లేఖం బోని దానిని అతఁడు దూషించితినేమో అని యనుకొనఁగా వసంతసేన తాను 'నను భూషితా' అను కొనును. 'బలాత్కా రానుగమ్యమానా' అను శకార భాషితము చారుదత్తు చెవింబడి తాను ఉత్త సామాన్యపు బోగముదికామి అతనికి తెలిసినది కదా అని సంతసించును. 'మన్దభాగినీ ఖల్వహం తవాభ్యన్తరస్య' అని, నేను నీయింటి లోపలికి రాఁదగిన పున్నెము చేసికొనినదానను కాను గదా అని యనుకొన్న వసంతసేన మాటలోను, 'కథం, దేవతోపస్థానయోగ్యా యువతిరియం' అను చారు దత్తుని మాటలోను ఉభయులకు వట్టి బోగము సంబంధము గాక తమకు భర్తృ భార్యల సంబంధము ఐన శ్రేయ మగును కదా అనునంతపర్యంతపుటాస చిత్తాన దాఁగుడుమూఁతలాడు చున్నట్లు తోఁచును. [అట్లే నిర్వహణమున వధూశబ్దమును అవకుంఠనమును వసంతసేనకు రాజదత్తములుగా వచ్చినవి] మఱి చారుదత్తుఁడు ఈ దారిద్ర్యమున నాకు దీనిమీఁద మరులు కలిగినదే అది ఫలించునా అబ్బా—అని జంకును.

> 'యయా మే జనితః కామః క్షీణే విభవవిస్తరే
> క్రోధః కుపురుషస్యేవ స్వగాత్రేష్వేవ సీదతి.'

అయినను మగవారితో ధారాళముగా మాటలాడు ప్రగల్భయయ్యు నా మాటకు బదులు పలుకకున్నదే. ఆ బిడియము నామీది మరులును సూచింపఁ బోలును అని ధైర్యము గొనుచున్నాఁడు. గుడ్డ విసరినదానికి నన్ను మన్నించు అని చారుదత్తుఁడును, చెప్పక ఈయింటిలోనికి అడుగిడినందులకు నన్ను మన్నించు అని వసంతసేనయు ఒండొరుల బతిమాలు కొందురు. అంతట ఇంచుక ధైర్యముగొని, మఱి నాజూకు గానే ఈపూట ఇక్కడ ఉండిపో అన్నట్లు 'తిష్ఠతు ప్రణయః' అని చారుదత్తుఁడు అనును. దాన ఉభయప్రార్థన కలదన్న విస్రంభ ధైర్యములు వసంతసేన చిత్త మున హత్తుకొనును. ఐనను వసంతసేన అప్పుడే తాను అక్కడ నిలువరాదు- అట్లు చేసిన తనకు మరల అక్కడికి వచ్చుటకు సాకు ఉండదు. అతఁడు తనయింటికి

వచ్చునాయన్న, బోగముదానింటికి ఉత్తచేతులతో పోవుటెట్లు, అని జంకునేమో ఆజంకు తీర్పను తనకుగల విస్రంభమును అతనిమనసు కెక్కింపను బంగారునగను 'దారిలో భయము, తర్వాత, కొందును' అని అతనికడ ఇల్లడపెట్టి పోఁగోరును. అతఁడును కైకొని నేను వెంటనే నీకు చేర్తునులే అనును. మైత్రేయుఁడు తాను ఆపెకు ఇంటికి తోడుపోను అనఁగా చారుదత్తుఁడు తానే వెన్నెలలో కనువింపుగా దానిం జూచుచు తోడుపోయి ఇల్లుచేర్చి అనురాగముతో ఒండొరుల వీడ్కొనినంతట తాను మరలును.

రెండవ యంకమున విరాళిం గూరియున్న వసంతసేనతో నిపుణమైన చేటి 'ఆ తిరునాళ్లలో శరణుఁజొచ్చిన నిన్ను కాఁచినాఁడే అతఁడా ఈ పరధ్యానకారణము'- అని యానవాలు పట్టి యడుగఁగా వసంతసేన 'అవును' అనును. మఱి యే యాపదకై శరణుఁ జొచ్చినదో ఎట్లు కావఁబడినదో అది తెలియఁదాయెను. ఐనను అంతకు మునుపు రూపగుణములు చెవికెక్కి వలపు పుట్టించినవారు నాగానంద ప్రియదర్శికా రత్నావళీ మాలతీమాధవాదులలో ఉద్బంధనము నుండియో ఘాతుక మృగము నుండియో రాక్షసినుండియో కావంబడుచు దాన వలపు మఱింత మనసున నాటుకొన్న పలుచెలువలు గలరు. శకుంతలయు తుమ్మెదకు భయపడినది, ఇటను అట్లేయగును. వివరము తెలియలేదు. ఖలులు తఱుముటం దప్పించుకొని ఆతనియింటఁ జొచ్చి తప్పించుకొన్నదే దానికి కాదు ఈ నిర్దేశము. తర్వాత సభిక ద్యూతకరుల బారి నుండి వసంతసేన యౌదార్యమున తప్పించుకొనుటకు తనయిల్లుచొచ్చి వచ్చిన సంవాహకుఁడు ప్రస్తావవశమున తాను చారుదత్తుని సంవాహకుఁడనని చారుదత్తుం బొగడిన మాత్రకు అతనిని ఆదరించి కాపాడి ఆపొగడ్తకు ఎంతయు తనిపి చారుదత్త మనస్కయైపోయినది. కట్టు తప్పించుకొని ఆఁపరాక వీథిలోఁబడిన తన మదపు టేనుఁగును తన నౌకరు కర్ణపూరకుఁడు కొట్టి పట్టి కట్టిన సాహసమును ఆదారిం బోవుచుండిన చారుదత్తుఁడు చూచి మెచ్చుకొని తనకడ ఇనామిచ్చుటకు మఱేమియు లేనందున తన జాజులవాసనప్రావారకమును వానికి ఇనాము ఈయఁగా వాఁడు దానిందెచ్చి తన దొరసానియైన వసంతసేనకు చూపఁగా, సమయాన అట్టి ఇనాము ఇచ్చువాఁడు మఱెవఁడగును, అతఁడే యగు నని, వసంతసేన దానిని చారుదత్త శేష మని, మునుపు రోహసేనుం గప్పుమని రదనికా భ్రాంతిచే తనమీఁదికి విసరినదే అని గుర్తుపట్టి, తాను ఆసతో గ్రహించి కప్పుకొని ప్రియాలింగనముం బోలె అనుభవించుచు వానికి ఒండునగను పారితోషికమిచ్చి పంపుచు- అతఁడు చారుదత్తుఁడు

ఎందుండియో ఈ వీథినే పోవుచున్నాఁ డనఁగా తటాలున మేడయెక్కి అందుండి అతనిని చూపుమేర దాఁటువఱకు చూచి తనిపినది. సంవాహకుఁడు చారుదత్తుం బ్రస్తావించి మెచ్చుకొనుటను కర్ణపూరకుఁడును అట్లే చారుదత్తుం బ్రస్తావించి మెచ్చుకొనుటను విన్నవసంతసేనకు వీనులవిందై ఆతనిని మరల వీథిం బోవఁ గనుట కన్నులకు ఆమెతయై, ప్రావారకము అల్లయానాఁటి సాయంకాలమున అతఁడు చూపిన యాదరమును జ్ఞప్తిసేసి మనసునకు సుఖముఁగూర్చి దాన దేహముంగప్పి కొనుట ఇపుడు తదాలింగన సుఖముంబోలెఁ గూర్చి ఆ యనురాగమును ఎంతయుం బెంచినది.

మూఁడవ యంకములోని కన్నపు దొంగతనమునకు ఈ చారుదత్త వసంతసేనల యనురాగమను నాటక ప్రధానాంగమునకు ఏమి సంబంధము? ఇందు వసంతసేనయిల్లడ సువర్ణభాండము, దేనిం గొనిపోవ తాను మరల చారుదత్తు నింటికి రాఁదగియుండు ననుకొన్నదో అది, యీ కన్నపు దొంగతనమున దొంగిలించి కొని పోఁబడినది. మఱి నాలవయంకమున అంతలో మరల పదివేల వరహాల వెల నగను పంపిన శకారునిపిలుపును బండిని చీకొట్టి ఏవపడి తఱిమివేసినది వసంతసేన. మదనికకైన నిష్క్రియధనముగా శర్విలకుని చేత తనయిల్లు సేర్పఁబడి, మదనికబోధన వలననే న్యాసప్రత్యర్పణముపేర చారుదత్తునికి తెలియకయే సువర్ణభాండము మరల వసంతసేన చేతికే వచ్చినది. ఇఁక దానికోసమని తాను చారుదత్తుం జూడఁ బోవ వీలు లేదు. మఱి యెట్లు? ఇంతలో అందులకు అనుకూలమగునట్లుగా మైత్రేయుఁడు తెచ్చి యిచ్చిన చారుదత్తు రత్నావళి తన చేతికి రాఁగా దానింగూర్చి చారుదత్తునితో మాటలాడుటకు అని వసంతసేన సువర్ణభాండ రత్నావళుల గుట్టు ఎఱింగినట్టిది ఎంతోసంతోషముగా పంచమాంకమున ఉఱుముల మెఱుముల గాలుల సందె చీకటిలో జల్లులలోనే, చారుదత్తుని అభిసరించును. సువర్ణభాండమునుఓడిన జూదగాఁడని చమత్కారముగా పలుకరించి ఆ చెలువ యతని విలక్షుంజేయును. మఱి రత్నహారముం బంపిన శౌండీరుఁడని తాను సంతసించి వసంతసేన అతనిపై కామమును మనసున ఇముడ్చుకొనలేక పొరలించుకొనును. ఇఁక ఒక క్షణమైనను ఆ విరహమును తా పట్టఁజాలకపోవును. పోయి అతనిం దరిసి పూలుచల్లి సుఖమడిగి కూరుచుండును. రత్నహారము జూదాన ఓడఁబడినది. దానివెలయెంత యని మందహాస చమత్కారముతో తన చేటిచే అడిగించును. దానిని వెదకి పట్టువఱకు ఈ సువర్ణభాండ ముండనీతే అని శర్విలకుని వలనఁ గొన్నదానిని చూపును. అంతట అట నందఱును రత్నహారముం గూర్చినది-

సువర్ణ ఖాండమును గూర్చినదియు నగు జూదపుటోటమి మాట ఉత్తదియని గుసగుసలు వోయి యొండొరులు నిజములు చెప్పుకొందురు. మలికిత మంతయు తీఱిపోవును. వసంతసేనకు పక్కన చేటియు చారుదత్తునికి పక్కన మైత్రేయుఁడును తమ సాని స్వాములకు అవినయసంకోచము కలిగించుపాటివారు కారు, ఇఁకను సన్నిధివియోగ మేల? మరలనపుడు మబ్బుకమ్మి మెఱుము తళుక్కని మింటిం బెనచికొనఁగా, ఇఁక తమకము పట్టలేక వసంతసేనా చారుదత్తులు ఒండొరులను ప్రగాఢముగా తొలి యాలింగనము చేసికొని, జల్లు తొడంగగానే ఇంటిలోపలికి పోవుదురు.

అది చారుదత్త వసంతసేనల ప్రధానశృంగారముయొక్క తొలి పర్యవసానము.

ఇట్లు ముగిసిన ఇందులోని కొన్ని యవాంతర విషయములు పరికింపఁ దగును, తొలియంకములోనే శకారుఁడు వసంతసేన తనకు దొరకక చారుదత్తునింటఁ దూఱఁగా దానిని తనకడకు చేర్చి నెయ్యము నెఱపుమనియు లేకున్న తాను పగఁగొని ఆ యిరువురిని చారుదత్త వసంతసేనలను ఏమేమో చేయఁగలననియు బెదరించి పోయియున్నాఁడనుట. శర్విలక మదనికల పెండ్లియైనది. మఱి అదియైనతీఱున వా రుభయులును వసంతసేనకు కృతజ్ఞులై ఆంతరంగికులై యుండవలసి ఏర్పడినది. తన పాదాలలో వాలి మ్రొక్కిన మదనికను వసంతసేన అభినందించుచునే ఇఁక నీవు గాదు నాపాదాలలో వ్రాలవలసినది, వధువవైపోయిన నీపాదలలో తాను వ్రాలఁదగును, అనఁగా తన మనసులో లోఁతున దాఁగియున్న చారుదత్తుని మీఁది యనురాగమున నిమిడియున్న కులాంగనతా వాప్తికైన మెఱమెఱ సూచితమైనది. ఈ బృందములోని యావీరచోరుఁడు శర్విలకుఁడు తటాలున అప్పుడే తన మిత్రము ఆర్యకుఁడు నిష్కారణ ముగా సిద్ధాదేశభీతుఁడైన రాజుచే చెఱలో పెట్టఁబడినాఁడని విని వానిని విడిపింపఁ బోవుటచే ఆ రాజపరివర్తన పితూరీదారులతో ఇందఱును, చారుదత్తుఁడును తదీయులును, వసంతసేనయు తదీయులును వారి ప్రయత్నములన్నియుం గూడ ఈ తట్టుకు, రాజునకు ఎదిరికి చెందినవగుననియు వారు తదీయులలో హార్దముగా లీనులని లోలోపల గ్రహింపఁ బడుదురనియు తోఁచును. నాటక ప్రధానాంగమగు చారుదత్త వసంతసేనల కథతో ఈ పితూరీ యోగక్షేమమును ఇఁక నొకపాటి పెనఁగొనును. అనును చారుదత్తుఁడు కడపట శర్విలకునితో—మా యీపొందు - ప్రణయము - నీవు కూర్చినదే - (సువర్ణఖాండముచే - X - 49) అని

ఆఱవ యంకము, పరివహణవిపర్యయమనునది ఈ నాటకవస్తువునకు ఒక కీలుమేకు వంటిది. అంతవఱకు కథ ఒకవిధముగా పైకి నడచుచున్నట్టిది ఇఁకను క్రిందికిని, క్రిందికి నడుచుచున్నట్టిది ఇఁక పైకిని పాఱును. చారుదత్త వసంత సేనల కథ ఒక తీఱున మెల్లగా పైకినడచి చారుదత్త చతుశ్శాలాభ్యంతరమున వారి 'సత్' సురతోత్సవ సుఖమున ముగియును. ఇఁకను ఇందుండి వసంతసేన హత్యవంకకును చారుదత్త మరణదండన వంకకును పేరెము పాఱును. ఆర్యకుఁడు రాజు కాఁగలఁడను సిద్ధాదేశము మెల్లగా పరివ్రాజు చెవిందాకి అంతట శంకింతుఁడైన వానిచే కారాబద్ధుఁడై యున్న యార్యకుఁడు తప్పించుకొని తనయిల్లుచేరి తన మిత్రులం గలపికొనును, ఉజ్జయినీ రా జగును.

ఈ యంకమున రెండు విషయములు ఉన్నవి—ఒకటి మృచ్ఛకటిం గూర్చి నది, దాని మహిమచే అది నాటకమునకు పేరైనది. మఱి యొకటి బండ్ల మాఱు పాటు, దాని మహిమచే అది ఈయంకమునకు పేరైనది.

చారుదత్తుని కొడుకు రోహసేనుఁడు ప్రక్కయింటి పిల్లవాని బంగారు ఆట శకటికం జూచి అది కావలయునని యేడ్చి, చేటి, దానింటోనిది ఒక మట్టి శకటిక చేసి యీఁగా ఒల్లక మకురుదనము చేయుటను నిద్రలేచి శయ్యాగారమునుండి వచ్చి ఇంటిలో అందఱకి స్వజనమువలె నైపోయిన వసంతసేన చూచి జాలిగొనును. ఆ బండి ప్రస్తావముచే ఇంటి యప్పటి దారిద్ర్యమునకు తనకు మనసు కలుక్కనును. పిల్లవానిని బుజ్జవించును. వాఁడు ఎవరీమె అనఁగా రదనిక మీయమ్మరా అనును. వాఁడు కాదు పో - ఈమెకు ఒళ్ళంతా నగలేనే అనును. పిల్లవానిచే అమ్మ యనిపించుకొనుటకును ఆదారిద్ర్యము మాపి వానికిని బంగారుబండి కలిగించుటకును వసంతసేన తన సువర్ణ భాండములను ఆబండిలో నింపి 'నాయనా, ఇదిగోచూడు, మీయమ్మనైతిని, ఇందము. బంగారుబండి చేయించుకో' అని యిచ్చును. ఈ నగలు నాఁడు నమ్మకముతోఁపింప చారుదత్తునిచేత ఇల్లడయైనవి. దొంగిలింపఁబడి మరల వసంతసేన చేతికి చేరినవి. అందుండి మరల ఇట్లు ఈ బండిలోనికి వచ్చినవి. అవి మనకెందుకు వసంతకు చేర్పు అన్న చారుదత్తుని మాటబడి మైత్రేయుఁడు వానిం గొనిపోవుచు ఇంతలో చారుదత్తుఁడు ఫిర్యాదులో చిక్కుకొని విచారణలో నున్నాఁడని విని అక్కడికిపోయి శకారునితోడి జగడాన సంకనుండి అధికరణకుని ఎదుట పొరపాటున పడవేయఁగా అగపడి చారుదత్తునిపైకి ప్రబలప్రతికూల సాక్ష్యమై వానివి-

కొర్తికి సహించుచుసు. అట్లు వసంతసేన మృచ్ఛకటిం గూర్చిన ఆనగలు ఎంతపని చేసినవి అన్నట్లుగా తజ్జ్ఞాపకముగా నాటకమునకు కవి మృచ్ఛకటి అని ఆ పేరిడినాఁడు.

ఇఁకను బండ్ల మాఱుదల. అది న్యాయ్యముగానే విశ్వసనీయముగానే ఏ యసాధారణతయు తోపకుండునట్లే యున్నది. ముందు బయలుదేఱినబండి వర్ధమానకుఁడు తోలు చారుదత్తుని పెట్టెబండి. అది యింటి దిడ్డి వాకిటి చెంతకు వచ్చినది. వసంతసేన ఎక్కవచ్చును అన్నాఁడు. మఱి వసంతసేన 'ఉండు, కొంచెము, నేను అలంకరించుకొని ముస్తాబయ్యెదను' అన్నది. వర్ధమానకుఁడును, సరే నేనును బండిలో పఱుపు మఱచి వచ్చితిని. ఎడ్లు నిలువకున్నవి. బండితోనేపోయి దానిని వేసికొని వచ్చెదను. అని పోయినాఁడు. వసంతసేన తన కాంతుం గలిసికొనను పోవుట, తాను అలంకరించు నేర్పుగలజాతిది. రాత్రి నలకడలో పడుకలో తలరేఁగి ఒళ్లునలిగి ఉన్నది. కావున ముస్తాబగుటకు కొంత యాలస్య మగుచున్నది. ముస్తాబు ఐనది. ఇంతలో స్థావరక చేటుఁడు పుష్పకరండ జీర్ణోద్యానమునకు శకారునికై తోలు కొనిపోవు బండిని అది దారియగుటచే దారిలో బండ్లు అడ్డముగా నిలిచియున్నందున చారుదత్తునింటి పక్ష ద్వారముకడ నిలిపినాడు - బండినేమి శబ్దము వినవచ్చినది. అదియు పెట్టె బండియే - అడ్డమున్న బండ్లను తానే సాయపడి చక్రమువేసి తొలఁగించి వత్తమని పోయినాఁడు. ఇంతలో వసంతసేన ముస్తాబై వచ్చినది. తెలియక ఆ సిద్ధముగా నున్న స్థావరక చేటుని బండిలో ఎక్కికూర్చుండి తలుపు వేసికొన్నది. స్థావరక చేటుఁడు బండ్ల చక్రాల నన్నిటిని కదలించి త్రిప్పి అలసివచ్చినాఁడు. తన బండిని కదలించినాఁడు. అది రవంతబరువుగా నున్నట్లు తోఁచినది. తాను అలసిపోయి నందున అట్లు తోఁచుచున్నది అని సమాధానపడినాఁడు. అప్పుడే 'ఆర్యకుఁడు కారాగారము నుండి తప్పించుకొన్నాడు. జాగ్రత్తగా కనిపట్టుఁడు' అని యఱపులు వీథిలో సంభ్రమము ఎక్కువ కాఁ జొచ్చినది. అందులకై స్థావరకుఁడు ఎడ్లను త్వరగా తోలఁ గడంగి నాఁడు. ఇది యొక మాఱుపాటు. వసంతసేన శకారుని బండిలో ఎక్కుట ఐనది.

ఆ తప్పించుకొన్న యార్యకుఁడు ఒంటికాల అరతెగిన సంకెల గలగల యనుచుండఁగా ఎవరైన చూతురో అని దాపుననున్న చారుదత్తునింటఁ జొచ్చి దాఁగి మెల్లఁగా దిడ్డి వాకిటికడకు పోయి అక్కడ అప్పటికి సరిగా చేరవచ్చిన వర్ధమానకుని

బండిలో వెనుకనుండి ఎక్కినాఁడు. ఎద్దులమీఁద కన్నుంచినవాఁడు, సంకెల గల్లుతో ఆర్యకుఁడు వెనుకతట్టు బండిలో ఎక్కి కూర్చుండఁగా ఆగల్లు వసంతసేన కాలి యందెల గల్లు అనుకొని, సరి ఆమె ఎక్కినదని కదలించి తోలుకొని పోయినాఁడు. ఇది రెండవ మాఱుపాటు. ఆర్యకుఁడు చారుదత్తు బండిలో ఎక్కుట ఐనది.

తర్వాత దారిలో వర్ధమానకుని బండి వీరకుఁడు చందనకుఁడు అను రాజా దారులచే అటకాయింపఁబడినది. అందు వీరకుఁడు కర్కశుఁడు చందనకుఁడును కర్కశుఁడైనను స్థానాన కాలాన ఉదారుఁడు మృదువును కాఁగలఁడు. వారు ఎవరిదిరా బండి అందులో ఎవరున్నారురా అన్నందులకు చారుదత్తునిది అందు వసంతసేన యున్నది పుష్పకరండమునకు చారుదత్తుని కడకు పోవుచున్నది. అని చెప్పినాఁడు వర్ధమానకుఁడు. ఇరువురును ఉజ్జయినీ పౌరాగ్రేసరులు. చారుదత్తుఁ డెల్లరకు పూజ్యుఁడు, చందనకుని కెంతయు అతనియందు గౌరవము. వాఁడు వీరకుని ఉండరా యని తాను ఎక్కి లోపల సోదా చూచినాఁడు. వసంతసేన లేదు. ఎవనిం గనిపట్టను తమ సంభ్రమమో ఆయార్యకుఁడు అందున్నాఁడు - చందనకుని శరణు అని బతిమాలుకొన్నాఁడు. అతఁడు మనసున రాజ పరివర్తన పితూరీదార్లపై పక్ష పాతము గలవాఁడు. ఆర్యకుని మిత్రమును. తాను అతనికి అభయమిచ్చి, దిగి బండి తలుపుమూసినాఁడు. వీరకుఁడు నేనును ఎక్కి చూచెదను అన్నాఁడు. చారు దత్తుని ఎఱుఁగవటరా వానిబండి. అందు వసంతసేన ఉన్నది. వసంతసేనను ఎఱుఁగవా ? నేను నీతోడివాఁడను ఎక్కిచూచి యైనది. దానిని పోనీఁదగును అని యనుచుంటినే మరల నీవు చూచుట - సాటివాఁడ నగునామాటను పాటింపమిగదా - అని వానిని నిరోధించి జగడమాడి కూలఁదన్నినాఁడు. వాఁడు కచ్చేరిలో చెప్పెదనని పోయినాఁడు. బండి దాఁటిపోయినది. వర్ధమానకునితో అన్నాఁడు, దారిలో మఱెవ్వ రైనను సోదాచూడవత్తురేని రాజాల నాయకులు వీరక చందనకులు ఇరువురు చూచి దానికి గుర్తు ఇందమని వసంతసేన చేతికి రహదారి యిచ్చినారని చెప్పుమన్నాఁడు. మఱి వర్ధమానకునికి తన బండిలో నున్నవాఁ డార్యకుఁడను మతి మొదటి నుండియు లేదు. వసంతసేన యనియే తలంచినాఁడు. అటకాయింపు సోదాలో ఆర్యక చందనక భాషితములు జనాంతికములు - మఱి యితరులకు వినఁబడినట్లుగాఁ గ్రహింపఁ గూడనివి. కావున తోఁటలో చారుదత్తుఁడు చూచి దింపువఱకు ఆర్యకుని సంగతి ర్ధమానకుఁడు ఎఱుఁగఁడు

స్థావరక చేటుని బండికి, శకారునిది, రాజు మఱఁదిది యని ఆటంకము కలుగకయే పోయియుండును. దానికి సోదా ప్రసక్తి అగపడలేదు.

మఱి గంతవ్యదేశమైన పుష్పకరండమునకు వెనుక బయలుదేఱిన వర్ధమానకుఁడు ముందును, ముందు బయలుదేరిన సావరకుఁడు వెనుకను చేరినారే అదెట్లు పొసఁగును, విశేషముగా వర్ధమానకునికి బండికి దారిలో పోలీసుల యటకాయింపు వలని జాగును కలిగినదే? ఇట్లు కాఁబోలును.

దారిలో బండ్లు జనుల సందడి అందందు అడ్డపడి వానిం దప్పించుకొనుటకైన జాగు కలిగించుననుట స్థావరక చేటుని మాటలవలనను. 'అలేలే గామలుఅ, ఓశలధ ఓశలధ' అను నఱపుల వలనను తెలియుచున్నది, ఇంకను చారుదత్తుఁడు ఎన్నియో అలస్యకారణములు VII-2 లో సూచన చేసినాఁడు. వానిం దప్పించుకొనిపోవ జాగు ఉభయులకు కలుగునదే ఐనను వర్ధమానకుఁడు చారుదత్తసేవా తత్పరుఁడు. ఆలస్యము తప్పింప అడ్డదారులు డగ్గఱు సందలు దూఱి ఎట్లో ముందు చేరినాఁడు. స్థావరక చేటుఁడు మెల్లమెల్లగానే పోవుచు 'ఓరోరి బందోడ వగలమారి బందోడం' బోని పాటలు ఆలాపించుకొనుచు ఈలలువేసికొనుచు మిడియెండకు రస్తాయోరల చెట్ల నీడలలో ఆఁగుచు మరల సాఁగుచు మట్టమధ్యాహ్నమునకు చేరినాఁ డనుకొనందగును. పుష్పకరండకోద్యానము ఊరిజనమునకు ఉమ్మడియైన సర్కారుతోఁట. అయినను అందులోనికి గొప్పవారు పోయి కాలక్షేపము చేయుచుందురు. అందు చారుదత్తుని వాడుక తట్టు అనియు, శకారునివాడుక తట్టు అనియు వారిపేరులతోనే వ్యవహరింపఁదగు వాడుక ప్రదేశములుండును. కావున అట చారుదత్త శకారులు ఒండొరులను పరికింపరు. ఎవరిచోటవారే అని యనుకొనఁదగును.

ఈ బండ్ల మాఱుపాటున ఆర్యకుఁడు చారుదత్తుం జేరి యాతని స్నేహాశీస్సుం బొంది, ఆ బండిలోనే తదనుమతమున బాంధవులం గూడఁ బోయినాఁడు. చారుదత్తుని యీ కృత్యము రాజునకు ఎంతయు అప్రియమైనది. తాను ఈ యార్యక సమాగమపు సంబంధమున, తనకు గొంతులోనే మెదలుచున్నదైనను వసంతసేన సంగతియేమి యన్న ప్రశ్నను జనాంతికముగానేని వర్ధమానకు నడుగఁడు. ఆత్మగతముగానేని యనుకొనలేదు. ఇల్లు చేరవలయునను తొందరయు, అక్కడ విచారించుకొందమన్న యోరుపును వహించి అప్పుడు ప్రియురాలిం దలఁచుకొని ఉత్కంఠతో తరలినాఁడు.

అట్లే వసంతసేన దైవికముగా శకారునికి ఆతోటలోనే అగ్గమైనది తత్సాన్నిధ్యమున పశూద్రేకము అతనికిని మసనష్ఠరోఁతయు భయమును వసంతసేనకును కలిగినవి. వాఁడు ఆపెం దఱియుటయు ఆపె వానిని కాలం దన్నుటయు జరిగినవి. ఆపె విటుని గుడ్డ కొన పట్టుకొని శరణమగు మని ప్రార్థించినది. వాఁడు విటుని ఆపెను మెడనులిమి చంపుమనును. 'ఈ నగరానికే భూషణము, పిన్నది, స్త్రీ - దీనిం జంపుదునా? ఏమిచ్చినను చంపను' అనును అతఁడు. అంతట చేటుని, తన బానిసగదా యని ఆ చెలువం జంపుమనును. వాఁడు నీవు నన్ను చంపినను నేను ఆపని చేయను, ససేమిరా - అని పరువెత్తును. అంత తానే పూనుకొని కాసె బిగించుకొనఁగా విటుఁడు ఏమీ నాయెదురుగా ఆపెను చంపెదవా అని వాని మెడపట్టి గుంజగా క్రిందపడిలేచి, నే నూరక అన్నామగాని, చంపుదునా అని, నీవు ఉన్న ఈపె సిగ్గుపడుచున్నది. నీవు పోయి పరువెత్తిపోయిన చేటుని వెదకితెమ్ము అన్నాఁడు. అట్లే సిగ్గునేమో, బోగముది అని అతఁడును వసంతసేనను తన న్యాసముగా చూచుకొమ్మని, తరలి దాఁగి పొంచి చూచి వాఁడు పిల్లా పిల్లా రావే అనుటం గాంచి ఫర్వాలేదు కామియైనాఁడులే అనుకొని పోవును. ఈ యొంటి పాటున మరల వాఁడు వసంతను బతిమాలఁగా, ఆపె తీయమామిడిని మాని మోదుగును తాఁకుదునా అని తిరస్కరింపఁగా చారుదత్తునే వాపోవు నాపెను మెడనులిమి చంపినాఁడు. విటుఁడు పాపము వాని మాటను నమ్మినాఁడు, తర్వాత వచ్చి చూచి యేడ్చి శకారునిసేవ మానుకొని పోయినాఁడు,

శకారుఁడును చారుదత్తుని మీఁద దారిద్ర్యముచే వసంతసేనను పుష్పకరండమునకు తెచ్చి నగలు పెఱుకుక్కొని గొంతుపిసికి చంపినాఁడని ఫిర్యాదు చేయును. అధికరణికుఁడు తాను ఫిర్యాదును పట్టను అనఁగా శకారుఁడు తన బావతో చెప్పుదునని బెదరించును. అంతట అతఁడు ఫిర్యాదును గ్రహించును. చారుదత్తుం బిలిపించి యడుగఁగా తానది ఏమియు ఎఱుఁగనని చారుదత్తుఁడు అన్నాఁడు. అధికరణికుఁడు చారుదత్తుని శీలఖ్యాతిని బట్టి రవంత పక్షపాతము గొన్నను వసంతసేన చారుదత్తుని బండిలో పోవుచుండఁగా తాను చూచితి నన్న రాణాదారు వీరకుని సాక్ష్యమును, వాఁడే అపుడు ఆపుష్పకరండమునకు పోయి తనిఖీ చూచివచ్చి అక్కడ కుక్కలు నక్కలు పెఱికి తినుచున్న యొక స్త్రీ శవము ఉన్నదని చెప్పినమాట యాప్రతికూల సాక్ష్యమును బలపఱిచినది. ఇంతలోవచ్చి శకారునితో తప్పుడు ఫిర్యాదని జగడమాడి కొట్లాడిన మైత్రేయుని సంకనుండి వసంతసేన సువర్ణభాండము జాఱి అధికరణికుని

ఎదుటపడి పట్టువడఁగా దాన చారుదత్తునిపై ఫిర్యాదు గట్టిగా రుజువైనది. చారుదత్తుఁడు తానేమేని వివరములు చెప్పఁబూనిన, ఆర్యకుని సంగతి బయటవడుననియు నగలం గూర్చిన తన మాటలు దారిద్ర్య దోషమున నమ్మఁబడవనుపరువునకు వెలితియగు ననియును గబ్బిగా నోరుమూసికొనియుండి శకారుని మాత్రము దూషించి రాజు ధర్మశాస్త్రమును పాలింపలేదని రాజును శపించి చండాలురకు చంప నప్పగింపఁబడినాఁడు.

దశమాంకమున చారుదత్తుఁడు వీథులలో వధకు కొనిపోఁబడుట ఎంతయో జాలి గొల్పును; చూపఱు తలలు వంచుకొని, కన్నుల నీరుకార్తురు. వీధిలో స్థావరక చేటుఁడు ప్రాణమునకు తెగి మేడమీఁదినుండి దూఁకి తాను కంటితోగన్న నిజముచెప్పి చారుదత్తుం దప్పింపఁ బ్రయత్నించుటయు మైత్రేయుఁడు చారుదత్తునికై ప్రాణము వదలనుంకించుటయు ఎంతయు శ్లాఘ్యము. చండాలురును రాజాజ్ఞయని చారుదత్తుం జంపుట నెఱవేర్తుముగాని మాకెంతయు దుఃఖాన మనసుకరఁగి పోఱుచున్నదనుటయు ప్రశంసనీయమే.

చారుదత్తునిచంపుప్రయత్నము విపివించునంత దీక్షముకాఁగా, అప్పటికి వసంతసేనయే బ్రదికి లేచివచ్చి యగపడి చారుదత్తుం గాఁచినది. ధూతయు నిప్పులం బడనీయక ఆఁపఁబడినది.

అప్పుడే రాజుం జంపి కొత్తరాజు ఈ వర్గముచే ఉపకృతుఁడు ఈ వర్గమునకు అనుకూలుఁడు వచ్చినాఁడు. అన్ని విధముల నిర్వహణము మంగళాంత మైనది. అందు శకారుని చారుదత్త పాదాక్రాంతుని ఉపకారహతుం జేసి అతఁడు విడిచిపెట్టుటయు ఎంతేని కొనియాడఁ దగినది.

## ప్రధానకథతో ఆంతరకథకు పెనఁడువ

ప్రస్తావనలోని కథాసూచనలోని 'వ్యవహారదుష్టతాం' అనుటయందే రాజ్యాన పరిపాలన సరిగా లేదని సూచించినాఁడు. మఱియు సూత్రధారుఁడు జూర్ణకవృద్ధుని పాలకరాజుచే కోయింతునని ఆతని యధార్మికతను కొండీంద్ర విన్నుటను సూచించినాఁడు. ప్రొద్దు క్రుంకి చీకటి పడఁగానే నగరవీధులలో శాంతియు మంచియు లేక గణికలు విటులు చేటులు రాజవల్లభులు విశృంఖలముగా తిరుగాడుచుందురు. వసంతసేనం దఱుముటంబోని పోకిరితనములు పేదబ్రాహ్మణులను వైదికులను హేళనముచేసి వేధించుటలు ఇట్టి వన్నియు నుండునని తెలుపఁబడినది. జూదమును ఆడుటలోను ఆడించుటలోను

పర్కారువారును షరీకు అని అడపులేని వాస్పీథడగవాలలో తెలియవచ్చుచున్నది. అట్లే కన్నపు దొంగతనాలును. దేశాన పాలనయందు జనులకు అతృప్తి కలిగి ఉన్నది. కావున ఎవఁడో సిద్ధుఁడు గోపాలబాలకుఁడు రాజు కాఁగలఁడని ఆదేశించినాఁడు అని లోలోపల రహస్యముగా గోపాలబాలకవర్గ మని జనులలో క్రింది మెట్టునుండి పై మెట్టువఱకు ఏర్పడి పితూరీ రాజదొడఁగినది - ఈ విషయము దరిద్రచారుదత్తమున లేదు - శూద్రకుఁడు కల్పించి ఇందు ప్రధానకథతో చాల నేర్పుగానే పెనఁచి అల్లినాఁడు. ఐనను ప్రధానకథా ప్రాధాన్యమును డిందనీక ఈయంగ కథయు చక్కఁగానే వెలుంగు నట్లు అల్లినాఁడు.

ఇందు లెక్కకువచ్చు పాత్రములు గోపాలబాలకుఁ డార్యకుఁడు, శర్విలకుఁడు, చందనకుఁడు, దర్దురకుఁడు, శకారుని విటుఁడు. ఆర్యకుఁడు గొల్లయైనను దైవము అతనిని వెదకి పైకి ఎత్తినదనఁగా వానిలో ఏవో రూపగుణాది విశేషములు ఉన్న వనియే. శర్విలకుఁడు వాని మిత్రము. పితూరి నాయకుఁడు, చెడిన బాపఁడు, కన్నపు దొంగతనమును విద్యగా నేర్చినాఁడు; భోగము మదనికను వలచి వెలయిచ్చి స్వతంత్రంజేసి తనకు భార్య కావించుకొన్నాఁడు. తనకుఁ దగిన రాజ్యాపరక్తులనెల్ల ఒక ప్రోగుచేసినాఁడు. శర్విలకుఁడు మదనికతోను దాన వసంతసేనతోను అట్లట్లు చారుదత్తునితోను లంకెపడినవాఁడైనాఁడు. చారుదత్తమిత్రము రేభిలక భావుఁడు వానికిని ప్రియమిత్రము విస్రంభస్థానము. దర్దురకుఁడు వట్టి రాలుగాయ. వాని బొక్కల చివు కుడుఉత్తరీయము ఆసింహాసన రాజ్యమైన జూదమునుండి వాఁ డెట్లెట్లు ఆగతికి వచ్చి నాఁడో తెలుపును. సభికునితో బెడిసి పితూరివంకకు పోవును. శకారుని విటుఁడు శకారుని మూర్ఖతకును క్రౌర్యమునకును ఏవపడి ఆ రాజవల్లభునితో బెడిసి పితూరిలో చేరును. ఉన్న రాజు రాజ్యమునందలి జనుల యపరాగమును పితూరి లోలోపల రాజఁ దొడంగుటయు ప్రస్తావననుండి సూచిత మగుచున్నది. రెండవ యంకమున దర్దురకుఁడు అటు నడచినాఁడు. మూఁడవ యంకపు వైణిక రేభిలక భావుఁడు ఆర్య చారుదత్త మిత్రము, శర్విలకునికిని మిత్రము, నాలవ యంకమున మదనికం గొని పోవుచు శర్విలకుఁడు పాలకునిచే ఆర్యకుఁడు బంధింపఁబడినాఁడని విని మదనికను రేభిలకు నిల్లు సేర్పించి తాను వాని విడిపించు ప్రయత్నములకు పోవును. ఆఱవ యంకమున ఆ ప్రయత్నము నెగ్గి ఆర్యకుఁడు సంకెల పగులఁ గొట్టుకొనివచ్చి చారు దత్తు బండియెక్కి - చారుదత్త వసంతసేనల పేరున పోలీసుసోదాలో తప్పించుకొని చారుదత్తుం గలసికొని అత్యంత కృతజ్ఞుఁడై ఆశీస్సు పొంది ఇంటికిం బోవును. అట్లు

వానిని బండిలో తప్పించుకొననిచ్చిన చందనకుఁడు ఆర్యకపూర్వమిత్రుఁడే పోయి ఆర్యకుం గూడును. ఇదెల్ల ఆఱే డంకముల వృత్తము. ఎనిమిదిలోను శకారుని విటుఁడు శకారునివిడిచి పితూరినాయకుం గలయును. తొమ్మిదవ పిర్యాదంకమున చారుదత్తుఁడు ఆర్యకునికి అపకారము కలుగునేమో అని తన కనుకూలము కాఁగల సాక్ష్య వివరములను వేనిని చెప్పక మూఁగగా నుండెను. పదవ యంకమున పాలక వధతో పితూరి నెగ్గి క్రొత్తరాజు, క్రొత్త యేర్పాట్లు కావింపఁగా నాటకవస్తువు చక్కని శుభావసానముం బొందును. ఇట్టిది ప్రధానవస్తువునకును అప్రధాన వస్తువునకును కవి కూర్చిన సమ్మేళనము.

## కామసూత్ర నాగరకవృత్త వైశికాది

నాటకకవి ప్రస్తావనలో తన్నుం గూర్చి చెప్పుచో —

"ప్రథితః శూద్రకః........కలాం వైశికీం జ్ఞాత్వా" అన్నాడు. ఇందు నాయికయు వేశ్య. కావున వాత్స్యాయన వైశికాది ప్రకరణమునుండి ఇది యుదాహరింపఁదగును.

IV. నాగరకవృత్త ప్రకరణమ్.

1. గృహీత విద్యః ప్రతిగ్రహజయక్రయ నిర్వేశాధిగతైరర్థై రన్వయాగతై రుభయైర్వా గార్హస్థ్య మధిగమ్య నాగరకవృత్తం వర్తేత — నాయకః.

..........................

16. స ప్రాతరుత్థాయ కృతనియతకృత్యః, గృహీతదన్తధావనః మాత్రయా అనులేపనం ధూపం స్రజమితి గృహీత్వా, దత్త్వా సిక్థక మలక్తకంచ, దృష్ట్వా ఉదర్శే ముఖమ్, గృహీత ముఖవాసతామ్బూలః కార్యా ణ్యనుతిష్ఠేత్.

.......................

23. ప్రదోషేచ.........

24. తదన్తే.........

25. ఆగతానాం (అభిసారికాణాం) మనోహరై రాలాపై రుపచారైశ్చ... వర్ష ప్రమృష్ట నేపథ్యానాం దుర్దినాభిసారికాణాం స్వయమేవ పునర్మణ్డనమ్, మిత్ర జనేనవా పరిచరణమ్.........

39. ఏతేన ఉద్యానగమనం వ్యాఖ్యాతమ్......

40. పూర్వాహ్ణ ఏవ స్వలంకృతా స్తురగాధిరూఢా వేశ్యాభిఃసహ పరిచారకానుగతా గచ్ఛేయుః; దైవాసికీంచ యాత్రాం తత్రైవానుభూయ. ...... ...... అనుకూలైశ్చ చేష్టితైః కాలంగమయిత్వా అపరాహ్ణే గృహీత తదుద్యానోపభోగచిహ్నా స్తథైవ ప్రత్యావ్రజేయుః. (ఉపభోగచిహ్నైః - కుసుమస్తబక కిసలయాదిభిః ... శిరః కర్ణేషు కౢప్తైః - ఇతి.) .........

46. ఏకదేశవిద్య స్తు క్రీడనకో విశ్వాస్యశ్చ విదూషకః వైహాసికో వా. (...... వేశే గోష్ఠ్యాంచ వివిధేన హాసేన చరతీతి వైహాసికః - ఇత్యుభయనామా.)

వైశికాధికరణమ్-I

1. వేశ్యా.........

6. నిత్య మలఙ్కారయోగినీ రాజమార్గావలోకినీ దృశ్యమానా న చాతివివృతా తిష్ఠేత్ పణ్యసధర్మత్వాత్. (...అతి ప్రకటం పణ్యమపి న శ్లాఘనీయం భవతి.)

వేశ్యయా గమ్యస్య లక్షణమ్.

10. కేవలార్థా స్త్వమీ గమ్యాః, స్వతన్త్రః, పూర్వేవయసి వర్తమానః, విత్తవాన్, అపరోక్ష వృత్తిః, అధికరణవాన్, అకృచ్ఛ్రాధిగతవిత్తః, సన్తాయః, సుభగమానీ, శ్లాఘనకః, స్వభావత స్త్యాగీ, దైవప్రమాణః, విత్తావమానీ, సవిత్తః, ఏకపుత్రః ...... (కేవలః ప్రీతిరహితోఽర్థః యేభ్యః ఇతి. ప్రీతియశోఽర్థా శ్చ రతియశసీ అర్థః ప్రయోజనం యేభ్యో ఽర్థస్త్వానుషఙ్గికః, స్వతన్త్రః గురుష్వపరాయత్తః, అపరోక్షా ప్రత్యక్షా, న దేశాన్తర వృత్తి ర్జీవనం యస్య, అధికరణవాన్ అధ్యక్షః, యోఽర్థాధికారేఽధికృతః సోఽర్థదః - దైవప్రమాణః భాగ్యక్షయేణ క్షీయతే నోపభోగేన సంపదితి మన్యమానః బహుదదాతివిత్తావమానీ కలసమం ద్రవ్యమిత్య మన్యమానో దదాతి.

11. ప్రీతి యశోఽర్థా స్తు గుణతోఽధిగమ్యాః. (యతో గుణవద్భ్యఏవ ప్రీతి ర్యశశ్చ భవతి.)

నాయక గుణాః.

12. మహాకులీనో విద్వాన్ సర్వసమయజ్ఞః.....వాగ్మీ, ప్రగల్భః,........ మహోత్సాహో దృఢభక్తిః అనసూయకః, త్యాగీ, మిత్రవత్సలః, ఘటా గోష్ఠీ ప్రేక్షణక సమాజ సమస్యాక్రీడన శీలో, నీరుజః.....ప్రాణవాన్, అమద్యపః, వృషో, మైత్రః, స్త్రీణాం ప్రణేతా, లాలయితా, న చాసాం వశగః, స్వతన్త్రవృత్తి, రనిష్ఠురోఽనీర్ష్యాలు, రనవశఙ్కీ చేతి నాయక గుణాః.

(ప్రగల్భః = ప్రతిభావాన్, దృఢభక్తిః = దృఢప్రీతిః న హారిద్రా రాగః, అనుసూయకః = క్షమావాన్, ప్రేక్షణకం నటాదిదర్శనమ్, సమస్యా క్రీడా సంభూయ క్రీడా, ప్రాణవాన్ = బలవాన్, అమద్యపః - అర్థాత్ బ్రాహ్మణః, వృషః = వ్యవాయ (=మైథున) క్షమః, మైత్రః = కరుణావాన్, అనవశఙ్కీ = నిఃశఙ్కీ ఆరమ్భవాన్, ప్రణేతృత్వం ఉపదేశేన తాసాం సముదాచారస్థాపనమ్).

13. నాయికా గుణాః -

రూప యౌవన లక్షణ మాధుర్యయోగినీ, గుణేష్వనురక్తా న తథార్థేషు, ప్రీతిసంయోగశీలా, స్థిరమతి, రేకజాతీయా, విశేషార్థినీ, నిత్యమకదర్యవృత్తిః, గోష్ఠీ కలాప్రియా, చేతి నాయికాగుణాః.

(లక్షణం - సౌభాగ్యాదిసూచకమ్, ప్రీతిసంయోగశీలా ప్రీతిగ్రహణం బాహ్యసంయోగ నివృత్త్యర్థమ్, రతిసంభోగశీలేత్యర్థః, స్థిరమతిః కర్తవ్యమితి నిశ్చిత్య అన్యథా నకరోతి, ఏకజాతీయా ఏకప్రకారా, న మాయావినీ, విశేషార్థినీ న యత్ర క్వచనవస్తుని రమతే, అకదర్యవృత్తిః - ఆత్మవృత్త్యనురోధేన అర్థసఙ్కోచః కదర్యవృత్తిః సా న యస్యాః, తత్రాపి న కదాచిత్ ఇత్యాహ నిత్యమితి;)

15. బుద్ధి శీలాచార, ఆర్జవం, కృతజ్ఞతా, దీర్ఘదూరదర్శిత్వమ్, అవిసంవాదితా, దేశకాలజ్ఞతా, నాగరకతా, దైన్యాతిహాస పైశున్య పరివాద క్రోధలోభ స్తమ్భ చాపలవర్జనమ్, పూర్వాభిభాషితా, కామసూత్రే కౌశలమ్, ...సాధారణగుణాః.

17. రాగః ... ధర్మః యశః ... ధన్యతా ... ప్రీతిః ... (రాగః స్వాభావికః ఉత్పన్నః, ధర్మః అకిఞ్చనవిద్వద్బ్రాహ్మణాభిగమనాత్, ...ధన్యతా

పుణ్యవానయం, అతోఽస్య సంయోగాత్ కీర్తనీయాహం భవిష్యామి, యత ఏష గుణవాన్ కులీనో ధనవాన్ రూపవాంశ్చ, ......సాతత్యా నిత్యసాహచర్యమ్, .........

21. ఉపనిమన్త్రితాఽపి గమ్యేన సాహసా న ప్రతిజానీయాత్. పురుషాణాం సులభావమానిత్వాత్. ............

24. సమ్భావితేన చ సహ విటపురోగాం ప్రీతిం యోజయేత్.

..........................................................

28. ......... కారణాపదేశేన స్వయంగమనమితి గమ్యోపావర్తనమ్

..........................................

గమ్యేన సహసంసృష్టా రఞ్జయేత్తం తతః పరమ్.

II. 1. సంయుక్తా నాయకేన తద్రఞ్జనార్థమేకచారిణీ వృత్తమనుతిష్ఠేత్.

2. సఞ్జయేత్ నతు సజేత్, సక్తవచ్చవిచేష్టేత ఇతి సఙ్క్షేపోక్తిః.

(సఞ్జయే దితి - షఞ్జ్ సఙ్గే - ప్రయోజకవ్యాపారే ణిచ్. నతుసజేత్ స్వయం సక్తాస్యాత్.)

......................................

10. ప్రేక్షణ మన్యమనస్కస్య రాజమార్గే ప్రాసాదస్థాయాః.........

......................................

మఱియు - మృచ్ఛకటిలో

ప్రస్తావన (6)

శ్లో. అవన్తిపూర్యాం ద్విజసార్థవాహో
యువాదరిద్రః కిల చారుదత్తః
గుణానురక్తా గణికా చ తస్య
వసన్తశోభేవ వసన్తసేనా
తయోరిదం సత్సురతోత్సవాశ్రయం

'సత్సురతోత్సవాశ్రయం' అని అట్లు దానిని ప్రధానముచేయుట చేతను, మొదటి యంకమందలి మధుకరికాపల్లవకాది చేటులతో వసంతసేన చారుదత్తు నభిసరిం

చుట నట్లు చెప్పుటచేతను. 'నృత్తప్రయోగవిశదౌ చరణౌక్షిపన్తీ' I-37 ఇత్యాది చేతను, '....విటజన నఖఘట్టితేవ వీణా' I-24. 'తరుణజన సహాయ శ్చిన్త్యతాం వేశవాసః' ఇత్యాది - I-31. 'వాప్యాం .... జనంవేశ్యాసి సర్వంభజ' I-32. 'గుణః ఖలు అనురాగస్య కారణం, న బలాత్కారః' ఇత్యాది వసంతసేన భాషితము లెల్లను, 'రత్నం రత్నేన సఙ్గచ్ఛతే' మొదలగు విటభాషితము లెల్లను. రాజవల్లభుఁడు రాష్ట్రియుఁడు వెంటఁబడి తిరస్కృంపఁబడుటయు, చారుదత్త వసంతసేనా సమాగమము సర్వమును, వెన్నెలలో తానే తోడుగా చారుదత్తుఁడు వసంతసేనను ఇంట వదలి మరలుటయు. రెండవ యంకమున వసంతవిరాళి వృత్తము సర్వమును, నాలవ యంకము సర్వమును. ఐదవ యంకపు దుర్దినాభి సరణసత్వరతోత్సవాది సర్వమును. ఆఱవ యంకమున చీకటితో తోఁటకు పోయిన చారుదత్తునిం గలసికొనుటకు అతని యేర్పాటు మేరకు వసంతసేన తగినట్లు సొగసు చేసికొని బయలుదేరుటయు - ఈ సర్వమును వాత్స్యాయన శాస్త్ర వైశికాదికి అద్భుతోదాహరణము, అత్యంతము హృదయంగమము. IX లో వేశ్యామాత భాషితములును వృత్తమును, వసంతసేనం గూర్చిన చారుదత్తు మాటలును X లో అతని వసంతం గూర్చిన యేడ్పును అట్లే. మఱియు V న సాటోపకూట కపటానృత - ఇత్యాది శ్లోకమును. VIII లో 'హా వసన్తసేనే, దాక్షిణ్యోదకవాహినీ' ఇత్యాది శ్లోకమును వేశ్యా వృత్త రహస్యములతో నిండియున్నవి. మల్లినాథుఁడో జయమంగళుఁడో వ్యాఖ్యానింపఁదగినవి, మఱి మంచి వాఖ్యం బడసినవి కావు.

ఈ నాటకమున కవి చెప్పిన వైశిక వృత్తము, శర్విలకుఁడు మదనికను దొరసానికి నిష్క్రియ ధనమిచ్చి, విడిపించి, వధూకరింపించుకొనుటయు, అదిలోకాన చెల్లుబడి యగుటయు, అట్లే వసంతసేన చారుదత్త యోగమున కులపాలికాత్వముం గోరుటయు, కొత్తరాజు దానినే, వధూత్వమును అవగుంఠనమును ఒసంగుటయు, వారి యనురాగము సామాన్య వైశిక మార్గమునం బ్రవర్తిల్లకుండుటయు, తద్వధూత్వపర్యవసాయిగా నడచుటయు శూద్రకుని ప్రతిభా కల్పన. ఒకవేళ ఇదియొకపాటి యెందేని జరిగిన దాని యనుకరణమగునా? కాదని తోఁచును. సర్వము కవి కల్పనయ యగును, ఒక్కింత భాసుని సూచనలుండు నేమో.

వేశ్యామాత వైశికమున ఇంటి పెద్ద, చేట చేటికలు బానిసలు స్వేచ్ఛాపౌరులు కారు, కూతులును నాయికలు అమ్మకు పరాధీనలు II-42. మాత్రావినా నకిఞ్చిత్

చేష్టిత. కన్నెటికము ఓలి - సర్వమును అమ్మ నిశ్చయించును, కైకొనును. ఇందు రాష్ట్రియుఁడు పదివేల వరహాల నగను ఇచ్చి అమ్మద్వారా వసంతను ఒప్పింపఁగోరి నాఁడు. వసంత ఒప్పుకొనలేదు. తాను చారుదత్తునే కూడుదు నన్నది. మదనికకు అభుజిష్యతను ధనము గొని ఇచ్చినది. వైశికమున నాయిక ఇల్లువీడి ఇఁక తాను నాయకుని ఇల్లాలుగ నుండఁగోరునేని తల్లికి అతఁడు ధనమీయవలయును. కాదా రాజునకు తెలిపియేని నిష్క్రియము ఒసఁగి విడుపు పొంది వేఱు ఊరికిం బోవచ్చునని వాత్స్యాయనుఁడు II-19. .... తేన సహ దేశమోక్షం రోచయేత్ రాజని నిష్క్రియంవ. అమ్మ ఒప్పుకొనకున్నను రాజు నుత్తరువు లేకున్నను అమ్మ బలవంతముగా పిలిపింప వచ్చును.

## ౪. పాత్రల శీలాదికము

ఇట్లు సామాన్య జనులకును ఇంపుఁ గూర్ప రచించిన యీ నాటకమున దానికి తగినట్లే యున్న పాత్రల శీలాదికముం బరిశీలింపఁదగును.

1. చారుదత్తుఁడు.—కథానాయకుఁడు చారుదత్తుఁడు, సదాచారపరుఁడై వేళ తప్పక నిత్య సంధ్యా మాతృబలులు నిర్వర్తించు బ్రాహ్మణ యువ. జూర్ణవృద్ధుఁడు 'సిద్ధీకృత దేవకార్యుని' అనును. వృత్తిచే సార్థవాహుఁడు. మైత్రేయుఁడు, వసంతసేన యెనిమిది లోగిళ్ల బంగళాను దాని సంపదను చూచి కుబేరభవనమనుకొని అంత సంపదకు మూలము ఓడలవ్యాపారమా 'కిం యుష్మాకం యానపాత్రాణి వహన్తి - మీకు ఓడ లున్నవా, సబురులు పోవునా?' యని యడుగుటం జూడ చారుదత్తునికి తాత తండ్రులనాటి నుండి - సాగరదత్తుఁ డను పేరునకుం దగినట్లున్న ఓడ వ్యాపార పరిచయము కలిగినవాఁడని - చారుదత్తుని యతిమాత్రపుసంపదకు అట్టి కారణ ముండెనా అని ఇంచుక ఊహకు అందును. దాననే ఓడ మునిఁగియొ తప్పియొ ఆకస్మిక దారిద్ర్యము కలుగును, షేక్స్పియరు వెన్నిసు మర్చంటుకుం బోలె. మఱి నాటకమున ఆకారణముం దడవలేదు. అంత ధనదసంపద నుండి ఎంతయు పేద వడిన ప్రస్తావమే కలదు. పుట్టు దయార్ద్ర హృదయతచేతను లెక్కలేని యీవుల చేతను చాల దీనదశకు వచ్చినవాఁడు. మఱి యతనికి ధనములేదనుచింత ఇంచుకయు లేదు. సంపద బండి కంటియాకు. మిత్రులకు ఇచ్చినాఁడు పేదల పేదఱికమును మాన్పినాఁడు, ఎవఁడు ఏ మంచిపని చేసినను తగినట్లు సత్కరించినాఁడు. నగరాన దేవళాలు సత్రాలు తటాకములు తోటలు అన్నింటిని సమకూర్చి యలంకరించినాఁడు. ఇట్టి

ఘనకార్య ధౌరంధర్యముచే పేదవడినందుకు అతనికి దుఃఖము ఇంచుకయు లేదు. మఱి అట్టిపనులం జేయలేకయు అట్లు ఈవులు ఈయలేకయు పోయితినే అనునది అతనికి దుఃఖము. అతిథులు ఇపుడు తన యింటికిరారే మిత్రులు తనతో పలుకరే అని యతని దుఃఖము. కర్ణపూరకుఁడు మదపుటేనుఁగువలన నొక శ్రమణకుం గాచిన పరాక్రమముం గన్నపుడు వానిని సత్కరింప వ్రేళ్లు తడవుకొని ఒక ఉంగరమైనను లేకపోయెనే యని మిన్ను చూచి అంగలార్చినాఁడు. ఈ పెద్దబంగళాలో సులువుగా ధనము దొరుకునని ఇంటికి దొంగ కన్నము వేయఁగా వాని కష్టమునకు ఇక్కడ ఏమియు దొరకక వాఁడు వట్టిచేతులతో ఏమనుకొని పోయెనో అని వందురును. ఆర్జవశాలి యతఁడు తనచే నుపకృతులు ఇప్పుడు కృతఘ్నులై తన్ను సరకు చేయరే అని దుఃఖించును. మైత్రేయ రదనికలు సయితము, యథాపూర్వానుసరణము కలిగి యున్నను, మున్నువోలె తన్ను లక్ష్యపెట్టుట లేదని భ్రమయును. మఱి ఇట్లుకదా అతని పరోక్షమున అతని చేటుఁడును మెచ్చుకొనును.

'సుజనః ఖలు భృత్యానుకమ్పకః స్వామీ
నిర్ధనోఽపి శోభతే......' అని.

అది యింట రదనికాదులకునుం జెల్లును.

మైత్రేయుఁడేమో పగలు ఎక్కడ తిరిగినను సర్వకాలమిత్రముగా సందెవేళకు తన యింటికి తన కడకే వచ్చుచున్నాఁడు, ఉంటున్నాఁడు. వర్ధమానక రదనికాది పరిజనులు తన్ను వీడక కొలుచుచునే యున్నారు. ధూత పాతివ్రత్యము కలిగి అనుకూలముగా ఉన్నది. సంవాహకుఁడు సేవ మానుకొని పోయినను ఎంతయు తొంటి గౌరవ కృతజ్ఞతలు కలిగియే యున్నాఁడు.

చారుదత్తుఁడు దారిద్ర్య మహిమను ఇట్లుగ్గడించును. దారిద్ర్యమున సిగ్గు, సిగ్గున తేజోభ్రంశము. దాన పరిభవము, పరిభవమున విసుకు, దాన దుఃఖము, దుఃఖపుదెబ్బకు బుద్ధి కోలుపోవుట, దాన నాశనము గనుట - అని యతని యేడ్పు గొలుసువరుస. నాటకాన అతని యనుభవము లన్నియు, కడకు వసంతసేనం జంపెనన్న ఫిర్యాదు బనాయింపు సయితము, నిజదారిద్ర్య ప్రభవములే అని తలంచును. సంపద నిలుకడలేనిదని అతఁడు లెస్సగా ఎఱుఁగును, కాని దాన స్వార్థపరమును కృతఘ్నమును ఐ లోకము తన్ను చులకన చేయునే అని చేయకున్నను భ్రమగొనుచు అందులకు చింతిల్లును. సంపద తఱిఁగినందులకు కాదు, ఈవికి శక్తి విఱిఁగి

నందులకు అతఁడు పొగులుట. మదన త్రయోదశి పండుగుకు కామదేవుని గుడి యుత్సవమునకుపోయి అట వసంతసేనం గాంచినాఁడు. ఎందులకో తన్ను శరణు జొచ్చినదానిం గాచినాఁడు. దాని సౌందర్య విలాస విభ్రమములకు కన్నులు తనిసినవి. మనసున రాగము ఇగురొత్తినది. మరి ఆమె దరిద్రుని తన్ను సరకుసేయునా అని జంకి మరల తాను దానిని ఎవరితోను అనుకొననే లేదు. మఱి వసంతసేనయే వీథి కొంటెలం దప్పించుకొని తన గడప త్రొక్కి వచ్చినప్పుడును తనకు ఆ జంకు మాన లేదు. 'స్వగాత్రే ష్వేవ సీదతి' I-55. అని రాగమును చిత్తాన అడంచుకొన్నాఁడు.....

ఉజ్జయిని నగరాన చారుదత్తుని కీర్తి మ్రోగుచునే యున్నది. మైత్రేయుఁడు 'పురస్థాపనవిహారారామదేవాలయతటాకకూపయూపైః నగరీ అలఙ్కృతా' అనును. శకార విటుఁడు 'అస్మద్విధానాం ప్రణయైః కృశీకృతః' అనును. ఇంకను అతఁడు పలికిన పొగడికను వినఁదగును. (I-48)

'దీనానాం కల్పవృక్షః స్వగుణఫలనతః, సజ్జనానాం కుటుమ్బీ,
ఆదర్శః శిక్షితానాం, సుచరితనికషః, శీలవేలా సముద్రః
సత్కర్తా నావమన్తా పురుషగుణనిధి ర్దక్షిణోదారసత్త్వో
హ్యేకః శ్లాఘ్యః స జీవ త్యధికగుణతయా చోచ్ఛ్వసన్తీవ చాన్యే.

వసంతసేన తనయింటికి చారుదత్తు మానిసిగా వచ్చిన మైత్రేయుని ఇట్లు గదా చారుదత్త కుశలవార్త అడిగినది - "అపీదానీం

గుణ ప్రవాలం వినయ ప్రశాఖం
విశ్రమ్భ మూలం మహనీయపుష్పమ్
తం సాధు వృక్షం స్వగుణైః ఫలాఢ్యం
సుహృద్విహఙ్గాః సుఖ మాశ్రయన్తి ?" (IV-32)

ఇదెల్ల వసంతసేన వినుకలియే. అట్టిది ఊరిలో చారుదత్తు ప్రసిద్ధి. ఆ పలుకును మైత్రేయుఁ డెంతయు మెచ్చుకొన్నాఁడు - 'సుష్ఠు ఉపలక్షితమ్' అని.

చారుదత్తుఁడు దొంగనని తనపై పిర్యాదు చేయఁడా యని శర్విలకుఁడు అనఁగా మదనిక 'న చన్ద్రా దాతపో భవతి.' అనును. రాజాదారు చందనకుని మనమున చారుదత్తుఁడు ఎంత గొప్పవాఁడుగా నాటుకొని యున్నాఁడు! VI—13-14

'కస్తం గుణారవిన్దం శీలమృగాఙ్కం జనో న జానాతి
ఆపన్నదుఃఖమోక్షం చతుఃసాగరసారం రత్నమ్?
ద్వావేవ పూజనీయా విహ నగర్యాం తిలకభూతౌ చ
ఆర్యా వసన్తసేనా ధర్మనిధి శ్చారుదత్తశ్చ'

ఆర్యకుఁడును చారుదత్తుఁడు అభ్యుపపన్న వత్సలుఁడు అనును. తాను ఆతని బండి దొరకఁగా ఆతని పేరుచేతను గుణాల ప్రసిద్ధిచేతను తప్పించుకొనఁ గలిగితిని అని ఎంతయు అతనికి కృతజ్ఞుఁడగును. అధికరణికుఁడును ఫిర్యాదు విషయమున తాను నిష్పక్షపాత మవలంబింపవలయునని ఎంత యెఱిఁగి నమ్మినవాఁ డైనను చారుదత్తుని గుణాలకును కీర్తికిని అటు వంగక యుండలేఁ డాయెను. 'ఆర్య చారుదత్తః కథ మకార్యం కరిష్యతి?' అనును. ఇంకను ఎంతయో ఆతని ఘనతం బొగడును. IX-22 'కృత్వా సముద్ర ముదకోచ్ఛ్రియ మాత్రశేషం' ఇత్యాది. ఆతనికై శకారుని 'మూర్ఖ, వేదార్థాన్ ప్రాకృతస్త్వం' ఇత్యాదిగా దూషించును. ఈ మహనీయ కోమల దేహానినా కళలం గొట్టుట! - అనుకొనును. చండాలురును. (X-14)

'ఏష గుణరత్ననిధిః సజ్జన దుఃఖానా ముత్తరణసేతుః
అనువర్ణం మణ్డనక మపనీయతే ఽద్యనగరీతః'

అని వధ్యకు కొనిపోవుచును పొగడుదురు.

చారుదత్తునిం గూర్చిన యీ పొగడ్త, మిత్రులు, తటస్థులు సయితము చేసినది, వట్టివారి కపనముగాదు, సత్యమైన దాఖలాలపై నెలకొన్నట్టిది. ఈ పేదఱికపు దినాలలో కూడ అతఁడు తన యేపాటి మెచ్చుగన్న యెవనింగూడఁ దా సత్కరింపక పోఁడు. కర్ణపూరకునికి ప్రావారకదానము, కుంభీలకునికి ఉత్తరీయ దానము చేసినాఁడు. మైత్రేయుఁడు ఎంత వలదన్నను చతుః సముద్రసారమైన రత్నావళిని వసంతసేన తనయం దుంచిన మహా విశ్వాసమునకు ఇది వెలయగునని పంపిన యుదారుఁడును మనస్వియు. ఈ యౌదార్య కృత్యములన్నియు ఒకయెత్తు ఆర్యకునికి అభయమిచ్చి సంకెల యూడ్చి తన బండిలో క్షేమముగా సాగనంపి, అది మనుజపతికి మహావ్యళీకమగునని యెఱింగియు, దాన తనకేమి కానున్నను కానిమ్మని తెగించి అధికరణమునను ఫిర్యాదువిచారణ గందరగోళమున దానిని బయటపెట్టక కాచి

తన ప్రాణమునకు తెగించుట ఒకయెత్తు. వసంతసేన ఇతని వలచి అతనిచే గొంతు పిసికించుకొనుటయు. ధూత తా దూఁకుటకు నిప్పుమంటలు లేపుటయు, రదనికయు మైత్రేయుఁడును - సహగమనము గాదు - పురోగమనముగా ప్రాణము వదలఁ బూను కొనుటయు, స్థావరక చేటుఁడు మింటి యెత్తు మిద్దెనుండి ప్రాణమును ఒడ్డి చారు దత్తుంగావ మంటిమీఁదికి దూఁకుటయు - చండాలురను 'ఆర్య చారుదత్త, రాజ నియోగః ఖలు అపరాధ్యతి. న ఖలు వయం చణ్డాలాః' అని తమ కూరిమిని అసహా యతనుం గూడ చెప్పుటయు, నగరజనమంతయు చారుదత్తునికై జాలిపడుచు మొగాలుకప్పుకొనువారుగా కన్నీరువర్షించువారుగా అతనివెంట వీథిలో మూఁగుటయు ఇదెల్ల జనము చారుదత్తుని యౌదార్యమునకును కీర్తికిని చేసిన పూజయే. చారు దత్తుఁడు తన దారిద్ర్యమున తన్నెవరును లక్ష్యపెట్టరని వందురుట అతని మనో బలహీనతయు అప్పటి యతని జంకును ఒకవిధమగు అనుదార స్వభావమును దానిచే కొంతను కొండంతం జేయుటయు నగును.

చారుదత్తుని శీలమున ఎన్నఁదగినది. మఱియొకటి, యతని యాత్మశీలకుల కీర్తులందలి యసాధారణాభిమానము. దానిచేత నాతని నడువడితెలంగు చక్కఁగా బోధపడును. అతని యభిమానము సాధువే న్యాయ్యమే యనఁ దగును, మఖశత పరిపూతమైన వంశమున పుట్టినాఁడు, అతని పూర్వులు పుణ్యాత్ములని ప్రసిద్ధి; ఏ కళంకమును గలవారు కారు. తానును అట్టివాఁడే, ఏమచ్చయు కలవాఁడు కాఁడు. ఎట్టి యాపద వచ్చినను శీలభ్రంశము ఓర్వఁడు. చెప్పును గదా,

'నభీతో మరణాదస్మి కేవలం దూషితం యశః
విశుద్ధస్య హి మే మృత్యుః పుత్రజన్మసమో భవేత్'
'ఏకో మాం దహతి జనాపవాదవహ్నిః
వక్తవ్యం యదిహ మయా హతా ప్రియేతి.'

పతివ్రతమైన ధూతమ్మ నగను, భార్యసాయమునవా నాధురానా కాపాడుకొనుట అని తాను కొన నొల్లఁడు గదా - అతని యీ మర్జికి ఆమె మాటయే రుజువు. 'అతి శౌణ్డీరతయా ఆర్యపుత్రః న గ్రహీష్యతి.' ఎంతయు మనస్వి యనుట. వసంత సేనయు అందులకే సువర్ణభాండమును న్యాసము చేసినది, అతని యాత్మగౌరవ వినోదమునకు రత్నావళిని నిరభ్యంతరముగాఁ గొన్నది. ఎంత మనస్విరా యీయన యని యనుకొన్నది. అభిసరించినది. అక్కడ సువర్ణభాండ రత్నహారములం గూర్చి

గుసగుసలు. 'కిమిదం కథ్యతే? కిం వయం బాహ్యాః? ఏమిటి మీ రనుకొన్నది? నేను వినఁగూడదా?' అని తానును విని యెఱుంగును. వానిచే అన్ని మలికితములు తీఱుట - సన్నిధి వియోగదుర్భరత. వసంతసేన, ప్రగల్భ, తాను తొలుత చేయి చాఁపి కవుంగిలించుకొనఁగా చారుదత్తుఁడు తానుం జాఁపి కౌఁగిలి బిగించుకొని లోఁగిటికి నడిపించినాఁడు. అక్కడి రహఃసంగమము పోనిండు. అందును అధరపాన చుంబనాది బాహ్య చేష్టలును అంతః క్రియలును ఈతట్టును, అటు వసంతసేన తట్టును వెడ నవ్వులపాటియే కాని సరససల్లాపములు, ఈ గబ్బితనము నకు దూరమైనవి, అంతగా లేవు. చూ. X - 12

'శశి విమల మయూఖ శుభ్రదన్తి
సురుచిర విద్రుమ సన్నిభాధ రోష్ఠి
తవ వదన భవామృతం నిపీయ
కథ మవశో హ్యయశో విషం పిబామి?'

చూ. VI - వసంతసేనా - సుష్ఠు న నిధ్యాతో రాత్రౌ. త దద్య ప్రత్యక్షం ప్రేక్షిష్యే.'

తెల్లవాఱఁగా నిదుర తాను ముందులేచి, వసంతసేనకుం జెప్పక దానిం గలుపుకొని పోక, తాను ముందు పుష్పకరండమునకు, వసంతసేనను బండిలో పిలుచుకొని రమ్మని వర్ధమానకునికి రాత్రియే చెప్పినవాఁడు; వేఁకువను మరల మైత్రేయు ముఖమున చెప్పిపోవుటయు ఈ రసికుని శౌండీర్య విధానమే - అనురాగ మునను ఆ పుట్టుగబ్బితనము మానమి.

అధికరణమున ఫిర్యాదువిచారణసమయమునను ఈయత్యంతమనస్వితయు గబ్బితనమునే ప్రకట మగును. తనపై మోపఁబడిన నేరమునకు జవాబుగా రెండు మాటలు చెప్పినాఁడు చారుదత్తుఁడు. దుష్టుఁడు మత్సరి రాగాంధుఁడు ఘాతకుఁడు పుట్టు అబద్ధాలకోరు. ఈ శకారుఁడు - వీనిమాట గ్రహించుటయా, అరయక పోవుటయా? (X - 27) నేను తీఁగనైనను పూలుగిల్లను వంపనోడుదునే. అట్టి నేను ఏడ్పించి తీగఁబోడిని కొప్పు పట్టి చంపుదునా? (X - 28) అని. గొప్ప బ్రాహ్మణుఁడు వంశపుమడిని 'మఖశతపరిపూతం' అన్నవాఁడు, తాను వసంతసేన తన మిత్రమని సూటిగా ఒప్పుకొనఁడు. అది తన యౌవనపు టపరాధ మనును. వసంత సేన యింటికిపోయినదో ఎక్కడికి పోయినదో తాను సరిగా ఎఱుఁగడు పోసీ.

సువర్ణభాండము ఏడ్చిన రోహసేనుని మృచ్ఛకటికకై తనయిల్లు సేరినదన్నమాటనుం జెప్పఁడే. దాన తన దారిద్ర్యము పరామృష్టమగును, కీర్తి కొఱఁబడునను గర్వాననే. చెప్పియున్న ఫిర్యాదుకైన ఒక సాక్ష్యము దిద్దువడి ఒకపాటి తేలిపోయి యుండును. మఱి ప్రవహణ విపర్యాసము, అందు ఆర్యకుఁడు తనబండి యెక్కుట - ఇది యతని నోటివి గట్టిగా మూసివేసినది. దాన ఆర్యకునికిని తనకునుంగూడ పితూరి యన్వితులని తప్పక చావు మూఁడును. తా నేమైన కానీ. శరణాగతుఁడు ఆర్యకుఁడు అరక్షితుఁ డగును. మఱి యా శౌండీరుఁడు శరణాగతునికై తన ప్రాణమును తృణీకరింప వెనుదీయునా ? చారుదత్తుని నిజమైన దుఃఖకారణము -

'ఏషా చ వ్యథయతి ఘోషణా మనో మే'

'స్త్రీ రత్నం చ విశేషేణ శేషమేషా ఽభిధాస్యతి (-వ్యాపాదితా)

'ఏకో మాం దహతి జనాపవాదవహ్నిః -
ర్వ్యక్తవ్యం య దిహ మయా హతా ప్రియేతి.'

చారుదత్తుని యీ యౌదార్యాది విశేషమువలని తేజస్సు ఊరక వినంబడుట మాత్రమే యైనను, అబ్బ ! యెంతగొప్పది ! 'ఎంతటి వాఁడో !' యని మిఱుమిట్లు గొల్పునఁ దగును. మఱి కొన్ని యెప్పపెప్పటం జూచినవారి వర్ణనంబట్టి మనకు అందుబాటులో నిది ఆకళింపులోనిది యగుచున్నది. అతనింగన్న యార్యకుఁడనును - 'న కేవలం శ్రుతిరమణీయో, దృష్టి రమణీయోఽపి.' అని. అధికరణికుఁ డనును -

'ఘోణోన్నతం ముఖ మపాఙ్గ విశాలనేత్రం
నైత ద్ధి భాజన మకారణ దూషణానామ్.
న హ్యాకృతిః సు సదృశం విజహాతి వృత్తమ్.'

అని. బోగమువృద్ధ అందపు టంచన నిపుణ యనును -

'అయం స చారుదత్తః ! సునిక్షిప్తం ఖలు దారికయా యౌవనమ్'

అని. చండాలురును -

'అనువర్ణం మణ్డనక మపనీయతే ఽద్య నగరీతః'

అని. కావుననే వసంతసేన చూచిన మాత్రకు తానై వలచి అంత నేర్పుతో అతనిని తనవంకకు తిప్పుకొన్నది.

ఈ మహనీయుని గబ్బితన మట్లున్నందుననే, తన కులాంగనమీఁది గౌరవమును ప్రాణేశ్వరి యైన యనురాగమును అతిప్రగాఢములే, మఱి అంతగా వాగారంభముం బొరయవు. తన కుమారుఁడైన రోహసేనుని ఎప్పుడు దింపక ఎత్తుకొని ఒడిలో నుంచుకొని వినోదించును. అతి వాత్సల్యము. మఱి అంతగా మాటలాడఁడు, ముద్దులు 'పీకఁడు', లాలన చేష్టలు చేయఁడు. మఱి యతనిమీఁది మరులు ఇంతంత కాదు, వసంతసేనను కామదేవాయతనోద్యానమున చూచినాఁడు. కన్నులును చిత్తమును ఆ యందమున మునింగినవి. 'యయా మే జనితః కామః' అనును. మఱి ఆమాటను ఎవరి చెవిం బడను, మైత్రేయుని చెవిం బడనైనను ఒకమాఱు తల పోయఁడు గదా. దుష్యంత వత్స రాజాది తక్కిన నాయకులు ఎంతెంత యాత్మగతము గాను మిత్రశ్రుతముగాను చెప్పుదురు.

'కామం ప్రియా న సులభా, మనస్తు తద్భావ దర్శనాశ్వాపి' ఇత్యాది యెన్ని రసవ దుక్తులు!

చారుదత్తుఁడు మఱి వసంతను వెదకుకొనుచు తాను పోఁడు. వసంతయే తన యింటికి వచ్చును. మిద్దెయెక్కి అతఁడు వీథిం బోవుటం జూచును. పుష్పకరండకము నుండి మరలిన తర్వాత వసంతసేన పోఁబడి కనుఁగొని ఆబండిలో ఇంటికిపోయిన దనుకొని తనకుఁగల పునర్దర్శనమునకైన యుత్కంఠకు సూచనగా ఆ మఱునటి యుదయమే అతన శౌండీర్యమునే ప్రకటించుచు సువర్ణభాండమును (రత్నమాలతోడం గూడిన దానిని) ఆమెకు ఇమ్మని, మైత్రేయుం బంపును ఇంతలో అధికరణమునకు పిలుపును పోవును. అక్కడ పిడుగుపాటువంటి మాట వినును, 'వసంతసేన గొంతు పిసుకఁబడి చచ్చినది' అని. ఆనేరమునకు తనమీఁదకే పిర్యాదు బనాయింపు ఉండనీ - మఱి ఆత్మగతముగా నైనను 'అట్లు ఎట్లైనదోగదా, ఎంత దిగులుపడినదో ఎంత బాధపడినదో ఎంత ఏడ్చినదో అని ఒక్క కరుణోక్తి యనుకొనఁడు గదా—

'త్రస్తైక హాయన కురఙ్గవిలోల దృష్టేః
... .. ... ...
క్రవ్యాద్భి రఙ్గలతికా నియతం విలుప్తా'

'నష్టం సీతేతి నామాపి' ఉ. రా. చ.

అనువానిం బోనివి.

ఇట్టిది యతని గబ్బితనము. వసంతసేనకై యేడువవలయును. ఆర్యకుని కోసము ఎంతేని జాగ్రత్త పూనవలయును, తాను హత్యలో ముద్దాయి ఐ యున్నాఁడు. అదియు వసంతసేన విషయముగానే. ఎన్నియేని భయంకరపు టపశకునములై యున్నవి. పిర్యాదు బనాయింపున శకారుని నాఁటి బెదరింపు స్మృతికి వచ్చియుండును. అతని చిత్తము అపుడు భావముల పెనుకూడలియై, తా నేమియు పలుకకే మానరాని యే యొక్క మాటయో పలుకుచు అధికరణమున చారుదత్తుఁడు ఎంతేని అలవిపడని మెలఁకువ వహింపవలయును; కూడలిలో భావములు అహమహమికతో పొంగుచు ఉడుకుచు ఉన్నవి. పైన మరణదండనయు పడినది! అంత గబ్బితనము మనోబలమును గలవాఁడైనందుననే చారుదత్తుఁడు అపాటి నిలిచినాఁడు. మఱెవఁడైనను నిలుపున ప్రాణముపోయి వ్రాలియుండును. ఐనను ఈ లోఁతు పాఁతుగా ఇమిడిన భావము లన్నియు అతని చావుసమయాన ఎంతయు వెలికి పొంగును.

ఇంతటి గాంభీర్యగుణోన్నతులతో చారుదత్తునియందు ఇవియు పరికింపఁదగును. అతఁడు మంచి గృహస్థాచారసంపన్నుఁడు. వేళకు సంధ్యావందన జపములు చేయువాఁడు. ఆ తొలి యభిసరణమునాఁడు సాయంసంధ్య చేసియైనవాఁడు జపమునకు కూరుచుండి చాలసేపు సమాధిలో నుండును. దొంగతనము పోయిన రాత్రి వేఁగు జాముననే 'అహమపి కృతశౌచః సంధ్యాం ఉపాస్యే' అని యతని ప్రాతః సంధ్యావందనము నిర్దేశింపఁబడినది. గృహస్థుఁడు నిత్యకర్మలను మానరా దను తన యధ్యవసాయమును జెప్పును. ఇతఁడు నిత్యదేవకార్య తత్పరుఁ డని ఇతని మిత్రము జూర్ణవృద్ధుఁ డెఱుఁగును. 'సిద్ధీకృత దేవకార్యస్య' అనును. (మడిపనికి వాసన యంగవస్త్రము కూడదా?) గృహదేవతలకు బలియిడకం దప్పఁడు. చెప్పును-

'తపసా మనసా వాగ్భిః పూజితా బలికర్మభిః
తుష్యన్తి శమినాం నిత్యం దేవతాః, కిం విచారితైః?'

మఱియు అతనికి గాన చిత్రలేఖనాది కళలందు మంచి ప్రవేశము అభిరుచి కలదు. కన్నమువేసి చొచ్చిన దొంగకు మఱేమియు అగపడకున్నను అగపడిన వాద్యాదిచేత అతఁడు ఇదేమి నాట్యాచార్యుని యిల్లా యని అనుకొనును. చారుదత్తునియింట పాటకచ్చేరీలో ఆటకచ్చేరీలో జరుగు చుండెడివా? ఏల? అట్లు జరిగిన దాసివారు తమ సాధనములం దాపె తెచ్చుకొందురు. తమ సొంతములను మానలేరు. చారుదత్తుఁడే వానిని వాయింపను నేర్చినాఁడేమో. రేభిలుని వీణపాటవిని అట్లు మైమఱచినాఁడు!

దాని మెచ్చుకోలున తన సంగీత జ్ఞానమును, మర్మములు సయిత మెఱుంగుటను అవిష్కరించినాఁడు. అది వట్టి 'శిశుర్వేత్తి పశుర్వేత్తి గానరసం' అను మొత్తపు సుఖానుభవ మాత్రము గాదు. పాటలో ప్రత్యవయవము యొక్కయు మేలిమిని సయితము మెచ్చనేర్చును. 'తం తస్య స్వరసఙ్క్రమం మృదుగిరః శ్లిష్టం చ తన్త్రీస్వనం' - ఇత్యాది III-5. అట్టి రసికుఁడు. కావుననే అట్టి యింటిదే ఐన రసికురాలు వసంతసేన తన గుట్టెఱిఁగిన విటుని మెప్పును

'ఇయం రఙ్గ ప్రవేశేన కలానాం చోపశిక్షయా
వఞ్చనా పణ్డితత్వేన స్వరనైపుణ్య మాశ్రితా'

అని పొందినట్టిది, రసికురాలు అతనిని స్వయముగా వలచినది.

తన గృహస్థ నిత్యధర్మాచరణము తన చిత్తమందలి దీనజనావన వ్రతము, సాధ్వార్యకుని రక్షణము, దేవాయతన -విహార వాపీ తటాక నిర్మాణాది ధర్మైక నిరతి మొదలైనది చిత్తమునకుం గలిగించిన సంస్కారముచేతనే ఏతత్సర్వ ప్రభవమైన జన్మాంతర వాసనచేతనే 'ధర్మోరక్షతి రక్షితః' అను సూక్తిబడి 'ప్రభవతి యది ధర్మో దూషితస్యాపి మేఽద్య' అని అవసానమున చిత్తాన నాధర్మమును శరణుగొను తలంపు మొలకెత్తినది. 'విద్యేవ సముపాగతా' అను తలంపును మెఱసినది. చావు తప్పి బ్రదికి ఎంతయు తేజరిల్లినాఁడు. ప్రవరుఁడు అగ్నిం దలఁచకొనఁడా!

వసంతసేన—వసంతసేన యొక యసామాన్యమైన లేజవరాలు. తన యిల్లు ఇంద్రభవనము. ఎనిమిది లోగిళుల యది సర్వకళలయు మేలి వస్తువులయు నిధానము. ఎడ్లు ఆవులు గొఱ్ఱెలు గేదెలు గుఱ్ఱాలు ఏనుంగులు పక్షులు అన్ని ఉన్నవి. సంపద కుబేరుని చీరికిం గొననిది. తాఁగా కావలయునన్న ఉజ్జయినినే కొనివేయఁగలదు. మఱి ఎంతయు పుట్టు వినీతి శీలౌదార్యములచే విరాజిల్లునది. దేవతా భక్తయు. ప్రతిదినము - ఉదయముననే స్నానమాడి సొంతముగా దేవతార్చన చేయునది. ఇంటిలో సొంతముగా కామునిగుడి యున్నది. దేవతార్చన బ్రాహ్మణుఁ డున్నాఁడు. చేటులు చేటికలు విటులు పరీక్షిత భక్తులు తన నౌకరులును ఆశ్రితులును.

బోగమువాడం బుట్టియు అసాధారణ పవిత్రామోదము వెదజల్లు క్రొత్తగా పూచినపూవు. తాను తన యౌవనమును గుణవదర్పణకై మీఁదు కట్టియుంచినది. మఱి తాను బోగముదాని గుణాలు ఎంతలేనిదైనను కులాంగనకు సాటిరాఁగలదైనను,

భోగముది యన్నపేరును పోఁగొట్టుకొనఁ గలుగునా? తా నెంత యొల్లకున్నను ఏ భోగముదానిం గూర్చియుం బోలెనే విట శకారాదులు ఆపెం దలఁచియుదురు; ఆపెం గూర్చియు తలంతురు. చెప్పనుం జెప్పుదురు.

'తరుణజన సహాయ శ్చిన్త్యతాం వేశవాసో
విగణయ గణికా త్వం మార్గజాతా లతేవ,
వహసి హి ధనహార్యం పణ్యభూతం శరీరం
సమ ముపచర భద్రే సుప్రియం చాప్రియం చ.' I-31

'వాప్యాం స్నాతి విచక్షణో ద్విజవరో, మూర్ఖోఽపి వర్ణాధమః
... ... ... ... ... ... I-32

అందఱు మునుఁగు ఉమ్మడి బావి, అందఱు గిల్లు దారిప్రక్కని తీగ, అందఱు ఎక్కు ఓడ - అమ్మడు వస్తువు - భోగముది. అట్టి భోగముదిగా పుట్టి తనవృత్తిదైన యవమానమును తాను ఎట్లు తలఁగును?

ఐనను అప్సరసం బోని రూపముగల యీ యువతి ఆపెద్ద యుజ్జయినీ నగరమున ఔదార్య సౌశీల్యాదికమునకు తనకు మంచిపేరు సంపాదించుకొన్నది. చందనకుఁడు దానిని పూజనీయ అనును, ఆయూరి వెన్నెల యనును. ఊరి తిలకము అనును. శకారవిటుఁడును తొలినాఁడు వేఁదుఱు గొని అతనికి తోడుగా ఆపె వెంటఁబడినవాఁడె అనును. - 'నగర సౌభాగ్యము, నగరాధిదేవత,' అని చారుదత్తుఁడు దేవతోపాసనయోగ్య అనును.

ఊరిలో ఆపె గడించిన యీ యసాధారణమైన పేరుప్రతిష్ఠలు ఆమె యంతస్తునకు సామాన్యమైనవి కావు. ఆపె తీరు పట్టి సాంప్రదాయికపు నాయికా లక్షణ నిర్వాహము కాదు. వసంతసేన కీర్తి వట్టి దబ్బర కాదు, అది యాపె యసాధారణ రూపగుణములం బట్టి వచ్చినది. చారుదత్తుఁడు అనుభవించి చెప్పును - 'శశి విమల మయూఖశుభ్రదన్తి' 'సురుచిర విద్రుమసన్నిభాధరోష్ఠి' - అని. వసంతసేనం గౌగిలించుకొని యా యరిది తాకుఁడు అనుభవించుచు 'స్మరపీడితం మే సంస్పర్శ రోమాఞ్చిత జాతరాగం .... గాత్రం' అని సొక్కును. ఆపె నడచుచో అడుగులను 'నృత్య ప్రయోగ విశదముగా' వేయును. కదలాడు కమ్మల కాంతి ఆపె చెక్కిళ్లపై ఒరసి డాలు చిమ్మును. ఒడ్యాణపుఁ బేటల రతనాల నక్షత్రాల కాంతి మొల పావడం గమ్మును, ఆ మేని యందము ఆ భీతమృగతరళాక్షులు, ఆ కొప్పునం బూల

పరిమళంపు గుబాళింపు ఆ యందెల రవళి - ఇదెల్ల ఏ తరుణుని యుల్లమును ఊఁపదు ? మఱి యీ విభ్రమ మంతయు ఆపెకు సహజము గాని తెచ్చుకోలు గాదు. వసంతసేన విటుఁడు ఎంతయు నిత్యానుభవ రసికుఁడు అనును -

అపద్మా శ్రీ రేషా ప్రహరణ మనఙ్గస్య లలితమ్
కులస్త్రీణాం శోకో మదన వర వృక్షస్య కుసుమమ్
... ... ... ... ... V - 12

ఇదెల్ల యందపు వర్ణనయే ! అంతకన్న 'శకారుని విటుఁడు వసంతసేన చంపఁబడిన దని విని దుఃఖ మూర్ఛితుఁడై తెలివిపొంది ఆపెకై యేడ్చిన యేడ్పు పరికింపఁ దగినది - VIII - 38. వాఁడు పరాయివాఁడుగా ఆపెం దలఁచి చక్కఁగా ఎఱిఁగినవాఁడు -

'దాక్షిణ్యోదక వాహినీ విగలితా, యాతా స్వదేశం రతిః, హా హా లంకృత భూషణే', 'ఆభరణస్యాభరణం' -

అన్నట్లు ఇక లోకాన మన్మథుని దుకాణమును సొగసు మేలుముల సరకుల గిడ్డంగియు కొటారును మూయఁబడినవి అనును. వసంతసేన సౌభాగ్యము బోగమువారిదానిం బోనిది వట్టి సారాకైపు గలిగించు బజారుది కాదు. సీతా శకుంతలాది కులాంగనల దానికి సదృశమై పవిత్రమైనది. దేవతోపస్థాన యోగ్య కన్నుల మిఱుమిట్లు గొల్పు నీమె లేపు ననురాగము క్రమ పరిణామము పొంది హార్దమగు కూరిమిం గలిగించును. చారుదత్తుఁడు అనఁగానే జనులచిత్తమున అతని ప్రక్కన వసంతసేనయు పొలయును. ఆపె యందము, ఆపె నడువడిం దోఁచు మర్యాద సౌజన్యములు ఆభరణములై ఆపెను ఎంతయు వెలిగించును. వేశ్యతమచ్చను హద్దులను ఆపె మేలి గుణముల పళపళ సుతరాం తుడిచివేసినది. నిష్కాపట్యార్జవములు తన జాతిస్వభావమును బొత్తిగా అడఁచి వేసినవి. నిపుణుఁడు శకారవిటుఁడు శకారుని తిరస్కరించుటను గుణమునకు వలతునని చారుదత్తుం దాన దలఁచియుటం జూచి అనుభవించి ఎఱిఁగి అనును - "వేశ్యా మవేశ సదృశోపచారామ్" - "బోగముదయ్యు, బోగమువీథికిని ఇంటికిని తగని స్నేహము అనురాగము చూపు మర్యాద గౌరవాచరణలు గల దానిని" అని. పుట్టువు వేశమందైనను ఆపె ప్రకృతి వేశ్యావృత్తికి ఎంతయు విపరీతమైనది. ధనికులు తన వెంటఁబడిన కిరాతునికి కదళివలెను లేడివలెను బెదరి పఱచును. శకారు దర్శనమునకే ఏవగించుకొనును. పదివేలవరహాల హారము నైనను

అతనిది కొనదు. తిరస్కరించును. తన యమ్మకు 'మఱొకమారు ఇట్టి బేరము పంపిన ఇఁక నీకు నే నుండను, ప్రాణము వదలుదును' అని సందేశించును. ఇంత కన్న ఆపె స్వభావ పవిత్రతకు తార్కాణ వలయునా ?

వసంతసేన ఇంకను గంభీర భావములు గలది. రోహసేనుఁడు ఈమె మా యమ్మ కాదు, మాయమ్మకు సొమ్ము లున్నవా అని యనఁగా అతని పసి యుత్తాన హృదయతకు, దాన తన మనసునకు తగిలిన ధూతమ్మ దారిద్ర్య వేషమునకు చారుదత్త కుటుంబమున ఒక్క రాత్రిలోనే తానుం జేరిపోయినట్లు నిండు ఆత్మీయత గొన్న వసంతసేన ఎంతయు జాలివడి ఇఁకను తత్కుటుంబగతయైన తనకు తగిన వేష మిది యని నగలన్నియు ఊడ్చి, వానికే ఇచ్చి వాని పద్దు తీర్చి ఇదిగో నాయనా మీయమ్మ నైతి నని తన చిత్తమున ఆ తల్లితనమును భావించుకొని వానిం గౌఁగిలించుకొనును.

దేవుడిచ్చిన యీ సాధు బుద్ధిచేతనే తూఱి చూచినట్లు ఇతరుల యింగితము నెఱింగి, తాను నమ్మిన, తన్ను నమ్మిన - మదనికయొక్క పురుషానురాగముం గని పట్టి ఆపెకు దాసితనము ఊడ్చి స్వేచ్ఛ నొసంగుటకు తా నెప్పుడును తయ్యారు. కాని అందులకు ఇంటి పెద్దయైన తన యమ్మను ఒప్పింపవలయును. తాను ఆపాటి తన యమ్మకు పరాధీన. అమ్మకు వెలదబ్బు కావలెను. తాను ఉదారురాలు దయగలది. చేటికలను నిర్బంధింపదు - వేధింపదు. మఱి వారు తన కెంతయుం గూర్తురు. మదనికా శర్విలకులకు రహస్య గోష్ఠులు అనుమతించును. తాను పొంచి యుండదు. ఆ దినమైనను వారి మాటలు తన్నుం గూర్చినవిగా తోఁపఁగా అట్లు పొంచి విన్నది. శర్విలకుఁడు దొంగిలిన సువర్ణభాండము తన చేతికి రాఁగానే, దాని గుట్టు పేతైనను, అమ్మ తృప్తికి దానిని విష్క్రియధనముం జేయుదునులే అని ఆనిముసమున మదనికను శర్విలవధువుం జేసి తన బండి యెక్కించి కులాంగనం బోలె పంపివేసినది. తనకు సొంతాన చారుదత్త వధువు కావలయునన్న కోరిక యున్నందున, ఆ మార్గాన మదనికగన్న యీ విజయమునకు తాను సుంతయు అసూయ చెందక, దానిని తన విజయముగా తలంచుకొన్నది.

చారుదత్తుఁడు తన్ను తొలుత రదనిక యనుకొని 'అభ్యంతరం ప్రవిశ' అన్నందులకు 'అభ్యంతరముం బ్రవేశించునంత పుణ్యమా నాకు!' అనుకొన్నది. చారుదత్తుఁడును అమను 'లోపలికి పోవే అని నే నన్నను' దేవతం బోనిది తాను

కదలదాయె - 'న చలతి భాగ్యకృతాం దశాం అవేక్ష్య' అని. అతఁడు 'ప్రకాశ నారీ ధృత' మని సువర్ణభాండముం గూర్చియే 'అలం చతుఃశాల మిమం ప్రవేశ్య' (III - 7) అని యనును గదా. కావున తనకు తన భోగంపు మచ్చమీఁద అంత గిలియు దానిం దీర్చుకొన నంత యాస చిత్తాన మెరమెర లాడుచుండుటయు స్పష్టమే. కావుననే తన యౌవనమును మీఁదు (- ముడుపు) కట్టి తన కన్నెఱికమును చారుదత్తునికి అర్పించి ధన్య యైనది. 'కామః ఖలు నామ ఏష భగవాన్; తదను గృహీతో మహోత్సవ స్తరుణజనస్య.' అను చేటిమాటబడియు ఇదె తాను తొలి మాఱు కాముని కగ్గ మౌట అని సూచింపఁబడినది. 'సునిక్షిప్తం దారికాయా యౌవనమ్' అను వేశ్యామాత ప్రశంసయు ఇందులకే సూచన. వసంతసేనకు కుల వధూత్వ సంపాద నాభిలాషయు, ఇందులకే గమక మగును. నీ యభ్యంతర చతుః శాలం జొచ్చునంత పుణ్యమా నాకు' అను నిర్వేదోక్తియు 'నేను అభ్యంతర చతుః శాలం జొచ్చితి నహే!' (VI) అను చేటితోడి పరితోషోక్తియు దీనినే అను మానింపఁజేయును.

చారుదత్తుని మీఁది తన యనురాగము తన భోగము జాతికిని నీతికిని ఇనుము నకు పరుసవేదివలె సోఁకి తమాము కులాంగనతా సువర్ణ పరిణతిం గూర్చినది! చారుదత్తుని పక్కన వసంతసేనయు వసంతసేన పక్కన చారుదత్తుఁడును ఒండొరు లను లోకాన తమ కలరూపున ప్రకాశింపఁ జేసికొన్నారు. చందనకుని మాట 'య ద్యార్య చారుదత్తం వసన్తసేనాం వా న జానాపి తదా గగనే జ్యోత్స్నా సహితం చన్ద్రమపి త్వం న జానాసి!' అనియు, వాని పితూరి నాయకుఁడు, విలాసిశేఖరుఁడు శర్విలకుఁడును 'జ్యోత్స్నాఢ్యం శశినమివ' అనియు - వారి యన్యోన్య పరభాగతా పాదకతను ఉగ్గడించినారు.

మదన త్రయోదశి కామదేవాయతనోద్యానమున అనఁగా ఆ తిరునాళ్ళలో చారుదత్త వసంతసేనలు ఒండొరుల కన్నులు కలుపుకొని చూచుకొన్నారు కాఁబోలు. అంతకు ముందును ఊరిలో ఒండొరులు కారణాంతరములం బ్రసిద్ధులు ఒండొరులం గూర్చి వినియున్నారేమో. అట్టిదియు కుతూహల పూర్వకమగు ననురాగముం గలిగింపఁ బోలును - అట్టిదానికి ఈ నాటకాన సూచనలేదు. వసంతసేనయు చేటియు ఆ యుద్యానమున అనఁగా యాత్రలో - తిరునాళ్ళలో వారు చూచుకొనుటం గూర్చి ఒండొరులు ఎకరారు పడుదురు. చేటీ వసంతసేనల మాటలలో 'కిం న ఏవ, మే

నార్యా శరణాగ తాభ్యుపపన్నా,' అన్న మూదలింపు గలదు. మఱి శరణాగతి ఎందు లకో? తెలియలేదు. అప్పుడే అతనిపేరు ఉండుచోటు అడిగి వారిచే కనుఁగొనఁ బడినవి. ఈ శరణాగతి ఈ యుద్యాన మప్పటి-తిరునాళ్లనాఁటి-మాటలలోనిది. నిన్న శకారుఁడు తఱిమినప్పుడు ఆయింటఁ దూఱి వాని బారిం దప్పించుకొన్నదే అది కానట్లు గట్టిగా తోఁచును. 'యయా మే జనితః కామః-' I-53 అను చారుదత్తుని మాటయు దానికే రుజువు. ఈ యనురాగారంభ ప్రకారమును వివరములు ఉభయులు అతి గాంభీర్యము గలవా రగుటచే వారి మాటలలో ఇంతకన్నను బయటికి తెలియరాలేదు.

మఱి యది మొదలుకొని ప్రగాఢానురాగముగలదై వసంతసేనయు తన ప్రాగల్భ్యముచే చారుదత్తుని గబ్బితనమును జంకును ఉపాయములు పన్ని జయించును. ఆ కృష్ణప్రదోషమున ఒకపాటి యభిసారముం బ్రయత్నించినది. తనతో చేటుని పల్లవకుని చేటులను పరభృతికా మాధవికలను తోడుగొని బయలుదేరినది. పేరు చోటు విన్నందున అమ్మార్గాన బయలుదేరినది. చారుదత్తునియిల్లు సరిగా ఇక్కడ ఇది యని యెఱుఁగదు. విచారించి కనుఁగొనఁగల ననుకొన్నది. పాపము! శకారాదులు వెంటఁ బడినారు. చీకటి. ఈ పరుగు తఱుముటలలో తన పరిజనము తప్పి పోయినది. అందఱును చారుదత్తుని యింటి చెంతకు వచ్చినారు. అది యపరిచితమైనందున ఆ గందరగోళములో చీకటిలో వసంతసేనకు తెలియదు. శకారుఁడు చెప్పినాఁడు. ఈలంజె ఆచారుదత్తుని మీఁద మోజుపడినది, ఇదిగో ఎడమతట్టు వానియిల్లు అందులోనికి తప్పించుకొని పోవునేమో అట్లు పోనీకుము-అని. అది విని గ్రహించి, తన నగలు ఊడ్చి సొమ్ముల రవళి తెలియనీకయు, పూలుతీసి వేసి వాసన తెలియనీకయు 'వామతః' అన్నందున వాకిలికై, ఎడమతట్టు గోడ తడవుచుంబోయి దైవయోగమున తెఱవఁబడిన దిడ్డి వాకిటిగుండ లోనికిపోయినది. అట్లు ఈ పోకిరి మూఁకను తప్పించుకొన్నది; గంతవ్యమును చేరినది. అక్కడను బాగుగా దీపాలులేవు, ఒకపాటి చీకటియే. బయటి మూఁకలో విటుఁడు చారుదత్తుని మీఁది గౌరవాన ఇఁక వసంతసేన జోలి కూడదని, మఱిచేసిన రచ్చకు విదూషకుని మన్నింపు అడుగుకొని పోయినాఁడు. శకారుఁడు ఏమో బెదరింపులు పలికి పోయినాఁడు. నాఁడు ఉద్యాన మప్పటి అనఁగా తిరువాళ్ళయప్పటి శరణాగత రక్షణాదికమందు వసంతసేనకు అతని యందమును గొప్పతనమును అత్యౌదార్యమున దరిద్రుఁడగుటను మఱి వీడని పరువును ప్రతిష్ఠను లోకాన వినియున్న దానికి అతని కన్నులతో

కన్నులు కలసినవి, అందము జయంత కంతుల మీఱునది చిత్తమున హత్తినది, చక్షుఃప్రీతి కలిగినది. అనురాగ మంకురించినది. వాఁడు రాగవశుఁ డగునా అని సందియము. భంగము అవమానము కలుగునో అని జంకు. కావున ఎవరికిం జెప్పలేదు. అతనికిని కన్నులు తనిసినవిగాని అతఁడును ఎవరితోను ఏమియు బయటికి తటాలున చెప్పు వాఁడు కాఁడు, ఆపె మాత్రము అతిమాత్రపు మెలఁకువతో తన ప్రాగల్భ్యమెల్ల వినియోగించి ఆతని పరువుకు ఇంచుకయు దెబ్బతగులనీక అత్యంత భక్తితో, అతఁడు తన్ను ఎంతయు వలచునట్లు చేసికొనును. తన్ను చారుదత్తుఁడు రదనికగా అను కొన్నను అనుగ్రహమే అనుకొనును. ఉత్తరీయము విసరినను సంతసించి జాజి వాసనం జూచి ఆ గబ్బితనమున మంచి రసికతయు దాఁగియున్నదే, తన వలపు తీఱుటకు అవకాశముండునని యాసపడును. "అస్మాభి ర్బలాత్కారానునీయమానా - ఇతి యత్సత్యం అలజ్కృతాస్మ్యైతై రక్షరైః" అన్నమాట చారుదత్తుని చెవిలోపడి నందులకు దీన తన విజాయతి శీలము వలపు తదేకాంతత సర్వేతరద్వేషము, చారు దత్తుని మనసునం దగులును గదా అని సంతసించును. తనయింట జొచ్చిన సంవాహకుని వలన చారుదత్తునిపేరు విన్నందులకే సగౌరవముగా ఆసనమునుండి లేచును. (దాక్షిణాత్యుల యాచారము!) ఆ చారుదత్తుని యా పూర్వసేవకునికి ఉపకారము చేయఁగంటిని గదా అని అతనికి తన చేటికలచే తాలవృంతాది సేవలు చేయించి వాని జూదపుబాకి తాను తీర్చి పంపును. మరల తన సేవకునివలన వాని పరగుణగ్రహణ సాద్యస్కదానశీలమును విని సంతసించి, వాని యినాము జాజుల వాసన పంచెను ఆనవాలు పట్టి దానిని, తన నగ వానికిచ్చి, తాఁగొని కప్పుకొని తద జ్జస్ప ఎష్టస్ప ఎష్టికతో తనిపి, అప్పుడే ఆతఁడు ఆ వీధినే పోవుచున్నాఁడని విని తటా లున మిద్దె యెక్కి చూపుమేర దాఁటువరకు చూచుచుండును. అనంతరము ఆతని చిత్తరువు తాన వ్రాసికొని చూచుచు వినోదించుకొనును. ఇట్టివి యలంతులె. అయినను అవి ఆపెకు చారుదత్తునిపైగల యాభక్తి గౌరవానురాగములు చిత్తము నిండి తొనుకుటలని వానికి ఎంతయో విలువ. 'దరిద్రః ఖలు సః' అని చేటియనఁగా 'అత ఏవ కామ్యతే' అని, ఆ 'అతఏవ' అనుటను వివరించును. దాన తాను గణికా లోకాన అవచనీయ నగుదును - అని. మఱియు దొంగిలఁబడిన నగ జూదాన ఓడఁ బడినది అని సందేశము పలికిన శౌండీరతకు తాఁగామించిన దఁట. లోకము మానిసికి ధనముంబట్టి ధనముకొలఁది విలువకట్టును. వసంతసేనయో గుణముంబట్టి. ఆమె యనురాగము అగాధము, అప్రకంప్యము.

ఇదెల్ల తన జాతికే అసాధారణము కాఁగా - దీనినెల్ల తాను మనసుననే దాఁచు కొనును, మురియును. కాని దానింగూర్చి తన నమ్మిన చేటికలతో నైనను మాట లాడదు. మీరు నవ్వుదురేమో - మీకు ఎందులకు చెప్పుట - 'సఖీజనాత్ ఉపహాసనీయ తాం రక్షామి.' అనును. ఆమెకు తాను ఏమి చెప్పిన ఏమి చేసిన చారుదత్తుని యభి మానమునకు వెలితి ఏమియు తోఁపనీయక దానిని నిలుపుచు పెంచుచు ఉండునో, దానిని మాత్రమే చెప్పును చేయును, తాను నిజకుబేరసంపద్గర్వితకాక అతని వలన తానే ఏమేమో పొందినట్లు తాను అనుకొనుచున్నట్లు అతనికి తోఁపింపవలయును. అందులకే నగను ఇల్లడ పెట్టినది. అది చోరితముకాఁగా దానికి బదులు తాను చారు దత్తుని వలన రత్నావళిని నిరభ్యంతరముగా స్వీకరించినది. అట్టిసొమ్ము తనకు ఇచ్చిన వాఁడనని న్యాసమునకు దానిని మించినదానిని ఇచ్చి పరువు నిలువుకొంటినని చారు దత్తుఁడు చిత్తాన మురియుచుండునను నమ్మకాననే తాను ధీరముగా ఆ ప్రదోషముననే వానలో అభిసరణము చేసినది. అంతట చారుదత్తుని పరిగ్రహఫలమును సత్ సురతోత్సవానంద ఫలమును పొందినది.

అట్లు చారుదత్తుని మనసున కెక్కవలయును. చారుదత్తుని చిత్తమును ఆక్రమింపవలయును. అది తన జీవితాన తనకు ఏకమోక్షము - అను కోరిక వసంత సేనకు తీఱినది. 'చేటి, కిం ప్రవిష్టాహం ఇహాభ్యన్తర చతుః శాలకమ్!' 'ఏమే, నేను ఇక్కడ లోపలి చతుఃశాలలో ప్రవేశించితినటే!' 'న కేవల మభ్యన్తర చతుః శాలకమ్, సర్వ పరిజనస్యాపి హృదయమ్' 'అందే కాదు, మాయెల్లర యుల్లము నను పదము గొన్నావు!' అను మాటలు విన్నది. ధూతకును తాను దాసినని తెలిపి, రత్నాల హారము ఆమెవలనను తానే ఉంచుకొనఁ దగునను మాట పొందినది. ఈ జీవితాన తనకు మనసున ఎంత సంతోషము, ఎంత దిటవు, ఎంత ధైర్యము కలిగినవి! దాన ఎన్నియో ఆసలు పెంచుకొన్నది. మఱి యంతట ప్రవహణ విపర్యయమున ఒంటరిగా శకారునికి చిక్కినది. దైవదుర్యోగము! వాఁడు తన పాదాలలో పడుదునన్నాఁడు. ఉత్తమోటుగాఁడు. ఆ దెప్పరమున ఏదేని భోగము జిత్తున, తన పాతివ్రత్యమునకు సేగిలేకయే, అప్పటికి వానిం దప్పించుకొనియుండ వచ్చునేమో. మఱి సహకారపాదప మాధవినై పోయితిని, ఇఁక నేమి యనునా తన దిటవున ధైర్యమున పరువున వానిని ఛీ పొమ్మని కాల దన్నినది. మెడ వాని పిడికిట చిక్కినది. 'నేను వసంతసేనను వావిచ్చి యేడ్తునా?' అని కిమా కుమా అనక చారుదత్తనామ స్మరణతో ప్రాణము విడిచినది.

ఉన్నారు నాటకాలలో కావ్యాలలో పతివ్రతలు, సీతా శకుంతలా దమయంత్యాదులు, మనము కేల్మోడ్చవలసినవారు, ఎంతలేసి కష్టములనో ఓపికతో ఎదుర్కొన్నవారు మఱి యిట్లు ధగధగని తెంపుతో కంఠమోటనపు చావునే ఎదుర్కొన్నవారు ఏరీ!

సంస్థానక శకారుఁడు :—

సంస్థానక శకారుం బోలిన నరుఁడు మానవజాతిలో అరుదు. వానిం బోలిన పాత్ర నాటక ప్రపంచమున అరుదు. భాసుఁడు దరిద్ర చారుదత్తమున వానిం బుట్టించినాఁడు. మృచ్ఛకటిక కవి ఆమార్గమున ఇంకను వానిని వంకలొత్తి నిపుణముగా తీర్చినాఁడు. వాఁడు స్వభావ హింస్రుఁడు నృశంసుఁడు నరపశువు. వానికి మనసు వంకర; వానినుండి రోఁత నిండి కాఱుచుండును. వాని మూర్ఖతకు సాటి వాని నక్కటక్కరితనమే. వాని వలపు, బెదరింపు. వాని యనుగ్రహము, చంపనులే అనుట. దుర్బోధమును బీభత్సము నగు విరుద్ధగుణముల రాశి శకారుఁడు.

అసాధారణ విపరీత భాషితము, తిండిపోతు తనము, రోఁతపుట్టించు కామోద్రేకము ప్రాణిహింసన పరితోషము - ఇవి యీశకారుని ముఖ్య లక్షణములు.

వాని భాషితపు తరహా వానిదే, అందు శకారముల పెల్లిదముం బట్టి వానికి శకారుఁ డనియే పేరుపెట్టఁబడినది. మాటలు పునరుక్తిమయము. వానికి కేశ అన్న చాలదు, 'వాల' 'శిరోరుహ' అనియు చేర్పవలయును. తన్ను వరపురుష మనుష్య వాసుదేవుఁ డని నిర్దేశించుకొనును. వసంతసేనకు దశనామ స్తోత్రమును రచించినాఁడు. ఉత్త పేరులో ఏమున్నది అని యనుకొన్నవాఁడు కాఁడు పేరుల యావృత్తి చేతనే తాను ఎంతో భావము తెలిపి ఏమో సాధింపఁగల నని యతని మతము. ఎదిరిమాటను అర్థము చేసికొనుటయందు ఎంత తెలివితక్కువ నేర్పునైనను ప్రకటించును. వసంతసేన 'ఆ పాడుమాట తన చెవిం బడకూడదు' అని 'శాంతమ్'అని చెవులు మూసికొనఁగా వాఁడు దానికి 'శ్రాంత' అని అర్థము చేసికొని, తదాభిముఖ్యమును ఆశంకించును. శ్రమణకుఁడు తన్ను ఉపాసకుఁడు ధన్యుఁడు పుణ్యుఁడు అనఁగా వానికి నాపితుఁడనియు, సాలెయనియు కుమ్మరి యనియు ఇంకను ఏమో అపార్థము చేసికొని వానిం గొట్టును. సమయాన సరిగానే అర్థము చేసికొని, వసంతసేన పరభృతిక పల్లవక అని తన నౌకరులను సాయమునకు పిలువఁగా, పిలుచుకో, వసంతమాసమునంతటినే పిలుచుకో అని విజృంభించును. భూతవైద్యునికిం

బోలె పేరులతోనే పిశాచములను వసబఱుచుకొందు నన్నట్టి యావేశము కలదు. శకారునికి తన పునరుక్తులలో. మఱి యది శ్రోతలకు హాస్య జనకమును ఉద్వేజకమును. ఉపమానములకు పురాణములందలి పురుషులను స్త్రీలను ఎంతయు అనను రూపముగా అసంబద్ధముగా తన భాషితములం గూర్చును. అన్నింటికిని ఒక్కటే ప్రయోజనము - వసంతసేనను బలాత్కారముగా పట్టుకొనుటయు ఎత్తుకొని పోవుటయు మఱి యేమో చేయుటయు. బడాయికి పురాణములను విన్నాఁడు. మఱి ఏమియు ధరింపలేదు.

శకారుని తిండిపోతు తనమున రుచుల విశేషములను జుఱ్ఱుటలు, లొట్టలును చప్పరింతలును త్రేన్పులును కలవు. పలుచవుల యనుభవముం జెప్పును. పాటకు గొంతు చికిలీచేసికొనం దగిన గంధద్రవ్యములయు నేతియు ఎఱచియు యోగము లెఱుఁగును - చేయించుకొని తినును. చారుదత్తునికి వధ దండన విధింపించిన తన పగ తీర్పుకు ఇంటిలో పెను పండువు చేసికొనును - మేలి శాలి ఎఱచి చేఁపలు ఇంకను ఏమేమో. మిక్కుటముగా మెక్కి చారుదత్తుని వధ యాత్రం జూడఁ బోవును.

శకారునికి తిండి తృష్ణ యెంతో స్త్రీ తృష్ణయు అంత యతిమాత్రము. కావున అట్లు వెఱ్ఱి యెత్తి వసంతసేన వెంటఁబడును. వశీకరణమునకు వాఁడు నేఁటి నాగరకుల యుక్తిని సయితము అవలంబించును. వసంతసేనకు పదివేల మొహరీల వెల గల నగను తన బండిని ఇంటికి పంపును. కాని అతఁడు మెచ్చిన యుపాయము వీడక వెంటఁ బడుటయే. తా వలచిన దానిని చుట్టు ముట్టి కత్తియు జళిపించి బెదరించుట బతిమాలుకొనుటకన్న కార్యకరము, అన్యోపాయము లేదని యతని తలంపు. నాట్యమాడును పాదములం ద్రెళ్లను కోరికం దీర్పవే అని బతిమాలును కాని, ఈ యభినయమునను తన మగ బలమును చంపు శక్తిని మఱవఁడు. అతని బతిమాలుటయు భయంకరమే - అనును వసంతసేన 'కథం! అస్య అనునయోపి భయముత్పాదయతి' అని. కట్టకడపట తన నేరము ఋజువై తాను చావు తప్పించుకొన చారుదత్త శరణాగతుఁడై, వసంతసేన సిఫారసు నడుగునప్పుడును 'ఇఁక నిన్ను మరల చంపనే!' అని కదా అనును.

కాని స్వభావముం బట్టి శకారుఁడు నిజముగా నీచపు పిఱికి పంద. తా రాజశ్యాలుఁడని మాటలలో ఎంతేని పొగరుపోతు బడాయికోరు. ఆడుదానిని బెదరించును. శ్రమణకుని మైత్రేయుని సన్యాసిని బాపనయ్యను వేధించును. మఱి పురుషమాత్రునికి

భయపడును. అట్టిదే లోకాన ఖలుల తెఱఁగు. శకారుఁడు కాక మఱెవఁడు 'తత్ పశ్య ప్రథమం రాష్ట్రియశ్యాల సంస్థానస్య శూరత్వమ్!' అని వసంతసేన పీనుఁగును విటునికిం జూపి సంతోషించును.

శకారునికి హింసనప్రవణత యెక్కువో, పశుకామమే యెక్కువో, ఇతరుల సుఖమును నాశము చేయుట యెక్కువో, ఇతరుల బాధను, విశేషముగా శత్రువుది - గిజగిజలాడుటో కత్తితోనో అంపముతోనో నిలువున చీల్పఁబడుటో, తానే సొంతముగా మెడ నులుమఁగా వసంతసేనవలె ఊపిరాడక తనుకులాడుటో - ఇట్టిది యేది చూచుట యెక్కువ ప్రియమో అతని స్వభావక్రూరచిత్తమునకు నిర్ణయింపరాదు. (వసంతసేనయు సమయాన మ్రొక్కవచ్చిన యాతని తలను కాలఁదన్ని యాతని కోపము రగిల్పినదే యగుఁగాక.) తన బండిని విఱిఁగిపడిన ప్రాకారపు గోడ మీఁదుగా పుష్పకరండకములోనికి తెమ్మని. అట్లు చేసిన ఎడ్లు చచ్చును, బండి విఱుగును, నేనును చత్తునే, అని స్థావరకుఁడు అనఁగా - చావనీ, కొత్తయెడ్లు కొత్తబండి కొత్త చేటుఁడు వత్తురు. నాకేమి - అని ఆచావులు విఱుగుటలు చూడ నాసపడినాఁడు. వధ్యస్థానమునకు పోయి అక్కడ చారుదత్తుని బిడ్డను రోహసేనుని చండాలురతో నాయనను విడిచి నన్ను చంపుఁడు అని జాలిపలుకులు పలుకుచున్న వానిని చూచి, చారుదత్తుఁడు వానిని సముదాయింపనగుచున్న విలంబమునుం జూచి శకారుఁడు చండాలురతో అబ్బాయితో కూడనే చంపుడు చారుదత్తుని యన్నాఁడు. కత్తి దెబ్బకు పిల్లవాఁడు ఎట్లు చేష్టించునో చారుదత్తుఁడు ఎట్లు చేష్టించునో చూడఁ గోరినాఁడు. వసంతసేనను చంపి, అప్పుడు మరలివచ్చిన విటుని, రా చెఱువులో ఈదులాడుదము అని పిలిచినాఁడు. వాని క్రౌర్యమునకు మితిగాని సాటువగాని యున్నదా? హృదయమే లేదు - వట్టిబండ, ఉక్కు! ఈ క్రౌర్యముననే వానికి ఎంత జిత్తులమారితనము! చారుదత్తుని మీఁద ఫిర్యాదును ఎంత నేర్పుగా బనాయించినాఁడు! వానిం గావ చేటుఁడు మేఁడ మీఁదినుండి దూఁకి నిజమును శకారహత్యా కృత్యమును ఉద్ఘోషింపఁగా దానిని ఎన్ని జిత్తులతోనో మాపి చేటుని అవలికిఁ గొంపోయినాఁడు! వసంతసేనం జంపినప్పుడు విట చేటుల నందుండి పంపివేయ తన నక్కతనమును చాల నేర్పుగా ప్రకటించినాఁడు. వారిని సాక్ష్యమునకు రానీక ఒకనిని తన మిద్దెమీఁద సంకెలలుపెట్టి కట్టి యుంచినాఁడు, మఱియొకనిని 'నీవుకదరా చంపినది?' అని తన రాజశ్యాలతతో వధను వానిమీఁద పెట్టుదునని బెదరించి యిటు రానీక తఱిమి

నాఁడు. ఒక్క దెబ్బన ఎన్ని వధలకు దారితీసినాఁడు, శకారుఁడో దయ్యమో! చిత్తమునకు సంస్కారము లవలేశముకూడ లేని రాక్షసుఁడు! ఇట్లు చెప్పినాఁడు. వానితో పీడక మెలఁగినవాని విటుఁడు.

అహో మూర్ఖతా!
విపర్యస్త మనశ్చేష్టైః శిలాశకల వర్ష్మభిః
మాంసవృక్షైరియం మూర్ఖైర్భారాక్రాన్తా వసుంధరా. VIII - 6

మఱి వాని పిఱికితనముననే చావుకు భయపడి చారుదత్తు శరణుజొచ్చి 'పొసఁగ మేలుచేసి పొమ్మనుటే చావు' అన్న చావుం బొందినాఁడు.

మైత్రేయుఁడు -

కాళిదాసు విదూషకుఁడు రాచనగరివాఁడు. అట్లే శ్రీహర్షుని విదూషకుఁడును. శాకుంతల విక్రమోర్వశీయ మాళవికలు మూఁటిలోను విదూషకుఁ డున్నాడు. నాగానంద రత్నావళీ ప్రియదర్శికలు మూఁటిలోను ఉన్నాఁడు, విదూషకుఁడు. వారు నాయకులకు కామ సాహాయ్యము నేర్పుగానే చేయుదురు. అందఱియందును తిండిపోఁతుతనమును సంధ్యావందనమేని రాని బ్రాహ్మణాచార శూన్యతయు పిఱికితనమును రాణివాసములో చొరవయు చెప్పఁబడినవి. వీరందఱును ఇంచుమించుగా ఒకమూసలో కరఁగి పోయఁబడిన వారుగా అగపడుదురు. మైత్రేయుఁడు వారికంటె వేఱుతీరువాఁడు. అందులకు కొంత కారణము చారుదత్తుఁడు వేఱుతీరువాఁ డగుటయు, వాని కథ వేఱుతీరు దగుటయు.

మైత్రేయుఁడు చారుదత్తుని సర్వకాలమిత్రము, బుద్ధియం దున్నట్లే దారిద్ర్యమందును చారుదత్తుని పీడక కూటికి ఎక్కడ తిరిగినను సాయంకాలమునకు అతని పంచకు వచ్చును.

మైత్రేయుని యాకారముననే కొంత నవ్వుతోఁచు కురూపము. శకారుఁడు అతనిని కాకికాళ్ల తలవాఁడా అనును. తానే తన తల ఒంటెపిల్ల మోకాలివంటిది అనును. చదువు సంధ్యలు కల వాఁడుకాఁడు గాని వేదాలయు, యజ్ఞాదులయు వాసనకలవాఁడే. వానినుండి ఉపమానములం గొనును. రేభిలుని పాటను చారుదత్తుఁడు ఎంతో మెచ్చుకొన్నదానిని ఒక ముసలి పురోహితుని వేదపఠనపు గొణుగువలె నున్నదని నవ్వును. స్త్రీ సంస్కృతము నేర్చుకొనుట కొత్త ముక్కుత్రాఁడు వెట్టిన పెయ్య నసకొట్టుటం బోలె, అట్లు అది ఆపాటియే, తనకు నవ్వు కలిగించినది అనును.

రావణుఁడు తపస్సు చేసి పుష్పకముం బొంది అందెక్కి ప్రపంచము నంతటిని స్వర్గాదులను తిరిగి చూచినాఁడఁట, అని తాను అదేదియు లేకయే వసంతసేన బంగళాలో తిరుగుచు లోకాలన్నియు స్వర్గముతోకూడ చూచినట్లైతినే అని బాలునివలె అబ్బురపడును.

మైత్రేయుఁడు తిండిపోతే, మఱి సూత్రధారుని నిమంత్రణమును లక్ష్యపెట్టి అంగీకరింపఁడు. మునుపు చారుదత్తుని బుద్ధికాలమున తాను తనచుట్టు గిన్నెలలో నానా భక్ష్యాలును పెట్టఁబడగా వానిని విలాసముగా తినుచు తూఁగుచు ఉంటినే అని తలపోసికొనుచు కొంత జాలిగొలుపును. వసంతసేన వంటయింటిని చూచి అక్కడ నుండి తన ముక్కునకుం గొట్టిన నానావిధముల కమ్మని వాసనలకు నోరూరి అది స్వర్గమే అనుకొని తన్ను భోజనానికి అక్కడ కూర్చుండు మనఁ గూడదా యని యువ్విళులూరును భగ్నమనోరథుఁ డగును. దానికి వసంతసేన మీఁద వాని మనసులో కోపము అతృప్తి కలుగును. దానిని తంటాగా చారుదత్తునితో చెప్పి అతనికి దానిజోలి పెట్టుకొనకు అని హితవు చెప్పును.

మైత్రేయుఁడు వట్టి పిఱికి. తనయింట కుక్కయు పరాక్రమించును అన్నట్లు చారుదత్తుని వాకిట విట చేట శకారాదులు రచ్చచేయుచు రదనికను జుట్టుపట్టిలాగు పోకిరితనము చేయఁగా తాను వారిని ఏమో చేయఁగల యట్లు కేకలు వేయును. శకారుం గూడ బెదరింపఁ బోవును కాని వాఁడు కూర్చుండుమన్నను నిలుచుండు మన్నను ఏడువుమన్నను నవ్వుమన్నను మనసున జంకుచునే పెంకె బదులు చెప్పును. వీథిలోనికి తోడు వెలుతురు లేక తాను పోను అనును. వసంతసేనకు తోడు పోవయ్యా అనఁగా ససేమిరా యనును. వీధిలో నాపై కుక్కలు పడును, రాత్రులు తిరుగాడు సొంటుగాయలు నన్ను పట్టుకొందురు అనును.

మైత్రేయుఁడు తెలివిలేని మూఢుఁడు. మఱి చారుదత్తుని యాసరావలని పొగరునుం గలవాఁడు. వసంతసేనచేటుని ప్రశ్నలకు, సులువుగా జవాబు చెప్పఁ దగిన వానికే, తనకు జవాబు తోఁపక మిణకరించి చారుదత్తు నడిగి ఎఱిఁగి చెప్పును. వసంతము సేన అన్న మాటలను చేర్పవయ్య అనఁగ అదియు చేయలేక తప్పుగా చేయును. మెఱుమునకు ఉలికినట్లు వసంతసేన చారుదత్తుం గౌగలించుకొనఁగా, మెఱసి యీ యమ్మను బెదరింతువా అని మైత్రేయుఁడు మ్రబ్బును తిట్టును. చారు దత్తుఁడు బంగరునగల న్యాసమును రాత్రుల నీవు కాపాడుము అనఁగా దానిని చేతఁ

గొనును గాని నాటినుండియు అది తనకు నిద్రాభంగ కారణమని ఎవఁడేని దొంగ దొంగిలించుకొని పోరాదా అనియే యనుకొనుచుండును. అది యొకపాటి మిత్ర నిరాదరణము అధర్మ ప్రావణ్యమును అగును కాని అది యాతని తెలివితక్కువచే కలిగినదే. ఎప్పుడును అదే తలంపు కాఁగా అదియే కలగనును. ఆనగలను శర్విలకుఁడు దొంగ కొనిపోవునట్లు కలలో తానే అతనిచేత పెట్టును. అధికరణమున ఎంతయు కూడని చోటను సమయమునకు ఒకపాటి దైవికముగను దానిని సంకనుండి క్రిందఁ బడవైచి దాన చారుదత్తుని ప్రాణము మీఁదికి వధ దండనం దెచ్చును. సర్వము అవివేక విలాసము.

మైత్రేయుని నోట ఎత్తి పొడుపు తప్పుపట్టుట తప్ప వేఱు మాటలు రావు. చారుదత్తుఁడు ఎంతో గొప్పవాఁడు పేదవడిన మాత్రకు వాని యింటిమీఁద గల్బా చేయుదురా అని అఱచును. విటుఁడు తన్ను చారుదత్తునితో చెప్పకు అని పాదాల వ్రాలి బతిమాలుకొనఁగా వానిని సత్పురుష అని గౌరవించి సరేలే అనును. మఱి వసంతసేన సోదరుం జూచి ఆ పట్టు ఉడుపులను ఆ నగలనుచూచి వల్లకాటి పూచిన చంపకము అనును, వసంతసేన యమ్మను మిక్కిలి లావుగా ఆసనమునం గూర్చుండఁ బెట్టఁబడినదానిని చూచి, అబ్బ! ఎంతలావు! డాకినియా! అనును. ఈమెను లోపల ఉంచి తరువాత గదికి వాకిలి పెట్టినారు కాఁబోలు, లేకున్న ఏవాఁకిటఁ బట్టును ఆ కళేబరము అనును. చచ్చునేని, అది వేయి నక్కల మేఁత యగును అనును. ఆయింట సంపదకు అబ్బురపడి ఓడలవ్యాపారమా అని యడిగి, కాదు అనఁగా - మీ కెందులకు ఆ యోడల వ్యాపారము? మీ చన్నులు పిఱ్ఱలు మొలలు ఓడలే కదా, మదన సముద్రాన ప్రేమ నిర్మలంపు నీళ్లలో పయనములు గావించునవి! - అని అది భోగమువృత్తి వలని భాగ్యమనును. భోగముది తగులుకొన్న అది చెప్పులోని రాయివలె తొలఁగింపరాక ఎంతయు వేధించును - నీవు వారి జోలి పెట్టుకొనకు అని చారుదత్తునికి హితవు చెప్పును. వసంతసేనకు మితిలేని డబ్బుమీఁదియాస అనును. అభిసరించి వచ్చిన వసంతసేనను వెకలిమాటగా - 'మీరేమి ఈ రాత్రి ఇక్కడనే నిలుతురా? పిచానా వేయుదురా?' అనును.

ఎన్ని వచ్చినను మైత్రేయునియందు ఒక్క మేలి గుణము, చారుదత్తుని మీఁది వీడని హార్దమగు స్నేహ పక్షపాతము. సంపన్న దశయందుం బోలెనే ఈ దారిద్ర్యమునను అతనిం గాచుకొనియే యుండును. వీధిలో భయమని వసంతసేనకు

తోడు పోఁజాల ననెను గాని రత్నావళిని ఇచ్చి రమ్మన్నను, మృచ్ఛకటిలో రోహ సేనునికి వసంతసేన పెట్టియిచ్చిన నగలను మరల వసంతసేనకు ఇచ్చి రమ్మన్నను తాను కుదురుగా పోవును. నగలం గొంపోవుచుండగా చారుదత్తుఁడు అధికరణ మునకుం బిలువఁబడినాఁడని విని ఏలొకో అని భయమంది అటుపోక అధికరణమునకుం బోవును. అధికరణమున చారుదత్తుని మీఁద శకారు ఫిర్యాదు విని అధికరణికునితో చారుదత్తుని తట్టుగా ఏ బ్యారిస్టరును చెప్పలేనంత ప్రతివాదమును ఉపన్యసించును. 'ఓహో, అర్యులారా, పురములు స్థాపించి విహారములు ఆరామములు దేవాలయ ములు తటాకములు కూపములు యజ్ఞ యూపములు-ఇన్నింటితో ఉజ్జయినీ నగరమును అలంకరించినవాఁడు పాడు డబ్బు సద్దికూఁటి కోసము ఇట్టి యకార్యము చేయునా? ఓరోరి లంజాకొడుకా, రాజశ్యాల సంస్థానకా, నోటికి అడ్డములేని వాఁడా జనులకు దోషము చేయువాఁడా భండా ఒంటినిండ బంగరు వేసుకొన్న కోఁతీ, చెప్పరా నా యెదురుగా. నాప్రియవయస్యుఁడు పూచిన మాధవిని దాని చిగురు నలుగునో అని, పూలుకోయ వంపలేనివాఁడు ఇహపరములకు కాని యిట్టి పనిని ఎటువలె చేయును? ఉండ్రా లంజాకొడుకా ఉండు. ఇగిగో నాచేతి కఱ్ఱతో నీ హృదయమువలె వంకరగా నున్న దానితో నీతల పగులఁ గొట్టెదను' అని ఒళ్లుతెలియక కచ్చేరి సముదాచారముం జూడక కొట్లాడెను. అట్టి స్నేహపరవశుఁడు. చారుదత్తుని వధ్యస్థానమునకు కొనిపోఁగా ఆ నాయనను కడచూపు చూచుటకు కొడుకును తీసికొని అగుంపులో త్రోయుచు త్రోపుడు వడుచుం బోయి చారుదత్తునికిం జూపి అజాలి సమాగమము ననంతరము శకారిగాఁడు పిల్లవానిం గూడ నాయనతోఁ గూడ నఱికివేయుఁడురా అని చండాలురతో అనఁగా, చారుదత్తుఁడు, రాజశ్యాలుని యామాటయు జరుపుదురో అని దిగులుపడి పిల్లవానిని తల్లికడకుం గొంపొమ్మని తనతో చెప్పఁగా, నీవుపోయిన నేను ఉందునను కొంటివా, మిత్రమా వేరుతెగిన చెట్టు ఉండదు అని బాలుని తల్లికిం జేర్చి తాను చారుదత్తునితో ప్రాణము వదలుదును అని పోవును. అటుపోఁగా అక్కడ ధూతాదేవి చారుదత్తుని యశ్రోతవ్యమును వినకముందే తాను అగ్నిం బడుదును అని జ్వాలా కరాళముగా మండుచున్న నిప్పులో దూఁకఁబోవు చుండఁగా, అమ్మా, ఏపనికిని బ్రాహ్మణ పురస్కారము వలయును, నిలు నన్ను బ్రాహ్మణుని పురస్కరించుకొని ఆపని చేయఁ దగును. నీకుముందు నేను దూకెదనని సంభ్రమ పడెను. అట్టి మిత్ర కుటుంబ పరాధీనుఁడు మైత్రేయుఁడు, వానిం బోలినవాఁడు మఱి ఎందును ఉండఁడు.

చారుదత్తుఁడును ఆ యాపదలో మొదటి స్మరణగా మైత్రేయుని స్మరించును. 'మైత్రేయ, భోః, కిమిద మద్య మమోపఘాతః' అని. తరువాత బ్రాహ్మణిని భార్యం దలంచుకొనును. 'హా! బ్రాహ్మణీ . ' అని. నిజముగా మైత్రేయుఁడు చారుదత్తుని సర్వకాలమిత్రము!

ధూతాదేవి :—

ధూతాదేవి పతివ్రతల మేలుబంతి. సంపదలో ఎట్లో దారిద్ర్యమున అంత కన్నను పతిశుశ్రూషా పరాయణ, తన నగలన్నియు ఖర్చుపెట్టినది. ఒట్టి ఒళ్లు! పత్యైకదేవత! ఇంటికి దొంగ కన్నమువేసి పోయినాఁడని రదనిక అనఁగానే ఆమె మొదటి తలంపు ఆర్యపుత్రునికి ఏమి దెబ్బ గాయము తగులలేదు గదటే అని. 'ఏమియు లేదమ్మా, ఆయిల్లడ నగ ఎత్తుకొనిపోయినాఁడు అంతే' - అని యనఁగా, 'అదేమే ఏమీ తగులలే దంటివే, ఒంటికి తగులుటకన్న ఇది చారిత్రమునకు దెబ్బ కదటే!' అని 'ఎట్లు లోకులు ఏమనుకొందురు, ఆర్యపుత్రుఁడు మ్రింగినాఁ డనుకో రఁటే! దానికి బదులు ఈ నా రత్నాలహారమును ఇచ్చివేయుదును. కాని ఆర్య పుత్రుఁడు నాది తీసికొనఁడే ఎట్లబ్బా' - అని మైత్రేయుం బిలిపించి దానిని అతనికి తన రత్న షష్ఠి యుపవాసమునకు బ్రాహ్మణ దానమని చెప్పి ఇచ్చివేయును. వసంత సేన చారుదత్తు నభిసరించి వచ్చి, ఆనాఁడు రాత్రి యింట నిలువఁగా తాను ఎంతో సంతోషించును. ఈసు చెందక చెల్లెలి ప్రీతిని ఉంచును. రత్నావళిని వసంతసేన తాను చారుదత్త గుణనిర్జిత దాసిని, అది తనకు వలదు ఇచ్చివేయుదును తీసికొమ్మ నఁగా తీసికొనదు - అది ఆజనమునకు చారుదత్తుఁడు ఇచ్చివేసినది - అని. తనకు నగలు వలదు, చారుదత్తుఁడే తన భూషణము అని పాతివ్రత్యానుష్ఠానమును ఇతరులకుం గలుపునట్లు అనును.

ధూత ఏమో ఉదాసీనవలె తోఁచుట నిజముగా ఔదాసీన్యము గాదు, అత్యంత మనస్విని యగుటతో కూడుకొన్న గర్వితనము, చారుదత్తునికిం దగినది. వానినే పోలినట్టి సాధ్వి. అంతే. చారుదత్తునికైన యామె ప్రీత్యనురాగ గౌరవములు మేరలేనివి. చారుదత్తుఁడు కొర్తిం బడఁబోవుచు రోహసేనుని ఇఁకను నీవు అమ్మతో ఆశ్రమమునకుం బొమ్ము అనఁగా అట అమ్మ నాయనకన్న ముందు నిప్పులో దూక సమకట్టఁగా ఆతఁడు కొంగు పట్టుకొని వీడకున్నను, అతనిని మైత్రేయుం బట్టు కొమ్మని తాను తన యిష్టముం జేయుదునని సంభ్రమించును, చారుదత్తుఁడు వచ్చి

కలసికొని తానుండఁగానే ఇదేమి సాహసము, సూర్యుఁడు అస్తమించినంగదా పద్మిని కన్నులు మూసికొనుట అనఁగా, కావుననే అవి యచేతనము - నాకు 'మానా' లక్ష్యభూతము గాదు. అనును. బ్రతికి లేచివచ్చి చారుదత్తుం బ్రదికించిన వసంతసేనం జూచి 'దిష్ట్యా। కుశలినీ భగినికా।' అని గాఢాలింగనము గావించుకొనును. ఎందరు లేరు పతివ్రతలు లోకాన, ఐనను ధూత ఒక యసాధారణమైనది, సాటిలేనిది, చారుదత్తునికి తగినది.

రోహసేనుఁడు :—

బాలుఁడు రోహసేనుఁడు చారుదత్తునికి అత్యంత ప్రేమభూమి, చారుదత్తుఁడు వానితోనే ప్రొద్దు పుచ్చును. వాఁడు చల్లగాలికి బయట పండుకొని నిద్రపోఁగా, ఆ వసంతర్తు ప్రదోషమున మంచుతోడి గాలివలన చలియెత్తునని వానిం దన ప్రావారకమున కప్పి లోపలికిఁ గొంపొమ్మనును. వాఁడు అన్నెము పున్నెము ఎఱుఁగని నోరెఱుఁగని కందు, మేని నిండ నగలు దాల్చియున్న తల్లి ధూత పేదఱికమున క్రమముగా నగలం గోలుపోవుట తల్లి యొడికెక్కు బాలుఁడు చూచుచు దాని కథలు వినుచుండినాఁడేమో తెలియదుయే వానితోను తమ్ముపై కొనుమన్న పేదఱికంపు బ్రస్తావములు వచ్చుచుండఁగా అది వాని చిత్తానను నాటుకొన్నది. వాఁడు 'మాయమ్మకు ఇప్పుడు నగలులేవు' అని యనుచు నుండును కాఁబోలు. కాక పేదఱికము పైకొన్న తరువాతనే వాఁడు పుట్టినాఁడో! నగలతో ధూతను చూచి యెఱుఁగఁడు. అట్టి వానిని ముద్దాడ వసంత యెత్తుకొనఁగా, రదనిక యీమె మీ యమ్మరా యన్నది. వాఁడు ఒంటినిండ నగలున్న యీమె మాయమ్మకాదు అనెను. ఆ మాటకు వసంతసేన యుల్లమున ఝల్లున కళుక్కుమని, ఆ యింటిం బైకొన్న పేదఱికము స్మారితమై వానిమీఁద జాలినిండి కంట నశ్రువు తేఱఁగా అప్పుడే తన నగల నన్నిటిని ఊడ్చి, 'రారా నాయనా, ఇదిగో మీయమ్మనైతిని చూడు' అని కంట వొఱెక్కిన యశ్రువుల బ్రిమింగుచు మాతృప్రేమ నిండఁ, బలికి, వానిని ఒడిలో నుంచుకొన్నది. ఆ నగలనే ఆ మట్టియాటబండిలో నించి వానికి ఇచ్చి, 'నాయనా దీనితో బంగారు బండి చేయించుమురా రదనిక నీకు' అని బుజ్జవించినది. అట్లే వధ్యస్థానమున చండాలురకు పట్టువడియున్న నాయనను మైత్రేయుఁడు అతనికిం జూపఁగా, అతఁడు ముద్దుకాఱు, దుఃఖముపేర, ఓరి చండాలురూ, మా నాయనను విడువుఁడురా నన్ను చంపుఁడురా అనును, నిప్పు మంటలో దూఁకఁబోవు నమ్మ కొంగు పట్టుకొని ప్రేమపారవశ్యమున నేనును కూడవత్తునని వీడఁడు గదా.

విటులు :—

ముని విటలక్షణముం జెప్పినాఁడు :—

'వేశ్యోపచారకుశలః మధురో దక్షిణః కవిః
ఊహాపోహక్షమో వాగ్మీ చతురశ్చ విటో భవేత్'

అని. వసంతసేన విటుఁడు ఈ లక్షణము లన్నింటితో కూడుకొన్నవాఁడు, చాల సమర్థుఁడు, వసంతసేన చాల గొప్ప యంతస్తు నాగరకత విలాసము గలది కావున ఆమె నాశ్రయించిన విటుఁడును విటులలో గొప్ప వాఁడగును. ఆమె చారుదత్తు నభిసరింప గాలిలోను మబ్బులోను ఛత్రధారిణి మొదలగు పరిజనముతో బయలుదేరఁగా విటుఁడును కూడ తోడుగా పోయినాఁడు. దారిపొడుగునను వానవలని యిద్దముగాని విసుకుగాని వసంతసేనకు తోపనీక ఆమెతో సమానముగాను మించుచును ఉత్సాహ పఱచుచు ఆదుర్దినమును వర్ణించుచునే పోయినాఁడు. మధురః, దక్షిణః, కవిః . . . . . . . మొదలగు నన్ని గుణములును ప్రత్యక్షమగుచుండెను. కడపట వసంతసేన చారుదత్తు నింటం జొచ్చుచు. అతనిని ఇఁక నీవు పొమ్ము అనఁగా వసంతసేనకు ఆ రాత్రి చారుదత్తునితో శయనగృహమునం గడపఁబోవు దానికి అనుభవపరీవాహముగా నెఱజాణతనముం గఱపు నుపదేశమును V - 36 (సాటోపే త్యాదిని) పలికి 'సుఖసిద్ధి రస్తు' అను నాశంస పలికి మరలినాఁడు. ఐనను వసంతసేన నిజమగు మర్మ్మ ఎఱుఁగఁ దనఁదగును. ఆపెది సర్వము వేశవాస దూర్తము గదా.

మఱియొక విటుఁడు శకారునికి శృంగార సహాయుఁడు ఉన్నాఁడు. వాఁడు మోటు శకారుని మోటు శృంగారమునకు సాయము కావలసినందున అందులకు తగినట్లు తాను వ్యవహరింప వలసియుండెను. చారుదత్తునే తొలినాఁడు అభిసరించుచున్న వసంతసేన శకార విట చేటాదులు సందెవేళల వీథులలో విలాస విహారము చేయుచుండ శకారుని కంటఁబడినది. వానికి ఆమెను బలాత్కరించి పట్టుకొని కోడి పుంజు ననుకరణముం జేయుకోరిక కలిగినది. దానికి తగిన మాటలు, 'డబ్బు ఇచ్చిన వానినెల్ల నీవు డబ్బుకు తగినట్లు కూడవలసిన దానవు' అను నిత్యాది నేర్పుగానే చెప్పుచుండినాఁడు. ఇంతలో ఆ శకారుఁడే ఆమె దరిద్ర చారుదత్తుని వలచి తన్ను ఒల్లకున్నది అనెను. సమర్థుఁడైన యావిటుఁడు వసంతసేన

యందమును, అంతస్తును గుణప్రసిద్ధిని ఊరిలో విని యున్నవాఁడు, కన్నవాఁడును 'సోఽస్మద్విధానాం ప్రణయైః కృశీకృతః....'I - 46 చారుదత్తుని యౌదార్యాభిజాత్య రూపాదులను ఎఱింగి యతనియం దెంతయు తన మనసున గౌరవము నాటుకొని యున్నవాఁడు. ఇఁకను వసంతసేనం బట్టుకొను శకార ప్రయత్నమున తాను సాయపడుట చాల తప్పు అని మనసునకు తెచ్చుకొని 'రత్నము రత్నముం గూడి నదిపో' అని తలంచి వసంతసేనకు తప్పించుకొనను గూడ సాయపడి, 'గుణఃఖలు అనురాగస్య కారణమ్. నపునర్బలాత్కారః' అను వసంతసేనమాటను పాటించి. 'హృదయే గృహ్యతే నారీ' అని ఇత్యాదిగా శకారుని మందలించి 'పో. అగపడక మాయమైనది వసంతసేన' అని యని. చారుదత్తు నింటికడ జరిగిన రచ్చలో తానగపడుట అజ్ఞానము చేతనని మైత్రేయుని కాళ్ళంబడి మ్రొక్కి 'మన్నింపుము, చారుదత్తునితో నాపై చెప్పకు' అని బతిమాలుకొని. చెప్పనని యతని యభయవార్త విని శకారుం ద్యజించి పోయిన గుణగ్రహణవినీతుఁడు అట్లే, బండ్ల మాఱుపాటుచే పాపము, వసంతసేన పుష్పకరండ జీర్ణోద్యానమునకు చేరఁగా చూచి విటుఁడు, అమ్మమాట విని డబ్బుకోసము కడపటికి ఆ హంసనుమాని యీ కాకి కడకు వచ్చితివాయని, కాదు బండ్లమాఱుపాటుచే ఇట్లు చిక్కుకొంటిని, యని తన్ను శరణు పొందఁగా. ఆమెం గాపాడ ప్రయత్నించి, తనవలన కాక, శకారుని తిరస్కరించి కాలఁదన్నిన యామెను వాఁడు చంప నిశ్చయించుకొని. తన విటుఁడు జీతగాఁడు కదా అని ఆపనిని వానిం జేయుమని, వాఁడు పరలోకభయాన ఎంత మాత్రము చేయననఁగా, అంతట తానె కాసెబిగించి అందులకు కడంగఁగా, ఏరా, నాయెదురుగా చంపెదవటరా ఆమెను. అని వానిని గొంతుపట్టిలాఁగి పడఁద్రోసిన వాఁడు శకారువిటుఁడు, అంతట వాఁడు జిత్తుపన్ని, మీ యెదుట నన్నుం గలయుటకు జంకుచున్నది వసంతసేన, నేనామెను ఎందులకు చంపుదును - నీవు అవతలికి పో, ఆమె నాకు వసపడును అనఁగా, అట్లును జరుగునేమో, భోగమువారి గుట్టెంతయు ఎవరెఱుంగుదురు అనుకొని శరణనుచున్న దానినే వసంతసేనం బాటింపక, వానితో 'వసంతసేన నీచేత నా న్యాసము, కాపాడి నాకు అప్పగింపవలయు'నని చెప్పి, తాను కదలిపోయి, అయినను వానిని నమ్మకపొంచిచూచి, వాఁడు పూలుదునిమి యలంకరించుకొనుటను, పిల్లా పిల్లాయని తఱియుటం జూచి, కామియు అనునయనశాలియు నైనాఁడు - ఇఁక పర్వాలేదు - అని ఆటక్కరిగానిం బొరపాటునసమ్మి తాను పోఁగా, అక్రూరుఁడు వసంతసేనను

మెడనులిమి చంపనే చంపి, రాలుడు పండుటాకులతో పీనుఁగును కప్పి, తొలఁగి నిలుచుండినాఁడు. వాఁడు మరలి ఏదీ వసంతసేన అని యడుగఁగా చంపివేసితిని. ఇదిగో చూడు నా పరాక్రమ కార్యమును అని చూప, ఆ పీనుఁగుం జూచి, అయ్యో, అయ్యయ్యో అని తన్ను శరణన్న దానిని విడిచిపోయితినే, ఉజ్జయినికి అలంకారమైన చంద్రలేఖయే, ఊరి లక్ష్మియే, నాబోంట్లకు ఆశ్రయమే, ఉపకారిణియే - చెడితినే నేను - అని దుఃఖాతిరేకమున మూర్ఛిల్లి తెలిసి వసంతసేనం దలంచుకొని 'అమ్మా! అట్టి దానవుగదే. ఇట్టి దానవుగదే, అని ముక్తకంఠముగా విలపించి, భోగముతనములేని సాధ్వివి కులాంగనవుగ పుట్టుదువుగాక అని ఆశంసపలికి, ఇఁక నీపొత్తు నాకు వలదు అని ఆ రాజశ్యాలుని శకారుని దిగనాడి, రాజ్యపు బితూరి నాయకుని శర్విలకుం జేరఁ బోయిన ధర్మపరుఁడు.

శకారుని చేటుఁడును వట్టిక్షుద్రుఁడు కానిస అని తొలఁగ ద్రోయఁ దగినవాఁడు కాఁడు. శకారుఁడు వసంతసేనను చారుదత్తుని యింటి దారిలో వీధిలో పట్టుకొనం గోరి తఱిమినపుడు, తన దొరతో రమింపవమ్మా మంచి చేఁపలు మాంసము తిందువుగాని అని దొరసేవను చక్కఁగా చేయును. ఓరి చేటా, మనమును ఇంటికి పోవుదము పద అనఁగా సరి అని, క్రిందపడియున్న కత్తిని దొరచేతనిచ్చి. వాఁడు ఉండనీలే నీ చేతనే అన్నను తాను దానిం బట్టుకొన నొల్లక వినయముం జూపినాఁడు. వసంతసేన పొరపాటున తన బండియెక్కుటను పాపము వాఁడు చూడలేదు. చూచియున్న మాన్పియుండును. మఱి పుష్పకరండకుం జేరినంతట తన బండినుండి దిగిన వసంతసేనం గాంచినాఁడు. ఈపె నీబండిలో ఎట్లు ఎక్కినది అని శకారుఁ డడుగఁగా తాను బండ్లయడ్డము తొలఁగించుకొనంబోవుచు బండిని చారుదత్తుని దిడ్డివాకిట నిలిపితిని అప్పుడు జరిగినట్లున్నది యీపని, నేను కనుఁగొనలేదని మెలఁకువతోనే సరిగానే యూహించి చెప్పును, కడపట శకారుఁడు వసంతసేనం జంప నిశ్చయించుకొని, చేటుని తన్ను ఆపనిచేయుము అనఁగా - తాను ఆఘోరపాపమును ఎంత మాత్రము చేయను, ఈజన్మను కూడ తాను పాపము చేసి పాడుచేసి కొనను. నన్నుకొట్టు, చంపు - నేనేమోచేయను అని తన పాపద్వేషమును ఊని చెప్పును, బండి మార్పున తాను తెచ్చితినే వసంతసేనను, పాపము ఇక్కడ ఇట్లు చంపఁబడుటకు అని తాను ఎంతేని పశ్చాత్తప్తుఁడై దుఃఖించును. తాను హత్యను బయట చెప్పుదునో అని తన్ను శకారుఁడు మిద్దెమీఁది కొట్టున సంకెలలంగట్టి యుంపఁగా, అక్కడికి వినవచ్చిన-

యార్యచారుదత్తుని వసంతసేనం జంపినాఁడని చంపఁగొని పోవుచుండు-చాటింపును విని, పాపము, ఏ పాపము ఎఱుఁగని యాగొప్ప బ్రాహ్మణుఁడు అట్లుకొనిపోఁబడు చున్నాఁడే - నేనెఱిఁగిన నా సామిమీఁది నిజముం జెప్పి వానిం గాఁచుపెట్లు. సంకెలలతో ఇక్కడ ఇట్లున్నానే అని పశ్చాత్తాప దుఃఖములుపడి, తాను కొంచెకాఁడను, చచ్చినం జత్తును. వానిం గాపాడఁజాల నని ఆ మిద్దెమీఁదినుండి క్రిందికి దూఁకిన పరోపకార సాహసికుఁడు. సంకెలలూడి కాళ్లు వచ్చినవి, కాని తాఁ జావలేదు! పుణ్య చింతఫలము! అంతట తాను ఆగుంపును వెదకుకొని దూఱిపోయి, తనదొర శకారుఁడు వసంతసేనం జంపినది, చారుదత్తుఁడు కానేకాదు అని ఆ గుంపున చండాలురు విన నఱచి చెప్పినాడు. చారుదత్తుఁడును ఎవఁడోగదా యీ నిష్కారణోప కారియని యబ్బురపడి తన్నుం జూచినాఁడు. ఇంతలో శకారుఁడు వచ్చి బానిసనైన తన్ను పట్టుకొని, తాను ఇంట బంగారు దొంగిలించినందులకు చావఁగొట్టఁగా తనమీఁద నీయసత్యము చెప్పుచున్నాఁడని చండాలురతో చెప్పి వానిని తొలఁగించి లాగుకొని పోవఁగా తాను చారుదత్తుం గాంచి నాశక్తి కొలఁది ప్రయత్నించితిని. మఱియిట్లు లాఁగికొని పోఁబడుచున్నా నని చెప్పకొనెను. ఆర్యకుఁడు రాజుకాఁగానే, చారు దత్తుఁడు ఈ నిష్కారణబంధువైన చేటుని క్షుద్రుఁ డనక ఆ పరహితప్రవణతకు ఎంతయు మెచ్చుకొని 'అదాసోభవతు' అని బానిసతనమునుండి స్వేచ్ఛగా నుండు పౌరుం జేసి యనుగ్రహించినాఁడు.

శర్విలకుఁడు—

శర్విలకుఁడు పిదూరికి నాయకుఁడు, దేన అధార్మికుఁడును క్రూరుఁడును అపరక్త పౌరుఁడును అగు పాలకుఁడు రాజ్యమునుండి తొలఁగింపఁబడునో, అయినను అది నాటకమున విశేషాకారముగా బయలుపడక అంగముగా లీనముగా నడచుచుం డును. కట్టకడపట ఈ శర్విలకుఁడు పాలకుం జంపి గోపాలదారకు సింహాసన మెక్కించి చారుదత్తుని యథోచితముగా సమ్మానింప నగపడును. అతఁడు ఇందు ముఖ్యముగా వసంతసేనచేటి మదనికం గామించి దానికి దాస్యము మాన్పి తన భార్యగా నిలుపుకొను కాముకుఁడుగా తోలుత అగపడును. మంచి బ్రాహ్మణకుల మునం బుట్టిన వాఁడయ్యు, మదనికం గామించి దానికై ధన మార్జింప అతినిపుణ ణముగా దొంగలవృత్తి, కన్నము వేయుట మొదలగునది, విద్యగా అభ్యసించి అందును ఎన్నియో ధర్మనియమములు పాటించుచుండి. ఒకనాఁడు చారుదత్తునింట

అతఁడు కాంచి మెచ్చుకొన్న మిక్కిలి యందమైన కన్నము కొట్టి, యెంతయు నేర్పుగా మైత్రేయునిచేతనున్న వసంతసేన యిల్లుడబంగరునగను హరించుకొనిపోయినాఁడు. తనకైన నిష్క్రియధన మని దానిని మదనికకుం జూపఁగా అది వసంతసేన దని చారుదత్తుని యింట నుండిన దని, చారుదత్తునికిం గలిగిన నష్టమునకు ఆచేటి (యు వసంతసేనయుం గూడ) మూర్ఛిల్లి తెలిసి యిట్టిపని చేసితివే, ఇకనెట్లు అని యనఁగా, అంతలో అది చారుదత్తునిమీఁది మదనిక మోజుమాట యని వాఁడు ఈసు చెంది, స్త్రీల యవిశ్వసనీయతను దూషింప జొరఁగా. మదనిక దాని నిజ మును, దాన వసంతసేనకును అప్రియముకాఁగల దన్నమాటను పలుకఁగా విని, మదనికవలననే ఆయిక్కట్టున తప్పించుకొను నుపాయమును నేర్చుకొని, తాను చారుదత్తుని మానిసిగా ఇల్లడ నప్పగింపవచ్చినవాఁడుగా నటించుచు వసంతసేనకు దానిని ఇచ్చును. ఈ కథయంతయు చాటున పొంచి వినుచు వికృతి ప్రకృతులఁ బొందుచున్న వసంతసేన, దానికి సంతోషించి నేర్పుమీఱ 'దానిం దెచ్చి యిచ్చిన వానికి మదనిక నిమ్మని ముందే చారుదత్తుఁడు తనకు సందేశము పంపినాఁ డనుచు మదనికను అతనికి వధువుగా ఇచ్చివేసినది. దాన తన కర్మ తాను తెలిసిపోయితిమే అని విలక్షుఁడై వసంతసేనతో ఎకరారుపడి వసంతసేనకును చారుదత్తునికిం గూడఁ గూర్చిన బంధువుం బోలె నొక్కట మహోపకారతా బద్ధాంతరంగముతో కృతజ్ఞుఁడై మదనికం గొనిపోయినాఁడు. ఆ క్రొత్త ప్రేయసినే, తటాలున అప్పుడే వినంబడిన తన మిత్రమైన గోపాలబాలకు నిష్కారణ బలాత్కార కారాబంధనమునకు దుఃఖ క్రోధములు మనసున లేవఁగా, వానిం గావ దీనిని మిత్రునింట విడిచి పరువెత్తిన యుచితజ్ఞ కార్యశూరుఁడు. ఆ యుజ్జయినీరాజ్యాన పాలకరా జ్యాపరక్తుల నెల్లరం గూర్చుకొని ఉపాయములు పన్ని యౌగంధరాయణుఁడు మునుపు వత్సేశునింబోలె తన మిత్రుని ఆగోపాలదారకుని విడిపించిన దక్షుఁడు - అట్లే సమయము వేఁచి యాపాలకుని యజ్ఞవాటమున పశుమారముగా జంపి, అనురక్తప్రజల జయధ్వానము లతో ఆగోపాలబాలుని రాజ్యసింహాసనమునం గూర్చుండఁబెట్టి, వానికి మంత్రియు సేనానియుంబోలె తాను చారుదత్తవసంతసేనలకు ఏది తగునో అది సాధించిన సాధు కార్యదీక్షితుఁడు. ఇట్లాక అనూచానపుత్రుఁడు శర్విలకుఁడు, కులము చెఱచుకొని బోగముదానిని వలచి, దానికి ఈవలయు డబ్బుకై దొంగతన మభ్యసించి, దాని నైనను నీతితప్పకే చేయుచుండి, దానిని విలుచుకొని తన వధువుగాఁజేసికొందు నని బేరమాడుచుండి. అట్లే ఒకనాఁటి పెద్దదొంగతనాన దొంగిలించిన ధనముతో

దానిని విలుచుకొన్న రసికవిలాసి. నాఁటి రాజ్యపాలనా దోషములు ఎంచి, దానిం జక్కఁబెట్ట దీక్షఁబూని పితూరీ లేపి సాధించి, సాధు రాజ్యముం బ్రతిష్ఠించి సాధువులం గాఁచి గౌరవించిన యొక కార్యశూర రణశూర పురుష విశేషము.

మదనిక :—

ఈశర్విలకునికి అనురాగాలంబనము మదనిక, భోగము దయ్యు తన యందమునకు సాటియైన పురుషగుణానురాగముగలది. ధనానురాగమును భోగమువృత్తిని మానుకొన్న కులాంగనతనమునకు ఉవ్విళులూరినది. తన సానికి వసంతసేనకు ఎంతయుం గూర్చునది. అపారమైన తెలివితేటగలది. శర్విలకుఁడు దొంగిలి తెచ్చిన యా యిల్లడకై ఇటు వసంతసేనకును అటు చారుదత్తునికిం గూడ అప్రియముఁ గావింపఁబడినదే యనియు తనకు విలువగా వసంతసేనదే యైన యానగను ఆమెకు చూపనగునా యనియు వందురి శర్విలకుం దూఱి, తప్పించుకొను నుపాయుమును అతనికి నేర్పిన నిపుణురాలు. దాన నిఁక తనకైన బేరము చెడినట్లే, తాను నిష్క్రీత కాకపోవుదును - అని తోఁచినను చింతింపక సానికి అపకారము కూడదు, తా నేమైన కానీ అను స్వామిన్యనురాగార్ద్రవశాలిని, మఱి దైవయోగమున సాని సౌజన్యమున దాననే నిష్క్రీతయై వధువైనను, వసంతసేనను వీడిపోలేక కృతజ్ఞతకు ఆమె పాదాలలో అశ్రువులు రాల్చిన కృతజ్ఞయు ఋజుకయు. శర్విలకుని కెంతయుం గూర్చిన పతివ్రత.

దర్దురకుఁడు :—

దర్దురకుఁడును ఒక తమాషామానిసి. రాలుగాయయు సోంటుకాయయు. పుట్టుజూదరి. అందు ఎంతో ధనము జయించి రాజువలె పెండ్లి చేసికొని మిత్రులం బొంది దానా లిచ్చి భోగా లనుభవించి జూదమే వృత్తిగా నుండి దాననే సర్వమును పోఁగొట్టుకొని, ఒక బొక్కలపేలికను, విప్పరానిదానిని కుచ్చెలుగా మడిచియే బుజాన దాల్చి. నిముస మొక్కచోట కాలు నిలువక దిన మంతయు ఖుషాలుగానే వీథులు తిరుగుచుండు వాఁడు; ఇప్పటికిని జూదపు మహిమను నమ్మినవాఁడు, తన పూర్వచరితముం బట్టి సభికుని కంటఁ బడ జంకుచుండును. వీథి జగడాలలో కలుగఁజేసికొని దూఱి, దయగొని బలహీనునికి తోడై తా జగడమాడి ఎదిరి కన్నులు నిండ మట్టి దుమ్ము కొట్టుటకైన ఓడనివాఁడు. ఆపూటకు దొరకిన దానిని దొరకినంతే తిని గడుపు

చుండువాఁడు, స్వభావసాహసికుఁడు. అట్టివాఁడు రాజ్యాన పితూరియే లేచుచున్న అందు చేరకుండునా? శర్విలకాశ్రితుఁడైనాఁడు. నాటకాంతమున చందనకాదులతో అగపడియున్న బాగుగా నుండెడిది. మఱి అగపడలేదు.

సంవాహకుఁడు :—

సంవాహకుఁడు పాటలిపుత్రపు మంచి గృహస్థు కొడుకు. సంవహనమును - ఒళ్లు ఆప్యాయముగా పిసుకుటను - విద్యగా నేర్చినాఁడు నగరదర్శనకుతూహలమున ఉజ్జయినికి వచ్చిన వానికి అది బ్రదుకుతెరువై వాఁడు చారుదత్తునికి సంవాహకుఁడుగా కుదిరి అతని దయౌదార్యాదికి సంతసించుచు సేవ చేయుచుండినాఁడు. సాధారణముగా గొప్ప యాఢ్యులు అంగసుఖపరాయణులు సంవాహకులచే అంగమర్దనము గావించుకొందురు. వసంతసేనయు అన్నది సంవహన మెంతయు సుకుమారమగు కళ అని. చారుదత్తుని దారిద్ర్యము పైకొనఁగా (=అతఁడు చారిత్రమాత్రావశేషుఁడు కాఁగా) అట అవృత్తిం గోలుపోయి, అతడు జూదమునం బ్రవేశించినాఁడు. ఆ విద్య చక్కఁగా రాక ఆటలో ఓడి, పది సువర్ణములు కట్ట లేక, సభికునిచే తన్నులు తిని పరారియై దాఁగుకొనుటకు తలుపు తెఱచియున్న వసంతసేన యింటఁ జొచ్చి శరణు వేడి, పొంది, వసంతసేన తన్నుంగూర్చి యడుగఁగా తా నొకప్పుడు ఆర్యచారుఁదత్తాశ్రితుఁడ నని చెప్పినందులకు ఆమెచే ఎంతయు మన్నన యాదరములు పొంది జూదగాండ్రబాకీ యామె తీర్పఁగా, ఆమెవలన సెలవుగొని, అప్పటికి తన జీవితక్లేశములం దలఁచుకొని, రోసి, ఇఁక పరివ్రజింతు నని బౌద్ధశ్రమణకుడైనాఁడు. అట్లు అవ్యాజముగా అంతయుపకారము చేసిన వసంతసేనకు ప్రతి తాను ఏమి చేయగల నని నిస్పృహం జెంది. దానిం దలఁచుకొనుచునే యుండెను. ఇట్లుండ ఒకదినము తాను తన కావులం గుంజుకొనుటకు శకారుని పుష్పకరండకములోని కోనేటికి పోయి మరలువాఁడు గుడ్డ ఎండవేయను తగినచో టని ఒక యెండుటాకులరాశిపై పఱుపఁగా, అది వసంతసేన పీనుఁగుపై కప్పియున్న పండుటాకుల రాశిగా ఏర్పడి అందు ప్రాణి కదలాడుటం జూచి, చేయి వెలికి నిగిడ్చిన మరల ప్రాణము వచ్చుచున్న వసంతసేనం జూచి యానవాలు పట్టి తేర్చి దాహము తీర్చి కాపాడి తమ మఠమున సేదదేర్చి, మఱునటి దినము ఆమె కోరినట్లు చారుదత్తునింటికి కొనిపోవుచు దారిలో చారుదత్తుం జంపఁ గొనిపోవుచున్న చాటింపు విని ఆమెను ఆగుంపులో చారుదత్తునెదుటికిం గొనిపోయి కూర్చి - దాన వారిదావులు తప్పించిన కృతజ్ఞుఁడు, ప్రత్యుపకారశీలుఁడు. సాధువు. అతనికి చారుదత్త

వసంతసేనా శకార శర్విలకాదులదై ఎగుడుదిగుడులతోఁడిదైన ఈలోకచరితముం జూడఁగా వైరాగ్యమే బలపడినది. అతనిని ఆదరించి ప్రత్యుపకరించుచు చారుదత్తుఁడు ఆ క్రొత్త యార్యకరాజ్యమున సర్వబౌద్ధ మతాధిపతిగా చేసినాఁడు. దేశాటన కుతూహలము, నమ్మిన సేవకునితనము, కృతజ్ఞత ప్రత్యుపకారపరత వైరాగ్యము - ఇవి వీని లక్షణములు.

## ౫. మృచ్ఛకటిలో హాస్యము

మఱి యే నాటకమునను ఇట్టి యొక శీర్షికకు అవకాశమే యుండదు. విదూషకుఁ డున్నచోట వాని నాశ్రయించినది ఏరవంతయో ఉండును. మఱి మృచ్ఛకటికమున అది యొక శీర్షికచేయగలయట్లు పెక్కు తెఱంగుల తొలినుండి కడవఱకు నిండి యున్నది. ప్రతిపుటలోను ప్రతిపాత్రమందును సంవిధానమునను అగపడుచునే యుండును. విసివింపదు. చప్పనగాదు. చమత్కారము కనిపించునది, క్రొత్త క్రొత్తగా, మొగ్గు తగ్గులుగా యథాపాత్ర సందర్భముగా పర్వియున్నది.

హాస్యముం గూర్చిన శాస్త్రము ఇంచుక. - సా. ద. III - 229....'వికృతములయిన యాకారము వాక్కు వేషము చేష్టలు ఇత్యాదులయొక్క వేడుకవలన హాస్యముఁ గలుగును. ఉత్తములకు స్మితహసితములును, మధ్యములకు విహసితావహసితములును నీచులకు అపహసితము అతిహసితంబును. ఇంచుక నేత్రవికాసము అధరచలనంబును కలది స్మితము. అదియే దంతములు ఇంచుక యగపడుచున్నచో విద్వాంసులచే హసిత మనఁబడుచున్నది. మధురస్వరము విహసితము. అంసశిరఃకంప సమేతము అపహసితము, బాష్పములతోఁడిది ఒడలు విసరుట కలది అతిహసితము ?

హాస్యము శృంగారమున పుట్టును. కావుననే శాస్త్రమున శృంగారము వెంటనే హాస్యముం జెప్పుదురు.

'శృఙ్గారాద్ధి భవేద్ధాస్యో.........భరత - VI - 44.

'శృఙ్గారానుకృతిర్యాతు, స హాస్యస్తు ప్రకీర్తితః - 45.

ఎత్తుకొనఁగానే ప్రస్తావనలో సూత్రి చాల సేపు పాటపాడినందున అలసితినని యింటికి పోయి నటిని తన భార్యను పిలిచి - 'తినుట కేమైన ఉన్నదచే

ఇంటిలో' అనఁగా - నటి 'అన్ని యున్నవి' అని, ఏమి! మన యింట నన్నియు ఉన్నవా ?' అనఁగా 'అంగడిలో ఉన్నవి.' అనుట హాస్యమై. ఈ నాటకాన హాస్యము దండి అని తొలుతనే సూచించును.

కొన్ని యెడల మాటలశ్లేష, వక్త ఒక యర్థమునం జెప్పినదానిని శ్రోత ఒం డర్థమునం గొనుట.

1. మైత్రేయుఁడు వసంతసేన యభిసరించి వచ్చినప్పుడు.

ఆమె వచ్చియున్నది అని చెప్పవచ్చిన చేటునితో.

మైత్రే—ఓరీ ఎక్కడరా నీవు ఈగాలిలో వానలో పెంజీకటిలో వచ్చితివి ?

చేటుఁడు—ఓరీ ఇదిగో ఆమె ?

మైత్రే—ఎవరురా, ఎవరురా ఆమె ?

చేటుఁడు—ఇదిగో ఆమె.

మైత్రే—ఏమిరా మెమ్మె, మెమ్మె, అందువు, కఱవులో ముసలి సన్నాసివలె మెమ్మె అని ఎగశ్వాసించెదవు !

చేటుఁడు—నీవు ఎందుకురా ఇంద్రోత్సవమునకు ఆసగొన్నట్లు కాకి వలె బిగ్గరగా కాకా కాకా అందువు !

మైత్రే—మఱి చెప్పరా ?

చేటుఁడు—ఓరి నీకొక ప్రశ్న వేసెదను రా. ?

మైత్రే—నేనును నీతలపై నాపాదము వేసెదనురా. ?

ఇత్యాది యెల్ల.

ఆ రెంటిని (వసంతము - సేన) ఒకటిగా కలిపి చట్టన చెప్పు - సేనవసంత. కాదురా పదాలు త్రిప్పి చెప్పరా. పాదాలు వెనుకకు మరల్చి నిలిచి - సేనవసంత. మూర్ఖ - పాదాలు కాదురా, మాటలు. వసంతసేన - ఇదిగో ఆమె వచ్చినది! చారుదత్తునితో చెప్పు అనుట యెల్లను. వయస్య నీ ధనికుఁడు వచ్చినాఁడు. నాయింట ధనికు డెక్కడి వాఁడు ? ఇదిగో వసంతసేన వచ్చినది. ఇందెల్ల ఎంత హాస్యము తొనుకు చున్నది!

చేట వేసగానికి సహాసమ్ అని అభినయసూచనయు ఉన్నది. తొలియంకమున శకారుఁడు వసంతసేనం దఱుమునపుడు, ఒల్లని దానిని వలచి తఱుము రసాభాసము ననే ఒకపాటి హాస్యము ఉన్నది. అంతియ కాక అప్పటి వాని మాటలలోనెల్ల హాస్యము తోఁచుచునే ఉండును - ఒల్లకున్న కత్తితో నఱుకుదును చంపుదును అనుటయు, ఓసి వర పురుష మనుష్యుఁడను వాసుదేవుఁడను - నన్ను కామింపవే! అనుటయు, అందులకు వసంతసేన కోపముతో మూయుము నోరు, పాపము ఆమాట - అన్నట్లుగా 'శా_న్తమ్' అనఁగా - దానికి శ్రా_న్తమ్ అని ఛాయంగొని, నన్ను ప్రేమించి, నాకై పరువెత్తి 'అలసితివి' అని జాలిగొనుచున్నది యని చప్పట్లు చఱచి పకపకనవ్వుటయు ఎనిమిదవ యంకమున శ్రమణకుఁడు ప్రసీదతు ఉపాసకః అని శ్రమణకభాషగా ఉపాసకుఁడు మన్నించునుగాక అనియు నీవు ధన్యుఁడవు, పుణ్యుఁడవు అనియు మెచ్చుకోళ్లు పలుకఁగా వానికి మంగలి యనియు నాస్తికుఁడనియు తొట్టి యనియు కుమ్మరి యనియు ఏమేమో యపార్థములు చేసికొనుటయు హాస్యమే. మఱియు శకారభాషితమంతయు - ఆపేరునకు తగిన 'శకారప్రాచుర్యము' చేతను 'అగమలిఙ్గవిహీనం దేశకలాన్యాయ విపరీతమ్ వ్యర్థైకార్థ మపార్థం భవతి హి వచనం శకారస్య' అన్న యన్ని యవలక్షణములచేతను 'రావణ స్యేవ కున్తీమ్', అనియు, 'హనూమాన్విశ్వావసో ర్భగినీమివ సుభద్రామ్-' అనియు మొదలుగా నున్న వానిం బోలినది ఎంతయు నవ్వును పుట్టించునదే యగును. ఆ నవ్వులతో, వానియెడ ఒక రోఁతయు తోఁచుచునే యుండును. ఇదియు, ఇంకను ఉన్నదియు హాస్యమయమే.

శకారుఁడు తాను పాడుదు నని గొంతెత్తి వికారముగా పాడి విటుని ఏమి ఎట్లున్నది నాపాట యని యడిగి, అతని కంటెను తన్ను తానే మెచ్చుకొని, ఎందులకు బాగుఁగా నుండదు. ఏల కాను గంధర్వుఁడను! గొంతు చికిలియగుటకు ఎట్టి వస్తువులతోడి సాధకములను అన్నముతో తిందును -' అనుటయు హాస్యజనకమె.

విటచేటులతోడి శకారుని మాటలహాస్యమున రోఁతయు భయమునుం గూడఁ గోఁచుచుండును. విటుఁడు ఏ తప్పును చేయని యీబాలను నగరభూషణమును నేను చంపుదునేని ఏతెప్పతో పరలోకనదిని దాఁటుదును ?' అని యనఁగా తోఁచుకొనకుండ నేనిత్తునులే నీకు మంచి పడవను అందులకు. అనును. వసంతసేనం జంపి వాఁడు పడిన సంతోషమెంత! నవ్వుచు నా యీ పరాక్రమమును మాయమ్మ చూడదాయెనే. మాయన్న చూడఁడాయెనే!—అనుట. మరలిన విటునితో 'చంపివేసితినోయ్ దానిని.

నాపరాక్రమము చూడుము అని వసంతసేన పీనుఁగుం జూపుట. అందులకు పొందిన దుఃఖాన మూర్ఛిల్లి తెలిసి యెంతేని ఏడ్చుచున్నవానిని 'భావా, వత్తువా, తామరల చెఱువులో ఈఁదులాడుదము.' అనుట. చారుదత్తుఁడు కొర్తికింగొని పోఁబడుచుండఁగా వానింజూడఁ జుట్టువాఱిన జనుల పెద్దగుంపును చూచి సంతోషించుచు, ఈదరిద్రునికే ఇంతగుంపు కూడినదే. ఒకవేళ రాజశ్యాలుని ఘనుని నన్ను ఇట్లుచంపఁ గొనిపోవుదురేని అప్పుడు ఇంక నెంత పెద్ద గుంపుకూడునో అనును. ఆమూర్ఖత! అదెంత హాస్యము. వసంతసేన బ్రదికి వచ్చి, చారుదత్తుం గూడి వారు క్రొత్తరాజుచే దొర దొరసానులు చేయఁబడగా, తన్ను భటులు పట్టువఱుచుకొని పెడఱెక్కలు విఱిచి కట్టి వారి యెదుటికి తేఁగా - వసంతసేనం జూచి తొత్తుకూఁతురా నన్నుకాపాడవే - ఇఁక మరల నిన్ను చంపనులేవే. అనును. ఇట్లు హాస్యము తోఁపని మాట లేదు. ముందు హాస్యము. తర్వాత మఱేమేని.

ఆపోలీసు అధికారులు వీరకచందనకులు జగడమాడు కొనుటయు నవ్వుల గొల్పునదే, అందులో ఒకఁ డొకనిని చేతి సంజ్ఞలతో, జాతితునుకపై కత్తిం దీటుట కత్తెరతో కత్తిరించుటం బోనివానితో నీజాతి మంగలి కదట్రా అనుటయు, మఱొకఁడును అట్లే సన్నలలో భేరీమొదలగు చర్మవాద్య నామములతో నీజాతి మాదిగ కదట్రా అనుటయు. నేను తనిఖీచేసిన దానిని మరల తనిఖీ చేయుటకు నీవెవఁడవురా అని ఒకఁ డొకనిని తన్ని కూలఁద్రోయుటయు. వాఁడు దొరతో చెప్పి నిన్నేమి చేయింతునో చూడు అని వెడలిపోవుటయు. చందనకుఁడు బండిలోనున్న ఆర్యకు నుద్దేశించి రహస్యముం గాచుచు వసంతసేనా అని పిలిచి బయటికి వ్యవహరించుటయు - 'ఇందము రహదారి తనిఖీ ఐనదన్న చీటి నీకు.' అని తన కత్తి నిచ్చుటయు ఇది కథలో ఎంతయో ప్రధాన విషయ మయినను అంతయు హాస్యపూరితము.

శకారుని చేటుఁడును హాస్యముగా పలుకనేర్చును.

శకా—నాబిడ్డా స్థావరకా చేటా, నేను నీకు బంగారు మురుగులు ఇత్తునురా.

చేట—ఇచ్చిన వానిని నేను పెట్టుకొందును.

శకా—నీకు ఒక బంగారుపీట పెట్టెదనురా.

చేట—పెట్టిన నేను దానిమీఁద కూర్చుందును,

ఇక్లే ఇంకను.

శకా__మటి నామాట విను. చంపరా వసంతసేనను.

చేట__అన్నియు విందును చేయుదును, ఆకార్యము తప్ప.

వసంతసేనాచేటుఁడును వసంతసేన - పేరు తటాలున చెప్పక - మామిళ్ళు ఎప్పుడు పూచును? వసంతమున - నగరాలకు ఏది రక్షణ? సేన - అని విడదీసి ప్రశ్నలువేసి, తర్వాత ఆజవాబులం గలిపి వసంతసేన యనిపించుటయు హాస్య జనకము.

విదూషకుఁడు గదా నాటకాలలో హాస్యగాఁడు. మఱి యిందు మైత్రేయుఁడు ఉన్నాడు. అతనిం గూర్చి ఒకవిధమైన హాస్యము పూర్వము ఉదాహరింపఁబడినది. ఇంకను ఎన్ని తెఱంగులదియో ఎంతయో కలదు. అతని మాటలలో ఉల్లకుట్టు - ఉత్ప్రాసము ప్రాయికముగా నుండును. మైత్రేయునిది మాటలహాస్యము. రేభిలుని యతిమధుర తంత్రీగాత్ర సమ్మిశితమైన పాటం గూర్చి, స్త్రీ సంస్కృతము పఠించుచో క్రొత్తగా ముక్కుతాడు కుట్టిన యావువలె ఎక్కువగా 'సుసూ' శబ్దము చేయును - మగవాఁడు కాకలి పాడుట వాడిన యెండిన పూలు చుట్టుకొన్న ముసలి పౌరో హితుఁడు వేదమంత్రము జపించున ట్లుండును అన్నాఁడు, దేనిని చారుదత్తుఁడు మైమఱచి మిక్కిలి మెచ్చుకొన్నాఁడో. ఇందు అతని సంగీతాజ్ఞానమును స్పష్టము. కలలో 'వయస్యా, నీవు ఈబంగరు నగను నాచేతినుండి తీసికొనకున్న ఒట్టు.' అని పలవరించి ఆన్యాసమును దొంగశర్విలకునిచేత తాన పెట్టినాఁడు. వసంతసేనతల్లి అతిస్థూలకాయను చూచి అబ్బో! డాకినియే! అని ఎంతబొజ్జ! ఈమెను పెద్ద దేవతావిగ్రహమువలె ముందు అక్కడ నుంచి, తరువాత వాకిళ్ళు అమర్చియుండ వలెను. లేకున్న ఈమె ఏవాకిటను పట్టదే! అనును. 'చాతుర్థికమను జ్వరముచే ఆమెయట్లు స్థూలయై పోయినది' అని అనఁగా 'బాబూ చాతుర్థిక జ్వరమా. నన్నును అట్లు అనుగ్రహింపవయ్యా నీకు మ్రొక్కెదను' అనును. 'చచ్చిన ఆమెను బయటికి ఎత్తుకొనిపోవ అలవిపడదు, వాకిళ్ళు పట్టదు. నక్కలను కుక్క లను నూటిని ప్రవేశపెట్టి పీనుఁగును తినిపింపవలసినదే', అనును, జంట బంగారు నగలను జరీయుడుపులను ఒంటినిండ ధరించిన వసంతసేన తమ్ముని జూచి ఏపుణ్యము చేసిన ఈమె తమ్ముఁడుగా జన్మముకలుగునో - అనును. అంతలో వాఁడు వట్టి వల్లకాటి పూచిన చంపకవృక్షము - పో అనును, ఎత్తిపొడుపులేని మాట

అపి చ,

శ్లో. దారిద్ర్య, శోచామి భవన్త మేవ
మస్మచ్ఛరీరే సుహృ దిత్యుషిత్వా
విపన్న దేహే మయి మన్దభాగ్యే
మ మేతి చిన్తా క్వ గమిష్యసి త్వమ్. 38

విదూ—(సవైలక్ష్యమ్) భోవయస్య యది మయా గన్తవ్యం, త దే షాపి మమ సహాయినీ రదనికా భవతు. (భో వఅస్స, జఇ మఏ గన్తవ్వమ్, తా ఏసా వి మే సహాఇణీ రదణిఆ భోదు).

---

మహాపాతకములు ఐదు, మనుప్రోక్తములు — ఇది ఆఱవది వానిని మించినది.

బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వఙ్గనాగమః
మహాన్తి పాతకా న్యాహుః సంసర్గ శ్చాపి తైః సహ.

శ్లో. 38. దారిద్ర్య = ఓరి పేదఱికముగా, భవన్తం = నిన్ను — నిన్ను గూర్చి నీకోసమే — ఏవం శోచామి = ఇట్లు దుఃఖపడెదను. ఎట్లనఁగా — అస్మత్ శరీరే = నాదేహమున, సుహృత్ ఇతి = మిత్రము అని, ఉషిత్వా = కాపురముండి, మన్దభాగ్యే మయి = అదృష్టహీనుఁడనైన నేను. విపన్న దేహే = ఆపదం బొందిన — ప్రాణము పోయిన — దేహముకలవాఁడను కాఁగా, త్వం = నీవు, మమ ఇతి చిన్తాం = ఇది నాది యను తలంపును, క్వ గమిష్యసి = ఎక్కడ పొందుదువురా ?

ఒరే దారిద్ర్యగా, నీవు నాయందు ఇంత మక్కువతో ఇంత ప్రియవాసము ఏర్పఱుచుకొంటివే, రేపు నేను చచ్చినట్లైన మఱి యెవనియందు చేరెదవురా, మఱి నావంటి దరిద్రుఁడు ఎందును లేఁడు అనుట. వ్యాజస్తుతి — అలంకారము. వాసయోగ్యమను స్తుతి నిందగా ముగియునదే. ఉక్తిర్వ్యాజస్తుతి ర్నిందా స్తుతి భ్యాం స్తుతి నిందయోః.

సవైలక్ష్యమ్ — వైలక్ష్యము గుట్టు తాఁక నాడినపుడు కలుగు సిగ్గు — తాను పోను అన్నందుకు — సుస్నిగ్ధా విముఖీభవన్తి సుహృదః — ఇట్లెల్ల చారుదత్తుఁడు వాపోయినందులకు — తనకు — అతనిచే నిత్యమహోపకృతునకు సిగ్గు కలిగినది.

యది మయా గన్తవ్యమ్ = నేను పోవక వలయు నేని, తత్ = అప్పటికి, ఏషా రదనికా అపి మే సహాయినీ = ఈరదనిక కూడ నాకు తోడుగా, అగును గాక.

తానై కలుగఁజేసికొని ఒకరి పక్షము చేరి వీథిలో కొట్లాటల పర్యంతమునకు వెను కాడనివాఁడు. తన యుత్తరీయము, విప్పిచూపరాని ఒక బొక్కలపేలిక, దానిని విప్పి, చూపఁదగదని కుచ్చెగాచుట్టి దానిని లాలించినాఁడు.........అయం పట చ్ఛిద్రశతై రలంకృతః.........సంవృత ఏవ శోభతే! అని.

శర్విలకుఁడు జందెమునకు ఎన్ని యుపయోగములు చెప్పును! దానితో కన్నమును పొడుగు వెడల్పులు కొలుతును అని కొలబద్దను, మఱచి వచ్చితినే యని యట్లుపయోగించును. ప్రతాపరుద్రుని వెఱ్ఱియుగంధరుఁడు వీఁపుగోఁకికొనుటకు పనికి వచ్చు ననఁడా!

సందర్భాలయు సన్నివేశాలయు హాస్యమును కలదు. వసంతసేనాచేటుఁడు మైత్రేయునికి ప్రశ్నలువేసి వానిని జవాబు చెప్పలేక మిణకరింపఁజేసి వానింగాంచి అందఱిని నవ్వునట్లు చేయుట, ముందే మాటలహాస్యమున ఉదాహృతము ఒకటి. శకారునియు వసంతసేనయు ఆభాసశృంగారఘట్టము లెంతయు హాస్యజనకములే.

శకారుఁడు చీకటిలో తాను మరల పొరబాటు చేయుదునో అని విటచేటులను ఇక్కడ ఇక్కడ అని కూర్చుండఁబెట్టి గుఱుతు పెట్టుకొనుటయు, రదనికను వసంత యనిలాగుట, మైత్రేయుని నవ్వు ఏడువు మొదలుగా అని వాని పెంకెజవాబు వినుటయు హాస్యజనకమే.

సంవాహకుఁడు జూదాన ఓడి దెబ్బలకు వెఱచి పరారియై పాడు దేవళములో దేవతా విగ్రహమువలె నగుటకు పాదాలు ముందుకు త్రిప్పి తా వెనుకకు నడిచి గుడిలో చొచ్చి కదలక నిలుచుండుట రాతిబొమ్మ కొయ్యబొమ్మ అని వారు ఊఁచిన కదలకుండుట వాని యెదుట అంతట సభికుఁడును జూదరియు, వాని గుట్టు కనిపట్టి జూదమాడ తొడంగుటం జూచి వాఁడు తన్ను నిలువరించుకొన లేక ఆటకై బయటికి వచ్చి వారికి దొరకుట ఎంత హాస్యజనక సందర్భము! తరువాతి జగడాన దర్దురకుఁడు వచ్చి సంవాహకునికి సాయపడం గలయుట, కొట్లాట - సంవాహ కుఁడు తప్పించుకొన లేక వసంతసేనయింటం జొచ్చి శరణడుగుట - వాని బాకీ తీర్ప వసంతసేన ఒక్క బంగారునగ చేటిచేతనిచ్చి, ఆ జూదరులకు ఇచ్చి పంపుమని చెప్పుట, వారిని వెదుక వచ్చిన చేటిని దాని చూపులచే రసిక భుజంగుల బేరానికి వచ్చిన దానింగా భ్రమసి ఆ జూదరులు మే మాపాటి సంపన్నులముగాము, మఱెవ్వరినైనను చూచుకొమ్మనుట, వారే సంవాహకు జూదపు జేతలని కనుగొని అది వారికి ఆ నగ నిచ్చి పంపివేయుట - ఇదంతయు ఎంతటి నవ్వుపుట్టించు సంవిధానము. శర్విలకుని

దొంగతనపు చేష్టలు అన్నియు ప్రత్యక్షముగా అగపడుచు మైత్రేయుని సువర్ణభాండముం గొనిపోవు వఱకు ప్రతిదియు హాస్యజనకమే. వీరకచందనకుల జగడము ఎంత హాస్యజనక సందర్భమో మాటల హాస్య ప్రస్తావమునం జెప్పఁబడినది. చందనకుఁడు కర్ణాటకలహము (గిల్లి జగడమురేఁపి తా నవ్వకుండుట) పెట్టుకొందునని తా దాక్షిణాత్యుఁడనియు, తమ దేశపువారి మాటలలో లింగవచనముల పొరబాట్లు లెక్కసేయఁ దగవు - అవి సాధారణము, ప్రచురము అనుటయు - ఆర్యకుని వసంతసేనగా అందుండి తప్పించి దాఁటిపోనిచ్చుటయును హాస్యజనకమే. ఇది ఠాణాదారుల నైజమున నుండు హాస్యము, సత్యాసత్యములు అసత్యసత్యములు చేయుట.

మైత్రేయుఁడు అధికరణమునకు వచ్చి అందు శకారుని తప్పుడు వ్యవహారమును విని చారుదత్తుని నిరపరాధతయు శకారుని దౌర్జన్యమును మనసున శకారునిపై రేఁపిన కోపమున వానిని తన వంకరకఱ్ఱతో కొట్టఁబోయి, కొట్టి, తాను వాని దెబ్బలు తిను నాకలహసంభ్రమమున సంకనుండి సువర్ణభాండమును క్రిందపడవైచుట ఒక్కట హాస్యమును ఒక్కట నంతకన్నను ఆసువర్ణము చారుదత్తుని మీఁది ఫిర్యాదును తిరుగులేక రుజువుచేయున దగుటచే జాలిదుఃఖములను కలిగించిన సందర్భము హాస్యముతో ఆరంభమై అత్యంతదుఃఖముతో ముగియుట యందును దాఁగని హాస్య మున్నది.

వసంతసేన బ్రదికి లేచివచ్చి చారుదత్తుం బ్రదికించి, ఇంతలో పితూరియు నెగ్గి పాలకుఁడు హతుఁడై, ఆర్యకుఁడు రాజై, ఆతని యాజ్ఞం గొని పితూరీనాయకుఁడు శర్విలకుఁడు చారుదత్తుందటిసి ఆ నాయికానాయకులను దొరయు దొరసానియుం జేయుటయు ధర్మవిజయాధర్మపరాజయ ప్రతిష్ఠకలుఁగుటయు, మూఁగిన సకలప్రజయు పెడఱెక్కలు విఱిచి కట్టి తేఁబడిన శకారుని 'చంపుడు' అని ఒక్కగొంతున అఱచుటయు, వసంతసేనయు చారుదత్తుని మెడనుండి యాకరవీరపుపూలదండను తివిచి శకారుమెడపైకి విసరుటయు శకారుఁడు దిక్కుతోఁపక ఆ వసంతసేననే నన్ను కావవే లంజెకూతురా, ఇదిగో నీపాదాలలో వ్రాలుచున్నాను ఇఁక మరల నిన్ను చంపనె అనుట ఒక నవ్వులగొల్లుం గలిగించునది.

చండాలుఁడు చారుదత్తయ్యా. సరిగా మెడచాపు. భయపడకు, త్రుటిలో తెగవేయుదునుతే - అని కత్తి యెత్తం బోవుచు అఁగుట, మునుపు మానాయన

ఒక కత చెప్పినాఁడు - ఓరీ తటాలున చంపకు. క్షణము ఆఁగు. ఇంతలో ఏదేని కారణము కలుగవచ్చును వధ్యుఁడు విడుదలయై పోవుటకు - అనుటయు ఆఘోరాన కొంత హాస్యచమత్కారకారియే.

అరరే, ఇది యెటువంటి హాస్యజనక సందర్భము! శర్విలకుఁడు మదనిక నిష్క్రియమునకు వసంతసేన యుంచిన యిల్లడనే దొంగిలుటయు, దానిని కనిపట్టి మదనిక అది కానిపని, సాని నగనే సానికి నిజనిష్క్రియధనముగా ఎట్లిచ్చుట, నీవు చారుదత్తుమానిసిగా వసంతసేనకు న్యాసప్రత్యర్పణము చేసినట్లు చేసిపో - అంతే, ఇట్లు మన పని కాదు, దానిదారి చెడినది యని శర్విలకుని చారుత్తుమానిసిగా నగతో వసంతసేనకడకుఁ బంపఁగా వాఁడు ఇదిగో అమ్మా, నీన్యాసము, చారుదత్తయ్య ఇచ్చి రమ్మన్నాఁడన్నట్లనుటయు, ఈసర్వము పొంచి చాటున వినుచుండిన వసంతసేన తన ప్రతి సందేశముంగొనిపో అనఁగా ఇఁక మరల నక్కడి కెవరు పోవుదురు అని గొణుగుకొనుటయు, అంతట తడవుకొనక నిజౌదార్యము మెఱయ, అట్లైన ఇదిగో ఈమదనికను నీవు గ్రహించు, దీనిని నాకు తెచ్చి యిచ్చిన వానికి మదనికను ఇమ్మన్నాఁడు నన్ను చారుదత్తయ్య యనుటయు శర్విలకుని తెలిసిపోయితినే అను వైలక్ష్యమును, మదనిక దొరకిన సంతోషమును, కృతజ్ఞతయు, మదనికా శర్విలకుల యాదాంపత్య పర్యవసానమును - ఈ సందర్భమెల్ల ఇంత యని కొలువఁదగిన హాస్యమా!

ఇట్లు మహాకవి ఆదినుండి అంతమువఱకు సందర్భములం బిగియు మనసును సుకముగా సడలించు హాస్యంపుఁ బెనుజాలును అలలతో పాఱించి యున్నాఁడు.

## ౬. నాటకమున స్థలకాలములు

నాటక కథ యంతయు ఉజ్జయినీ నగరముననే - దాని యాయా భాగములందే జరుగును.

I. మొదటి యంకము - చారుదత్తుని యిల్లు - దాని వీధి - అందు జరుగును. శకార విట చేటులు ఆవీథిలో వసంతసేనం దఱుముదురు. వసంతసేన చారుదత్తునింటి దిడ్డివాకిటిగుండ లోపలి ముంగిటికిం జొచ్చును. అంతయు అక్కడఁ జరుగును - అందుండి ఆవీథిలోనే వసంతసేన యింటికి అందఱు పోయి మైత్రేయ చారుదత్తులు చారుదత్తునింటికి మరలుదురు.

II. వసంతసేన యిల్లు - వీథియోరగా వసంతసేనగది. ఆవీధిలో జూదరుల జగడాలు సంవాహకుఁడు ఇంటి లోపల చొచ్చి రక్షితుఁడై వెడలిపోవును. కర్ణపూరకుఁడు వచ్చి తాను ఏనుఁగును అణఁచి తఱిమినకథం జెప్పుచో చారుదత్తయ్యం బ్రస్తావించుట, ఆవీథిం బోవువానిని వసంతసేన యింటినుండియే మిద్దెమీఁది కిటికీగుండ చూపుమేర దాఁట చూచి సంతోషించును.

III. చారుదత్తునియిల్లు - మైత్రేయ చారుదత్తులు ప్రవేశించుట. చారుదత్తుఁడు తన పడకగదికిం బోవును. మైత్రేయ రదనికా వర్ధమానకులు తమతమ చోటులం బండుకొందురు. శర్విలకుని కన్నము, ప్రవేశము, వాఁడు ఇంటిలో నలుప్రక్కల తిరిగి వెదకుట - బంగారుం గొని కన్నముగుండ వెడలిపోవుట. తక్కిన దంతయు ఆయింటనే.

IV. వసంతసేనయిల్లు - వసంతసేనగది - ముంగిలి, ఒక తట్టు కామదేవుగది వాకిలి, మదనికా శర్విలకులు తమపనినై వెడలిపోవుదురు. ఇంతలో మైత్రేయుఁడు వచ్చి వసంతసేన బంగళా ద్వారము చొచ్చి, అందుండి యెనిమిదిలోగిళ్ళను చూచుచు దాఁటి వసంతసేనగదికిం బోయి - సందేశము జెప్పి రత్నమాల ఇచ్చి, ప్రతిసందేశముం గొని. అందుండి వెడలిపోవును.

V. చారుదత్తునిల్లు - చారుదత్తుఁడు వృక్షవాటికలో తడిసి పొక్కిన చెమ్మగోడచెంత క్రక్కదలిపోయిన నెలకట్టున గుంజల మీఁది చాందినిక్రింద కూర్చుండియుండును - మైత్రేయుఁడు తఱియును. వసంతసేన చేటుఁడును; వానిచే వసంతసేన తెలుపఁబడును, వసంతసేనయు విట ఛత్రధారిణులతో వానలో ఆవీథిలో వచ్చి, చారుదత్తువాకిటనే తక్కిన వారిం బంపి, తాఁ బ్రవేశించి చారుదత్తుం గలసికొనును అందఱును అందుండి లోపలికి నిష్క్రమింతురు.

VI. చారుదత్తునింటనే ఆరంభము - వసంతసేన అందుండి నిద్రలేచి, జీర్ణపుష్పకరండకోద్యానమునకుం బోవ ముస్తాబగును. వర్ధమానకుఁడు బండిని తెచ్చి మరల వెనుకకు పోవును. ఇంతలో సంస్థానకచేటుఁడు తన బండిని దిడ్డివాకిట నిలిపి, దారిలో అడ్డముగానున్న బండ్లను తొలఁగింపఁ బోవును. ఇంతలో వసంతసేన సొగసు ముగించుకొని వచ్చి తెలియక ఆబండిలో ఎక్కి కూర్చుండును. ఇంతలో ఆచేటుఁడు వచ్చి బండిలో ఎవరో ఎక్కినది యెఱుఁగకే తోలుకొని పోవును - ఆపుష్పకరండకమునకే - ఇంతలో కారనుండి తప్పించుకొన్న యార్యకుఁడు దాఁగుటకు వాకిలి

తెలిపియున్న చారుదత్తునింటఁ జొచ్చి దిడ్డివాకిటికి వచ్చి అక్కడికి అప్పుడే వచ్చిన చారుదత్తుని బండిని ఎక్కి దాఁగును. ఎడ్లఁ ద్రుళ్లున పెనుమరలి చూడలేక ఆర్యకు కాలి సంకెలమ్రోఁతను అందెల రవళిగా భ్రమసి వసంతసేనయే యెక్కిన దని బండిం దోలుకొని పోవును. ఇట్లు ప్రవహణ విపర్యాసము - చారుదత్తుని యింటి దిడ్డివాకిటి చెంత. బండి కొంత సాఁగఁగా పోలీసుల సోదా, ఐ దాఁటిపోవును.

VII. పుష్పకరండకోద్యానము - మైత్రేయసహిత చారుదత్తుఁడు బండిలో ఆర్యకుం జూచి, అబ్బురపడియు, సంతోషించి, స్నేహము కలిపి, సంకెల యూడ్చి, ఆబండిలోనే భద్రముగా తనయిల్లు చేరుమని ఆర్యకుం బంపి, తాను, పోలీసులు చూతురో అని, అందుండి త్వరగా ఇంటికి మరలును.

VIII అపుష్పకరండకమే. విటుఁడు వల దన్నను శకారుఁడు శ్రమణకుం దన్ని పొమ్మనును. ఇంతలో సంస్థానకుని బండిలో వసంతసేన దిగును. చేట విట శకార వసంత సేనల సమాగమము. చేటవిటులఁ దొలఁగించి శకారుఁడు వసంతసేనను గొంతు పిసికి చంపి ఆకులం గప్పి దాఁచును. మరల వచ్చిన యాయిరువురు తొలఁగింపఁబడుదురు, శకారుఁడును నిష్క్రమించును. శ్రమణకుఁడు గుడ్డను ఎండవేసికొన నచటికి వచ్చి, ఆకులలో వసంతసేనం గనిపట్టి బ్రదికించి లేపి, చేరువ తన మఠమునకు కొంపోవును.

IX. ఉజ్జయిని యధికరణమండపము. దాని పచ్చిక ముంగిలి బయలు. మండపాన పిర్యాదు విచారణ.

X. ఉజ్జయిని రాజమార్గము — దక్షిణ శ్మశానమునకుం బోవునది. చారుదత్తు వధయాత్ర - జనులగుంపు. శ్మశాన పరిసరము - వసంతసేన చారుదత్తుల కలయిక. ఒకతట్టుధూత అగ్నిలో ఉఱుకుటం దప్పించుట. ఎల్లర సమాగమము' ముగింపు శుభము.

## ౭. కాలగమనము

I. అంకము - చైత్రబహుళ షష్ఠి ప్రాంతము. - అది బహుళ మేల యన కామదేవాయత నోద్యానము అనఁగా యాత్ర, తిరునాళ్ళమొదలు వసంతసేన చారుదత్తునిపై మరులుగొన్నది యని దానికి సాక్షి శకారుఁడు అసూయతో పలుకుచున్నాఁడు.

మఱియు మదనిక రెండవయంకము మొదట ఎందులకో ఆ కామదేవ యాత్రలో వసంతసేన చారుదత్తు శరణుఁజొచ్చి అతనిచే అభ్యుపపన్నయైనది అనును, అప్పుడే వారికి తొలిచూపులు, చక్షుఃప్రీతి. అది మదనత్రయోద(చతుర్)దశి, శుక్లము, కావున ఇది చైత్రబహుళము. మఱియు ఇది ప్రదోష సమయము - ఏలయన పగలంతయు ఎక్కడనో తిరిగి సంజకు చారుదత్తునింటికి మరలు మైత్రేయుఁడు అప్పుడే వచ్చినాఁడు. [ప్రస్తావనయు ఆసాయంకాలమే - రవంత ముందు - దినమంతయు సంగీతము పాడి సూత్రి యలసి నాలుగు మెదుకులు దొరకునా అని ఖటఖటపడు కనులతో అతని యింటికిం బోయినాఁడు. అక్కడ నతని భార్య నటి ఏదియో వ్రతపారణవంటల ప్రయత్నాన ఉన్నది. ఇక్కడ చారుదత్తు నింటికి మరలుచున్న మైత్రేయుని వారు బ్రాహ్మణునిగా నిమంత్రింపఁ గోరిన, వాఁడు ఒప్పుకొనఁడు - నాకు వేఱు పని యున్నది యనును, ]

చారుదత్తుఁడును సంధ్యాజపమునకుం గూరుచుండి ముగించును - వీథిలో గృహదేవతల సందెబలి పెట్టుమని రదనిక తోడున దీపపు వెలుతురుతో మైత్రేయుం బంపును, అంతియ కాక శకారాదులు వసంతసేనం బట్టుకొనం దఱుముట ప్రదోషముననే - అపుడు వసంతసేన చారుదత్తు నభిసరించుచుండినది. అభిసరణము ప్రాయికముగా ప్రదోషముననే, ఇంతలో కృష్ణపక్షపు సందెచీకటి, మిన్ను కాటుకవాన కురియుచున్నట్లున్నది. వసంతసేన శకారుం దప్పించుకొనుటకు చారుదత్తు దిడ్డి వాకిటం జొచ్చి ముంగిట నిలిచి చారుదత్తునికి రదనికాభ్రాంతి కలిగించినది. అక్కడి యా సమాగమము ముగిసి చారుదత్తుఁడు వసంతసేనను ఇల్లుచేర్ప తోడు బయలుదేఱు నప్పటికి దారికి దీపాలు అక్కఱ లేక 'రాజమార్గప్రదీపము' చంద్రుఁ డుదయించి నాఁడు. కృష్ణపక్షము, కావున అప్పుడు రాత్రి యెన్ని గంటలు కావచ్చి యుండునో,

ఇట పాఠము ఇరు దెఱంగులుగా నున్నది — సిద్ధీకృత దేవకార్యస్య' 'షష్ఠీవ్రత కృత దేవకార్యస్య' అని. ఇదేమో కృష్ణపక్షము, సాధారణముగా శుక్లషష్ఠియే వ్రతాచరణకుఁ గొనఁబడును. అన్ని శుక్లషష్ఠులును వ్రతదినములే, మార్గ శీర్షముం బోని కొన్ని నెలలది విశేష మగుఁగాక, దొంగ చొచ్చిన దినమునకుం బూర్వము వచ్చినది, రత్నషష్ఠి అట్టిది. న్యాసప్రత్యామ్నాయముగా తన రత్నమాలికను చారు దత్తుఁడు తనవలన నంగీకరింపఁడు - అని ధూతాదేవి అందులకు జిత్తుగా మొన్న రత్నషష్ఠి, తాను ఆవ్రతము పట్టితిని, నాఁడు సరిగా బ్రాహ్మణునికి పెట్టలేదు. దానఁ గలిగినదేమో ఈయనిష్టపు దొంగతనము, అన్న సూచనగా "......బ్రాహ్మణః

ప్రతిగ్రాహితవ్యః; సచన ప్రతిగ్రాహితః, తతః తస్యకృతే ప్రతీచ్ఛ ఇమాం రత్న మాలికాం' అని మైత్రేయునితో అనును. అది పొసఁగఁబోలును. మఱి యీకృష్ణషష్ఠిం గూర్చి యెట్లో. 'కృష్ణప్రదోషమని వేఱువిధాన తెలియు చున్నది. రాత్రి యెంతయైనదో ఊహించుకొనఁదగును - చంద్రోదయముచేత. షష్ఠిప్రాంతము కానోపును.

మొత్తమునకు మొదటి యంకము 3, 4 - గంటలు పట్టియుండును. దినము వేళ ఒకపాటి నిశ్చయమైనది. మఱి యిది యేఋతువు? అదియు నిశ్చయమైనట్లే. చైత్ర బహుళ షష్ఠి ప్రాంతము కావున వసంతర్తువు - చైత్రమాసము - చారుదత్తునికి మిత్రము జూర్ణవృద్ధుఁడు జాజులవాసన ప్రావారకముం బంపెనే. 'నస్యా జ్జాతీ వసన్తే' అని కలదుగదా యన్న, అది జాజియత్తరు పట్టించిన దగును. అత్తరు పట్టించిననే ఉత్తరీయము చక్కఁగా వాసనకొట్టును గాని, జాజిపూలు అందు ముడిచినను అట్లు నిలిచి కమ్మటివాసన కొట్టదు. వాసంతాతపము తీక్ష్ణముగా నుండును. అపరాహ్ణమున ఇంటిలోపల ఉక్కఁగా నున్నందుననే శ్రోహసేనుఁడు 'మారుతాభిలాషి' యై బయట పరుండి నిద్రించినాఁడు, ప్రదోషమున ఉక్క తీఱి మలయము మళ్ళి చల్లఁగా నుండుటయే కాక చైత్రవిభావరులు మంచుఁగలిగియు నుండుటచే చలి యెక్కువగా నుండును, ప్రావారకమునం గప్పి వానిని లోపలికి కొనిపోవలసినది యని చారుదత్తుఁడు ఉత్తరువు చేసినాఁడు.

> 'ఉడుగణై రుదయోన్ముఖచన్ద్రికా
> గతహిమై రివ చైత్రవిభావరీ.' మాళవిక.

'గత హిమైః' మంచుకమ్మిన - నునుమంచు చైత్రవిభావరిచెలువకు పైరాదుకూలమువలె నుండును - అని వేమ. వివరణము.

> 'ఈషత్తుషారైః కృతశీతహర్మ్యే-'

అనియు ఋ. సం. న కాళిదాసే. దాననే చైత్రముననే ప్రదోషసమయశీతార్తః' అనియు. అనేన ప్రావారకేణ ఛాదయైనం-' అనియు, చారుదత్తుఁడు సూచించినాఁడు.

II. రెండవయంకము దాని మఱుపటిదినము. ఉదయమే అగును. నిన్నటి సందెరాత్రుల చారుదత్తుని యా సమాగమముం దలఁచుకొనుచు విరాళిచే పరధ్యానముగా నుండి వసంతసేన తన చేటికి మదనికకుం దెలిసిపోవును. అప్పుడు 8 - 9 గంటలప్పుడు అజూదరుల జగడము - సంవాహకుఁడు వసంతసేన యింట ప్రవేశించును - అతని నిజ

చారుదత్త దాస్యప్రస్తావము - అతఁడు చారుదత్తు గుణములం బొగడుట, అది వసంతసేనకు అప్యాయముగా నుండుట. శ్రమణకుఁడ నయ్యెదననుచు అతఁడు నిష్క్రమించుట, కర్ణపూరకుఁడు కట్టుతెంపుకొన్న యేనుఁగును సమాళించి శ్రమణకుం గాఁచుట, దారిం బోవుచున్న చారుదత్తుఁడు దానిం గాంచి మెచ్చుకొని జాజులప్రావారకమును వానికి ఇనామిచ్చుట, దానిని తెచ్చి వసంతసేనకుం జూపఁగా చారుదత్తు నాకప్పడమును తాఁగొని వానికి వేఱు ఇనామిచ్చి సంతోషపెట్టి, చారుదత్తు స్పృష్ట స్పర్శకు ప్రియాలింగనమునకుంబోలె సంతోషించుచు, చారుదత్తుఁడు అవీథినే తన యింటి ముందఱగా ఎఁదుండియో పోవుచున్నాఁడనఁగా వసంతసేన మిద్దెయెక్కి కిటికీగుండ చూచి కన్నులందనుపు కొనుట - అంతయు పూర్వాహ్ణము 10 గంటల లోపల నగును.

III. చారుదత్తుఁడు పాటకచ్చేరినుండి మరలు నపుడు అర్ధరాత్రి దాఁటుచున్నది. అతని చేటుఁడు ఇంట నున్నవాఁడు 'అతిక్రామతి అర్ధరజనీ' అనును. చారుదత్తునికిని దారిలో చంద్రాస్తమయము అగును. iii. 6, 10. ఇది శుక్లనవమి - వైశాఖ మైన ii కి iii కి నడుమ 17, 18 దినాలు జరుగును. మైత్రేయుఁడు ఎన్నాళ్ళు ఈపాడు సువర్ణభాండమును నేను గాఁచుట అనును. మైత్రేయ చారుదత్తులు ఇంటఁ జొచ్చి వారివారి చోట్ల నిద్రింతురు. అనంతరము చంద్రుఁడు క్రుంకి చీకటి పర్వుటం జూచుకొని, శర్విలకుఁడు కన్నము వేయుట, తన పని ముగించుకొని పరారియగుట. కావున ఇది శుక్లపక్ష రాత్రి, నవమి దశములు గాఁబోలును. ఇన్నాళ్ళును సువర్ణ భాండమును చూచుకొనవలయుటచే మైత్రేయునికి నిద్రాభంగముగా నున్నదనుటచే ఆపాటికాలము జరిగియుండును దొంగతనముం గూర్చి చారుదత్తాదులు కలసి యన్నియు మాటలాడుకొని యగునప్పటికి తెల్లవాఱ వచ్చినది - వర్ధమానకుని కన్నము చక్కఁగా మూయుమని, చారుదత్తుఁడు మైత్రేయుని ఇఁక నెచటికైనం బోవువానిని, నాఁడు అరత్నహారముతో వసంతసేనకడకుం బొమ్మని, పంపి, తాను శౌచము తీర్చుకొని సంధ్యావందనము చేసికొనం బోవును.

IV. ఆమఱునాటి యుదయము. వైశాఖ శుక్లదశమికాఁబోలు, శర్విలకుఁడు వసంతసేన యింటికి 8, 9 గంటలకు సువర్ణభాండముతో పోయియుండును. అక్కడ మదనికబేరము తీర్మానమై అవధూవరులు 10గ. కు అందుండి బండిలో తరలి యుందురు, ఇంతలో పూర్వాహ్ణముననే మైత్రేయుఁడు వచ్చి, వసంతసేన బంగళాను

చూచి యబ్బురపడి వసంతసేనం గలసికొని, రత్నాలహారమును ఒప్పించియిచ్చి 'నేను సాయంకాలము చారుదత్తుం జూడవత్తు' నన్న వసంతసేన సందేశముం గొని చారుదత్తునికడకు మరలును.

V. ఆసాయంకాలపుఁ బ్రదోషమే. వైశాఖసాయంకాలపు టాకస్మికపు మెఱుముల యుఱుముల గాలుల పెద్దవాన. అందులోనే వసంతసేన యభిసరణము. వసంతసేన చారుదత్తుంగూడును. బయట వానగా నున్నదని లోపలికి అందఱును పోవుదురు. వసంతసేన ఆరాత్రి చారుదత్తునితో ఆతని యింట గడపును.

VI. మఱునాటి యుదయము. — వసంతసేన రోహసేనుని 'మృచ్ఛకటిలో' సువర్ణభాండమును - తన బంగారు సొమ్ములను పెట్టి యిచ్చి. తాను సొగసు చేసికొని ముస్తాబు ఐ, చారుదత్తునింటి దిడ్డివాకిట పొరపాటున స్థావరకచేటుని బండిలో ఎక్కిపోవును. ఇంతలో ఆర్యకుఁడును చారుదత్తు నింటఁ జొచ్చి, దిడ్డివాకిలి చేరి, అక్కడ వర్ధమానకుఁడు తెచ్చిన చారుదత్తుని బండిలో ఎక్కి పోవును. ఇది ప్రవహణవిపర్యాసము. 8 గంటలు కావచ్చియుండును. దాని దారిలోనే వీరకచందనకులు ఆ బండిని ఆఁపి సోదాచూచుచు జగడ మాడుకొని అంతట బండిని వసంతసేన కూర్చుండియున్న చారుదత్తయ్య బండి యని తీర్మానించి రహదారి రాజవీథిలో పోనిచ్చును, 10 గంటలు ఐయుండును, పూర్వాహ్ణము, శుక్ల - ఏకాదశి కాఁబోలును.

VII. పుష్పకరండకోద్యానమున ఆర్యక చారుదత్త సమాగమము. మైత్రీనిబంధనము. చారుదత్తు నాశీస్సుతో ఆర్యకుఁడు ఆబండిలోనే తన యింటి తట్టు పోవుట, చారుదత్తుఁడు ఆరాజ వ్యళీకమునకు భయపడుచు ఇఁక నందుండఁగూడదని, వసంతసేనా దర్శనోత్సుకుఁడుగా ఇంటికి వడిగా మరలును. పూర్వాహ్ణము 1 , 11 - 30. గంటల ప్రాంతముగా నుండును,

VIII. పుష్పకరండకోద్యానమే, మట్టమధ్యాహ్నము కావచ్చినది, స్థావరకచేటుని బండి చేరును. వసంతసేన దిగును. చేట విటులం దఱిమివేసి శకారుఁడు వసంతసేనను మెడనులిమి ఆకులు కప్పి దాఁచి, ప్రాకారముదాఁట దూఁకి తన యింటికి వెడలును. శ్రమణకుఁడు ( సంవాహకుఁడు ) వచ్చి వసంతసేనను మూర్ఛ తేఱుచున్నదానిని లేపి ఓదార్చి మెల్లగా చెంగటి తన మఠమునకు కొనిపోవును.

IX. మఱునాటిదినము — ప్రాతఃకాలము - శకారుఁడు అధికరణమండపమున నాఁడు అదే తొలి ఫిర్యాదుగా వసంతసేనఖూని చారుదత్తుని మీఁద తాను దాఖలు

చేయును. ఫిర్యాదు విచారణ ముగియునప్పటికి పూర్వాహ్ణము ముగియవచ్చును. చారుదత్తునికి వధదండన విధింపఁబడును. అతఁడు వధ్యకు కొనిపోఁబడును. వైశాఖ శుక్ల ద్వాదశి (?)

X. రాజవీధి — నాఁటి యపరాహ్ణమే, నేరము దండన చాటింపుతో చారుదత్తుని వధయాత్ర. చుట్టురా జనుల పెద్దగుంపు - దక్షిణశ్మశానము చేర కొనిపోఁబడును. వసంతసేనరాక. చారుదత్తునితో సమాగమము. పాలకరాజహత్య. శర్విలకుఁడు చారుదత్తునికి క్రొత్తరాజు బహుమానము సమర్పించుట. చారుదత్తుఁడు శరణాగత శకారుని ప్రోచి విడిచి, ధూతాదేవిని నిప్పులం బడనీక వారించి అందఱితోడనుం గలసికొని జమీందారగుట. నాఁటి సాయంకాలమున కథ ముగింపు.

## ౮. మృచ్ఛకటిక ప్రయోగము

ఈ నాటకము కడుదీర్ఘము. ఉన్నది యున్నట్లుగా ఒక్క రాత్రి ప్రయోగింపనసాధ్యము. అట్లు ప్రయోగింపఁగోరువారు నాటకమున ఎంతయో కత్తిరించి వైచి కథకు వెలితిరానీయక తయారు చేసికొనవలయును. నాటకము అధ్యర్ధయామ ప్రయోగ పర్యాప్తముగానున్న లెస్సయగును అని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారు తమ యుషానాటకమున సూచించినారు. శాకుంతలాదులంగూడ అంతగా అనతిదీర్ఘములైనవానినే, ఇచ్చ మెయి ప్రధానములకు చాలమి రాకుండునట్లు కత్తిరించుకొమ్మని వారు తమ శిష్యులకు నాటక సమాజముగాఁ గూడి యాడఁగోరినవారికి హితవును నదుపాయమును చెప్పుట కలదు. తమ రచించిన ప్రతాపరుద్రీయ నాటకమును ఏకరాత్రమునకు అతిదీర్ఘమైనందున, సగ మొక రాత్రియు (తొలి యారంకములును) మఱియొక సగమొక రాత్రియు (ఏడవ యంకము మొదలు నాలుగంకములును) ఆఁడవచ్చు ననియు, అట్లు గాక ఒక్కరాత్రియే ప్రయోగింపఁ గోరికయేని యీ యీ యంకములు మాత్రము ప్రయోగింపఁ దగుననియు ఆనాటకము పీఠికలో తెలిపియున్నారు. అట్లే బొబ్బిలియుద్ధమునకును ఒకరాత్రికి కత్తిరింపులు సూచింతురు. ఏకారణముననను దైర్ఘ్యము ద్రష్టలకు విసుకు పుట్టింపఁ గూడదు. దాన నాటకము రక్తిం గోలుపోవును. కావున ఈ మృచ్ఛకటిం బ్రయోగింపఁ గోరువారు, దాని నెంతయో కత్తిరించుకొనఁ దగును. కాదా రెండురాత్రుల, తొలియైదంకములు ఒక రాత్రియు, ఆఱు మొదలు మిగిలినవి ఒక రాత్రియు, ఆడఁదగును,

సంస్కృతనాటకమున ఒక యంకము ఒక్క 'సీను' అన్న శాస్త్రనియమము గలదు. కాని యెన్నియంకములో అన్ని 'సీనులు'గా విడదీయఁదగినట్లును, అట్లు చేయ కున్న ఒకతట్టు కొందఱు భాషితములు పలుకుచు వ్యాపృతులుగా నుండ, ఒక తట్టు కొందఱు తమ్ము వారు తమతో కలుపుకొనునంతవఱకు నిర్భాషితముగా నిరభినయ ముగా నుండవలసి యేర్పడు ఘట్టము లుండును. అతివిశాలస్థలమున చిన్నస్థలము లను విడదీసికొన్న బాగుగా నుండునని తోచునట్లును ఉండును, శ్రీ శాస్త్రిలవారు తమ శాకుంతలానువాదమున అంకాలలో స్థలక (సీను) విభాగముం జేసి చూపి యున్నారు.

మన యీకాలమున నాటకశాలలు, ప్రక్కపరదాలు, నడిమిపరదాలు, ఎలెక్ట్రిక్కు యంత్రాలు దీపాలుమొదలైన వాని సాయము కలిగి యుండుటచే నాటకములను సీనులుగా భాగించుకొని మృచ్ఛకటికంబోనిదానిని చక్కఁగా నిపుణముగా ప్రయోగింపఁదగును. కాని భరతముని చెప్పిన ప్రేక్షాగృహములలో, వానిని ఇమిడ్చి ప్రయోగించుట ఎంతయు కష్టముగా నుండి యుండును, కాళిదాసు తన శాకుంతల ప్రయోగముం జూచుటకును భవభూతి తన యుత్తరచరిత ప్రయోగమును చూడను ఎంతేని ఉవ్విళులూరిరని వాననే ఊహింపఁదగియున్నది. అవి అధ్యర్ధయా మమున నిముడ్ప నెంతో క్లేశము కలిగించునవి. మఱి మనకు ఇపుడు ఆక్లేశముల యాలోచనయు, వానిని పూర్వులు ఎట్లు దాఁటిరి అను చింతయు పెట్టుకొనుట ఏమియు ప్రయోజనకారి కాదు. అది చరిత్రాన్వేషక కుతూహల పూరణమాత్ర ప్రయోజనము. ఎట్లెట్లో క్లేశపడియే ప్రయోగింపవలసియు, లేకున్న మానుకొని నాటకమును దృశ్యమునే ఊరకచదివి విని తృప్తిపడవలసియు నుండియుండును, ఈకాలమున మృచ్ఛకటికమును అట్లట్లు సినీమాతెరపైకి ఎక్కింపను ప్రయత్నము జరుపఁబడుచున్నది.

ఈనాటకకథ యల్లికలో జూదరులవృత్తము, ఆర్యకాధికృతమగు పితూరి వృత్తము, శర్విలకమదనికలది, శకారుని వసంతసేన ఖూని ఫిర్యాదు వ్యవహారము - ఇత్యాదులు చక్కఁగా పొందుపడక వాని యదుకులు అగపడుచున్నవను విమర్శలు కొన్ని కలవు. ఇవన్నియు ఎంతయు చక్కఁగా పొందుపడనే పడినవని పూర్వము అంగాంగి సంయోగ విచారమున నిరూపితము. మాళవికకాళిదాసు శాకుంతల కాళిదాసుకన్న వేఱనియు, మాలతీ మాధవమున కపాలకుండలాంకము మాధవ విరహ విలాపాదికము అదు కగును అనియు, ఇట్టి విచారములు పట్టిప్రొద్దుపోనివి, ఆంగ్ల

పండిత విమర్శల మనవారి యరగొఱజ్ఞానమునం బుట్టినవి, వానితో వృథాకాలయాపన యేల యని ఉభయ భాషా పండిత విమర్శక నిపుణులు నిర్ణయము కావించియున్నారు. మృచ్ఛకటికము ఆద్యంతము ఏకధారగా రసవంతము. 'భావో భావం నుదతి విషయాత్ రాగబన్ధః స ఏవ' అనుటకు ఎంతయుఁ దగినది.

చారుదత్తుఁడు ఆర్యకుని అట్లు తన బండిలో సాఁగనంపినవాఁడు, ఇఁక నక్కఁడ పుష్పకరండమున నుండఁగూడదు. మనుజపతికి మహావ్యళీకము చేసినం దునః చారులు చూతురేమో అని తరలుచు, మఱి కాంత వసంతసేన రాలేదే, అగపడ లేదే, ఏమైనదో అని తలపోసికొనుచునే ఆమెంజూడఁ గోరిన తహతహతో ఇల్లు చేరినాఁడు. మఱి వసంతసేన ఏమైన దన్న సంగతి అతఁడు విచారింప లేదా? తా నాదినము మట్టమధ్యాహ్నమునకు ఇల్లు చేరినాఁడు? తరువాత ఆదినము వసంత సేనం గూర్చి ఏమి చేసినాఁడు? ఇంటికి రాఁగానే విచారింపలేదా? మఱుసటి యుద యము జాముప్రొద్దెక్కునప్పటికి అధికరణమునకు పిలుపు వచ్చినది. తన్నేమో రాజు పాలకుఁడు చక్కఁగా ఎఱుఁగును. తన కులశీలములు అతఁడు చక్కఁగా ఎఱిఁగినవే, మఱి దారిద్ర్యమునం గలిగిన చులకనచేఁ గాకున్న తనకు అధికరణమునకు తటాలున పిలుపు ఏల రావలయును? ఆ తాను గావించిన రాజవ్యళీకము బయటికి పొక్కి యుండునా?— అదొక్కఁటే అతని యూహయు చింతయు. వసంతసేనం గూర్చిన చింత లేనే లేదు. మఱి యధికరణమునకుం బోఁగానే క్రొత్త కథ ఎదురుకొన్నది— 'తాను వసంతసేనను నగలకు ఆసపడి చంపితి' నన్న శకారుని ఫిర్యాదుం గూర్చి తన్ను విచారింపఁ దొడంగినారు. చారుదత్తుఁడు అంతవఱకు నిన్న మధ్యాహ్నము మొదలు వసంతసేనం గూర్చి విచారింపలేదా?

తన యేర్పాటు మేరకు వసంతసేన తన బండిలో తోఁటకు రాలేదు. ఇంటికి రాఁగానే అడిగి యుండును. చేటి తాననుకొన్నట్లు తమ బండిలోనే వసంతసేన పోయినది అని చెప్పియుండును. తాను వర్ధమానకచేటుని వసంతసేనం గూర్చి ఏల యడుగ లేదు? ఆర్యకుఁ డగపడుటయు, అది యొక గొప్పవిశేషమై చిత్తమును సర్వమును, మఱి దేనికిని అవకాశ మీయక, ఆక్రమించుకొనఁదగిన, విషయము, అది రాజవ్యళీ కము, పెద్దది. అప్పుడును తరువాతనుం గూడ చిత్తమున మఱి దేనికిని చోటు ఇచ్చునది కాదు. మైత్రేయుఁడు తోఁటలో అడిగినాఁడు అగపడఁగానే వర్ధమానకుని, ఏలరా ఇంత యాలస్యము అని. దానికి వాఁడు బండి పఱవు మఱవు, అందులకైన

తన యాతాయాతముం జెప్పినాఁడు. ఇంతలో వారికి బండిలో అర్యకదర్శనము, మఱి ఏప్రశ్నకును అవకాశము లేకపోయినది. వర్ధమానకుడు ఆర్యకునితో బండి తోలుకొని పోయినాఁడు. వాఁడు ఇంటికి ఎప్పుడు మరలినాఁడో. ఇంతలో చారు దత్తుఁడు చేటిని అడుగఁగా చేటి చెప్పినది. 'రోహసేనునికి నగలు ఇచ్చి తా ముస్తాబై వసంతసేన మన బండిలోనే పోయినది' అని. అది తన బండి కామికి తానే సాక్షి. మఱెవరిని ఏమి యడుగ నవకాశము?

వసంతసేనకు సొంతాన బండి యున్నది, అందే కదా మదనికా శర్విలకులం బంపినది. వసంతసేన ఆఢ్య, బహు పరిజనము కలది. తాను ఇంట చెప్పియే విటాదిపరివృతయయ్యే అభిసరణము గావించినది. వారిని పంపివేసి రాత్రి చారుదత్తు నింట నుండు తలంపు గలదు. రాత్రి చారుదత్తుని తోడి మదన వ్యాపారమునకైన సలహాను (V-36) 'సాటోపకపటావృతాదిని' ఒసంగి పోయినాఁడు, విటుఁడు. తాను మఱుసటి యుదయము వఱకును ఇంటికి రాకుందు నని వానితో చెప్పలేదు, ఎవరితోను తన వారితో చెప్పలేదు. చారుదత్తుఁడును అభిసరణము గావించి వచ్చిన వసంతసేన సురతాదియంతమున రాత్రియే యింటికి మరలుదుననునో అని రాత్రియే వర్ధమానకునితో 'యోజయ రాత్రౌ ప్రవహణమ్. వసన్తసేనా గచ్ఛతు' అని యేర్పాటు చేసెను. 'గచ్ఛతు - పోవునుగాక' అనుటను పరికింపఁదగును. ఆ యేర్పాటును చేటికిని జెప్పియుండెను. మఱి వసంతసేన రాత్రి యింటికి పోఁగోరక రతశ్రాంతయై అందే పరుండెను. చారుదత్తుఁడు తాను వేఁకువం బోవువాఁడు వసంతసేనను లేపి చెప్పక, చేటీ వర్ధమానకులకు మాత్రము తాను వసంతసేనను పుష్పకరండకమునకు పిలుచుకొని రమ్మంటినని చెప్పుఁడని చెప్పి, మైత్రేయుని చేతను వర్ధమానకునికి చెప్పించి అతనితోకూఁడ పోయినాఁడు. చూ. VII.

చారు—వయస్య, చిరయతి వర్ధమానకః.

విదూ—భణితో మయా వర్ధమానకః - 'వసన్తసేనాం గృహీత్వా లఘు లఘ్వాగచ్ఛ' ఇతి.

ఇక్కడ పుష్పకరండమునకు పోవలయుట ఈ యుదయాన తన్ను లేపిన చేటి మాటలవలన వసంతసేనకు తెలిసినది, అంతకు ముందు తెలియదు. కావున వసంత సేనకై అమ్మయో విటుఁడో చెప్పి పంపఁగా వసంతసేనబండియే వచ్చియుండును,

అందు ఇంటికి పోయి యుండును - అని చారుదత్తుఁడు న్యాయ్యముగానే తలంచి యుండును. అతని గబ్బితనము ఇంట మఱి యతనికిఁగాని ఎవరికిఁగాని ఏప్రశ్నకును అవకాశము ఈయదు.

వసంతసేనా చారుదత్తులకు ఇది తొలి కూటమి. అందులకైన సంకల్ప ప్రయత్నములు తన ప్రాగల్భ్యమున తాన చేసినను అందు కులాంగనపాటి కాకున్నను, ఈ చారుదత్తునికై మీఁదుకట్టియుంచిన తన ఎలజవ్వనమున ఈ తన కన్నెఱికమున లజ్జావామతాది యొకపాటి యుండనే యుండును. చారుదత్తుఁడు తనకు అధికరణము నకుం బిలుపు తాఁ గావించిన మహారాజవ్యళీకమునకై యుండునని యనుకొనుచునే పోవును. తన కులశీలములు చక్కఁగా ఎఱింగినవాఁ డయ్యు, రాజు తన దారి ద్ర్యముం బట్టి తన్ను చులకన చేసి పిలిపించుచున్నాఁ డనుకొనును, మఱి యిక్కడ ఫిర్యాదు ఫలానా యని తెలిసినది, తానేమో వసంతసేన తన యింటికే పోయి యుండు నని గట్టిగా అనుకొని యుండెను. అంతయే కాక, సువర్ణభాండమును రోహసేనునికి వలదని వసంతసేనకు ఇమ్మని మైత్రేయునిచేత ఇచ్చెను. తొలిరాత్రిది వారి తొలి సమాగమమే. వసంతసేనం గూర్చి వధ్యస్థానపు దారిలో చారుదత్తుఁడు ఇట్లు తలపోసికొనును.

> శశి విమల మయూఖ శుభ్రదన్తి
> సురుచిర విద్రుమ సన్నిభాధరౌష్ఠి
> తవ వదన భవామృతం నిపీయ,
> కథ మవశో హ్యయశో విషం పిబామి ?

అని. ఆరాత్రి సిగ్గునను వామతను వసంతసేనయు ఎక్కువ మాటాడ లేదు. ఎక్కువగా - అనఁగా పెల్లుగాఁగాదు, నాజూకుగా మందముగానే - మాటిమాటికి నవ్వుట యొక్కటే వసంతసేన చూపిన శృంగారచేష్ట, మోవింజూపుటయు. అవే చారుదత్తు చిత్తమున హత్తుకొన్నవి. చారుదత్తుఁడును, ఆర్యకుఁడు మగవాఁడు చూచిన మాత్రకే అబ్బురపోయిన యందగాఁడు - 'అయే! అయ మేవ ప్రవహణస్వామీ. న కేవలం శ్రుతిరమణీయః, దృష్టిర మణీ యో ఽపి!' అధికరణికుఁడును 'ఘోణోన్నతం ముఖ, మపాఙ్గవిశాలనేత్రమ్ నైత ద్ధి భాజన మకారణ దూషణానాం' అనుట ఆ రూపప్రశంస తనకు నెట్టుకొని వచ్చుటచేత. వృద్ధయు, అందంపు విషయమున గొప్ప నిపుణంపు ముద్రవేయ నేర్చినది! తనకు ప్రథమమైన ఈ దర్శనమున అనును-

అయం స చారుదత్తః! సునిక్షిప్తం ఖలు దారికయా యౌవనమ్!' అని. కావున తన రూపముననే చొక్కుచున్న వసంతసేనతో రాత్రిని తన గబ్బితనాన అంతగా మాటలు లేనియు, అయినను ఎంతయు రసికతానైపుణి మీఱినవియు నగు శృంగారకార్యములతో గడపినాఁడు. ఆపెయు 'రన్తు మిచ్ఛామి, న తు సేవితుమ్' అన్నట్టిది గదా. ఇరువురు రతాంత నిద్రలోనుండఁగా చారుదత్తుఁడు ముందుమేల్కొని, వసంతసేనకుం జెప్పకయే వెలువడి ఆపెకైన యేర్పాటును చేటికిని వర్ధమానకునికిని రాత్రియే-('యోజయ రాత్రౌ ప్రవహణమ్, వసన్తసేనా గచ్ఛత్వితి') చెప్పియున్నవాఁడు మరలవారిని ఎచ్చరించి ఇపుడు పుష్పకరండమునకు పిలుచుకొని రమ్మన్న యేర్పాటు మార్పుం జెప్పి మైత్రేయునిచేత గట్టిగా ఎచ్చరింపించి, (భణితో మయా వర్ధమానకః - వసన్తసేనాం గృహీత్వా లఘులఘ్వాగచ్ఛేతి - VII) ఆ వయస్యుం గూడి తాను తోఁటకు పోయినాఁడు. తోఁటయు నిన్నటి సందెపెద్దవానకు రామణీయక మెక్కి యెంతయో కనువిందుగా నుండును.

అతనియభిప్రాయమున, ఇంటికి దూరాన అచట నొంటిపాటున, ఇట్లే ఐనను, చాలసేపు వసంతసేనతో గడపనెంచినాఁడు. వసంతసేనయు, నిద్రు లేచి చేటింజూచి సరసోక్తిగా చారుదత్తుంగూర్చి 'ఎక్కడనే మీ జూదగాఁడు?' అనును. చేటి చెప్పును - వర్ధమానకునితో 'రాత్రి బండికట్టు. వసంతసేన పోనీ' అని చెప్పి ఇపుఁడు పుష్పకరండమునకు పిలుచుకొని రమ్మనిచెప్పి పోయినాఁడు - అని. 'పోనీ' అన్నదానిని విని, రవంత యెదపాటుదిగులుతోనే 'ఏమే - ఎక్కడికి పోవలెనే నేను' అనును వసంతసేన. చారుదత్తునికడకే (పుష్పకరండమునకే) అనును చేటి. ఆ మంచిమాటకు ఎంతో సంతోషించి, దానిం గౌఁగిలించుకొని వసంతసేన అనును 'చేటి, రాత్రి నేను చారుదత్తుని చక్కఁగా చూడలేదే. కావున ఇపుడు ప్రత్యక్షముఁగా చూతునే.' అని. అదియు న్యాయ్యమే తాను కామదేవాయతనోద్యానమునం జూచి తరువాత ఆసాయంకాలము అభిసరించి వచ్చి, చారుదత్తుఁడు ఉండుమన్నను ఉండక సువర్ణభాండము ఇల్లడపెట్టి చారుదత్తునితోడుననే పొడిచిన వెన్నెలలో తన యిల్లు చేరి అనురాగపూర్ణ ముఖరాగముతోనే వీడ్కొనినది. అంతట ఆ నగనే శర్విలకుఁడు అట్లు దొంగిలి కొనిపోయి యిట్లు వసంతసేనకు ఇచ్చినదానిం గూర్చి, జూదాన ఓడఁబడినది - దానికి బదులు రత్నమాలికం గొను మనఁగా దానిం గొని అట్లు అభిసరించివచ్చి - రత్నమాల జూదాన ఓడఁబడినది, ఇదిగో సువర్ణభాండము అని

దానిం జూపి యిచ్చి, జూదాల కథలు వట్టివి అని రదనిక మైత్రేయాదులు వసంత సేనతో గుసగుసలుపోవఁగా - నేనేమి బాహ్యుఁడనా అని ఆ యెకరారులో కలసి కొని, అంతట వానకు గాఢాలింగన పూర్వముగా లోపలికిం బ్రవేశించినారు. కావున ఈ కామునిరాయబారమున చారుదత్తుని మించిన నేర్పుచూపి జాణగా ప్రగల్భగా వచ్చినదే కాని, విటుఁడు నేర్పిన సురతపాఠమునకు 'యది కుప్యసి నాస్తి రతిః' ఇత్యాదికిని, 'సాటోప కూట కప టానృత జన్మభూమేః' ఇత్యాదికిని వసంతసేనకు పడకటింట అవకాశమే కలుగలేదని అది భోగముదానికి తగిన సలహా, కులాంగనకుం దగదని వసంతసేన తలఁచెను. నిజముగా వసంతసేన, తన యనురాగపుఁ జరిత మును తన నడువడియు వైశికమునకు దూరమైనందున తన గుట్టులను తన విట చేటి చేటికలకుం గూడ చక్కఁగా తెలియనీయలేదు. వెలయాలు తాను అట్లు శీలపుటాలు ఐనందున మనసున తగిన తెగువ ధీరత యున్నను, పడుకటింట నొకపాటి జంకు తోడి గబ్బితనము, ముగ్ధకులాంగనకన్న నెక్కువగా చారుదత్తునికిం బ్రతి యగునది కలిగియే యుండెను. చేటితో 'రాత్రి నేను చక్కఁగా చూడలేదే ఆయనను' అన్నప్పుడు ముగ్ధకులాంగనలంగూర్చిన యీకాళిదాసు సూక్తిని -

'కార్త్స్న్యేన నిర్వర్ణయితుం చ రూప
మిచ్ఛన్తి తత్పూర్వసమాగతానామ్;
న తు ప్రియే ష్వాయతలోచనానాం
సమగ్ర పాతీని విలోచనాని.' మాళ. IV.

చేమకూర వేంకటపతి సూక్తిని - (వాదప్రతివాదములు చేసి తన్ను అంగీ కరింపించుకొన్న - ఉలూపింగూర్చిన దానిని -)

ఉ. చక్కెరబొమ్మ, నావ్రతము చందము దెల్పితి, నంతె కాక నీ
చక్కఁదనంబు గన్న నిముసంబయిన న్నిలుపోప శక్యమే
యక్కునఁ జేర్ప? కంచు దయ నానతి యీఁ, దలవంచె; నంతలో
నెక్కడనుండి వచ్చెఁ దరలేక్షణకుఁ నునుసిగ్గుదొంతరల్!

తలంచుకొనఁదగును, (ఐనను వసంతసేనా చారుదత్తులు ఉలూప్యర్జునులం బోలినవారు కారు. వారు మాటలలో అతిప్రౌఢ ప్రగల్భులు.) వసంతసేనయేమో పుష్పకరండకమునకు చారుదత్తుంగూడనే పోవలయును అని, ప్రసాధనము ముగించు

కొని బండిలో ఎక్కెను. దుర్దైవయోగమున బండ్లమాఱుపాటుచే శకారుబారిం బడవల సిన దయ్యెను, చారుదత్తుఁడు నిజముగా రాజవ్యళీకమునకు ఏమగునో అనియే యనుకొనుచుండెను. మఱి తన బండిప్రస్తావముగాని మఱి వసంతసేన ఏమైనది యను సందేహముగాని తాను తొడఁగఁడు. వసంతసేన బండిలోనే పోయిన దని విని అది యేబండి మొదలగు విచారణలు అనావశ్యకమని చేయఁడు. వసంతసేన బండియే యని వాని నిశ్చయము. చారుదత్తుఁడు తన గబ్బితనాన తాను పుష్పకరం డమునకు పోవుదము అని ఆపెతో అనన్లే వసంతసేనయు తన గబ్బితనాన తా నింటికి పోఁగల నని తనతో చెప్పలేదు. ఆరాత్రికైన యభిసరణమేగదా ఆపె చేసి వది. కావున వసంతసేన మరల కలసికొందములే యని ఉదయము తన బండిలో తన యింటికి పోయిన దని గట్టిగానే అనుకొన్నాఁడు. రోహసేనుని కిచ్చిన నగలను వసంతసేనకు ఇచ్చివేయు మని మైత్రేయుని చేతి కిచ్చివేసినాఁడు. మఱి యీకథలో, ఇట్లనుకొనుటలో, చారుదత్త వసంతసేనల నడువడి ఋజువుగాను వారిస్వభావములకు ఎంతేని అనుగుణముగానే ఉన్నది. సర్వమునకు చక్కఁగానే సందేహముల కవ కాశము లేనట్లే సూచనలు కలిగియున్నవి. మఱి దీనిం గూర్చి మృచ్ఛకటి యాంగ్ల టీకాకారులు ఎంతెంతో నిజమునకు మూరెడు బారెడు ఎడసిన విచారణలు చేసి యున్నారు. వట్టి వృథ.

## ౯. మృచ్ఛకటిక రచయిత, కవి యెవరు?

ఆ పాతముగా ఈ ప్రశ్నకు అవకాశము లేదు. ప్రస్తావనలో సూత్రి కవిం గూర్చి స్పష్టముగానే శూద్రకుఁడు, ఇట్టిట్టివాఁడు అని రెండు మూఁడు శ్లోకములలో సమగ్రముగానే చెప్పినాఁడు. ద్విరదేంద్రగతి, చకోరనేత్రుఁడు, పరిపూర్ణేందు ముఖుఁడు, సువిగ్రహుఁడు (= అందగాఁడు) ద్విజముఖ్యతముఁడు (= క్షత్రియుఁడు), ప్రథితుఁడు, అగాధసత్త్వుఁడును, ఋగ్సామవేదములను, గణితమును, వైశికి కళను, హస్తిశిక్షను ఎఱింగినవాఁడు, కన్నుల తిమిరరోగమును శర్వప్రసాదమున మాన్పకొన్నవాఁడు, కొడుకును సింహాసన మెక్కించి తాను అశ్వమేధము చేసి నూఱేండ్ల పదిదినములు బ్రదికి, తానే అగ్నిం జొచ్చినాఁడు. జిగీషచే యుద్ధముల కెంతయు ఆసగొనువాఁడు, ఎందును ప్రమాదము (=పొరపాటు) ఎఱుంగనివాఁడు, మఱి వేదపండిత శ్రేష్ఠుఁడు, తపఃసంపన్నుఁడు, శత్రుల యేనుఁగులతో బాహు

యుద్ధమున కెంతయు ఉవ్విళులూరువాఁడు. అట్టి వాఁడు దీనిని చేసినాఁడు - అని. మఱి యిన్ని వివరములు చెప్పినను అతఁడు ఏదేశపురాజో ఇందు చెప్పఁబడలేదు. ఆలోప మొకఁడే ఎన్ని సందేహములో లేపును.

ఈ యొక్క లోపముచే ఆరాజు దేశ కాల నిర్ణయము చేయు టెట్లు? ఇంత తెలిసియు, అతనింగూర్చి ఏమియు తెలియనట్లే అగును. లెవి (Levi) యను పండితుఁడు 'ఇండియా నాటకరంగ' మను తన గొప్ప గ్రంథమున ఈ శూద్రకుంగూర్చి టూకీగా నైనను సమగ్రమని తోచునట్లే ఇట్లు చెప్పియున్నాఁడు. 'శూద్రకనామము బహు గ్రంథగత మైనను, ఇంచుకయు దేశచరిత్రలో తగులకయున్నది. విక్రమాదిత్యుని వలెనే శూద్రకుఁడు పెక్కు కథల నాయకుఁడు. కాదంబరిలో శూద్రకుఁడు విదిశ నేలిన రాజు. కథాసరిత్సాగరమున శోభావతి నేలినవాఁడు. బేతాళపంచవింశతిలో వర్ధమానకమునకు రాజు. కథాసరిత్సాగర బేతాళపంచవింశతి హితోపదేశాది పాతకథలలో చావుమూఁడిన యతనిని ఒక బ్రాహ్మణుఁడు తన యాయువు దారవోసి శతాయువుం జేసె నని చెప్పఁబడి యున్నది. దశకుమార చరితమున అతని పలుజన్మల వీరసాహస కార్యములు సూచింపఁబడినవి. హర్షచరితమున అతఁడు చకోరరాజు చంద్రకేతుని శత్రువుగా వర్ణింపఁబడినాఁడు. రాజతరంగిణిలో అతఁడు విక్రమాదిత్యునికిం బూర్వుఁడు, స్థైర్యమునకు పట్టుదలకు ఉదాహరణభూతుఁడు అని చెప్పఁబడినాఁడు. స్కాందపురాణమున అతఁడు విక్రమాదిత్యునికి ఇరువది యేడేండ్లు ముందు, కలియుగపు 3,290వ సంవత్సరమున అనఁగా క్రీస్తు 189వ సంవత్సరమున పాలించినట్లు చెప్పఁబడినాఁడు. దానికిం దార్కాణగా రామిలసౌమిలు లను కవులు, కాళిదాసునికిం బూర్వులు 'శూద్రకకథ' అని యొకటి రచించిరి ఇట్లన్ని సూచనలం బట్టి శూద్రకుఁడు నిజమయిన మానిసి కాఁడు, మఱి కేవలము కట్టుకథలయు పుక్కిటిపురాణములయు నాయకుఁడు అగును." అని. కెయిత్ పండితుఁడును ఆ మాటయే యనును.

అయినను శూద్రకుఁడు గొప్ప కవి యని కొన్ని యాకరములవలన తెలియుచున్నది. వామనుఁడు తన కావ్యాలంకారసూత్ర వృత్తిలో శ్లేషయను నర్థగుణమును 'ఘటనా శ్లేషః' అని సూత్రించి. 'క్రమ కౌటి ల్యానుల్బణ త్వోపపత్తియోగో ఘటనా. స శ్లేషః' అని వృత్తిచెప్పి, 'శూద్రకాదిరచితేషు ప్రబన్ధేషు అస్య భూయాన్ ప్రపఞ్చో దృశ్యతే' అని శూద్రకనామము గ్రహించినాఁడు, మఱి తత్ప్రబంధనామము, 'మృచ్ఛ

కటి' అని గ్రహింపఁడాయెను. పంచమాధికరణమున 'ప్రాయోగికము' అనుదాని యందు 'పాదాంత లఘువునకు ఎల్లెడల గురుత్వము ప్రయోగింపరాదు' అని సూత్రించి, దానికి ఉదాహరణముగా 'యాసాం బలిః' ఇత్యాది గ్రహించినాఁడు. మఱి యిది మృచ్ఛకటికములోనిది అని చెప్పఁడాయెను. ఈశ్లోకము భాసుని చారుదత్తము నందును కలదు. మఱియు IV. - 3 - ౨౩ - విశేషోక్తి యుదాహరణములందు 'ద్యూతం హి నామ పురుషస్య అసింహాసనం రాజ్యమ్' అని యుదాహరించినాఁడు, కాని అది మృచ్ఛకటినుండి గ్రహింపఁబడినది అని చెప్పలేదు. ఐనను అది మృచ్ఛకటిలో II - 7 - కడ దర్దురకవాక్యము. వామనుఁడు ఎనిమిదవ (715) శతాబ్దివాఁడని నిశ్చయింపఁబడినది. మఱి శూద్రకుఁడు తత్పూర్వుఁడు కావలదా?

దశరూప కావలోకమున తత్కర్త ధనికుఁడు ఇట్లు ఉదాహరించియున్నాఁడు.

(a) విప్రాదీనాం శాన్త తైవ, న లాలిత్యం, యథా మాలతీమాధవ మృచ్ఛకటికాదౌ మాధవ చారుదత్తాదిః

(b) యథా వా - మఖశతపరిపూతం గోత్ర ముద్భాసితం యత్ ....(x - 12)

(c) కితవ ద్యూతకారాది ధూర్త సఙ్కులం మృచ్ఛకటికాదివత్ సఙ్కీర్ణ ప్రకరణమ్.

ఇందు మృచ్ఛకటికము సంకీర్ణ ప్రకరణమని రెండు తూర్లు నిర్దిష్టము, చారుదత్తుఁడని నాయకుని పేరును గ్రహింపఁబడినది. ధనికుఁడు మాళవరాజు ముంజపరమారుని యాస్థానివాఁడు - అతఁడు పదియవశతాబ్దియంతపు వాఁడు. ఆదినాలలో మృచ్ఛకటికిఁ గల ప్రసిద్ధి దీన చక్కఁగా తెలియు చున్నది.

పంచతంత్రమునను మృచ్ఛకటికశ్లోకములు పెక్కు ఉదాహరణముం గన్నవి. పంచతంత్రము చాల ప్రాచీనమైనది, మనదేశపు నీతికథల పుస్తకము, దేశాంతరములనుం బ్రసిద్ధము. పెద్దలు చరిత్రనిపుణులు దాని తొలిపాఠము 6-వశతాబ్దికిం జాల పూర్వముది. 570 - A.D. (?) దాన మృచ్ఛకటి దానికిం బూర్వము దనఁదగును.

'ఏతా హసన్తి చ రుదన్తి చ' - మృచ్ఛ. IV - 14; సముద్రవీచీవ చలస్వభావః' IV - 15. అనునవి, మొదటి తంత్రమున IV వ కథలో 203 వ - 206 వ శ్లోకములు. ఒక మాటలోనో అరమాటలోనో పాఠభేదము ఉండునుగాక.

అట్లే II తంత్రమున మూఁడవకథలో 97 వ శ్లోకముగా 'శఙ్కనీయా హి సర్వత్ర నిష్ప్రతాపా దరిద్రతా' అని మృచ్ఛకటి III - 24 శ్లోకము కలదు. మఱియు II వ తంత్రములోని 3 వ కథలో 92, 93, 103, 108 శ్లోకములు మృచ్ఛకటి I లోని దారిద్ర్యముం గూర్చిన సూక్తులను ఎంతేని పోలి యున్నవి. పంచతంత్రపు టిప్పటి పాఠము ఎనిమిదవ శతాబ్దికిముందే స్థిరపడినది. తరువాత మార్పులు చేర్పులు ఉన్నట్లు లేదు. కావున మృచ్ఛకటి 6 వ శతాబ్దికి ఐనను గాకున్నను, ఎనిమిదవ శతాబ్దికి తప్పక ముందుదే. శూద్రకుని వ్యాకరణ ప్రయోగములు కొన్ని పాణినీయమునకు సరిపడకున్నవి అని అభియుక్తులు అనుటయు ఆతని ప్రాచీనతకు ఇంచుక సూచక మగును. బాణమహాకవికి శూద్రకుఁడు విదిశరాజు. అతఁడు భాసనాటకచక్రముం బ్రస్తావించును గాని శూద్రకుని రచనలం జెప్పఁడు. దాన నొకవేళ మృచ్ఛకటి బాణునికి తరువాతిది యందమా యన్న అట్టియూహ అనైకాంతిక మగును.

ఇట్లు మృచ్ఛకటి కవులయు కావ్యములయు లోకమున ఎవరిది ఎప్పటిది అని కొంత తడవఁబడినది. ఇంతకు ముందుది కాదు, ఇంతకు తరువాతిది కాదు, అని కొంత విస్పష్టమైనది. అట్లే ఇందు అధికరణికుఁడు చెప్పియు, రాజు బ్రాహ్మణుని దండించు విషయమున మనుస్మృతిని ప్రమాణీకరింపలేదు. దేనికిగాని, స్వర్ణస్తేయమునకు గాని వేశ్యాహత్యకు గాని, బ్రాహ్మణునికి మరణదండన విధింపఁగూడదు అని మనుస్మృతి వచనము. మఱియు బ్రాహ్మణుఁడు ఒట్టుపెట్టి ఇది నిజము అని చెప్పునేని దానిని నమ్మక పోరాదు. 'సత్యేన శాపయే ద్విప్రమ్' అని మనువు. అధికరణికుఁడు - 'చారుదత్తయ్యా, నిజము పలుకుము' అనఁగా చారుదత్తుఁడు తాను ఎంతమాత్రము హత్య చేయలే దనెను.

"యో ఽహం లతాం కుసుమితా మపి పుష్పహేతో -
రాకృష్య నైవ కుసుమావచయం కరోమి,
సో ఽహం కథం భ్రమరపక్షరుచౌ సుదీర్ఘే
కేశే ప్రగృహ్య రుదతీం ప్రమదాం నిహన్మి?

అని యంత మనసు కెక్కునట్లు నిజము చెప్పినాఁడు. దానిని సయితము పాటింపలేదు. మనుస్మృతి, చరిత్రనిపుణులు క్రీస్తుకుముందు 200 ఏండ్లును తరువాత 200 - ఏండ్లును కూడిన 400 యేండ్లలో అంతకు ముందు గాని అంతకు తరువాత గాని కాక, ఆనడుమ రచితమై యుండు నని నిర్ణయించినారు. మనుస్మృతి సాధారణ

ముగా చాలగొప్ప ప్రమాణము, ఉల్లంఘింపఁబడునది కాదు. మఱి యిట్లు ఉల్లంఘించినందున, అది యింకను జవదాటరానంత ప్రమాణముగా నాటుకొనలే దని యనుకొనఁదగునేమో. ముందుదికాదు. కాదా పాలకుని పాలనము సరిగా లేదని నాటకాన ఎన్నియో సూచనలు, రాజస్యాలదుర్వృత్తము, అతఁడు మాటావతో చెప్పుదు నని అధికరణికుల బెదరించుట, పోకిరితనముగా వీథులు తిరుగుట, నడివీథిలో బ్రాహ్మణులను స్త్రీలను బెదరించి కొట్టఁబోవుట, జూదము దాపటికము లేక ఊరి వీథులలో ఆఁడబడుచుండుట ఇవన్నియు తార్కాణ పఱపఁగా అరాజు మనుస్మృతింగూడ పాటింపని దుర్మార్గుఁ డనియు గ్రహింపఁదగునేమో.

మృచ్ఛకటిని వ్రాసినవాఁడు ఆచార్యదండి, ఆఱవ శతాబ్దివాఁడు - అని కొందఱు పెద్దపండితులు దశకుమారచరితలో వర్ణితములగు దేశకాలములకును మృచ్ఛకటిలోని వానికిని ఎంతేని సామ్యమున్నది. అనియు, దండిరచనలు మూఁడు అన్న ప్రసిద్ధి యుండఁగా కావ్యాదర్శ దశకుమారచరితములు అని రెంటి పేరులే ప్రసిద్ధమై యున్నందున, ఆమూఁడవది మృచ్ఛకటి యగును అని వాదించియున్నారు. ఈవాదములు వృథా కాలక్షేపములు. నిలువఁదగిన బలము గలవి కావు. అఁదఱును పేరును ప్రస్తావనలో కీర్తితో చెప్పుకొనుచుండ దండి. అంతటిగొప్పవాఁడు, తన పేరుం జెప్పుకొనక అన్యమును, శూద్రకనామమును ఏల చెప్పును?

మొత్తముమీఁద మృచ్ఛకటిక కవి శూద్రకుఁడే అనియు, అతఁడు దాక్షిణాత్యుఁ డనియు ఊహలు సరిపడునట్లున్నవి. - 'దక్కను'లో ఏడవ శతాబ్దిలో బౌద్ధమతము ఎక్కువ వ్యాప్తియు ఆదరమును కలిగి యుండినది. సంవాహకుఁడు తటాలున శ్రమణకుఁడును కడపట బౌద్ధమఠముల విచారణాధిపతియు నైనాఁడు. జనుల యాచారములు అభ్యాసములును అవంకకే, దక్షిణాదికే. తిరుగుచున్నవి. వరియన్నమును అందు మాటిమాటికి ప్రాతరాశమును - చలిది యన్నమును, చండాలురు 'భగవతి సహ్యావాసిని' అని అయమ్మవారికి మొక్కుకొనుటయు. శకారుఁడు శ్రమణకుగుడ్డను ఉలవచారువాసన కొట్టుచున్నదని యులవలం జెప్పుటయు, గుమ్మడితొడిమెకు పేడ పూసి కాపాడుటయు, చలికాలపు రాత్రి వండిన యన్నము పాసిపోక చిర ముందు ననుట దాక్షిణాత్యుల యనుభవమును సూచించు మాటయు, ఏవేళయందునుం గూడ సద్దికూడు ఉండునని అపరాహ్ణమున, కాదా సాయంసమయమునను సూత్రధారుఁడు దానిని అడుగుదు ననుటయు, చందనకుఁడు తాను దాక్షిణాత్యుఁడు మాటలలో

హ్రస్వదీర్ఘములు లింగభేదములు పాటింపను అనుటయు, కర్ణాటక కలహాముం బ్రస్తావించి ఆడుటయు, చారుదత్తసమ్మానప్రస్తావ మందలి కుశావతీ వేణలు దక్షిణాదిపేరు లగుటయు, కాణేలీమాత కణ్ణహళ్ళియమ్మను తలంపించుటయు, - ఇవన్నియు దక్షిణాదిని సూచించునవే.

కావున శూద్రకుఁడు రాజనియు దాక్షిణాత్యుఁ డనియు ఈనాటకకవి యనియు ఎనిమిదవశతాబ్దికి ముందువాఁడును మూఁడు నాలుగు శతాబ్దులకన్నం బూర్వుఁడు కాఁడనియు ఇట్లించుమించుగా అనుకొని సంతోషింపఁదగును అంతే.

## ౧౦. మృచ్ఛకటికమున తోఁచు దేశకాల పరిస్థితులు

వైదికబ్రాహ్మణమతము గట్టిగా ఉన్నది. ఐనను బౌద్ధమతమును వ్యాప్తి చెంది యున్నది. చారుదత్తుఁడు మంచి బ్రాహ్మణగృహస్థుఁడు, వైదికాచారపరుఁడు. వాని పూర్వులు యజ్ఞములు చేసినవారు, వాని యిల్లు వేదపారాయణగోష్ఠులతో మాఱు మ్రోగినట్టిది. పాలకుఁడును యజ్ఞవాటమున చంపఁబడినాఁడు. చారుదత్తుఁడు తన్ను వధ్యస్థానమునకు కొనిపోవుచుండఁగా తాను యజ్ఞమునకు శామిత్రమునకు కొనిపోఁబడు చున్న మేఁకవలె నున్నాను అనును. మఱి చారుదత్తుఁడు భోగముదానిని భోగినిగా కూడినాఁడు. ఆజనమునకు కులవధూగౌరవము రాజుచే అనుగ్రహింపఁ బడినది. సద్బ్రాహ్మణకులమునం బుట్టినవాఁడే శర్విలకుఁడును భోగము మదనికను తన కులాంగనం జేసికొన్నాఁడు. వైదికుల యిండ్లలోను ఈ సడలుపాటులు లెక్కింపఁదగును. రుద్రుఁడు, ఇంద్రుఁడు, హరవిష్ణుబ్రహ్మలు, రవిచంద్రులు, దేవి, వృషభవాహనుఁడు, దక్షయజ్ఞధ్వంసి, వాసుదేవుఁడు కార్తికేయుఁడు, సహ్యవాసిని, కామదేవుఁడు. - ఈయన్ని పేరులును ఇందు అట్లట్లు తగిలియున్నవి. దేవళములును విగ్రహారాధనయు కలవు. చారుదత్తుఁడు విహారములను కట్టించినాఁడు. దేవాలయములను కట్టించినాఁడు. సంధ్యాజప గృహదేవతాబలులు అతనికి నిత్యదినచర్యలు. అతని యింట స్కందషష్ఠి చేయఁబడును. కామదేవాయతనము ఊరికి ఉన్నది, వసంతసేనయింటను ఉన్నది. వసంతసేన యింట తాను సొంతముగా దేవపూజచేయును. తనకు ఓపిక లేనపుడు అందులకు దేవతార్చన బ్రాహ్మణుఁడు ఉన్నాఁడు. గోబ్రాహ్మణులకు వేదములకును పూజయు అగ్రపూజయు కలవు. చార్వాకులు నింద్యులు.

విధి విధానమున మేలు కీడు జనులకు కలుగునని నమ్మకము, విధి దాఁటరాని దను నమ్మకము కలదు. శుభాశుభశకునములయందు నమ్మకము బలీయము. ఈనాటక మునే విధిప్రాబల్యమును సోదాహరణముగా నిరూపించుటకు రచించితి ననును, కవి. 'భవితవ్యతాం చ' అని. మఱియు చారుదత్తునిచేతం బలికించును 'ఏష క్రీడతి కూప యన్త్రఘటికా న్యాయప్రసక్తో విధిః' అని. సంసారము జననమరణ పరివర్తనము. పుణ్యపాపములు అనఁగా ప్రారబ్ధము అనువర్తించును అని శకారుని విటచేటులకును ఎంతేని నమ్మకము, వారు వసంతసేనహత్య ఎంతమాత్రము తాము చేయ మందురు. చేటుఁడు భవిష్యజ్జన్మమునన్నైన తాను బాగుపడఁగోరును. ధూతాచారుదత్తులకు కొడుకు పెట్టవలయు శ్రాద్ధమునను తర్పణమునను నమ్మకము గలదు. జనులకు సిద్ధదైవజ్ఞా ద్యాదేశములయందు నమ్మకము గలదు. ఆర్యకుఁడు రాజుకాగలఁ డన్న సిద్ధాదేశమం దలి నమ్మకమే పితూరికిని రాజపరివర్తనమునకును మూలకారణము. శకునములం దును ఎక్కువ నమ్మకము గలదు - అక్షిస్ఫురణాది, చిత్తప్రసాదాది, వాయససర్ప శ్రమణకదర్శనాది, ద్వారబంధపాలహత్యాది - ఎన్నియో - ఇట్టి విశ్వాసమును మూఢ విశ్వాస మందురు గాని, ఇందు జ్ఞానులకును 'తలకుఁ దాఁకినపుడు' ఒకపాటి విశ్వా సము కలుగుచుండును - ఇది నాఁటి మతమున చేరియుండునట్లు తలంపఁదగును.

వైదిక బ్రాహ్మణమతము తోపాటు దేశాన బౌద్ధమతమునకును ఆదరము గలదు. సంవాహకునికి జీవితక్లేశములవలన నిర్వేదము కలుగఁగానే శ్రమణకుఁ డైపోవలయునన్న కోరిక కలిగినది. తరువాత చారుదత్తునిమీఁది తప్పుడుఫిర్యాదు అది నెగ్గుట, వసంతసేన చావుబ్రదుకులు, శకారుని దుండగము, శ్రమణకులకు ముక్కుకుట్టి బాధించు పోకిరితనము, వానిమీఁద హత్య వసంతసేనసొంతమాటలలో ఋజువయ్యు వాఁడు దండన పొందక తప్పించుకొనుట - వీనినెల్ల గన్నవానికి నిర్వే దము రూఢిపడి సన్న్యాసమందు మఱింత పట్టుదల కలిగినది.

దేశమున రాజాధిరాజుల ప్రస్తావము ముద్రారాక్షసమందుం బోలె అగపడదు. ఉజ్జయిని పెద్దనగరము - దాని పాలన చుట్టుపక్కలకే కాని ఆసేతుశీతనగవ్యాప్తము గాదు. పెక్కురాజ్యములు బలాఢ్యుఁడు ఒక్కరాజును నడినగరమున పైకొని కప్పము దోఁచుకొనుట సూచితము - V - 17 'నృప ఇవ పురమధ్యే మన్దవీర్యస్య శత్రోః' ఆర్యకుఁడు చారుదత్తుని వేణాతీరపు కుశావతికి దొరగా చేసినాఁడు. రాజు నధికారము నకు మితిమేరలు లేవు. సర్వపాలన తన చేతనుంచుకొనుటయే కాక తన యిష్టమే

చట్టముగాఁ గలవాఁడు. శ్రుతిస్మృతులతో పనిలేక తన యిచ్ఛమేయి భోగమువసంత సేనకు వధూత్వము నొసంగఁగలడు. అధికరణికుల నేర్పుఱుపను తీసివేయను అధికారము రాజుది. శకారుఁడు బావతో చెప్పి అధికరణికుని తొలఁగింపింతును అనును. దానికి అధికరణికుఁడు భయపడును.

రాజ్యమునకు రక్షకము సేన. ఫిర్యాదుల విచారణకు అధికరణ మున్నను, కడపటి తీర్పు రాజాధీనము. రాజు చారచక్షువు, పోలీసు సిబ్బంది కలదు, రాజ్యమున అధర్మముం బట్టుటకు, ధర్మముం గాఁచుటకు. అందు పెద్దపదవికి నైపుణ్యము సామర్ధ్యము ఆవశ్యకము. అవికలవానిని మంగలినైనను మాదిగనైనను దేశాంతరాల వారినైనను ఏర్పాటుచేయును. రాజధానినగరమునకు చుట్టు కోట. నలుదిక్కుల ద్వారములు, వాని సమీపమున గుల్మస్థానములు - పోలీసు సిపాయి ఠాణాలు కలవు. ప్రధానదండధారకుఁడు అని పృథ్వీదండధారకుఁడని బలపతి అని రాష్ట్రియుఁ డని - కొన్ని పేర్లు గొప్ప అధికారులకు, వారు అధికరణికునికి పరిచితులు, లోఁబడినవారు' వీరకుం బోలె. ఇప్పుడు 'మేజిస్ట్రేటుకు' 'పోలీసులు' పోలె. రాత్రి వీధులలో ఆరెకులు గస్తు తిరుగుచుందురు. ఆయుద్యోగస్థులు సమర్థతతోడనే వ్యవహరింతురు. రాజద్రోహులం బట్టవలసివచ్చినప్పుడు ఎంతెంత సోదాలో నేర్పుతోనే చేయఁబడును. అందు నేరగానిని, నాయననైనను, తప్పించుకొనిపోనీని వీరకుంబోనివారును, అర్థాతంబట్టి పోనిచ్చు చందనకుంబోనివారును ఉందురు.

నగరములో రాజమార్గము, చతుష్పథములు పుష్పకరండకముం బోని తోఁటలుం గలవు. పన్నులు వసూలు చేయుసిబ్బందియు గలదు. జూదపుఁ గొట్టుల నాయకులు రాజునకై వార్తాహరులుగా పంపఁబడుదురు.

ధర్మవిచారణకు అధికరణము, దానికి మండపము, అధికరణికుఁడు, వానికి సాయముగా శ్రేష్ఠికాయస్థులు, ఇంకను నియుక్తులును గలరు. అందఱును రాజుచే ఏర్పాటు చేయఁబడుదురు. వారిని తొలఁగించు నధికారము రాజునకే. అధికరణికుఁడు ఎంతటి ధర్మపక్షపాతముతో పిర్యాదును విచారింపవలయునో ix 3, 4, లలో చెప్పఁబడినది. పురుష పక్షపాతము లేక ధర్మపక్షపాతమే కలిగి యుండవలయును. వినుకలి సాక్ష్యము కాక ప్రత్యక్షముగా అధికరణమున విన్నట్టియు కన్నట్టియు సాక్ష్యముం బట్టి పిర్యాదు తీర్మానింపవలయును.

వ్యవహారములు ఇరు దెఱంగులు - వాదిప్రతివాదులవి, కేవలము సర్కారే వాదిగా విచారింపవలసినది - వసంతసేనహత్యలం బోనిది. విచారణ యంతయు

కాయస్థుఁడు వ్రాసిపెట్టును. దానిని పర్యాలోచించి ప్రాడ్వివాకుఁడు తీర్పుచెప్ప వలయును. వధదండన విధింపఁబడినవానిని, దానికి తగిన వేషము వేసినడివీధిలో కొనిపోవుచు ఆయాప్రధానస్థలముల డప్పుకొట్టి నేరమును చాటి మఱెవ్వరైనను అట్టి నేరము చేసిన అట్లు దండింపఁబడుదురు అను బెదరింపును చాట వలయును. ఇట్టిదెల్ల దేశాన నేరముల మాన్పుటకే. కత్తితో మెడ తెగఁగొట్టుట, కొఱ్ఱు నెక్కించుట - హత్యకు దండనలు. దానికి గట్టకడపటను ఎవఁడేని సాధువు ధన మిచ్చి తప్పింపవచ్చును. రాజునకు కొడుకుపుట్టిన యాయుత్సవమున మోక్షము కలుగవచ్చును. లేక ఏనుఁగు కట్టు కంబము తప్పించుకొని వీధివెంటఁ బడిన గందర గోళముననను మోక్షము కలుగవచ్చును. రాజు మార్పునను, క్రొత్తరాజువచ్చుటను అది తప్పిపోవచ్చును.

దేశము మంచి సంపన్నముగా నున్నట్లే తోఁచును. అనఁగా బిచ్చగాండ్రు బీదలు లేనేలే రని కాదు. మొత్తాన సంపన్నత తోఁచును. భాగ్యవంతులు వారి యాశ్రితులు, సాయంకాలమున వీథులు సందడిగా నుండుట, జూదపు చావడులు, బోగమువారు, సారాగిడ్డంగులు, ఇదెల్ల ధనమును సుఖమును సూచించును. వసంత సేన కుబేరసంపద, చారుదత్తుని దానాల ధర్మాల చరితము, శ్రేష్ఠిచత్వరము మొదలైనదియు ఆవంకవే. వరిమళ్ళు పండుట, పైరు పండి మడిపై మడి వాలుట, ఎండబారు వేలకు ఆకస్మిక ద్రోణమేఘవర్షము సేద్యమును సూచించును. మంచి వర్తకము, ఓడల వ్యాపారము, సరకు అమ్ముడుపోయిన కోమటివాని సంతుష్టి - సంపద సూచకమే,

వణిజ ఇవ భాన్తి తరవః. పణ్యా నీవ స్థితాని కుసుమాని
శుల్కమివ సాధయన్తో మధుకరపురుషాః ప్రవిచరన్తి,

ఇది ఉజ్జయిని బజారువర్ణన అనుకొనవచ్చును. గృహపతులు భూస్వాములు కాఁబోలు. సంవాహకుఁడు గృహపతికొడుకు. ఉజ్జయినిం జూచు నాసతో సంచారము వెడలి శ్రమణకుఁ డగువఱకు మార్పులు చెందినాఁడు, అన్నివిధాల జీవనములును ఉన్నవి. బేల్దారులు (కామాటులు) వడ్రంగులు కంసాలులు - ఇంకను అన్నిపనుల వారును కలరు. వసంతసేన బంగళాయు అందు అగపడినవియు ఈయన్నివృత్తుల యతిమాత్రపు నైపుణి సూచించును. చాతుర్వర్ణ్యమును, బ్రాహ్మణ ప్రాధాన్యమును స్పష్టము, వసంతసేన చారుదత్తులోగిట ప్రవేశింపరాదు. దాని నగలు సైతము మైల,

చారుదత్తుని యింటిలోపలికి కొనిపోఁదగవు. మఱి సంసారుల యిండ్లలో స్త్రీలు మంచి మర్యాద కలిగి యున్నారు. ధూతమ్మ పతివ్రతల మేలుబంతి. ఐనను స్త్రీలను గాని శ్రీలను గాని నమ్మరాదను హితబోధయు ఒక వంక కలదు. (చూ. IV - 12 - 13) పురుషులకు బహుభార్యత చూపట్టును, వేశ్యలస్నేహమును. అగ్నిసాక్షిక వివాహము, పుత్రజన్మము, మొదలైనవి పండుగులు, వసంతోత్సవము ఇంద్రోత్స వము మొదలైనవియు సూచితములు చావున చితాగ్నిదహనమును సహగమనమును సూచితములు.

ద్విజులు ఇంకను వేదవేదాంగముల నేర్చుకొందురు. ధర్మశాస్త్రముల జదువు దురు. ఇతిహాసకావ్యపురాణపఠనమును కలదు. నాటకాన రామాయణ మహాభారత జ్ఞాపకములు ఎన్నియేని కలవు. శూద్రకుఁడు గణితపండితుఁడు. జ్యౌతిషమున ప్రవేశముకలదు, గజశిక్షయు అశ్వశిక్షయు. వసంతసేన సేవకుఁడు కర్ణపూరకుఁడు గొలుసు తెంచుకొన్న వసంతసేన యేనుఁగును పట్టి కట్టినాఁడు, కన్నపుదొంగతనము కలదు. శర్విలకుఁడు దానిని విద్యగా నేర్చినాఁడు. అతఁడు దొంగలకును దేవుఁడును, చేయతగిన తగని పనుల నియమములును కల వనును. తన నేర్పును తాన వర్ణించును, (చూ. III. 20, 21), వైష్ణవభక్తుఁడైన తిరుమంగైయాళ్వారునకు దేవునికైంకర్య మునకై దొంగతనమునం బ్రవిష్టునకు 'నీటిపై నడచువాఁడు' ('మానిపి) నీడలో లీనమగు వాఁడు' అను మొదలగు దాఁగుడు విద్యలు నేర్చినవారు తోడుగా ఉండిరి అనువార్త కలదు. శర్విలకునియొద్ద యోగరోచనమను కాటుక యున్నది. దానిం బెట్టుకొన్నవాఁడు మానుసులకంటికి అగపడఁడు. ఒక పురువును పంపి దీపమును ఆర్పించును. లోపలిజనులు మెలఁకువగా నుండి తన్ను పట్టుకొందురా అని కను గొనుటకు, ఒక మానిపిబొమ్మను ఉంచుకొని ముందు కన్నమున దానిం బ్రవేశపెట్టి, ఎఱుఁగును, ఇట్టి యుక్తు లెన్నియో కలవు ఆ విద్యలో,

ఆదేశమున కళలు నేర్చినవారును ఉండిరి. నాట్యము. పాట, చిత్రలేఖనము, వీణ వాయించుట, ఇంకను ఎన్ని వాద్యములో వాయించుటను ఎఱింగినవారు ఉండిరి. వానికి ఆదరము మెప్పు కలదు. తనయింట అన్ని వాద్యములు గల చారు దత్తుఁడు గొప్ప రసికుఁడు రేభిలార్యుని వీణెపాట కచ్చేరికి పోయి మరలును, వసంత సేనకు నాట్యనైపుణి కలదు. చారుదత్తుని చిత్తరువున వ్రాసి విరహబాధను వినోదించు కొనును. సంవహనము, ఒళ్ళుపిసుకుట - మానుసులకు మాలీష్‌చేయు సుకుమార

విద్యయు నేర్చుకొనుటయు, దానిని జీవికగా నుంచుకొనుటయుం గలదు, గృహ నిర్మాణ నైపుణియు కలదు చారుదత్తునిది పాతబంగళా, వసంతసేనది యెనిమిది లోగిళ్ళ పెద్దబంగళా - అన్నివిధముల అలంకరింపఁబడినది, కుబేరభవనముం బోనిది. వసంతసేనకును శకారునికి చారుదత్తునికిని - అనఁగా ఆఢ్యులకు జంట యెడ్ల పెట్టె బండ్లు కలవు. వారు సాధారణముగా నడవక బండ్లలోనే పోవలసినచోట్లకు పోవు చుందురు. కాలినడకగాను షికారులు తిరుగుట గలదు.

సర్వమును పరిశీలించిన జనుల జీవిత విధానములు, సంస్కృతి నాగరికత ఈకాలమున ఉన్నట్లే ఉండినట్లు తోఁచును. మఱి యిపుడు పదార్థ రసాయన వైద్య విద్యు దాది శాస్త్రజ్ఞాన మెక్కువ యైనందున వానివలన కలిగిన సౌకర్యములు అను కూలములు అప్పుడు లేనివి ఇప్పుడు కలవు. అంతియ భేదము. నాఁడు పుష్పకముం బోని విమానములు నేఁటి గాలియోడలను మించినవియు దేశకాల విప్రకర్షను జయించిన భూత భవిష్య ద్వర్తమానముల నెఱుంగు సిద్ధులు, నైపుణి కాదాచిత్క ముగా క్వాచిత్కముగా నుండినవే ఇపుడు వెల్లివిరిసినవి. అంతియ. ఆస్తిక హిందువునకు వానియందు నమ్మకము సిద్ధము.

శ్రీః

# మృచ్ఛకటికమ్

## నాన్ది



శ్లో. పర్యఙ్క గ్రన్థిబన్ధ ద్విగుణిత భుజగా
శ్లేష సంవీతజానో
రన్తః ప్రాణావరోధ వ్యుపరత సకల
జ్ఞానరుద్ధేన్ద్రియస్య
ఆత్మ న్యాత్మాన మేవ వ్యపగతకరణం
పశ్యత స్తత్త్వదృష్ట్యా

---

శ్లో. ౧. పర్యఙ్క గ్రన్థి... జానోః—(గ్రన్థి=) ముడివంటి (పర్యఙ్క=) వీరాసనముయొక్క సడలమికై రెట్టపేటగా చంకలగుండ రానిచ్చిన పాముచేత చుట్టఁబడిన మోకాలుగలవాఁడును; ద్విగుణిత - మునుపుకలిగినదే. ఇపుడిబ్బడి. అన్తఃప్రాణా ... రుద్ధేన్ద్రియస్య = (దేహము)లోపల ప్రాణవాయువును - ఊపిరిని - (బయటికి ఆడనీక) బిగబట్టుటచేత ఉడిగిన శబ్దస్పర్శాది జ్ఞాన రూపములైన చిత్తవృత్తులచేత అడ్డగింపఁబడిన ఇంద్రియములు గలవాఁడును, కలఁగని బాహ్యేంద్రియములును అంతరింద్రియములును గలవాఁడనుట - కావుననే, తత్త్వదృష్ట్యా = పరమార్థదర్శనముచేత, తన సారూప్యముం బొందుటయనెడు ప్రత్యక్స్వరూప సాక్షాత్కారముం బొందుటచేత - అనుట, వ్యపగతకరణం = విశ్రాంతములైన (=అడంగిన) బహి రంతఃకరణ వ్యాపారములు గలయట్లుగా, ఆత్మని = తనయందు, ఆత్మానం ఏవ = తనకంటె వేఱుగాని పరమాత్మను, పశ్యతః = కాంచుచున్నవాఁడును, ఐన, శమ్భోః = (కల్యాణముం

శంభో వః పాతు శూన్యేక్షణ ఘటిత లయ
బ్రహ్మలగ్నః సమాధిః. ౧

గూర్చువాఁ(డైన) శంభునియొక్క, శూన్యేక్షణ...లగ్నః = దేనియందును తగులు కొనని చూపుచేత – నిర్వికల్పమైనదానిచేత – కన్నుతెఱపు కలదు, చూపు లేదు. అనుట–కూర్పఁబడిన–సంపాదింపఁబడిన వాసనల (=పూర్వానుభూతార్థ స్మరణల) విత్తనము సయితము నాశనమైన హేతువున, పరమాత్మయందు గాటముగా తగులు కొన్న (మఱి యందుండి లేవని అనుట), సమాధిః = నియమము – తదేకధ్యానము, వః = మిమ్ము (సామాజికులను), పాతు = రక్షించును గాక.

పరమాత్మయందు లగ్నమైయున్న శంభుని సమాధి మిమ్ము బ్రోచును గాక. ఆసమాధిలోనున్న శంభువు వీరాసనమునం గూర్చుండి యున్నాఁడు. ఆయాసనము సడలకయుఁ సుఖముగాను ఉండుటకు చంకలదూర్చి మోకాలిచుట్టు మెత్తని పామును రెట్టపేటలుగా చుట్టుకొనియున్నాఁడు. ప్రాణాయామముచే బాహ్యాంతరేంద్రియముల నడ్డుటచే అతనికి మఱి యేజ్ఞానమును లేకున్నాఁడు. కావున తనలోనే తనకన్న వేఱు కాని తత్త్వమును అనఁగా పరమాత్మను సాక్షాత్కరించుకొను చున్నాఁడు. కావుననే చూపు శూన్యమై ఆబ్రహ్మమందు తగుల్కొని మఱి లేవకున్నది.

అట్లు పాముం జుట్టుకొనుట 'స్థిరసుఖం ఆసనం' అని యోగశాస్త్రాను శాసన ముండుటంబట్టి. అట్లు 'స్థిరసుఖము' కాకున్న సమాధి కుదురదు. ముక్కంటి యీసమాధిని కుమారసంభవమున కాళిదాసు లెస్సగాను అందముగాను వర్ణించినాడు.

"III 45. పర్యఙ్కబన్ధస్థిర పూర్వకాయ
ఋజ్వాయతం సన్నమితోభయాంసమ్
ఉత్తానపాణిద్వయ సన్నివేశాత్
ప్రఫుల్లరాజీవ మివాఙ్కమధ్యే.

46 భుజఙ్గమోన్నద్ధ జటాకలాపం
కర్ణావసక్త ద్విగుణాక్షసూత్రమ్
కణ్ఠప్రభా సఙ్గ విశేషనీలాం
కృష్ణత్వచం గ్రన్థిమతీం దధానమ్

47. కిఞ్చిత్ప్రకాశస్తిమితోగ్రతారైః
భ్రూవిక్రియాయాం విరతప్రసఙ్గైః
నేత్రైరవిస్పన్దితపక్ష్మమాలై
ర్లక్ష్యీకృతఘ్రాణమధోమయూఖైః

48. అవృష్టిసంరమ్భమివామ్బువాహ
మపామివాధారమనుత్తరఙ్గమ్
అన్తశ్చరాణాం మరుతాం నిరోధా
న్నివాతనిష్కమ్పమివ ప్రదీపమ్.

..............................

50. మనో నవద్వారనిషిద్ధవృత్తి
హృది వ్యవస్థాప్య సమాధివశ్యమ్
యమక్షరం క్షేత్రవిదో విదు స్త
మాత్మాన మాత్మ న్యవలోకయ న్తమ్.

[ క్షేత్రవిదః = క్షేత్రజ్ఞులైన పురుషులు, యం = ఎవనిని, అక్షరం = నాశములేనివానినిగా, విదుః = ఎఱుంగుదురో, తం ఆత్మానమ్ = ఆపరమాత్మను, ఆత్మని = తనయందే, అవలోకయన్తమ్ = సాక్షాత్కరించుచున్నవానిని - అని మల్లినాథసంజీవనికి శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారి తెలుఁగు. ]

ఈ ఐదు శ్లోకములం జెప్పినదెల్లను శూద్రకకవి 'పర్యఙ్కగ్రన్థి' త్యాది తన ఒక్క శ్లోకమున చక్కఁగా ఇమిడ్చినాఁడు. మఱి కుమారసంభవమున ఈ యెక్కువ యున్నది -

49. కపాలనేత్రాన్తరలబ్ధమార్గై
ర్జ్యోతిఃప్రరోహైరుదితైః శిరస్తః
మృణాలసూత్రాధికసౌకుమార్యాం
బాలస్య లక్ష్మీం గ్లపయన్త మిన్దోః"

పర్యంకాసనము అనఁగా వీరాసనము - కుమారసంజీవనియందు మల్లినాథుఁడు. వసిష్ఠః—

ఏకపాద మథైకస్మి న్విన్యస్యోరౌ తు సంస్థితమ్
ఇతరస్మిం స్తథైవోరుం వీరాసన ముదాహృతమ్.

తథా యోగసారే

ఉత్తానితే కరతలే కర ముత్తానితం పరమ్
ఆదాయాఙ్కగతం కృత్వా ధ్యాయేద్వ స్తస్య సోఽన్తరమ్.

ఈ శ్లోకమున యోగదశారోహక్రమము ఆసనము వేసికొని కూర్చుండుట మొదలుగా '-లయబ్రహ్మలగ్నత' వఱకు చెప్పఁబడినది. 'వీక్షైశ్వర్యే స్థితోఽపి ప్రణతబహుఫలే-' మాళ. అన్నట్లు అకామునికైనను ఈశ్వరునికి ఈ సమాధి యేల యన అది కేవలము ఆశ్రితపరిత్రాణమునకు. అట్లే కాళిదాసు కుమారమున I-57.

'స్వయం విధాతా తపసః ఫలానాం కేనాపి కామేన తపశ్చచార'
ఆఫలము ఆశ్రితపరిత్రాణమే.

ఇందు శంభుసమాధిని ఉన్నదియున్నట్లుగా అందముగా చెప్పినందున స్వభావోక్తి. 'స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్.'

ఇందు కొందఱు లింగము అవివక్షితము కాఁగా, ఈ నాయికావిశేషణములు ఊహింతురు. ఎట్లనగా 'శంభు' శబ్దముచేత సుఖముకలుగు సాధనమైన వసంతసేనయు, 'సమాధిః' చిత్తమును లెస్సగా ఉంచుట యనఁగా అనురాగమును, 'శూన్య' అనుటచే నగలు మొదలయినవి లేమిని, 'ఈక్షణేన' అనఁగా చూచుటచేత, 'ఘటిత' అనగా ఊహింపఁబడిన 'లయః' అనఁగా విభవక్షయము అదే దారిద్ర్యము గల 'బ్రహ్మ' బ్రాహ్మణచారుదత్తునియందు 'లగ్న' నాటుకొనుటయు, ఇట్టి విశేషణముచేత 'అనురాగము' నిరుపాధికముగా తనంతట కలుగుటయు, 'పర్యఙ్క' పడుకయు, 'గ్రన్థి' ముడివలె గట్టిగా పెనచుకొన్న యొండొరుల యాలింగనముచేత, 'ద్విగుణిత-ఒండొరుల (కావున) రెండుచేతుల పెనకువచేత, కామశాస్త్రమునం జెప్పఁబడిన భుజగాశ్లేషముతో సదృశమైన సకలాంగపరిష్వంగమును, దాన 'సంవీతజానోః'-ఒండొరుల మోకాళ్ళ పెనకువయు, 'ప్రాణావరోధ' చేత చిత్తము అనన్యపర మగుటయు, మఱేదియు ఎఱుంగకుండుటయు. 'తత్త్వదృష్ట్యా' చేత పరమార్థానురాగమునకు నిమిత్తమైన గుణవిశేషముం గాంచుటచేత తనలో ప్రియహృదయమే గాంచు సమానురాగత్వమే (వసంతసేన) ఆపొందుకు హేతువుగా తలఁచుటయు- ఇందు సగము (ఐదంకాల) నాటకకథ ఇమిడిపోయినది.

అపి చ

శ్లో. పాతు వో నీలకణ్ఠస్య కణ్ఠః శ్యామామ్బుదోపమః
గౌరీభుజలతా యత్ర విద్యుల్లేఖేవ రాజతే. ౧

( నాన్ద్యన్తే )

అపి చ = మఱియు.

శ్లో. ౧. యత్ర = ఎందు, గౌరీభుజలతా = (బంగారువన్నె మేని) పార్వతి యొక్క తీగంబోని బాహువు, విద్యుత్ + లేఖా ఇవ = మెఱపుగీతవలె, రాజతే = ప్రకాశించుచున్నదో, (అ)శ్యామ అమ్బుద ఉపమః = నల్లమబ్బు సాటువగా గల, నీలకణ్ఠస్య = నల్ల మెడదేవుని ( = ఈశ్వరుని), కణ్ఠః = మెడ, వః = మిమ్ము, పాతు = రక్షించును గాక. సామాజికులను అనుట.

(గరళ)శ్యామలపు మెడగలదేవుని మెడను ఆలింగనము చేసికొన్నందున, అందు గౌరిబాహువు నల్లమబ్బుమీఁది మెఱపు గీతవలె ప్రకాశించుచున్నది. అట్టి యాలింగనసుఖ మనుభవించుచున్న నీలకంఠుడు మిమ్ముఁ బ్రోచును గాక.

గరళశ్యామలతచే ఆర్తత్రాణపరత ధ్వనించుచున్నది. గరళ పానము లోకముం బ్రోవనే కదా. శ్యామామ్బుదోపమయు జగత్సంతాపవారణమును సూచించును. 'నీలకణ్ఠ' - గరళనైల్యముచేత విశేష్యము ఆశ్రితత్రాణపరమగుటచే పరికరాంకురాలంకారము. 'విద్యుల్లేఖాఇవ' - 'వలె' ఇత్యాదిచే పూర్ణోపమ.

సాభిప్రాయే విశేష్యే తు భవేత్ పరికరాఙ్కురః.
ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీ రుల్లసతి ద్వయోః.

ఇందును 'అమ్బుద' అనుటచే మేఘమువలె యాచకుల సంతాపముం దీర్చి పేదవడిన చారుదత్తుఁడును, ...భుజలతా... విద్యుల్లేఖా అనుటచే మెఱపుతీగం బోని వసంతసేనతో కూడుకొన్నవాఁడు అనుటయు - కావ్యార్థము సూచింపఁ బడినది.

నాన్ద్యన్తే—సూత్రధారః.

నాన్దీ—

'నన్దీ వృషో వృషాఙ్కస్య జగదాదౌ జగత్పతేః
నృత్యతః కల్పనాయోగా జ్జగామ కిల రఙ్గతామ్
తస్య తద్రూపసమ్బద్ధా పూజా నాన్దీతి కథ్యతే.'

ఇత్యుక్త్వా నన్దిసమ్బన్ధినీ పూజా నాన్దీ.

జగదాదియందు జగత్పతియైన వృషాంకునికి నృత్యము చేయుటకై అతని నంది, నిజరచనప్రయత్నమున రంగముగా మారెనట. అతని యీ రూపమునకు చేయు పూజ నాంది యనఁబడును అని యొక వ్యుత్పత్తి. 'నన్దతి' సమృధ్యతే నాట్య మనయా ప్రత్యూహాపోహా దితి నాన్దీ. తస్యా అస్తే.' అని దీనిచేత నాట్యము అడ్డంకులు తొలఁగి పెంపొందును గాన నాంది.

'ఆశీర్వచనసంయుక్తా స్తుతి ర్యస్మాత్ ప్రయుజ్యతే
దేవద్విజనృపాదీనాం తస్మా న్నాన్దీతి సంజ్ఞితా
మఙ్గల్య శఙ్ఖ చన్ద్రాబ్జ కోక కైరవశంసినీ
పదై ర్యుక్తా ద్వాదశభి రష్టాభి ర్వా పదై రుత' సా.ద.

య త్రాష్టాభి ర్ద్వాదశభి రష్టాదశభి రేవ వా
ద్వావింశత్యా పదై ర్వాఽపి సా నాన్దీ పరికీర్తితా
అర్థతః శబ్దతో వాపి మనా క్కావ్యార్థసూచనమ్
పదాదినియమో ఽపి వా
నన్దన్తి దేవతా యస్మాత్ తస్మా న్నాన్దీతి సంజ్ఞితా

ఇవి నాందిశ్లోకములు. నాందియనునది నాటకాదుల యారంభమున దేవబ్రాహ్మణ రాజప్రభృతులకు స్తుతిగా సామాజికులకు ఆశీర్వచనముగా 8, 12, 18, 22 పదములు గలదిగా రచింపఁబడును. ఇందు బిల్వ శంఖ చంద్ర కమల చక్రవాక కములాది శుభవస్తువాచకములును ఇంచుక కావ్యార్థసూచనయు నుండవలయును. కొందఱి మతమున పదనియమ కథాంశసూచనలు పాక్షికములు, కావున లేకయుం బోవచ్చును. ఈ రెండుశ్లోకములనాందిని పదనియమము సరిపడుటకై పద మనఁగా శ్లోకపాద మని యర్థము చెప్పి అష్టపదనాంది యందురు.

ఈ చెప్పఁబడిన నాంది పూర్వరంగమునకు ఒక ప్రధానాంగము. పూర్వ రంగము, నాటకారంభమునకు ముందు. రంగవిఘ్నోపశాంత్యాదికై నటులు

# ఆ ము ఖ మ్

సూత్రధారః—అల మనేన పరిష త్కుతూహల విమర్ద కారిణా పరిశ్రమేణ. ఏవ మహ మార్యమిశ్రా న్ప్రణిపత్య విజ్ఞాప

---

గావించునది. దానితో నాటకకవికి ఏమియు సంబంధము లేదనియు, 'రంగ ద్వారము' మొదలుకొని కవి నాటకమును రచింపఁదగును, కావున ఈశ్లోకములు రంగద్వార మగును అనియు సాహిత్యదర్పణకర్త విశ్వనాథకవిరాజు మతము. 'నాన్ద్యన్తే సూత్రధారః' అనఁగా నాందియైనతర్వాత సూత్రధారుఁడు తానే కాని, తన్నుఁబోని మఱియొక సూత్రధారుఁడు, స్థాపకుఁడనియు చెప్పఁబడు వాఁడు కాని ఈరంగద్వార మంగళశ్లోకములం జెప్పి ప్రస్తావనకుం గడంగు చున్నాఁ డనుట.

'నాన్దీం ప్రయుజ్య పూర్వస్మిన్ సూత్రధారే వినిర్గతే
ప్రవిశ్య తద్వ దపరః కావ్య మాస్థాపయే న్నటః.'

## ఆ ము ఖ మ్

అలం, అనేన – చాలు ఇది, ఇఁక వలదు. 'అలం' నిషేధార్థకము. దానికి తృతీయతో యోగము. ఇప్పటికే ఈపూర్వరంగము చాలసేపుపట్టినది. ఇఁక వలదు, సామాజికులు విసుగుకొందురు. అనుట. పరిష త్కుతూహల విమర్ద కారిణా – ప్రేక్షకబృందముయొక్క ఆటం జూచు కుతూహలమును పాడుసేయునదైన ఈ పాట ఇఁక వలదు. ఆర్యమిశ్రాన్ – (ఈ)మిక్కిలి పూజ్యులను. ఆర్య – పూజ్యుఁడు, మిశ్ర అనుటయు పూజావాచకము, కావున మిక్కిలిపూజ్యులు అనుట. ఇది పరిషత్ స్తుతి. వారిని వశీకరించుటకు, తమకు ధన మొసంగి మెచ్చుకొనుటకును ఓపికపట్టి 'గల్బా' చేయకుండుటకును. ప్రణిపత్య = నమస్కరించి, విజ్ఞాప యామి = విన్నవింతును. యత్ = ఏమనఁగా – మృచ్ఛకటికమ్ – మృదః శకటం మృచ్ఛకటం–త దస్తి అత్ర ప్రతిపాద్యతయా ఇతి మృచ్ఛకటికమ్. మట్టితో చేసిన బండి ఇందు చెప్పఁబడినది గాన దీనికి ఆపేరు. లేక 'మృదః శకటికా అల్పా శకటీ యస్మిన్' ఇతి బహువ్రీహిః. మట్టితో చేసిన చిన్నబండి యిం దున్నది కావున 'మృచ్ఛకటికమ్' – అనుట. చారుదత్తపుత్త్రుఁడు రోహసేనుని యాట వస్తువు మట్టితో చేసిన బండి ఇందు అవయంకమునఁ గలదు. కావున 'మృచ్ఛ కటికమ్.'

యామి - య దిదం వయం మృచ్ఛకటికం నామ ప్రకరణం ప్రయోక్తుం వ్యవసితాః. ఏతత్కవిః కిల

శ్లో. ద్విరదేన్ద్రగతి శ్చకోరనేత్రః
పరిపూర్ణేన్దుముఖః సువిగ్రహ శ్చ
ద్విజముఖ్యతమః కవి ర్బభూవ
ప్రథితః శూద్రక ఇ త్యగాధసత్త్వః. 3

ప్రకరణం — ఇది పది తెఱంగుల రూపకములలో ఒక తెఱఁగుది. "ప్రకరణ మందు వృత్తము లౌకికము, కవికల్పితము, శృంగారము అంగి, నాయకుఁడు విప్రుఁడు గాని, అమాత్యుఁడు గాని; అపాయముతోఁ గూడిన ధర్మకామార్థములయందు ఆసక్తుఁడు, ధీరప్రశాంతుఁడును. విప్రనాయకము మృచ్ఛకటికము, అమాత్యనాయకము మాలతీమాధవము, వణిఙ్నాయకము పుష్పభూషితము. నాయిక కొన్నిట కులకన్యగాను, కొన్నిట వేశ్యగాను, కొన్నిట ఆయిరువురును గాను, ఉండును. అందువలన దీనియందు మూఁడు భేదములు కలవు. అందు మూఁడవభేదమున వంచకులు ద్యూతకారాదులు విటులు చేటులు మొందుకొని యుందురు. కులస్త్రీ పుష్పభూషితమున, వేశ్య రంగవృత్తమున, ఇరువురును మృచ్ఛకటికంబున. ఇది నాటకప్రకృతి గలది. కావున దీని కడమ లక్షణము నాటకమునకుం బోలె నెఱుంగునది." సా. ద. — వే. వేం.

ప్రయోక్తుం వ్యవసితాః = ప్రయోగింపం బూనుకొంటిమి.

శ్లో. 3. ద్విరదేన్ద్రగతిః = గజరాజు నడకకు సమానమైన నడక కలవాఁడును, చకోరనేత్రః = చకోరములవంటి కన్నులుగలవాఁడును (చకోరము వెన్నెల మేతరి), పరిపూర్ణేన్దుముఖః = నిండు చందురుంబోలు మొగముగలవాఁడును, సువిగ్రహశ్చ = (ఒక్కొక్కటిం జెప్పనేల?) సర్వాంగసుందరుఁడును, ద్విజముఖ్యతమః = క్షత్రియశ్రేష్ఠుఁడు - త్రయోవర్ణాః ద్విజాతయః - అన్నారు గదా - మహాకులీనుఁ డనుట - అగాధసత్త్వః = ఇంతయని లోతు కొలువరాని దేహ(మనో) బలములు గలవాఁడును - గాంభీర్యశాలి అనుట - సత్త్వగుణమనియేని, శూద్రక ఇతి ప్రథితః = శూద్రకుఁడని ప్రసిద్ధుఁడు, ఐన, కవిః=కవి, బభూవ = ఉండెను. చకోర- నల్ల-చూ.వసు. III. 92-ద్విరేఫములు-మహివల్లభు చూపులు.

మహారాజునకు ఉండవలయు మంచిగుణము లన్నియు చెప్పఁబడినవి. అట్టి యతఁడు గొప్పకవియై ఈ నాటకమును వ్రాసినాఁడు.

అపి చ,

శ్లో. ఋగ్వేదం సామవేదం గణిత మథ
కలాం వైశికీం హస్తిశిక్షాం
జ్ఞాత్వా, శర్వప్రసాదా ద్వ్యపగతతిమిరో
చక్షుషీ చోపలభ్య,
రాజానం వీక్ష్య పుత్రం, పరమసముదయే
నాశ్వమేధేన చేష్ట్వా,
లబ్ధ్వా చాయుః శతాబ్దం దశదినసహితం,
శూద్రకో ఽగ్నిం ప్రవిష్టః. ౪

'కవిః' బభూవ – అని విశేష్యముగా చెప్పుటచే కవిత్వము ప్రధానలక్షణముగా నిర్దిష్టము – ఇన్ని గొప్ప విశేషములం జెప్పి 'శూద్రక' అని తన పేరుం జెప్పుకొనుటచే అన్నిటికి మించిన భూషణముగా తన వినయము సూచితము.

అపి చ = మఱియు.

శ్లో. ౪. ఇంకను ఆకవిప్రస్తుతియే, ఋగ్వేదం = ఋగ్వేదమును, ప్రథమ గ్రహణముచే అది తన శాఖయనుట. సామవేదం = సామవేదమును, గణితం = లెక్కలవిద్యను, అథ = మఱియు, వైశికీం = భోగమువారిదైన కళలను, హస్తిశిక్షాం = ఏనుఁగులమరఁపుటను, జ్ఞాత్వా = ఎఱింగి, శర్వప్రసాదాత్ = ఈశ్వరుని యనుగ్రహామువలన, వ్యపగతతిమిరే = గ్రుడ్డితనముకలిగించు 'తిమిర'మను కంటిరోగము మాని (మంచిచూపుపొంది)న, చక్షుషీ = కన్నులు, ఉపలభ్య = పొంది, పుత్రం = కొడుకను, రాజానం = పట్టాభిషిక్తునిగా, వీక్ష్య = చూచి, పరమసముదయేన = మహాభ్యుదయముతో – నిర్విఘ్నముగాను తృప్తికలిగించిన దక్షిణలతోను అనుట, అశ్వమేధేన ఇష్ట్వా చ = గుఱ్ఱముం జంపు జన్నముతో దేవతల సంతోషపెట్టి, దశదినసహితం శతాబ్దం ఆయుః లబ్ధ్వా చ = పదిదినములతోడం గూడిన నూఱేండ్లయాయుస్సును– జీవించుటను– పొంది, శూద్రకః = శూద్రక (మహారాజు) అగ్నిం ప్రవిష్టః = నిప్పులోం జొచ్చెను. అట్లు స్వచ్ఛందముగా ప్రాణత్యాగము, చేసెను – అనుట.

అపి చ,

శ్లో. సమరవ్యసనీ ప్రమాదశూన్యః
కకుదం వేదవిదాం తపోధన శ్చ
పరవారణ బాహుయుద్ధ లుబ్ధః
క్షితిపాలః కిల శూద్రకో బభూవ. ౫

అస్యాం చ తత్కృతౌ

వేదములు శాస్త్రములు కళలు అన్నియు నేర్చి కన్నులకు తిమిరరోగము రాఁగా ముక్కంటిం గొలిచి ఆ యనుగ్రహమున మరల మంచి చూపుపొంది, కొడుకునకు రాజపట్టముం గట్టి మహావిభవముతో అశ్వమేధయాగము చేసి, నూఱేండ్లు పదిదినముల పురుషాధికమగు ఆయువును అనుభవించి తనిసి, హోమాగ్ని జ్వాలాభీలముగా జ్వలింపించి అందు స్వచ్ఛందముగా తన దేహమును వేల్చినాఁడు. అట్టి దొడ్డ మహానుభావుఁడు అనుట. జ్ఞానభక్తిక్రియాసమగ్రత చెప్పఁబడినది.

రామాయణారణ్యకాండమున శరభంగమహాముని రామదర్శనమునకు వేచి యుండి, రాముని సేవించి, అతనియెదుర నే తాను వేల్చుచున్న యగ్నిలో తాను జొచ్చినట్లు ఇతఁడును. అది యొక యాగప్రక్రియ కానోపును, ఆత్మహత్యాదోషము లేనిది, గొప్ప యాముష్మిక గుణముగలది. ఎంతో తనివితో ధీరతతో చేయుపని.

శ్లో. ౫. సమరవ్యసనీ = యుద్ధములందు ఆసక్తిగలవాఁడు, ప్రమాదశూన్యః = మఱపు పొరపాటు లేని (ఎఱుఁగని) వాఁడు, వేదవిదాం = వేద పండితులలో, కకుదం = ప్రధానుఁడు, తపోధనః చ = రాజర్షియు, పరవారణ బాహుయుద్ధలుబ్ధః = శత్రుసేనాగజములతో (తన) బాహువులతోడనే యుద్ధముచేయ నాసగొనువాఁడు, ఏనుఁగులను ఓర్చు బాహుబలము గలవాఁ డనుట, శూద్రకః కిల = శూద్రకుఁ డని ప్రసిద్ధుఁడు, క్షితిపాలః బభూవ = రాజు ఉండెను.

శూద్రకుఁడు విద్వాంసుఁడు, పొరపా టెఱుఁగనివాఁడు, యుద్ధోత్సాహి, జిష్ణుఁడు, తపఃశాలియు, గొప్పరాజు. పర_తనయేనుఁగు తనతో పోరరాదు.

అస్యాం చ తత్కృతౌ = ఈ యాతని రచితమైన కావ్యమందు.

శ్లో. అవన్తిపుర్యాం ద్విజసార్థవాహో
యువా దరిద్రః కిల చారుదత్తః
గుణానురక్తా గణికా చ తస్య
వసన్తశోభేవ వసన్తసేనా. ౬

శ్లో. ౬. అవన్తిపుర్యాం = అవంతిరాజధాని (యైన యుజ్జయిని) యందు, ద్విజసార్థవాహః=వణిగ్వృత్తి కైకొన్న బ్రాహ్మణుఁడు, సాహుకారు, యువా= మంచి ప్రాయపువాఁడు, (మఱి) దరిద్రః = పేదవాఁడు, చారుదత్తః కిల = చారుదత్తుఁడని ప్రసిద్ధుఁడు - ఉండెను, తస్య = అతనికి, గుణానురక్తా = (రూపౌదార్య మాధుర్యాది) గుణములచే మరులుగొన్నట్టి, గణికా=భోగముది, వసన్తశోభా ఇవ = వసంతశ్రీనిం బోనిది, అనఁగా చిగుళ్ళం బూలుం బోని తన యంగములచేత నే మరుని పొగరు గొల్పునది అనుట, వసన్తసేనా చ=వసంతసేనయనునదియు - (ఉండెను - 'బభూవ' - అని అధ్యాహార్య శేషము).

[యస్య అనియు పాఠము. అది సాధువుగాదు. నాయికానాయకులకు సమప్రాధాన్యము ఇష్టము. కావున నే తర్వాతి శ్లోకమున 'తయోః' అని ద్వివచన నిర్దేశము. 'యస్యా' అన్న నాయిక అప్రధానయై పోవును.]

'వసన్తశోభా ఇవ' అని ఉపమ.

ఈ సామాన్యనాయికా లక్షణమును తొలుతనే ఇటగ్రహించుట శ్రేయము - సామాన్య నాయిక ధీరయు కలానిపుణయు నగును. నిర్గుణులనైనను ద్వేషింపదు. గుణవంతులయందును రాగ మూనదు, ధనమునుమాత్రము గని అది బయటికి రాగము చూపును. తనకు మిక్కిలి యిష్టుఁడగువానింగూడ ధనము కోలుపోయినాఁ డని మరలఁ గూడెడునాసగలదై తల్లిచేత వెడల నడిపించును. వేశ్యకు ప్రాయికముగా దొంగలు, పురుషు లనిపించుకొనఁగోరు నపుంసకులు, మూర్ఖులు, సులువుగా ధన మబ్బినవారు, తాఁటదమ్ముండ్రు, ప్రచ్ఛన్న కాముకులు లోనగువారు వల్లభులు, వేశ్యయు మదనాయత్తయై ఒకానొకనియందు వాస్తవానురాగము వహించును. ఇది రక్తయైనను విరక్తయైనను దీనికడ రతము కడు దుర్లభము. ...రక్తకు ఉదాహరణము మృచ్ఛకటికాదియందు వసంతసేనాది." వే. వేం. సా. ద.

ఇట్లు నాయికానాయకుల గుణాతిశయము ప్రదర్శింపఁబడినది.

శ్లో. తయో రిదం సత్సురతోత్సవాశ్రయం
నయప్రచారం వ్యవహారదుష్టతామ్,
ఖలస్వభావం భవితవ్యతాం తథా
చకార సర్వం కిల శూద్రకో నృపః. 8

'చక్షోర్య ఏవ చతురా శ్చన్ద్రికాచామకర్మణి
అవన్త్య ఏవ నిపుణాః సుదృశో రతకర్మణి.'

అని అవంతిదేశమందే స్త్రీలకు ఎక్కడను లేని రతాదివైదగ్ధి చెప్పఁబడినది. ఇఁక నందు నగరవాసినులకును, మఱి అదియే కులవిద్యగా నేర్పఁబడిన గణికలకుం జెప్పవలయునా? అందులకు అవంతిపురి చెప్పఁబడినది.

"వేశ్యనామములతుదిని దత్త, లేక సిద్ధ, లేక సేన అనుశబ్దము ఉండవలయును, వణిజులపేళ్ళు ప్రాయికముగా దత్తశబ్దాంతములుగా నుండవలయును. వేశ్యకు ఉదా. వసంతసేన." వే.వేం.సా.ద. వేశ్యంగూర్చి అల్లసాని పెద్దన - 'పూతపసిండివంటి వలపుం బచరించునది' అని.

శ్లో. 8. తయోః=ఆ యిరువురియొక్క, సత్ సురత ఉత్సవ ఆశ్రయమ్=(తుల్యగుణతచేతను తుల్యానురాగతచేతను) శ్లాఘనీయమైన, (ఇతరభావము లెల్ల అడఁగి ఆనందమొక్కటే రస మయిన) సురతహర్షము నాశ్రయించిన, ఇదం=దీనిని, నయప్రచారం=(అందులకైన ప్రతిబంధముల తొలఁగించుకొని ఒండొరుల సంగసిద్ధికైన యిరువురి) ఉపాయవిధానమును, వ్యవహారదుష్టతామ్=(అందు) జగడాలయు వ్యాజ్యముల (పిర్యాదుల)యు సెబ్బరను. ఖలస్వభావం=దుష్టుల స్వభావమును, తథా=అట్లే—మఱియు అనుట, భవితవ్యతాంచ = విధివిధానమును—ఏపురుషకారమును అక్కఱకు రామిని అనుట, సర్వం=లోకమున అనుభవమునకు వచ్చు సమస్త (అర్థజాత)మును, శూద్రకోనృపః=శూద్రకరాజు, చకార=చేసెను. గణితమథ - తా నెఱిఁగిన విద్యలలో గణితమును ఇట్లు ప్రధానముగా చెప్పుటచే, శూద్రకుఁడు గొప్ప జోస్యుఁడును అగును. దాన, తన యనంతరమే ఇది ప్రయోక్తవ్యమని తలఁచె నేమో - ఇందు శ్లోకములలో నెల్ల 'బభూవ కిల'అనియు, 'చకారకిల' అనియు—భూతకాల నిర్దేశముగా—జోస్యపు లెక్కలచే నూహించి వ్రాసినాఁడు. ఇవి ప్రక్షిప్తములు గావు. అగు నేని అప్రక్షేప్త ఇతని పేర నేవ్రాసియున్న సరిగా వ్రాసియుండఁడా? ఇట్లు వ్రాయుట యసంభవము. శూద్రకుని

(పరిక్రమ్యావలోక్య చ) అయే, శూన్యేయ మస్మత్సంగీతశాలా! క్వను గతాః కుశీలవా భవిష్యన్తి? (విచిన్త్య) ఆం, జ్ఞాతమ్,

శ్లో. శూన్య మపుత్రస్య గృహం
చిరశూన్యం నాస్తి యస్య సన్మిత్రమ్,
మూర్ఖస్య దిశః శూన్యాః
సర్వం శూన్యం దరిద్రస్య. ౮

పేరనే ఇవి సంప్రదాయముగా ప్రాచీనులచే వ్యాఖ్యాతమై యున్నవి. అది పరికింపఁదగును. నాటకము తన మరణమునకు తర్వాత ఎప్పుడో ప్రయోగింపఁబడును, పఠింపఁబడును అని. తాను కల్పించిన యితివృత్తపువశమున- విచిత్రలోకవృత్తము నెల్ల ఇందు సమకూర్చెను.

ఇందు ఈనాటకమందలి యితివృత్తము తెఱంగెల్ల సూక్ష్మముగా సూచింపఁబడినది.

పరిక్రమ్య = రంగమున అటునడిచి—సంగీతశాలవంక పోవుట నభినయించి, అయే- ఆశ్చర్యము! ఈమాట విస్మయముం దెలుపును. శూన్యా...మాసంగీతశాలలో ఎవ్వరు లేరే! దీనిచే పేదపడిన నాయకుని యిల్లు బావురుమని యుండుట సూచితము కాఁబోలు. కుశీలవాః = (మా)నటు లందఱు- ఎక్కడికి పోయినారు! ఆం = మఱచినదానిని జ్ఞప్తిచేసికొనుటం దెలుపును. ఈసూత్రియుం దన విభవములం గోలుపోయినట్టు లున్నది.

శ్లో. ౮. అపుత్రస్య = కొడుకు- సంతానము- లేనివానికి, గృహం = ఇల్లు, శూన్యమ్ = (మఱేదేది యున్నను గూడ అప్రియతమవస్తువు లేనందున) శూన్యము(గా తోఁచును), యస్య = ఎవనికి,- సన్మిత్రం = మంచిచెలికాఁడు, నాస్తి = లేఁడో (తస్య = వానికి), చిరశూన్యం = ఆజన్మశూన్యత- మంచి మిత్రుఁడున్న పండువు, సంపద, మఱింత సంతోషదాయకము, లేమిడి తేలికగా ఓర్వఁదగినదిగా నుండును. చెప్పినాఁడు విశాఖదత్తుఁడు. ముద్రా. vi - 2 (ఛాయ)

'సంతాపే తారేశానాం గేహోత్సవే సుఖాయమానానామ్
హృదయస్థితానాం విభవా విరహే మిత్రాణాం దూనయన్తి.'

మూర్ఖస్య = మూర్ఖుని- తెలిసి తెలియనివానికి, దిశః = దెసలు-దేశాలు, శూన్యాః =

కృతం చ సంగీతకం మయా. అనేన చిరసంగీతోపాసనేన గ్రీష్మ సమయే ప్రచణ్డ దినకరకిర ణోచ్ఛుష్క పుష్కరబీజ మివ ప్రచలిత తారకే క్షుధా మ మాక్షిణీ ఖటఖటాయేతే. త ద్యావ ద్గృహిణీ మాహూయ పృచ్ఛామి, అస్తి కించి త్ప్రాతరాశో న వేతి. ఏషో ఽస్మి భోః, కార్యవశా త్ప్రయోగవశా చ్చ ప్రాకృతభాషీ సంవృత్తః. – అవిద, అవిద భోః, చిరసంగీతోపాసనేన శుష్క

(ఎందును సారము గనలేనివానికి) సారహీనములు; దరిద్రస్య = బీదవానికి–(అందును బ్రదికిచెడినవానికి విశేషముగా) సర్వం = సమస్తమును, ఇల్లు ఆత్మ దిక్కులు అన్నియు – ఉన్నను – లేనివే. కొడుకు ఇల్లాలు మొదలగున దెల్ల ఉన్నను, పోషింపలేమిచే – లేనట్లే – సర్వము దుఃఖదాయకమే అగును. అతనికి బుద్ధియే తోఁపదు.

శూన్య మపుత్రస్య ఇత్యాది—ప్రస్తుత దారిద్ర్యముం గూర్చిన మంచి యెుఱుకవ తక్కిన యప్రస్తుతమును ప్రశంసించుటచేత అప్రస్తుతప్రశంస. భంగ్యంతరముగా ఈసూక్తి హితోపదేశ పంచతంత్రములందును కలదు.

> అపుత్రస్య గృహం శూన్యం సన్మిత్రరహితస్య చ
> మూర్ఖస్య చ దిశః శూన్యాః సర్వశూన్యా దరిద్రతా.

ఇది సుభాషితరత్నభాండాగారమున ఉదాహృతము.

సూత్రధారుఁడు పెద్దనటుఁడు, వానిది నటకుటుంబము, ఎందఱో నటులు వాని సంగీతశాలలో శిక్ష పొందుచుండిరి. ఇపుడు తాను పేదవడినాఁడు. వారెవరును తనకడ లేరు. తోడు లేక ఒంటరిగా అలసట కలుగు నంత సంగీతము పాడినాఁడు. అలసినాఁడు. తన లేమిడికి దుఃఖించుచున్నాఁడు ఇట్లు.

సఙ్గీతమ్ = నృత్తగీతవాద్య యోగము — అందు స్త్రీలుం గూడిన అది 'సంగీతకమ్' అనఁబడును. మఱి యిట సంగీతమే – చిరసంగీతోపాసనేన = చాలసేపు పాడుచున్నందున, గ్రీష్మసమయే = ఎండకాలమందు ...ఉచ్ఛుష్క పుష్కరబీజం ఇవ = మిక్కిలి యెండిన తామరగింజవలె, క్షుధా = ఆకలిచేత, ప్రచలితతారకే = సుడియుచున్న – తేలిపోవుచున్న – గుడ్లుగలవై, అక్షిణీ = కన్నులు, ఖటఖటాయేతే = కటకటనను చున్నవి – శోషచే తేలిపోవుచున్నవి,

పుష్కరనాలా నీవ మే బుభుక్షయా మ్లానా న్యఙ్గాని. త ద్యావ ద్గృహం గత్వా జానామి, అస్తి కిమపి కుటుమ్బిన్యా ఉపపాదితం న వేతి. [అవిద, అవిద, భోః, చిరసంగీదోవాసణేణ సుక్ఖపోక్ఖరణా లాఇం విఅ ఖే బుభుక్ఖాఏ మిలాణాఇం అఙ్గాఇం. తా జావ గేహం గదుఅ ఆణామి అత్థి కింపి కుటుమ్బిణీఏ ఉవవాదిదం ణ వేత్తి.] (పరిక్ర మ్యావలోక్య చ) ఇదం త దస్మాకం గృహమ్. త త్ప్రవిశామి. [ఏదం తం అమ్హాణం గేహమ్. తా పవిసామి] (ప్రవి శ్యావలోక్య చ) ఆశ్చర్యమ్, కిం ను ఖల్వస్మాకం గృహే ఉన్యదివ సంవిధానకం వర్తతే. ఆయామి తణ్డులోదక ప్రవాహా రథ్యా, లోహ కటాహ పరివర్తన కృష్ణసారా కృతవిశేష కేవ

గృహిణీం ఆహూయ = ఇల్లాలినిపిలిచి, ప్రాతరాశః = చల్దియన్నము, కార్యవశాత్ = (స్త్రీలతో మాటలాడు) పని కలుగుటవలనను - వారికి సులువుగా తెలియుట కయ్యును, (ప్రాకృతము సుకుమార మగుటచే దాని) ప్రయోగమునకయ్యును, ప్రాకృతభాషీ = ప్రాకృతము మాటలాడువాఁడను, సంవృత్తః = ఐతిని.

'కార్యత శ్చోత్తమాదీనాం కార్యో భాషావ్యతిక్రమః' అని నాటక శాస్త్రము. పని కలిగినపుడు ఉత్తమాదులకును, సంస్కృతము మాటలాడువారికి ప్రాకృతము పెట్టఁదగును.

అవిద - అవిదా - ఆపదలో సహాయమునకైన అఱపు. శుష్క-పుష్కర నాళాని ఇవ = ఎండిన (వాడిన) తామరతూండ్లవలె, మ్లానాని = దుర్బలములు - కిం అపి = ఏదైనను - ఆకలిగొన్నవానికి రుచితోపక్వతతో పనిలేదు. ఆకలి రుచి ఎఱుఁగదు అనుట. ఉపపాదితం = సిద్ధముగా ఉంపఁబడినది. ఇదం త దస్మాకం గృహమ్ - ఈమాటచే అక్కడ ఇల్లు ఉన్నట్లు సూచన - అట్టి సూచనలు ఈ కాలమున రంగాన చిత్తరుల తెరలచే చూపఁబడును. హీమాణహే - ప్రాకృత మున ఆశ్చర్యద్యోతకము. అన్యత్ ఇవ సంవిధానకమ్ - అనుకోనిదానింబోని ఏర్పాటు, ఆయామి తణ్డులోదక ప్రవాహా - పొడుగైన బియ్యపుఁగడుగుయొక్క జాలుకలదిగా ఉన్నది, రథ్యా = (ఇంటిముందటి) వీథి, లోహకటాహపరివర్తన కృష్ణసారా = ఇనుపఁగొప్పెరలను (వేడియు బరువును ఐ ఎత్తరామిచే) దొరలించి లాగుటచేత నల్లచాఱలు గలదిగా ఉన్నది, కృతవిశేషకా = పత్రభంగముల నలం

యువ త్యధికతరం శోభతే భూమిః. స్నిగ్ధగన్ధేనోద్దీప్యమానే వాధికం బాధతే మాం బుభుక్షా. తత్కిం పూర్వార్జితం నిధాన ముత్పన్నం భవేత్? అథ వాహమేవ బుభుక్షాతో న్నమయం జీవలోకం పశ్యామి? నాస్తి కిల ప్రాతరాశో உస్మాకం గృహే. ప్రాణాధికం బాధతే మాం బుభుక్షా, ఇహ సర్వం నవం సంవిధానకం వర్తతే. ఏకా వర్ణకం పినష్టి, అపరా సుమనసో గుమ్ఫతి. [హీమాణహే. కిం ణుక్ఖు అమ్హాణం గేహే అణ్ణం విఅ సంవిహాణఇం వట్టది. ఆఆమి తణ్డులోదఅ ప్పవాహా రచ్ఛా. లోహ కడాహ పరివత్తణ కసణ సారా కిదవిసేసఆ విఅ జుఅదీ అహిఅదరం సోహది భూమీ. సిణిద్ధగన్ధేణ ఉద్దీవిఅన్తీ విఅ అహిఅం బాధే దిమం బుభుక్ఖా. తా కిం పువ్వజ్జిదం ణిహాణం ఉవ్వణ్ణం భవే. ఆదు అహం జ్జేవ బుభుక్ఖాదో అణ్ణమఅం జీఅలోఅం పేక్ఖామి. ణత్థి కిల పాదరాసో అమ్హాణం గేహే. పాణాధియం బాధేది మం బుభుక్ఖా. ఇధ సవ్వం ణావం సంవిహాణఅం వట్టది. ఏక్కా వణ్ణఅం పీసేది, అవరా సుమణాఇం

కృతము, భూమి - ఈ నేల అట్లు సొబగారుచున్నది. ఆఁకొన్నవానికి పెద్దపెద్ద వంటలు చేసినట్లు అగపడుచున్నది, స్నిగ్ధగన్ధేన = నూనియ నేతుల కమ్మని వాసనచేత, ఉద్దీప్యమానా = మఱింత రగుల్కొనఁబడినదై, బుభుక్షా = ఆకలి, పూర్వార్జితం నిధానం = పూర్వులు - మా పెద్దలు దాఁచిపెట్టినధనము, ఉత్పన్నం భవేత్ = బయటపడి దొరకినదా? అథవా... పశ్యామి - కాదా, ఆకొన్న నేనే (ఈ) ప్రాణిలోకము నంతయు అన్నమయముగా తలంచుకొనుచున్నానా? నాస్తి కిల...గృహే = (నిజముగా) మాయింట చల్దియన్నముకూడ ఉండదుగదా, ఇహ సర్వం...వర్తతే = ఇక్కడ నంతయు క్రొత్త యేర్పాటుగా ఉన్నది. వర్ణకమ్ = కస్తూరీ కుంకుమాదుల యంగరాగము. పినష్టి = నూఱుచున్నది, అపరా సుమనసో గుమ్ఫతి = మఱి యొకతె పూలు గ్రుచ్చుచున్నది, ఏకా వర్ణకం పినష్టి - ఇత్యాది. చూ. ముద్రా - ప్రస్తా.

వహతి జల మియం పినష్టి గన్ధా
నియ మియ ముద్గ్రథతే స్రజో విచిత్రాః

గుమ్ఫోది.] (విచిన్త్య) కిం ను ఇదమ్. భవతు, కుటుమ్బినీం శబ్దాప్య పరమార్థం జ్ఞాస్యామి. [కిం ణేదం. భోదు, కుడుమ్బిణిం సద్దావిఅ పరమత్థం జాణిస్సమ్.] (నేపథ్యాభిముఖ మవలోక్య) ఆర్యే ఇత స్తావత్. [అజ్జే, ఇదో దావ.]

నటీ—(ప్రవిశ్య) ఆర్య, ఇయ మస్మి. [అజ్జ, ఇఅ హ్మి.]

సూత్ర—ఆర్యే, స్వాగతం తే. [అజ్జే సాఅదం దే.]

నటీ—ఆజ్ఞాపయ త్వార్యః కో నియోగో ఽనుష్ఠీయతా మితి. [ఆణవేదు అజ్జో కో ణిఓఓ అణుచిట్ఠీఅదు త్తి.]

సూత్ర—('చిరసంగీతోపాసనేన' ఇత్యాది పఠిత్వా) ఆర్యే అస్తి కిమ ప్యస్మాకం గేహే ఽశితవ్యం న వేతి. [అజ్జే అత్థి కింపి అమ్హాణం గేహే అసిదవ్వం ణ వేత్తి.]

నటీ—ఆర్య సర్వ మస్తి. [అజ్జ సవ్వం అత్థి.]

సూత్ర—కిం కి మస్తి? [కిం కిం అత్థి?]

ముసల మిద మియం చ పాతకాలే
ముహు రనుయాతి కలేన హుంకృతేన.

భవతు కుటుమ్బినీ మాహూయ పృచ్ఛామి -

శబ్దాప్య = పిలిచి, పరమార్థణం = వాస్తవమును - నేపథ్యాభిముఖం = తెరవంకఁ (జూచి) - అనఁగాలోపల నట్టువులు ఉండు తట్టు - 'కుశీలవకుటుమ్బస్య స్థానం నేపథ్య ముచ్యతే' దశరూ. కాఁడా, తెరవంకనే.

ఇయ మస్మి - ఇదిగో నేను. ఆర్య - నటీసూత్రధారులు ఒండొరుల 'ఆర్య' - అని పిలుచుకొనవలయును. (సా. ద.) కో నియోగో ఽనుష్ఠీయతామ్ = (నీ)యే యుత్తరువును నేను జరుపుదునో చెప్పు. అశితవ్యం = (తినఁదగినది) అన్నమో అప్పచ్చియో.

నటీ—తద్యథా, గుడౌదనం ఘృతం దధి తణ్డులాః ఆర్యేణాత్తవ్యం రసాయనం, - సర్వ మస్తీతి. ఏవం తవ దేవా ఆశాసన్తు. [ తం జధా గుడోదనం ఘిదం దహీం తణ్డులాయిం అజ్జేణ అత్తవ్వం రసాఅణం సవ్వం అత్థి త్తి. ఎవ్వం దే దేవా ఆసాసేదు. ]

సూత్ర—కి, మస్మాకం గేహే సర్వ మస్తి! అథవా పరిహాససి? [ కిం అమ్హాణం గేహే సవ్వం అత్థి! ఆదు పరిహాససి? ]

నటీ—(స్వగతమ్) పరిహసిష్యామి తావత్. [ పరిహాసిస్సం దావ ] (ప్రకాశమ్) ఆర్య, అస్త్యాపణే. [ అజ్జ, అత్థి ఆవణే. ]

సూత్ర—(సక్రోధమ్) ఆః అనార్యే, ఏవం త వాశా ఛేత్స్యతే, అభావం చ గమిష్యసి, య దిదానీ మహం వరణ్డలమ్బుక ఇవ దూర ముత్క్షిప్య పాతితః. [ ఆః అణజ్జే, ఎవ్వం దే ఆసా ఛిజ్జిస్సది. అభావం అ గమిస్ససి, జం దాణిం అహం వరణ్డలమ్బుఓ విఅ దూరం ఉక్ఖివిఅ పాడిదో ]

గుడౌదనం = బెల్లపుటన్నము - తియ్యని పొంగలి, ఘృతం... = నేయి, పెరుగు, బియ్యము - అనఁగా ఉత్త అన్నము, అత్తవ్యం=తినఁవలసినది, రసాయనం రసవంతమంతయు - తియ్యనివి, పుల్లనివి, ఒగరువి, చేదువి, కమ్మని వన్నియు, ఆశాసన్తు = అనుగ్రహింతురుగాక.

అథవా పరిహససి = లేక పరియాచకము చేయుచున్నావా? అస్తి ఆపణే = ఉన్నది, అంగడిలో. ఏవం తే ఆశా ఛేత్స్యతే - ఇట్లు నీయాశ(లు) తెగఁగొట్టఁబడునుగాక. అభావం చ గమిష్యసి = నాశనమైపోఁగలవు. యత్ = ఏలన, వరణ్డలమ్బుక ఇవ = (వరణ్డ = )వీతపు దూలానికి ఒక తట్టు బరువుకై కట్టఁబడిన బరువైన మట్టిగడ్డ లేక పెద్దబండవలె లేక మట్టిబొమ్మవలె కాదా—ఇరుప్రక్కల కట్టిన ఎత్తైన యిటిక గోడల పైనుండి వాని నడిమిసందును నింపుటకు దబ్బున త్రోసిన యిటికరాశివలె, ఆశచే మిన్నంట నెత్తి, నిరాశచేయుట అందుండి దబ్బున గోతిలో త్రోయుటవలె నున్న దనుట. ఈ 'వరండ' యే వరాండా - Verandahకు ప్రభవము కాఁబోలు - వరాండా రెండెత్తైన గోడలపై నిలుపఁబడునదికదా. లమ్బుక - ఇటికలమో - కంకరమో మోపు.

నటీ—మర్షతు మర్ష త్వార్యః. పరిహాసః ఖ ల్వేషః [మరి సేదు మరిసేదు అజ్జో. పరిహాసో క్ఖు ఏసో]

సూత్ర—త త్కిం పున రిదం నవ మివ సంవిధానకం వర్తతే? ఏకా వర్ణకం పినష్టి, అపరా సుమనసో గుమ్ఫతి, ఇయం చ పఞ్చ వర్ణ కుసుమోపహార శోభితా భూమిః. [తా కిం ఉణ ఇదం ణవం విఅ సంవిహాణవం వట్టది. ఏక్కా వణ్ణఅం పీసేది. అవరా సుమణాఒ గుమ్ఫేది, ఇఅం అ పఞ్చవణ్ణ కుసుమోవహార సోహిందా భూమీ.]

నటీ—అ ద్యోపవాసో గృహీతః. [అజ్జ ఉవవాసో గహిదో.]

సూత్ర—కింనామధేయో உయ ముపవాసః. [కింణామధేఓ అఅం ఉవవాసో.]

నటీ—అభిరూపపతి ర్నామ. [అహిరూఅవదీ ణామ.]

సూత్ర—ఆ ర్యే, ఇహలౌకికో உథవా పారలౌకికః. [అజ్జే, ఇహలోఇఓ ఆదు పారలోఇఓ.]

నటీ—ఆర్య పారలౌకికః. (అజ్జ. పారలోఇఓ.)

సూత్ర—(సరోషమ్) ప్రేక్షన్తామ్ ప్రేక్షన్తా మార్యమిశ్రాః, మదీయేన భక్తపరివ్యయేన పారలౌకికో భ ర్తాన్విష్యతే. [పేక్ఖన్తు

మర్షతు=మన్నించునుగాక. 'ఇది పరిహాసముగదా.' పఞ్చవర్ణ...మిః—నేల ఐదువన్నెల పూల సమర్పణతో వెలుంగుచున్నది. ఉపవాసో గృహీతః= ఉపవాస(వ్రత)ము పట్టఁబడినది. పట్టితిని — అనుట. కిం నామధేయః = ఏ పేరు గలది (ఈవ్రతము)? పేరు చెప్పిన దానిఫలము ఎఱుకపడునని. 'అభిరూపపతిః' అందమైన భర్తఁగలది. కలుగుటకై పూనఁబడినది — అనుట. ఇహలౌకికః అథవా పారలౌకికః— ఈలోకమునకు చెందినవాఁడా పరలోకమునకు చెందినవాఁడా? మదీయేన భక్తపరివ్యయేన=నాదైనయన్నమును వెచ్చించుటచేత — ఖర్చుచేయుటచేత. ఆర్య మిశ్రాః=ఓపూజ్యులారా. ఆర్య=పూజ్యుఁడు, 'మిశ్రః'యు పూజ్యవాచకము. రెండును కలసిన 'అత్యంత పూజ్యులారా'—అని. అన్విష్యతే = వెదకఁబడుచున్నాఁడు. కోరఁబడుచున్నాఁ డనుట.

పేక్షన్తు అజ్జమిస్సా. మమ కేర కేణ భ త్తపరివ్వపేణ పారలోఇఓ భత్తా అణ్ణేసీఅది.]

నటీ—ఆర్య, ప్రసీద ప్రసీద, త్వ మేవ జన్మాన్తరే భవిష్య సీతి. [అజ్జ, పసీద పసీద, తుమం జ్జేవ జన్మాన్తరే భవిస్ససి త్తి.]

సూత్ర—అయ ముపవాసః కేన త వోపదిష్టః. [అలం ఉవ వాసో కేణ దే ఉవదిట్టో.]

నటీ—ఆర్య స్యైవ ప్రియవయస్యేన జూర్ణవృద్ధేన. [అజ్జస్స జ్జేవ పివవఅస్సేన జుణ్ణవుడ్ఢేణ.]

సూత్ర—(సకోపమ్) ఆః దాస్యాఃపుత్ర జూర్ణవృద్ధ, కదా ను ఖలు త్వాం కుపితేన రాజ్ఞా పాలకేన నవవధూకేశహస్త మివ సుగన్ధం కల్ప్యమానం ప్రేక్షిష్యే? [ఆః దాసీఏపుత్తా జుణ్ణవుడ్ఢా,

ప్రసీద=మన్నింపుము. త్వం|ఏవ జన్మా న్తరే భవిష్యసి_నీవే జన్మాంతరమందును నాకు పతివి కాఁగల వని_అగుటకు_ఈ యుపవాసము సంకల్పించుకొంటిని అనుట. కేన ఉపదిష్టః = ఎవరిచేత ఉపదేశింపఁబడినది? ఇది చేయుట మంచిది అని నీకు ఎవరు నేర్పినారు? ప్రియవయస్యేన = ప్రియుఁడైన మిత్రునిచేత. సక్రోధమ్ = కోపముతో, దాస్యాఃపుత్ర = లంజాకొడుకా! కుపితేన రాజ్ఞా పాలకేన - పాలకుఁడని అప్పుడు ఉజ్జయినీ రాజునకు పేరు. అతనిచేత. సుగన్ధం, చుట్టబడిన పూలతోను పూయఁబడిన పైపూతలతోను, పరిమళించుచున్న వానిని, కల్ప్య మానం = నఱక - తఱుగఁ - బడుచున్న వానింగా, ప్రేక్షిష్యే = చూతునో కదా. మేము పేదవడియుండఁగా ఇంత వ్యయము చేయవలయు ఈయుపవాస మేల చెప్పితివిరా, నీవు నాశనమైపోను. అని మిత్రుని తిట్టుట. 'బధ్యమానం'—అను పక్షమున - వబలకు అభేదమగుటచే, వధ్యమానం = చంపఁబడుచున్న వానింగా, నవ వధూకేశహా స్తం ఇవ - క్రొత్త పెండ్లికూతురు తలవెండ్రుకల ముత్తమువలె, 'పాశః పక్షశ్చ హస్తశ్చ కలాపార్థాః కచాత్పరే—' అని అమరుఁడు. కల్ప్య మానం=వాసననూనియపూసి దువ్వి(జడగా) తీర్పఁబడుచున్న, పా. బధ్యమానం = కట్టఁ - ముడువఁ - బడుచున్న.

క దా ణు క్ఖు తుమం కువి దేణ రణ్ణా పాలఏణ ణవవహూ కేసహత్థం విఅ సుఅన్ధం కప్పిజ్జన్తం పేక్ఖిస్సమ్?]

నటీ—ప్రసీద త్వార్యః, ఆర్యస్యైవ పారలౌకికో ఽయ ముపవాసః. [పసీదదు అజ్జో, అజ్జస్స జ్జేవ పారలోఇఓ అఅం ఉవవాసో.] (ఇతి పాదయోః పతతి.

సూత్ర—ఆర్యే, ఉత్తిష్ఠ. కథ యాత్రోపవాసే కేన కార్యమ్. [అజ్జే, ఉట్ఠేహి. ఏత్థ ఉవవాసే కేణ కజ్జమ్.]

నటీ—అస్మాదృశజనయోగ్యేన బ్రాహ్మణే నోపనిమన్త్రితేన. [అమ్హారిస జణ జోగ్గేణ బమ్హణేణ ఉవణిమన్తిదేణ.]

సూత్ర—అతో గచ్ఛతు ఆర్యా. అహ మప్యస్మాదృశజన యోగ్యం బ్రాహ్మణ ముపనిమన్త్రయామి. [అదో గచ్ఛదు అజ్జా. అహం పి అమ్హారిస జణ జోగ్గం బమ్హణం ఉవణిమన్తేమి.]

నటీ—య దార్య ఆజ్ఞాపయతి. [జం అజ్జో ఆణవేది.]
(ఇతి నిష్క్రాన్తా.

సూత్ర—(పరిక్రమ్య) ఆశ్చర్యమ్! తస్మాత్కథం మయైవం

---

ఆర్యస్యైవ = ఆర్యునికే - ఆర్యునికోసమే చేయఁబడుచున్నది. ఈ పారలౌకిక మైన ఉపవాసము. నీవే అందగాఁడవుగా నాకు ప్రియుఁరాలికి, రాఁగల జన్మమందును పతిగా కలుగవలయునని ఉపవాసోద్దేశము. పాదయోః పతతి = పాదముల వ్రాలును. భర్త ప్రసన్నుఁడు కాకున్న వ్రతము ఫలమీయదు భార్యకు - అని, తేర్చుచున్నది. 'ఆర్య, లేవే, చెప్పు, ఈ యుపవాసమున ఎవనితో పని, ఎవఁడు కావలయును - అని.

అస్మాదృశజనయోగ్యేన = మనబోంట్లకు తగినవాఁడైన, బ్రాహ్మణేన ఉపనిమన్త్రితేన = బ్రాహ్మణుఁడు భోజనమునకు పిలువఁబడవలయును అనుట. అతః = అటులైన, గచ్ఛతు ఆర్యా = ఆర్య-నీవు, పోవుదువుగాక, పో, లోపలికి, నీపని చూచు

సుసమృద్ధాయా ముజ్జయిన్యా మస్మాదృశజన యోగ్యో బ్రాహ్మణో ఽన్వేషితవ్యః. (విలోక్య) ఏష చారుదత్తస్య మిత్రం మైత్రేయ ఇత ఏ వాగచ్ఛతి. భవతు. ప్రక్ష్యామి తావత్. ఆర్యమైత్రేయ, అస్మాకంగృహే ఽశితు మగ్రణీ ర్భవ త్వార్యః. [హీమాణహే, తా కధం మఏ ఏవ్వం సుసమిద్ధాఏ ఉజ్జయణీఏ అహ్మారిసజణ జోగ్గో బహ్మణో అణ్ణేసిదవ్వో. (విలోక్య) ఏసో చారుదత్తస్స మిత్తం మిత్తేఓ ఇదో జేవ్వ ఆఅచ్ఛది. భోదు. పుచ్ఛిస్సం దావ. అజ్జ మిత్తేఅ, అహ్మాణం గేహే అసిదుం అగ్గణీభోదు అజ్జో.]

(నేపథ్యే)

భోః అన్యం బ్రాహ్మణ ముపనిమన్త్రియతు భవాన్. వ్యాపృత ఇదానీ మహమ్. [భో, అణ్ణం బహ్మణం ఉవణిమన్తేదు భవమ్. వావుడో దాణిం అహమ్.]

---

కొనుటకు, నేను మనకు తగిన బ్రాహ్మణుని వెదకి తెచ్చెదను. సుసమృద్ధాయాం = మిక్కిలి సంపదతో కూడుకొన్నదైన, అందఱును సంపన్నులే ఐన, ఉజ్జయిన్యాం = ఉజ్జయినియందు, అస్మాదృశ జనయోగ్యః = మాబోంటి జనమునకు తగిన - మేము పేదలము, అందును చారణులము (= భోగమువారము.) అట్టి మాకు తగిన, ఏష చారుదత్తస్య మిత్రం = వీఁడుగో, చారుదత్తుని మిత్రము, చారుదత్తుఁడు దరిద్రుఁడైనాఁడు. వాని మిత్రము వీఁడు నాపిలుపును అంగీకరింపవచ్చును అని ప్రత్యాశ. ఆర్య మైత్రేయ - సంస్కృతమున పూజావాచకమైన 'ఆర్య' 'అయ్య' మొదల్లైనవి పేరుకు ముందు చేర్పఁబడును. మైత్రేయయ్య అనుట, అశితుం = భోజనము చేయుటకు, అగ్రణీః = మొదటివాఁడవు. నీవు తిన్నతరువాత, తక్కిన యందఱిభోజనమును అనుట.

అన్యం బ్రాహ్మణ ముపనిమన్త్రియతు భవాన్ = వేఱు బ్రాహ్మణుని పిలుతువుగాక భోజనమునకు నీవు. వ్యాపృత ఇదానీం అహమ్ = నాకు ఇప్పుడు పని ఉన్నది.

సూత్ర—ఆర్య, సంపన్నం భోజనం నిఃసపత్నం చ. అపి చ దక్షిణాపి తే భవిష్యతి. [అజ్జ, సంపణ్ణం భోఅణం ణీసవత్తం అ. అవి అ దక్ఖిణా వి దే భవిస్సది.]

(పునర్నేపథ్యే)

భోః, ఇదానీం ప్రథమ మేవ ప్రత్యాదిష్టో ఉసి తత్క ఇదానీం తే నిర్బంధః, పదే పదే మా మనురోద్ధుమ్? [భో, దాణిం పఢమం జ్జేవ పచ్చాదిట్టోసి, తా కో దాణిం దే ణిబ్బన్ధో పదే పదే మం అనుబన్ధేదుమ్.]

సూత్ర—ప్రత్యాదిష్టో ఉస్మ్యేతేన. భవతు. అన్యం బ్రాహ్మణ ముపనిమన్త్రయామి. [పచ్చాదిట్ఠో మ్హి ఏదిణా. భోదు అణ్ణం బమ్హణం ఉవణిమన్తేమి.]

(ఇతి నిష్క్రాన్తః)

ఇత్యాముఖమ్

సంపన్నం భోజనం=మృష్టాన్నము, నిఃసపత్నం = మఱెవ్వరుకూడ ఉండనిది, అంతయు నీవే, నీకే. దక్షిణా అపి = దక్షిణయు - ఇంతఆశ చెప్పినను వాఁడు ఒప్పుకొనలేదు.

ప్రత్యాదిష్టః అసి - తిరస్కరింపబఁడితివి, రాను పొమ్మ అంటిని. పదే పదే మాం అనుబన్ధుం = అడుగడుగున నన్ను మాటిమాటికి అడుగుటకు - బలవంత పెట్టుటకు, అనుట.

అన్యం బ్రాహ్మణం ఉపనిమన్త్రయామి = మఱొక బ్రాహ్మణుని పిలిచెదను, భోజనానికి.

ఈ సూత్రధార నటీ సంభాషణలోను - కావ్యార్థసూచన మెండుగాఁ గల దందురు. 'కదా ను ఖలు త్వాం కుపితేన రాజ్ఞా' - ఇత్యాదిచే చారుదత్తుఁడు వధ్యచిహ్నములు దండ పూఁత మొదలైనవి తగిలించి కొఱుత వేయుటకు కొని పోఁబడుట సూచిత మందురు. 'మదీయేన భక్త పరివ్యయేన పారలౌకికో భర్తా ఉన్విష్యతే...త్వ మేవ జన్మాన్తరే భవిష్య సీతి ...ఇహ లోకే త్వయి సతి కో ఉయ మన్యో ఉభిరూప' ఇత్యాదిచే వసంతసేన పాలవని (మఱఁదిని) పరి

హరించి చారుదత్తుని వరించుట - సూచింపఁబడినది - అనియు. 'అన్నియు ఉన్నవి. ఏ దేది? బెల్లపు టన్నము నేయి - ఇత్యాది నంతయు చెప్పి, ఎం దున్నదో చెప్పక ఇంటనే అను భ్రమ కలిగించి, తరువాత 'అంగడిలో' అని చెప్పి నాకు మిన్నంటు నాస కలిగించి అటనుండి దబ్బున గోతిలోనికి త్రోసితివి. నీయాశలు కూలి నీవు నాశనమై పోవుదువు' అను నిత్యాదిచే వసంతసేనయొక్క బండి మాఱు పాటు, దాన శకారునికి దొరకి హత్యగావింపఁబడుట మొదలైనది- సూచిత మందురు.

కార్యవశమున అని సూత్రధారుఁడు ప్రాకృతభాషి యగుట నాటకములలో అరుదు. ప్రాకృతము సంస్కృతమున కన్నను మధురమును సుకుమారమును, స్త్రీలకు సుబోధతరమును అగుటచేత. ఈనాటకమునందు మెండుగా పలు తెఱంగులు ప్రాకృతభాషితములు ఆయావేషములంబట్టి వారివారికి తగునట్లు మార్పు చెందినవి కలవు. 'స్త్రీషు న అప్రాకృతం వదేత్'— స్త్రీలలో - వారినడుమ - అప్రాకృతము అనఁగా సంస్కృతము పలుకరాదు. అట్లే పని కలిగినపుడు ఉత్తములకైనను భాషావ్యతిక్రమము చేయవలసినది అన్నారు. ప్రాకృతభేదములు పెక్కు ఉన్నను శౌరసేని, అవంతిక, ప్రాచ్య, మాగధి అను నాలుగే నాట్య ప్రబంధములయందు ప్రయోగింపఁబడును. అట్లే అపభ్రంశభేదములును పెక్కు ఉన్నను శాకారి చాండాలి శాబరి డక్క-దేశీయ. అను నాలుగును ప్రయోగింపఁబడును. ఈమృచ్ఛకటికమందు సూత్రధారుఁడు నటి రదనిక మదనిక వసంతసేన దానితల్లి చేటి చారుదత్తుని భార్య, కర్ణపూరకుఁడు శోధనకుఁడు శ్రేష్ఠి అను పదునొకండుమంది శౌరసేని భాషింతురు. వీరకుఁడు చందనకుఁడు అవంతికను భాషింతురు. విదూషకుఁడు ప్రాచ్యను. శకార వసంతసేన చారుదత్తుల చేటులు ముప్పురును సంవాహకుఁడు భిక్షువు చారుదత్తుని కొడుకు బాలుఁడు- వీరు ఆర్గురును మాగధి భాషింతురు. వీరు ప్రాకృత పాఠకులు. అపభ్రంశ పాఠకులు. రాష్ట్రియుఁడు శకారుఁడు శాకారి. చండాలులు చాండాలి. మాథురుఁడు ద్యూతకారుఁడును ఢక్క. శౌరసేని యవంతిక ప్రాచ్య, వీనిలో దంత్యసకారము. అవంతికలో రేఫము ఎక్కువ, లోకోక్తులు మెండు. ప్రాచ్యలో స్వార్థక కకార మెక్కువ. ప్రాచ్యలో తాలవ్యశకారము మెండు. మాగధిలోను అట్లే. తాలవ్యశకార వకార ప్రాయలు శాకారిచాండాలులు. దంత్యసకారమును తాలవ్యశకారమును రెండును కలసి సంస్కృతప్రాయగా ఉండునది ఢక్క. ఈ యన్ని భాషలయందును ద్వివచనము లేదు. ఏకవచన బహువచనములే. చతుర్థికి షష్ఠి. పరస్మై పదాత్మనేపద నియమము లేదు.

ఇతి ఆముఖమ్—ఇతి ముగింపును తెలుపును. ఆముఖమని ప్రస్తావనకు మఱి యొక పేరు.

నటీ విదూషకో వాపి పారిపార్శ్వక ఏవ వా
సూత్రధారేణసహితాః సంలాపం యత్ర కుర్వతే
చిత్రై ర్వాక్యైః స్వకార్యోత్థైః ప్రస్తుతాక్షేపిభి ర్మిథః
ఆముఖం త ద్విజానీయా ద్బుధైః ప్రస్తావ నోచ్యతే.

నటియేని విదూషకుఁడేని పారిపార్శ్వకుఁడేనియు సూత్రధారునితో స్వకార్యములం గూర్చి చిత్రవాక్యములతో నారంభించి నాట్యవస్తువును ప్రశంసించునట్టి సంభాషణ ఆముఖమనియు ప్రస్తావనయనియు పేర్కొనఁబడును.

సూత్రం కథాసూత్రం ధారయ తీతి సూత్రధారః, సూత్రమును అనఁగా కథాసూత్రమును ధరించువాఁడు సూత్రధారుఁడు, ప్రధాననటుఁడు. ఒక సూత్రధారుఁడు తెరచాటున నేని బయట నేని నాందిని పఠించును. అనంతరము అతఁడే యేని, అతఁడు పోయి (స్థాపకుఁడను పేరి) యింకొక సూత్రధారుఁడేని ప్రస్తావనను జరుపును. 'ద్విరదేంద్రగతి' మొదలగు శ్లోకముల కవిప్రశంసయు, అవన్తిపుర్యాం ఇత్యాది కావ్యప్రశంసయు, పరిషత్ప్రశంస – ఇత్యాది ప్రరోచన అనఁబడును, ప్రస్తావనలో చేరును '...అతః ప్రీత్యుత్పత్తి ర్భవిష్యతి, తస్మా దవలోక్యతా మేత దితి సా ప్రరోచనా, ప్రకృష్టరుచిహేతుభూతత్వాత్' – అభినవభారతి.

"ప్రయోజనం ప్రయోజ్యస్య, నిర్దేశో దేశకాలయోః
కావ్యార్థసూచకైః సూక్తైః సభాయా శ్చిత్తరఞ్జనమ్
కవికావ్యనటాదీనాం ప్రశంసా చ ప్రరోచనా"

ఎచట ప్రశంసచేత ఉన్ముఖీకరణమో అది ప్రరోచన. ప్రశంసచేత ప్రస్తుతాభినయములయందు శ్రోతలను ఉన్ముఖులం జేయుట ప్రరోచన – ఈ ప్రస్తావన ఐదు తెగలలో కొంతమట్టుకు కథోద్ఘాతమున చేరునేమో – కథోద్ఘాత మన –

'సూత్రధారుని వాక్యమును గాని, దాని యర్థమును గాని కొని పాత్రము ప్రవేశించు నేని అది కథోద్ఘాత మనంబడును.' సా. ద., వే. వేం.

ఇందు సూత్రధారుని మాటకు తాను పలికిన జవాబునే, మరల పలుకుచు, అట్లు కథను ఉద్ఘాతము, ఆరంభము, చేయుచు పాత్రము విదూషకుఁడు ప్రవేశించినాఁడు.

# ప్రథమోఽఙ్కః



[ప్రవిశ్య ప్రావారకహస్తః]

మైత్రేయః—(‘అణ్ణం బహ్మణం’ ఇతి పూర్వోక్తం పఠిత్వా) అథవా మయాపి మైత్రేయేణ పర స్యామన్త్రణకాని సమీహితవ్యాని, హా అవస్థే, తులయసి. యో నామాహం తత్రభవత శ్చారుదత్తస్య ఋ ద్ధ్యాహోరాత్రం ప్రయత్న సిద్ధై రుద్గారసురభి గన్ధిభి ర్మోదకై రే వాశితో ఽభ్యన్తరచతుశ్శాలకద్వార ఉప

---

ప్రవిశ్య ప్రావారకహస్తః - ప్రవిశ్య=ప్రవేశించి, రంగముపైన ప్రేక్షకుల యెదుట నగపడి - అనుట. ప్రావారకహస్తః = ఉత్తరీయము చేతకలవాఁడై - అథవా=అట్లు కాదు; మయాపి మైత్రేయేణ-మైత్రేయుఁడనైన నాచేత సయితము, పరస్య ఆమన్త్రణకాని=ఇతరుని తిండికి పిలుపులు, సమీహితవ్యాని=కోరఁబడఁ వలసివచ్చినవే. ‘మైత్రేయుఁడను’ అని పేరు చెప్పుకొనుట ప్రసిద్ధిద్యోతకము. అల్లవాని వయస్యుఁడనై యున్నవాఁడనే. ఛాయాపాఠాంతరము - ప్రత్యేష్టవ్యాని = అంగీకరింపవలసివచ్చినవే. హా=అయ్యో, అవస్థే = (నా) దశా! తులయసి = చులకన చేయుచున్నావు. అన్తఃసారం ఘన తులయితుం నానిలః శక్ష్యతి త్వామ్ - మేఘ. తత్రభవతః - ఆ పూజ్యుఁడైన - ఎదురుగా లేని వానిని గౌరవించుమాట. అత్రభవతః - ఎదురుగా ఉన్నవానిని. ఋద్ధ్యా = సంపదచేత, అహోరాత్రం = రాత్రింబవలు - సర్వకాలము, ప్రయత్నసిద్ధైః = పూనికతో — ఏర్చి కూర్చి - తయారు చేయఁబడిన - సమగ్రగుణములుగల యనుట - ఉద్గారసురభిగన్ధిభిః = వెలువడుచున్న (వాని తేన్పులంబోని) కమ్మని వాసనగలవైన, మోదకైః ఏవ=కుడుములు లడ్డులతోనే, అశితః=తినఁబెట్టఁబడితినో - నేను అడుగకయే అనుట. అభ్యన్తర చతుఃశాలకద్వారే= లోపలి (ఏకాంతమైన) చావడి (పెద్ద Hall) వాకిట, బాగుగా గాలితగులుచు

విష్టో మల్లకశత పరివృత శ్చిత్రకర ఇ వాఙ్గుళీభిః స్పృష్ట్వా స్పృష్ట్వాపనయామి నగర చత్వర వృషభ ఇవ రోమన్థాయమాన స్తిష్ఠామి. స ఇదానీ మహం తస్య దరిద్రతయా యత్ర తత్ర చరిత్వా గృహపారావత ఇ వావాసనిమిత్త మత్రాగచ్ఛామి. ఏష చార్య చారుదత్తస్య ప్రియవయస్యేన జూర్ణవృద్ధేన జాతీకుసుమవాసితః ప్రావారకో ఽనుప్రేషితః సిద్ధీకృత దేవకార్య స్యార్యచారుదత్త స్యోపనేతవ్య ఇతి. త ద్యావ దార్యచారుదత్తం పశ్యామి,

---

పోయి గానుండు చోట-అనుట. ఉపవిష్టః=కూరుచున్నవాఁడనై, మల్లక శత పరివృతః= గిన్నెల నూటితో చుట్టఁబడినవాఁడనై, నూఱుగిన్నెలు చుట్టురా కలవాఁడనై, నూఱుగిన్నెలలో వివిధములైనవి ఉండఁగా, వానిని, చిత్రకరః ఇవ=చిత్రకారుఁడు (కుచ్చి కుంచెతో) వలె, అఙ్గుళీభిః=వ్రేళ్ళతో, స్పృష్ట్వా స్పృష్ట్వా=తాఁకి చూచి చూచి-మంచివిగా ఏఱుకొని ఏఱుకొని, అపనయామి=పనికిరాని వానిని పాఱవేయుచుండి, రోమన్థాయమానః = నెమరువేయుచు (వానినే తలఁచుకొనుచు) నగర చత్వర వృషభ ఇవ-పట్టణపు నాలుగు దారులు కలయు చోట-విచ్చలవిడిగా పగున్న-ఆఁబోతువలె చూ. మాళ-iv. భట్టిని, ఏష ద్వారదేశే సముద్రగృహస్య, విపణిగత ఇవ బలీవర్ద ఆర్య గౌతమ ఆసీన ఏవ నిద్రాయతే. అచ్చుబెద్దు-ఆఁబోతు, (పోయిగా తృప్తుఁడనుగా), తిష్ఠామి=ఉందునో, సః = అట్టివాఁడను, అహం = నేను, ఇదానీం తస్య దరిద్రతయా = ఇపుడు అతని పేదతికముచేత - యత్ర తత్ర = ఎక్కడ దొరకిన దక్కడ, చరిత్వా = భుజించి (తిరిగియు), గృహపారావత ఇవ=ఇంటి పెంపుడు పావురమువలె,—(అదియు పగ లంతయు అక్కడక్కడ తిరిగి మేసి సాయం కాలము గూటికి మరలును), ఆవాసనిమిత్తం = ఇంటికై - ఉండఁదగినచోటునకై, అత్ర ఆగచ్ఛామి = ఇక్కడికి వత్తును. ఏష చ = ఇదియు, జాతీకుసుమవాసితః = జాజిపూల వాసన కొల్ప (పట్టింప)ఁబడిన, ప్రావారకః = ఉత్తరీయము, ప్రియ వయస్యేన = ప్రియుఁడైన మిత్రముచేత, సిద్ధీకృతదేవకార్యస్య = తీర్చిన - కావించి ముగించిన - దేవతార్చన కలవానికి, ఉపనేతవ్యః = చేర్పవలసినది అని, ఆవేళకు పోయి దీనిని అతనికి ఇమ్ము అని, చిత్రకారుఁడు తన చుట్టును పెక్కు రంగుల గిన్నెల నుంచుకొని, కుంచెతో దాన దాన ముంచి, విదిర్చి, కావలసినంత మాత్రము గొని చిత్తరువునం బూయును, యావత్ పశ్యామి = చూడఁగలను - లేక

(పరిక్రమ్యావలోక్యచ) ఏష చారుదత్తః సిద్ధీకృత దేవకార్యో గృహదేవతానాం బలిం హర న్నిత ఏ వాగచ్ఛతి.

[అథవా మఏ వి మిత్తేఏణ పరస్స ఆమన్తణఆఇఇం పచ్ఛిద వ్వాఇం. హా అవత్థే, తులీఅసి. జో ణామ అహం తత్తభవదో చారుదత్తస్స రిద్ధీఏ అహోరత్తం పఅతణసిద్ధేహిం ఉగ్గారసురహి గన్ధేహిం మోదకేహిం జ్జేవ అసిదో అబ్భన్తరచతుస్సాలఅదుఆఏ ఉవవిట్టో మల్లక సద పరివుదో చిత్తఅరో విఅ అఙ్గులీహిం ఛివిఅ ఛివిఅ అవణేమి. ణఅర చత్తర వుసహో విఅ రోమన్థాఅమాణో చిట్ఠామి. సో దాణిం అహం తస్స దలిద్దదాఏ జహిం తహిం చరిఅ గేహపారావదో విఅ ఆవాసణిమిత్తం ఇధ ఆఅచ్ఛామి. ఏసో అ అజ్జచారుదత్తస్స పిఅవఅస్సేణ జుణ్ణవుద్ధేణ జాదీకుసుమవాసిదో పావారఓ అణుప్పేసిదో. సిద్ధీకిద దేవకజ్జస్స అజ్జచారుదత్తస్స ఉవణే దవ్వోత్తి. తా జావ అజ్జచారుదత్తం పేక్ఖామి. (పరిక్రమ్యావ లోక్య చ) ఏసో చారుదత్తో సిద్ధీకిద దేవకజ్జో గిహదేవదాణం బలిం హరేన్తో ఇదో జ్జేవ ఆఅచ్ఛది.]

---

'యావత్' ఇప్పుడే అనియుం గొనవచ్చును. ఏవః = వీఁడుగో, బలి = ఉపహారము - హరన్ = (చేతఁగొని) పెట్టువాఁడై, ఇత ఏవ = ఇటే. అనఁగా నేను సమయమునకే వచ్చితిని అనుట. సద్ధీవదకద దేవకజ్జస్య - అను పాఠాంతరము శ్రేయముగునా? 'షష్ఠీవ్రతకృతం దేవకార్యం'—షష్ఠి సుబ్రహ్మణ్యషష్ఠి కాఁబోలు - దీన కొంత కాలనిర్దేశమును అగునా? దాని ప్రయోజనముం బరికింపఁదగును. అట్లు పరికింపఁగా, ఇది కృష్ణపక్ష (ప్రదోష)మగుటచే ఆహారము పనికిరాదు. వ్రతము శుక్లముననే. జాజులవాసనం జెప్పుటచే జాజులబుుతువును ఎన్నఁదగునా? ఒకవేళ అత్తరు - జాజితైలము - బుుత్వనియతి సులభమును అగునా? అగును. సుద్ధ పూఁతకు అదియే తగినది. పూలు కావు.

[తతః ప్రవిశతి యథానిర్దిష్ట శ్చారుదత్తో రదనికా చ]

చారుదత్తః—(ఊర్ధ్వ మవలోక్య సనిర్వేదం నిఃశ్వస్య)

శ్లో. యాసాం బలిః సపది మద్గృహదేహలీనాం
హంసై శ్చ సారసగణై శ్చ విలుప్తపూర్వః
తా స్వేవ సంప్రతి విరూఢతృణాఙ్కురాసు
బీజాఞ్జలిః పతతి కీటముఖావలీఢః. ౯

---

ఊర్ధ్వమ్ అవలోక్య - పైకి - మింటివైపు - చూచి - ఇది నిర్వేదసూచనానుభావము. నిఃశ్వస్య - నిట్టూర్చి - ఇదియు.

శ్లో. ౯. యాసాం మద్గృహదేహలీనాం = ఏ నాయింటి గడపలయొక్క - అందు పెట్టిన - బలిః దేవతోపహారము, సపది = తత్క్షణమే, హంసైః చ = అంచలచేతను, సారసగణైః చ = బెగ్గురు గుంపుల చేతను, విలుప్తపూర్వః = మునుపు తినివేసి - అక్కడ లేకుండ చేయఁబడుచుండెనో, తాసు ఏవ = వానియందే, సంప్రతి = ఇప్పుడు, విరూఢ తృణాఙ్కురాసు = మొలచిన పుల్లుమొలకలుగలవైన వానియందు, బీజాఞ్జలిః = గింజలదోసిలి - దోసెఁడు గింజలు, కీటముఖావలీఢః = పురువుల - చీమలు మొదలైనవాని - నోట నాకఁ(= తినఁ)బడినవిగా, పతతి = పడుచున్నది.

మునుపు నాయింటిగడపలకడ ఇడఁబడిన పూజోపహారము, పెట్టియు పెట్టక మునుపే హంసలును సారసములును తినివేయుచుండినవి. ఇప్పుడు అక్కడ చిమ్ముటమొదలగు సంస్కారములును లేక పోయినవి, గడ్డిమొలకలు లేచియున్నవి. అందు దోసెడుగింజలు పడవేయఁబడుచున్నవి. వానిని చీమలు పురువులు నోటకఱచుకొని పోవుచున్నవి. దేహళీనాం - బ. వ. పెద్ద బంగళా - పెక్కు.

అట్టిది పూర్వపు సంపన్నదశ, ఇప్పటి దరిద్రదశయు. అంచలను సారసములను చెప్పుటచే, ఇంటి తోఁట, డిగ్గియ మొదలైనవియు. బలియందును వానికి తగిన వస్తువులునుండెను. ఇప్పుడు అక్కడ చిమ్మిచల్లుటయు లేకపోయినది. ఆచారమునకై వట్టివి ఏవో గింజలు చల్లఁబడుచున్నవని. దశావిపర్యాసము వర్ణింపఁబడినది. గడ్డి మొలచినది అనుటచే గింజలు వట్టు అగునని. కాకులు పిచ్చుకలు బలిభుక్కులు- అని కూడ చెప్పఁబడలేదు. గడ్డి అడుగున పడిపోయినవానిని పురువులే పట్టుకొనఁ

[ ఇతి మన్దం మన్దం పరిక్ర మ్యోపవిశతి. ]

విదూషకః—ఏష ఆర్యచారుదత్తః. త ద్యావ త్సాంప్రత ముపసర్పామి. [ ఏసో అజ్జ చారుదత్తో. తా జావ సంపదం ఉవస ప్పామి. ] (ఉపసృత్య) స్వస్తి భవతే. వర్ధతాం భవాన్. [ సోత్థి భవదే. వడ్డదు భవమ్.

చారు—అయే సర్వకాలమిత్రం మైత్రేయః ప్రాప్తః! సఖే, స్వాగతమ్. ఆస్యతామ్.

---

గలవు. అంచ బెగ్గురులం జెప్పుటచే మునుపు బలిగా ముత్తెములు పెట్టఁబడు చుండె ననియు అంచలు ముత్తెములం దినునవి వానిం గ్రహించుచుండిన వనియు – వే. వేం. శాస్త్రిలవారు చెప్పియుండిరి. దాన చారుదత్తుని యతిమాత్రపు సంపద ఊహింపఁ దగును అని. ముత్తెములమాట కాదంబరి కథాసరిత్సాగరాదులలో వెదకఁదగును.

ఒక్కటనే మఱి యొకటి చేయఁబడుటం జెప్పుటచే అలంకారము పర్యాయము.

ఏకస్మిన్ య ద్యనేకం వా పర్యాయః సోఽపి కథ్యతే.

దేహళులందే మునుపు అవి, ఇపుడు ఇవి అనుటచేత.

ఈశ్లోకము వామనాలంకారమున ఉదాహృతము.

మన్దం మన్దం=(చింతచే) మెల్ల మెల్లగా, పరిక్రమ్య=రంగాన నడిచి, ఆ నటు నికి ఎచ్చరిక, ఉపవిశతి=కూర్చుండును. ఉపసర్పామి = చేరఁబోయెదను. స్వస్తి భవతే=స్వస్తి నీకు – స్వస్తితో చతుర్థి. వర్ధతామ్ = వర్ధిల్లుదువుగాక – చిరాయువు తోను మేలుములతోను అనుట. ఇవి తొలుమాటు కలసికొన్నప్పటి ఆచారపు టుప చారోక్తులు. వాని యర్థముతో అంతగా పనిలేదు.

అయే = ఓహో. తటాలున చూడఁగానే ఈతఁడే అని యనుకొనుటం దెలుపును. సర్వకాల మిత్రం = మునుపు సంపదకాలములో వలె ఇపుడు ఈ దారి ద్ర్యకాలమునను ఏకవిధమైన ప్రీతిగౌరవములతో నుండు మిత్రము – ప్రాప్తః = వచ్చినాఁడు. స్వాగతమ్=స్వాగతము – ఆచారోక్తి – ఆస్యతామ్ – కూర్చుండుము.

విదూ—యద్భవా నాజ్ఞాపయతి. (జం భవం ఆణవేది.) (ఉపవిశ్య) భో వయస్య, ఏష తే ప్రియవయస్యేన జూర్ణవృద్ధేన జాతీకుసుమవాసితః ప్రావారకో ௨నుప్రేషితః 'సిద్ధీకృత దేవకార్య స్యార్యచారుదత్తస్య త్వ యోపనేతవ్య' ఇతి. [భో వఅస్స, ఏసో దే పిఅవఅస్సేణ జుణ్ణవుడ్ఢేణ జాదీకుసుమవాసిదో పావారఓ అణుప్పేసిదో, 'సిద్ధీకిద దేవకజ్జస్స అజ్జచారుదత్తస్స తుఏ ఉవణేదవ్వో' త్తి.] (సమర్పయతి)

[చారుదత్తో గృహీత్వా సచిన్తః స్థితః]

విదూ—భోః కి మిదం చిన్త్యతే. [భో, కిం ఇదం చిన్తీఅది.]

చారు—వయస్య,

శ్లో. సుఖం హి దుఃఖా న్యనుభూయ శోభ తే
ఘనాన్ధకారే ష్వివ దీపదర్శనమ్;
సుఖా త్తు యో యాతి నరో దరిద్రతాం
ధృతః శరీరేణ మృతః స జీవతి. ౧౦

సమర్పయతి=ఒసంగును, గృహీత్వా=గ్రహించి, సచిన్తః స్థితః-చింతిల్లుచు ఉన్నాఁడు - చిన్త్యతే = ఏమి చింతించుచున్నావు?

శ్లో. ౧౦. ఘనాన్ధకారేషు = చిమ్మచీకటులలో, దీపదర్శనం ఇవ = దీపమును చూచుటంబోలె, దుఃఖాని అనుభూయ=దుఃఖములను అనుభవించి(న తర్వాత) సుఖం = సుఖము, శోభతే హి = మిక్కిలి శోభిల్లును. సుఖాత్ తు = సుఖమునుండి యన్ననో (సంపదవలని - అనుట) సుఖ మనుభవించినతరువాత అన్ననో, యః నరః = ఏమనుష్యుఁడు, దరిద్రతాం = దారిద్ర్యమును, యాతి = పొందునో, సః = అతఁడు, శరీరేణ=దేహము (ఉండుట)చేత, ధృతః = బ్రదికినవాఁడయ్యు, మృతః= చచ్చినవాఁడుగా నే - జీవతి = బ్రదుకు చున్నాఁడు. దుఃఖాని - బ. వ. - పలు తెఱంగుల అనుట.

విదూ—భో వయస్య, మరణా ద్దారిద్ర్యా ద్వా కతర త్తే రోచతే. [భో వఅస్స, మరణాదో దాలిద్దాదో వా కదరం దే రోఅది.]

చారు—వయస్య

శ్లో. దారిద్ర్యా న్మరణా ద్వా మరణం
మమ రోచతే న దారిద్ర్యమ్;
అల్పక్లేశం మరణం, దారిద్ర్య
మన న్తకం దుఃఖమ్. ౧౧

---

చిరానుభూత దుఃఖముల యనంతరము_దారిద్ర్యానంతరము_సుఖము అందుల కారణమైన సంపదకలన కలిగినది యించుక యైనను ఎంతో శోభిల్లును! చాల కాలము దట్టంపుఁ జీకటిచే కన్నులు వేనిం జూడక గ్రుడ్డివింబోలె నున్నప్పుడు చిన్న దీపపువెలుఁగును ఎంతో రమణీయముగా నుండును. బ్రదికిచెడినవాఁడు_సంపద అనుభవించి దరిద్రుఁడైనవాఁడు మనుపీనుంగే.

ఈ యొక్క శ్లోకమున _ సుఖం హి దుఃఖా నీత్యాదిలో నాలుగు అలంకారములు _

అనకారే ష్వివ _ అని ఇవచే ఉపమ. ఇందలి యప్రస్తుతము ప్రస్తుతాశ్రయి యగుటచే అప్రస్తుతప్రశంస. మృతో౽పి జీవతి అనుటచే విరోధాభాసము. 'ఆభాసత్వే విరోధస్య విరోధాభాసః' దుఃఖమునుండి సుఖము గన్నవానికన్న సుఖమునుండి దుఃఖము గన్నవాని విశేషించుటచేత వ్యతిరేకము. వ్యతిరేకో విశేష శ్చే దుపమానోప మేయయోః. ఇది సుభాషితరత్నభాండాగా రోదాహృతము.

మరణాత్ దారిద్ర్యాత్ వా _ మరణమును దారిద్ర్యమును సారిది ఆలోచించి నంతట, కతరత్ = ఈ రెంట నేది _ తే రోచతే = నీకు ఇష్టము.

శ్లో. ౧౧. దారిద్ర్యాత్ మరణాత్ వా — దారిద్ర్యాత్ మరణం వా, మరణాత్ దారిద్ర్యం వా అనుట _ ఆరెండు తెఱంగులందును, మరణం = చావు, మే రోచతే = నాకు ఇష్టము, న దారిద్ర్యమ్ = దారిద్ర్యము కాదు _ (ఏలన) మరణం = చావు, అల్పక్లేశం = ఇంచుకే క్లేశము _ కష్టము _ గలది. దారిద్ర్యం = పేదఱికము, అనన్తకం దుఃఖమ్ = కడలేని దుఃఖము _ క్లేశము _ గలది.

విదూ—భో వయస్య, అలం సంతప్తేన. ప్రణయిజన సంక్రామిత విభవస్య సురజన పీత శేషస్య ప్రతిపచ్చన్ద్ర స్యేవ పరిక్షయో ఽపి తే ఽధికతరం రమణీయః. [భో వఅస్స, అలం సందప్పిదేన. పణఇజణ సంకామిద విహావస్స సురజణ పీద సేసస్స పడివచన్దసస్స విఅ పరిక్ఖఓ వి దే అహిఅదరం రమణీఓ.]

చారు—వయస్య, న మమార్థాన్ప్రతి దైన్యమ్. పశ్య,

---

మరణం అనఁగా - తెప్పపాటున ప్రాణము పోవుట - తీఱుట - ఆటే సుఖము దారిద్ర్యమునకన్నను - దారిద్ర్యక్లేశము ఒకనాఁటికి ముగియునది కాదు.

ఇందు ఉపమానోపమేయములకు గల విశేషము చెప్పుటచేత - దారిద్ర్య మరణములకు - వ్యతిరేకము. ఇంచుక పా. భేదముచే హితోపదేశమున, సుభాషిత రత్నభాండాగారమునను ఉదా.

అలం సన్తాపేన = సంతాప (దుఃఖ) పడకు, ప్రణయి జన సఙ్క్రామిత విభవస్య = మిత్రులకు - యాచకులకు - చెందఁజేయఁబడిన సంపదగలవాఁడవైన, తే = నీకు, పరిక్షయః అపి = దారిద్ర్యము సయితము, అధికతరం రమణీయమ్ = మిక్కిలియు శోభిల్లుచున్నది. ఎట్లనఁగా - సురజన పీతశేషస్య = దేవతలచే త్రాఁగఁబడి మిగిలినవాఁడైన, ప్రతిపచ్చన్ద్రస్య = శుక్లపక్ష ప్రథమనాఁటి చంద్రునికిం బోలె.

భర్తృహరి 'తనిమ్నా శోభన్తే' క్షయముచేతను శోభింతురు - అని ఒక జాబితా చెప్పుచు శ్లోకమున 'కళాశేష శ్చన్ద్రః' అనియు, 'గళితవిభవా శ్చార్థిషు నరాః' అనియు చెప్పెను. ఈ కళాశేషుఁడు ప్రతిపచ్చంద్రకళయా, కృష్ణచతుర్దశినాఁటి వేఁగుజామువాఁడా? ప్రతిపచ్చంద్రుఁడు క్షీణుఁడే కాని, ప్రతిదినవర్ధిష్ణువు - 'ప్రాచీమూలే తను మివ కళామాత్రశేషాం హిమాంశోః' అన్నాఁడు మేఘమున కాళిదాసు. రఘువునను ...అకిఞ్చనత్వం మఖజం వ్యనక్తి పర్యాయపీతస్య సురై హిమాంశోః కళాక్షయః శ్లాఘ్యతరో హి వృద్ధేః - అనియు. నాటకమున చారుదత్తుఁడు ఇంకను ఇంతకన్నను క్లేశములపాలై, చంపఁబడఁబోవుచుండి అంతలో ఆకస్మికముగా దైవికముగా తప్పించుకొని మరల బుద్ధిమంతుఁడగుట చెప్పఁబడును గాన- ప్రతిపచ్చంద్రుఁడు పనికిరానివాఁడు కాఁడు. ఆరెండు కళలును అట్లట్లు ఎంచుకొనఁదగినవే.

న మమ అర్థాన్ ప్రతి దైన్యమ్ = ధనముంగూర్చి కాదు, అది పోయినదే అని కాదు నాకు దురవస్థ. మఱేమన, పశ్య = చూడు.

శ్లో. ఏత త్తు మాం దహతి య ద్గృహ మస్మదీయం
క్షీణార్థ మి త్యతిధయః పరివర్జయన్తి;
సంశుష్క_సాన్ద్రమద లేఖ మివ భ్రమన్తః
కాలాత్యయే మధుక రాః కరిణః కపోలమ్. ౧౨

విదూ—భో వయస్య, ఏతే ఖలు దాస్యాఃపుత్రా అర్థకల్య వర్తా, వరటాభీతా ఇవ గోపాలదారకా అరణ్యే, యత్ర యత్ర న

---

శ్లో. ౧౨. ఏతత్ తు = మఱేమన ఇది, మాం దహతి = నన్ను కాల్చివేయుచున్నది, యత్ = ఏదనఁగా, అస్మదీయం గృహం = నాదైన యిల్లు. - అస్మచ్ఛబ్ద బహువచనమునకు - ప్రకరణముం బట్టి ద్వివచనమును ఏకవచనమును అర్థము. - క్షీణార్థః ఇతి = ధనము క్షీణించిపోయిన దని, అతిథయః = అతిథులు, కరిణః కపోలం = ఏనుఁగు గండమును, కాలాత్యయే = (మద)కాలము గడచిపోయి నపుడు, సంశుష్క సాన్ద్ర మదలేఖం = పొత్తిగా ఎండిపోయిన (పూర్వపు) దట్టంపు మదపుటోడికల గీటులు గలదానిని, భ్రమన్తః మధకరాః ఇవ = విడిచి తొలఁగిపోవు తుమ్మెదలవలె, పరివర్జయన్తి = మానుచున్నారు - ఇట్లు రాక తొలఁగి పోవుచున్నారే - అది నన్ను కాల్చివేయుచున్నది - అనుట.

ధనము లేకపోయిన దని నాకు దుఃఖము లేదు - మఱి దాన అతిథులు ఇంటికి రాక పోవుచున్నారే అనుట నన్ను కాల్చివేయుచున్నది. మదకాలము తీఱి మదధార యెండిపోయిన ఏనుఁగు గండమును విడిచి తుమ్మెదలు ఎక్కడికో ఎగిరి పోయినట్లు.

సంశుష్క సాన్ద్ర మదలేఖ మివ— ఉపమ.
కాలాత్యయే మధుకరాః కరిణః కపోలమ్ - వృత్త్యనుప్రాస.

ఏతే ఖలు దాస్యాఃపుత్రాః = ఈ లంజకొడుకులున్నారే - తిట్టు అర్థమైనప్పుడు 'దాస్యాః పుత్ర' అని సమాసము, అలుక్. అర్థకల్యవర్తాః = ధనమనెడు చల్దికూళ్ళు, అరణ్యే = అడవిలో, వరటాభీతాః = కందురీఁగలకు భయపడిన, గోపాలబాలకాః ఇవ = పసులకాపరి (గొల్ల)పిల్లగాండ్రవలె, యత్ర యత్ర = ఎందెందు, న ఖాద్యన్తే = తిన(అనుభవింప)బడవో (పెట్టనుంబడవో)

ఖాద్యన్తే తత్ర తత్ర గచ్ఛన్తి. [భో వఅస్స, ఏదే ఖు దాసీఏ పుత్తా అత్థకల్లవత్తా వరడాభీదా విఅ గోవాలదారఅ అరణ్ణే జహిం జహిం ణ ఖజ్జన్తి తహిం తహిం గచ్ఛన్తి.]

చారు—వయస్య,

శ్లో. సత్యం న మే విభవనాశకృతాస్తి చిన్తా
భాగ్యక్రమేణ హి ధనాని భవన్తి యాన్తి.
ఏతత్తు మాం దహతి నష్టధనాశ్రయస్య
యత్సౌహృదాదపి జనాః శిథిలీభవన్తి. ౧౩

(వరటల పక్షమున కట్టఁబడరో, కొట్టఁబడరో, చీవాట్లు పెట్టఁబడరో అచోటికి అనియు), తత్ర తత్ర = అక్కడక్కడికి - పిసినార్లకడకు, గచ్ఛన్తి = పోవును.

శ్లో. ౧౩. సత్యం = నిజము, మే = నాకు, విభవనాశకృతా = సంపద తొలఁగుటవలన కలిగిన, చిన్తా = దుఃఖము, నాస్తి = లేదు, హి = ఏలన, భాగ్యక్రమేణ = అదృష్టముయొక్క వరుసన, ధనాని = సంపదలు, భవన్తి = కలుగును, యాన్తి = తొలఁగును, తు = (కింతు) మఱేమనఁగా, ఏతత్ = ఇది, మాం దహతి = నన్ను కాల్చివేయుచున్నది - నాకు ఓర్వరాని సంతాపము కలిగించుచున్నది, యత్ = ఏదనఁగా, నష్ట ధన ఆశ్రయస్య = ధనావలంబము లేనివానియొక్క - పేదపడినవానియొక్క, సౌహృదాత్ అపి = మైత్రివలననుండియు, జనాః = జనులు (పామరులు అనుట), శిథిలీభవన్తి = సడలుకొని పోవుదురే - అది నాకు సంతాపకారణము అనుట.

నిజము చెప్పుచున్నాను, వయస్యా, ధనము పోయినదన్న చింత నాకు లేనేలేదు - అదృష్టమున్న అది యుండును, లేకున్న తొలఁగును. ఆకాలము వచ్చినది, పేదపడితిని, అంతే, దానికి నాకు దుఃఖము లేదు. మఱేమన నా మిత్రులుగానున్న జనులు సయితము, ఆధనము వెంబడినే నన్ను విడిచిపోవుచున్నారే, దానికి ఎంతేని దుఃఖింతును.

చింతలేమికి—భాగ్యక్రమేణ హి ధనాని భవన్తి యాన్తి - అని కారణోపన్యాసమును, దహనమునకును 'యత్సౌహృదా'దితి కారణోపన్యాసమును కావ్యలింగము -

సమర్థనీయస్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్.

అపి చ,

శ్లో. దారిద్ర్యాద్ధ్రియ మేతి, హ్రీపరిగతః
ప్రభ్రశ్యతే తేజసో,
నిస్తేజాః పరిభూయతే, పరిభవా
న్నిర్వేద మాపద్యతే,
నిర్విణ్ణః శుచ మేతి, శోకపిహితో
బుద్ధ్యా పరిత్యజ్యతే,
నిర్బుద్ధిః క్షయ మే, త్యహో నిధనతా
సర్వాపదా మాస్పదమ్! ౧౪

శ్లో. ౧౪. దారిద్ర్యాత్ = లేమిడి వలన, హ్రియం = సిగ్గును, ఏతి = పొందును, హ్రీపరిగతః = సిగ్గరి, తేజసః = పరువునుండి, ప్రభ్రశ్యతే = తొలఁగి పోవును, నిస్తేజాః = తేజులేనివాఁడు, పరిభూయతే = అవమానింపఁబడును, పరిభవాత్ = అవమానమువలన, నిర్వేదం = దైన్యమును - హేయత తలఁపును నిరుత్సాహమును, చింతను ఆపద్యతే = పొందును, నిర్విణ్ణః = ఉత్సాహములేని దీనుఁడు, శుచం ఏతి = దుఃఖమును పొందును, శోకపిహితః = దుఃఖము కమ్మినవాఁడు, బుద్ధ్యా = (బాగోగులను తెలియఁజాలు) వివేకముచేత, పరిత్యజ్యతే = వీడఁబడును, నిర్బుద్ధిః = బుద్ధిలేనివాఁడు, క్షయం ఏతి = నాశమును పొందును, అహో = ఆశ్చర్యము! నిధనతా = ధనములేమి, సర్వ ఆపదాం = అన్ని యాపదలకు, ఆస్పదమ్ = చోటు, మూలకారణము. [నిధనతా - తప్పు, నిర్ - కుదురదు, ని - యగును. కాదా, ని - ఉపసర్గాణాం అనేకార్థత్వమ్.]

ఒక్క లేమిడి అనునది గొలుసుగా పరంపరగా క్షయ - నాశపర్యంతమైన ఆపదలకు మూలకారణము. 'బుద్ధినాశాత్ ప్రణశ్యతి' అను సూక్తి కలదేగదా. కావున దారిద్ర్యమునకై నా సంతాపము.

దారిద్ర్యాద్ధ్రియం ఇత్యాది పూర్వపూర్వమును ఉత్తరోత్తరమునకు కారణముగా వరుసగా చెప్పినందున కారణమాల

గుమ్ఫః కారణమాలా స్యాద్యథా ప్రాక్ప్రాన్తకారణైః
అహో నిధనతా సర్వాపదాం కారణం.

అని సమర్థించుటచేత కావ్యలింగమును

ఇది హితోపదేశమునను సుభాషితరత్నభాండాగారమునను కలదు.

విదూ—భో వయస్య, త మే వార్థకల్యవర్తం స్మృత్వాలం సంతాపితేన. [భో వఅస్స, తం జ్జేవ అత్థకల్లవత్తం అంసుమరిఅ అలం సంతప్పిదేణ.]

చారు—వయస్య, దారిద్ర్యం హి పురుషస్య

శ్లో. నివాస శ్చిన్తాయాః పరపరిభవో వైర మపరం
జుగుప్సా మిత్రాణాం స్వజనజనవిద్వేషకరణమ్
వనం గన్తుం బుద్ధి ర్భవతి చ కలత్రా త్పరిభవో
హృదిస్థః శోకాగ్ని ర్న చ దహతి సంతాపయతి చ. ౧౫

త ద్వయస్య, కృతో మయా గృహదేవతాభ్యో బలిః. గచ్ఛ; త్వమపి చతుష్పథే మాతృభ్యో బలి ముపహర.

---

తం ఏవ అర్థకల్యవర్తం = ఆ డబ్బు చలికూటినే, స్మృత్వా = తలంచుకొని, విదూషకునికి అన్నిటికి ఉపమానములు భోజనమునుండియే తోఁచుచుండును. కావున అతఁడు అర్థమును చలిదికూడు అనుట. భోజనమున అన్ని మేలుములు ఎఱిఁగి చలిదియన్నపు హీనతను ఎఱింగినవాఁడు గనుక ఆ యుపమానము.

దారిద్ర్యం హి పురుషస్య = దారిద్ర్యమే హో పురుషునికి.

శ్లో. ౧౫. చిన్తాయాః నివాసః = చింతకు - దుఃఖమునకు, ఇదెట్లు దొరకునా అదెట్లు తెత్తునా అను అకులపాటుకు తావలము, పరపరిభవః = ఇతరులవలని యవమానము, అపరం వైరం = అదొక వేఱు శాత్రవము, మిత్రాణాం = సంగతికాండ్రకు, జుగుప్సా = రోఁత, స్వజన జన విద్వేషకరణమ్ = బంధువులయు, (ఇతర) జనులయు పగ కలిగించునది; వనం గన్తుం=అడవికి పోవుటకు, బుద్ధిః= తలంపును కలుగును, భవతి చ కళత్రాత్ పరిభవః = భార్యవలన అవమానమును కలుగును, హృదిస్థః = మనసులోనున్న, శోకాగ్నిః = శోకరూపపుటగ్ని, న చ దహతి = కాల్చి (బుగ్గిచేసి) వేయదు, సన్తాపయతి చ = మఱి సంతాపమును, దుఃఖమును - కలిగించును.

దారిద్ర్యము ఇన్ని దోషములకు బాధలకు ఏకకారణము కావున నేను లేఁదవ కొనవలె నన్నాను అనుట. శోకాగ్ని రూపకము అలం.

కృతః మయా...... నేను ఇంటిదేవతలకు ఉపహారము పెట్టితిని, పో, నీవు పోయి ఆ నాలుగు దారులు కలయు చోట మాతలకు బ్రాహ్మ్యాదులకు, సప్త మాతలకు బలిని (ఉపహారమును) పెట్టు.

విదూ—న గమిష్యామి. [ణ గమిస్సమ్.]

చారు—కిమర్థమ్?

విదూ—యత ఏవం పూజ్యమానా అపి దేవతా న తే ప్రసీదన్తి, తత్కో గుణో దేవే ష్వర్చితేషు? [జదో ఏవ్వం పూఇజ్జన్తా వి దేవదా ణ దే పసీదంతి, తాకో గుణో దేవేసు అచ్చిదేసు.]

చారు—వయస్య, మా మైవమ్. గృహస్థస్య నిత్యోఽయం విధిః.

శ్లో. తపసా మనసా వాగ్భిః, పూజితా బలికర్మభిః
తుష్యన్తి శమినాం నిత్యం దేవతాః కిం విచారితైః ౧౬

---

న గమిష్యామి = నేను పోవను. యత ఏవం పూజ్యమానా అపి—ఏలయన ఇట్లు పూజింపఁబడుచున్నవా రయ్యును, దేవతలు నీకు ప్రసన్నలు కాకున్నారు. తత్ ... తేషు = కావున ఏమి ప్రయోజనము, దేవతలు పూజింపఁబడిన - దేవతలం గొలిచిన? మా మా ఏవం = ఇట్లు కాదోయి, గృహస్థునికి ఇది నిత్యమైన - తప్పక చేయవలయు - నియతమైన పని. నైమిత్తికము వలె మానఁదగినది కాదు, చేయకున్న ప్రత్యవాయము - తప్పు - పాపము తెచ్చును - అనుట.

బ్రాహ్మ్యాదులు 'సప్త' అనియు 'అష్ట' - అనియు మత భేదము.

బ్రాహ్మీ మాహేశ్వరీ చణ్డీ వారాహీ వైష్ణవీ తథా
కౌమారీ చైవ చాముణ్డా చర్చి కే త్యష్టమాతరః.
బ్రాహ్మీ మాహేశ్వరీ చైవ కౌమారీ వైష్ణవీ తథా
మాహేన్ద్రీ చైవ వారాహీ చాముణ్డా సప్త మాతరః.

పదునార్గురను మతమును కలదు. శక్తి దేవతలు.

శ్లో. ౧౬. శమినాం = వీతరాగులకు, తపసా = వ్రతనియమాదుల దేహమును వాడ్చుటచేతను, (వాడు దేహముతోను అనుట), మనసా = (ధ్యానాదుల) మనసుతోను, వాగ్భిః = (జపాదులయు స్తుత్యాదులయు) వాక్కుతోను, బలి

తద్గచ్ఛ. మాతృభ్యో బలి ముపహర.

విదూ—భోః, న గమిష్యామి. అన్యః కోఽపి ప్రయుజ్యతామ్. మమ పున ర్బ్రాహ్మణస్య సర్వ మేవ విపరీతం పరిణమతి. ఆదర్శగ తేవ ఛాయా వామతో దక్షిణా దక్షిణతో వామా. అన్య చ్చైతస్యాం ప్రదోషవేలాయా మిహ రాజమార్గే గణికా విటా శ్చేటా రాజవల్లభా శ్చ పురుషాః సంచరన్తి. తస్మా న్మణ్డూక

---

కర్మభిః = ఉపహార నైవేద్యములతోను, నిత్యం = తప్పక ప్రతిదినమును, పూజితాః = పూజింపఁబడిన, దేవతాః = దేవతలు, తుష్యన్తి = సంతోషింతురు - ప్రసన్ను లగుదురు. కిం విచారితైః = ఎందులకు ఈయాలోచనలు ?

విధుల ననుష్ఠించి పొందు దేవతాపరితోషము, స్వర్గ స్వారాజ్య నిఃశ్రేయసాంతము లైన పారలౌకిక (ఆముష్మిక) శ్రేయములం గూర్చును. మనులును అట్లు సర్వము అనుష్ఠింతురు. అ దెందులకు ఇ దెందులకు అని ఈ కుతర్కము లేల ?

తపసేతి—ఇందు అలంకారము అప్రస్తుతప్రశంసా. ఇందలి యప్రస్తుతము గృహస్థునికి నాకు నిత్యవిధి అను ప్రస్తుతమును ఆశ్రయించినది.

తద్గచ్ఛ... = కావున పొమ్ము—భోః న గమిష్యామి = ఓయి నేను పోను. అన్యః కః అపి ప్రయుజ్యతాం = మఱెవరి నైనను పంపుము, మమ పునః బ్రాహ్మణస్య = నా కన్ననో బ్రాహ్మణునికి, సర్వం ఏవ విపరీతం పరిణమతి = అంతయు విరుద్ధరూపముగా ముగియును. ఎట్లనఁగా - ఆదర్శగతా ఛాయా ఇవ... = అద్దములోని నీడ - ప్రతిబింబము - వలె, ఎడమ కుడిగాను, కుడి యెడమగాను - అగును. (అంతియ కాదు.) అన్యత్ చ = మఱొకటియు. ఏతస్యాం ప్రదోషవేలాయాం = ఈ సందెచీకటివేళలో, ఇహ రాజమార్గే = ఇక్కడ పెద్దబాటలో, గణికాః = భోగముసానులు, విటాః = (వారిని వెదకుకొని వెంబడించు) విలాసిగాండ్రు, చేటాః = వారి నౌకరులు, రాజవల్లభాః పురుషాః చ = రాజునకు ప్రియులైన మనుష్యులు, సఞ్చరన్తి = తిరుగుదురు - ఇది నాఁటి పాలకుఁడు అను రాజుపాలనలో ఉజ్జయిని స్థితి గతి - అని ఊహింపఁదగును. తస్మాత్ = అందువలన, మణ్డూక

లుబ్ధస్య కాలసర్పస్య మూషిక ఇ వాభిముఖాపతితో వధ్య ఇదానీం భవిష్యామి. త్వ మిహ ఉపవిష్టః కిం కరిష్యసి?

[భో ణ గమిస్సం. అణ్ణో కో వి పడుజ్జీఅదు. మమ ఉణ బహ్మణస్స సవ్వం జ్జేవ్వ విపరీదం పరిణమది. ఆదంసగదా విఅ ఛాఆ వామాదో దక్ఖిణా దక్ఖిణాదో వామా. అణ్ణం అ. ఏదాఏ పదోస వేలాఏ ఇధ రాఅమగ్గే గణిఆ విడా చేడా రాఅవల్లహా అ పురిసా సంచరన్తి. తా మండూఅలుద్ధస్స కాలసప్పస్స మూసిఓ-విఅ హి ముహోవడిదో వజ్ఝో దాణిం భవిస్సమ్. తుమం ఇధ ఉవవిట్టో కిం కరిస్ససి.]

చారు—భవతు. తిష్ఠ తావత్. అహం సమాధిం నిర్వర్త యామి.

లుబ్ధస్య కాలసర్పస్య = కప్పలకు ఆసగొని (కనుపెట్టుకొని)యున్న నల్లత్రాచునకు, మూషిక ఇవ = ఎలుకవలె, అభిముఖ ఆపతితః = ఎదుటపడినవాఁడనై, వధ్యః ఇదానీం భవిష్యామి = ఇపుడు చంపఁబడువాఁడను కాఁగలను. అది నా భయము, త్వం ఇహ ఉపవిష్టః కిం కరిష్యసి = నీవు ఇక్కడ కూర్చుండి ఏమి సేయుదువు? _ నీవే పోరాదా అనుట. ఈ సర్వకాలమిత్రమును ఇట్లు చారుదత్తునికి ఎదురుపలుకుచున్నాఁడు _ ఐనను అతని పిఱికితనము చారుదత్తునికి పరిచితమే కానోపును. కావుననే కోపపడక _ భవతు _ సరే కానీలే, రవంత ఉండు, లే _ సమాధిం నివర్తయామి = ధ్యానమును చేయుచున్నాను, ముగియనీ. విటః _ కామతన్త్రకళాకోవిదః, వేశ్యాకాముకో విటః, చేటః _ సన్ధానకుశలః _ (కాముకులను) కూర్చువాఁడు _ రాజవల్లభుఁడు _ రాష్ట్రియుం బోనివాఁడు_రాష్ట్రియుఁడు _ రాజు బావమఱఁది _ భార్యకు తలుచుగా అవరవర్ణుఁడు, తమ్ముఁడు _ విదూషకుని యీ భాషితముచే ఒక విధముగా వసంతసేనావిట చేట శకారుల ప్రవేశము సూచింపఁబడినది. 'నానూచితస్య పాత్రస్య ప్రవేశః' అని శాస్త్రము. శకారప్రాయ _ భాషిత్వాత్ _ శకారో రాష్ట్రియః స్మృతః _ రాష్ట్రియుని మాటలలో ఎక్కుడు 'శకారములు' ఉన్నందున వానిని శకారుఁడని యందురు. ప్రకరణమున శకారుఁడు, కుట్టిని, చేటి, ధర్మశాస్త్ర బహిష్కృతులును. విటచేటాదులు మెండుకొందురు.

[ నేపథ్యే ]

తిష్ఠ వసన్తసేనే, తిష్ఠ

[తతః ప్రవిశతి విటశకారచేటై రనుగమ్యమానా వసన్తసేనా]

విటః—వసన్తసేనే, తిష్ఠ, తిష్ఠ,

శ్లో. కిం త్వం భయేన పరివర్తిత సౌకుమార్యా
నృత్యప్రయోగ విశదౌ చరణౌ క్షిపన్తీ
ఉద్విగ్న చఞ్చల కటాక్ష విసృష్ట దృష్టి
ర్వ్యాధానుసార చకితా హరిణీవ యాసి. ౧౭

శకారః—తిష్ఠ వసన్తసేనికే, తిష్ఠ, [ చిట్ఠ వసన్త శేణిఏ, చిట్ఠ, ]

తిష్ఠ వసంత సేనే = నిలు, వసంత సేనా.

శ్లో. ౧౭. కిం = ఏల, త్వం = నీవు, వ్యాధానుసార చకితా = వేఁట గాఁడు వెంట తఱుముటచే భయపడిన, హరిణీ ఇవ = లేడివలె, పరివర్తిత సౌకుమార్యా = తొలఁగిపోయిన మార్దవము - ఇట్లు వడివడి నడకవను పరువునను తాళలేనిది - కలదానవై, నృత్త ప్రయోగ విశదౌ = ఆట ఆడుటలో - అడుగు వేయుటలో - అందమైన - అప్పటి యందము తోఁచునట్లుగా, చరణౌ = పాదములను, క్షిపన్తీ = విసురుగా వేయుచున్నదానవై, ఉద్విగ్న...దృష్టిః = బెదరి లోలములైన కడకండ్లం బఱపు చూపుకలదానవై, యాసి = పోవుచున్నావు?

బోయ వెంటఁబడిన లేడివలె పరువెత్తుచున్నావే, ఎందులకు? నీ సౌకుమార్యము తొలఁగిపోవుచున్నది. పాదములు ఆటలో అడుగు వేసినట్లు అందగించుచున్నవి. చూపులు భయలోలములై కడకండ్లం బరపుచున్నవి. ఇదంతయుం గూడ నీపై మరులుగొన్న నాకు అందముగానే ఉన్నవి. అట్లు విసవిస పోనేల?

'గ్రీవాభఙ్గాభిరామం ముహు రనుపతతి స్యన్దనే బద్ధదృష్టిః' - అన్న భయతరళదృష్టి - స్మారిత మగుచున్నది. చకితహరిణీవ - ఉపమ

వసన్తసేనికే - అని శకారుఁడు సుకుమారముగా సంబోధించుచున్నాఁడు.

శ్లో. కిం యాసి ధావసి పలాయసే ప్రస్ఖలన్తీ
వాసు ప్రసీద న మరిష్యసి తిష్ఠ తావత్,
కామేన దహ్యతే ఖలు మే హృదయం తపస్వి
అఙ్గారరాశి పతితా మివ మాంసఖణ్డమ్. ౧౮

[ కిం యాశి ధావశి పలాఅశి పక్ఖలన్తీ
వాశూ పశీద ణ మలిస్సశి చిట్ఠ దావ
కామేణ దజ్ఝది హు మే హడకే తవశ్శి
అఙ్గాల లాశిపడిదే విఅ మంశఖణ్డే. ]

శ్లో. ౧౮. వాసు = పిల్లా, కిం = ఎందుకే, ప్రస్ఖలన్తీ = తొట్రుపడుచున్న దానవై, యాసి ధావసి పలాయసి = పోవుచున్నావు పరువులాడుచున్నావు? ప్రసీద = మన్నింపవే, అనుగ్రహింపవే, న మరిష్యసి = చావువలేవే - నిన్ను నేనేమియుచేయనే, చంపనే, తిష్ఠ తావత్ = నిలువవే, తపస్వి - పాపము జాలిగొనఁదగినదై, మే హృదయం = నామనసు, అఙ్గార రాశి పతితం మాంసఖణ్డం ఇవ = నిప్పుల మొత్తమున పడ్డ ఎఱచిముక్కవలె, కామేన = మదనునిచేత, దహ్యతే ఖలు = కాల్చివేయఁబడుచున్నది కదటే.

శకారుఁడు తన యనురాగము అయోగ తాపము ఉట్టిపడునట్లు మాటలాడుచున్నాఁడు - బతిమాలుకొనుచున్నాఁడు - బతిమాలుకొనునట్లు - ఓపిల్లా, ఎందుకే ఆతొట్రుపాటు, ఆపరువు? నామీఁద ప్రీతి వహింపవే. నిన్ను నేను చంపనే, రవంత నిలువవే. నామనసుమీఁద జాలిపడవే. అది నిప్పులలో పడిన రొయిచి ముక్కవలె ఈకామునిచేత మాడ్చివేయఁబడుచున్నదే.

మాంసఖణ్డం ఇవ - అనుటచే ఉపమ.

శకారుఁడు ఇట్టిమాటలవాఁ డగునని లక్షణము.—

అపార్థ మక్రమం వ్యర్థం పునరుక్తం హతోపమమ్
లోక న్యాయ విరుద్ధం చ శకారవచనం విదుః.
ఆగమ లిఙ్గ విహీనం దేశ కాల న్యాయ లోక విపరీతమ్
వ్యర్థైః కార్థ మపార్థం భవతి హి వచనం శకారస్య.

చేటః—ఆర్యే, తిష్ఠ, తిష్ఠ, [అజ్జుకే, చిట్ఠ, చిట్ఠ,]

శ్లో. ఉత్త్రాసితా గచ్ఛ స్యన్తికా న్మమ
సంపూర్ణప క్షేవ గ్రీష్మమయూరీ,
అవవల్గతి స్వామి భట్టారకో మమ
వనే గతః కుక్కుటశాబక ఇవ. ౧౯

[ఉత్తాశితా గచ్ఛశి అన్తికా మే
శంపుణ్ణ పచ్ఛా విఅ గిమ్హ మోరీ
ఓవగ్గదీ శామిఅ భట్టకే మే
వణ్ణే గడే కుక్కుడశావకే వ్వ.]

---

అజ్జుకే = ఆర్యే = అమ్మా, తిష్ఠ = నిలు, చేటుఁడు వారి నౌకరు కావున సగౌరవముగా పలుకుచున్నాఁడు, ఆర్యా = అమ్మా అని. వాని పని కామినీ సంధానము గదా. అత్తికా - అనియు. పా. = అక్కా, నీచజాతులకు బోగము వారితో ఇట్లు బంధు వ్యవహారము వాడుక.

శ్లో. ౧౯. సంపూర్ణపిఞ్ఛా (పా. పుచ్ఛా) = నిండారిన పింఛము గల, గ్రీష్మ మయూరీ ఇవ = ఎండకాలపు నెమలివలె, ఉత్త్రాసితా = బెదరి, మమ అన్తికాత్ = నా సమీపమునుండి, గచ్ఛసి = పోయెదవు; - అట్టి నెమలి గ్రీష్మమున ఎఱ్ఱని పూవు చివురుం గాంచియు దావాగ్ని యని బెదరి పోవునట్లు, నీవును సింగారములో నిండినదానవై దొంగ యని భయముచే, నీమీఁద మరులుగొన్న వానినే నాసామిని చూచి పరువెత్తుచున్నావు - మమ స్వామి భట్టారకః = నాదొర, వనే గతః = అడవిలోకి పోయిన, కుక్కుటశాబక ఇవ = కోడిపిల్లవలె, అపవల్గతి = ఎగురుచు దుముకుచు ఉన్నాఁడు - నీమీఁది మరులుచే నిన్నుం గలసికొనుటకు.

చేటునికి తగిన భావములు ఉపమానములు - హీనమైనవి అనుట - వానికి తోఁచును. కవియుచితజ్ఞత. తళతళని నగలతో పళపళని చీరతో నిండార పురి విప్పుకొన్న వేసంగి నెమలివలె మఱింత భయపడి పోయెదవు, నీకోసము నాసామి - రాష్ట్రియుఁడు - అడవికోడిపిల్లవలె గునగున ఎగురుచును దూఁకుచును ఉన్నాఁడమ్మా.

మయూరీ ఇవ కుక్కుట శాబక ఇవ—ఉపమ.

విటః—వసన్తసేనే. తిష్ఠ, తిష్ఠ

శ్లో. కింయాసి బాలకదలీవ వికమ్పమానా
రక్తాంశుకం పవనలోలదశం వహన్తీ
రక్తోత్పల ప్రకర కుట్మల ముత్సృజన్తీ
టఙ్కై ర్మనఃశిలగు హేవ విదార్యమాణా. ౨౦

శకారః—తిష్ఠ, వసన్తసేనే, తిష్ఠ, [ చిట్ఠ, వసన్తసేనే, చిట్ఠ, ]

---

శ్లో. ౨౦. బాలకదళీవ = జింకపిల్లవలె, వికమ్పమానా = వణఁకుచున్నదానవై, పవన లోల దశం = గాలికి కదలాడుచున్న చెఱఁగు గల, రక్తాంశుకం = ఎఱ్ఱ పట్టుచీరను, వహన్తీ = తాల్చినదానవై, రక్తోత్పలప్రకర కుట్మలం = ఎఱ్ఱకలువ గుంపు మొగ్గలను, ఉత్సృజన్తీ = వెలికి జార్చు(చల్లు)చున్నదానవై, యాసి కిం = ఏల పోవుచున్నావు? నీ నడకకు కొప్పునుండి ఆ మొగ్గలురాలుట ఎట్లున్న దనఁగా, టఙ్కైః = ఉలులతో, విదీర్యమాణా = చీల్పఁబడుచున్న - చీలఁగొట్టబడుచున్న, మనః శిల గుహా ఇవ = ఎఱ్ఱజాతి కొండ గుహావలె ఎఱ్ఱ గలువ మొగ్గల పిండు రాలుట, రక్తాంశుకము గాలికి ఆడుట - ఉలుల దెబ్బలకు ఆయెఱ్ఱ బండనుండి తునుకలు ఎగురున ట్లున్నది అనుట - అప్పుడే చీలి ఎగురువానికి కాంతి తళుకు ఎక్కువ.

పోవుచున్నా వేమమ్మా, జింకపిల్లవలె, వణఁకుచున్నావు, నీయెఱ్ఱచీర చెఱఁగు గాలికి ఆడుచున్నది, కొప్పునుండి ఎఱ్ఱగలువ మొగ్గల పిండు రాలుచున్నది. ఆ యెఱ్ఱకాంతియు ఈ యెఱ్ఱకాంతియు, టంకముతో చీలఁగొట్టఁబడు మణిసిల గుహ పెళ్ళలవలె నిగనిగలాడుచున్నది. నీ యీ గమనము మాదొరకు మఱియు వెఱ్ఱి యెత్తించుచున్నది.

బాలకదళీ ఇవ, మనః శిల గుహా ఇవ - ఉపమలు.

నిలువవే వసంతసేనికా నిలు.

శ్లో. మమ మదన మనఙ్గం మన్మథం వర్ధయన్తీ
నిశి చ శయనకే మమ నిద్రా మాక్షిపన్తీ
ప్రసరతి భయభీతా ప్రస్ఖలన్తీ స్ఖలన్తీ
మమ వశ మనుయాతా రావణ స్యేవ కున్తీ. ౨౧

[మమ మఅణ మణఙ్గం మన్మథం వడ్డఅన్తీ
ణిశి అ శఅణకే మే ణిద్దఅం అక్ఖివన్తీ
పశలశి భఅభీదా పక్ఖలన్తీ ఖలన్తీ
మమ వశ మణుజాదా లావణ శ్శేవ కున్తీ.]

విటః—వసన్తసేనే,

శ్లో. కిం త్వం పదై ర్మమ పదాని విశేషయన్తీ
వ్యాలీవ యాసి పతగేన్ద్రభయాభిభూతా

---

శ్లో. ౨౧. మమ = నాకు, మదనం అనఙ్గం మన్మథం = ఇట్లు అర్థభేదమున జ్ఞానము తాత్పర్యము లేకయే పర్యాయములం బలుకుట శకార భాషితముల ప్రకారము, వర్ధయన్తీ = కామోద్దీపనము చేయుచున్నదానవై, నిశి = రాత్రియందు, శయనకే = పడుకలో, మే = నాకు, నిద్రాం అక్షిపన్తీ చ = నిద్రను తొలఁగించుచున్నదానవును ఐ, జాగరము చేయించుచున్నదానవై, అట్లు నేను మరులుకొనియుండఁగా. భయభీతా=నీవు భయముగొని, ప్రస్ఖలన్తీ స్ఖలన్తీ = మరల పర్యాయపదములు - తొట్రుపడుచు, ప్రసరసి = పరువెత్తు చున్నావు, రావణస్య = రావణునికి, కున్తీ ఇవ = కుంతివలె, మమ = నాకు, వశం ఉపయాతా = వశమైతివి, నిన్ను నేను వదలనులే. ఈ భాషితమున నిరర్థక పునరుక్తులును వ్యాఘాతోపమయు - రావణుఁ డెక్కడ కుంతి యెక్కడ! - పురాణవిరుద్ధము. నాకు కామోద్దీపనము జాగరము కలిగించుచున్నావు. మఱి భయపడి తొట్రుపడుచు పరువెత్తుచున్నావు. రావణునికి కుంతివలె నాకు దొరకినావులే. ఇఁక నెక్కడికి పోఁగలవు?

శ్లో. ౨౨. వరగాత్రి = ఓసుందరీ, పతగేన్ద్ర భయాభిభూతా = గరుత్మంతునివలన భయముచే పైకొనఁబడిన, వ్యాళీ ఇవ = నాగి - పామువలె, పదైః = (నీ) అడుగులతో, మమ పదాని = నాయడుగులను, విశేషయన్తీ = మించుచున్నదానవై - అంతవడిగా, నాకు దొరకకుండ, త్వం యాసి కిం = నీవు పరువెత్తెదవు

వేగా దహం ప్రవిసృతః పవనం న రున్ధ్యాం
త్వన్నిగ్రహే తు వరగాత్రి న మే ప్రయత్నః. ౨౨

శకారః—భావ, భావ, [భావే, భావే,]

శ్లో. ఏషా నాణకమోషికా మకశికా

---

ఏలనే? అహం = నేను, వేగాత్ = వేగమువలన, ప్రవిసృతః = ప్రసరించినవాఁడను అనుట—ఐ, పవనం = గాలిని, న రున్ధ్యాం = అడ్డగింపఁబట్టలేనా? (పా. నిరున్ధ్యాం = అడ్డగింతును.) తు = కాని, త్వన్నిగ్రహే = నిన్ను పట్టుకొనుటయందు, న మే ప్రయత్నః = నా ప్రయత్నము లేదు, నేను నిన్ను బలవంతముగా పట్టుకొనఁగోరలేదు—నీవై చిక్కవలె నని వాయాస.

గరుడునికి కంటఁబడి భయము గొని పఱచు పామువలె, నేను వడిగా నడచుచున్నను, నాకన్న వడిగానడచుచు పోయెద వేమి? నేను పట్టుకొనవలయువన్న నీ వెంత? వేగమున గాలిని సయితము మించుదునే. నీవే దొరకవలయు నని వాయాస. విటుని రసికోక్తి.

వ్యాళీవ...ఉపమా.

వేగా దహం ప్రవిసృతః పవనం నిరున్ధ్యామ్—అతిశయోక్తి, గాలిని నిరోధింపలేకున్నను నిరోధింతు ననుటచేత.

భావ = భావ, రవంత తనకంటె గొప్పవానిని భావ అనుట పండితుఁడా—అన్నట్లు. ఐనను భావ అని యనుట నాణెము, మర్యాద. విటుఁడు శకారుఁడు. ఇరువురును కూడి వసంతసేన వెంటఁబడుట కుక్కలు కుక్కవెంట పడినట్లు రసాభాస మగును. అట్లు వానిం గలుపుకొని పలుకుచున్నాఁడు, శకారుఁడు.

శ్లో. ౨౩. ఏతాని = ఇవిగో, అస్యాః = దీనికి, మయా = నాచేత, దశ నామాని = పదిపేరులు, కృతాని = పెట్టఁబడినవి—అద్యాపి = ఇప్పటికిని, మాం న ఇచ్ఛతి = నన్ను ఒల్లకున్నదే! పేర్లు ఏమనఁగా—నాణకమోషి = వెండి బంగారు నాణెముల—ధనము—మోసముచేయునట్టిది, దోచునట్టిది, కామకశికా = మదనుని కొరడా. ఎంత ధనమునైన హరించు కాముని కొరడా అని—కొరడా ఆడింపఁగా భోగులు అదరి వసమై ఎంతేని ధనమిత్తురు. కాంతితో దానిని మించినట్టిది—అనుట—కొరడాతోనుంబోలె కాముఁడు దీనిం బ్రయోగించి ధనికుల వశపఱుచుకొనును, కొరడాఅనుటచే జవ్వాడు నడుముతో తన్వంగిగా ఉండుట సూచితము.

మత్స్యాశికా లాసికా
నిమ్ననాసా కులనాశికా అవశికా
కామస్య మఞ్జూషికా
ఏషా వేశవధూః సువేశనిలయా
వేశాఙ్గనా వేశికా
ఏతా న్యస్యా దశ నామకాని మయా
కృతా న్య ద్యాపి మాం నేచ్ఛతి. ౨౩

[ ఏశా ణాణకమూశికా మశషికా
మచ్ఛాశికా లాశికా
ణిణ్ణాశా కులణాశికా అవశికా
కామస్స మఞ్జూశికా
ఏశా వేశవహూ సువేశణిలఆ
వేశఙ్గణా వేశిఆ

---

మత్స్యాశికా = చేపలు తినునది, తన కిష్టమైనవానిం దినునది తనకు ప్రియురాలు, శకారునికి చేపలు ఇష్టము. లాసికా = ఆటకత్తె, నిమ్ననాసా = కుంగిన ముక్కు గలది. ముక్కునకు ఉన్నతియే యందమైనను శకారుని మోటుమాటలలో అది దోషముగాదు. 'నిమ్నాశా' అనియు ఛాయాపాఠము - నీచమైన - నీచులమీఁద - కేవలధనార్థమైన - ఆశ గలది అనుట మేలు. కులనాశికా = కులమును నాశము చేయునది, అవశికా = ఎవరికిని వశపడనిది, కామస్య మఞ్జూషికా = కాముని పెట్టె - బరణి - కాముఁడు తనవి అన్నియు ఇందు ఉంచుకొనును - మరులుగొల్పు సామగ్రియంతయు అనుట. వేశవధూః = భోగముపిల్ల, సువేశనిలయా = భోగము వారి వీథిలో ఉండునది - కాదా - మంచి వేషమునకు అందమునకు స్థానమైనది, వేశాఙ్గనా వేశికా = శకారుని పర్యాయపదాలు. ఇవి పది దీనిపేర్లు. ఇట్లు ముద్దు ముద్దుగా పిలిచినను దొరకకున్నదే! దశనామస్తోత్రముచేసినను ప్రసన్న కాకున్నదే. నేను దీనికి పదిపేర్లు పెట్టి పిలిచినను, స్తోత్రపారాయణము చేసినను, ఇది న న్నొల్లకున్నదే!

వేశే శే హాశ ణామకే మమ కలే
అజ్జావి మం ణేచ్ఛది. ]

విటః—

శ్లో. ప్రసరసి భయవిక్లవా కిమర్థం,
ప్రచలిత కుణ్డల ఘృష్ట గణ్డ పార్శ్వా
విటజననఖ ఘట్టి తేవ వీణా
జలధర గర్జిత భీత సార సీవ. ౨౮

---

...కళికా ...చ్ఛళికా ...లాళికా - వృత్త్యనుప్రాస - శబ్దాలంకారము. కామస్య మఞ్జూషికా - ఇందు పరిణామము - అలంకారము. ప్రకృతము వసంతసేన కాముని పెట్టెగా పరిణమించి అన్వయము బొందుటచేత. పరిణామః క్రియార్థశ్చే ద్విషయీ విషయాత్మనా!

శ్లో. ౨౮. భయ విక్లబా = భయముచే (ఇట్లు) నిలుకడలేనిదానవై - ఓపనిదానివై - అనుట, విటజన నఖ ఘట్టితా వీణా ఇవ = విటజనుల గోళ్ళతో గట్టిగా మీటఁబడిన వీణవలె, ప్రచలితకుణ్డల... = కదలుచున్న కమ్మలచే ఒరయఁబడిన చెక్కిళ్ళప్రక్కలు గలదానవై, జలధర...సారసీ ఇవ = ఉఱుమునకు బెదరిన హంసివలె, కిమర్థఙం ప్రసరసి = ఏల పరువెత్తుదువు?

ఎందుకే నీకు భయము? పరువెత్తుచువు. కమ్మలు చెక్కిళ్లను ఒరసికొనుచున్నవి. విటులు గోట మీటిన వీణెవలె నున్నావు. ఉఱుముకు ఉలికిన హంసవలె పఱచుచున్నావు!

వీణా ఇవ—ఉపమ. సారసీ - అనఁగా ఇట బెగ్గురు కాదు. బెగ్గురు. ఇంచుమించుగా కొంగజాతిదే, బలాకంబోనిదే. దానికి ఉఱుము, మేఘధ్వని ఇంపైనది - గర్భం బలాకా దధ తేబ్దయోగాత్ - ఇతి కర్ణోదయే. అది మేఘోదయమున, దాననే గర్భముం దాల్చును. ఉఱుము హంసికి ఉలుకు కలిగించును. సారసమనఁగా హంసయు. చూ. మేఘ. సంజీవని. I - 32.

'చక్రాఙ్గః సారసో హంసః ఇతి శబ్దార్ణవే'

మఱియు నడక ప్రస్తావముగుట చేతను, హంసయాన అని కదా కవులమాట.

శకారః—

శ్లో. ఝుణఝ్ఝుణమితి బహుభూషణ శబ్ద మిశ్రం
కిం ద్రౌపదీవ పలాయసే రామభీతా
ఏష హరామి సహ సేతి యథా హనూమా
న్విశ్వావసో ర్భగినీమివ తాం సుభద్రామ్. ౨౫

[ఝుణఝ్ఝుణన్త బహుభూషణ శద్ద మిశ్శం
కిం దోవదీ విఅ పలాఅసి లామభీదా
ఏశే హలామి శహశత్తి జధా హణూమే
విశ్శావశుశ్శ బహిణిం విఅతం శుభద్దమ్.]

చేటః—

శ్లో. రమయ చ రాజవల్లభం తతః

శ్లో. ౨౫. ఝుణఝ్ఝుణాయమాన బహుభూషణ శబ్దమిశ్రం = జణజణ యని మెరయు పెక్కు నగల శబ్దముగల యట్లుగా, రామభీతా = రాముని వలన భయపడిన, ద్రౌపదీ ఇవ = ద్రౌపదివలె, పలాయసే కిం = పరువెత్తెదవు ఎందులకే? హనూమాన్ = హనుమంతుఁడు, విశ్వావసోః భగినీం తాం సుభద్రాం ఇవ యథా (పునరుక్తి) = విశ్వావసుని చెల్లెలిని ఆసుభద్రంబోలె, సహసా ఇతి = తటాలున ఒడిసికొని, ఏష హరామి = ఇదిగో కొనిపోయెదను.

నీ వడికి సొమ్ములు మఱింత జణజణ మ్రోఁగఁగా-పరువెత్తుచున్నావు! ఇఁకను నేను తాళను, ఒడిసి నిన్ను బలాత్కారముగా కొనిపోయెదను.

ఇట శకారుని భాషితమున పెల్లుగా వ్యాహతి, విరుద్ధములైన మాటలు ప్రయుక్తములు. దుశ్శాసనభీత ద్రౌపది, రామభీత కాదు, అట్లే సుభద్రను హరించినవాఁడు అర్జునుఁడు, హనుమంతుఁడు కాఁడు, సుభద్ర కృష్ణభగిని, విశ్వావసునికి కాదు, ఇతి నిరర్థకము, ఇవ యథా పర్యాయములు కావున పునరుక్తి. శకారుఁడు బడాయిగా పురాణకాలక్షేపము జేయువాఁడు.

శ్లో. ౨౬. రాజవల్లభం చ = రాజునకు ప్రియుఁడైన ఈశకారుని సైతము, రమయ = సంతోషపెట్టుము, వానిని రతిం దేల్పుము, తతః = అంతట, దానివలన

ఖాదిష్యసి మత్స్యమాంసకమ్
ఏతాభ్యాం మత్స్యమాంసాభ్యాం
శ్వానో మృతకం న సేవన్తే. ౨౬

[ లామేహి అ లాణవల్లహాం తో
క్ఖాదిశి మచ్ఛమంశకమ్
ఏదేహిం మచ్ఛమంశకేహిం
శుణఆ మలఅం ణ శేవన్తి. ]

విటః—భవతి వసన్తసేనే

శ్లో. కిం త్వాం కటీతటనివేశిత ముద్వహన్తీ
తారావిచిత్రరుచిరం రశనా కలాపమ్
వక్త్రేణ నిర్మథిత చూర్ణ మనఃశిలేన

---

(వాఁడు పెట్టఁగలవానిని వానితోనే) మత్స్యమాంసకం = చేఁపలను ఎఱచిని, ఖాదిష్యసి = తినఁగలవు. - అవి దండిగా దొరకును. ఇవి లక్ష్యపెట్టఁదగనివి, కొఱఁదగనివి కావుసుమా. ఏతాభ్యాం మత్స్యమాంసాభ్యాం = ఈచేఁపలచేతను మాంసముచేతను - వానిని మరగి - శునకాః = కుక్కలు, మృతకం = పీనుఁగును, న సేవన్తే = తినవు. అవి పీనుఁగుకన్న రుచి - అనుట.

ఈయనతో రమింపవమ్మా, ఈయన రాజునకు ప్రియుఁడు, గొప్పవాఁడు - నీకు దండిగా చేపలు మాంసము తినుటకు పెట్టఁగలఁడు, తినుదువుకాని. చేటునికిం దగిన యుపమలును విషయములును ఈ భాషితమున.

శ్లో. ౨౭. కటీతట నివేశితం = నితంబమున ఉంపఁబడిన, తారా విచిత్ర రుచిరం = ముత్తెములు - నానారత్నములు తాపినందున పలురంగులతో సొబగారుచున్న, రశనాకలాపమ్ = పెక్కు పేటల (= కలాప) మొలనూలు, ఉద్వహన్తీ = ధరించినదానవై. నిర్మథిత చూర్ణ మనఃశిలేన = మెత్తగా నూఱిన (చూర్ణ = ) పరిమళద్రవ్యములు కలిపిన మనఃశిల పామిన, వక్త్రేణ = మొగముతో-నీ విటు త్రిప్పికొన్న మొగము మాకు అగపడుచున్నదిలే, అనుట. త్రస్తా = బెదరుకొన్నదానవై,

త్ర స్త్వాద్భుతం నగరదైవతవ త్ప్రయాసి. ౨౭

శకారః—

శ్లో. అస్మాభి శ్చణ్డ మభిసార్యమాణా
వనే సృగా లీవ కుక్కురైః
పలాయసే శీఘ్రం త్వరితం సవేగం
సవృన్తం మమ హృదయం హరన్తీ. ౨౮

[ అమ్హేహిం చణ్డం అహిశాలిఅన్తీ
వణే శిఆలీ విఅ కుక్కులేహిం
పలాశి శిగ్ఘం తులిదం శవేగ్గం
శవేణ్టాణం మే హాలఅం హాలన్తీ. ]

---

నగరదైవతవత్ =(ఉజ్జయినీ) నగరదేవతవోలె, ప్రయాసి=పోవుచున్నావు, దేవత కును మొగానికి జేగురు పాముదురు, అద్భుతమ్ = ఆశ్చర్యము! _ దేవత యనుట చేతను ఆశ్చర్యమనుటచేతను, ఆరూపము_అందము_సాటిలేనిది అని భావము.

ఒక్కొక్కతూరి ఆసింగారములోని యొక్కొక్కదానిని పరికించి యెంచు కొని వర్ణించుచు తన ప్రణయమును వెలిపుచ్చుచున్నాఁడు. ఈతూరి మొలనూలును, ఎఱ్ఱపూత_పత్త్రాల_తోడి మొగమును. దేవతవలె ఉన్నది ఆయందము.

నగరదైవతవత్ _ ఉపమ

శ్లో. ౨౮. వనే = అడవిలో, కుక్కురైః = కుక్కలచేత, శృ(సృ)గాలీ ఇవ = ఆడునక్కవలె, అస్మాభిః = నా(మా)చేత, చణ్డం = బిట్టు, అభిసార్యమాణా = నీకట్టు _ నీవెంట _ అనుసరింపఁబడుచున్నదానవై, సవృన్తం = తొడిమతోకూడ _ వేరుతో కూడ, మమ హృదయం = నామనసును, హరన్తీ = ఒడిసి దొంగిలుకొనుచు, శీఘ్రం సవేగం త్వరితం = వడివడిగా _ అనావశ్యకపు పర్యాయపదములు శకార సులభములు, పలాయసే = పరువెత్తుచున్నావే!

నా హృదయమును (నీమీఁద మరులుకొన్నదానిని) వేరూడ దొంగిలించు కొని, నాకు చిక్కక పరువెత్తుచున్నావే!

వసన్తసేనా—పల్లవక, పల్లవక, పరభృతికే పరభృతికే.
[పల్లవఅ, పల్లవఅ, పరహుదిఏ, పరహుదిఏ]

శకారః—(సభయమ్) భావ భావ, మనుష్యా మనుష్యాః.
[భావే భావే, మణుశ్శే మణుశ్శే.]

విటః—న భేతవ్యం, న భేతవ్యమ్.

వస—మాధవికే, మాధవికే. [మాహవిఏ, మాహవిఏ]

విటః—(సహాసమ్) మూర్ఖ, పరిజనో ఽన్విష్యతే.

---

శృగాలైః సృగాలీవ-నీచోపమ. అలం. నక్క నక్కం బోలినది. ఆడు నక్క భ్రమచేతనో నక్కయైన నేమి మనజాతింబోనిదేలే అనియో దాని వెంటఁ బడిన నక్కవలె-నాచేత అనుట. ఇట్టి విజాతి ప్రణయమును జంతువులలో నుండును. శకారునికి తగిన నీచోపమ.

పల్లవకుఁడు-వసంతసేన చేటుఁడు, పరభృతిక ఒక చేటి, మాధవిక మఱి యొక చేటి-ఈపరిజన మంతయు చీకటిలో తనతో తోడుగా వచ్చుచుండినవారు, ఈపరువులలో తప్పిపోయినారు. వారు కూడనే ఉన్నారని వసంతసేన తలంపు. పిలుపుకు పలుకనందున ఎవరును లేరు తోడు అని భయపడుచున్నది. చీకటిలో వారు ఎట్లు తప్పిపోయినారో.

భావ భావ మనుష్యాః మనుష్యాః-భావ, భావ, మానుసులు మానుసులు-ఎవరో మనుష్యులు ఉన్నట్టు లున్నది, భయమగుచున్నదే-అని-వట్టి పిఱికివాఁడు మనుష్యమాత్రునికే భయపడున ట్లున్నది. ఒంటిపాటున చిక్కినదని తలుముటయు మానుసులు చూచుచున్నారన్న భయపడుటయు, న భేతవ్యమ్ = భయపడవలదు, సహాసమ్ = నవ్వుతో-వాని యా పిఱికితనమునకు వీనికి నవ్వు, వీని కన్నులపాటి వాని కన్నులు చూడలేవా? ఏమేని కంటిజబ్బా? మూర్ఖ = తెలివిలేనివాఁడ, పరిజనః అన్విష్యతే-పరిజనము-సేవకులు, చేటి, చేటుఁడు-ఆట్టివారు, వెదకఁబడు చున్నారు-మఱెవ్వరో మనుష్యులు కారు.

శకారః—భావ, భావ, స్త్రియ మన్వేషయతి? [భావే, భావే. ఇత్థిఆం అణ్ణేశది?]

విటః—అథకిమ్.

శకారః—స్త్రీణాం శతం మారయామి. శూరో౽హమ్. [ఇత్థిఆణాం శదం మాలేమి. శూలే హగే.]

వసన్త—(శూన్య మవలోక్య) హాధిక్, హాధిక్. కథం! పరిజనో౽పి పరిభ్రష్టః. అత్ర మ యాత్మా స్వయ మేవ రక్షితవ్యః. [హద్ధీ, హద్ధీ, కధం పరిఅణో వి పరిబ్భట్టో. ఏత్థ మఏ అప్పా శఅం జ్జేవ రక్ఖిదవ్వో.]

విటః—అన్విష్యతామ్, అన్విష్యతామ్.

శకారః—వసన్తసేనికే విలప విలప, పరభృతికాం వా

---

స్త్రియం అన్వేషయతి = స్త్రీని వెదకుచున్నదా? అథ కిం = అవును, ఈ మాటల మొత్తమునకు అది అర్థము. వానిని విడఁదీయఁ గూడదు–తరువాత ఏమి అన్నట్లుగా, మొత్తముగానే గ్రహింపవలయును. స్త్రీణాం శతం–స్త్రీల నూర్గురను (వినను), మారయామి; శూరః అహమ్ = ఆడువారైన, నూర్గురనైనను చంపుదును–శూరుఁడను నేను–(ఏమనుకొన్నావో!), శూన్యం అవలోక్య = ఎవరు లేమిని పరికించి; హాధిక్–అయ్యో, ఇసీ–కథం = ఏమి! ఎట్లు! పరిభ్రష్టః = లేకపోయినది, ఎటుపోయినారో, అత్ర–ఇక్కడ–ఇప్పుడు, ఆత్మా = దేహము–నేను, స్వయం ఏవ–సొంతముగానే, రక్షితవ్యః = కాపాడుకొనఁబడవలయును.

అన్విష్యతాం = వెదకఁబడును గాక–వెదకుకో–అనుట. విలప–అఱచుకో–పిలుచుకో–పరభృతికను, పల్లవకుని–అది చేటికి పేరు, ఇది చేటునికి పేరు, మాధవిక–ఇదియు చేటికి పేరు–నాటకాలలో చేటులకు అట్టి పేరులు పెట్టుదురు–మధుకరికా పరభృతికలు శాకుంతలమందును, తోఁటపనికత్తెలు కలరు. పరభృతిక అనఁగా కోయిల, పల్లవక మనఁగా చిగురు, మాధవిక యనఁగా బండిగురివెంద తీగె ఇవన్నియు వసంతర్తువులో ఉండునవి. మఱి ఆసాని పేరు 'వసంతసేన'

పల్లవకం వా సర్వం వా వసన్తమాసమ్. మ యాభిసార్యమాణాం త్వాం కః పరిత్రాస్యతే. [వశన్త శేణిఏ, విలవ విలవ పరహుదిఅం వా పల్లవఅం వా శవ్వం ఏవ వశన్తమాశమ్. మఏ అహిశాలిఅన్తం తుమం కో పలిత్తాఇశ్శది.]

శ్లో. కిం భీమసేనో జమదగ్నిపుత్రః
కుంతీసుతో వా దశకన్ధరో వా
ఏషో ఽహం గృహీత్వా కేశహస్తే
దుఃశాసనస్యానుకృతిం కరోమి. ౨౯

[కిం భీమశేణే జమదగ్గిపుత్తే
కున్తీశుదే వా దశకన్ధలే వా
ఏశే హగే గేణ్హియ కేశహత్థే
దుశ్శాశణశ్శాణుకిదిం కలేమి.]

కావున శకారుఁడు ఎగతాళిగా - సర్వం ఏవ వసన్తమాసమ్ = సకలమైన మాసమును! మయా అభిసార్యమాణాం త్వాం = నాచేత వెంబడింపఁబడుచున్న నిన్ను, కః పరిత్రాస్యతే = ఎవఁడు కాపాడఁగలఁడు? చేట చేటికల ప్రస్తావముచేతను, వసంతసేన గొప్ప సింగారము చేతను, ఇది చారుదత్తునింటికి అభిసరణమని ఊహింపఁదగును. అట్లే చెప్పనుంబడును.

శ్లో. ౨౯. ఏషః అహం = ఇదిగో చూడు, నేను, కేశహస్తే = (కేశములతో చేరిన 'హస్తము'నకు మొత్తము అని యర్థము) తలవెండ్రుకల మొత్తమున - కొప్పున, గృహీత్వా = పట్టుకొని, దుఃశాసనస్య అనుకృతిం కరోమి = దుఃశాసనుని పోలుటను - (వాఁడు ద్రౌపదిని కొప్పు పట్టి యీడ్చుకొనిపోయినట్లు), కరోమి = చేసెదను, కిం = ఏమి, జమదగ్నిసుతః భీమసేనః = జమదగ్నికొడుకైన భీమసేనుఁడా, కుంతికొడుకా, రావణుఁడా - కః పరిత్రాస్యతి? - ఎవఁడు నిన్ను కాపాడఁగలఁడు? మును పెవరైనను దుఃశాసను బారినుండి ద్రౌపదిని కాపాడఁ గలిగిరా?

భీమసేనుని కుంతికొడుకును పాండవుని జమదగ్నికొడుకు అనుట, రావణుఁడు అనుట - అన్నియు శకారుని తప్పుడు కూఁతలు - అతని పురాణపు - పొరపాట్లు.

నను ప్రేక్షస్వ, నను ప్రేక్షస్వ [ణం పేక్ఖ, ణం పేక్ఖ],

శ్లో. అసిః సుతీక్ష్ణో వలితం చ మస్తకం
కల్పయే శీర్ష ముత మారయామి వా
అలం త వైతేన పలాయితేన
ముమూర్షు ర్యో భవతి న స ఖలు జీవతి. 30

[అశీ శుతిక్ఖే వలిదే అ మత్థకే
కప్పేమ శీశం ఉద మాలఏమ వా,
అలం త వేదేణ పలాయిదేణ
ముముక్ఖు జే హోది ణ శే క్ఖు జీఅది.]

వసన్త—ఆర్య, అబలా ఖ ల్వహమ్. [అజ్జ, అబలా క్ఖు అహమ్.]

---

నేను వెంటఁబడఁగా ఈ ప్రపంచాన నిన్నెవరు కాపాడఁగలరే. నను = ఓసి, ప్రేక్షస్వ = చూడు.

శ్లో. 30. అసిః = (ఇదిగో నాచేతిలో) కత్తి, సుతీక్ష్ణః = మిక్కిలి వాడియైనది, వలితం = తిరిగిన (మాతట్టుకు నీవు త్రిప్పియున్న), మస్తకం శీర్షం = (శకారుని పునరుక్తులు) తలను. కల్పయేమ = నఱికివేయుదును, ఉత = లేక, మారయామివా = చంపుదును _ (ఇదియు పునరుక్తియే), తవ = నీకు, ఏతేన పలాయితేన అలం = ఈపరువెత్తుట కూడదు _ అలం తృతీయతో నిషేధముం దెలుపును, యః ముమూర్షుః = ఎవఁడు చావఁగోరినవాఁడు, భవతి = అగునో, సః = అతఁడు, న ఖలు జీవతి = బ్రదుకఁడుగదా. శకారుఁడు పుల్లింగముగానే పలుకును!

నీవు ఇట్లు నన్ను లక్ష్యపెట్టక పరువెత్తుట నాకత్తిదెబ్బకు తలపగిలి చచ్చుటకే, చావు మూఁడినవాఁడు ఎవఁడు బ్రదుకును?

అబలా ఖలు అహమ్ = అబలను, (బలము లేని దానను) = ఆడుదాననుగద టయ్యా నేను?

విటః—అత ఏవ ధ్రియసే.

శకారః—అత ఏవ న మార్యసే [అదో జ్జేవ ణ మాలీఅశి]

వసన్త—(స్వగతమ్) కథం అనునయో ఉప్యస్య భయముత్పాదయతి. భవతు, ఏవం తావత్. (ప్రకాశమ్) ఆర్య, అస్మాత్కి మప్యలంకరణం తర్క్యతే. [కథం అణుణఓ వి శే భఅం ఉప్పాదేది. భోదు. ఎవ్వం దావ. అజ్జ, ఇమాదో కిం పి అలఙ్కరణం తక్కీఅది.]

---

అత ఏవ ధ్రియసే = కావున నే బ్రదికియున్నావు.

...న మార్యసే = చంపఁబడకున్నావు.

స్వగతమ్ - పాత్ర రంగాన ఉన్న యితరులకు తెలియనీక తన మనసులో అనుకొనుమాటలు - మనసులో అనుకొనుట యైనను దానిని నేర్పుకొలఁది ఇతర విధముగా అభినయించుచునే, బిగ్గరగా అన్నిమాటలకంటెనే ప్రేక్షకులలో దూరాన నున్న కడపటివానికిం గూడ చక్కఁగా వినఁబడునట్లు పలుకవలెను. ఈకాలమున కొందఱు నాటకవిమర్శకులు నాటకమున స్వగతముం జొనుపుట కవినేర్పు చాలమి అనియు, సర్వము ప్రకాశభాషిత సందర్భముననే తెలియవలెను అనియుం అందురు. కాని భరతముని త్రికాలజ్ఞుఁడు దానికి లక్షణముం జెప్పి యనుమతించినాఁడు. షేక్స్పియరు కాళిదాసాది మహానిపుణుల నాటకాలలో అవి యుండి, అస్వాభావికత తోఁపక పోవుటయు కాక, తక్కిన భాషితములకన్న అవి రసవంతములై ఆనందముం గలిగించుచున్నవి. ఇట్టి విషయములలో సహృదయానుభవాభిప్రాయములు ప్రమాణము.

కథం - ఎట్లూ! ఏమీ! ఇది నాటకభాషితములలో ఇట్లు ఆశ్చర్యార్థముగా మిక్కిలి ప్రయోగింపఁబడును. అనునయః అపి అస్య = వీని సాంత్వనము - ఓలండింపు సయితము, భయం ఉత్పాదయతి = భయము కలిగించుచున్నది. ఏవం తావత్ = ఇట్లు పలికెదనుగాక, ఆర్య, అస్మాత్ (జనాత్ అనుట) నావలన, కిమపి అలఙ్కరణం = ఏదేని నగ, తర్క్యతే కిం = (కావలయునని) అనుకొనఁబడుచున్నదా? ఎందులకు నావెంట వచ్చుట? తత్ కిం ఖలు ఇదానీం = మఱి యిప్పుడు ఇదేమి?

విటః—శాన్తమ్, భవతి వసన్తసేనే న పుష్ప మోష మర్హ త్యుద్యానలతా. త త్కృత మలఙ్కారైః.

వసన్త—త త్కిం ఖ ల్విదానీమ్? [ తా కిం క్ఖు దాణిమ్? ]

శకారః—అహం వరపురుష మనుష్యో వాసుదేవః, కామయితవ్యః. [ హగే వరపులిశ మణుశ్శే వాశుదేవకే, కామయిదవ్వే ].

వసన్త—(సక్రోధమ్) శాన్తమ్ శాన్తమ్, అపేహి. అనార్యం మన్త్రయసి. [ శాన్తం శాన్తమ్ అవేహి అణజ్జం మన్తేశి. ]

శకారః—(సతాలికం విహస్య) భావ, భావ. ప్రేక్షస్వ తావత్. మా మన్తరేణ సుస్నిగ్ధైషా గణికాదారికా నను. యేన మాం భణతి.– 'ఏహి. శ్రాన్తో ఽసి క్లాన్తో ఽసి' ఇతి. అహం న

శాన్తమ్ = శాంతము – ఆమాట అనకు, నేను వినలేను; ఓర్వలేను, నీ దేహమునుండి నగ తీసి యిత్తువా? కూడదు. భవతి వసన్తసేనే = అమ్మా, వసంతసేనా, ఉద్యానలతా = తోఁటలోని తీవ, పుష్పమోషం = పువ్వులుకోయుటను, దోచుటను, న అర్హతి = ఓర్వదు, కోయఁగూడదు, కృతం అలఙ్కారైః – కృతం = అలం, కూడదు.

అహం వరపురుషమనుష్యః = నేను నీమీఁద మరులుగొన్నవాఁడను, కామయితవ్యః=(నీచే) కామింపఁబడవలసినవాఁడను, మనుష్య=పురుష – ఇవి శకారుని మామూలు పునరుక్తులు. వాసుదేవుఁడనుట అంతటివాఁడను–అనుట. వర=శ్రేష్ఠ.

సక్రోధమ్ = అందులకు వసంతసేనకు కోపము వచ్చినది, శాన్తమ్ = మాయాము నోరు – అ దేటి మాట? అనార్యం = అగౌరవపు (పాడు)మాటను, మన్త్రయసి = పలుకుచున్నావు.

సతాళికం విహస్య = చప్పట్లతో (చఱచి) బిగ్గరగా నవ్వి, మాం అన్తరేణ = నాయెడ, నన్నుగూర్చి, సుస్నిగ్ధా ఏషా = ఇది చాల స్నేహము గలిగియున్నది, నను = కదా, యేన = ఏలయన, మాం భణతి = నన్నుఁగూర్చి పలుకుచున్నది, ఏహి = రా, శ్రాన్తః అసి = అలసితివి, క్లాన్తః అసి = వాడితివి – అని. అహం న

[గ్రామాన్తరం న నగరాన్తరం వా గతః, భట్టాలికే, శపే భావస్య శీర్ష మాత్మీయాభ్యాం పదాభ్యాం. త వైవ పృష్ఠానుపృష్ఠిక యాహిణ్డమానః శ్రాన్తః క్లాన్తో ఽస్మి సంవృత్తః. [భావే, భావే, పేక్ఖ దావ. మం అన్తలేణ శుశిణిద్ధా ఏశా గణిఆదాలిఆ ణమ్. జేణ మం భణాది - 'ఏహి శన్తే శి కిలిన్తే శి' త్తి. హగే ణ మా మన్తలం వా గడే. అజ్జుకే శవామి భావశ్శ శీశ్శం అత్తణకేహిం పాదేహిం. తవ జ్జేవ పశ్చాణుపశ్చిఆఏ ఆహిణ్డన్తే శాన్తే కిలిన్తే మ్హి శంవుత్తే.]

విటః—(స్వగతమ్) అయే, కథం! శాన్త మిత్యభిహితే శ్రాన్త ఇత్యవగచ్ఛతి మూర్ఖః. (ప్రకాశమ్) వసన్తసేనే వేశవాస విరుద్ధ మభిహితం భవత్యా. పశ్య

గ్రామాన్తరం, న నగరాన్తరం వా గతః = నేను మఱొక పల్లెకుఁగాని పట్టాము నకుఁగాని నడచిన - పోయిన - వాఁడఁ గాను. భట్టాలికే = ఓదొరసాని, భావస్య శీర్షం = భావతలను-ఆత్మీయాభ్యాం పాదాభ్యాం = నాపాదాలమీఁదను, పెట్టి - అనుట - శపే = ఒట్టు పెట్టెదను, 'శాన్తం' - నోరు మూయుము అను కోపపు మాటను, శ్రాన్తం - అని ఛాయ చేసికొని, భ్రాంతిచే 'త్వయా' అని కలుపుకొని - నీచేతనే అలుపు గొనఁబడినది - అనఁగా నీవు బడలితివి, పాపము - అని నాయిక యొక్క తనమీఁది స్నేహపు - అనురాగపు మాటగా భ్రమసి - విటునితో తన ధన్యతను చెప్పుకొనుచున్నాఁడు. ఓదొరసానీ, పృష్ఠానుపృష్ఠికయా ఆహిణ్డమానః = నీవెంటనే నీ వెనుకనే అల్లాడు(తిరుగు)చున్నవాఁడనై, శ్రాన్తః క్లాన్తః - సంవృత్తోఽస్మి = అయినవాఁడనైతిని - తన ప్రణయ పరిశ్రమముం జెప్పుకొను చున్నాఁడు. మాం అన్తరేణ - (= అనన్తరజ్ఞేణ) మనసుచే (న - అనుటయు).

అయే - ఓహో - ఆశ్చర్యముం దెలుపును. శాంత మనఁగా శ్రాన్త అని అర్థము చేసికొన్నాఁడు ఈమూర్ఖు. వేశవాసవిరుద్ధం = బోగము పాళెమునకు - స్థితికి - విరుద్ధము - అనుచితము - గా నున్నది. పశ్య = చూడు - ఏల యట్లు చెప్పు చున్నావనఁగా - వాస - పా. వాట - మేలు.

శ్లో. తరుణజనసహాయ శ్చిన్త్యతాం వేశవాసో
విగణయ గణికా త్వం మార్గజాతా ల తేవ
వహసి హి ధనహార్యం పణ్యభూతం శరీరం
సమ ముపచర భద్రే సుప్రియం చాప్రియం చ. 31

అపి చ,

శ్లో. వాప్యాం స్నాతి విచక్షణో ద్విజవరో
మూర్ఖో౽పి వర్ణాధమః,

---

శ్లో. 31. చిన్త్యతాం = తలఁపోయుదువుగాక, వేశవాసః = భోగము వారియిండ్లు, తరుణ జన సహాయం = కోడెకాండ్రు సాయముగాఁ గలవి. కులాంగనల యిండ్లవలె అత్తమామలు అన్నయక్కలు అట్టి పెద్దలకాఁపుదారి కలవి కావు. గణికా త్వం = వెలయాలివి నీవు, మార్గజాతా లతా ఇవ = బాటఁ ప్రక్క మొలచియుండు తీఁగంబోనిదానివి. విగణయ - అదియు తలపోయుము; ధనహార్యం = ఓలిచే = రోయిచే పొందఁదగిన, పణ్యభూతం = అమ్మకపు వస్తువైన, శరీరం = దేహమును, వహసి హి = ధరించియున్నావుగదా, (కావున) భద్రే = ఓమంచిదానా, సుప్రియం చ అప్రియం చ = మిక్కిలి ప్రియమైన వానిని ఎంతయు ప్రియముకాని వానినిం గూడ, సమం = సమానముగా, ఉపచర = సేవింపుము. కావున 'కాన్తం' అని, 'అవార్యం' అని యనఁజెల్లదు.

భోగమువారి యిండ్లు కోడెకాండ్రకు కాపురపుఁ జోటు - వారే వారికి తోడు. ...గణికవు - గణముచే గుంపుచే సేవింపఁబడుదానవు - పలువురకు ఉమ్మడి దానవు, బాటలప్రక్కన మొలచిన తీఁగంబోనిదానవు, పణ్యాంగనవు - శరీరమును వెలకు అమ్ముకొనుదానవు. నీరూపమునుం బట్టి చెప్పుచున్నాను. ఓ మంచి దానా - ప్రియుని అప్రియుని సమానముగా సేవింపుము.

మార్గజాతాలతేవ - ఉపమ. 'హి' అని సమర్థనము చెప్పియున్నందున కావ్యలింగము. ఒకఁడు ఆకు పీఁకును ఒకఁడు పూవు గిల్లును !

శ్లో. 32. వాప్యాం = బావిలో, విచక్షణః ద్విజవరః = విద్వాంసుఁడైన బ్రాహ్మణశ్రేష్ఠుఁడును, మూర్ఖః = చదువని మొఱకైన, వర్ణాధమః అపి = తక్కువ(శూద్ర, మాల)జాతివాఁడును, స్నాతి = స్నానమాడును. యా = ఏది -

ఫుల్లాం నామ్యతి వాయసో ఽపి హి లతాం
  యా నామితా బర్హిణా,
బ్రహ్మక్షత్రవిశ స్తరన్తి చ యయా
  నావా తయైవేతరే
త్వం వాపీవ లతేవ నౌరివ జనం
  వేశ్యాసి సర్వం భజ. 31

వసన్త—గుణః ఖలు అనురాగకారణమ్, న పున ర్బలాత్కారః. [గుణో క్ఖు అణురాఅస్స కారణమ్, ణ ఉణ బలాక్కారో].

ఏతీఁగ, బర్హిణా-(పైనవాలిన) నెమలిచేత, నామితా=వంపఁబడినదో, ఫుల్లాం=పూలు పూచియున్న, (తాం) లతాం = ఆతీఁగెను, వాయసః అపి = కాకియు, నామ్యతి హి = (వాలి) వంచునుగదా, బ్రహ్మ క్షత్ర విశః = బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులును, యయా నావా = ఏయోడతో, తరన్తి = (ఏఱు మొదలగు జలాశయములను) దాఁటుదురో, తయా ఏవ = దానితోడనే, ఇతరే చ = ఇతరులును - అంతకు తక్కువవారును, దానినెక్కి కూరుచుండి - తరన్తి = దాఁటుదురు, త్వం = నీవు; వాపీ ఇవ, లతా ఇవ, నౌః ఇవ = బావివలెను, తీఁగవలెను, ఓడవలెను, వేశ్యా అసి = వేశ్యవు అగుదువు, సర్వం జనం భజ = ఎల్లజనులను పొందుము - సేవింపుము. నామయతి అనుట సాధువు - మఱి కుదురదు.

మొదటి మూఁడు పాదములకు నాల్గవ పాదము తాత్పర్యమువలె నున్నది. స్నాన నమన తారణములచే ఉపభోగ విశేషధ్వని కలదా? 'ఇవ' అచే ఉపమ. వేశ్యా అసి అని సమర్థనము కావ్యలింగము.

గుణః ఖలు = గుణము గదా, అనురాగస్య కారణమ్ = స్నేహమునకు వలపునకు కారణము, కులాంగనలకు నిజధర్మ విద్యాదులు కారణము అగును అనురాగమునకు. నాబోఁటికి గుణము - (నా) వలపునకు కారణము, పరుల బలాత్కారము గాదు - మాకు చిత్తము లేదా చిత్తజుఁడు లేఁడా. గుంట తీఁగ యోడలవలె అచేతనమునా నేను?

విటుని ఈమాటలచే తాము ఇప్పటికి కొన్నితూర్లు తిరస్కరింపఁ బడితిమి అని సూచితము. అట్లే పూర్వశ్లోకమునను సూచితము. (31)

శకారః—భావ, భావ, ఏషా గర్భదాసీ కామదేవాయతనోద్యానా త్ప్రభృతి తస్య దరిద్రచారుదత్త స్యానురక్తా న మాం కామయతే. వామత స్తస్య గృహమ్. యథా తవ మమ చ హస్తాన్నైషా పరిభ్రశ్యతి తథా కరోతు భావః. [భావే, భావే, ఏశా గబ్భదాశీ కామదేవాఅదణుజ్జాణాదో బహుది తాహ దలిద్దచాలుదత్తాహ అణులత్తా ణ మం కామేది. వామదో తశ్శ ఘలమ్. జధా తవ మమ అ హత్థాదో ణ ఏశా పలిబ్భంశది తధా కలేదు భావే.]

విటః—(స్వగతమ్) య దేవ పరిహర్తవ్యం త దే వోదాహరతి మూర్ఖః. కథమ్! వసన్తసేనా ఆర్యచారుదత్త మనురక్తా!

---

ఏషా గర్భదాసీ - ఇది పుట్టుకనుండియు, దాసీ = పరవతి. పరాధీనురాలు, స్వతంత్ర కాదు. మరేమో 'గుణము' అనుచున్నది. ఏమిగుణము? కాముని గుడి తిరునాళ్ళ మొదలుకొని. తస్య దరిద్ర చారుదత్తస్య అనురక్తా = ఆపేద చారుదత్తునియందు అనురాగముగలదై, మాం = నన్ను, నకామయతే = కామింపకున్నది. ఆదరిద్రునియందు ఏమి గుణము? వామతః తస్య గృహం = ఎడమతట్టు వాని యిల్లు (ఉన్నది.), యథా = ఎట్లు, తవ మమ చ హస్తాత్ = నీయొక్కయు నాయొక్కయు చేతినుండి, ఏషా = ఇది, నపరిభ్రశ్యతే = తప్పించుకొని పోదో, తథా కరోతు భావః = బావ అట్లు చేయునుగాక. ఆయాత్రలో వారికన్నులకలయిక చూచినది మొదలు తాను ఈసెత్తి దాని పొందుకై ప్రయత్నించి పరాహతుఁడగుచున్నాఁడనుట. ఉద్యాన-యాత్ర-తిరునాళ్ళ-వే. వేం. దీనికి వ్యాఖ్యాతలకు అర్థము తెలియలేదు.

యత్ ఏవ = ఏది తప్పక, పరిహర్తవ్యం = మానవలసినదో - తెలుపక, జ్ఞప్తిసేయక, చేసినట్లైన అందులోనికి తప్పించుకొని పోవును. అందుండి ఎవరికైనను సాయమునకు పిలుచును. కథం = ఏమీ ఎట్లూ! ఆశ్చర్యార్థకము. వసన్తసేనా ఆర్యచారుదత్తం అనురక్తా! ఏమీ, వసంతసేన చారుదత్తయ్యను వలచి యున్నదా? ఆవిషయము ఇంతవఱకు విటునకు తెలియదు. తెలిసియున్న ఇట్లు

సుష్ఠు ఖల్విద ముచ్యతే. — 'రత్నం రత్నేన సంగచ్ఛతే.' ఇతి. త ద్గచ్ఛతు. కిమనేన మూర్ఖేణ. (ప్రకాశమ్) కాణేలీమాతః, వామత స్తస్య సార్థవాహస్య గృహమ్?

శకారః—అథకిమ్, వామత స్తస్య గృహమ్. [ అథ ఇం. వామదో తశ్శ ఘలమ్ ]

వసన్త—(స్వగతమ్) ఆశ్చర్యమ్! వామత స్తస్య గృహ మితి యత్సత్యమ్, అపరాధ్య తాపి దుర్జనే నోపకృతమ్, యేన

ఆమె వెంటఁబడి వచ్చియుండఁదేమో. సుష్ఠు ఖలు ఇదం ఉచ్యతే - ఈమాట ఎంతో లెస్సగా ఉన్నదికదా - ఏ దనఁగా - రత్నం రత్నేన సంగచ్ఛతే - రత్నము రత్నముతో కూడును. ఇతి=అనుట. చారుదత్తుఁడు పురుషరత్నము; వసంతసేనయో స్త్రీరత్నము. కావున ఈయనురాగము శ్లాఘ్యమైనది. తత్ గచ్ఛతు = కావున పోవునుగాక. కిం అనేన మూర్ఖేణ = ఈమూర్ఖునితో నేమి? దానికి అడ్డపడక పోనిచ్చుటే మంచిది. కాణేలీభ్రాతః, కాణేలీమాతః - అనియు పాఠము. కాణేలీ అనగా కన్యక - రాజునకు ఉంపుడుకత్తె, పెండ్లిచేసికొనఁబడనిది దానికి అన్న - కావున 'రాజ్ఞః శ్యాలః' రాజునకు బావమఱఁది అనియు వ్యవహారము. కాణేలీ మాతః - రాజశ్వశురస్య అనూఢాయాం కన్యకాయాం జాతః - రాజుమామకు ఉంపుడుకన్యకు కొడుకు. అతనికూతురు రాజుభార్య. ఇతఁడు ఆమెకు తోఁబుట్టు వరుస. ఇది నాఁటి సంఘమున ఆక్షేపణ లేక చెప్పుకొనఁదగిన సంబంధము - కావున కాణేలీత్యాదిసంబోధన శకారునకు గౌరవమైనదియు సంతోషపెట్టు నదియు. 'కాణేలియన్నా' 'కాణేలికొడుకా' అని. వామతః తస్య సార్థవాహస్య గృహమ్? = ఎడమ తట్టు ఆ(బ్రాహ్మణ)వర్తకుని యిల్లా?

అథ కిం = అవును.

అమ్మహే = ఆశ్చర్యము! ...ఇతి యత్ సత్యం = అని నిజముగానే, అపరాధ్యతా అపి = తప్పు చేయుచున్నవాని చేత నైనను, శకారుని చేత, దుర్జనేన = దుర్మార్గుని చేత, దుష్టుని చేత, ఉపకృతమ్ = ఉపకారము - మేలు - చేయఁ

ప్రియసంగమః ప్రాపితః. [అమ్మహే! వామదో తశ్శ గేహం త్తిజం శచ్చమ్ అవరజ్ఝన్తేణ వి దుజ్జణేణ ఉవకిదమ్, జేణ పిఅశఙ్గమం పావిదమ్.]

శకారః—భావ, భావ, బలీయసి ఖ ల్వన్ధకారే మాషరాశి ప్రవిష్టేవ మసీగుటికా దృశ్యమానైవ ప్రనష్టా వసన్తసేనా. [భావే, భావే, బలీయే క్ఖు అన్ధఆలే మాశలాశిప్పవిట్టా విఅ మశిగుడిఆ దీశన్తీ జేవ పణట్టా వశన్తశేణిఆ].

విటః—అహో! బలవా నన్ధకారః. తథా హి -

శ్లో. ఆలోకవిశాలా మే సహసా తిమిరప్రవేశవిచ్ఛిన్నా
ఉన్మీలి తాపి దృష్టి ర్నిమీలి తేవాన్ధకారేణ. 33

---

బడినది. యేన = ఏలన, (దాన) ప్రియసఙ్గమః = ప్రియునిం గూడుట, ప్రాపితః = పొందింపఁబడినది. యత్సత్యమ్-అసంభావ్యే-నమ్మలే కున్నాను. అంత సంతోషము!

బలీయసి అన్ధకారే = మిక్కిలిబలమైన (కన్నులకు అంధ్యముం గూర్చునట్టి) చీకటియందు, మాషరాశి ప్రవిష్టా = మినుముల పెనుప్రోవులో, (ప్రవిష్టా=) చొచ్చిన, మషీగుటికా ఇవ = మసి (నల్లనిబొగ్గు-) గుండువలె, వసన్తసేనా, దృశ్యమానా ఏవ = (మనము) చూచుచుండఁగానే, ప్రణష్టా = అగపడక పోయినది.

శ్లో. 33. ఆలోకవిశాలా = వెలుతురులో చూ. 'నిరాలోకం లోకం' - మాలతి. పెద్దది - ఎంతటి సూక్ష్మమైనదాని నైనను చూడఁజాలినట్టిది, మే దృష్టిః = నా కన్ను, సహసా = తటాలున, ఒక్కుమ్మడి, తిమిర...న్నా = చీకటి(లో) చొచ్చుటవలన, (విచ్ఛిన్నా =) ప్రతిహతమై - పోయినదై, ఉన్మీలితా అపి = తెఱచుకొనియున్నదైనను, అన్ధకారేణ = చీకటిచేత, నిమీలితా ఇవ = మూయఁబడినట్లు (ఐనది). ఆలోకం - మాపు బలముగా ఉన్నది - అని యేని.

నాకన్ను, వెలుతురులో సూక్ష్మములను సైతము చూచునట్టిది, విప్పారియున్నట్టిదే, తటాలున చీకటిలోనికి చొచ్చుటచేత, పోయినదైనది. తటాలునం

అపి చ,

శ్లో. లిమ్పతీవ తమో௨ఙ్గాని వర్షతీవాఞ్జనం నభః
అసత్పురుష సేవేవ దృష్టి ర్విఫలతాం గతా. 34

శకారః—భావ, భావ, అన్విష్యామి వసన్తసేనికామ్.
[ భావే, భావే. అణ్ణేశామి వసన్తశేణిఅమ్ ].

విటః—కాణేలీమాతః అస్తి కించి చ్చిహ్నం, య దుప లక్షయసి.

---

గాక క్రమక్రమముగా వియున్న - అట్లు బొత్తిగా పోదు. నేను తెలియచుకొనియే యున్నను, చీకటిచేత, మూయఁబడిన ట్లయినది!

ఉన్మీలి తాపి నిమీలి తేవ - ఇవ - ఉత్ప్రేక్ష. 'సంభావనా స్యా దుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా.' తిమిర ప్రవేశవిచ్ఛిన్నతాఫలోత్ప్రేక్ష.

శ్లో. 34. తమః = చీకటి, అఙ్గాని = (నా) యవయవములను, లిమ్పతీ ఇవ = పూయుచున్నట్లున్నది, నభః = ఆకసము, అఞ్జనం = కాటుకను, వర్షతి ఇవ = కురియుచున్నట్లు ఉన్నది, 'కాటుకవాన' కురియుచున్నట్లున్నది, దృష్టిః = చూపు, అసత్పురుష సేవా ఇవ = దుర్జనుని సేవించుట (కొలుచుట) వలె, విఫలతాం = ప్రయోజనము లేమిని, గతా = పొందినది.

చీకటి లోక మంతటను ఎంత దట్టముగా నున్నది! ఒంటికి (పూఁత అంటు కొనునట్లు) పూఁతపూయునట్లున్నది, మిన్ను మన్ను ఒక్కటి వ్యాపించుటచేత, కాటుకవాన కురియుచున్నదో అన ఉన్నది. ఎక్కువ దట్టమగుటచేత, చీఁకటి వస్తువు గావున్నను పెద్ద మసిపూఁతవలెను కాటుకవానవలెను అంగములను నల్లగా చేసివేయుచున్నది. దుర్జను కొలువుకు ప్రయోజనము లేనట్లు కన్ను చూచుచున్నను చూడన ట్లయిపోయినది!

లిమ్పతీవ తమోంగాని - మొదలైనది ఉత్ప్రేక్షకు ప్రసిద్ధోదాహరణము - లిమ్పతీవ - వర్షతీవ - లు స్వరూపోత్ప్రేక్షలు, విఫలతాంగతా - అని ఫలోత్ప్రేక్ష.

అన్విష్యామి = వెదకెదను, అస్తి కిఞ్చిత్ చిహ్నం = కొంచె మైనను గుఱుతు ఉన్నదా, యత్ ఉపలక్షయసి = దేనిచే నీవు కనిపట్టుదువో, వెదకుదు నందువే, ఏమేని గుఱుతు తెలియుచున్నదా, నీకు, వెదకుటకు?

శకారః—భావ, భావ, కిమివ? [భావే, భావే, కింవిఅ?]

విటః—భూషణశబ్దం సౌరభ్యానువిద్ధం మాల్యగన్ధం వా.

శకారః—శృణోమి మాల్యగన్ధమ్ అన్ధకారపూరితయా పున ర్నాసికయా న సువ్యక్తం పశ్యామి భూషణశబ్దమ్. [శుణామి మల్లగన్ధమ్ అన్ధఆలపూలిదాఏ ఉణ ణాశిఆఏ ణ శువ్వత్తం పేక్ఖామి భూశణశద్దమ్.]

విటః—(జనాన్తికమ్) వసన్తసేనే,

---

మాల్యగన్ధం = పూలమాలవాసన, శృణోమి = వినుచున్నాను - (కాంచు చున్నాననుటకు - శకారుని లోకవిరుద్ధపు పలుకు - అశ్లే.) అన్ధకారపూరితయా = చీకటితో నింపఁబడిన, నాసికయా = ముక్కుతో, భూషణశబ్దమ్ = నగల మోఁతను, సువ్యక్తం = స్పష్టముగా, పశ్యామి = చూచుచున్నాను - కంటితో అనుటకు ముక్కుతో అనుటయు లోకవిరుద్ధోక్తి.

జనాన్తికమ్ = రంగాన ఒక పాత్రము, మఱియొక పాత్రముతో, ఉన్న చోటినుండి కదలకుండనే మఱి యితరులకు వినఁబడని యట్లుగా, మూఁడువ్రేళ్ళు ఎత్తి పట్టిన చేతితో వారిని ఎడముచేసి, మాటలాడుట. వినఁబడనియట్లుగా అనఁగా వినఁబడమి వట్టి యభినయమే - బిగ్గరగానే ప్రేక్షకులలో దూరాన కడ పటనున్నవానికిని వినఁబడునట్లుగానే పలుకవలయును - ఉన్నచోటినుండి కదలి వినవలసినవానిని ఇంచుక అవతలికిం గొనిపోయి మాటలాడిన దానిని 'అపవారితము' అందురు.

త్రిపతాకాకరే ణాన్యా నపవా ర్యాన్తరా కథాం
రహస్యం కథ్యతే ౽న్యస్య జనాన్తే త జ్జనాన్తికమ్.

విటుఁడు చారుదత్త ప్రస్తావముచే వసంతసేనయందు గౌరవమును పొంది, మంచి వాఁడై ఇతరులకు వినఁబడని యట్లుగా వసంతసేనా అని పిలిచి పలుకుచున్నాఁడు. ఇఁక ఈ మూర్ఖునితో ఏమి అని ముందే అన్నాఁడుకదా.

శ్లో. కామం ప్రదోషతిమిరేణ న దృశ్యసే త్వం
సౌదామినీవ జలదోదర సంధిలీనా
త్వాం సూచయిష్యతి తు మాల్యసముద్భవో౽యం
గన్ధశ్చ భీరు ముఖరాణి చ నూపురాణి. ౩౫

శ్రుతం వసన్తసేనే.

వసన్త—(స్వగతమ్) శ్రుతం, గృహీతం చ. (నాట్యేన నూపురా ణ్యుత్సార్య మాల్యాని చాపనీయ కించి త్పరిక్రమ్య హస్తేన పరామృశ్య) అహో భిత్తిపరామర్శసూచితం పక్షద్వారకం

శ్లో. ౩౫. భీరు = భయపడుచున్నదానా, ప్రదోషతిమిరేణ = ఈ మునిమాపు చీకటిచేత, త్వం = నీవు, జలద ఉదర సన్ధి లీనా = మబ్బు కడుపులోని సొరలో దాఁగిన, సౌదామనీ ఇవ = మెఱుపుఁదీఁగవలె, కామం న దృశ్యసే = ఇంచుకయు అగపడకున్నావులే, తు = ఐనను, మాల్యసముద్భవః = (తలపై తాల్చిన) మాలలం బుట్టినట్టి, అయం గన్ధః చ = ఈ పరిమళమును, ముఖరాణి = మొరయుచున్న, నూపురాణి చ = అందెలును, త్వాం = నిన్ను, సూచయిష్యతి = సూచించుచు(పట్టియిచ్చుచు)న్నది.

నీవు, పాపము, భయముగొన్నావు. ఈమునిమాపుచీకటిలో అగపడ కున్నావు కాని, నీ పూలమాలలవాసన నీ యందెలరవళి, నిన్ను సూచించుచునే ఉన్నవి.

సౌదామనీ ఇవ - అని ఉపమ.

సూచయిష్యతి - అని అనుమానాలంకారము. ముఖరతయు, గంధవత్తయు లింగములు అనుమానమునకు.

శ్రుతం వసన్తసేనే = వసంతసేనా (నామాట నీకు) వినఁబడినదా?

స్వగతమ్ - వినియు వసంతసేన వానితో పలుకదు. వానిమాటలను తాను ఉపయోగించుకొన్నది. శ్రుతం = వినఁబడినది విన్నాను, గృహీతం చ = గ్రహింపఁబడినది. తెలిసికొన్నాను. 'I have understood the hint' వే. వేం. నాట్యేన ఉత్సార్య - తీసివేయుటను అభినయించి, కిఞ్చిత్ పరిక్రమ్య = ఇంచుక నడిచి, భిత్తి పరామర్శ సూచితం = గోడను తడువుటచే సూచింపఁబడినది, పక్ష ద్వారకం = దిడ్డివాకిలి - ఇంటి ఒకప్రక్కనుండి చిన్నవాకిలి - రహస్యద్వారము -

ఖ ల్వేతత్. జానామి చ సంయోగేన గేహస్య సంవృతం పక్షద్వారకమ్. [సుదం గహీదం అ. అమ్మో, భిత్తి పరామరిస సూఇదం క్ఖు ఏదమ్. జాణామి అ సంజోఏణ గేహస్స సంవుదం పక్ఖదుఆరఅమ్.]

చారు—వయస్య, సమాప్తజపో ఽస్మి. త త్సాంప్రతం గచ్ఛ. మాతృభ్యో బలి ముపహార.

విదూ—భోః, న గమిష్యామి [భో, ణ గమిస్సం]

చారు—ధి క్కష్టమ్,

---

సింహద్వారము - తలవాకిలి - కాదు. అహో = సంతోష(సూచక)ము, ఖలు ఏతత్ = కదా ఇది, సంయోగేన = (చేతికి) తగులుటచేత, జానామి - తలంచెదను - గేహస్య = ఇంటియొక్క, సంవృతం పక్షద్వారం - మూయఁబడిన దిడ్డివాకిలి (అని). గడియ వేయఁబడినది కాదు. నాటకభాషితములలో 'జానామి' తలంతును - అనుకొందును అనునర్థమున మాటిమాటికి ప్రయుక్తము అగును - 'ఎఱుంగుదును' అని కాదు. కొన్నిచోట్ల ఆ యర్థమును గలదు.

వయస్య = చెలికాడా, సమాప్తజపః అస్మి - జపము ముగించినవాఁడ నైతిని. కవి నిపుణముగా చారుదత్తునికి ఈసమాధి కల్పించినాఁడు. అతఁడు రంగాన ప్రవిష్టుఁడై, కూర్చుండియున్నాఁడు - మఱి వసంతసేనా శకారాదులు ప్రవేశించి పెక్కు పుటల, చాల నిమిషముల గ్రంథము నడిపినారు - ఇంతసేపు చారుదత్తుఁడు ఊరక మిణుకరించుచు ఎట్లుండును? కావున ఈ సమాధి కల్పన శ్రేయము. మైత్రేయుఁడు వానిం గాచుకొని యుండును. ఈ మెలఁకువ 'చారుదత్తమున' లేదు. ఇది శూద్రకుని కల్పన.

తత్ సాంప్రతం గచ్ఛ - కావున ఇపుడు పొమ్ము, మాతలకు బలి కొనిపోయి పెట్టుము. భో న గమిష్యామి - ఓయి నేను పోవను.

ధిక్ కష్టం = ఇసీ! కష్టా!

శ్లో. దారిద్ర్యాత్పురుషస్య బాన్ధవజనో
వాక్యే న సంతిష్ఠతే
సుస్నిగ్ధా విముఖీభవన్తి సుహృదః
స్ఫారీభవన్త్యాపదః
సత్త్వం హ్రాసముపైతి శీలశశినః
కాన్తిః పరిమ్లాయతే
పాపం కర్మ చ యత్పరైరపి కృతం
తత్తస్య సంభావ్యతే. 36

శ్లో. 36. దారిద్ర్యాత్ = పేదఱికమువలన, బాన్ధవజనః = బందుగులు, వాక్యే న సంతిష్ఠతే = మాటన, నిలువరు. చెప్పినమాట వినరు, చేయరు; సుస్నిగ్ధాః సుహృదః = గాటంపు స్నేహముగలమిత్రులు, విముఖీభవన్తి = పెడమొగ మిడుదురు; ఆపదః = ఆపదలు, స్ఫారీభవన్తి = మెందుకొనును, సత్త్వం = బలము - పనులకు పూనిక, తెలివి, వీర్యాతిశయమును గలుగునది, హ్రాసం ఉపైతి = తగ్గిపోవును, సుహృద్బాంధవుల యనాదరమే సత్త్వహ్రాసమునకు కారణము. శీలశశినః = సద్వృత్త రూప చంద్రునికి, కాన్తిః = కాంతి, పరిమ్లాయతే = ఎంతయు మాసిపోవును,అంతియ కాదు, పరైః అపి కృతం యత్ పాపం కర్మ = ఇతరులచే కావింపఁబడిన పాపకార్యము సైతము ఏది కలదో, తత్ = అది, తస్య = అతనిదిగా, సంభావ్యతే = తలంపఁబడును - అతనిపై మోపఁబడును.

పేదఱికము ఎన్నివిధాల సెబ్బర తెచ్చును! బందుగులు కొడుకు భార్యం బోనివారును మాట వినరు; ఎంతో చెలిమిగల మిత్రులు సైతము పెడమొగ మిడుదురు. ఆపదలే ఒకటివెంట నొకటి పైకొనును. బలము ఉత్సాహము తఱిగి పోవును, చంద్రునివలె స్వాచ్ఛ్యము లేని నడువడి చెడ్డపని చేయకున్నను మాసి పోవును. అంతియ కాదు, ఇతరులు కావించిన పాపకర్మయు, దొంగతనము హత్య మొదలైనది, తనకు అంటకట్టఁబడును.

అప్రస్తుతప్రశంస - అలంకారము.

ఈ దారిద్ర్యకార్యముల జాబితా చారుదత్తు దారిద్ర్య కార్యమును ప్రస్తుతమును ఆశ్రయించినది.

పాపం కర్మ ఇత్యాది 9, 10 అంకాల కథను సూచించును.

అపి చ,

శ్లో. సఙ్గం నైవ హి కశ్చి దస్య కురుతే
సంభాషతే నాదరా
త్సంప్రాప్తో గృహ ముత్సవేషు ధనినాం
సావజ్ఞ మాలోక్యతే
దూరా దేవ మహాజనస్య విహర
త్యల్పచ్ఛదో లజ్జయా
మన్యే నిర్ధనతా ప్రకామ మపరం
షష్ఠం మహాపాతకమ్. 32

శ్లో. 32. అస్య సఙ్గం = ఇతని సంగాతమును, న ఏవ హి కురుతే = చేయనే చేయఁడు గదా. (కశ్చిత్ = ఎవఁడును) ఆదరాత్ = మన్ననవలన - మన్ననతో, న సంభాషతే = మాటలాడఁడు, ఉత్సవేషు = పండుగులయాంగు, ధనినాం గృహం సంప్రాప్తః = ధనాఢ్యుల యిండ్లకు పోయిన (వాఁడు), సావజ్ఞం ఆలోక్యతే = తిరస్కారముతో కూడుకొన్నట్లుగా, చూడఁబడును. అల్పచ్ఛదః = మాసిన చాలని బట్టలు కట్టుకొన్నవాఁడై (దానచే), మహాజనస్య = విలపొడుగు ఉడుపులు దాల్చిన సంపన్నులకు, లజ్జయా = సిగ్గుచే, దూరాత్ ఏవ = దూరాననే దగ్గఱరాక, విహరతి = తిరుగాడును, (కావున), నిర్ధనతా = ధనహీనత (పేదతికము), ప్రకామం = ఎంతయు, అవరం = జఘన్యమైన, పా. అపరం = వేఱు తెఱఁగు, షష్ఠం = ఆఱవ, మహాపాతకమ్ - మహాపాతకములు ప్రసిద్ధముగా, పంచ = ఐదు కలవుగదా - 1 స్వర్ణస్తేయము (= బంగారు దొంగిలించుట), 2 సురాపానము (= కల్లు త్రాఁగుట), 3 బ్రహ్మహత్య (= బ్రాహ్మణుం జంపుట), 4 గురుపత్నీగమనము (= గురునిభార్యం గూడుట), 5 ఇవి చేయువారితోడి సహవాసము - అని. అట్టి పాతకి సర్వథా సహవాసానర్హుఁడు.

ఎవరును అట్టివానితో కూడరు, ఎవరును అట్టివానిని ఎక్కడికిని రానీరు, మిక్కిలి అలక్ష్యము అవమానము సేయుదురు.

మన్యే - ఉత్ప్రేక్షా వాచకము - అలంకారము ఉత్ప్రేక్ష.

మహాపాతకమ్! అని స్వరూపోత్ప్రేక్ష.

అపి చ,

శ్లో. దారిద్ర్య, శోచామి భవన్త మేవ
మస్మచ్ఛరీరే సుహృ దిత్యుషిత్వా
విపన్న దేహే మయి మన్దభాగ్యే
మ మేతి చిన్తా క్వ గమిష్యసి త్వమ్. 38

విదూ—(సవైలక్ష్యమ్) భో వయస్య యది మయా గన్తవ్యం, త దేషాపి మమ సహాయినీ రదనికా భవతు. (భో వఅస్స, జఇ మఏ గన్తవ్వమ్, తా ఏసా వి మే సహాఇణీ రదణిఆ భోదు].

---

మహాపాతకములు ఐదు, మనుప్రోక్తములు - ఇది ఆఱవది వానిని మించినది.

బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వఙ్గనాగమః
మహాన్తి పాతకా న్యాహుః సంసర్గ శ్చాపి తైః సహ.

శ్లో. 38. దారిద్ర్య = ఓరి పేదతికముగా, భవన్తం = నిన్ను - నిన్ను గూర్చి నీకోసమే - ఏవం శోచామి = ఇట్లు దుఃఖపడెదను. ఎట్లనఁగా - అస్మత్ శరీరే = నాదేహమున, సుహృత్ ఇతి = మిత్రము అని, ఉషిత్వా = కాపురముండి, మన్దభాగ్యే మయి = అదృష్టహీనుఁడనైన నేను. విపన్న దేహే = ఆపదం బొందిన - ప్రాణము పోయిన - దేహముకలవాఁడను కాఁగా, త్వం = నీవు, మమ ఇతి చిన్తాం = ఇది నాది యను తలంపును, క్వ గమిష్యసి = ఎక్కడ పొందుదువురా?

ఒరే దారిద్ర్యా, నీవు నాయందు ఇంత మక్కువతో ఇంత ప్రియవాసము ఏర్పఱుచుకొంటివే, రేపు నేను చచ్చినతైన మఱి యెవనియందు చేరెదవురా. మఱి నావంటి దరిద్రుఁడు ఎందును లేఁడు అనుట. వ్యాజస్తుతి - అలంకారము. వాసయోగ్యమను స్తుతి నిందగా ముగియునదే. ఉక్తిర్వ్యాజస్తుతి ర్నిందాస్తుతి భ్యాం స్తుతి నిందయోః.

సవైలక్ష్యమ్ - వైలక్ష్యము గుట్టు తాఁక నాడినపుడు కలుగు సిగ్గు - తాను పోను అన్నందుకు - సున్నిగ్ధా విముఖీభవన్తి సుహృదః - ఇల్లెల్ల చారుదత్తుఁడు వాపోయినందులకు - తనకు - అతనిచే నిత్యమహోపకృతునకు సిగ్గు కలిగినది.

యది మయా గన్తవ్యమ్ = నేను పోవల వలయు నేని, తత్ = అప్పటికి, ఏషా రదనికా అపి మే సహాయినీ = ఈరదనిక కూడ నాకు తోడుగా, అగునుగాక.

చారు—రదనికే, మైత్రేయ మనుగచ్ఛ.

చేటీ—యదార్య ఆజ్ఞాపయతి. [జం అజ్జో ఆణవేది].

విదూ—భవతి రదనికే, గృహాణ బలిం ప్రదీపం చ. అహ మపావృతం పక్షద్వారకం కరోమి. [భోది రదణిఏ, గేణ్హ బలిం పదీవం అ. అహం అపావుదం పక్ఖదుఆరఅం కరేమి]. (తథా కరోతి).

వసన్త— మ మాభ్యుపపత్తినిమిత్త మి వాపావృతం పక్షద్వారకమ్. త ద్యావ త్ప్రవిశామి. హా ధిక్ హా ధిక్. కథం ప్రదీపమ్! [మమ అబ్భువవత్తిణిమిత్తం విఅ అవావుదం పక్ఖదుఆరఅమ్. తా జావ పవిసామి.] (దృష్ట్వా) హా ధీ హా ధీ, కథం పదీవో!] (పటాన్తేన నిర్వాప్య ప్రవిష్టా)

చారు—మైత్రేయ, కి మేతత్ ?

---

మైత్రేయం అనుగచ్ఛ = మైత్రేయుని వెంట పొమ్ము, యత్ ఆర్య ఆజ్ఞాపయతి - సరే, అయ్యగారు ఉత్తరువుచేసినట్లే. భవతి రదనికే = అమ్మా రదనికా, గృహాణ = పట్టుకో, బలిం ప్రదీపం చ = ఉపహారమును, దీపమును. అహం... కరోమి = నేను దిడ్డివాకిలి తెఱచెదను. తథా కరోతి - అట్లు చేయును - దానిని తెఱచును అనుట.

మమ అభ్యుపపత్తి నిమిత్తం ఇవ=నన్ను కాపాడుట కొఱకే యనునట్లుగా, పక్షద్వారం అపావృతం = దిడ్డివాకిలి తెఱవఁబడినది, తత్ యావత్ ప్రవిశామి = కావున ఇదె ప్రవేశించెదను, దృష్ట్వా = చూచి - చొరఁబోఁగా నే, అగపడినది దీపము. - తనపై ఆ వెలుతురు పడి తాను అగపడకూడనివారికి అగపడునట్లు, తనకు రక్షకమైన చీకటిని భేదించునని, భయపడి - హాధిక్ - అయ్యో యిసీ అనుకొనుట, పటాన్తేన = కొంగుతో - విసరి యనుట - నిర్వాప్య = (దీపము) ఆర్పి, అది మైత్రేయాదులకును అగపడలేదు - వారు దీపము తలుపు తెఱచిన గాలికి ఆఱిపోయిన

విదూ__అపావృత పక్షద్వారేణ పిణ్డీభూతేన వాతేన నిర్వాపితః ప్రదీపః, భవతి రదనికే, నిష్క్రామ త్వం పక్షద్వారకేణ. అహ మప్యభ్యన్తరచతుఃశాలాతః ప్రదీపం ప్రజ్వా ల్యాగచ్ఛామి. [అవావుదపక్ఖదుఆరఏణ పిణ్డీభూదేణ వాదేణ ణివ్వావిదో పదీవో. భోది రదణిఏ, ణిక్కమ తుమం పక్ఖదుఆరఏణ. అహం పి అబ్భన్తరచదుస్సాలాదో పదీవం పజ్జాలిఅ ఆఅచ్ఛామి.] (ఇతి నిష్క్రాన్తః.

శకారః__భావ భావ, అన్వేషయామి వసన్తసేనికామ్. [భావే, భావే, అణ్ణేశామి వశన్తశేణిఅమ్.]

విటః__అన్విష్యతామ్ అన్విష్యతామ్.

శకారః__(తథా కృత్వా) భావ భావ, గృహీతా గృహీతా. [భావే భావే, గహిదా గహిదా.]

విటః__మూర్ఖ, న న్వహమ్.

శకారః__ఇత స్తావ ద్భూత్వా ఏకాన్తే భావ స్తిష్ఠతు. [ఇదో దావ భవిఅ ఏఅన్తే భావే చిట్ఠదు.] (పున రన్విష్య చేటం గృహీత్వా) భావ, భావ, గృహీతా గృహీతా. [భావే భావే, గహిదా గహిదా.]

---

దనుకొన్నారు. పిండీభూతేన వాయునా = ముత్తము వన గాలిచే, గాలి తటాలున విసరుగా కొట్టినదానిచే, నిష్క్రామ త్వం = నీవు వెలువడు, బయటికి పొమ్ము, అభ్యన్తర చతుఃశాలం = లోపలి నాలుగుగదుల ముంగిలిలోకి, ప్రదీపం ప్రజ్వాల్య = దీపమును వెలిగించుకొని.

అన్విష్యతాం = వెదకఁబడునుగాక _ వెదకు _ అనుట. తథా కృత్వా = అట్లు చేసి _ చీకటిలో వెదకుట నభినయించి, గృహీతా _ పట్టువడినది! నను అహం = ఓరీ నేను రా, నన్ను పట్టుకొన్నావు, ఇతః తావత్ భూత్వా = ఇక్కడికి వచ్చి _ ఏకాన్తే భావః తిష్ఠతు = ఈ ఏకాంతమున భావ ఉండునుగాక _ అనుమ గుర్తుగా విటుని ఒకతట్టు ఉంచినాఁడు _ మరల పొరపాటు పడకుండుటకు. మరల వెదకుట అభినయించి, చేటుం బట్టుకొని _ 'దొరకినది' అని అఱచినాఁడు.

చేటః—భట్టారక, చేటో ఽహమ్. [భట్టకే చేడే హంగే.]

శకారః—ఇతో భావః, ఇత శ్చేటః. భావ శ్చేటః, చేటో భావః. యువాం తావ దేకాన్తే తిష్ఠతమ్. [పున రన్విష్య రదనికాం కేశేషు గృహీత్వా] భావ, భావ, సాంప్రతం గృహీతా, గృహీతా వసన్తసేనికా. [భావే భావే, శంపదం గహిదా వశన్తశేణిఆ].

శ్లో. అన్ధకారే పలాయమానా మాల్యగన్ధేన సూచితా
కేశబృన్దే పరామృష్టా చాణక్యే నేవ ద్రౌపదీ. ౩౯

[అన్ధఆలే పలాఅన్తీ మల్లగన్ధేణ శూఇదా
కేశవిన్దే పలామిట్టా చాణక్కే ణేవ్వ దోవదీ.]

---

భట్టారక = దొరా, చేటః అహమ్ = నేను చేటుఁడను, త్వం తావత్ = నీవు, ఏకాన్తే తిష్ఠ = ఇక్కడ ఏకాంతమున ఉండు. అట్లు ఉంచి బాగుగా గుఱుతు ఉంచుకొనుచున్నాఁడు, ఇతో భావః = ఇక్కడ భావ, ఇతః చేటః = ఇక్కడ చేటుఁడు - అని రెండు మారులు చెప్పుకొనుచున్నాఁడు మరల పొరపాటు పడకుండుటకు, పున రన్విష్య = మరల వెదకి, రదనికాం కేశేషు గృహీత్వా = రదనికను వెండ్రుకలం - కొప్పునం - బట్టుకొని, ఈతూఁతి స్త్రీగా తోఁచినందున, తప్పక వసంతసేనయే పట్టుబడినది అనుకొని.

శ్లో. ౩౯. అన్ధకారే = చీకటిలో, పలాయమానా = పరువెత్తుచున్నదై, మాల్యగన్ధేన సూచితా = పూలదండవాసనచే సూచింపఁబడినదై, చాణక్యేన ద్రౌపదీ ఇవ = చాణక్యునిచేత ద్రౌపదివలె, కేశబృన్దే = వెండ్రుకల ముత్తమున - కొప్పులో - పరామృష్టా = తడవి పట్టుకొనఁబడినది.

దుఃశాసనేన అనుటకు చాణక్యేన అనుట శకారుని ఇతిహాస విరుద్ధంపుఁ బలుకు.

విటః—

శ్లో. ఏ షాసి వయసో దర్పాత్కులపుత్రానుసారిణీ
కేశేషు కుసుమాఢ్యేషు సేవితవ్యేషు కర్షితా. ౪౦

శకారః—

శ్లో. ఏ షాసి వాసు శిరసి గృహీతా
కేశేషు వాలేషు శిరోరుహేషు
ఆక్రోశ విక్రోశ లపాధిచణ్డాం శంభుం
శివం శంకర మీశ్వరం వా. ౪౧

---

శ్లో. ౪౦. వయసః = యౌవనముయొక్క, దర్పాత్ = క్రొవ్వువలన, కులపుత్రానుసారిణీ = కులీనుఁడైన యువకుని, (అనుసారిణీ =) అభిసరించుచున్న దానవు, కుసుమాఢ్యేషు = పూలుదాల్చియున్న (కాఫునసే), సేవితవ్యేషు = కొలువఁ బడవలసినవైన – ఎంతయో – ఇంకను – పూలతో – పూజింపఁ దగినవైన, కేశేషు = వెండ్రుకలయందు – కొప్పున, ఏషా = ఇదిగో, కర్షితా అసి = లాగఁ బడినదానవైతివి.

ఈ తగని దుండగమునకు పాల్పడుఁబడితివి. శకారుఁడు దాని చారుదత్తాభిసరణముం జెప్పినప్పటినుండి విటుఁడు దానియెడ చిత్తవృత్తిని మార్చుకొని అనుకూలుఁడై చారుదత్తునిసాని యని గౌరవబుద్ధి వహించినాఁడు – సాయపడనుం గోరినాఁడు.

ఆఁడుదానిని పరాయి మగవాఁడు లాగుటే తప్పు. అందు విశేషముగా కొప్పున – జుట్టున – పట్టి లాగుట ఎంతయుక్షుంతవ్యముగాని, దండ్యమైన తప్పు. మఱి అది యిట శకారుని స్త్రీని బలాత్కరించి మరులుగొల్పు చేష్ట. ఆ తప్పిదమును అవివేకమును అవలేపమును వర్ణింపఁ దరముగాదు.

శ్లో. ౪౧. వాసు = బాలా, ఏషా = ఇదిగో, శిరసి కేశేషు వాలేషు శిరోరుహేషు = తలమీఁది కొప్పున – ఇవి శకారుని పునరుక్తులు; గృహీతా అసి = పట్టుకొనఁబడితివి, అతిచణ్డాం = ఎంతబిగ్గరగా నైనను, శంభుం శివం శఙ్కరం ఈశ్వరం వా = శంభుని ఏపేరు పెట్టియైనను, ఆక్రోశ విక్రోశ వాలప = ఆఱువుము.

[ఏ శాశి వాశూ శిలశి గ్గహీదా
కేశేశు వాలేశు శిఱోలుహేశు
అక్కోశిశ విక్కోశిశ లబాహిచణ్డాం శంభుం
శివం శంకల మీశలం వా. ]

రదనికా—(స భయమ్) కి మార్యమిశ్రై ర్వ్యవసితమ్?
[కిం అజ్జమిస్సేహిం వవసిదమ్. ]

విటః—కాణేలీమాతః, అన్య ఏవైష స్వరసంయోగః.

శకారః—భావ భావ, యథా దధిసరపరిలుబ్ధాయా మార్జారికాయాః స్వరపరివృత్తి ర్భవతి, తథా దాస్యాఃపుత్ర్యా స్వగపరివృత్తిః కృతా. [భావే, భావే, జధా దహిశరపలిలుద్ధాఏ మజ్జాలిఏ శలపలివత్తే హోది, తధా దాశీఏ ధీఏ శలాపరివత్తే కడే].

విటః—కథం స్వరపరివర్తః కృతః! అహో చిత్రమ్. అథవా కి మత్ర చిత్రమ్.

---

శంభుం ఇత్యాదియు ఆక్రోశ - ఇత్యాదియు శకారుని పునరుక్తులు. ఇఁకను ఏ పౌరుషశాలియు నిన్ను విడిపింపఁజాలఁడు.

సభయమ్ = భయముతో, కిం ఆర్యమిశ్రైః వ్యవసితం = పూజ్యులచేత - మీచేత - ఏమి పూనఁబడినది? నన్ను మీరు ఏమి చేయఁ గోరుచున్నారు, పూజ్యులారా, అయ్యలారా, అన్య ఏవ ఏష స్వరసంయోగః - ఈగొంతు, పలుకు సవ్వడి వేఱుగా ఉన్నది - వసంతసేనది కాదు. దధి సర పరిలుబ్ధాయాః = పెరుఁగు మీఁగడపై ఆసగొన్న, మార్జారికాయాః = ఆడుపిల్లికి, యథా స్వరపరివర్తనః = ఎట్లు (గొంతు) పలుకుమార్పు, భవతి = కలుగునో, తథా = అట్లే, దాస్యాః పుత్ర్యా = (ఈ) లంజెకూతు చేత, స్వగపరివర్తనః = గొంతుమార్పు, కృతః = చేయఁబడినది.

కథం = ఏమీ, స్వరపరివర్తనః కృతః = గొంతుమార్పు చేయఁబడినదా! అహో చిత్రమ్ = ఆశ్చర్య మాశ్చర్యము, అథవా = కాదు, అట్లుకాదు - కిం అత్ర చిత్రం = ఇందు ఆశ్చర్య మేమున్నది?

శ్లో. ఇయం రఙ్గప్రవేశేన కలానాం చోపశిక్షయా
వఞ్చనాపణ్డితత్వేన స్వరనైపుణ్య మాశ్రితా. ౨౨

[ ప్రవిశ్య ]

విదూషకః—హీ హీ. ఆశ్చర్యం భోః. ప్రదోషమన్దమారుతేన పశుబన్ధోపనీత స్యేవ ఛాగలస్య హృదయమ్, పురపురాయతే ప్రదీపః. (ఉపసృత్య రదనికాం దృష్ట్వా) భో రదనికే. [హీ హీ భోః, పదోస మన్దమారుదేణ పసుబన్ధోవణీదస్స విఅ ఛాగలస్స హిఅఅమ్, పురపురాఅది పదీవో. భో రదణిఏ.]

శకారః—భావ భావ, మనుష్యో మనుష్యః. [భావే భావే, మణుశ్శే మణుశ్శే].

---

శ్లో. ౨౨. ఇయం = ఈమె. రఙ్గప్రవేశేన = నాట్యస్థానముం జొచ్చుట చేతను, కళానాం = కళలయొక్క, ఉపశిక్షయా చ = నేర్చుకొనుట చేతను, వఞ్చనాపణ్డితత్వేన = మోసము చేయుటయందలి పాండిత్యముచేతను, నేర్పు చేతను - స్వరనైపుణ్యం = పలుకు (గొంతు అంతలో మార్చు నేర్పును,) నేర్పును, ఆశ్రితా = పూనినది, పట్టినది.

వేశ్యకు సులభములగు విద్యలు - రంగప్రవేశము - ఆయావేషములు వేసి నటించుట - కళాశిక్షణము - కోయిలకూఁత మొదలైనవాని యనుకరణము సైతము నేర్చుకొనుట, వంచనా పాండిత్యము - మోసమును విద్యగా నేర్చి అందు పాండిత్యము పొందుట. ఈ యన్నియుం గలది. స్వరనైపుణ్యము పట్టినది.

హీ హీ భోః - అయ్యో, రదనికా, ప్రదీపః = దీపము, పురపురాయతే - పురపురలాడుచున్నదే - అదరుచున్నదే - ప్రదోషమన్దమారుతేన = మునిమాపు పిల్ల గాలికి; పశుబన్ధ... = యజ్ఞపశువు కట్టు కంబమునకు ఈడ్వఁబడుచున్న మేఁక యొక్క గుండెవలె.

మనుష్యః - ఎవఁడో మానిసి!

విదూ__యుక్తం నేదమ్, సదృశం నేదమ్, య దార్య చారుదత్తస్య దరిద్రతయా సాంప్రతం పరపురుషా గేహం ప్రవిశన్తి. [జుత్తం ణేదం, సరిసం ణేదం. జం అజ్జ చారుదత్తస్స దలిద్దదాఏ సంపదం పరపురిసా గేహం పవిశన్తి].

రద__ఆర్య మైత్రేయ, ప్రేక్షస్వ మే పరిభవమ్. [అజ్జ మిత్తేఅ, పేక్ఖ మే పరిహావమ్]

విదూ__కిం తవ పరిభవః? అథ వాస్మాకమ్. [కిం తవ పరిహావో. ఆదు అమ్హాణమ్].

రద__నను యుష్మాక మేవ. [ణం తుమ్హాణం జ్జేవ]

విదూ__కి మేష బలాత్కారః. [కిం ఏసో బలాక్కారో].

రద__అథకిమ్. [అధఇం].

విదూ__సత్యమ్, బలాత్కారః. [సచ్చమ్, బలాక్కారో].

రద__సత్యమ్. [సచ్చమ్].

---

యుక్తం - సదృశం - న ఇదమ్ = ఇది పాడియా, ఇది తగినదా? యత్ - ఏదనఁగా, ఆర్యచారుదత్తస్య దరిద్రతయా = చారుదత్తయ్య పేదతికముచేత, సాంప్రతం = ఇప్పుడు, పరపురుషాః = పరాయివారు, గేహం ప్రవిశన్తి = ఇంట ప్రవేశించుచున్నారే, ఆర్యమైత్రేయ = మైత్రేయుయ్యా, ప్రేక్షస్వ = చూడు - మే పరిభవం = నా(కుజరిగిన) అవమానమును.

కిం తవ - నీకా, అథవా = కాదు, అస్మాకమ్ = మాకే, నను యుష్మాకమ్ = మీకే కదా, కిం ఏష బలాత్కారః = ఏమి ఇది బలాత్కారమా? బలవంతముగా లాగుటయా? అథ కిం = అవును, సత్యమ్ = నిజమా? దణ్డకాష్ఠం = చేతికఱ్ఱను, ఉద్యమ్య = ఎత్తి.

విదూ—(సక్రోధం దణ్డకాష్ఠ ముద్యమ్య) మా తావత్! భోః, స్వకే గృహే కుక్కురో ఽపి తావ చ్చణ్డో భవతి. కిం పున రహం బ్రాహ్మణః? త దేతే నాస్మాదృశజనభాగధేయకుటిలేన దణ్డకాష్ఠేన దుష్ట స్యేవ శుష్క-వేణుకస్య మస్తకం తే ప్రహారైః కుట్టయిష్యామి. [మా దావ. భో, స్సకే గేహే కుక్కురోవి దావ చణ్డో భోది. కిం ఉణ అహం బమ్హణో. తా ఏదిణా అహ్మారిసజణ భాఅదేఅకుడిలేణ దణ్డకట్టేణ దుట్టస్స విఅ సుక్ఖాణ వేణుఅస్స మత్థఅం దే పహారేహిం కుట్టయిస్సమ్].

విటః—మహాబ్రాహ్మణ, మర్షయ మర్షయ.

విదూ—(విటం దృష్ట్వా) నాత్ర ఏషో అపరాధ్యతి.

మా తావత్ = కూడదు, కూడదు. స్వకే గేహే = తన యింట, కుక్కురః అపి తావత్ = కుక్క సయితమును, చణ్డః = (కోపముతో) భయంకరము, భవతి = అగును, కిం పునః = మఱి ఏమి చెప్పవలయునా! అహం బ్రాహ్మణః = నేను బ్రాహ్మణుఁడను - ఎంత చేయలేను అనుట.

స్వకే గేహే కుక్కురః...కిం పున రహం బ్రాహ్మణః. ఇందు అలంకారము కావ్యార్థాపత్తి.

కైముత - మఱి చెప్పవలయునా? అనుచోట కావ్యార్థాపత్తి. 'కైముత్యే నార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే'

తత్ = కావున, ఏతేన దణ్డకాష్ఠేన = ఈ (చేతి) కఱ్ఱతో, అస్మాదృశ జన భాగధేయ కుటిలేన = మాబోఁటి జనుల యదృష్టమువలె వంకరయైనదాని చేత - కాష్ఠవిశేషణము - విదూషకునికి చేతికఱ్ఱయు వంకరయైనదే. శుష్క-వేణోః ఇవ = ఎండిన వెదురుం బోలిన, దుష్టస్య తే మస్తకం = దుర్జనుఁడవైన నీతలను, ప్రహారైః కుట్టయిష్యామి = దెబ్బలతో, కొట్టెదను.

మహాబ్రాహ్మణ = ఓ దొడ్డ బ్రాహ్మణుఁడా, మర్షయ = మన్నింపుము, న అత్ర ఏషః అపరాధ్యతి = ఇందు ఇతఁడు కాదు తప్పు చేసినవాఁడు, ఏష ఖలు అత్ర

(శకారం దృష్ట్వా) ఏష ఖల్వత్రాపరాధ్యతి. అరేరే రాజ్ఞశ్శ్యాలక సంస్థానక దుర్జన దుర్మనుష్య, యుక్తం నేదమ్. యద్యపి నామ తత్రభవా నార్యచారుదత్తో దరిద్రస్సంవృత్తః, తత్కిం తస్య గుణై ర్నాలంకృ తోజ్జయినీ. యేన తస్య గృహం ప్రవిశ్య పరిజన స్యేదృశ ఉపమర్దః క్రియతే.

[ణ ఏత్థ ఏసో అవరజ్ఝది. ఏసో క్ఖు ఏత్థ అవరజ్ఝది. అగేరే రాఅసాలఅ సంట్ఠాణఅ దుజ్జణ దుమ్మణుస్స. జుత్తం ణేదమ్. జఇవి ణామ తత్తభవం అజ్జచారుదత్తో దలిద్దో సంవుత్తో, తా కిం తస్స గుణేహిం ణ అలంకిదా ఉజ్జయిణీ. జేణ తస్స గేహం పవిసిఅ ఈరిసో ఉవమద్దో కరీఅది.]

శ్లో॥ మా దుర్గత ఇతి పరిభవో, నాస్తి కృతాన్తస్య దుర్గతో నామ.
చారిత్రేణ విహీన ఆఢ్యో ఽపి చ దుర్గతో భవతి. ౪౩

---

అపరాధ్యతి = వీఁడు కాదా - ఈ శకారుఁడు - ఇట నాయెడ అపరాధము కావించినాఁడు, యది అపి నామ...సంవృత్తః - చారుదత్తయ్య దరిద్రుఁడైన నేమాత్రము, తత్ = దాన. కిం తస్య గుణైః న అలఙ్కృతా ఉజ్జయినీ = ఆయన గుణములచే ఉజ్జయిని అలంకరింపఁబడక యున్నదా? ఆయన మంచి స్వభావము దాతృత్వము మొదలైనవి, ఉజ్జయినికే అలంకారమైనవి, ప్రసిద్ధిం గోలుపోయినవా డనుట. యేన = ఏలన - ఏల యడుగుచున్నాననఁగా, తస్య గృహం ప్రవిశ్య... అతని యిల్లు చొచ్చి, అతని పరిజనమునకు ఇట్టి, ఉపమర్దః = నలఁగుడా? అరేరే = ఓగోరి, సంస్థానక = అది వాని పేరు, రాజశ్యాలక - రాజుమఱంది, దుర్జన = దుష్టుఁడా, దుర్మనుష్య = హీనజాతివాఁడా, నీ వెంత రాజు మఱఁది యైనను, ఇట్టి చెడ్డపని చేయుదువా?

శ్లో. ౪౩. దుర్గత ఇతి = దరిద్రుఁడు అని, మా పరిభవః = కూడదు, అవమానించుట. కృతాన్తస్య = విధికి, దైవమునకు, దుర్గతో నామ నాస్తి = బీదవాఁడనుట లేదు - పాటింపఁబడదు, చారిత్రేణ హీనః = మంచి నడువడి - శీలము - లేనివాఁడు, ఆఢ్యః అపి - భాగ్య - ధన - వంతుఁ డైనను, దుర్గతః భవతి = బీదవాఁడు అగును.

[మా దుగ్గదో త్తి పరిహావో ణత్థి కఅన్తస్స దుగ్గదో ణామ
చారిత్తేణ విహీణో అడ్ఢో విఅ దుగ్గదో హోఇ.]

విటః—(సవైలక్ష్యమ్) మహాబ్రాహ్మణ, మర్షయ మర్షయ; అన్యజనశఙ్కయా ఖల్విద మనుష్ఠితమ్. న దర్పాత్. పశ్య

శ్లో. సకామాన్విష్యతే ఽస్మాభిః

విదూ—కి మియమ్? [కిం ఇయమ్?]

విటః—శాన్తం పాపమ్!

ధన మనఁగా నిజముగా ఏమి? శీలము. అది కలవాఁడు నిజముగా భాగ్యశాలి. అది లేనివాఁడు, ధనమున్నను పేదయే, నిర్భాగ్యుఁడే; పేదఱికము యముని దండన పొందునది కాదు, మఱి చారిత్రహీనత ఏమనుకొన్నావో అది వాని కడ పేదఱికము.

నాస్తి కృతాన్తస్య-అను మొదలైన సమర్థనము కలిమి, కావ్యలింగాలంకారము.

అఢ్యో ఽపి దుర్గతో భవతి - అను విరోధము చారిత్రేణ విహీనః అని ఆభాసమైనందున విరోధాభాసము.

'ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే.'.

సవైలక్ష్యమ్=గుట్టు తాఁక నాడఁబడుటచే కలిగిన సిగ్గుతో, అన్యజనశఙ్కయా=మఱొకతె అని యనుకొని కదా, ఇదం అనుష్ఠితమ్=ఇది - ఈపని - చేయఁబడినది, న దర్పాత్='పొగరువలన కాదు - విటుఁడు చారుదత్తుని పేరు తొలుత విన్నప్పటినుండి వసంతసేనాభిసరణము మానుకొని పశ్చాత్తప్తుఁడు నగుచున్నాఁడు - శకారుఁ డొకఁడే పోకిరిగా నుండుట.

శ్లో. ౪౪. సకామా = కామముతో - కోరికతో - మరులుతో కూడు కొన్నట్టి, (ఒకర్తు.) అస్మాభిః = మాచే, అన్విష్యతే = వెదకఁబడుచున్నది - [ఇంతలో తొందరపడి యడుగుచున్నాఁడు 'కిం ఇయం'-'ఏమి ఈపెయా?'_అని. శాన్తం పాపమ్=కాదు కాదు - అనుటయ - శాన్తం పాపమ్ - అనుట - అపై

కాచి త్స్వాధీనయౌవనా!

సా నష్టా, శఙ్కయా తస్యాః ప్రాప్తే ఽయం శీలవఞ్చనా. ౪౪

సర్వథా ఇద మనునయ సర్వస్వం గృహ్యతామ్. (ఇతి ఖడ్గ ముత్సృజ్య కృతాఞ్జలిః పాదయోః పతతి).

విదూ—సత్పురుష, ఉత్తిష్ఠోత్తిష్ఠ. అజానతా మయా త్వ ముపాలబ్ధః. సాంప్రతం పున ర్జాన న్ననునయామి. [సప్పురిస, ఉత్ఠేహి ఉత్ఠేహి. అఆణన్తేణ మఏ తుమం ఉవాలద్ధో. సంపదం ఉణ జాణన్తో అణుణేమి.]

అట్టి యపవాదముం బలికిన పాపము శమించును గాక.] కాచిత్ - ఒకానొకతె, స్వాధీనయౌవనా = తన జవ్వనమును తన పరముగనే అమ్ముకొనఁదగినట్లు ఉంచుకొన్నట్టిది - భర్తకును అత్తమామలకును పరాధీనము కానట్టిది - పరకీయ కానట్టిది - సామాన్య, భోగముది - అనుట. సా = ఆపె. నష్టా = అగపడక పోయినది, తస్యాః శఙ్కయా = ఆపెయొక్క - ఆపెయను సందేహముచేత, ఇయం = ఈ, శీలవఞ్చనా = నడవడి లోపము, పరస్త్రీని తాఁకుట యనునది, ప్రాప్తా = పొందఁబడినది - దాన ఈ నిందకు పాల్పడితిని.

ఒక భోగముది ఇటు వచ్చినది. దాని వెంట వచ్చితిని. అంతియ. నేను పరస్త్రీని బలాత్కరించు చెడునడువడి నడుచుకొనువాఁడఁ గాను. దానికి నేను మఱెంత, ఎట్లు క్షమాపణ ఒనర్తును?

సర్వథా = ఎల్ల తెఱంగులైన, అనునయసర్వస్వం = ఊఱడింపు మొత్తము - బతిమాలుకొనుట - గృహ్యతాం = గ్రహింపఁ బడును గాక, నన్ను మన్నించి కావుము - అని - కృతాఞ్జలిః పాదయోః పతతి = చేతులు మోడ్చి పాదములం బడును.

సత్పురుష = ఓయి సజ్జనుఁడా, ఉత్తిష్ఠ = లెమ్ము, అజానతా మయా = ఎఱుఁగని వాఁడనైన నాచేత, త్వం ఉపాలబ్ధః = నీవు దూఱఁబడితివి, సాంప్రతం పునః = మఱి యిప్పుడు, జానన్ = ఎఱుఁగుచున్నవాఁడనై - అనునయామి =

విటః—నను భవా నే వా త్రానునేయః. త దుత్తిష్ఠామి సమయతః.

విదూ—భణతు భవాన్. [భణాదు భవమ్].

విటః—య దీమం వృత్తాన్త మార్యచారుదత్తస్య నాఖ్యాస్యసి?

విదూ—న కథయిష్యామి. [న కథయిస్సమ్].

విటః—

శ్లో. ఏష తే ప్రణయో విప్ర శిరసా ధార్యతే మయా
గుణశస్త్రై ర్వయం యేన శస్త్రవన్తో ఽపి నిర్జితాః. ౪౫

(నేను)నిన్ను తేర్చెదను. నన్ను మన్నింపుము. బతిమాలెదను. నను = అయ్యా, భవాన్ ఏవ అత్ర అనునేయః = నీవే ఇందు మన్నింపు అడుగఁబడవలసినవాఁడవు, సమయతః ఉత్తిష్ఠామి = (నీవు నాకు ఈ) సమయము - ఒడంబడిక, వాగ్దానము చేసినట్లైన - (ఉత్తిష్ఠామి =) నేను (నీపాదములు వదలి) లేచెదను, భణతు భవాన్ = నీవు చెప్పుదువుగాక - చెప్పుము అనుట - యది ఇమం వృత్తాన్తం ఆర్యచారుదత్తస్య న ఆఖ్యాస్యసి = ఈ జరిగినదానిని, నేను కావించినదానిని, చారుదత్తయ్య గారికి చెప్పకుందువేని, న కథయిష్యామి = నేను చెప్పను.

శ్లో. ౪౫. విప్ర = బ్రాహ్మణుఁడా, ఏషః తే ప్రణయః = ఇదిగో ఈ నీ స్నేహము, మయా = నాచేత, శిరసా ధార్యతే = తలపైఁ దాల్పఁబడుచున్నది, యేన = దేన, శస్త్రవన్తః అపి వయం = కత్తి పూనినవాఁడ నైనను నేను, గుణశస్త్రైః = సద్గుణము లనుఆయుధములతో, నిర్జితాః - ఓడింపఁబడితిని, చారుదత్తునికి అణఁగిపోతిని, సత్పురుషులు లోకమును - లోకులను - గుణములతో గెలుతురు. స్వాధీనము చేసికొందురు.

నీతోఁడి యీస్నేహమును నేను తలం దాల్తును. నేను నీకు - మీకు - ఎప్పుడును ఎందులకును వశ్యుఁడను. నాకత్తి ఎందులకు? నీ గుణములకు నేను దాసుఁడను.

శకా—(సాసూయమ్) కింనిమిత్తం పున ర్భావ ఏతస్య దుష్టవటుకస్య కృపణాఞ్జలిం కృత్వా పాదయో ర్నిపతితః? [కిం ణిమిత్తం ఉణ భావే ఏదశ్శ దుట్టవడుఅశ్శ కివిణఅఞ్జలిం కదుఅ పాయేశు ణివడిదే?]

విటః—భీతో ఽస్మి

శకా—కస్మా త్త్వం భీతః? [కశ్శ తుమం భీదే?]

విటః—తస్య చారుదత్తస్య గుణేభ్యః.

శకా—కే తస్య గుణా యస్య గృహం ప్రవి శ్యాశితవ్యమపి నాస్తి. [కే తశ్శ గుణా జశ్శ గేహం పవిశిఅ అశిదవ్వం పి ణత్థి]

విటః—మా మైవమ్.

శ్లో. సో ఽస్మద్విధానాం ప్రణయైః కృశీకృతో

---

గుణశస్త్రైః - అని రూపణముచేత రూపకము.

విషయ్యభేదతాద్రూప్య రంజనం విషయస్య యత్ రూపకమ్. శిగో ధారణమునకు ... నిర్జితాః ఇత్యాది సమర్థనము కలిమి కావ్యలింగమును.

సాసూయమ్ = అసూయతో, కిం నిమిత్తం పునః = మఱి యెందులకు భావః = భావ, దుష్టవటుకస్య = చెడ్డనుడుగునకు, (క - నిందార్థకము, వటుక అనుటయు.), కృపణం అఞ్జలిం = దీనపు చేమోడ్పు, కృత్వా = కావించి, పాదయోః నిపతితః = పాదములం బడినాఁడు?

భీతః అస్మి = భయపడితిని, కస్మాత్ = ఎవనివలన? తస్య చారుదత్తస్య గుణేభ్యః = ఆ చారుదత్తుని గుణములవలన, కే తస్య గుణాః = ఏవి ఆతని గుణములు? యస్య = ఎవనియొక్క - (అతనియొక్క అనుట), గృహం ప్రవిశ్య = ఇంటఁ జొచ్చి, అశితవ్యం అపి నాస్తి = తినఁదగినది - (కమికేఁడు) కూడైనను లేదె, మా మా ఏవం = అనకు, అట్లనకు.

శ్లో. ౨౮. సః = ఆయన, అస్మద్విధానాం ప్రణయైః = నాఁబోంట్ల యాచనలచేత, కృశీకృతః = సన్నగిలునట్లు - బక్కగా - సంపదలేనివాఁడుగా

న తేన కశ్చి ద్విభవై ర్విమానితః,
నిదాఘకాలే ష్వివ సోదకో హ్రదో
నృణాం స తృష్ణా మపనీయ శుష్కవాన్. ౪౭

శకా—(సామర్షమ్) కః స గర్భదాస్యాఃపుత్త్రః? [ కే శే గబ్భదాసీఏ పుత్తే?

శ్లో. శూరో విక్రాన్తః పాణ్డవః శ్వేతకేతుః
పుత్త్రో రాధాయా రావణ ఇన్ద్రదత్తః
ఆహో కున్త్యా తేన రామేణ జాతః
అశ్వత్థామా ధర్మపుత్త్రో జటాయుః? ౪౮

చేయఁబడినాఁడు, అడిగినవారి కెల్ల అడిగినట్లు పెట్టి, ఇట్లు పేదవడినాఁడు, విభవైః= సంపదలచేత, తాను కలవాఁడను అని, తేన = అతనిచేత, కశ్చిత్ = ఎవఁడును, న విమానితః = అవమానింపఁబడలేదు, ధనముకలిమి — ఈవికలిమి — గర్వములేమి — ఇన్నియు ప్రత్యేక గుణములు, నిదాఘకాలేషు = ఎండకాలములందు, సోదకః హ్రదః ఇవ = నీరు నిండిన మడువు వలె, సః = అతఁడు, నృణాం = జనుల, తృష్ణాం = ఆశను, దప్పినిఅనియు, అపనీయ = తీర్చి, శుష్కవాన్ = లేనివాఁడు — దరిద్రుఁడు — ఎండిపోయినవాఁడు — ఐనాఁడు.

నాబోంట్లకు పెట్టి తాను లేనివాఁడైనాఁడు. కలవాఁడ నని, ఎవనిని అవమానించి యెఱుఁగఁడు. ఎండకాలపు మడుగువలె జనుల ఆసదప్పిని తీర్చి తీర్చి, పాపము, ఎండి — దరిద్రుఁడై — పోయినాఁడు.

కః సః గర్భదాస్యాః పుత్రః — ఎవఁడు, ఆపుట్టులంజాకొడుకా! వాఁడా, నీవు చెప్పుట!

నిదాఘకాలేషు హ్రద ఇవ — ఉపమాలంకారము.

శ్లో. ౪౮. శూరః = విక్రాన్తః = పరాక్రమశాలికి పునరుక్తులు. సర్వమును ఇతిహాసపురాణ విరుద్ధములు — శకారసులభములు — శూరుఁడును విక్రాంతుఁడు నైన పాండవుఁడు అర్జునుఁడు — దానికి బదులు శ్వేతకేతు వనుట. రాధకొడుకు కర్ణుఁ డనుటకు రావణుఁ డనియు, ఇంద్రదత్తుఁ డనియు అనుట, అహో = లేక, కుంతికి ఆ రామునిచేత పుట్టిన — ఇత్యాది సర్వము ప్రల్లదము లు.

[ శూలే విక్కన్తే పణ్ణవే శేదకేతు
పుత్తే లాధాయే లావణే ఇన్దదత్తే
ఆహో కున్తీయే తేణ లామేణ జాదే
అశ్శత్థామే ధమ్మపుత్తే జడాఊ? ]

విటః—మూర్ఖ, ఆర్య చారుదత్తః ఖల్వసౌ.

శ్లో. దీనానాం కల్పవృక్షః స్వగుణఫలనతః
సజ్జనానాం కుటుమ్బీ,
ఆదర్శః శిక్షితానాం సుచరితనికషః
శీలవేలాసముద్రః,
సత్కర్తా నావమన్తా పురుషగుణనిధి
ర్దక్షిణోదారసత్త్వః,

---

ఇట్లు దుర్భాషలాడెద వేమిరా?

మూర్ఖ ... = చారుదత్తయ్యగారు గదరా ఆయన?

శ్లో. ౪౪. దీనానాం = బీదలకు, స్వగుణఫలనతః = తన మేలిగుణములు - ఔదార్యాదులు అను పండ్లతో వంగిన - సులువుగా పొందఁదగిన అనుట, కల్పవృక్షః = ఈవిప్రాను - కోరికలెల్ల ఒసంగు దివ్యవృక్షము, సజ్జనానాం కుటుమ్బీ = సాధువులే తనకు కుటుంబముగా - పోష్యవర్గముగాఁ గలవాఁడు; శిక్షితానాం = అభిజ్ఞులకు, ఆదర్శః = తమ జ్ఞానమెంతో చూచుకొనుటకును, తప్పును దిద్దుకొనుటకును, అద్దమైనవాఁడు; సుచరితనికషః = (ఇతరుల) మంచినడువడికి ఒరగల్లు; దాని మంచియు ఇంతంతలు కొలుచుటకు అనుట, శీలవేలా సముద్రః = సముద్రమువలె సంపదతో నిండినవాఁడైనను (దానికి) శీలమే - మంచి నడువడియే - దాఁటరాని తీరము - ఒడ్డుగా కలవాఁడు, మంచి నడువడియే 'పోటు' 'పొంగు'గా కల గుణసముద్రుఁడు, సత్కర్తా = (ఎల్ల వారిని) గౌరవించువాఁడు, న అవమన్తా = (ఎవరిని కాని) అవమానించు - తిరస్కరించువాఁడు కాఁడు, పురుష గుణ నిధిః - ఒక్కొక్క దానినిగా ఎన్నింటిని, లెక్కింతును? పురుషుల కుండవలయు మేలిగుణముల సత్యశౌచాదుల నిధానము, దక్షిణోదార సత్త్వః = మోమోటమియు దయయు శక్తియుం గూడినదియు ఉన్నతమైనదియు

హ్యేకః శ్లాఘ్యః స జీవ త్యధికగుణతయా
చోచ్ఛ్వస న్తీవ చాన్యే. ౪౮

తదితో గచ్ఛామః.

శకా—అగృహీత్వా వసన్తసేనామ్? [అగేణ్హిఅ వశన్త శేణిఅమ్?]

నగు (సత్త్వము =) పూనికయు ఉత్సాహము గలవాఁడు. ఇట్లల్ల, అధిక గుణతయా = అతిశయమైన గుణములు గలవాఁడగుట చేతను, శ్లాఘ్యః = పొగడఁ దగినవాఁడై, స ఏకః = అతఁడు ఒక్కఁడే, జీవతి హి = నిజముగా జీవించి యున్నాఁడు, అన్యే చ = ఇతరులన్ననో, ఉచ్ఛ్వసన్తి ఇవ = ఊరక ఊపిరి యాడుచుంబోలె ఉన్నారు - మను పీనుంగులు.

చారుదత్తునియందు లేని మంచిగుణమును లోకోపకారచింతయు మఱి యెందును లేదు. కావున అతఁ డొక్కఁడే నిజముగా శ్లాఘ్యముగా బ్రదికి యుండువాఁడు, మఱి యందఱును ఊపిరిమాత్రము ఆడుచుండువారే. అతఁడు ఎవ రేది కోరినను ఇచ్చును; సజ్జనమును తన జనముగా పోషించువాఁడు. విద్వాంసులు తమ్ము చూచుకొని యెఱింగి దిద్ది తీర్చుకొనుటకు అద్దము ... ఇట్లే తక్కిన దానికి దాత్పర్యము.

ఒక్కని పలువురు పలుగల నుల్లేఖించుట ఉల్లేఖము. బహుభి ర్బహుధోల్లేఖా దేక స్యోల్లేఖ ఇష్యతే. దీనులు కల్పవృక్షముగా సజ్జనులు కుటుంబిగా శిక్షితులు ఆదర్శముగా ఉల్లేఖించుటచే ఉల్లేఖము అలంకారము. సుచరిత నికష కాది - అహమహమికతో ఆర్య చారుదత్తునందు అన్వయించుటం జెప్పుట - సముచ్చయము. అహం ప్రాథమికాభాజా మేకకార్యాన్వ యేపి సః (సముచ్చయః). సజీవతి - అన్యే ఉచ్ఛ్వసన్తి - ఉపమా నోపమేయములలో విశేషము కలిమి వ్యతిరేకాలంకారము.

'వ్యతిరేకో విశేష శ్చే దుపమానోపమేయయోః.'

తదితో గచ్ఛామః = కావున ఇందుండి పోయెదను (నేను.) బహువచనము నకు ఏకవచన మర్థము. కాదా, పోవుదము - అందఱం గలుపుకొనినమాట, అందులకు శకారుని ఆక్షేపణ -

అగృహీత్వా వసన్తసేనాం = కాకువుచే ప్రశ్న - వసంతసేనం గొనకయేనా?

విటః—నష్టా వసన్తసేనా.

శకా—కథ మివ? [కథం విఅ?]

శ్లో. అన్ధస్య దృష్టి రివ పుష్టి రి వాతురస్య
మూర్ఖస్య బుద్ధి రివ సిద్ధి రి వాలసస్య
స్వల్పస్మృతే ర్వ్యసనినః పర మేవ విద్యా
త్వాం ప్రాప్య సా రతి రివారిజనే ప్రనష్టా. ౪౯

---

నష్టా ... వసంతసేన అగపడకపోయినది. ఆమెం గొనుటేమి? కథం ఇవ = ఎటువలె?

శ్లో. ౪౯. అన్ధస్య దృష్టిః ఇవ = గ్రుడ్డివాని చూపువలెను, ఆతురస్య పుష్టిః ఇవ = రోగియొక్క బలుపువలెను, మూర్ఖస్య బుద్ధిః ఇవ = మొఱకుని తెలివివలెను, అలసస్య = సోమరియొక్క, సిద్ధిః ఇవ = తొలుత సప్రయత్నుఁడై సంపాదించుకొన్న, (సిద్ధిః ఇవ =) మంత్ర తప ఆది సిద్ధివలెను, స్వల్పస్మృతేః = జ్ఞాపిశక్తి ఇంచుకే ఐనవానికి – ధరింపరాఁమిచేతను, వ్యసనినః = చెడువాడుకలు పట్టువడినవానికి – వేఱు పరాకు ఎక్కువగుటచేతను – అనుట, పరమా విద్యా = ఉత్కృష్టమైన విద్య – బ్రహ్మవిద్య అనుట – వానివలెను, సా = ఆమె = వసంతసేన, త్వాం ప్రాప్య = నిన్ను పొందియు, నీబారింబడియు, అరిజనే రతిః ఇవ = శత్రువులయందు అనురాగము – ప్రీతి – వలె, ప్రణష్టా = అగపడకపోయినది. తాను నిన్ను ఒల్లనిది. నీవు బలాత్కారముగా వెంటఁబడితివి. మఱి నీవే ఆమెను చారుదత్తుని యింటిని, తాను తప్పించుకొను ఉపాయమును చూపితివి. నన్ను చేటుని రదనికను పట్టుకొని అఱచి ఎట్లెట్లో కూడని విధాన విలంబమును జేసితివి. కావున వసంతసేన భ్రాంతిగా అగపడకపోయినది.

వారివారికి అవియవి ఎట్లు తటాలున నే, గొప్ప కారణము కలుగుటచేత పోవునో, వసంతసేన అట్లు నీకు లేక అగపడక పోయినది.

అన్ధస్య దృష్టిరివ – ఇత్యాది – మాలోపమ.

ఏతత్ అపి న శ్రుతం త్వయా? = ఇదియు నీవు వినలేదా? ఏదనఁగా.

శకా—అగృహీత్వా వసన్తసేనాం న గమిష్యామి. [అగే
ణ్హిఅ వసన్తశేణిఅం ణ గమిశ్శమ్.]

విటః—ఏత దపి న శ్రుతం త్వయా?

శ్లో. ఆలానే గృహ్యతే హస్తీ, వాజీ వల్గాసు గృహ్యతే.
హృదయే గృహ్యతే నారీ, య దీదం నాస్తి గమ్యతామ్. ౫౦

శకా—యది గచ్ఛసి గచ్ఛ త్వమ్. అహం న గమిష్యామి.
[యది గచ్ఛశి, గచ్ఛ తుమమ్. హగే ణ గమిశ్శమ్.]

విటః—ఏవమ్ గచ్ఛామి. (ఇతి నిష్క్రాన్తః.)

శ్లో. ౫౦. ఆలానే = కట్టు గ్రక్కమున, —హస్తీ = ఏనుఁగు, గృహ్యతే = వసము చేసికొనఁబడును, వాజీ = గుఱ్ఱము, వల్గాసు = కళ్ళెముల - గృహ్యతే = వసము చేసికొనఁబడును, నారీ = స్త్రీ, హృదయే = చిత్తమునందు, గృహ్యతే = పట్టువఱుచుకొనఁబడును, ఇదం = ఇది, యది నాస్తి = లేకపోయెనేని, గమ్యతామ్ = పోవచ్చును - నీవు అనుట.

పట్టు లేకున్న వసము చేసికొనుట శక్యము గాదు. ఏనుఁగునకు గ్రక్కమును, గుఱ్ఱమునకు కళ్ళెమును స్త్రీకి అనురాగమును పట్టువఱుచుకొనుటకు సాధనములు - అది లేదేని మానుకొని పోవచ్చును.

ఆలానేత్యాది. ప్రతివస్తూపమ.

ఉపమానోపమేయోభయగతమగు సమాన ధర్మమును వేఱు వేఱుగా తెల్పుట.

నారీ హృదయే గృహ్యతే - హస్తి ఆలానమున వాజి వల్గములను - అని వేఱు వేఱుగా చెప్పుటచేత.

వాక్యయో రేకసామాన్యే ప్రతివస్తూపమా మతా.

యది గచ్ఛసి గచ్ఛ త్వం = పోవుదువేని నీవు పొమ్ము. అహం - ... నేను పోను. ఏవమ్ - గచ్ఛామి - అట్లే - పోయెదను.

శకా—గతః ఖలు భావో౽భావమ్. (విదూషక ముద్దిశ్య) అరే కాకపదశీర్షమస్తక దుష్టవటుక, ఉపవి శోపవిశ. [గదే క్షు భావే అభావమ్. అలే కాకపదశీశమత్థకా దుట్టవడుకా, ఉపవిశ.]

విదూ—ఉపవేశితా ఏవ వయమ్. [ఉవవేసిదా జ్జేవ అమ్హే.]

శకా—కేన? [కేణ?]

విదూ—కృతాన్తేన. [కఅన్తేణ]

శకా—ఉత్తి ష్ఠోత్తిష్ఠ. [ఉట్ఠేహి ఉట్ఠేహి]

విదూ—ఉత్థాస్యామః. [ఉట్ఠిస్సామో]

శకా—కదా? [కదా?]

విదూ—యదా పున రపి దైవ మనుకూలం భవిష్యతి. [జదా పుణో వి దేవ్వం అణుఊలం భవిస్సది.]

---

గతః ఖలు భావః అభావమ్ - భావ అగపడకపోయినాఁడు గదా. అతఁడు ఉన్నట్లైన ఇతనికి ఈమాటలు పలుకు ధైర్యము లేదు, అరే - ఓరీ, కాకపద శీర్షమస్తక - శీర్ష మస్తక - అనుట శకారు పునరుక్తి - కాకికాలివలె ప్రక్క అ వంకర మూలలు కలిగి ముందు పొడుఁగును సన్నమును ఐన తల గలవాఁడా - వంకరయు విరూపమును ఐన తలగలవాఁడా. దుష్టవటుక - చెడ్డవడుగుగా. అంత నిర్లక్ష్యముగా పలుకుచున్నాఁడు, ఉపవిశ = కూర్చుండుము - అనుటయు. ఉప వేశితా ఏవ వయం = కూర్చుండఁ బెట్టఁబడియే యున్నాను - బహువచనమునకు ఏక వచన మర్థము. వ్యాకరణ సూత్రముచేత.

'అస్మదో ద్వయో శ్చ - ఏకత్వే ద్విత్వే చ వివక్షితే, అస్మదో బహు వచనం వా స్యాత్. వయం బ్రూమః - పక్షే అహం బ్రవీమి -' సిద్ధాంతకౌముది.

కృతాన్తేన = దైవముచేత - చదికిలఁబడియేయున్నాను, దైవముచేత. నీవు చెప్ప నక్కఱలేదులే - ఇదియు అలక్ష్యపు జవాబు, శకారునికి. అనఁగా దైవోప హతుఁడనుగా ఉన్నాను - అనుట. ఉత్తిష్ఠ = లెమ్ము, ఉత్థాస్యామి - లేవగలను. యదా పునః అపి దైవం అనుకూలం భవిష్యతి - ఎప్పుడు మరల దైవము అను కూలము అగునో. శకారుని పొగరు మాటలు!

శ కా—అరే, రుదిహి రుదిహి. [అలే, లోద లోద.]

విదూ—రోదితా ఏవ వయమ్. [రోదావిదా జ్జేవ అహ్మే.]

శ కా—కేన? [కేణ?]

విదూ—దుర్గత్యా. [దుగ్గదీఏ.]

శ కా—అరే, హస హస. [అలే, హస హస].

విదూ—హసిష్యామః. [హసిస్సామో].

శ కా—కదా? [కదా?].

విదూ—పున రపి బు ద్ధ్యార్యచారుదత్తస్య [పుణో వి బుద్ధీఏ అజ్జచారుదత్తస్స]

శకారః—అరే దుష్టవటుక, భణిష్యసి మమ వచనేన తం దరిద్ర చారుదత్తకమ్ - ఏషా ససువర్ణా సహిరణ్యా నవనాటకదర్శనోత్థితా సూత్రధారీవ వసన్తసేనానామ్నీ గణికాదారికా కామదేవాయతనోద్యానా త్ప్రభృతి త్వా మనుర క్తాస్మాభి ర్బలాత్కారాను

అరే = ఓరి - అనుచున్నాఁడు, పొగరుగా, రుదిహి = ఏడువుము, రోదితా ఏవ = ఏడిపింప సేబడుచున్నాను, దుర్గత్యా = బీదతనము చేత, హసిష్యామః = నవ్వగలను, పున రపి బుద్ధ్యా = మరల సమృద్ధి - సంపద - (వచ్చుట) చేత.

భణిష్యసి - చెప్పఁగలవు - చెప్పరా - అనుట. ...దత్తకమ్ = చారుదత్తిగానితో - 'క' ప్రత్యయము నిందార్థకము. అతఁడును అంత కంటికి దిసింపక ఉన్నాఁడు - 'అపూటకు వాని యింట తిండి లేనివాఁడు' అని మును పే 'యస్య గృహం ప్రవిశ్య అశితవ్య మపి నాస్తి.' అని అన్నాఁడుగదా. నవ నాటక దర్శనోత్థితా = క్రొత్తగా ఆటను చూపుటకు నిలుచుండిన - సూత్రధారీవ = సూత్రధారివలె, ఆటకత్తెవలె, ససువర్ణా = బంగారు (సొమ్ముల)తో కూడుకొన్నదై, గణికాదారికా = భోగముపిల్ల, కామదేవాయతనోద్యానాత్ ప్రభృతి - కాముని దేవళపు తిరుణాళ్ల - యాత్ర - (ఉద్యాన = తిరునాళ్ల అని. వే. వేం.) మొదలుకొని, త్వాం అనురక్తా = నీయందు అనురాగముగలదై, అస్మాభిః = నాచేత, బలాత్కార అనునీయమానా = బలవంతముగా (వసము చేసికొనుటకై) బతిమాలు

నీయమానా తవ గేహం ప్రవిష్టా. త ద్యది మమ హస్తే స్వయ మేవ ప్రస్థాప్యైనాం సమర్పయసి, తతో ఽధికరణే వ్యవహారం వినా లఘు నిర్యాతయత స్తవ మ యానుబద్ధా ప్రీతి ర్భవిష్యతి. అథవా అనిర్యాతయతో మరణాన్తికం వైరం భవిష్యతి. అపి చ ప్రేక్షస్వ.

[అలే దుట్టవడుకా, భణేశి మమ వఅణేణ తం దలిద్ద చాలు దత్తకమ్ - 'ఏశా శశువణ్ణా శహిలణ్ణా ణవణాడఅ దంశణుట్టిదా శుత్తదాలి వ్వ వశన్తశేణా ణామ గణిఆదాలిఆ కామదేవాఅదణుజ్జాణాదో పహుది తుమం అణులత్తా అహ్మేహిం బలక్కాలాణుణీఅమాణా తుహ గేహం పవిట్టా. తా జహ మమ హత్థే శఅం జ్జేవ పవిట్టావిఅ ఏణం శమప్పేశి, తదో అధిఅలణే వవహాలం వినా లహుం ణిజ్జాదమాణాహ తవ మఏ అణుబద్ధా పీదీ హువిశ్శది. ఆదు అణిజ్జాదమాణాహ మలణన్తికే వేలే హువిశ్శది. అవి అ పేక్ఖ.]

శ్లో. కూష్మాణ్డీ గోమయలిప్తవృన్తా
శాకం చ శుష్కం తలితం ఖలు మాంసమ్

---

కొనఁబడుచున్నదై - బలవంతము బలిమాలుట విరుద్ధార్థకములు, శకారుని వి, ప్రస్థాప్య = నడపించి తెచ్చి-అధికరణే=వ్యవహారస్థానమున (=Court of Justice), వ్యవహారం వినా = వ్యాజ్యెము - తగవు - పిర్యాదు - లేకయే, లఘు = త్వరగా, నిర్యాతయతః = అప్పగించు, తవ = నీకు, నీయెడ, అనుబద్ధా = వీడని, అథవా అనిర్యాతయతః - అట్లుగాక, అప్పగింపవేని, మరణాన్తికం వైరం = మరణము ముగింపు - కడ - గా గల, వైరం = విరోధము, పగ, అపి చ - మఱియు, పశ్య = చూడు -

శ్లో. ౨౧. కూష్మాణ్డీ = గుమ్మడికాయ, గోమయ లిప్త వృన్తా = తొడిమకు ఆవుపేడ పూయఁబడినది, శాకం = కూర - ఆకు పువ్వు కాయ వేరు గడ్డ మొదలుగా పదిరకములైనది, శుష్కం = ఎండినదియు, తలితం = నూనెతో వేఁపఁబడిన, మాంసం ఖలు = చెప్పవలయునా? తప్పకుండ - మాంసమును, హైమంతిక రాత్రి

భక్తం చ హైమన్తిక రాత్రి సిద్ధం
లీనాయాం చ వేలాయాం న ఖలు భవతి పూతి. ౫౧

[కశ్చాలుకా గోచ్ఛడ డిత్త వేట్టా
శాకే అ శుక్ఖే తలిదే హు మంశే,
భత్తే అ హేమన్తిఅ లత్తిశిద్ధే
లీణేఅ వేవే ణహు హోది పూదీ]

శోభనం భణిష్యసి, సకపటం భణిష్యసి. తథా భణిష్యసి యథాహ మాత్మకీయాయాం ప్రాసాదబాలాగ్రకపోత పాలికాయా

సిద్ధం = హేమంత ఋతు రాత్రుల వండిన, భక్తం చ = అన్నమును, ఋణం = అప్పును, వైరం చ = వేరమును - పగయు, పూతిః = పాసిపోయినది - చెడ్డ కంపుగలది, సడలిపోయినట్టిది, న భవతి ఖలు = కానే కాదుకదా.

కూష్మాణ్డీత్యాది అప్రస్తుత ప్రశంస - ఇందలి యప్రస్తుతము ప్రస్తుతాశ్రయి - ఇది 'లీనాయాం చ వేలాయాం' అను పాఠము గొన్నప్పుడు. అట్లు కాక వీణే ... వేలే - అను పాఠమును ఋణం చ వైరం' అని ఛాయయుం గొన్న - అలంకారము దీపకమగును. వర్ణ్యమును - వైరము - ఇతరముతో ఏకధర్మము చేయఁ బడును గాన.

'వదంతి వర్ణ్యావర్ణ్యానాం ధర్మైక్యం దీపకం బుధాః'.

శోభనం భణిష్యసి = శుభముగా - మేలుగా - చెప్పుదువా ? సకపటం భణిష్యసి = కపటముతో వంచనతో చెప్పుదువా? తథాభణిష్యసి = అట్లు చెప్పఁగలవు - యథా = ఎట్లు అనఁగా - ఆత్మీయాయాం = నాదైన, ప్రాసాద (వా) బాలాగ్ర కపోతపాలికాయాం = మేడయొక్క (బాల = ) క్రొత్త - నిర్మాణపు పూతతో సొబగారు లేక (బాలమనఁగా) ఏనుఁగుగున్న - దాని ప్రతిమనిలిపియున్న - (అగ్ర=) పైభాగము లేక డాబామీఁద, (కపోత=) గువ్వలగూళ్ళ చూరులో అనఁగా లక్షణచే దానిమీఁద గదిలో - అనఁగా మేడ ముందుతట్టు గదిలో పరికించుచు అంతరెత్తునసున్న నాకు చక్కఁగా వినఁబడును. అట్లు వినఁబడునట్లుగా, లేక శాలాగ్ర మనఁగా మత్తవారణము - అనఁగా మేడమీఁది చిన్నగది. 'A turret or small room on the top of a large building' - Apte. దాని 'గువ్వల

ముపవిష్టః శృణోమి. అన్యథా యది భణసి, తదా కపాట ప్రవిష్ట కపిత్థగులిక మివ మస్తకం తే మడమడాయిష్యామి.

[ శోత్తకం భణేశి, లత్తకం భణేశి. తధా భణేశి జధా హగే అత్తణకేలికాఏ పాశాద బాలగ్గ కవోదవాలిఆఏ ఉవదిట్టే శుణామి. అణ్ణధా జధి భణేశి, తా కవాల పవిట్ఠ కవిత్థగుడిఅం విఅ మత్తఅం దే మడమడాఇశ్శమ్. ]

విదూ.—భణిష్యామి. [ భణిస్సమ్ ].

శకా.—(అపవార్య) చేట, గతః సత్య మేవ భావః. (చేడే, గడే శచ్చకం జేవ భావే. ]

చేటః—అథ కిమ్. [ అధ ఇం ]

శకా.—త చ్ఛీఘ్ర మపక్రమావః. [ తా శిగ్ఘం అవక్కమమ్హ ].

---

గూళ్ళ చూరు కడ - ఇవెల్ల శకారుని పొగరు కూఁతలు, విదూషకునితో, చారుదత్తునికి. ఉపవిష్టః = కూర్చున్నవాఁడనై, శృణోమి = విందును - అక్కడ కూర్చుండిన నాకు వినఁబడునట్లుగా, అన్యథా = అట్లు కాకుండ, యది భణసి = చెప్పవదువేని, కపాటప్రవిష్ట = తలుపునందున చొచ్చి చిక్కుకొన్న వెలగకాయగుండువలె, తే మస్తకం = నీతలను, మడమడాయయిష్యామి = మడమడయనునట్లు పగులగొట్టెదను, అపవార్య - ఇతరులకు తెలియకుండునట్లు తాను ఆవలికి పిలిచి లేక మరలి - అపవారితమును జనాంతికము కంటిదే - 'త్రిపతాకా కరేణ' - ఇత్యాది కలదే - మతి। భేదము - ఉన్న చోటినుండి ఇంచుక తొలఁగి లేక వెనుమరలి 'తాను చోటు మాటి వెనుమరలి అన్యునికి చెప్పు రహస్యము అపవారితము.' సా. ద. వే. వేం.

గతః సత్యం ఏవ భావః - నిజముగానే పోయినాఁడా? తత్ = అట్లైన, శీఘ్రం అపక్రమావః = త్వరఁగా తొలఁగి పోవుదము - మఱెవరైనను వత్తురేమో,

చేటః—త ద్గృహ్ణాతు భట్టారకో ఽసిమ్ [తా గేణ్హాదు భట్టకే అశిమ్.]

శకా—త వైవ హస్తే తిష్ఠతు. (తవ జేవ హత్థే చిట్ఠదు.]

చేటః—ఏష భట్టారకః. గృహ్ణా త్వేనం భట్టారకో ఽసిమ్. [ఏ శే భట్టాలకే. గేణ్హాదు ణం భట్టకే అసిమ్].

శకా—(విపరీతం గృహీత్వా)

శ్లో. నిర్వల్కలం మూలకపేశివర్ణం
స్కన్ధేన గృహీత్వా చ కోశసుప్తమ్
కుక్కురైః కుక్కురీభి శ్చ
బుక్క్యమానో యథా సృగాలః శరణం ప్రయామి. ౫౨

---

పట్టుకొందురేమో, తత్ = కావున, గృహ్ణాతు భట్టకః అసిమ్ = దొర కత్తిని కైకొనును గాక. మాదొర విటుఁడు పోయినాఁడు గనుక నీవే ఇపుడు దొరవు కత్తి విటునిది. వాఁడు ఇందాక పశ్చాత్తప్తుఁడై విదూషకు పాదముల వ్రాలినపుడు, కత్తిని క్రిందవైచినాఁడే, ఆకత్తిని శకారునిచేత ఈఁబోయినాఁడు, వాఁడు తీసికొనక – 'నీచేతనే ఉండనిమ్ము' అన్నాఁడు. ఏష భట్టారకః = నీవే ఇపుడు దొరవు. దొర కత్తిం గొనునుగాక, విపరీతం = తలక్రిందుగా – పిడిమాని కొన చేతనుండునట్లుగా – ఏపనియందును వీనికి తెలివి తక్కువే.

శ్లో. ౫౨. నిర్వల్కలం=పై పొర తీసివేసినట్టి, మూలక పేశి వర్ణం= ముల్లంగి తోలు రంగువంటి రంగు గలదియు, కోశసుప్తం = ఒరలో తూఁగిన – దీనిని – ఈకత్తిని, స్కన్ధేన = బుజాన, గృహీత్వా = పెట్టుకొని, కుక్కురైః కుక్కురీభిః చ = మగ కుక్కలచేతను ఆడు కుక్కలచేతను, బుక్క్యమానః సన్ = మొఱుగుచు వెంట తఱుమఁబడినవాఁడ నగుచు, సృగాలః యథా = నక్కవలె,

రాత్రి వీథిలో పరువెత్తు జనుని కుక్కలు మొఱుగుచు వెంటఁబడి తఱుమును గదా – అట్లు తఱుమఁబడుచు, బెదరి పఱచు నక్కవలె – ఇంటికి పరువెత్తెదను. బుజాన కొన చేతనుపిడి వెనుకకు ఉండునట్లు ఉంచుకొనఁబడిన యొరలోని కత్తితో,

[ ణివ్వాక్కలం మూలకపేశవణ్ణం
ఖన్ధేణ ఢేత్తూణ అ కోశశుత్తమ్
కుక్కేహి కుక్కేహి అ బుక్కఅన్తే
జదా శిఆలే శలణం పలామి. ]

(పరిక్రమ్య నిష్క్రాన్తౌ)

విదూ.—భవతి రదనికే, న ఖలు తే ఽయ మపమాన స్తత్రభవత శ్చారుదత్తస్య నివేదయితవ్యః. దౌర్గత్యపీడితస్య మన్యే ద్విగుణతరా పీడా భవిష్యతి. [ భోది రదణిఏ, ణ క్ఖు దే అఅం అవమాణో తత్తభవదో చారుదత్తస్స ణివేదఇదవ్వో. దోగ్గచ్చ పీడిఅస్స మణ్ణే దిగుణదరా పీడా హువిస్సది. ]

రదనికా—ఆర్య మైత్రేయ, రదనికా ఖ ల్వహం సంయత ముఖీ. [ అజ్జ మిత్తేఅ, రదణిఆ క్ఖు అహం సంజదముహీ ]

విదూ.—ఏవం ను ఇదమ్. [ ఏవం ణ్ణేదమ్ ]

చారు.—(వసన్తసేనా ముద్దిశ్య) రదనికే, మారుతాభిలాషీ

---

భవతి రదనికే = అమ్మా రదనికా, తే అయం అవమానః = నీ యీ యవ మానము, అయ్యగారికి చారుదత్తయ్యకు, న నివేదయితవ్యః = తెలుపఁగూడదు, దౌర్గత్యపీడితస్య = పేదఱికముతో బాధపడుచున్నవానికి, ద్విగుణతరా పీడా = రెట్టింపు పీడ, జనిష్యతి = కలుగును.

ఆర్య మైత్రేయ = మైత్రేయయ్యా, రదనికాఖలు అహం = రదనికను కదా - పెద్ద పండ్లు గలదానను కదా ... పండ్ల వరుసలను చేర్చిన, నోరు మూయఁబడును గదా, సంయతముఖీ = మూసికొనఁబడిన నోరుగలదాననే, ఏవం ను ఇదం = సరియే, ఆలాగే ఇది.

వసన్తసేనాం ఉద్దిశ్య = వసంతసేనం గూర్చి - ఎఱుఁగక రదనిక యనుకొని, వెలుతురు చాలనందున పొరపాటు - మారుతాభిలాషీ = గాలి కోరినవాఁడై -

ప్రదోష సమయశీతార్తో రోహసేనః తతః ప్రవేశ్యతా మభ్యన్తర మయమ్. అనేన ప్రావారకేణ ఛాద యైనమ్. (ఇతి ప్రావారకం ప్రయచ్ఛతి).

వసన్త—(స్వగతమ్) కథమ్ పరిజన ఇతి మా మవగచ్ఛతి. (ప్రావారకం గృహీత్వా సమాఘ్రాయ చ స్వగతం సస్పృహమ్) ఆశ్చర్యమ్. జాతీకుసుమవాసితః ప్రావారకః. అనుదాసీన మస్య యౌవనం ప్రతిభాసతే. [కథం పరిఅణో త్తి మం అవగచ్ఛది. అమ్మహే, జాదీకుసుమవాసిదో పావారఓ. అణుదాసీణం సే జోవ్వణం పడిభాసేది].

చారు—నను రదనికే, రోహసేనం గృహీత్వాభ్యన్తరం ప్రవిశ.

---

మొదట ఇక్కడ (పరుండి) ఉన్నాఁడు - ఇపుడు ఈమునిమాపు సమయపు చలికి బాధపడుచున్నాఁడు, తతః ... అయమ్ = కావున ఇతనిని లోపలికి కొనిపొమ్ము, అనేన ప్రావారకేణ = ఈ యుత్తరీయముతో, ఛాదయ ఏనమ్ = కప్పు, ఇతనిని. అని ఉత్తరీయమును ఇచ్చెను.

పరిజన ఇతి = సేవకురాలు అని, అవగచ్ఛతి = తలంచుచున్నాఁడు, సమాఘ్రాయ = వాసనచూచి, సస్పృహం = ఆసతో - అమ్మహే = సంతోషము! అస్య యౌవనం అనుదాసీనమ్ = ఇతని జవ్వనము వృథాగానట్లు, ప్రయోజనరహితము గానట్లు, ప్రతిభాసతే = అగపడుచున్నది, ఏలన ఈ దారిద్ర్య దశయందును జాజి పూల పరిమళము గుబాళించుచున్నది, ఇతని యంగవస్త్రము - భోగపరుఁడుగానే ఉన్నాఁడు. కావున నా యనురాగము పాత్రమందే అలముకొన్నది. నన్ను అంగీకరించును అన్న ప్రత్యాశ కలుగుచున్నది, అపవారితకేన = చారుదత్తునికి అగపడనీక - ఇంచుక తొలఁగి - అనుట.

నను రదనికే = ఓసి రదనికా, ...అభ్యన్తరం, ప్రవిశ = లోపలికి పోవే, తవ అభ్యన్తరస్య = నీ శుద్ధాంతమునకు - కులాంగన యుండవలసినచోటికి - భోగము

వసన్త—(స్వగతమ్) మన్దభాగినీ ఖ ల్వాహమ్. త వా భ్యన్తరస్య. [మన్దభాయిణీ క్ఖు అహం తుమ్హే అబ్భన్తరస్స].

చారు—నను రదనికే, ప్రతివచన మపి నాస్తి. కష్టమ్!

శ్లో. యదా తు భాగ్యక్షయపీడితాం దశాం
నరః కృతాన్తో పహితాం ప్రపద్యతే
త దాస్య మిత్రా ణ్యపి యా న్త్యమిత్రతాం
చిరానురక్తో ఽపి విరజ్యతే జనః. ౫౩

(రదనికా ముపసృత్య)

విదూ—భోః, ఇయం సా రదనికా. [భో, ఇఅం సా రదణిఆ]

దాన నగుటచే, మన్దభాగినీ ఖలు - అదృష్టహీనురాలను గదా, నను రదనికే = ఏమే రదనికా, ప్రతివచనం అపి = జవాబైనను, న అస్తి లేకున్నది! కష్టం = కట్టా! ఎట్టి కాలము వచ్చినది - అనుట.

శ్లో. ౫౩. నరః = మనుష్యుఁడు, యదా తు = ఎప్పుడుగన, మునుపటి వలె కాక, కృతాన్త ఉపహితాం = విధి పెట్టిన, భాగ్య క్షయ పీడితాం = దారిద్ర్య బాధ గలిగిన, దశాం = స్థితిని, ప్రపద్యతే = పొందునో, తదా = అప్పుడు, అస్య = అతని, మిత్రాణి అపి = మిత్రులు సయితము, అమిత్రతాం = మిత్రులు గామిని - శత్రువు లగుటను, ఔదాసీన్యమునేని, యాన్తి = పొందుదురు, చిర అనురక్తః జనః అపి = చాలకాలమునుండి అనురాగముగలవారు సయితము - ఈ రదనిక బోంట్లును - విరజ్యతే = ప్రీతి తొలఁగినవారగుదురు.

మాయింట ఎంతకాలముగా ఉన్నది, ఈ రదనిక - చెప్పిన మాటను ఎట్లెట్లు వినుచుండినది. ఇపుడు బదులు చెప్పుటయు మానుకొన్నదే!

యదా తు భాగ్యక్షయ ఇత్యాది. ఇందు అలంకారము అప్రస్తుతప్రశంస - ఇందలి యప్రస్తుతము ప్రతివచనము చెప్పమి యని ప్రకృతాశ్రయి.

రదనికాం ఉపసృత్య = విదూషకుఁడు రదనికను సమీపించి - భోః = ఓ వయస్యా, ఇయం సా రదనికా = ఇదిగో నీవుచెప్పుచున్న రదనిక, ఇయం ... కా = సరి,

చారు__ఇయం సా రదనికా. ఇయ మపరా కా?

శ్లో. అవిజ్ఞాతావసక్తేన దూషితా మమ వాససా

వసన్త__(స్వగతమ్) నను భూషితా. [ణం భూసిదా].

చారు__

ఛాదితా శరదభ్రేణ చన్ద్రలేఖేవ దృశ్యతే. ౫౪

అథవా, నయుక్తం పరకలత్ర దర్శనమ్.

విదూ__భోః, అలం పరకళత్రశఙ్కయా. ఏషా వసన్త సేనా; కామదేవాయతనోద్యానాత్ప్రభృతి త్వా మనురక్తా. [భోః, అలం పరకలత్త దంసణసఙ్కాఏ. ఏసా వసన్తసేణా, కామదేవా అదనుజ్జాణాదో పహుది భవన్త మణురత్తా]

నేను చెప్పుచున్న యా రదనిక ఇది. (మఱి) ఇయం అపరా కా = ఈ మఱియొకతె ఎవరు?

శ్లో. ౫౪. అవిజ్ఞాత అవసక్తేన = పరమార్థము ఎఱుఁగజాలమిచే, (అవసక్తేన =) తగిలింపఁబడిన - కప్పఁబడిన, మమ వాససా = (పరాయివాఁడనైన) నావస్త్రముచేత, దూషితా = పరాయిదానిం గప్పుట - పరాయివానిచేత కప్పఁబడుట - అను దోషమునకు పాల్పఱుపఁబడినదే! నాచేత - అని శేషము, నను భూషితా = వసంతసేన తనలో అనుకొనుచున్నది - దూషితను గాను - నాకు దోషము చేయఁబడలేదు. మఱేమన - నిజముగా అలంకరింపఁబడినది - ... పడితిని అనుట. శరదభ్రేణ = శరత్కాలపు - నీరులేని - తెల్ల మేఘముచేత, ఛాదితా = మూయఁబడిన, చన్ద్రలేఖా ఇవ = చంద్రరేఖవలె - ఉన్నదే!

శరన్మేఘము కమ్మిన చంద్రలేఖ వలె, నా తెల్లని యుత్తరీయముం గప్పుకొని విరాజిల్లుచున్నదే - ఎవ రీమె? ఎవరో పరభార్య యగును. అట్టిదానిని - దర్శనం = చూచుట, నయుక్తమ్ = కూడదు, ...శఙ్కయా అలం = కూడదు, ఆసందేహము ఆభయము, ఏషా వసన్తసేనా = ఈమె వసంతసేన, ...ఉద్యానాత్ ప్రభృతి = తిరుణాళ్ళం దొట్టి - తిరుణాళ్ళలో నిన్న చూచినది

చారు—ఇయం వసన్తసేనా (స్వగతమ్)

శ్లో. యయా మే జనితః కామః క్షీణే విభవవిస్తరే
క్రోధః కుపురుష స్యేవ స్వగాత్రే ష్వేవ సీదతి. ౫౫

విభూ—భో వయస్య, ఏష ఖలు రాజశ్యాలో భణతి. [భో వఅస్స, ఏసో క్ఖు రాఅసాలో భణాది.]

చారు—కిమ్?

విదూ—ఏషా ససువర్ణా సహిరణ్యా నవనాటకదర్శనోత్థితా సూత్రధా రీవ వసన్తసేనానామ్నీ గణికాదారికా కామదేవాయతనోద్యానా త్ప్రభృతి త్వా మనుర క్తాస్మాభి ర్బలాత్కారానునీయమానా తవ గేహం ప్రవిష్టా. [ఏషా ససువణ్ణా సహిలణ్ణా ణవ

---

మొదలు, భవన్తం అనురక్తా = నీపై వలపు గొనియున్నది, అయే = అహా! ఇయం వసన్తసేనా = ఈమె వసంతసేనయా! మైత్రేయుఁడు శకార భాషితముం బట్టి వసంతసేన అనిగ్రహించినాఁడు. ఊరిలో చాల ప్రసిద్ధ కావున మునుపును చూచి యాకారణమునను గ్రహింప వచ్చును.

శ్లో. ౫౫. యయా = ఏమెచేత, మే = నాకు, విభవవిస్తరే = గొప్ప సంపద, క్షీణే = నశించిపోఁగా - ఇట్లు దరిద్రుఁడనైన తర్వాత, కామః జనితః = కోరిక - మరులు - కలిగింపఁబడినదో, అది, కుపురుషస్య క్రోధ ఇవ - అల్పుని - కొంచెకాని - యొక్క, కోపమువలె, స్వగాత్రేషు ఏవ = తన యవయవముల యందే, సీదతి = అడఁగును.

పేదవాని కోపము పెదవులచేటు - అని సామెత కలిగినదే కదా. పేద పడిన తర్వాత, ఇప్పుడు నాకు ఈమెపై కామము కలిగినదే ఏమిప్రయోజనము? ఆపె వెలయాలు, నేను దరిద్రుఁడను. ఇఁకనదెట్లు?

ణాడఅ దంసణుట్ఠిదా సుత్తదావి వ్వ వసన్తసేణాణామ గణిఆదాలిఆ కామదేవా అదణుజ్జాణాదో పహుది తుమం అణులత్తా అమ్హేహిం బలక్కాలాణీ అమాణా తుహ గేహం పవిట్ఠా ].

వసన్త—(స్వగతమ్) బలాత్కారానునీయమానేతి యత్సత్యమ్, అలంకృతాస్మ్యేతై రక్షరైః. [బలక్కాలాణుణీఅమాణేత్తి జం సచ్చమ్, అలంకిదహ్మి ఏదేహిం అక్ఖరేహిం].

విదూ—తద్యది మమ హస్తే స్వాయమేవ ప్రస్థాప్యైనాం సమర్పయసి, తతో௨ధికరణే వ్యవహారం వినా లఘు నిర్యాతయత స్తవ మయానుబద్ధా ప్రీతి ర్భవిష్యతి. అన్యథా మరణాన్తికం వైరం భవిష్యతి. [తా జయి మమ హత్థే సఅం జ్జేవ పట్ఠావిఅ ఏణం సమప్పేసి, తదో అధిఅలణే వవహాలం విణా లహుం ణిజ్జాదమాణాహ తవ మఏ అణుబద్ధా పీదీ హువిస్సది. అణ్ణధా మలణన్తికే వేలే హువిస్సది].

---

గాత్రైః - బహువచనము - ఒక్కొక్క అవయవమునకును ఒక్కొక్క కోరిక - చుంబనాలింగనాదులు - పాడమును. మఱి తీఱునా? తీఱదు - ఆయంగములయందు అడంగవలసినదే. ఇదేమి! ఇపుడు నాకు అనుభవమునకు దొరకు టేమి!

బలాత్కార అనునీయమానా = బలవంతముగా ఒప్పింపఁ బ్రయత్నింపఁబడుచున్నదై - అని 'బలాత్కారముగా' అను మాట చేత, యత్ సత్యం = నిజముగానే, ఏతైః అక్షరైః = ఈ యక్షరములచేత, అలఙ్కృతా అస్మి = అలంకరింపఁబడినదాన నైతిని.

ఆ మాటలచే నే నెంతమాత్రమును అతనిం గోరినదానఁ గాను, మఱి కోరనిదానను, అని నా ప్రియుఁడగు చారుదత్తుని చెవిం బడుట నాకు ఎంత మంచిది! దాన, వానిమీఁద నాద్వేషము తెలియుచున్నది కదా.

చారు—(సావజ్ఞమ్) అజ్ఞో ఽసౌ (స్వగతమ్) అయే, కథం దేవతోపస్థానయోగ్యా యువతి రియమ్. తేన ఖలు తస్యాం వేలాయామ్.

శ్లో. ప్రవిశ గృహ మితి ప్రతోద్యమానా
న చలతి భాగ్యకృతాం దశా మవేక్ష్య
పురుషపరిచయేన చ ప్రగల్భం
న వదతి య ద్యపి భాషతే బహూని. ౫౬

---

సావజ్ఞమ్ = తిరస్కారముతో - అజ్ఞః అసౌ = మూర్ఖుఁడు వీఁడు, అయే = ఆహా! కథం = ఎట్లు! దేవతా ఉపస్థానయోగ్యా = దేవతలకుం బోని సేవకుఁదగిన జవరాలు ఈమె! (శకారవిటుఁడు నగరశ్రీ, నగర విభూషణం అనును. చందనకుఁడు పూజనీయ నగరతిలకము అనును. కనుదోయిని మిఱుమిట్లు గొల్పు నది. శకుంతలను దుష్యంతుఁడు నూనం అప్సరః సంభవా! అనఁడా. తేనఖలు కావుననే గదా - తస్యాం వేలాయాం = ఆవేళలో - ఆ సమయమున.

శ్లో. ౫౬. ప్రవిశ గృహం ఇతి = ఇంటిలోపలికి పొమ్ము, చారుము - అని, ప్రచోద్యమానా = ప్రేరింపఁ బడినదయ్యు, భాగ్యకృతాం = దురదృష్టముచే కలిగిన, దశాం = ఇపుడు కలిగిన పేదరికమును, స్థితిని, అవేక్ష్య = పరికించి, అని యొక వ్యాఖ్యాత. మఱి యట్లుగాదు - భాగ్యకృతాం = తన భోగముదాని జన్మమును తన (దుర్) అదృష్టముచే కలిగిన స్థితిని, గృహాభ్యంతర ప్రవేశానర్హతను, అవేక్ష్య = తలంచి - అనుట మేలు, ఆపెయు మునుపే అనుకొన్నది, నాకు నీయింట చొచ్చు భాగ్యమా అని. చారుదత్తుఁడును ఆపెనగనే చతుః శాలాభ్యంతరమునకు తేఁగూడదనును. చూ. III. న చలతి = (అడుగైనను) కదలలేదు. పురుషపరిచయేన చ = మఱి పురుషులతోడి యెక్కువ పరిచయముతో - బహూని = పెక్కు, యది అపి భాషతి = మాటలాడున దైనను, ప్రగల్భం = ధీరముగా, న వదతి = పలుకదాయెను.

ఇంటిలోపలికి పొమ్మని గట్టిగా చెప్పినను నా (యింటి) పేదఱికపు స్థితిని తలఁచి అడుగైనను కదలదాయెను. మగవారితోడి చనవుచేత, తాను పెక్కు మాటలాడునదే ప్రగల్భయే ఐనను ధీరముగా (నాతో) ఒక్కమాటయైనను పలుక

(ప్రకాశమ్) భవతి వసన్తసేనే, అనే నావిజ్ఞానా దపరిజ్ఞాత పరిజనోపచారే ణాపరాద్ధో ఽస్మి. శిరసా భవతీ మనునయామి.

వసన్త—ఏతే నానుచితభూమికారోహణే నాపరా ద్ధార్యం

దాయెను. ఏల? మనసులోని రాగభరము మాటలాడ నీయలేదు. ధీర యైనను శాలీనవలె ఐనది! వసంతసేనయనురాగమును నిపుణముగా ఊహించుచున్నాఁడు.

వసంతసేన భావావిష్కరణముం గూర్చిన యీ చారుదత్తుని తలపోఁతను శకుంతల భావావిష్కరణముం గూర్చిన యా దుష్యంతుని తలపోఁతతో పోల్చి పరికింపందగును. భేద మించుకయున్న వసంతసేన కులాంగనం బోని వేశ్య యగుటయు, శకుంతల కులాంగనయే యగుటయు కారణము.

చూ. శాకుం. I-౩౧.

దుష్య—వాచం న మిశ్రయతి య ద్యపి మే వచోభిః
కర్ణం దదా త్యభిముఖం మయి భాషమాణే;
కామం న తిష్ఠతి మదాననసమ్ముఖీనా
భూయిష్ఠ మన్యవిషయా న తు దృష్టి రస్యాః.

II-౧౧

దుష్య—అభిముఖే మయి సంహృత మీక్షితం
హసిత మన్యనిమిత్తకృతోదయం
వినయవారితవృత్తి రిత స్తయా
న వివృతో మదనో న చ సంవృతః.

మృచ్ఛకటి కవియు ఎంతయు కామరహస్యవేత్త

భవతి వసన్తసేనే = అమ్మా, వసంతసేనా - సగౌరవముగా పలుకుచున్నాఁడు, అవిజ్ఞానాత్ = ఎఱుఁగమివలన, అనేన = ఈ, అపరిజ్ఞాత పరిజన ఉపచారేణ = తెలియక చేసిన పరిజనోచిత వ్యవహారముచేత, తప్పుచేసినవాఁడనైతిని, కావున - శిరసా = తలతో - తలవంచి నమస్కరించుచు - భవతీం అనునయామి = నిన్ను బతిమాలుకొనుచున్నాను - మన్నింపు మని. అందులకు వసంతసేనయు అనుచున్నది - అనుచిత భూమి ఆరోహణేన = ఈ నేనురాఁదగని చోటికి

శీర్షేణ ప్రణమ్య ప్రసాదయామి. [ఏదిణా అణుచిదభూమి ఆరోహణేణ అవరద్ధా అజ్జం సీసేణ పణమిఅ పసాదేమి].

విదూ—భోః, ద్వా వపి యువాం సుఖం ప్రణమ్య కలమకేదారావివాన్యోన్యం శీర్షేణ శీర్షే సమాగతౌ. అహ మ ప్యమునా కరభజాను సదృశేన శీర్షేణ ద్వా వపి యువాం ప్రసాదయామి. [భో, దువే వి తుమ్హే సుఖం పణమిఅ కలమకేదారా అణ్ణోణ్ణం విఅ సీసేణ సీసం సమాఅదా. అహం పి ఇమిణా కరహజాణు సదిసేణ సీసేణ దువే వి తుమ్హే పసాదేమి]. (ఇత్యుత్తిష్ఠతి)

చారు—భవతు, తిష్ఠతు ప్రణయః.

వసన్త—(స్వగతమ్) చతురో మధుర శ్చాయ ముపన్యాసః.

ఎక్కి వచ్చుటచేత, అపరాద్ధా = తప్పుచేసినదాన నైతిని. అయ్యగారిని ...తలతో మ్రొక్కి, మన్నింపు అడుగుకొనుచున్నాను, ఇట్లు సగౌరవముగా పలుకుచు ఒండొరులకు తలవాల్చినారు.

ద్వౌ అపి యువాం = మీరు ఇరువురును, సుఖం = అప్యాయముగా, ప్రణమ్య=వంగి నమస్కరించి, కలమకేదారౌ ఇవ= రెండు వరిచేలవలె, అన్యోన్యం= ఒండొరులు, శీర్షేణ శీర్షం = తలతో తలగా, సమాగతౌ = కూడినవారైతిరి, అహం అపి = నేనును, అమునా = ఈ(నా) కరభజాను సదృశేన = ఒంటె పిల్ల మోకాలిం బోలిన, శీర్షేణ = తలతో, ద్వా వపి యువాం = మీ యిరువురిని, ప్రసాదయామి = మన్నింపు అడిగెదను, తేర్చెదను.

భవతు = కానీలే - నాతప్పో నీతప్పో - అదియుండనీలే, ప్రణయః తిష్ఠతు = స్నేహము (అనురాగము తిరముగా) ఉండునుగాక. దీనిని సంభోగ ప్రార్థన అనియు అందురు కొందఱు, చతురః మధురః = నేర్పు మీఱి చాల ఇంపుగా ఉన్నది - అయం ఉపన్యాసః = ఈ యుపన్యాసము - ఈపలుకు, కానీలే, పోనీలే, స్నేహము తిరముగా నుండునుగాక - అన్నట్టిది, దాన ననురాగము సూచితముంబలె, వచ్చినదానవు ఈ రాత్రి ఉండిపోవే అనునట్లు నాజూకుమాట, అదియే 'తిష్ఠతు ప్రణయః' అనుదానికి అర్థమని ఈ వసంతసేన వ్యాఖ్యచే తెలియుచున్నది కదా.

న యుక్త మద్యేదృశేనేహాగతయా మయా ప్రతివస్తుమ్. భవతు. ఏవం తావద్భణిష్యామి. (ప్రకాశమ్) ఆర్య, య ద్యేవ మహమార్యస్యానుగ్రాహ్యా త దిచ్ఛా మ్యహ మిమ మలంకార మార్యస్య గేహే నిక్షేప్తుమ్. అలంకారస్య నిమిత్త మేతే పాపా అనుసరన్తి.

[చదురో మధురో అఅం ఉవణ్ణాసో. ణ జుత్తం అజ్జ ఏరిసేణ ఇధ ఆఅదాఏ మఏ వడివసిదుమ్. భోదు. ఏవ్వం దావ భణిస్సమ్. అజ్జ, జఇ ఎవ్వం అహం అజ్జస్స అణుగ్గేజ్ఝా తా ఇచ్ఛే ఇమం అలంకారఅం అజ్జస్స గేహే ణిక్ఖివిదుమ్. అలంకారస్స ణిమిత్తం ఏదే పావా అణుసరన్తి].

చారు—అయోగ్య మిదం న్యాసస్య గృహమ్.

---

వినను, తిష్ఠతు ప్రణయః - ఈ బతిమాలుకొనుట, ఉండనీలే. తరువాత కొంత చారుదత్త భాషితము లుప్తము. ఏదో? దానిమీఁది తలపోత ఇది - ఇట్టి వానితో ఇత్యాది అని మేలువ్యాఖ్య, ఈదృశేన = ఇట్టివానితో, ఇహ ఆగతయా మయా = ఇక్కడికి వచ్చిన నాచే, అద్య = ఇప్పుడు, ప్రతివస్తుం = ఉండుటకు - న యుక్తం = తగదు - ఇప్పుడే నేను ఇక్కడ నిలిచిపోవుట సరికాదు. (కావున) భవతు = కానీ, ఏవం తావత్ భణిష్యామి = ఇట్లు చెప్పెదను గాక, ఆర్య = అయ్యా, ఆర్యస్య అనుగ్రాహ్యా = ఆర్యుని యనుగ్రహమునకు పాత్రమగుదు నేని, తత్ - అట్లేని, ఇమం అలంకారకమ్ = ఈనగను, ఆర్యస్య గేహే = ఆర్యునియింట, నిక్షేప్తుం = ఇల్లడగా దాఁచిపెట్టుటకు, అలఙ్కారస్య నిమిత్తం = నగ(ల)కోసము, ఏతే పాపాః = ఈ పాపాత్ములు - శకారాదులు, అనుసరన్తి = వెంబడింతురు.

ఇదం గృహం = ఈయిల్లు, న్యాసస్య = ఇల్లడకు, అయోగ్యం = తగనిది, ఇల్లు భద్రము తక్కువయైనచో టయిపోయినది, అసత్యం = అబద్ధము, పురుషులు

వసన్త—ఆర్య, అలీకమ్. పురుషేషు న్యాసా నిక్షిప్యన్తే, నపున ర్గేహేషు. (అజ్జ, అలీఅమ్. పురుసేసు ణాసా ణిక్ఖివిఅన్తి. ణ ఉణ గేహేసు.]

చారు—మైత్రేయ, గృహ్యతా మయ మలంకారః.

వసన్త—అనుగృహీ తాస్మి. [అణుగ్గహీదహ్మి]

(ఇ త్యలంకార మర్పయతి.

విదూ—(గృహీత్వా) స్వస్తి భవత్యై. [సోత్థి భోదీఏ].

చారు—ధిజ్ మూర్ఖ, న్యాసః ఖ ల్వయమ్.

విదూ—(అపవార్య) య ద్యేవం తదా చోరై ర్హ్రియ తామ్. [జఇ ఏవ్వం తా చోరేహిం హరిజ్జఉ].

చారు—అచిరే ణైవ కాలేన

గాని న్యాసమునకు స్థానము, ఇండ్లు గావు. నీవు అందులకు మిక్కిలియుం దగిన వాఁడవు. నీబోంట్లు న్యాసహరణము చేయరు, గృహ్యతాం = తీసికొనుము, అనుగృహీతా అస్మి = అనుగ్రహింపఁబడితిని. అర్పయతి = అప్పనచేయును, ఇచ్చును. గృహీత్వా = కైకొని, అది తన సొంతమునకు, మరల ఈనక్కఱ లేనట్లు అనుకొని - దానముగా భ్రమసి - స్వస్తి భవత్యై - అని స్వస్తి - ఆశీస్సు పలుకుచున్నాఁడు.

ధిక్ మూర్ఖ = ఛీ, తెలివిలేనివాఁడా, న్యాసః ఖలు = ఇల్లడ కదా - కాపాడి తిరుగ కోరినపుడు ఇచ్చివేయవలసినదికదా. యది ఏవం ...... హ్రియ తామ్ = దొంగలచే కొనిపోఁబడవచ్చును, అని వాఁడు అటు మరలి చారుదత్తునితో అనుచుండఁగా, దానికి జవాబైన యీ చారుదత్త భాషితపు భాగము దానికి ఉపశ్రుతి శకునమగునట్లుగా వినఁబడినది.

అచిరేణ ఏవ కాలేన = చాల త్వరగానే - చాలకాలము కాకయే - నేఁడో రేపో అన్నట్లు. దొంగలపా లగును అని. మఱి చారుదత్త భాషితము ఆపాటియే

విదూ—ఏషో ఽస్యా అస్మాకం విన్యాసః. [ఏసో సే అహ్మాణం విణ్ణాసో].

చారు—నిర్యాతయిష్యే

వసన్త—ఆర్య, ఇచ్ఛా మ్యహ మనే నార్యే ణానుగమ్య మానా స్వకం గేహం గన్తుమ్ [అజ్జ, ఇచ్ఛే అహమ్ ఇమిణా అజ్జేణ అణుగచ్ఛిజ్జన్తీ సకం గేహం గన్తుమ్.]

చారు—మైత్రేయ, అనుగచ్ఛ తత్రభవతీమ్.

---

కాదు - 'అచిరేణ కాలేన నిర్యాతయిష్యే' - త్వరగానే - రేపో మాపో - అనెడు చేర్చి, తీర్చివేయఁగలను. ఇట్టి యుపశ్రుతి శకునములు సంస్కృత నాటకము లలో, అడుగడుగున కలవు. దాని ఫలితము - ఈన్యాసము ఇందు దొంగచే కొనిపోఁబడును. అది ఇతివృత్తమున ఒక ప్రధాన సంగతి.

యది ఏవం ... హ్రియతామ్ = అట్లైన దొంగలచే కొనిపోఁబడవచ్చును - మైత్రేయుఁడు తన మాటలను అపవారితముగా చారుదత్తునితో చెప్పుచున్నాఁడు. ఆమాటలకు ఇంకను శేషము ఉన్నది. 'ఏష అస్యాః అస్మాకం విన్యాసః' అని. 'ఇదిగో ఈమె మనకడ నుంచిన విన్యాసము - అనఁగా మైత్రేయుని పూర్ణవాక్యము - ఇదిగో ఈమె మనకడ నుంచిన ఈ పెద్దన్యాసము దొంగలచే కొనిపోఁబడవచ్చును. మనకు గ్రహచారము బాగుగా లేదు, మనకు అన్నియు పోయినవే అన్నట్లు. దొంగలచే దొంగిలింపఁబడవచ్చును - అన్న మైత్రేయ వాక్యావయవమునకు చారుదత్తుని పూర్తివాక్యము - 'అచిరే ణైవ కాలేన నిర్యాతయిష్యే' అనుదానిలోని 'అచిరే ణైవ కాలేన' అను అవయవము చేరి, అది యుపశ్రుతియై త్వరగానే రేపో మాపో దొంగిలింపఁబడవచ్చును అని యర్థమై IIIవ యంకపు కన్నపు దొంగతనము సూచితమగును. అప్పుడు 'ఏషః అస్యాః అస్మాకం విన్యాసః' ఈమెది ఇది మనకు (అప్పటికి) పోయినన్యాస మగును - అనియు ఉపశ్రుతిశేషము - 'న్యాసము' 'విన్యాసము' - విశేషన్యాసము కాదా విగతన్యాసము (హె హె హె) అనియు అగును అని చమత్కారము.

అనుగమ్యమానాం = తోడుగా వెంబడింపఁబడుచున్న దానవై.

విదూ—త్వ మే వైతాం కలహంసగామినీం అనుగచ్ఛ రాజహంస ఇవ శోభసే. అహం పునర్బ్రాహ్మణో యత్ర తత్ర జనై శ్చతుష్పథోపనీతః ఉపహారః కుక్కురై రివ ఖాద్యమానో విపత్స్యే. [తుమం జ్జేవ ఏదం కలహంసగామిణీం అణుగచ్ఛన్తో రాఅహంసో విఅ సోహసి. అహం ఉణ బహ్మణో జహిం జహిం జణేహిం చఉప్పహోవణీదో ఉవహారో కుక్కురేహిం విఅ ఖజ్జమాణో వివజ్జిస్సమ్.]

చారు—ఏవం భవతు, స్వయ మే వానుగచ్ఛామి తత్ర భవతీమ్. త ద్రాజమార్గ విశ్వాసయోగ్యాః ప్రజ్వాల్యన్తాం ప్రదీపికాః.

విదూ—వర్ధమానక, ప్రజ్వాలయ ప్రదీపికాః. [వడ్ఢమాణఅ, పజ్జావేహి పదీవిఆఓ].

---

త్వం ఏవ అనుగచ్ఛన్ శోభసే-నీవే పొమ్ము, నీవైన ఈయంచయాన వెంట రాజహంసవలె ప్రకాశింతువు, అహం పునః=నేను అన్ననో, యత్ర తత్ర=ఎక్కడ నన్న నక్కడ, చతుష్పథ = నాలుగుదారులు కలయుచోట, ఉపనీత = తెచ్చి పెట్టc బడిన, ఉపహారము - దేవతా నైవేద్యము - వలె, కుక్కురైః = కుక్కలచే, ఖాద్యమానః = తినcబడు - కఱవcబడుచున్నవాcడనై, విపత్స్యే = ఆపదం బొందుదును, ఏవం భవతు - సరే, అట్లే కానిమ్ము, 'ప్రణయః తిష్ఠతు' అనియో మఱేదియో అనురాగోక్తి యన్నవాcడు గావున, ఇపుడు వసంతసేన ఎదురుగా అంచలపోలికం గూడ విని, తాను సులువుగా ఇయ్యకొన్నట్లును, అనురాగముం గల యట్లును ఈ యంగీకారము. రాజమార్గ విశ్వాస యోగ్యాః - పెద్దబాటలో నమ్మకమునకు తగిన - గాలికి ఆఱిపోని, ఫలానావారు పోవుచున్నారు, చీకటి యభిసారులు కారు, అని అందఱును నమ్మి చూడcదగిన - అందఱికిని మానుసులు అగపడc దగిన - ప్రదీపికాః = పెద్దదీపాలు, ప్రజ్వాల్యన్తాం = వెలిగింపc బడును గాక, ఇందాక ఆఱిపోయినట్లు ఆఱిపోనివి అనుట. వర్ధమానకుcడు చారుదత్తుని నౌకరు - చేటుcడు.

చేటీ—(జనాన్తికమ్) అరే, తైలేన వినా ప్రదీపికాః ప్రజ్వాల్యన్తే! [అలే, తేల్లేణ విణా పదీవిఆఓ పజ్జావిలీఅన్తి].

విదూ—(జనాన్తికమ్) ఆశ్చర్యం. తాః ఖ ల్వస్మాకం ప్రదీపికా అపమానిత నిర్ధనకాముకా ఇవ గణికా నిఃస్నేహా ఇదానీం సంవృత్తాః. [హీ. తాఓ క్ఖు అమ్హాణం పదీవిఆఓ అవమాణిద నిద్ధణకాముఅ విఅ గణిఆ ణిస్సిణేహాఓ దాణిం సంవుత్తా.]

చారు—మైత్రేయ, భవతు. కృతం ప్రదీపికాభిః. పశ్య

శ్లో. ఉదయతి హి శశాఙ్కః కామినీగణ్డపాణ్డు
ర్గ్రహగణపరివారో రాజమార్గప్రదీపః.
తిమిర నికరమధ్యే రశ్మయో యస్య గౌరాః

తైలేనవినా = నూనె లేక, ...దీపములు వెలిగింపఁబడుచున్నవి! —ఎట్లు వెలుఁగునయ్యా - అనుట. అపమానిత నిర్ధన కాముకాః = అవమానింపఁబడిన ధనహీన (ధనము పోయిన) కాముకులుగల, గణికా ఇవ = బోగమువారివలె, నిఃస్నేహాః = నూనె (అనురాగము అని బోగముదాని పరము) లేనివిగా, ఇదానీం = ఇప్పుడు, సంవృత్తాః = ఐనవి. ఈ మాటలు చారుదత్తుఁడు వినకుండునట్లు - జనాంతికముగా - చేటునితో అన్నాఁడు - ఇంటి దారిద్ర్యము సూచించునవి - చారుదత్తునికి సమయాన దుఃఖము కలిగించునవి జనాంతిక మగుటచే వసంతసేన యున్నను బోగముదాని లేని స్నేహ ప్రస్తావము. కృతం = వలదు - అలంవలె నిషేధార్థకము, తృతీయతో యోగము చెందును.

శ్లో. ౫౭. ఉదయతి హి = పొడుచుచున్నాఁడు గదా - కామినీ గణ్డపాణ్డుః = ప్రియ సంగమమునకు కోరికగల స్త్రీ చెక్కిటివలె తెల్లనైనవాఁడు - కామముచే, ఉత్కంఠచే, తెలుపుకాంతి హెచ్చును - కామినీ స్త్రీ మాత్రమును అగును - గ్రహ గణ పరివారః = నక్షత్రపరివారము - నౌకర్లు కలవాఁడై, శశాఙ్కః = చంద్రుఁడు, రాజమార్గ ప్రదీపః - రాచబాటకు పెద్దదీపము ఐనవాఁడు, యస్య = ఎవనియొక్క - అతనియొక్క - అనుట, గౌరాః రశ్మయః =

ప్రుతజల ఇవ పఙ్కే క్షీరధారాః పతన్తి. ౫౭

(సానురాగమ్) భవతి వసన్తసేనే, ఇదం భవత్యా గృహమ్. ప్రవిశతు భవతీ.

(వసన్తసేనా సానురాగ మవలోకయన్తీ నిష్క్రాన్తా)

చారు—వయస్య, గతా వసన్తసేనా. త దేహి, గృహమేవ గచ్ఛావః.

---

తెల్లని కిరణములు, ప్రుతజలే = నీరుకారిపోయిన, పఙ్కే = చిక్కని బురదలో, (విరిసిపోవుచున్న చీకటిలో - చీకటిని విరియించుచు అనుట, క్షీరధారా ఇవ = పాల ధారలవలె, పతన్తి = పడుచున్నవి.

తడి బురదలో పడిన పాలు మడ్డియై పోవును - నీరు కారిపోయిన బురద గల చోట పడినది ప్రవహింపనుం గూడ ప్రవహించును. ఆ బురదయు చాల చిక్కగా నల్లగా నుండును. దానిమీఁది పాలు మఱింత తెల్లగా అగపడును.

చేతి దీపము లేల? రాజమార్గపు దీపము చంద్రుఁడు ఉదయించుచున్నాఁడులే. వసంతసేన చెక్కిటివలె తెల్లగా నున్నాఁడు. నక్షత్రాలన్నియు వాని పరిజనమువలె మిణుక్కుచున్నవి. వెన్నెల పాలవానవలె పడుచున్నది. చీకటి విరిసి పోవుచున్నది.

చూ. 'అభివ్యక్తాయాం చన్ద్రికాయాం కిం దీపికా పౌనరుక్త్యేన.' విక్రమో॰ II కామినీగణ్డ పాణ్డుః - గణ్డ ఇవ పాణ్డుః - అని ఇవచే ఉపమ, గ్రహగణమే సరివార మని రూపించుటచే రూపకము. రాజమార్గ ప్రదీపః - ప్రదీపముగా పరిణామముం జెప్పుటచే పరిణామాలంకారము. ప్రుతజల ఇవ పఙ్కే - ఇవ - అభూతోపమ. క్షీరధారాః పతన్తి - ఉత్ప్రేక్ష - వస్తు - గమ్య.

సానురాగమ్ - గొంతునను పలుకుతీఱునను ముఖరాగమునను అనురాగము తోఁచునట్లుగా - అమ్మ, వసంతసేనా. ఇది నీయిల్లు, ప్రవేశింపుము. వసంతసేనయు అనురాగము ఒలుకు మొగములో చూపులతో చూచుచు వెడలిపోయినది.

వయస్య = మైత్రేయుఁడును. వారితో కూడ వచ్చియున్నాఁడు, గృహం ఏవ = ఇంటికే. 'గతా' అని ఒకపాటి నిర్వేదవాక్కు.

శ్లో. రాజమార్గో హి శూన్యోఽయం రక్షిణ స్సంచరన్తి చ
వఞ్చనా పరిహర్తవ్యా బహుదోషా హి శర్వరీ. ౫౮

(పరిక్రమ్య) ఇదం చ సువర్ణభాణ్డం రక్షితవ్యం త్వయా రాత్రౌ, వర్ధమానకే నాపి దివా.

విదూ—యథా భవా నాజ్ఞాపయతి. [జధా భవం ఆణవేది.]

[ఇతి నిష్క్రాన్తౌ]

ఇతి మృచ్ఛకటికే ఽలంకారన్యాసో నామ
ప్రథమో ఽఙ్కః

---

శ్లో. ౫౮. అయం రాజమార్గః = ఈ పెద్ద బాట, శూన్యః హి = మిక్కిలి నిర్జనముగా ఉన్నది - మాటుమణఁగి నట్లున్నది, రక్షిణః చ = వీథుల సర్కారు కాఁపరులు - పోలీసువారు, సఞ్చరన్తి = తిరుగుచున్నారు, వఞ్చనా = మోసము, ఎవరైనను చేయఁగలది, పరిహర్తవ్యా = తప్పించుకొనవలయును, శర్వరీ = రాత్రి, బహుదోషా హి = పెక్కుదోషములు గలది, జాగ్రత్త.

వీథి, వెడల్పుగాను పొడవుగాను ఉన్నట్టిది మాటుమణఁగి బావురు మను చున్నది. గస్తు పోలీసులు (మాత్రము) తిరుగుచున్నారు. మోసము, దొంగ తనము - ఇట్టిది కలుగనీక జాగ్రత్తగా మెలఁకువగా ఉండవలయును. రాత్రి కాలము అన్ని తప్పులకును సమయము, అనుకూలమైనది.

పరిక్రమ్య = కొంత దూరము - కొన్ని అడుగులు నడచి, ఇదం చ = ఇది ఉన్నదే - నీచేత. సువర్ణభాణ్డం = బంగారునగ, త్వయా రాత్రౌ = నీచేత రాత్రియందును, దివా = పగటియందును, రక్షితవ్యమ్ = కాపాడఁబడవలసినది, వాఁడు పగలు తీఱని పనులలో నుండును, అప్పుడు వాని నడుమ దీనిని కూడ చూచుకొనఁ గలఁడు - రాత్రులు వాఁడు అయలయికచే నిద్రించును. అప్పుడు నీవు మెలఁకువగా జాగ్రత్తగా కాపాడవలయును.

నిష్క్రాన్తౌ = వెడలిపోయిరి - రంగమునుండి. అంకాంతమున రంగము నుండి సర్వపాత్ర నిష్క్రమణముం జెప్పవలసిన దని శాస్త్రము.

కోటీశ్వరుఁడైన కులపుత్రుఁడు, చారుదత్తుఁడు దారిద్ర్యము పైకొన్నను. సంధ్య జపము దేవతోపహారములు పెట్టుట అను నిత్యకర్మలు మానక చేయువాఁడు, ఆ దేవతలు సంతోషింతు రను నమ్మకము గలవాఁడు. మఱి తన యింటికి అతిథులు మిత్రులు రారే, తన మాట ఎవరు మున్నువోలె విని ఆదరింపరే అని అభిమాన దుఃఖితుఁడు. అత్తరులు పూసిన యంగవస్త్రము ధరించుటంబోని నాజూకుతోడి యింద్రియ సుఖములు మరఁగినవాఁడు. కామదేవాయతన యాత్రలో శరణాగత వసంతసేనను గాచి కాంచి మోజుపడి, మఱి తన పేదఱికముం దలంచుకొని ఆమోజును అంగములందే అణఁచుకొన్నవాఁడు.

వసంతసేన భోగముదయ్యు సంపన్న యయ్యు, విలాసిని తాను అతనిని పేదవడినవానినే అతిలోక రూపసంపదయు శీల (గుణ) సంపదయు గలవాఁడని తానై మరులు కొన్నది. ఆ మదనత్రయోదశి యనంతరము నాలుగైదు దినాలకు ఒక్క ప్రదోషమున సింగారించుకొని చేటులం దోడుగొని అతని నభిసరింప వచ్చినది. దారిలో తఱుమఁ జొచ్చిన శకారాదులను తన పూర్వావధీరితులను, గుణము కదా వలపునకు కారణము, బలాత్కారమా అని చెప్పి చీకటిలో తప్పించుకొని చారుదత్తునిల్లు సొచ్చినది. విటుఁడు చారుదత్తోపకృతుఁడు అది తద్రక్త యని విని సగౌరవముగా దానిజోలి మానుకొని చారుదత్తు వయస్యుని మన్నింపు అడుగుకొని పోయినాఁడు. శకారుఁడు వసంతసేనను నగలతో కూడ తన కప్పగింపు మనియు, అప్పగింపకున్న వైరము పూని ఫిర్యాదు చేసెద ననియు మైత్రేయునితో చారుదత్తునికిం జెప్పుమని బెదరింపులు పలికి తన యింటికి మరలినాఁడు.

చారుదత్తుఁడు వసంతసేనను, చీకటిలో రదనికయనుకొని తన జాజుల వాసనయుత్తరీయము నిచ్చి దానితో అబ్బాయిని రోహసేనుని చలికి కప్పి లోపలికి కొనిపొమ్మని చెప్పి, అది కదలక చూచుచుండగా ఇంతలో వసంతసేన యని యెఱిఁగి ఆరూపు పున్నెంపు డాలునకు అజనము ఉపస్థాతవ్య దేవతయే యని నివ్వెఱచెంది, ప్రగల్భయయ్యు పలుకమి రాగభరమున అని యెంచుకొని, తన పొరపాటును మన్నింపుమనును. వసంతసేనయు అట్లు అననుమతముగా ఇల్లు త్రొక్కి యెక్కివచ్చినందున అతనిని మర్యాదగా క్షమ వేఁడును. ఉభయులకును మనసున ఒండొరులపై ననురాగము పెరిఁగినది. చారుదత్తుఁడు వసంతసేనను రాత్రికి ఇందుండి పో అను నభిప్రాయముగా గబ్బిగా నాజూకుగా స్నేహము ఉంపుమనియో (మఱేమనియో?) అన్నాఁడు. వసంతసేనయు ఎంతో ఆసయున్నను ఇప్పుడే ఇక్కడ

నుందునా? కూడదు, ఇప్పటికి ఇట్లు చేసెదను అని తలపోసికొని తన నగను అక్కడ ఇల్లడ పెట్ట నెంచి పెట్టి ఆ యుభయ ప్రార్థనకు తనిసి ఇంతలో చంద్రోదయమై వెన్నెల రాఁగా. మాటుమణఁగుచున్న రాజమార్గమున చారుదత్తుని తోడుగొని తన యింటికి పోయినది. ఇరువురును అనురాగపుఁ జూపుల నొండొరుల జూచుకొన్నారు. ఎవరింటికి వారు చేరినారు. ఆ రాత్రి వేళ ఆయిల్లడ నగ విదూషకుని రక్షణలో ఉంపఁబడినది. కథాంశముగా చారుదత్త వసంతసేనల అన్యోన్యానురాగము పెరుఁగుట, ఉభయప్రార్థనాసిద్ధి, విటుని పశ్చాత్తాపము, శకారునిద్వేషపు బెదరింపు, నగయిల్లడ, సంవాహకుల సందడి, దుండగీంద్ర దుండగము - ఇవి ప్రస్తావింపఁ బడినవి. కొందఱు వ్యాఖ్యాతలు ఈ యంకమునకు 'నగయిల్లడ' అని పేరుపెట్టినారు.

అంకము నాటకమందలి పరిచ్ఛేదము - అనఁగా భాగము, ఒక్క కథాంశము అక్కడికి ముగియునది.

## అలంకారన్యాసము

## ప్రథమాంకము ముగిసినది



# ద్వితీయోఽఙ్కః

[ప్రవిశ్య]

చేటి—మా త్రార్యాసకాశం సందేశేన ప్రేషితాస్మి. తద్యావత్ప్రవిశ్య ఆర్యాసకాశం గచ్ఛామి. ఏ షార్యా హృదయేన కిమ ప్యాలిఖన్తీ తిష్ఠతి. తద్యావ దుపసర్పామి. [అత్తాఏ అజ్జఆ సఆసం సందేసేణ పేసిదహ్మి. తా జావ పవిసిఅ అజ్జఆ సఆసం గచ్ఛామి] (పరిక్ర మ్యావలోక్య చ) [ఏసా అజ్జఆ హిఅఏణ కింపి ఆలిహన్తీ చిట్ఠది. తా జావ ఉపసప్పామి].

[తతః ప్రవిశతి ఆసనస్థా సోత్కణ్ఠా వసన్తసేనా మదనికా చ]

వసన్త—చేటి, తత స్తతః? [హఞ్జే, తదోతదో?]

---

ప్రవిశ్య చేటీ - చేటి తొలుత ప్రవేశించినది. 'విష్కమ్భాది వినాకృతం' - విష్కంభములు మొదలైన అర్థోపక్షేపకములు 'ప్రకరణమున' ఉండవు - అని దాని లక్షణము. అన్నియు అంకములందే.

అత్తాఏ = అమ్మచేత, వసంతసేన తల్లిచేత - ఆమెను చేటి చేటాదు లెల్లరుం గూడ అమ్మయనియే వ్యవహరింతురు, సన్దేశేన = సమాచారముతో - అనఁగా చెప్పుమని అనుట - ఆర్యాసకాశం = అక్కకడకు, చేటీ చేటులు సానిని అక్క-అని వ్యవహరింతురు. అది ఉపచారము; సముదాచారము. హృదయేన కిం అపి ఆలిఖన్తీ = హృదయముతో దేనినో, ఆలిఖన్తీ = వ్రాయుచు - హృదయమున ఎవనినో చిత్రించుచు - సాక్షాత్కరించుకొనుచు - తదేకధ్యానమగ్నగా - (ఎవనినో కాంతుని కోరి తలఁచుకొని అభిలాషలం బెంచుకొనుచు), తిష్ఠతి = ఉన్నది - ఎంతయు పరధ్యానముగా, ఆసనస్థా = ఆసనమునం గూర్చున్నదై, సోత్కణ్ఠా=విరాళిం గొన్నదై, కోరఁబడిన వానికైన తహతహ కలదై, మదనికా-వసంతసేన చేటిపేరు, హఞ్జే - ఓసీ, తతః తతః = తర్వాత తర్వాత, అంతవ

మద—ఆర్యే, న కి మపి మన్త్రియసి. కిం తత స్తతః? [అజ్జఏ, ణ కిం పి మన్తేసి, కిం తదో తదో?].

వసన్త—కిం మయా భణితమ్? [కిం మఏ భణిదమ్]

మద—తత స్తత ఇతి. [తదో తదో త్తి]

వసన్త—(సభ్రూక్షేపమ్) ఆం ఏవమ్. [ఆం ఎవ్వమ్]

[ఉపసృత్య]

ప్రథమా చేటి—ఆర్యే, మా తా దిశతి.—'స్నాతా భూత్వా దేవతానాం పూజాం నిర్వర్తయ' ఇతి [అజ్జఏ, అత్తా ఆదిసది—'ణ్హాదా భవిఅ దేవదాణం పూఅం ణివ్వత్తేహి' త్తి.]

వసన్త—చేటి, విజ్ఞాపయ మాతరం—'అద్య న స్నాస్యామి. త ద్బ్రాహ్మణ ఏవ పూజాం నిర్వర్తయతు' ఇతి. [హఞ్జే, విణ్ణవేహి అత్తమ్—'అజ్జ ణ ణ్హాఇస్సమ్. తా బమ్హణో జ్జేవ పూఅం ణివ్వత్తేదు' త్తి.

---

మునుపు మదనిక, వసంతసేన ఏమియు చెప్పి-చెప్పుచు-ఉండలేదు, అట్లున్న ఈమాటలు సంగతమగును, అట్లు లేదు, కావున ఇది అసంగత భాషితము.

ఆర్యే న కిమపి మన్త్రియామి-... యసి = అక్కా- నేను-నీవు-ఏమియును చెప్పలేదే, నీవు 'తర్వాత' అని యడుగుటకు. ఇట్టి యసంగత జల్పనము విరాళిలో ఉన్మాదావస్థను తెలుపుచున్నది. కిం 'తతః తతః'-'తర్వాత తర్వాత' అని యడుగుచున్నావే! కిం మయా భణితమ్-ఇంతలో ఇప్పుడే తా నన్న మాటను మఱచిపోయినది. 'నేను ఏమంటిని?' అని యడుగుచున్నది, సభ్రూక్షేపమ్ = బొమలు ముడుచుటతో, పరాకు మానుటం దెలుపును. జ్ఞప్తి కలుగుటను సూచించును. ఆం ఏవమ్ = అవును, ఇట్లే (అంటిని అని శేషము.) ఆదిశతి = చెప్పుచున్నది, (ఉత్తరువు చేయుచున్నది), స్నాత్వా = స్నానముచేసి దేవతార్చన చేయుము-అని. అద్య న స్నాస్యామి = నేను ఇప్పుడు స్నానము చేయను. తత్ బ్రాహ్మణ ఏవ-... కావున బ్రాహ్మణుఁడే పూజ చేయును గాక-అని. తనకు దానికి ఓపిక లేమి,

చేటీ—యదార్యాజ్ఞాపయతి. [జం అజ్జఆ ఆణవేది]

(ఇతి నిష్క్రాన్తా.)

మద—ఆర్యే స్నేహః పృచ్ఛతి, న పురోభాగితా; తత్కిం న్విదమ్? [అజ్జఏ, సిణేహో పుచ్ఛాది. ణ పురోభాఇదా, తా కిం ణేదమ్?]

వసన్త—మదనికే, కీదృశీం మాం ప్రేక్షసే? [మదణిఏ, కేరిసిం మం పేక్ఖసి?]

మద—ఆర్యాయాః శూన్యహృదయత్వేన జానామి, హృదయగతం కమప్యార్యాభిలషతీతి. [అజ్జాఆఏ సుణ్ణహిఅఅత్తణేణ జాణామి, హిఅఅగదం కం పి అజ్జఆ అహిలసది త్తి.]

వసన్త—సుష్ఠు త్వయా జ్ఞాతమ్. పరహృదయగ్రహణపణ్డితా మదనికా ఖలు త్వమ్. [సుట్ఠు తుఏ జాణిదమ్. పరహిఅఅగ్గహణపణ్డిఆ మదణిఆ క్ఖు తుమ్.]

---

ఆర్యే స్నేహః ... = అక్కా. స్నేహః = స్నేహము - నీయందు నాకు కలదే అది - అడుగుచున్నది. న పురోభాగితా = నీయందు తప్పుపట్టుట కాదు. తత్ కిం ను ఇదమ్ = మరి యిదేమిటి అక్కా (ఇట్లున్నావే)? కీదృశీం మాం పశ్యసి = ఎట్టిదానినిగా నన్ను చూచుచున్నావే? నీవు నేను ఎట్టిదాననుగా అగపడుచున్నానే? ఆర్యాయాః శూన్యహృద ... లషతీతి = అక్క పరాకుగా - ఏకతానముగా ఉండుటంబట్టి, మనసులో ఎవనినో అక్క కోరుచున్నది, ఎవనిమీఁదనో మనసుపడి యున్నది అని అనుకొనుచున్నాను. సుష్ఠు ... - చక్కఁగా కనిపట్టితివి, నీవు. పరహృద ... పణ్డితా ... త్వమ్ = ఒరుల హృదయమును - తలంపును కనిపట్టుటయందు పండితురాలవు - అది విద్యగా నేర్చిన నిపుణవు, మదనికవు - నామునోఁగతమును కనిపట్టి నన్ను సంతోషపెట్టుచున్నావు - మదనునంతటి దానవు.

మద—ప్రియం మే ప్రియం. కామః ఖలు నామైష భగవాన్. అనుగృహీతో మహోత్సవ స్తరుణజనస్య. త త్కథయ త్వార్యా, కిం రాజా రాజవల్లభో వా సేవ్యతే. [పిఅం మే పిఅం. కామో క్ఖు ణామ ఏసో భఅవం. అణుగహీదో మహూసవో తరుణజణస్స. తా కధేదు అజ్జఆ, కిం రాఆ రాఅవల్లహో వా సేవీఅది.

వసన్త—చేటి, రన్తు మిచ్ఛామి, న సేవితుమ్. [హఞ్జే రమిదు మిచ్ఛామి, ణ సేవిదుమ్.]

మద—విద్యావిశేషాలంకృతః కిం కో ఽపి బ్రాహ్మణయువా కామ్యతే. [విజ్జావిసేసాలంకిదో కిం కో వి బహ్మణజుఆ కామీఅది.]

వసన్త—పూజనీయో మే బ్రాహ్మణజనః. [పూఅణీఓ మే బహ్మణజణో.]

మద—కి మనేక నగరాభిగమనజనితవిభవవిస్తారో వాణిజ

ప్రియం మే = నాకు ఎంతయో ఇష్టముగా, సంతోషముగా ఉన్నది. కామః ఖలు ఏష భగవాన్ = ఈ దేవుఁడు కాముఁడను పేరివాఁడు గదా, కామ్యతే అనేన = కామింపఁ జేయువాఁడు, మరులు గొల్పువాఁడు గదా, అనుగృహీతః ... నస్య = జవ్వనము పైకొన్నవారికి పెనుఁబండువు అనుగ్రహింపఁ బడినది. మఱి యొవరో అయన; చెప్పవమ్మా అక్కా, కిం రాజా ... – ఆ నీచేత సేవింపఁ బడుచున్నవాఁడు, సేవలచేత వశపఱచుకొనఁ (కోర) బడుచున్నవాఁడు, రాజా లేక రాజునకు ప్రియుఁడు మఱెవఁడైనను గొప్ప హోదా కలవాఁడు మంత్రియా, సేనాపతియా? అనుట. దీన ఇది వసంతసేన కన్నెతికపుఁ దొలి వలపు అని సూచితము. హఞ్జే, రన్తుం ... = ఓసి రమింపఁగోరుదును, సేవింపను గాదు, మనసిచ్చి కలాంగనవలె సంతోషింపఁ గోరుచున్నాను. (అట్లైన) కిం విద్యా విశేషా ... మ్యతే = గొప్పవిద్యలే అలంకారముగాఁగల యెవఁడేని వయసు బ్రాహ్మణుఁడు వలవఁ బడుచున్నాఁడా?

పూజనీయః ... – బ్రాహ్మణుని నే పూజింతును (కామింపను అనుట) అట్లైని, కిం అనేక నగర అభిగమన ... – పెక్కు నగరములకు (పేరములకు)

యువా వా కామ్యతే? [కిం అణేఅణఅరాహిగమణ జణిద విహావ విత్థారో వాణిఅ జుఆవా కామీఅది.]

వసన్త—చేటి, ఉపారూఢస్నేహ మపి ప్రణయిజనం పరిత్యజ్య దేశాన్తరగమనేన వాణిజజనో మహద్వియోగజం దుఃఖ ముత్పాదయతి. [హఞ్జే, ఉవారూఢ సిణేహం పి పణఇజణం పరిచ్చఇఅ దేసన్తర గమణేణ వణిఅజణో మహన్తం విఓఅజం దుఃఖం ఉప్పాదేది.]

మద—ఆర్యే, న రాజా, న రాజవల్లభః, న బ్రాహ్మణః, న వాణిజజనః. తత్కః ఇదానీం స భర్తృదారికయా కామ్యతే? [అజ్జఏ, ణ రాఆ, ణ రాఅవల్లహో ణ బమ్హణో, ణ వాణిఅజణో. తా కో దాణిం సో బట్టిదారిఆఏ కామీఅది.]

వసన్త—చేటి, త్వం మయా సహ కామదేవాయతనో ద్యానం గతాసి, [హఞ్జే, తుమం మఏ కామదేవాఅదణుజ్జాణం గదా అసి].

మద—ఆర్యే, గతాస్మి. [అజ్జఏ, గదహ్మి].

---

పోయి, దానఁ గలిగిన గొప్ప సంపద గలవాఁడు, వణిగ్యువా ... — యౌవనవంతుఁడగు కోమటి కోరఁబడుచున్నాఁడా? హఞ్జే ఉపారూఢ ... — ఓసి, ఎంతో అనురాగము గలదానినైనను — క్షణవియోగమును సయితము ఓర్వలేనిదానినైనను, (ఇంట) వదలిపెట్టి, దేశాంతరగమనముచే, కోమటివాఁడు ఎంతేని వియోగ దుఃఖమును కలిగించును. (కావున అట్టివాఁడును కాఁడు అనుట), ఆర్యే ... = అక్కా, మఱి రాజు కాఁడు, రాజవల్లభుఁడుం గాఁడు, బ్రాహ్మణుఁడు కాఁడు, కోమటియుం గాఁడు, (అంటివే), తత్ కః ఇదానీం ... = మఱెవఁడు వాఁడు, భర్తృదారిక చేత కోరఁబడుచున్నవాఁడు?

త్వం మయా సహ ... = నీవు నాతో కూడ కామదేవుగుడి తిరునాళ్ళకు వచ్చితివే, ... గతాస్మి = వచ్చితిని, తథా అపి = ఐనను, (అట్లు వచ్చి చూచి

వసన్త—తథాపి మాముదాసీనేవ పృచ్ఛసి. [తహావి మం ఉదాసీణా విఅ పుచ్ఛసి.]

మద—జ్ఞాతమ్. కిం స ఏవ యే నార్యా శరణాగతాభ్యుపపన్నా. [జాణిదమ్. కిం సో జ్జేవ జేణ అజ్జఆ సరణాఅదా అబ్భువవణ్ణా.]

వసన్త—కిం నామధేయః ఖలు సః? [కిం ణామహేఓ క్ఖు సో?]

మద—స ఖలు శ్రేష్ఠిచత్వరే ప్రతివసతి. [సో క్ఖు సేట్ఠిచత్తరే పడివసది.]

వసన్త—అయి, నామాస్య పృష్టాసి. [అఇ ణామం సే పుచ్ఛిదాసి].

మద—స ఖలు ఆర్యే, సుగృహీతనామధేయ ఆర్య చారుదత్తో నామ. [సో క్ఖు అజ్జఏ, సుగహీదణామహేఓ అజ్జ చారుదత్తో ణామ.]

---

అంతయు ఎఱిఁగినదాన వైనను), ఉదాసీనా ఇవ = ఎఱుఁగక ఊరకున్నదానివలె, అడుగుచున్నావే! జ్ఞాతమ్ = (ఆ,) తెలిసినది, కిం స ఏవ = ఏమి, అతఁడేనా, యేన ఆర్యా ... పన్నా - ఎవనిచేత, అక్క శరణాగతయై - రక్షణ కోరినదై, కాపాడఁబడినదో, కిన్నామధేయః = ఏపేరుగలవాఁడు అతఁడు? అతని పేరేమి? స ఖలు ... = ఆయన, కోమటుల చదరములో - చౌక్‌లో - వాటికలో - పేటలో - కాపురమున్నాఁడు గదా, అయి = ఓ మంచిదానా, నామ ... = ఆయన పేరు అడిగితివా? సుగృహీతనామధేయః - ఇది యొక గౌరవసూచకపు మాట - ఎవని పేరు పలుకుటయు మంగళకరమో - బలి, యుధిష్ఠిరుఁడు - మొదలైనవారిం బోని వాఁడు - ప్రసిద్ధుఁడనియు.

వసన్త—(సహర్షమ్) సాధు మదనికే, సాధు. సుష్ఠు త్వయా జ్ఞాతమ్. [సాహు; మదణిఏ, సాహు సుట్ఠు తుఏ జాణిదమ్].

మద—(స్వగతమ్) ఏవం తావత్. [ఎవ్వం దావ] (ప్రకాశమ్) ఆర్యే, దరిద్రః ఖలు స శ్రూయతే. [అజ్జఏ, దలిద్దో క్ఖు సో సుణీఅది.]

వసన్త—అతఏవ కామ్యతే, దరిద్రపురుషసంక్రాన్త మనాః ఖలు గణికా లోకే ఽవచనీయా భవతి. [అదో జేవ కామీఅది. దలిద్ద పురిససంకన్తమణా క్ఖు గణిఆ లోఏ అవఅణీఆ భోది.]

మద—ఆర్యే, కిం హీనకుసుమం సహకారపాదపం మధుకర్యః పునః సేవన్తే? [అజ్జఏ కిం హీణకుసుమం సహఆరపాదవం మహుఅరీఓ ఉణ సేవన్తి?]

వసన్త—అత ఏవ తా మధుకర్య ఉచ్యన్తే [అదో జేవ తాఓ మహుఅరీఓ వుచ్చన్తి].

సాధు మదనికే = బళి మదనికా బళి, నీవుచక్కఁగా - లెస్సగా - ఎఱిఁగితివి. ఏవం ... = అట్లే, బాగుగానే ఎఱిఁగితిని, ఇది స్వగతము - వసంతకు తెలియనీక తాను తనలో అనుకొనుట - బాగుగానే ఎఱిఁగితిని ఈకోరిక అంత మంచిది కాదే అని తాను అనుకొనుట. బయటికిని ఇట్లు పలుకుచున్నది, ఆర్యే ... = అక్కా, (వట్టి) పేదవాఁడని కదా వానిం జెప్పుకొందురు.

అత ఏవ ... = కావుననే, నేను వలచుచున్నాను, దరిద్ర పురుషునిమీఁద మేలుపడిన, భోగముది - లోకములో జనులగుంపునకు ఉమ్మడి యనుకొనంబడినది, 'గణః అస్త్యస్యాః భర్తృత్వేన ఇతి' - గణిక - (నిజముగా), అవచనీయా = నింద పాలుగాక మెచ్చుకొనఁ దగినది, ఆర్యా, కిం హీనకుసుమం ... = అక్కా, మఱి పూలులేని - రాలిపోయిన తీయమామిడిచెట్టును తేంట్లు, ముసరుకొనునా? అత ఏవ ... = అందులకే అవి 'మధుకరులు' = తేనె కూర్చునవి - బిచ్చమెత్తునది అనియు ధనము ప్రోగుచేయువారు కదా - భోగమువారును - అనుట. తాము

మద—ఆర్యే, యది స మనీషిత స్తత్కిమర్థ మిదానీం సహసా నాభిసార్యతే? [అజ్జఏ, జఇ సో మణీసిదో తా కీస దాణిం సహసా ణ అహిసారీఅది?]

వసన్త—చేటి, సహసాభిసార్యమాణః ప్రత్యుపకార దుర్బలతయా, మా తావత్, జనో దుర్లభదర్శనః పున ర్భవిష్యతి [హఞ్జే, సహసా అహిసారిఅన్తో పచ్చుఅఆరదుబ్బలదాఏ, మా దావ, జణో దుల్లహదంసణో పుణో బవిస్సది.]

మద—కి మత ఏవ సో ఽలంకార స్తస్య హస్తే నిక్షిప్తః. [కిం అదో జేవ సో అలంకారఓ తస్స హత్థే ణిక్ఖిత్తో?]

వసన్త—చేటి, సుష్ఠు త్వయా జ్ఞాతమ్. [హఞ్జే, సుట్ఠు దే జాణిదమ్]

---

సాంతాన-రతి, సుఖము-అనుభవింపఁ గోరువారు కారుకదా-యది స మనీషితః = అతఁడు కోరఁబడినట్టైన, తత్ కిమర్థం = మఱి యెందులకు, సహసా = వెంటనే, న అభిసార్యతే = అతని యింటికి పోవకున్నావు? త్వయా-అని శేషము. అనఁగా అతఁడు పేదవాఁడు, నీకడకు వచ్చుటకు ధైర్యము పూనలేక యుండును. నీవే అతనియింటికిం బోవుదువేని, నీకు దుర్లభుఁడు కాఁబోఁడు. సులభుఁడే అగును గదా. ఎందులకు ఈ యాలస్యము చేయుచు బాధపడుచున్నావు? చులకన ఐపోవుదునని భయమా? మఱేమి?

సహసా అభిసార్యమాణః-తటాలున-ఒండొరులకు నమ్మకము కుదురకమును పే, ప్రత్యుపకార దుర్బలతయా = నగ, చీర-ఇట్టిదానిని బదులు ఇచ్చి తృప్తిపఱుచు శక్తి లేనందున, జనః = (ఆ) జనము, పునః = మరల మఱి, దుర్లభ దర్శనః = అగపడని వాఁడు, భవిష్యతి = కాఁగలఁడు. కావున, మా తావత్ = (అది యెంతమాత్రమును) కూడదు.

కిం అత ఏవ .. = అందులకే అనగను అతనిచేత ఇల్లడ పెట్టితివా? సుష్ఠు త్వయా జ్ఞాతమ్ = నీవు లెస్సగా తలంచితివి-ఈ యర్థము నాటకాలలో తెలియు, కాదా-ఎఱింగితివి, కనిపట్టితివి, గ్రహించితివి-అని మెప్పు. నిజముగా నివు

[ నేపథ్యే ]

అరే భట్టారక, దశసువర్ణస్య రుద్ధో ద్యూతకరః ప్రపలా యితః, ప్రపలాయితః. తద్గృహాణ గృహాణ, తిష్ఠ, తిష్ఠ, దూరా

దారిదొంగల భయమునకు అక్కడ పెట్టివచ్చినదానవు కావు, మఱేమన, ఇందులకు, వానికి నమ్మకము గొలుపుటకు - నేను అట్లు దారిద్ర్యమునకు అలత్యపెట్టుదానను కా నని అతనికి తోఁపఁజేయుటకు.

నేపథ్యే - తెరవెనుక - అరే భట్టారక - ఒరే సభాపతి, జూదగాండ్ర మేస్త్రీ, మధ్యస్థుఁడా - ఇపు డిచట ముప్వురు ప్రవేశించుచున్నారు. ఓడిపోయి పరువెత్తిన జూదరి - వానికి సంవాహకుఁ డని పేరు. వాని విద్య సంవహనము - సంవాహము - ఒళ్ళు పిసుకుట - మానుసులకు 'మాలీష్' చేయుట. ఇందు వానికి పేరును - సంజ్ఞయు - అదే ఐనది. మఱియొక జూదరి - వానికి సంజ్ఞ లేదు; ద్యూతకరుఁడు - జూదరి అనియే ఉన్నది. వాఁడు గెలిచినవాఁడు - సభికుఁడు మధ్యస్థుఁడు, వీరి తగాదాలు నిర్ణయించువాఁడు.

యాజ్ఞవల్క్య మితాక్షరలో జూదము ఆడఁదగు ననియు, సర్కారునకు పన్ను కట్టి సర్కారు రక్షణ పొందఁదగు ననియు, కలదు.

సభికః కారయేద్ ద్యూతం దేయం దద్యాచ్చ తత్కృతమ్
దశకం తు శతం వృద్ధి స్తతః స్యాత్ ద్యూతకారితా
అథవా కితవో రాజ్ఞే దత్వా లాభం యథోచితం
ప్రకాశం దేవనం కుర్యా దేవం దోషో న విద్యతే.—ఇతి.

మనువు కూడ దని నిషేధించినాఁడు.

ద్యూతం సమాహ్వయం చైవ రాజా రాష్ట్రా న్నివారయేత్ ...
ప్రకాశ మేవ తాస్కర్యం య ద్దేవన సమాహ్వయౌ.—అని.

దశ సువర్ణస్య = పది సువర్ణముల కోసము, సువర్ణము ఎనుబది రతుల బంగారు నాణెము - మొహారీ అనంబడునది - పెద్ద మొత్తమే. రుద్ధః = పట్టుపడి, ఓడి చిక్కి, జూదరి సంవాహకుఁడు పరారియైనాఁడు. తత్ గృహాణ గృహాణ - కావున పట్టుకో పట్టుకో. (ఇంతలో అపాఱిపోయినవాఁడు దూరాన అగపడఁగా,

త్ప్రదృష్టో ఽసి. [అలే భట్టా, దశసువణ్ణాహ లద్ధు జూదకరు పపలీణు పపలీణు, తా గేణ్హ తా గేణ్హ, చిట్ఠ చిట్ఠ దూలా త్పదిట్టో సి.]

(ప్రవిశ్యాపటీక్షేపణ సంభ్రాన్తః)

సంవాహకః—ఆశ్చర్యమ్, కష్ట ఏష ద్యూతకరభావః. [హీమాణహే, కట్టే ఏసో జూదీఅలభావే].

శ్లో. నవబన్ధనముక్తయేవ గర్దభ్యా
హా తాడితో ఽస్మి గర్దభ్యా
అఙ్గరాజముక్తయేవ హా శక్త్యా

వానిని (సంవాహకునింగూర్చి) నిలునిలు - దూరాత్ ప్రదృష్టో ఽసి = దూరము నుండి అగపడినవాఁడవైతివి. ఇది యా జయించినవానిమాట - కొంత మైత్రిని గూర్చియు, కొంత సంవాహకుం గూర్చియు.

అపటీక్షేపణ - పటిని - తెరను - వేయకయే - పట ఆక్షేపేణ - అనియు చెప్పఁబడును - పటము - తెర - వేయకయు. సూచిత సాధారణ ప్రవేశమునకు - పటీ - పట - క్షేపము - వేయుటయు, సంభ్రాంత - అనూచితమైన సంభ్రమము (= వడి) తోడి ప్రవేశమునకు క్షేపము - వేయుట - లేమియు - నిబంధనము.

“పటాక్షేపము - తెర వేయమి; పాత్ర ప్రవేశమునకు తెర వేయుటయు, సంభ్రాంత ప్రవేశమునకు తెర వేయమియు నియతములు.” ప్రియఁద. వే. వేం. టీక. పు. 74.

హీమాణహే = ఆశ్చర్యము! ద్యూతకరభావః - జూదరివృత్తి, కష్టః - కష్టమైనది - చిక్కులతో కూడుకొన్నది.

శ్లో. ౧. నవబన్ధన ముక్తయా = క్రొత్త కట్టునుండి విడిపింపఁబడిన, గర్దభ్యా ఇవ = ఆడుగాడిద చేతం బోలె, గర్దభ్యా = గర్దభము అను సారె చేత; హా = అయ్యో, తాడితః అస్మి = కొట్టఁబడితిని. అట్లే, శక్త్యా = శక్తి అను సారె చేత (సారె = పాచిక), అఙ్గరాజముక్తయా = అంగదేశపు రాజైన కర్ణుని చేత

ఘటోత్కచ ఇవ ఘాతితో ఽస్మి శక్త్యా. ౧

[ణవబన్ధణ ముక్కాఏ విఅ
గద్దహీఏ హా తాడదో మ్హి గద్దహీఏ
అఙ్గలాఅముక్కాఏ విఅ శత్తీఏ
ఘడుక్కో విఅ ఘాదిదో మ్హి శత్తీఏ].

శ్లో. లేఖకవ్యాపృతహృదయం సభికం దృష్ట్వా ఝటితి ప్రభ్రష్టః
ఇదానీం మార్గనిపతితః కం ను ఖలు శరణం ప్రపద్యే? ౨

[లేఖఅవావడహిఅఅం శహిఅం దత్తూణ ఝత్తి పబ్భట్టే
ఏణ్హిం మగ్గణివడిదే కం ణుక్ఖు శలణం పపజ్జే?]

---

ప్రయోగింపఁబడిన, శక్త్యా = శక్తి అను నాయుధముచేత, ఘటోత్కచః ఇవ = ఘటోత్కచుని వలె (హిడింబీ భీముల కొడుకువలె), ఘాతితః అస్మి = కొట్టఁబడిన వాఁడనైతిని. గర్దభి జాటి కాఁబోలు, గవ్వలుతాపిన ఊరిదాదేని?

జూదపుటాటలో ఓడిపోయి పందెపు డబ్బు (చేత లేనందున) కట్టనందుకు పాచికలతోనే బిట్టు కొట్టఁబడితిని. సువర్ణము 80 గురిగింజల యెత్తు బంగారు నాణెము.

శ్లో. ౨. లేఖక వ్యాపృత హృదయం = (జూదర్ల పగత్తులు మొదలైనవి) వ్రాయుటలో పనివడ్డ మనసుగల - అపరాధులో నున్న, సభికం = జూదపుమేస్త్రిని, దృష్ట్వా = చూచి, ఝటిత్ ఇతి = తటాలున, ప్రభ్రష్టః = తప్పించుకొని పరువెత్తితిని, మార్గనిపతితః = దారిలో - బాటలో - పడితిని, ఇదానీం = ఇప్పుడు, కం = ఎవనిని, శరణం = రక్షకునిగా, ప్రపద్యేను ఖలు = పొందుదునో కదా.

జూదాన ఓడితిని. మేస్త్రి నాచేయి పట్టుకొన్నాఁడు, పోనీక, వాఁడు వ్రాఁతలో మనసు పెట్టియుండఁగా, ఏమరుపాటున చేయి లాగుకొని తటాలున పరువెత్తి వచ్చి ఇట బాటలో పడితిని. ఇక్కడ ఎవరిని నన్ను కాపాడుమని అడుగఁగలను?

తద్యావ దేతౌ సభికద్యూతకరా వన్యతో మా మన్విష్యతః, తావ దహం విపరీతాభ్యాం పాదాభ్యా మేత చ్ఛూన్యదేవకులం ప్రవిశ్య దేవీ భవిష్యామి. [తా జావ ఏదే శహిఅజూదిఅలా అణ్ణదో మం అణ్ణేశన్తి, తావ హఙ్కే విప్పడీవేహిం పాదేహిం ఏదం శుణ్ణదేవ ఉలం పవిశిఅ దేవీభవిశ్శమ్].

(బహువిధం నాట్యం కృత్వా తథా స్థితః)

(తతః ప్రవిశతి మాథురో ద్యూతకరశ్చ)

మాథురః—అరే భట్టారక, దశసువర్ణస్య రుద్ధో ద్యూతకరః ప్రపలాయితః ప్రపలాయితః. తద్గృహాణ గృహాణ, తిష్ఠ తిష్ఠ, దూరా త్ప్ర్రదృష్టో ఽసి. [అలే భట్టా, దశసువణ్ణాహ లుద్ధు జూదకరు పపలీణు పపలీణు. తా గేహ్ణ గేహ్ణ, చిట్ఠ చిట్ఠ, దూరా త్పదిట్టో ఽసి.]

---

తత్ = కావున, ఏతౌ సభికద్యూతకారకౌ = జూదపు మేస్త్రియు, జూదగాఁడును, మాం = నన్ను, అన్యతః = ఒకతట్టు, యావత్ అన్విష్యతః = వెదకులోపల, తావత్ = అంతలో, అహం = నేను, విపరీతాభ్యాం పదాభ్యాం = ఎదురుమళ్ళిన - మళ్ళింపఁ బడిన - పాదములతో - అట్టి యడుగుల గుఱుతు కలుగునట్లుగా, ఏతత్ శూన్యదేవకులం = ఈ పాడుపడిన గుడిని, ప్రవిశ్య = చొచ్చి, దేవీ భవిష్యామి = (అందలి) దేవతగా ఐపోయెదను, బహువిధం = పలుతెఱంగుల, నాట్యం కృత్వా = నృత్యము చేసి, తథా స్థితః = అట్లు - దేవళములో విగ్రహముగా - (స్థితః -) ఐనాఁడు.

ఎదురు అడుగులు వేయుటయు నృత్యమాడుటయు అడుగుజాడ గుఱుతు తెలియకుండుటకును, ఒకవేళ అట్లు సందేహించినను, లోపల లేఁడు, మరల ఎటో బయటికట్టు పరువెత్తినాఁడు అను భ్రమ కలిగించి, తన్ను చేర రాకుండుటకును. మాథురః - మథురాపట్టణము వాఁడు.

ద్యూతకరః—

శ్లో. యది వ్రజసి పాతాల మిన్ద్రం శరణం చ సాంప్రతం యాసి
సభికం వర్జయిత్వైకం రుద్రోఽపి నరక్షితుం తరతి. 3

[జయి వజ్జసి పాదాలం ఇన్దం శలణం చ సంపదం జాసి
సహిఅం వజ్జిఅ ఏకం దుద్దో వి ణ రక్ఖిదుం తరఇ].

మాథుర—

శ్లో. కుత్ర కుత్ర సుసభిక విప్రలమ్భక
పలాయసే రే భయపరివేపితాఙ్గక
పదే పదే సమవిషమం స్ఖల న్కులం
యశో ఽతికృష్ణం కుర్వన్. ౪

శ్లో. 3. పాతాళం వ్రజసి యది = పాతాళమునకు - చీకటితో నిండిన అధోలోకమునకు పోయినను, సంప్రతి = ఇప్పుడు, ఇన్ద్రం చ శరణం యాసి (యది) = (మింట) ఇంద్రుని శరణు జొచ్చినను, నముచ్యసే - అని శేషము - విడువఁబడవు - విడుపు పొందవు - తప్పించుకొనలేవు, ఏకం సభికం వర్జయిత్వా = ఒక్క జూదపు మేస్త్రిని విడిచిపెట్టిన - అనఁగా వాఁడు తప్ప, రుద్రః అపి = రుద్రుఁడు సయితము, రక్షితుం = కాపాడుటకు, న తరతి = సమర్థుఁడు కాఁడు.

పాతాళము చొచ్చినను, ఇంద్ర రుద్రులను శరణు జొచ్చినను నీవు తప్పించుకొనలేవు, సభికుఁడు ఒకఁడే నీకు గతి-వాడే కావవలయును, లేక విడువవలయును. ఒరుఁడు ఎంతటివాఁడును నీకు ఏమియు చేయలేఁడు.

శ్లో. ౪. రే = ఓరి, సుసభిక విప్రలమ్భక = మంచి సభికుని మోసము చేయువాఁడా, భయ పరివేపి తాఙ్గక = భయముతో మిక్కిలి వణఁకుగొన్న దేహముగలవాఁడా, పదేపదే = అడుగడుగునను, సమవిషమం = సరి, ఎగుడు, దిగుడు - చోట్ల, ఒండుదానిని వేఱొండుగా భ్రమసి, స్ఖలన్ = తొట్రుపడుచును, కులం యశః అతికృష్ణం కుర్వన్ = కులమును కీర్తిని ఎంతయు నల్లగాచేయుచు - చెడ్డకులమున పుట్టినవాఁడు, అపయశస్సు కలవాఁడు అని యనిపించుకొనుచు, కుత్ర కుత్ర = ఎక్కడెక్కడికి, పలాయసే = పరువెత్తెదవు ?

[కహిం కహిం సుసహిఅవిప్పలమ్భఆ
పలాసి లే భఅపలివేవిదజ్గఆ
పదేపదే సమవిసమం ఖలన్తఆ
కులం జసం అదికసణం కలేన్తఆ.]

ద్యూత—(పదం వీక్ష్య) ఏష వ్రజతి. ఇయం ప్రనష్టా పదవీ. [ఏసో వజ్జది. ఇఅం పణట్ఠా పదవీ.]

మాథు—(ఆలోక్య సవితర్కమ్) అరే విప్రతీపౌ పాదౌ. ప్రతిమాశూన్యం దేవకులమ్. ధూర్తో ద్యూతకరో విప్రతీపాభ్యాం పాదాభ్యాం దేవకులం ప్రవిష్టః. [అలే, విప్పదీవు పాదు. పడిమాశుణ్ణు దేఉలు. (విచిన్త్య) ధుత్తు జూదకరు విప్పదీవేహిం పాదేహిం దేఉలం పవిట్ఠో]

ద్యూత—తతో ఽనుసరావః. [తా అణుసరేమ్హ].

మాథు—ఏవం భవతు. [ఎవ్వం భోదు]

ఓరీ, మన సభికుఁడు ఎంత మంచివాఁడు, వానిని మోసగింతువు, భయముతో అంత వణికెదవు. నేల సరిగా ఉన్నను మెఱక పల్లములుగా ఉన్నను ఒక్క తీఱుగానే తడఁబడెదవు, నీకులానికి కీర్తికి మసిపూసి చెడ్డవాఁడ వని అనిపించుకొనుచున్నావు, ఎక్కడికి పరువెత్తెదవురా, నీవు?

పదం దృష్ట్వా = అడుగు (గుఱుతు) చూచి, ఏషః = ఇది, వ్రజతి = పోవుచున్నది, ఇదిగో ఇటు నడిచినట్లు ఉన్నది, ఇయం పదవీ = ఇదిగో దారి - అడుగుజాడవరుస - ప్రణష్టా = అగపడకపోయినది, సవితర్కమ్ = వితర్కముతో - చక్కఁగా ఆలోచించి ఊహించి, పాదౌ విప్రతీపౌ = అడుగులు తలక్రిందుగా ఉన్నవి, దేవకులం = దేవళము, ప్రతిమాశూన్యం = విగ్రహము - బొమ్మ - లేనిది, జూదగాఁడు బలు మోసగాఁడు - విప్రతీపాభ్యాం = తలక్రిందులైన, ముందువెనుకలైన - పాదాభ్యాం=అడుగులతో-వెనుకకు నడచిన యడుగులతో, దేవకులం ప్రవిష్టః=దేవళము చొచ్చినాఁడు. అనుసరావః=వెంబడింతము, ఇరువురు దేవళములో ప్రవేశించి.

(ఉభౌ దేవకులప్రవేశం నిరూపయతః దృష్ట్వాన్యోన్యం సంజ్ఞాప్య)

ద్యూత — కథమ్ కాష్ఠమయీ ప్రతిమా. [కధం కాట్ట మయీ పడిమా]

మాథు — అరే, న ఖలు న ఖలు, శైలప్రతిమా, [అలే ణహు ణహు, శైలపడిమా,] (ఇతి బహువిధం చాలయతి, సంజ్ఞాప్య చ) ఏవం భవతు ఏహి ద్యూతేన క్రీడావః. [ఎవ్వం భోదు ఏహిం జూదం కీలేమ్హ.] (ఇతి బహువిధం ద్యూతం క్రీడతి).

సంవా — (ద్యూతేచ్ఛావికారసంవరణం బహువిధం కృత్వా స్వగతమ్] అరే,

శ్లో. కత్తాశబ్దో నిర్నాణకస్య హరతి హృదయం మనుష్యస్య
ఢక్కాశబ్ద ఇవ నరాధిపస్య ప్రభ్రష్టరాజ్యస్య. ౫

పరికించి (=నిరూపయతః), అన్యోన్యం సంజ్ఞాప్య=ఒండొరులు సన్న చేసికొని, — అనఁగా అది ప్రతిమగాదు, సంవాహకుఁడే - అని కనిపట్టియు, కథం కాష్ఠమయీ - న ఖలు న ఖలు - శైలీ = ఏమీ - కొయ్యతో చేసినదిగా నున్నది! కాదు కాదు - శిలతో - ఱాతితో చేసినదిగా ఉన్నది ఇతి - ఇట్లనుచు - బహువిధం = పలు తెఱంగులు, చాలయిత్వా = ఆడించి - (నిజ మెఱిఁగి - ఎఱుఁగనట్లుగా) ఒండొరులు సన్న చేసికొని.

ఏవం భవతు = ఇట్లగుం గాక - ఏహి = రమ్ము, ద్యూతం క్రీడావః = జూదము ఆడుదము. అని - బహువిధం ద్యూతం క్రీడతి - పలు తెఱంగుల జూదము ఆడును. వినోదార్థము ఆట అభినయింతురు.

ద్యూత ఇచ్ఛా సంవరణం బహువిధం కృత్వా - జూదమాడు కోరికను దాఁచుటను పలు తెఱంగులఁ గావించి, ఇముడ్చుకొనలేక - (స్వగతమ్ =) తనలో అనుకొనుచున్నాఁడు.

శ్లో. ౫. కత్తా శబ్దః - కత్త అని ఏదియో జూదపు సాధనము - కాదా - పాచిక - దాని మ్రోఁత, ఢక్కాశబ్దః = (యుద్ధ) దుందుభిమ్రోఁత, ప్రభ్రష్ట రాజ్యస్య = పోయిన రాజ్యముగల - రాజ్యమునుండి భ్రంశము పొందిన, నరాధి

[కత్తాశద్దే ణిణ్ణాణఅశ్శ హాలఇ హడకం మనుశ్శశ్శ
ఢక్క-శద్దే వ్వ ణడాధివశ్శ పబ్భట్ట లజ్జశ్శ].

శ్లో. జానామి న క్రీడిష్యామి సుమేరుశిఖరపతనసంనిభం ద్యూతమ్
తథాపి ఖలు కోకిలమధురః కత్తాశబ్దో మనో హరతి. ౬

[జాణామి ణ కీలిశ్శం శుమేలు శిహాలపడణశణ్ణిహం జూఅమ్,
తహా వి హు కోఇలమహులే కత్తాశద్దే మణం హాలది]

ద్యూత—మమ పాఠే మమ పాఠే [మమ పాఠే మమ పాఠే].

పస్య ఇవ = రాజునకుంబోలె, యుద్ధాన ఓడి రాజ్యము కోలుపోయినవానికైనను, మరల రణభేరి మ్రోఁత చెవింబడిన - చేతులును చిత్తమును యుద్ధమునకు పురపుర లాడును, అట్లే - నిర్ణాణకస్య - నాణెములు - పందెమొడ్డుటకు రూకలు - లేని, మనుష్యస్య హృదయం హరతి = నరుని మనస్సును ఆకర్షించును - ఆడు ఆడు అని యనును - ఆడ నాసగొల్పును, ఢక్క - ఆయో ఆట్టి విభవము పోయినదని ఏడ్పు.

పాచికలమ్రోఁత చెవింబడిన, రూకలేనివానికైనను, చిత్తము ఆఁగదు - ఆడుటకు ఎంతయు ప్రేరించును - వాఁడు తన్ను నిలువరించుకొనలేఁడు. నా కిపుడు అట్లున్నది.

శ్లో. ౬. సుమేరు శిఖర పతన సన్నిభం = మేరు - బంగరు - కొండ కొమ్మునుండి అక్కడికి ఎక్కి అందుండి పడుటంబోనిది - జయముచే బలుధనముచే బంగరుకొండకొమ్మునెక్కిన సంతసము పొంది, అంతలో ఓటమి కలుగఁగా అందుండి నేలను - పాతాళమునను - పడుటం బోనిది. నేను ఇప్పుడు అట్టి పాటు అనుభవించుచున్నాను - తథా అపి = అయినను, కత్తా శబ్దః = కత్తయొక్క ధ్వని, కోకిలమధురః = కోయిల - కూఁతవలె - చెవికి ఇంపై, మనః హరతి = చిత్తమును నెట్టన లాగుచున్నది.

ఆడుటకు పట్టరాని కుతూహలము పెంచుచున్నది - ఈ యాట చూచుటయు దాని మ్రోఁతలు వినుటయు.

మమ పాఠే = నాతట్టు - నాదిపట్టు - నాదిపాట - నాది పందెము - ఇది జ్యాదగాంధ్ర భాషితవిశేషము - కత్తా - వలెనే, అన్యతః = ఒకతట్టునుండి,

మాథు—న ఖలు! మమ పాశే మమ పాశే! [ణ హు, మమ పాశే మమ పాశే]

సంవా—(అన్యతః సహసా సోపసృత్య) నను మమ పాశే. [ణం మమ పాశే].

ద్యూత—లబ్ధః పురుషః. [లద్ధే గోహే]

మాథు—(గృహీత్వా) అరే లుప్తదణ్డక, గృహీతో ఽసి. ప్రయచ్ఛ త ద్దశసువర్ణమ్. [అలే పేదణ్డా, గహీదో సి. పఅచ్ఛ తం దశసువణ్ణమ్.]

సంవా—అద్య దాస్యామి. [అజ్జ దయిశ్శమ్]

మాథు—అధునా ప్రయచ్ఛ. [అహుణా పఅచ్ఛ]

సంవా—దాస్యామి. ప్రసాదం కురు. [దఇశ్శమ్. పశాదం కలేహి].

మాథు—అరే, నను సాంప్రతం ప్రయచ్ఛ. [అలే, ణం సంపదం పఅచ్ఛ].

సంవా—శిరః పతతి. [శిలు పడది].

(ఇతి భూమౌ పతతి. ఉభౌ బహువిధం తాడయతః.

సహసా = తటాలున, ఉపసృత్య = సమీపించి, నను మమ పాశే = ఓరి నాతట్టున కదట్రా పట్టు-పందెము, గృహీత్వా = (వానిని) పట్టుకొని, అరే లుప్తదండక - ఓరి దండమును, జూదాన ఓడి కట్టవలసివచ్చిన ధనమును, ఎగవేసినవాఁడా, దండన తప్పించుకొన్నవాఁడా.

గృహీతః ... = దొరకినావురా, కట్టు, తేరా, ఆ పదిసువర్ణములను, అద్య ... ప్రయచ్ఛ = ఇచ్చెదను లెమ్ము, ఇప్పుడు ఇమ్ము - ఇచ్చెదనులే, అను గ్రహింపుము - మన్నింపుము. అరే నను ... పతతి - ఓరి ఇప్పుడే ఇచ్చివేయరా. (ఇదిగో) తల పడిపోవుచున్నది - తిరుగుచున్నది - అని నేలం బడును. ఉభౌ ... తః - ఇరువురును పలు తెఱంగుల, కాళ్ళతోను చేతులతోను కొట్టుదురు. అంతట

మాధు—ఏష త్వం ఖలు ద్యూతకరమణ్డల్యా బద్ధో ఽసి. [ఏసు తుమం హు జూదిఅరమణ్డలీఏ బద్ధో ఽసి].

సంవా—(ఉత్థాయ సవిషాదమ్) కథం ద్యూతకరమణ్డల్యా బద్ధో ఽస్మి. కష్టమ్, ఏషో ఽస్మాకం ద్యూతకరాణా మలఙ్ఘనీయః సమయః. తస్మాత్కుతో దాస్యామి? [కధం జూదిఅలమణ్డలీఏ బద్ధో హ్మి. హీ, ఏశో అమ్హాణం జూదిఅలాణం అలఙ్ఘణీఏ శమఏ. తా కుదో దఇశ్శమ్.]

మాధు—అరే, గణ్డః క్రియతాం క్రియతామ్, [అలే, గణ్డే కులు కులు].

సంవా—ఏవం కరోమి. (ద్యూతకర ముపస్పృశ్య) అర్ధం తుభ్యం దదామి. అర్ధం మే ముఞ్చతు. [అద్ధం తే దేమి. అద్ధం మే ముఞ్చదు].

ద్యూత—ఏవం భవతు. [ఎవ్వం భోదు].

---

ఇట్లును బెదరింతురు—త్వం ... బద్ధః అసి—ఇదిగోనీవు జూదరుల ముఠాచేత కట్టివేయఁబడితివి. (—దురాయి పెట్టఁబడితివి.) నీవిషయము ముఠావ తెలిసిపోయినది—ముఠాపేర (నిన్ను) ఇపుడు నేను కట్టివేచుట. జూదరుల యేర్పాటులం దాఁటుట వారి కందఱకు కోపకారణము. నే నొక్కఁడను మున్నించు టెట్లు?

ఉత్థాయ సవిషాదమ్—లేచి దుఃఖముతో, కథం ... స్మి—ఏమీ ... ముఠాచేత కట్టివేయఁబడితినా! కష్టమ్=కట్టా=అయ్యో. ఏషః ... యః=ఇది జూదగాండ్ర మను మాట దాఁటరాని నిబంధన—ఏర్పాటు—ఒడంబడిక ... కావున ఎట్లు—ఎక్కఁడనుండి తెచ్చియీఁగలను? గణ్డఃక్రియతాం=పూఁటకాఁపుం బెట్టుము, అర్ధం తుభ్యం దదామి—సగము నీకు ఇచ్చెదను. సగము నాకు

సంవా—(సభిక ముపగమ్య) అర్ధస్య గణ్డం కరోమి. అర్ధమపి మే ఆర్యో ముఞ్చతు. [అద్ధశ్శ గణ్డే కలేమి. అద్ధం పి మే అజ్జో ముఞ్చదు].

మాథు—కో దోషః. ఏవం భవతు. [కో దోసు. ఎవ్వం భోదు.]

సంవా—(ప్రకాశమ్) ఆర్య, అర్ధం త్వయా ముక్తమ్. [అజ్జ, అద్ధే తుఏ ముక్కే]

మాథు—ముక్తమ్. [ముక్కే].

సంవా—(ద్యూతకరం ప్రతి) అర్ధం త్వయాపి ముక్తమ్. [అద్ధే తుఏ వి ముక్కే].

ద్యూత—ముక్తమ్. [ముక్కే].

సంవా—సాంప్రతం గమిష్యామి. [సంపదం గమిశ్శమ్].

మాథు—ప్రయచ్ఛ తం దశసువర్ణం. కుత్ర గచ్ఛసి? [పఅచ్ఛ తం దశసువణ్ణమ్. కహిం గచ్ఛసి?]

సంవా—ప్రేక్షధ్వం ప్రేక్షధ్వం భట్టారకాః. హా, సాంప్రత

---

విడువుము ... అట్లే కానిమ్ము, అర్ధస్య గణ్డం కరోమి - సగమునకు పూఁటకాఁపు నేర్పఱుతును - ప్రమాణము చేయుదును. అర్ధం ... తు - సగము నాకు ఆర్యుఁడు - మేస్త్రి నీవు - విడిచిపెట్టును గాక. కోదోషః - (అందు) తప్పేమున్నది? అట్లే కానిమ్ము.

అర్ధం త్వయా ... - సగము నీచే విడువఁబడినది - (అవును) విడువఁబడినది. సగము నీచే ..., సాంప్రతం గచ్ఛామి = (రెండుసగములు కలసి అంతయుంగదా. కావున అంతయు విడువఁబడినది. కావున ఇఁకను) ఇప్పుడు పోయెదను. ఓయరా ఆపది సువర్ణములను - ఎక్కడికి పోయెదవు?

ప్రేక్షధ్వం ... చూడుఁడు చూడుఁడు దొరలారా. హా - అయ్యో - ఒక సగమునకు పూఁటకాఁపు పెట్టితిని. ఒక సగము విడువఁబడినది. కావున మొత్తమే -

మేవ ఏక స్యార్ధే గణ్డః కృతః, అపర స్యార్ధం ముక్తమ్. త థాపి మా మబలం సాంప్రత మేవ యాచతే. [ పేక్ఖధ పేక్ఖధ భట్టాలఆ. హా, సంపదం జ్జేవ ఏక్కాహ అద్ధే గణ్డే కడే అవలాహ అద్ధే ముక్కే. తవవి మా అబలం శంపదం జ్జేవ మగ్గది ].

మాథు—(గృహీత్వా) ధూర్త, మాథురో ఽహం నిపుణః. అత్ర నాహం ధూర్తయామి. తత్ప్రియచ్ఛ తం లుప్తదణ్డక, సర్వం సువర్ణం సాంప్రతమ్. [ ధుత్తు, మాథురు అహం ణిఉణు, ఏత్థ తుఏ ణ అహం ధుత్తిజ్జామి. తా పఅచ్ఛ తం పేదణ్డఆ, సవ్వం సువణ్ణం సంపదమ్ ].

సంవా—కుతో దాస్యామి? [ కుదో దఇశ్శమ్ ].

మాథు—పితరం విక్రీయ ప్రయచ్ఛ. [ పిదరు విక్కిణిజ్జ పఅచ్ఛ ].

సంవా—కుతో మే పితా. [ కుదో మేపితా ].

మాథు—మాతరం విక్రీయ ప్రయచ్ఛ. [ మాదరు విక్కిణిజ్జ పఅచ్ఛ ]

సంవా—కుతో మే మాతా. [ కుదో మేమాదా ]

మాథు—ఆత్మానం విక్రీయ ప్రయచ్ఛ. [ అప్పాణం విక్కిణిజ్జ పఅచ్ఛ ].

---

రాశియంతయు - విడువఁబడినట్లే కదా. మఱి, తథా అపి - అట్లైనను, నన్ను బలహీనుని - కట్టలేనివానిని - ఇప్పుడే (ఇమ్మని) అడుగుచున్నాఁడు! గృహీత్వా = పట్టుకొని - ధూర్త - మోసగాఁడా, నేను మాథురుఁడనురా, నిపుణుఁడను - నెప్పరిని - నీమాయను కనిపట్టఁగలవాఁడనురా, న ధూర్త్యే - మోసపోనురా, కావున ఇమ్ము, ఆ యోడిన పందెపు సొమ్ము అంతయు ఇప్పుడే, ఆత్మానం విక్రీయ ప్రయచ్ఛ = నిన్ను అమ్ముకొని ఇమ్ము. (అట్లైని) నామీఁద అనుగ్రహింపుము. నన్ను రాజవీథికి నడిపించుకొని పొమ్ము.

సంవా—కురుత ప్రసాదమ్. నయత మాం రాజమార్గమ్. [కలేధ పశావమ్. ణేధ మం లాజమగ్గమ్].

మాథు—ప్రసర. [పసర].

సంవా—ఏవం భవతు. (పరిక్రామతి) ఆర్యాః, క్రీణీధ్వం మా మస్య సభికస్య హస్తా ద్దశభిః సువర్ణకైః. (ఆకాశే దృష్ట్వా) కిం భణత. — 'కిం కరిష్యసి' ఇతి. గేహే తే కర్మకరో భవిష్యామి. కథమ్! అదత్వా ప్రతివచనం గతాః. భవ త్వేవమ్. ఇమ మన్యం భణిష్యామి. (పున స్త దేవ పఠతి) కథమ్, ఏషో ௨పి మా మవ ధీర్య గతః. హా, ఆర్యచారుదత్తస్య విభవే విఘటితే ఏష వర్తే మన్దభాగ్యః.

[ఎవ్వం భోదు అజ్జా, కిణీధ మం ఇమశ్శ శహిఅశ్శ హత్థాదో దశేహిం శువణ్ణకేహిం. కిం భణాధ. 'కిం కలఇశ్శశి' త్తి. గేహే దే కమ్మకలే హువిశ్శమ్. కథమ్. అదఇఅ పడివఅణం గదే. భోదు ఎవ్వం. ఇమం అణ్ణం భణఇస్సమ్. కథమ్. ఏశే వి మం అవధీలిఅ గదే. హా! అజ్జచాలుదత్తస్స విహవే విహడిదే ఏశే పఢామి మన్దభాఏ].

ఆర్యాః - అయ్యలారా, క్రీణధ్వం మాం ... కైః - నన్ను పది సువర్ణములు ఇచ్చి, యీ జూదగాని చేతినుండి కొనుఁడు, దృష్ట్వా ఆకాశే = మింటఁజూచి - ఇది 'ఆకాశభాషిత' మనఁబడును. 'కిం బ్రవీ ష్యేవ మిత్యాది వినాపాత్రం బ్రవీతి యత్। శ్రుత్వే వానుక్త మప్యేక స్తత్ స్యా దాకాశభాషితమ్.' అని లక్షణము. మింటివైపు చూచి, ఏమి చెప్పుచున్నావు అని పాత్రములేకయే పాత్ర మున్నట్లు అడిగి, తరువాత ఏదియో జవాబు వినవచ్చినట్లు అభినయించుచు తానే ఇదియా నీవు చెప్పుట అని విన్నట్లు అనువాదము చేయుట ఆకాశభాషితము - ఇది ఎక్కువమంది వేసములు వేయుటను మాన్పించుటకు నటుల యనుకూలమునకు కల్పింపఁబడినది. సా. ద. 428. ఏమి చెప్పుచున్నారు, కిం ... ష్యసి ఇతి = నీవు ఏమి పనిచేయఁగలవు - అనియా? ఇంట నీకు పనివాఁడనుగా ఉండఁగలను.

మాథు—నను దేహి. [ణం దేహి].

సంవా—కుతో దాస్యామి? [కుదో దఇశ్శమ్] (ఇతి పతతి.

(మాథురః కర్షతి)

సంవా—ఆర్యాః పరిత్రాయధ్వం పరిత్రాయధ్వమ్. [అజ్జా, పలిత్తాఅధ పలిత్తాఅధ]

(తతః ప్రవిశతి దర్దురకః)

దర్దురకః—భోః, ద్యూతం హి నామ పురుష స్యాసింహాసనం రాజ్యమ్.

శ్లో. న గణయతి పరాభవం కుతశ్చి

---

ఎట్లూ! జవాబుచెప్పకే పోయినాఁడు. సరే కానీ ఈ మఱియొకనిని అడిగెదను. కథమ్ - ఎట్లూ! వీఁడును నన్ను లక్ష్యపెట్టక పోయినాఁడు - హా - అయ్యో - చారుదత్తయ్య సంపద నాశనమైనందున, మందభాగ్యుఁడను నేను ఇట్లున్నాను. నను దేహి = ఏరా ఇయ్యరా, కుతః దాస్యామి = ఎందుండి యిత్తును? - అని (పతతి =) నేలంబడును. మాథురః కర్షతి = ... లాగును.

ప్రవిశతి దర్దురకః - దర్దురకుఁడు మఱియొక జూదగాఁడు. ద్యూతం హి నామ - ... జూద మనఁగా ప్రసిద్ధమే గదా - పురుషస్య = పురుషునికి, రాజ్యమ్ = రాజ్యమే - రాజ్యానుండు సకల సుఖభోగములు కలవు అనుట - అసింహాసనం = సింహాసనము లేని - ఒక్క సింహాసనము లేదు గాని ఇంకేమియు తక్కువ లేదు - అనుట.

శ్లో. ౭. నృపతిః ఇవ = రాజువలె, (జూదరియు), కుతశ్చిత్ = ఎందుండియు, ఎవనివలనను, పరాభవం = అవమానమును, తిరస్కారమును, న గణయతి = చింతింపఁడు - రాజు తానే ఎల్లర పరాభవింప సమర్థుఁడు - అది తనకు ఎవనిచేతనైన కలుగునను చింత లేదు, జూదరికిని మానావమానములు తుల్యములగుటచే - వాఁడు అవమానమును లెక్కసేయఁడు - అంతలో జయాన మానము, అంతలో ఓటమి - నవమానము కలుగుటచే వాఁడు దేనింగాని లెక్కసేయఁడు.

ద్ధరతి దదాతి చ నిత్య మర్థజాతమ్
నృపతి రివ నికామ మాయదర్శీ
విభవవతా సముపాస్యతే జనేన. ౭

అపి చ,

శ్లో. ద్రవ్యం లబ్ధం ద్యూతే నైవ దారా మిత్రం ద్యూతే నైవ
దత్తం భుక్తం ద్యూతే నైన సర్వం నష్టం ద్యూతే నైవ. ౮

నిత్యం = ఎల్లప్పుడును, కుతశ్చిత్ = ఎందుండియో, అర్థజాతం = ధనంపు మొత్తమును, హరతి = హరించును, కొనును, దదాతి చ - ఇచ్చును, రాజ్యాన విరామము లేక ఆయమును ఉండును, వ్యయమును ఉండును. జూదానను జయాపజయముల ధనము వచ్చుచుం బోవుచు ఉండును. (నృపతి) నికామం ఆయదర్శీ = మిక్కిలి రాబడిమీఁద నే దృష్టి నుంచును. (జూదము - జూదరి) నికామ మాయదర్శీ = ఎంతయు మాయ - గారడము - గలవారిని చూపును, మాయా నిపుణులను చూపును, విభవవతా = సంపదగల, జనేన = జనులచే, సముపాస్యతే = సేవింపఁబడును - రాజు సామంతులచేత, జూదము ధనవంతులచేత - ఇట్లు రాజునకును జూదరికిని, రాజ్యమునకును జూదమునకును సామ్యము.

ఎందుండియు ఎవనివలనను పరాభవము లెక్క సేయమియు, ఎల్లకాలను ఎంతెంత ధనమునో కొనుటయు ఇచ్చుటయు ఆయమందే దృష్టి యిడుటయు మాయయందే, గారడమందే, దృష్టి యిడుటయు ధనవంతులచే సేవింపఁబడుటయు - ద్యూతమునకును రాజ్యమునకును పోలికలు.

శ్లో. ౮. జూదముననే అన్నియు పొందుటయు, (వచ్చుటయు) పోవుటయు - ద్యూతేన ఏవ = జూదముచేతనే, ద్రవ్యం = ధనము - ఆస్తి, ఎల్ల వస్తువులు - లబ్ధం = పొందఁబడును - ద్యూతేన ఏవ = జూదముచేతనే - దాన కలిగిన ధనముచేతనే, దారాః = భార్యయు, మిత్రం = సావాసగాఁడును - పొందఁబడును అనుట, దత్తం = దానము, భుక్తం = భోగానుభవము, ద్యూతేన ఏవ లబ్ధమ్ - ద్యూతేన ఏవ సర్వం నష్టం = సర్వనాశనము కలుగును -

జూదము ఏమేమి సాధింపదు, ఏమేమి కొలుపుచ్చదు! ధనము ఆస్తి అన్నియు జూదాన వచ్చును. ధనముతో భార్యయు, మిత్రులును వత్తురు. దానము ఇచ్చుట భోజనము భోగము అనుభవించుట ఆజూదానవచ్చిన ధనముతోనే - అది

అపి చ,

శ్లో. త్రేతాహృతసర్వస్వః పావరపతనాచ్చ శోషితశరీరః
నర్దితదర్శితమార్గః కటేన వినిపాతితో యామి. ౯

(అగ్రతో ఽవలోక్య) అయ మస్మాకం పూర్వసభికో మాథుర ఇత ఏ వాభివర్తతే. భవతు. అపక్రమితుమిమం న శక్యతే. త

తుదముట్ట నాశనమగుటయు జూదాననే. దారనాశము అనఁగా భార్యపై అనురాగము అపేక్ష తొలఁగును ఉపేక్ష కలుగును. మిత్రుఁడును స్నేహము చూపక ఉదాసీనుఁ డగును.

శ్లో. ౯. త్రేత-అనియు, పావర-అనియు, నర్దిత-అనియు, కట-అనియు-జూదమున పాచికల 'పాటులకు' పేళ్ళు. అవి తనకు పడిన జయమును ఎదిరికి అపజయమును కూర్చునవి. ఈ దర్దురకునికి అవి యన్నియు తనకు ప్రతికూలము గాను, ఎదిరికి అనుకూలముగాను పడుటచే, జూదాన, ఒండు మురాలో, సర్వము పోఁగొట్టుకొన్నవాఁడై ఇటు వచ్చుచున్నాఁడు. ఒకప్పుడు ఈ మేస్త్రికిని పరిచితుఁడు.-తనకు కలిగిన గతిని చెప్పుకొనుచున్నాఁడు.-త్రేతా హృత సర్వస్వః= (పాచికల) త్రేత యను పాటు (ఎదిరికి అనుకూలించుట) చేత, నాసమస్తమును కోలుపోయినవాఁడనై, పావర-పతనాత్ చ-'పావర' అను (పాచికల) పాటుచే (అదియు ఎదిరికి అనుకూలించుటచే) శోషితశరీరః=మాటిమాటికైన నష్టమే కలిగించిన చిత్తక్షోభచే, ఎండిన-మాడిన-దేహముగలవాఁడనై, నర్దిత దర్శిత మార్గః=నర్దితము (అను పాచికల పాటు)చే, దారి చూపఁబడిన వాఁడనై-పోరా, ఇటనుండి వెడలి అని చెప్పఁబడినవాఁడనై-కటేన=కటము (అను పాచికల పాటు)చే, వినిపాతిత=సర్వనాశము చెందినవాఁడనై, యామి= పోవుచున్నాను.

జూదాన సింహాసన మొక్కటి మాత్రములేని రాజ్యము పొందఁ దగినను, నేను త్రేతయు పావరమును నర్దితమును కటమును-అన్నియు ఎదిరికే అనుకూలముగా పడఁగా-నాసర్వము పోఁగొట్టుకొని, కృశించి, ఇటువెడలి పోరా అని తఱుమఁగొట్టఁబడినవాఁడనై, సర్వనాశనముం బొంది పోవుచున్నాను.

అగ్రతః అవలోక్య-ఎదురుగా చూచి-అయం ... = వీఁడుగో మా మును పటి జూదపుమేస్త్రి; మాథురుఁడు ఇటే వచ్చుచున్నాఁడు. అపక్రమితుం ... =

దవగుణ్ఠయా మ్యాత్మానమ్. [ బహువిధం నాట్యం కృత్వా స్థితః. ఉత్తరీయం నిరీక్ష్య ]

శ్లో. అయం పటః సూత్రదరిద్రతాం గతో
హ్యాయం పట శ్ఛిద్రశతై రలంకృతః
అయం పటః ప్రావరితుం న శక్యతే
హ్యాయం పటః సంవృత ఏవ శోభతే. ౧౦

అథవా కి మయం తపస్వీ కరిష్యతి. యో హి

శ్లో. పాదే నైకేన గగనే ద్వితీయేన చ భూతలే
తిష్ఠా మ్యుల్లమ్బిత స్తావ ద్యావ త్తిష్ఠతి భాస్కరః. ౧౧

(అగపడకుండ) తొలఁగి పోవ శక్యముగాదు - (వీనితో నాకు పాత తగాదా ఉన్నది. పట్టుకొనునేమో - అని, కాదా నేను పలుమాఱు జూదాన భగ్నుఁడను. నాకు వీని దర్శనమేల అని ... (కావున) నన్ను ముసుకువైచి కప్పుకొందును - (ఉత్తరీయమును కప్పుకొని, పలువిధముల - పోఁబోయినట్లు కాళ్ళకు అడ్డములు తగిలినట్లు నటన మభినయించి నిలంబడినాఁడు. ఉత్తరీయమును చూచి).

శ్లో. ౧౦. అయం పటః = ఈబట్ట, సూత్రదరిద్రతాం గతః = నూలు పోగులే లేని దయినది; అయం హి పటః = ఈబట్టయే, ఛిద్రశతైః = నూర్ల బొక్కలతో, అలఙ్కృతః = అలంకరింపఁబడియున్నది, అయం ... తే = ఈ బట్ట, కప్పుటకు, నన్ను అగపడనీకుండుటకు, చాలదు, (శక్తముగాదు), అయం హి పటః ... తే = ఈబట్ట మూయఁబడియే, విప్పక మడువఁబడియే, అందముగా నుండును - రాణించును,

అథవా కిం అయం తపస్వీ కరిష్యతి - కాకున్న, దానిలోనే అట్లైనను కప్పుకొనక, పాపము ఈదీనుఁడు అనఁగా తానే ఏమి సేయఁగలఁడు? యతః (అహం) హి - ఏ నేను -

శ్లో. ౧౧. భాస్కరః యావత్ తిష్ఠతి = సూర్యుఁడు (పొడిచి అస్త మింపక) ఉండు నంతవరకు - పగటి వెలుతు రుండునంతవఱకు, గగనే ఏకేన పాదేన = మింట నొక్కపాదముతోను, భూతలే = మంట, ద్వితీయేన = రెండవ పాదముతోను, ఉల్లమ్బితః తావత్ = నేలను పట్టుకొని పైకిఁవ్రేలు వానివలె, తిష్ఠామి = ఉన్నాఁడను, మొగ్గవాలినట్లు.

మాథు—దాపయ దాపయ. [దాపయ దాపయ].

సంవా—కుతో దాస్యామి. [కుదో దఇశ్శమ్].

(మాథురః కర్షతి)

దర్దు—అయే, కి మేత దగ్రతః (ఆకాశే) కిం భవా నాహ- 'అయం ద్యూతకరః సభికేన ఖలీక్రియతే, న కశ్చి న్మోచయతి' ఇతి. న న్వయం దర్దురో మోచయతి (ఉపసృత్య) అన్తర మన్త రమ్ (దృష్ట్వా) అయే, కథం మాథురో ధూర్తః, అయ మపి తపస్వీ సంవాహకః.

పగలంతయు క్షణము వేసరక యల్లాడుటవలన, నిముసమైన రెండుపాద ములు ఒక్కచోట పెట్టియుండుటకు శక్తుఁడను గాక ఉన్నాను. ఇట్లు అంతయు పోఁగొట్టుకొని దేశ మంతట నల్లాడుచుండు నాకు ఎవనివలన భయము? (అనఁగా ఈసభికుఁ డేమి సేయఁజాలును?)

దాపయ = ఇప్పింపుము, పది సువర్ణాలకు అమ్ముడుపోయి ఎవనిచేతనైనను - అనుట.

అయే కిం ఏతత్ అగ్రతః? - ఓహో ఏమి ఇది యెదురుగా? ఆకాశే - మింట - మరల ఈదర్దురకుఁడు 'ఆకాశభాషితమును' జరుపుచున్నాఁడు, అర్థో పక్షేపముగా, సంగతి ఎఱుంగనిచ్చుటకై, పాత్రము లేకయే, కిం భవాన్ ... = ఏమంటివి, నీవు? ఈ జూదగాఁడు జూదపుమేస్త్రిచేత బాధపెట్టఁబడుచున్నాఁడు. ఎవఁడును విడిపింపకున్నాఁడు అనియా? నను అయం ... = ఓరి, వీఁడుగో దర్దు రుఁడు విడిపించును. అన్తరం అన్తరం - జనులు క్రిక్కిరిసి యుండఁగా, అను చున్నాఁడు - సందు సందు, దారి దారి - ఇవి జనసమ్మర్దమున చెప్పు మాటలు. దృష్ట్వా - చూచి - అయే - ఓహో, కథం! = ఎట్టూ! మాథురో ధూర్తః = మాథు రుఁడు వంచకుఁడు, పోకిరి; అయం అపి తపస్వీ = ఈదీనుఁడును, వానిచేత చిక్కి యున్నవాఁడు, పాపము, సంవాహకః - ఒళ్ళుపిసికేవాఁడు. [జూదరియైనను జూదరుల మాయలు మోసములు నేర్చినవాఁడు కాఁ డనుట].

శ్లో. యః స్తబ్ధం దివసాన్త మానతశిరా
నాస్తే సముల్లమ్బితో
య స్యోద్ఘర్షణలోష్టకై రపి సదా
పృష్ఠే న జాతః కిణః
త స్యైత చ్చ న కుక్కురై రహరహ
ర్జఙ్ఘాన్తరం చర్వ్యతే
త స్యాత్యాయత కోమలస్య సతతం
ద్యూతప్రసఙ్గేన కిమ్? ౧౨

శ్లో. ౧౨. ఇందు అంతయు విపరీతలక్షణగా చెప్పఁబడుచున్నది - యః = ఎవఁడు, స్తబ్ధః = కదలక మొద్దువాఱినవాఁడై, దివసాన్తం = దినము ముగియుట - మరల ప్రొద్దుపొడుచువఱకు, ఆనతశిరాః = వంగిన తల గలవాఁడై, సముల్లమ్బితః = (చెట్టుకొమ్మంబోని దాన) ప్రేలాడుచున్నవాఁడుగా - నాస్తే - ఉండలేదో! అనఁగా ఎప్పుడును అట్లున్నాఁడు అనుట, యస్య = ఎవనికి, సదా, ఉద్ఘర్షణ లోష్టకైః అపి = (దురదకు) ఎల్లప్పుడు మిక్కిలిగా ఒరయికకైన మంటిపెళ్ళలచేతనైనను, పృష్ఠే = వీపున. కిణః - కాయ, న జాతః = కాయలేదో, కలుగలేదో! అనఁగా వీపంతయు అట్టికాయలే - అనుట, యస్య = ఎవనికి, అహరహః = ప్రత్యహము - ప్రతిదినమును, జఙ్ఘాన్తరం = పిక్కలసందు, కుక్కురైః = కుక్కలచేత, న చర్వ్యతే = నమలఁబడలేదో! - నమలఁబడుచునే యున్నదో - అనుట, అత్యాయత కోమలస్య = వ్యాయామములేని - శ్రమ యెఱుఁగని ఈ సుకుమారునికి, అనఁగా సుకుమారుఁడుకాని మోటుమానిసికి - శ్రమపడియే జీవించిన యొళ్ళు పిసుకువానికి అనుట, సతతం = ఎప్పుడును, ద్యూతప్రసఙ్గేన కిం = జూదముమీఁది యాస - జూదముజోలియేల?

'ఇది యొకసామాన్యోక్తి.' వే. వేం. జూదమాడ నిట్టివాఁ డర్హుఁడగునా? మఱి అట్టివాఁడుకానివాఁడు అర్హుఁడగుంగాని. అని.

సంవాహకుఁడు వీఁడు, సతత పరిశ్రాంతుఁడు, కాయలవీపువాఁడు - పరుషగాత్రుఁడు వీనికి జూద మేల? జూదము విభవశాలియు ఏచింతయు లేని

భవతు. మాథురం తావ త్సాన్త్వయామి. (ఉపగమ్య) మాథుర, అభివాదయే.

(మాథురః ప్రత్యభివాదయతే)

దర్దు—కి మేతత్

మాథు—అయం దశసువర్ణం ధారయతి. [అఅం దశసువణ్ణం ధాలేవి].

దర్దు—నను కల్యవర్త మేతత్

మాథు—(దర్దురస్య కక్షుతల లుణ్ఠీకృతం పట మాకృష్య) భర్తారః, పశ్యత, పశ్యత, జర్జరపటప్రావృతో ఽయం పురుషో దశసువర్ణం కల్యవర్తం భణతి. [భట్టా, పశ్శత పశ్శత. జజ్జర పడప్పావుదో అఅం పులిసో దశసువణ్ణం కల్లవత్తం భణాది.]

దర్దు—అరే మూర్ఖ, న న్వహం దశసువర్ణా న్కటకరణేన

వాఁడును, దేహశ్రమ వాడుక పడనివాఁడును - అనఁగా గర్భేశ్వరుంబోనివాఁడును వినవానికి ప్రొద్దు పుచ్చను వినోదమైనది. అట్టిది అది. మఱి యిట్టివానికి దానిజోలి యేల?

భవతు - కానీ, మాథురం తావత్ సాన్త్వయామి - మాథురునే మంచి మాటలతో ప్రసన్నుం జేసెదను. కిం ఏతత్ = ఏమి ఇది? ధారయతి = బాకీపడి యున్నాఁడు, ననుకల్యవర్తం ఏతత్ = ఓయి, ఇది చద్దియన్నము (పాటియే) కదా - దానికి ఇంత చేయవలయునా అనుట.

కక్షుతల లుణ్ఠీకృతం = సంకలో చింపిగా దోపుకొనియున్న, పటం ఆకృష్య = బట్టను లాగి, భర్తారః = దొరలారా, పశ్యత - చూడుఁడు - జర్జర పట ప్రావృతః - ఈచింపి గుడ్డను కప్పుకొనియున్న వీఁడు పది బంగారునాణెము లను (ఒక పూట) చద్దికూడు అనుచున్నాఁడు! అరే మూర్ఖ = ఓరి తెలివిలేని వాఁడా, గుడ్డ చింపిది అని చూపి నా ధనహీనతం జెప్పెదవు! నను - చూడరా - కట కరణేన = (పాచికలను) కట(క)మును పాటున దొర్లించి, దాన గెలిచి, పది

ప్రయచ్ఛామి. తత్కిం యస్యాస్తి ధనం స కిం క్రోడే కృత్వా దర్శయతి. అరే

శ్లో. దుర్వర్ణో ఽసి వినష్టో ఽసి దశస్వర్ణస్య కారణాత్
పఞ్చేన్ద్రియ సమాయుక్తో నరో వ్యాపాద్యతే త్వయా. ౧౩

మాథుః—భర్తః, తవ దశసువర్ణః కల్యవర్తః. మమైష విభవః. [భట్టా, తువ దశసువణ్ణు కల్లవత్తు. మమ ఏసు విహవు].

దర్దుః—యద్యేవమ్, శ్రూయతామ్ తర్హి. అన్యాం స్తావద్దశ సువర్ణాన స్మైవ ప్రయచ్ఛ. అయమపి ద్యూతం శీలయతు.

---

సువర్ణములను ఇచ్చెదనురా - (ఏమనుకొంటివో!) యస్య అస్తి ... దర్శయతి - డబ్బుగలవాడు ఒళ్ళోనం బెట్టుకొని చూపునా ఏమి? ఎవనికి వీడు బాకీయో వానితోడనే నేను ఆడి, కటము వేసి, వానిని పది దీనారములు గెలిచి అప్పు తీర్చెదను చూడరా అనుట. అరే - ఓరి.

శ్లో. ౧౩. దశ స్వర్ణస్య కారణాత్ = పది దీనారాల - బంగారు (నాణెము)ల - కారణమువలన, దుర్వర్ణః అసి = (కోపాన) వర్ణము చెడితివి - నల్లబడితివి, వినష్టః అసి = వినాశమైతివి - నాశనముపొందినవానివలె ఐతివి, పఞ్చేంద్రియసమాయుక్తః = నీవలెనే ఐదింద్రియములుగల, నరః = (నీబోటి) మానిసి, త్వయా వ్యాపాద్యతే = నీచే చంపఁబడుచున్నవాఁడు, (పాపము!) ... మానిసిని చంపుచున్నావు - అనుట,

పదిదీనారముల మాత్రకు నీవు వన్నెయే మాసిపోయితివే! సర్వనాశనమైతివే! అన్ని యింద్రియములు ఆడుచున్నవానినే నీతోడిమానిసిని చంపుచున్నావు! (పిల్లియు ఎలుకను, పులియుం జింకను చంపును కాని పిల్లి పిల్లిని పులి పులిని చంపునా?) పదింటికై ఐదు - గలవానిని అనియు చమత్కారము.

భర్తః = దొరా - హేళనముగా పొడుపుగా పలుకుట - తవ ... = నీకు పదిదీనారములు సద్దికూడు - అదే నాకు సంపద, సామ్రాజ్యము.

యది ఏవం ... = అట్లైని, అప్పటికి విను - వేఱు పది దీనారములను వీనికే ఇమ్ము, వీఁడును, ద్యూతమ్ శీలయతు = జూదమారంభించి ఆడునుగాక - వీనిని

మాథు—తత్కిం భవతు. [తక్కిం భోదు].

దర్దు—యది జేష్యతి తదా దాస్యతి.

మాథు—అథ న జయతి. [అహ ణ జుణాది].

దర్దు—తదా న దాస్యతి.

మాథు—అథ న యుక్తమ్ జల్పితుమ్. ఏవ మాచక్షాణ త్వాం ప్రయచ్ఛ ధూర్తక. అహ మపి నామ మాథురో ధూర్తో ద్యూతం మిథ్యా ఆదర్శయామి? అన్యస్మా ద ప్యహం న బిభేమి. ధూర్త ఖణ్డితవృత్తో ఽసి త్వమ్. [అహ ణ జుత్తమ్ జప్పిదుమ్. ఎవ్వం అక్ఖన్తో తుమం పయచ్ఛ ధుత్తఅ. అహం పి ణామ మాథురు ధుత్తు జూదం మిథ్యా ఆదంసఆమి? అణ్ణస్స వి అహం ణ బిభేమి. ధుత్తా, ఖణ్డిఅవుత్తో ఽసి తుమమ్]

దర్దు—అరే, కః ఖణ్డితవృత్తః?

ఆడనిమ్ము, అనుట. తత్ కిం భవతు = దాన ఏమగును? యది జేష్యతి ...తి = గెలుచునేని అప్పుడు ఇచ్చును (క్రొత్త ప్రాత అంతయు అనుట), అథ న జేష్యతి? = గెలువఁడు అంతట? తదా న దాస్యతి = అప్పుడు ఇయ్యఁడు.

అథ న యుక్తం జల్పితుం = ఇఁక వదరుట సరిగాదు, ఏవం ఆచక్షాణః ... = ఇట్లు చెప్పుచున్నవాఁడవు, నీవు ఈయరా, మోసగాఁడా, నన్ను నీవు మాటలలో మోసము చేయఁ జూచుచున్నావు! అహం మాథురః ధూర్తః ... అపినామ దర్శయామి? = నేను మాథురుఁడను, జూదపు మోసగాఁడను - సభికుఁడను - గా ఉండి, జూదము కట్టి యబద్ధము, అసత్యము అని - చూపింతునా? నిరూపణము చేయుదునా? కాదా, వృథాగా ఆడుదునా? అన్యస్మాత్ అపి న బిభేమి = నేను ఎవనివలనను భయపడను, ఖణ్డితవృత్తః అసి త్వమ్ = చెడ్డ నడువడి కలవాఁడవు, ఖలుఁడవు నీవు, జూదపు ధర్మమును న్యాయమును తప్పఁ జూచుచున్నావు.

అరే కః ..= ఓరి, ఎవఁడురా ఖండితవృత్తుఁడు? నీవు కదట్రా?

మాథు—త్వం ఖలు ఖణ్డితవృత్తః. [తుమం హు ఖణ్డిఆవుత్తో].

దర్దు—పితా తే ఖణ్డితవృత్తః.

(సంవాహక స్యాపక్రమితుం సంజ్ఞాం దదాతి.

మాథు—వేశ్యాపుత్ర, ఏవ మేవ ద్యూతం త్వయా సేవితమ్. [గోసావిఆపుత్తా, ఏవ్వం జ్జేవ జూదం తుఏ సేవిదమ్].

దర్దు—మ యైవం ద్యూత మాసేవితమ్.

మాథు—అరే సంవాహక, ప్రయచ్ఛ త ద్దశసువర్ణమ్. [అలే సంవాహఆ పఅచ్ఛ తం దశసువణ్ణమ్].

సంవా—అద్య దాస్యామి, తావ ద్దాస్యామి. [అజ్జ దఇశ్శమ్. దావ దఇశ్శమ్].

(మాథురః కర్షతి)

దర్దు—మూర్ఖ, పరోక్షే ఖలీకర్తుం శక్యతే, న మ మాగ్రతః ఖలీకర్తుమ్.

(మాథురః సంవాహక మాకృష్య ఘోణాయాం

---

పితా ... = నీ అబ్బరా, ఖండితవృత్తుఁడు, అని - సంవాహకస్య అపక్రమితుం సంజ్ఞాం దదాతి - సంవాహకునికి పాఱిపొమ్మని సన్న చేయును, వేశ్యాపుత్ర = ఓరి తొత్తుకొడుకా, ఏవం ఏవ ... = నీచేత ఇట్లే సేవింపఁబడిన దట్రా - జూదము? ... ఏవం ... = ఇట్లే పరహింస లేకుండ - అనుట, అరే ... = ఓరిసంవాహక, ఈరా ఆపది దీనా(- బంగా -)రాలను, ఇప్పుడు ఇత్తును, ఎట్లో ఒకయట్లు ఇత్తును లే - మూఖుఁ, పరోక్షే ... = ఓరి మూర్ఖుఁడా నామఱుఁగున బాధింప శఖ్యమగును, నాయెదుర కాదు.

సంవాహకం ఆకృష్య ... = లాగి ముక్కుమీఁద పిడికిటం గ్రుద్దును, సంవాహకుఁడు నెత్తురు వఱ్ఱోడ్డుడు, మూర్ఛను నటించుచు నేలం బడును, దర్దుర

ముష్టిప్రహారం దదాతి. సంవాహకః సశోణితం మూర్ఛాం నాటయన్ భూమౌ పతతి. దర్దురక ఉపసృత్యాన్తరయతి. మాథురో దర్దురం తాడయతి. దర్దురో విప్రతీపం తాడయతి)

మాథు—అరే అరే దుష్ట పుంశ్చలీపుత్త్రక, ఫల మపి ప్రాప్స్యసి. [అలే అలే దుట్టఘిణ్ణాలిఆపుత్తఅ, ఫలం పి పావిహసి].

దర్దు—అరే మూర్ఖ, అహం త్వయా మార్గగత ఏవ తాడితః. శ్వో యది రాజకులే తాడయిష్యసి, తదా ద్రక్ష్యసి.

మాథు—ఏష ప్రేక్షిష్యే. [ఏసు పేక్ఖిస్సమ్].

దర్దు—కథం ద్రక్ష్యసి?

మాథు—(ప్రసార్య చక్షుసీ) ఏవం ప్రేక్షిష్యే. [ఏసు పేక్ఖిస్సమ్].

(దర్దురో మాథురస్య పాంశునా చక్షుషీ పూరయిత్వా సంవాహక స్యాపక్రమితుం సంజ్ఞాం దదాతి. మాథురో ఽక్షిణీ నిగృహ్య భూమౌ పతతి. సంవాహకో ఽపక్రామతి)

కుఁడు సమీపించి, నడుమసొచ్చి వానికి అడ్డపడును. మాథురుఁడు దర్దురకుం గొట్టును, దర్దురకుఁడు - విప్రతీపం తాడయతి - ఆదెబ్బ తనకు తగులనీయకయే తా వానిం గొట్టును. దుష్ట పుంశ్చలీపుత్ర ... = దుష్టుఁడా, ఱంకుటాలి(= లంజా) కొడుకా, ఫలం అపి ప్రాప్స్యసి = నన్ను కొట్టిన ఫలమును పొందుదువులేరా. (వ్యాజ్యము వేసి రాజదండము గూర్తునురో.) ఏష ప్రేక్షిష్యే = ఇదిగో చూతును గా.

కథం ... = ఎట్లూ! చూతువా! కొట్టించుటచే - తప్పక ఫలము కుడుతువు అనుట. దానిని - ఎట్లు చూతువు? ప్రకారప్రశ్నగా హేళనార్థము గొని 'ఇట్లు' అని కన్నులు విప్పారఁ జూచుట. ప్రసార్య చక్షుషీ - కన్నులు విప్పార తెఱచి, ఏవం ప్రేక్షిష్యే = ఇట్లు చూడఁగలను - (హేళనగర్భముగా పలుకుట), దర్దుర కుఁడు దుమ్ముతో మాథురుకన్నులు నింపి సంవాహకునికి పాఱిపో సన్న చేయును,

దర్దు—(స్వగతమ్) ప్రధానసభికో మాథురో మయా విరోధితః, తన్నాత్ర యుజ్యతే స్థాతుమ్. కథితం చ మమ ప్రియవయస్యేన శర్విలకేన యథా కిల — 'ఆర్యకనామా గోపాలదారకః సిద్ధాదేశేన సమాదిష్టో రాజా భవిష్యతి.' ఇతి. సర్వశ్చాస్మద్విధో జన స్త మనుసరతి. త దహ మపి తత్సమీప మేవ గచ్ఛామి.

(ఇతి నిష్క్రాన్తః.)

సంవా—(సత్రాసం పరిక్రమ్య దృష్ట్వా) ఏత త్కస్యాప్య నపావృత పక్షద్వారకం గేహమ్. త దత్ర ప్రవిశామి. ఆర్యే,

నిగృహ్య - నిగూహ్య - అనియు పాఠము - కన్నులు సమాళించుకొనను మూసి కొని - చేతులతో మూసికొని - నేలం బడును. సంవాహకుఁడు పరారియగును, నేలం బడుట అవశత చేతను, దర్దురకుని చూపులు తప్పపట్టుదురుగాక - అనియు.

ప్రధానసభికః - జూదపుమేస్త్రీలలోను ప్రధానుఁడైనవాఁడు - మాథురః, విరోధితః = పగగొల్పఁబడినాఁడు. (వాఁడు రాజవల్లభుఁడు. కనుక నాకు బెడద వచ్చును, ఎవరైనను రాజపురుషులు - పోలీసులు నన్ను పట్టుకొందురు.) తత్ న అత్ర యుజ్యతే స్థాతుం = ఇక్కడ ఇఁక నుండఁగూడదు. కథితంచ ... = చెప్పినాఁడులే, నాప్రియవయస్యుఁడు, శర్విలకుఁడు. యథా కిల - ఏమన్నట్లు అనఁగా - ఆర్యకుఁడు అను పేరుగలవాఁడు ఒక గొల్ల పిల్లవాఁడు, సిద్ధుని - భూత భవిష్యత్తులు ఎఱుఁగు మహిమ పొందిన యొక్కని యాదేశము - ఉపదేశము - పలుకు - చేత చెప్పఁబడినాఁడు, రాజు కాఁగలఁడని. (కావున) సర్వశ్చ ... = మాబోఁటి జను లందఱు వానిని అనుసరించుచున్నారు అని. కావున నేనును అతనికడకే పోయెదను - అని నిష్క్రమించినాఁడు - రంగమునుండి పోయినాఁడు. శర్విలకుఁడు ఒక బ్రాహ్మణుఁడు, దొంగతనము - వృత్తిగా - జీవనోపాయముగాఁ గొన్నవాఁడు - చారుదత్తుయింట కన్నము వేయుచు మూఁడవయంకమున అగపడఁగలఁడు. వాఁడు ఈజూదాన చెడిన దర్దురకునికి తోడఁట - సదృశముగానే ఉన్నది.

సంవాహకుఁడు - సత్రాసం పరిక్రమ్య = భయముతో పరిక్రమించి - ఎక్కడికో పోవు నభినయముగా రంగాన నడిచి - అనపావృత పక్షద్వారకం = తెఱవఁ

శరణాగతో ఽస్మి. [ఏశే కశ్శవి అణపావుద పక్ఖదుయాలకే గుహే. తా ఏత్థ పవిశిశ్శమ్.] (ప్రవేశం రూపయిత్వా వసన్తసేనా మవలోక్య) [అజ్జే, శలణాగదే హ్మి.]

వసన్త—అభయం శరణాగతస్య. చేటి, పిధేహి పక్షద్వారకమ్. [అభఅం సరణాగదస్స. హఞ్జే, ఢక్కేహి పక్ఖదుఆరఅమ్].

(చేటీ తథా కరోతి)

వసన్త—కుత స్తే భయమ్. [కుదో దే భఅమ్].

సంవా—ఆర్యే, ధనికాత్. [అజ్జే, ధణికాదో].

వసన్త—చేటి, సాంప్రత మపావృణు పక్షద్వారకమ్. [హఞ్జే, సంపదం అవావుణు పక్ఖదుఆరఅమ్].

సంవా—(ఆత్మగతమ్) కథం ధనికా త్తులిత మస్యా భయకారణమ్. సుష్ఠు ఖ ల్వేవ ముచ్యతే. [కధం ధణికాదో తులిదం శే భఅకాలణమ్. శుట్ఠు క్ఖు ఏవం వుచ్చది].

బడిన దిడ్డి వాకిలి గలది. తత్ అత్ర ప్రవిశామి = కావున ఇందు ప్రవేశింతును. రూపయిత్వా = నటించి, వసన్తసేనాం అవలోక్య = వసంతసేనం జూచి - ఆర్యే - అమ్మా, శరణాగతః అస్మి = నేను రక్షణకోరు వాఁడను - అని పలికెను. అభయం = ఇదె రక్షణ - భయ మక్కఱలేదు - అనుట. ఓసి చేటి, దిడ్డితలుపు మూయవే. కుతః తే భయమ్ = ఎవనివలన నీకు భయము? ధనికాత్ = (ఒక) ధనవంతునివలన. అట్లు అనఁగానే, తాను భాగ్యవతి, ఎంత ధనమేనియు ఇచ్చి అధమర్ణుని ఉత్తమర్ణునిం గూడ తృప్తిపఱుపఁజాలుటచే - 'సాంప్రతం అపావృణు ... = ఇప్పుడు తెఱవుము ... కథం = ఏమీ! ధనికాత్ అనఁగానే భయకారణము 'ఇంతేనా' అన్నట్లు (తులితం = చులకన చేయఁబడినది, లక్ష్యము లేక పోయినది; తీఱిపోయినది; సుష్ఠు ఖలు ఏవం ఉచ్యతే - ఇట్లు చెప్పఁబడుట లెస్సయే గదా - ఎట్లనఁగా.

శ్లో. య ఆత్మబలం జ్ఞాత్వా భారం తులితం వహతి మనుష్యః
తస్య స్ఖలనం న జాయతే న చ కాన్తారగతో విపద్యతే. ౧౪

[ జే అత్తబలం జాణిఅ భాలం తులిదం వహేహి మాణుస్సే
తాహ ఖలణం ణ జాయది ణ అ కాన్తాలగదో వివజ్జది ].

అత్ర లక్షితో ఽస్మి. [ ఏత్థ లక్ఖిదహ్మి ].

మాథు—( అక్షిణీం ప్రమృజ్య ద్యూతకరం ప్రతి ) అరే, దేహి దేహి. [ అలే దేహి దేహి ].

ద్యూత—భర్తః, యావ దేవ వయం దర్దురేణ కలహాయితా స్తావ దేవ స పురుషో ఽపక్రాన్తః. [ భట్టా, జావ దేవ అహ్మే దద్దురేణ కలహాయిదా తావ దేవ సో గోహో అవక్కన్తో ].

---

శ్లో. ౧౪. యః మనుష్యః = ఏమానిసి, ఆత్మబలం జ్ఞాత్వా = తన బలమును - శక్తిని - ఎఱిఁగి, భారం = బరువును, తులితం = తాను లగువు అని చూచుకొని, మోయఁగలను అని యనుకొన్నదానిని, వహతి = మోయునో, తస్య = వానికి, స్ఖలనం = తడబాటు, న జాయతే = కలుగదు. (వాఁడు) కాన్తారగతః అపి = ఇలుకు పేరడవిని - చెడ్డరస్తా కాని - చెందినవాఁడైనను, న విపద్యతే = విపత్తును - ఆపదం - బొరయఁడు.

తన బలము ఎఱిఁగి, తాను చాలుదును అని బరువు ఎత్తుకొనువానికి ఎందును అపాయ ముండదు. ఈమె నన్ను తాఁ గాపాడఁగల నను నమ్మికచే - తలుపు తెఱపించినది.

అత్ర లక్షితః అస్మి = ఇక్కడ ఈశ్లోకార్థము తార్కాణపఱచు కొంటిని. లక్షితవాఁ డనుట. ప్రమృజ్య = తుడుచుకొని, ద్యూతకరంప్రతి = జూదగానిం గూర్చి - సంవాహకుఁడు ఎదుటనున్నాఁ డనుకొని - ఓరి ఇయ్యరా, ఇయ్యరా. అన్నాఁడు - మఱియొకఁడు - అనఁగా ఎవనికి సంవాహకుఁడు ఓడి బాకీపడినాఁడో - వాఁడు - కలహాయితాః = జగడము పెట్టుకొన్నవారమైతిమో, తావత్ = అప్పుడు - ఆసందున.

మాథు—తస్య ద్యూతకరస్య ముష్టిప్రహారేణ నాసికా భగ్నాసీత్. తదేహి, రుధిరపథ మనుసరావః. [తస్స జూదకలస్స ముట్ఠిప్పహారేణ ణాసికా భగ్గా ఆసి. తా ఏహి. రుహిరపహం అణుసరేమ్హ].

(అనుసృత్య)

ద్యూత—భర్తః, వసన్తసేనాగృహం ప్రవిష్టః సః. [భట్టా, వసన్తసేణాగేహం పవిట్ఠో సో].

మాథు—భూతాని సువర్ణాని. [భదాఇం సువణ్ణాఇం].

ద్యూత—రాజకులం గత్వా నివేదయావః, [లాఅఉలం గదుఅ ణివేదేమ్హ].

మాథు—ఏష ధూర్తో ఇతో నిష్క్రమ్యాన్యత్ర గమిష్యతి. తదుపరోధే నైవ గృహ్ణీవః. [ఏసో ధుత్తో అదో ణిక్కమిఅ అణ్ణత్త గమిస్సది. తా ఉఅరోధే ణేవ్వ గేణ్హేమ్హ].

భగ్నా ఆసీత్ = పగిలినది ఆయెను. రుధిరపథం = నెత్తుటిజాడ.

వసన్తసేనాగృహం = వసంతసేనయింట; ఉన్నాఁడు కదా అక్కడ - కావున - అనుట - భూతాని సువర్ణాని = (ఇఁక) దీనారములు దొరకినవే పో. - నిజములే, మనవు వచ్చినవే! - అనుట - కాదా - పోయినవే పో అని యేని. ఎట్లనుకొనియో - రాజునింటికి - కచ్చేరికి - పోయి, (వ్యాజ్యము) ఎఱుక పఱతుము వేయుదము - రా - అని తోడి జూదగాఁడు అనుచున్నాఁడు. మైత్రియభిప్రాయము అది కాదు. అనుచున్నాఁడు - ఏష ధూర్తః ... = వీఁడు మోసగాఁడు, (మనము కచ్చేరికి తరలుదుమేని) (వాఁడు) ఇందుండి బయలు వెడలి మఱి యెక్కడికేని పోఁగలఁడు. వానిని పోనీక అడ్డగించియే - ... బాధించియే - కొనుదము. ఇక్కడ ఇట్లుండ, అక్కడ వసంతసేన యింటిలో -

(వసన్తసేనా మదనికాయాః సంజ్ఞాం దదాతి)

మద—కుత ఆర్యః? కో వార్యః? కస్య వార్యః? కాం వా వృత్తి మార్య ఉపజీవతి? కుతో వా భయమ్? [కుదో అజ్జో. కో వా అజ్జో, కస్స వా అజ్జో. కిం వా విత్తిం అజ్జో ఉవజీవది. కుదో వా భఅమ్?]

సంవా—శృణో త్వార్యా. ఆర్యే, పాటలిపుత్త్రం మే జన్మభూమిః. గృహపతి దారకో ఽహమ్. సంవాహకస్య వృత్తి ముపజీవామి. [శుణాదు అజ్జఆ. అజ్జఏ, పాడలిఉత్తే మే జమ్మభూమీ, గహావఇదాలకే హగే. సంవాహఅశ్శ విత్తిం ఉపజీఆమి.]

వసన్త—సుకుమారా ఖలు కలా శిక్షి తార్యేణ. [సుఉమారా క్ఖు కలా సిక్ఖిదా అజ్జేణ].

సంవా—ఆర్యే, క లేతి శిక్షితా, ఆజీవి కేదానీం సంవృత్తా. [అజ్జఏ, క లేతి శిక్ఖిదా, ఆజీవిఆ దాణిం సంవుత్తా].

---

మదనికాయాః సంజ్ఞాం ... = మదనికకు సన్న చేయును - వానిని అడిగి వివరము కనుఁగొమ్మని. కుతః ... భయమ్? - ప్రశ్నపరంపర. - అయ్య ఎక్కడి వాఁడు? (అయ్యది ఏయూరు అనుట), అయ్య ఎవరు? ఎవరివాఁడు? ఏ వృత్తిని - పట్టినవాఁడు - ఏమి జీవనోపాయము? - అనుట - ఎవరివలన భయము, ఎందులకు? అమ్మ వినును గాక. వయసు బోగముదానిని అమ్మయనక అక్కయని యందరు వ్యవహరింతురనియుఁ గొనఁదగును. అక్క వినును గాక.

పాటలిపుత్రం ... వామి = పాటలిపుత్రము నాపుట్టిన చోటు, నేను ఒక ఊరిపెద్ద, పెదకాఁపు పిల్లవాఁడను - కొమారుఁడను. ఒళ్ళు పిసుకుట అను జీవనోపాయమును ఆశ్రయింతును, బోగముది అధ్య గావున - పిసికిళ్ళ మేలిమి సౌకుమార్యము దానఁ గలుగు సుఖము మరగినట్టిది, ఆకళ మెచ్చుకోలుం బలుకుచున్నది - సుకుమారా ఖలు ... = సుకుమారమైన కళను గదా అయ్య నేర్చుకొన్నాఁడు. ఆర్యే కళా ఇతి ... = అక్కా - కళ అని నేర్చుకొన్నాను, ఇప్పుడు అదే బ్రతుకు తెరువు ఐనది.

చేటి—అతినిర్విణ్ణా మార్యేణ ప్రతివచనం దత్తమ్. తత స్తతః. [అదిణివ్విణ్ణం అజ్జేణ పడివఅణం దిణ్ణమ్. తదో తదో].

సంవా—తత ఆర్యే, ఏష నిజగృహా ఆహిణ్డకానాం ముఖా చ్ఛ్రుత్వాపూర్వదేశదర్శన కుతూహలే నే హాగతః. ఇహాపి మయా ప్రవి శ్యోజ్జయినీ మేక ఆర్యః శుశ్రూషితః. య స్తాదృశః ప్రియ దర్శనః ప్రియవాదీ, దత్వా న కీర్తయతి, అపకృతం విస్మరతి. కిం బహునా ప్రలపితేన? దక్షిణతయా పరకీయ మి వాత్మాన మవ గచ్ఛతి, శరణాగత వత్సల శ్చ.

[తదో అజ్జఏ, ఏశే ణిజగేహే ఆహిణ్డకాణం ముహాదో శుణిఅ అపువ్వదేశ దంశణ కుదూహలేణ ఇహ ఆగదే. ఇహ వి మఏ పవిశిఅ ఉజ్జయిణిం ఏక్కే అజ్జే శుశ్శూశిదే. జే తాలిశే పిఅదం

అతినిర్విణ్ణం = మిక్కిలియు హేయబుద్ధి కలిగినట్లున్నది దానిమీఁద, ఆర్యుఁడు జవాబు చెప్పటం జూడ.

ఏష ... ఇహ ఆగతః – ఈ నేను, మాయింట (పాటలిపుత్రమున నే) ... ఊరూరు తిరుగువారి నోటినుండి – బైరాగులు సన్న్యాసులు మొదలైనవారివలన అనుట – విని, క్రొత్త దేశమును చూచు కోరికతో ఇక్కడికి వచ్చినాఁడను. ఇహాపి మయా। ... = ఇక్కడను ఉజ్జయిని (రాజధాని) నే ప్రవేశించి, ఒక అయ్యను శుశ్రూషించితిని – సేవించితిని – సంవహనాదిచేత కాఁబోలు – యః = ఎవఁడు – అనఁగా అతఁడు – అనుట – తాదృశః ప్రియదర్శనః ... అట్టి (సాటిలేని అనుట – ఒకసారి చూచిన మాటిమాటికి చూడవలయుననిపించు క్రొత్తయందము (సాటిలేని అనియే) తోఁచువాఁడు, ప్రియవాదీ = తియ్యనిమాటలవాఁడు, దత్వా ... = ఇచ్చి బయటికి చెప్పఁడు – 'దానేమానం' అన్నట్లుండువాఁడు; అపకారమును (మనసున ఉంచుకొనఁడు) మఱచును. కిం బహునా ... = ఎందుకు పలుమాటలు వదరుట – (దీనులయందలి) దయ – మోమోటముల – వలన, తన్ను ఇతరుని – అధీనుని – వసమున నున్నవానింగా తలంచును – వానికి కావలసినదెల్ల సమకూర్చును – అనుట – శరణు అన్నవారియెడ (బిడ్డలందుంబోలె) వాత్సల్యముకలవాఁడు.

శణే పిలవాదీ, దఇల ణ కిత్తేది, అవకిదం విసుమలేది, కిం బహుణా పలన్తేణ? దక్ఖిణదాఏ పలకేలఅం విఅ అత్తాణఅం అవగచ్ఛది. శరణాగఅ వచ్ఛలే అ].

చేటి—క ఇదానీ మార్యాయా మనోరథాన్తరస్య గుణాంశ్చోరయి త్వోజ్జయినీ మలంకరోతి? [కో దాణిం అజ్జఆఏ మణోహరన్తరస్స గుణాఇం చోరిఅ ఉజ్జయిణిం అలంకరేది].

వసన్త—సాధు చేటి, సాధు, మయాప్యేవ మేవ హృదయేన మన్త్రితమ్. [సాహు హఞ్జే, సాహు మఏవి ఎవ్వం జ్జేవ హిఅఏణ మన్తిదమ్]

చేటి—ఆర్యా, తత స్తతః. [అజ్జ, తదో తదో].

సంవా—ఆర్యే, స ఇదానీ మనుక్రోశకృతైః ప్రదానైః. [అజ్జఏ, సోదాణిం అణుక్కోశకిదేహిం పదాణేహిం]

వసన్త—కి ముపరతవిభవః సంవృత్తః? [కిం ఉవరదవిహవో సంవుత్తో?]

సంవా—అనాఖ్యాత మేవ కథ మార్యయా విజ్ఞాతమ్? [అణుజక్ఖిదే జ్జేవ కధం అజ్జఆఏ విణ్ణాదమ్?]

క ఇదానీం ఆర్యాయా ... = ఎవఁడు ఇప్పుడు అక్కకోరికలో - అంతర్గతుఁడుగా - ఉన్నవానియొక్క గుణములను దొంగిలి యుజ్జయినిని - అలంకరించుచున్నాఁడు - ...కి అలంకారముగా నున్నాఁడు అనుట. బళి, చేటి, బళి. నాచేతను ఇట్లే మనసున తలంపఁబడినది. - ఇతఁ డెవఁడో మతి యొకఁడు చారుదత్తుం బోలినవాఁడు ఉజ్జయినియలంకారము ఉన్నాఁడే అని. అనుక్రోశకృతైః ప్రదానైః = దయచేచేసిన - ఒసంగిన - ఈవులచే - అని తరువాత సంవాహకుఁడు వాక్యపూర్తి చేయఁబోవుచుండఁగా దానిని వసంతసేన పూర్తి చేయుచున్నది - విభవ మెల్ల పోయినవాఁ డాయెనా? - అని, అనాఖ్యాతమ్ ఏవ = ... చెప్పఁబడనిదే, ఎట్లు అక్కయ్యాకు తెలిసినది? ఇక్కడ ఎఱుంగవలసిన దేమున్నది? గుణములును (వానితో కూడిన) విభవములును (లోకాన) అరుదు.

వసన్త—కి మత్ర జ్ఞాతవ్యమ్. దుర్లభా గుణా విభవాశ్చ. అపేయేషు తడాగేషు బహుతర ముదకం భవతి. [కిం ఏత్థ జాణీ అది. దుల్లహా గుణా విహవా అ. అపేఏసు తడాఏసు బహువరం ఉదలం భోది.]

చేటి—ఆర్య, కింనామధేయః ఖలు సః? [అజ్జ, కింణామ ధేఓ క్ఖు సో].

సంవా—ఆర్యే, క ఇదానీం తస్య భూతలమృగాఙ్కస్య నామ న జానాతి, స ఖలు శ్రేష్ఠిచత్వరే ప్రతివసతి. శ్లాఘనీయ నామధేయ ఆర్య చారుదత్తో నామ. [అజ్జే, కే దాణిం తశ్శ భూదలమిఅఙ్కస్స ణామ ణ జాణాది. శో క్ఖు శెట్ఠిచత్తలే పడివశది. శలాహణిజ్జణామధేఏ అజ్జ చాలుదత్తే ణామ].

వసన్త—(సహర్ష మాసనా దవతీర్య) ఆర్య, స్యాత్మీయ మేత ద్గేహమ్. చేటి, దేహ్యా స్యాసనమ్. తాలవృన్తకం గృహాణ.

అపేయేషు ... = త్రాఁగుటకు పనికిరాని తటాకములలో నీళ్ళు మెండగును. ఆర్య, కింనామ ... = అయ్యా అతఁడు ఏపేరు గలవాఁడో గదా. క ఇదానీం తస్య ... = అక్కా - ఎవఁ డిపుడు ఆభూలోకపుఁ జంద్రుని పేరు ఎఱుఁగని వాఁడు? అతఁడు సెట్ల 'చౌక్'లో కాపురమున్నాఁడు, మెచ్చఁదగిన పేరివాఁడు చారుదత్తయ్య అని పేర్గన్నవాఁడు. (పేరు = కీర్తి).

సహర్షం ఆసనాత్ ... = వసంతసేన మిక్కిలి సంతోషముతో ఆసనము నుండి దిగి. - చారుదత్తుని పేరు పలుకఁబడినందున - అంతట అతనికి గౌరవ సూచకముగా ఆసనము వీడి లేచి నిలుచుట - గొప్పవారు సమీపించినపుడు, వారిని గౌరవింప తక్కువవారు, కూర్చుండి యున్నవారు లేచి నిలంబడుదురు. భర్త సమీపించినపుడు, భార్య కూర్చుండియుండిన, తత్క్షణమే నిలంబడును - ఇట చారుదత్తునియెడను, తన్నామగ్రహణము చేయఁబడఁగా. తన భర్త - కాంతుఁడు అని యిది వసంతసేన సముదాచారము. (దక్షిణాదిలో ఎక్కువ వాడుక.)

ఆర్యస్య ఆత్మీయం ... అయ్యాకు ఈయిల్లు సొంతము. చేటి, ఈయనకు పీట పెట్టవే - విసనకఱ్ఱం దీసికోవే, మిక్కిలి (= పరి) అలపు అయ్యాను బాధించు

పరిశ్రమ ఆర్యస్య బాధతే. [అజ్జస్స ఉత్తణకేరకం ఏదం గేహమ్. హఞ్జే, దేహి సే ఆసణమ్. తాలవేణ్ణఅం గేణ్హ. పరిస్సమో అజ్జస్స బాధేది].

( చేటీ తథా కరోతి )

సంవా—( స్వగతమ్ ) కథ మార్యచారుదత్తస్య నామ సంకీర్తనే నేదృశో మే ఆదరః! సాధు ఆర్యచారుదత్త సాధు పృథివ్యాం త్వ మేకో జీవసి. శేషః పున ర్జనః శ్వసితి. (ఇతి పాదయో ర్నిపత్య) భవతు ఆర్యే భవతు. ఆసనే నిషీద త్వార్యా. [కధం అజ్జచాలుదత్తస్స ణామశంకిత్తణేణ ఈదిశే మే ఆదలే. శాహు అజ్జచాలుదత్తో, శాహు. పుహవీఏ తుమం ఎక్క జీవశి. శేషే ఉణ జణే శశది, భోదు అజ్జఏ భోదు. ఆశణే ణిశీదదు అజ్జఆ.]

వసన్త—( ఆసనే సముపవిశ్య ) ఆర్య కుతః స ధనికః? [అజ్జ, కుదో సో ధణిఓ]

సంవా—

శ్లో. సత్కారధనః ఖలు సజ్జనః;
కస్య న భవతి చలాచలం ధనమ్?

చున్నది. కథం! = ఏమి! ఎట్లు! చారుదత్తస్య నామ ... = చారుదత్తయ్య పేరు నోటినిండ పలికిన మాత్రమున నాకు ఇట్టి యాదరము! బళి, చారుదత్తయ్యా బళి. పుడమిలో నీవొక్కఁడవే జీవించుచున్నావు. తక్కిన జన మన్ననో (= పునః) శ్వసితి - ఊపిరిమాత్రము విడుచు చున్నది - అని (వసంతసేన) పాదములం బడును - అట్లు పడుట వసంతసేనకు చారుదత్తుని గుణములయందు అంతగౌరవమున్నందు లకు. కానీ అక్కా కానీలే. ఆసనమునం గూర్చుండుము - అనుట - కూర్చుం డునుగాక అనుట గౌరవోక్తి. (మతి) అయ్యా ఏఁడీ అధనికుఁడు - నీవు అప్పు తీర్పవలసినవాఁడు?

శ్లో. ౧౫. సజ్జనః = సత్పురుషుఁడు - మంచివాఁడు, సత్కారధనః ఖలు = ఇతరులయొక్క-ఇతరులం గూర్చి తాను చూపు-ఆదరమే అస్తిగాఁగలవాఁడు, చలా చలం ధనమ్=అస్థిరమగు ధనము, కస్య న భవతి=ఎవనికి ఉండదు? యః=ఎవఁడు,

యః పూజయితు మపి న జానాతి
స పూజావిశేష మపి జానాతి ? ౧౫

[ శకా్కలఘుణే క్ఖు శజ్జణే
కాహం ణ హోఇ చలాచలే ఘుణే
జే పూఇదుం పి ణ జాణాది
శే పూఅవిశేశం సి జాణాది ?

వసన్త—తత స్తతః. [ తదో తదో ].

సంవా—తత స్తే నార్యేణ సవృత్తిః పరిచారకః కృతో

పూజయితుం అపి న జానాతి = పూజింపనైనను ఎఱుంగఁడో, సః = వాఁడు, పూజా విశేషం అపి = (ఇతరులు కావించు) సత్కారాతిశయమును, జానాతి = ఎఱుఁగునా ? - కాకువుచే ప్రశ్న. - ఎఱుఁగనే ఎఱుంగఁడు - అనుట,

చూ. స్వప్నవాసవదత్త - IV.

విదూ—ఉచితం తత్రభవతో మగధరాజస్య అపరాహ్ణకాలే భవన్త మగ్రతః కృత్వా సుహృజ్జనదర్శనమ్. సత్కారోహినామ సత్కారేణ ప్రతీష్టః ప్రీతిము త్పాదయతి. తదు త్తిష్ఠతు తావత్ భవాన్.

రాజా—బాఢమ్ - ప్రథమః కల్పః. (ఉత్థాయ)

గుణానాం వా విశాలానాం సత్కారాణాంచ నిత్యశః
కర్తారః సులభా లోకే విజ్ఞాతార స్తు దుర్లభాః. ౧౦.

లోకాన మంచివానికి ఆస్తి (వంటిది) ఏదనఁగా సత్కారము - ఇతరుల నాదరించుట. వట్టి డబ్బు, అదృష్టవశాన నేఁడు ఉండును అదృష్టవశాన రేపు పోవును - ఎంతయు అస్థిరము. ఎవఁడు ఇతరుల ఆదరింప నెఱుఁగఁడో, వానికి తన్నుంగూర్చి యితరులయు అట్టి యాదరింపులో అతిశయ మన నెట్టిదో తక్కువ యన నెట్టిదో ఎఱుకయా ?

తతః తేన ఆర్యేణ ... = అంతట ఆయయ్యచేత, సవృత్తిః = బ్రదుకు తెరువుతోకూడ - అనఁగా జీతము ఇచ్చి, పరిచారకుఁడను (= సేవకుఁడను) చేయఁ

௨స్మి. చారిత్రావశేషే చ తస్మి న్ద్యూతోపజీ వ్యస్మి సంవృత్తః. తతో భాగధేయ విషమతయా దశసువర్ణం ద్యూతే హారితమ్. [తదో తేణ అజ్జేణ శవిత్తి పలిచాలకే కిదో హ్మి. చాలిత్తావశేశే అ తస్సిం జూదోవజీవి హ్మి శంవుత్తో. తదో భాఅధేఅ విశమదాఏ దశశువణ్ణఅం జూదే హాలిదమ్.]

మాథు—ఉత్సాదితో ௨స్మి. ముషితో ௨స్మి. [ఉచ్ఛాదిదో మ్హి, ముసిదో మ్హి].

సంవా—ఏతౌ తౌ సభికద్యూతకరౌ మా మనుసంధత్తః. సాంప్రతం శ్రుత్వార్యా ప్రమాణమ్. [ఏదే దే శహిఅ జూదిఅలా మం అణుశంధఅన్తి. శంపదం శుణిఅ అజ్జఆ పమాణమ్.]

వసన్త—మదనికే, వాసపాదప విసంష్ఠులతయా పక్షిణ ఇతస్తతో ௨ప్యాహిణ్డన్తే. చేటి, త ద్గచ్ఛ. ఏతయోః సభిక

బడితిని. ఆయన (చారిత్ర అవశేషే =) ధన మెల్ల పోయి శీలము మాత్రమే మిగిలినవాఁడు కాఁగా, ఆ వృత్తి పోయినది. ద్యూత ఉపజీవీ అస్మి సంవృత్తః = జూదమును ఆశ్రయించినవాఁడ నైతిని. తతః భాగధేయ ... = అంతట. అదృష్టము ప్రతికూలించినది కాఁగా, పది సువర్ణములు జూదాన పోఁగొట్టుకొంటిని _ ఓడితిని. అట్లు జూదగానికి అప్పుపడితిని.

ఉత్సాదితః అస్మి ... = నాశన మైపోయితిని, (మోసపోయితిని =) డబ్బ పోఁగొట్టుకొన్నవాఁడ నైతిని. వీరుగో ఆసభికుఁడు జూదగాఁడును, నన్ను వెదకు చున్నారు. (ఇది నాకథ యంతయు) సాంప్రతం శ్రుత్వా ... = దీనిని విని అక్కయే ఏమి చేయఁదగునో అది చేయఁగలదు.

వాసపాదపస్య ... కాపురము చోటైనచెట్టు చారుదత్తయ్య యొక్క, కదలి పోయి యొగుడుదిగుడై నిలుకడలేమిచేత పక్షులు ఇటు నటు తిరిగి అల్లాడును. (అట్లే ఇతఁడును అనుట) తత్ గచ్ఛ... = మఱి పొమ్ము, ఈసభికద్యూతకరులకు, ఈయయ్యయే ఇచ్చుచున్నాఁ డని ఈనాచేతి మురుగును నీవు ఇమ్ము,

ద్యూతకరయోః, అయ మార్య ఏవ ప్రతిపాదయతీతి. ఇదం హస్తా భరణం త్వం దేహి. [మదణిఏ, వాసపాదవ విసంతులదాఏ పక్ఖిణో ఇదో తదో వి ఆహిణ్డన్తి. హఞ్జే, తా గచ్ఛ, ఏదాణం సహిఅజూదిఅరాణమ్ అఅం అజ్జో జ్జేవ పడివాదే త్తి. ఇమం హత్థా భరణఅం తుమం దేహి].

(ఇతి హస్తా త్కటక మపాకృష్య చేట్యాః ప్రయచ్ఛతి

చేటీ—(గృహీత్వా) యదా ర్యాజ్ఞాపయతి. [జం అజ్జఆ ఆణవేది]. (ఇతి నిష్క్రా)న్తా

మాథు—ఉత్పాదితో ఒస్మి ముషితో ఒస్మి. [ఉచ్ఛాదిదో హ్మి, ముసిదో హ్మి].

చేటీ—యథైతా వూర్ధ్వం ప్రేక్షేతే, దీర్ఘం నిశ్వసతః, అభిలపత శ్చ ద్వారనిహితలోచనౌ, తథా తర్కయామి, ఏతౌ తౌ సభికద్యూతకరౌ భవిష్యతః. (ఉపగమ్య) ఆర్య, వన్దే. [జధా ఏదే ఉద్ధం పేక్ఖన్తి, దీహం ణీససన్తి, అహిలపన్తి అ దుఆరణిహిదలోఅణా, తధా తక్కేమి, ఏదే దే సహిఅజూదిఅరా హువిస్సన్తి. అజ్జ, వన్దామి].

మాథు—సుఖం తవ భవతు. [సుహం తుఏ హోదు].

చేటీ—ఆర్య, కతరో యువయోః సభికః. [అజ్జ, కదమో తుమ్హాణం సహిఓ].

---

యథా ఏతే ఊర్ధ్వం ... ఎట్లు వీరు పైకి చూచుచున్నారో, నిట్టూర్తురో, చింతపడుదురో, ఆసతో వాకిటిమీఁద నే కన్ను ఉంచి యున్నారో (తథా = అట్లు =) దానిం బట్టి, ఊహింతును, వీరే వారు, ఆ సభికుఁడును జూదగాఁడును, అగుదురు. ... నీకు సుఖము కలుగును గాక. ఎవరు మీలో సభికుఁడు ?

మాధు—

శ్లో. కస్య త్వం తనుమధ్యే అధరేణ రతదష్టదుర్వినీతేన
జల్పసి మనోహరవచన మాలోకయన్తీ కటాక్షేణ. ౧౭

[కస్స తుహం తణుమజ్ఝే అహరేణ రదదట్ఠదువ్వీణీదేణ
జమ్పసి మణోహలవఅణం ఆలోఅన్తీ గడక్ఖేణ]

నాస్తి మమ విభవః, అన్యత్ర వ్రజ. [ణత్థి మమ విహవో అణ్ణత్త వ్వజ]

చేటి—యదీదృశాని నను మన్త్రయసి, తదా న భవసి ద్యూతకరః, అస్తి కో ఽపి యుష్మాకం ధారకః? [జఇ ఈదిసాఇం ణం మన్తేసి. తా ణహోసి జూదిఅరో. అత్థి కో వి తుహ్మాణం ధారఓ]

---

శ్లో. ౧౭. తనుమధ్యే = ఓ కృశోదరీ - సన్నని నడుముదానా, (ఒయ్యారముగా నడుము జవ్వాడించుచు - అనుట) రత దష్ట దుర్వినీతేన = రతమందు గాటుపడియు ఇంకను పొగరు అడఁగని అధరముతో, కటాక్షేణ ఆలోకయన్తీ = కడకంట జూచుచు, (ఇట్లు) డెందమును ప్రుచ్చిలించు పలుకుం బలుకు చున్నావే, కస్య త్వం = ఎవ్వరిదానవే నీవు?

జవ్వాడు నీనడుము, సురతాన గాటుపడియు ఇంకను గాట్లుకోరు నీ క్రొపెదవి, నీకడకంటిచూపు నీ (ముద్దు) పలుకు చిత్తము ప్రుచ్చిలుచున్నవి! ఎవరిదానవు నీవు?

నాస్తిమే ... = నాకు సంపద లేదు మ రెవనియొద్దకేని పొమ్ము. యత్ ఈదృశాని ... = నీవు దేన (= ఎందుచేత) ఇట్టివి - నాకు విభవము లేదు ఇత్యాది - పలుకుచున్నావో - తదా = అప్పుడు (= అందుచేతనే,) నీవు ద్యూతకరుఁడవు కావులే - తప్పక అగుదువు (టక్కరివి) అని కనుగొంటిని - అనుట. అస్తికోఽపి ... = మీకు బాకీ పడినవాఁ డెవఁడేని యున్నాఁడా? ఉన్నాఁడు - పది సువర్ణ

మాథు—అస్తి. దశసువర్ణం ధారయతి? కిం తస్య. [అత్థి. దశసువణ్ణం దాలేది. కిం తస్స?]

చేటీ—తస్య కారణా దార్యేదం హస్తాభరణం ప్రతిపాదయతి. నహి నహి, స ఏవ ప్రతిపాదయతి. [తస్స కారణాదో అజ్జఆ ఇమం హత్థాభరణం పడివాదేది. ణహి ణహి, సో జ్జేవ పడివాదేది.]

మాథు—(సహర్షం గృహీత్వా) అరే, భణసి తం కుల పుత్త్రమ్—'భూత స్తవ గణ్డః. ఆగచ్ఛ, పున ర్ద్యూతం రమస్వ' [అలే భణేశి తం కులపుత్తమ్. - 'భూదం తుఏ గణ్డే. ఆఅచ్ఛ, పుణో జూదం రమఅ'] (ఇతి నిష్క్రాన్తః)

చేటీ—(వసన్తసేనా ముపసృత్య) ఆర్యే, పరితుష్టౌ గతౌ సభికద్యూతకరౌ. [అజ్జఏ. పడితుట్ఠా గదా సహిఅజూదిఅరా]

వసన్త—త ద్గచ్ఛతు. అద్య బన్ధుజనః సమాశ్వసితు. (తా గచ్ఛదు. అజ్జ బ్ధుఅణో సమస్ససదు].

సంవా—ఆర్యే, య ద్యేవం త దియం కలా పరిజనహస్తగతా క్రియతామ్. [అజ్జఏ, జఇ ఎవ్వం తా ఇఅం కలా పలిఅణహత్థగదా కలీఅదు].

(దీనార)ములు బాకీ పడినాఁడు. కింతస్య = ఏమి వానికి? తస్యకారణాత్ ... = వానికోసము అక్కయ్య ఈ చేతిమురుగు ఇచ్చుచున్నది. - కాదు కాదు - అతఁడే ఇచ్చుచున్నాఁడు,

అరే - ఒరే - భణసి తంకులపుత్రస్య ... = ఆదొడ్డకులమునం బుట్టినవానితో చెప్పు. డబ్బు ఎగవేయమికిని, మరల ఆడ నుత్సాహము గొల్పుటకును ఈప్రశంస - భూతఃతవ(గణ్డః =) నీ ప్రమాణము సెఱవేఁనది. రమ్ము, మరల జూదము ఆడుము. అని. పరితుష్టౌ = మిక్కిలి తృప్తిపడినవారై - బాకీకి మించిన సొమ్ము దొరకుటచే. తత్ గచ్ఛతు ... = మఱి అయ్యఁడు పోవును గాక, చుట్టాలు (ఊఱడిల్లుదురుగాక.) - యద్యేవం ... = అట్లేని, అక్కా,

వసన్త—ఆర్య, యస్యకారణా దియం కలా శిక్ష్యతే, స ఏష ఆర్యేణ శుశ్రూషితపూర్వః, శుశ్రూషితవ్యః. [అజ్జ, జస్స కారణాదో ఇఅం కలా సిక్ఖీఅది, సో జ్జేవ అజ్జేణ సుస్సూసిదపువ్వో సుస్సూసిదవ్వో].

సంవా—(స్వగతమ్) ఆర్యయా నిపుణః ప్రత్యాదిష్టో ఽస్మి. కథం ప్రత్యుపకరిష్యే? (ప్రకాశమ్) ఆర్యే, అహ మేతేన ద్యూతకరాపమానేన శాక్యశ్రమణకో భవిష్యామి. త త్సంవాహకో ద్యూతకరః శాక్యశ్రమణకః సంవృత్త ఇతి స్మర్తవ్యా న్యార్యయైతా న్యక్షరాణి. [అజ్జఆఏ ణిఉణం పచ్చాదిట్టో మ్హి. కథం పచ్చువకలిశ్శమ్? (ప్రకాశమ్) అజ్జఏ, అహం ఏదిణా జూదిఅలావమాణేణ శక్కశమణకే హువిశ్శమ్. తా శంవాహకే జూదిఅలే శక్కశమణకే శంవుత్తే త్తి శుమలిదవ్వా అజ్జఆఏ ఏదే అక్ఖలు]

వసన్త—ఆర్య, అలం సాహసేన. [అజ్జ, అలం సాహసేణ].

ఈనాకళ - సంవాహనవిద్య - నీ పరిజనమునకు నాచే సేవింపుము. (అట్లు ప్రత్యుపకారముం గొనుము - అనుట) యస్యకారణాత్ ... = ఎవనికొఱకు ఈకళ సేవఁబడవలయునో, అతఁడే ఆర్యునిచే మునుపు శుశ్రూషింపఁబడినాఁడు. (ఇంఁడియు) శుశ్రూషింపఁబడఁదగును. వద్దు, అపని (= సేవుఁట). ఆర్యయా నిపుణం ... వద్దు కూడదని అక్కచే నేర్పుమీఱ జవాబు చెప్పఁబడితిని. - తన కేమియు ఇందులకు ప్రత్యుపకారమువలదు అని సుకుమారముగా చెప్పినది. కథం ప్రత్యుపకరిష్యే - ఎట్లు ప్రత్యుపకారము చేయఁగలను? (తోఁపలేదే - సరి.) ఆర్యే అహం ఏతేన ... = అక్కా, నేను ఈజూదకారులు కావించిన పరాభవము చేత, విరాగముం బొందినాను - (ఇఁక) శాక్యశ్రమణకః భవిష్యామి = బౌద్ధ పరిప్రాజకుఁడ నయ్యెదను. తత్ సంవాహకః ... = కావున సంవాహకుఁడు ద్యూతకరుఁడు (ఐ.) శాక్యశ్రమణకుఁడు ఐనాఁడు - అను నీయక్షరములు - వివరముగా ఈమాటలవరుస - అక్కచేత జ్ఞప్తియం దుంచుకొనఁ బడవలయును, ఆర్య అలం ... = అయ్యా, సాహసము చేయకు - వలదు సాహసము ... = నిశ్చయము చేసికొనఁబడినది.

సంవా—ఆర్యే, కృతో నిశ్చయః. [అజ్జే, కతే ణిచ్ఛవే].
(ఇతి పరిక్రమ్య)

శ్లో. ద్యూతేన తత్కృతం మమ యద్విహస్తం జనస్య సర్వస్య
ఇదానీం ప్రకటశీర్షో నరేన్ద్రమార్గేణ విహరిష్యామి. ౧౭

[జూదేణ తం కదం మే జం వీహత్థం జణశ్శ శవ్వశ్శ
ఏణహిం పాఅడశీశే ణలిన్దమగ్గేణ విహలిశ్శమ్]

(నేపథ్యే కలకలః)

సంవా—(ఆకర్ణ్య) అరే, కిం న్విదమ్. (ఆకాశే) కిం భణత — 'ఏష ఖలు వసన్తసేనాయాః ఖుణ్టమోడకో నామ దుష్ట

శ్లో. ౧౭. యత్ = ఏది, సర్వస్య జనస్య = ఎల్లజనులకు (వలన అనుట,) డబ్బు తెండుటకు వచ్చిన సభికుఁడో వాని మానిసియో అని. (పా.) భీయతే= భయపడునో - ఎల్ల జనులకు భయపడుటయో, పా. విహస్తం(= చేతులు పోయినట్లు) ఎల్ల జనులకును శక్తి లేమియో, = ఏమియుం దోఁపమియో, తత్ = అది, 'విహస్తవ్యాకులౌ సమౌ' - అమరము. ద్యూతేన మమ కృతం = జూదముచే నాకు - అభయపడుట - అశక్తిలేమి - కలిగింపఁబడినది, (అందులకై ఇన్నాళ్ళును తలవాల్చుకొని - అధీరముగా - తిరుగుచుంటిని.) ఇదానీం = ఇపుడు, ప్రకటశీర్షః = ఎల్లరకు అగపడు తలగలవాఁడనై - తల యెత్తుకొని, నరేన్ద్రమార్గేణ= రాజమార్గమున - పెద్దరస్తాలో, విహరిష్యామి - హాయిగా - విహారముగా - సంచరించెదను.

జూదముచేత నాకు ఎల్లజనులవలన డబ్బుతెండుటకు వచ్చినవారో అని భయమును, (చేతులే పోయినట్లు) శక్తిలేమియు (= ఏమియుం దోఁపమియు) కలిగియుండినది. ఇపుడు, అది తీఱిపోయినది. ఇఁకను భయము కాని శక్తిలేమి కాని నా కెక్కడిది? తల ఎత్తుకొని రాజమార్గమున అందఱియెదుట విహారముగా సంచరించెదను.

నేపథ్యే - తెరవెనుక - కలకలః - అలబలము, గుంపున పుట్టిన మ్రోఁత.

అరే కిం న్విదమ్? ఆకాశే = మింట, కిం భణత = ఏమనుచున్నారు ... ఇత్యాది మరల ఆక్షేపకము ఆకాశభాషితము. ఏష ఖలు ... = ఇదిగో,

హాస్తీ విచరతి' ఇతి - అహో, ఆర్యాయా గన్ధగజం ప్రేక్షిష్యే గత్వా. అథవా, కిం మ మైతేన? యథా వ్యవసిత మనుష్ఠాస్యామి. [అలే, కిం ణ్ణేదమ్. (ఆకాశే) కిం భణాథ. - ఏశే క్ఖు వశన్తశేణ ఆఏ ఖుణ్టమోడకే ణామ దుట్టహత్థీ విఅలేది' త్తి. అహో, అజ్జఆఏ గన్ధగఅం పేక్ఖిశ్శం గదుఅ. అహవా, కిం మమ ఏదిణా? జధా వవశిదం అణుచిట్ఠిశ్శమ్]

(తతః ప్రవిశతి అపటీక్షేపేణ ప్రహృష్టో
వికటోజ్జ్వలవేషో కర్ణపూరకః)

కర్ణపూరకః—కుత్ర కు త్రార్యా! [కహిం కహిం అజ్జఆ!]

చేటీ—దుర్మనుష్య, కిం త ఉద్వేగకారణమ్. యదగ్రతో ఉపస్థితా మార్యాం న ప్రేక్షసే. [దుమ్మణుస్స, కిం తే ఉవ్వేఅ కాలణమ్, జం అగ్గదో వట్టిదం అజ్జఅం ణ పేక్ఖసి].

కర్ణ—(దృష్ట్వా) ఆర్యే, వన్దే. [అజ్జఏ, వన్దామి].

---

వసంతసేనయొక్క ఖుంటమోటకమను (కంబమును విఱుచునది అను) పేరుగల పోకిరి యేనుఁగు తిరుగుచున్నది - అనియా. అహో - సంతోషము, అక్కయ్య మదపుటేనుఁగును చూతును, పోయి - (అథవా =) ఎందుకు లే, నాకు దానితో ఏమి? నేను చేయఁ బూనుకొన్నదానినే - శ్రమణకుఁడ నగుటనే అనుష్ఠించెదను. తతః ప్రవిశతి ... = అంతట ప్రవేశించుచున్నాఁడు, సంభ్రాంతుఁడై - తొందర తొందరగా, అపటీక్షేపేణ - తెరపట్టకయే. పట్టరాని సంతోషముగలవాఁడై - వికటముగా (= మిక్కిలి) తళతళ ప్రకాశించు వేషము - కట్టు తోడుగు - కల వాఁడై కర్ణపూరకుఁడు - ఆ పేరుగల వసంతసేన పరిచారకుఁడు. వసంతసేన పరిచారకుఁడును అట్టి ఉజ్జ్వలవేషుఁడగును. కుత్ర ... = ఎక్కడ ఎక్కడ అక్క! దుర్మనుష్య! ... = పాడు మానిసీ, ఏమిరా నీకు (ఈ) సంభ్రమమునకు - కలవరమునకు - కారణము? యత్ అగ్రతోఽవస్థితాం ... = ఏల అడిగెద ననఁగా - ఎదురుగానున్న అక్కనే చూడకున్నావు! ... = సంతోషము

వసన్త—కర్ణపూరక, పరితుష్టముఖో లక్ష్యసే. త త్కిం న్విదమ్? [కణ్ణపూరఅ, పరితుట్టముహో లక్ఖీఅసి. తా కి ణ్ణేదమ్?].

కర్ణ—(సవిస్మయమ్) ఆర్యే, వఞ్చి తాసి య యాద్య కర్ణ పూరకస్య పరాక్రమో న దృష్టః. [అజ్జఏ, వఞ్చిదాసి, జాఏ అజ్జ కణ్ణఊరఅస్స పరక్కమో ణ దిట్ఠో.]

వసన్త—కర్ణపూరక, కిమ్ కిమ్. [కణ్ణఊరఅ, కిం కిమ్].

కర్ణ—శృణో త్వార్యా, యః స ఆర్యాయాః కుణ్టమోటకో నామ దుష్టహస్తీ, స ఆలానస్తమ్భం భఙ్త్వా మహామాత్రం వ్యాపాద్య మహాన్తం సంక్షోభం కుర్వ న్రాజమార్గ మవతీర్ణః. తతో ఉత్రాన్తరే ఉద్ఘుష్టం జనేన. [సుణాదు అజ్జఆ, జో సో అజ్జఆఏ ఖుణ్డమోడఓ ణామ దుట్ఠహత్థీ, సో ఆలాణత్థమ్భం భఞ్జిఅ మహామేత్తం వావాదిఅ మహన్తం సంఖోహం కరన్తో రాఅమగ్గం ఓదిణ్ణో. తదో ఏత్థన్తరే ఉగ్ఘుట్టం జణేణ].

శ్లో. ''అపనయత బాలకజనం

త్వరిత మారోహత వృక్షప్రాసాదమ్

నిండిన మొగము గలవాఁడవుగా అగపడుచున్నావే! ఏమిటి ఇది? సవిస్మయమ్ ... = ఆశ్చర్యముతో - అక్కా, వఞ్చితాసి ... = మోసపోయితివి - పోఁగొట్టుకొంటివి, నీ విప్పుడు నీకర్ణపూరకుని పరాక్రమముం జూడ వైతివే! ... ఏమిటిరా ఏమిటి ? శృణోతు ఆర్యా ... = అక్క వినును గాక - అక్క పోకిరి యేనుఁగున్నదే, ఖుంటమోటకము, అది కట్టుకంబమును విఱిచి, (మహామాత్రం =) మావటి నాయని చంపి, మిక్కిలి గొప్ప కలఁత కలిగించుచు, రాజమార్గము చొచ్చినది. అత్రాన్తరే ఉద్ఘుష్టమ్ ... = అంతలో జనులచే బిగ్గరగా చాటినట్లు అటవఁబడినది. - ఏమనఁగా.

శ్లో. ౧౫. బాలకజనం = (దారిలో నున్న శిశువులను - పిల్లకాయలను, అపనయత = అవలికి కొనిపొండు, త్వరితం = త్వరగా, వృక్షప్రాసాదం = చెట్లను

కిం న ఖలు ప్రేక్షధ్వం
పురతో దుష్టో హస్తీ ఇత ఏతి. ౧౮

[ అవణేధ వాలఅజణం
తురిదం ఆరుహధ వుక్ఖపాసాదమ్
కిం ణహు పేక్ఖధ
పురదో దుట్ఠో హత్థీ ఇదో ఏది.

అపి చ, [ అవి అ ],

శ్లో. విచలతి నూపురయుగలం
ఛిద్యన్తే చ మేఖలా మణిఖచితాః
వలయాశ్చ సున్దరతరా
రత్నాఙ్కురజాల ప్రతిబద్ధాః. ౧౯

[ విచలఇ ణేఉరజుఅలం
ఛిజ్జన్తి అ మేహలా మణిక్ఖఇఆ
వలఆ అ సున్దరదరా
రఅణఙ్కురజాలపడిబద్ధా ]"

---

మేడలను, ఆరోహత = ఎక్కు(డు. కిం న ఖలు పశ్యథ పురతః = ఏమి చూడరా, ఎదురుగా? దుష్టః హస్తీ ఇత ఏతి = దుండగాల యేను(గు ఇటు వచ్చుచున్నది.

ఇవి అఱపు - చాటింపు - మాటలు.

శ్లో. ౧౯. నూపురయుగళం - అందెలజత, విచలతి = కదలుచున్నది - భయసంభ్రాంతలై పఱచు స్త్రీలవి కా(బోలు. ఛిద్యన్తే = తెంప(బడుచున్నవి - మణిఖచితాః = రతనాలు తా(పిన, మేఖలాః = మొలనూళ్ళు! రత్నా ... ద్ధాః = రతనంపు మొలకలు - చిన్నరత్నములు - వలయాలలో తాప(దగినంతటివి - వాని మొత్తము తాపినట్టివి. కావుననే - సున్దరతరాః = మిక్కిలి యందమైనవియు, ఐన వలయములును - మురుగులును!

తత స్తేన దుష్టహస్తినా కరచరణరదనైః ఫుల్లనలినీ మివ నగరీ ముజ్జయినీ మవగాహమానేన సమాసాదితః పరివ్రాజకః. తం చ పరిభ్రష్ట దణ్డ కుణ్డికాభాజనం శీకరైః సిక్త్వా దన్తాన్తరే క్షిప్తం ప్రేక్ష్య పున రప్యుద్ఘుష్టం జనేన – 'హా, పరివ్రాజకో వ్యాపాద్యతే' – ఇతి. [తదో తేణ దుట్ఠహత్థిణా కలచలణరదణేహిం ఫుల్లణలిణిం విఅ ణఅరిం ఉజ్జయిణిం అవగాహమాణేణ సమాసాదిదో పరివ్వాజఓ. తచ్చ పరిబ్భట్ట దణ్డ కుణ్డిఆభాఅణం సీఅరేహిం సిఞ్చిఅ దన్తన్తరే క్ఖిత్తం పేక్ఖిఅ పుణో వి ఉగ్ఘుట్టం జణేణ. – 'హా, పరివ్వాజఓ వావాదీఅది' త్తి.

వసన్త—(ససంభ్రమమ్) అహో ప్రమాదః, అహో ప్రమాదః. [అహో పమాదో, అహో పమాదో].

కర్ణ—అలం సంభ్రమేణ. శృణోతు తావ దార్యా. తతో విచ్ఛిన్న విసంష్ఠులశృఙ్ఖలాకలాప ముద్వహన్తం దన్తాన్తరపరిగృహీతం

---

కాళ్ళవి, మొలవి, చేతులవి - అందెలు నూళ్ళు మురుగులు - అదరి కదలి తెగి విఱిగి పోవుచున్నవి - సంభ్రమమున. చెలువలవి కాఁబోలు. వారు భయముచే అట్లు ఉరవడించుచున్నారు - ఏనుఁగుం జూచి.

తతః తేన దుష్టహస్తినా ... = అంతట యాదుండగపు టేనుఁగుచేత. తొండముతోను పాదాలతోను దంతాలతోను, పూచిన తామరకొలనిలోనుం బోలె, ఉజ్జయినీనగరమున మునిఁగి కలంచుచుంబోలె పోవుచున్నదానిచేత పట్టుకొనఁబడినాఁడు, ఒక సన్న్యాసి. వానిని, చేతికఱ్ఱయు కమండలుపాత్రయు జాఱి పడిపోయినవానిని, తుంపురులతో తడిపి. (ఎత్తి) దంతాలనడుము వేసికొనఁబడిన వానిని చూచి మరలను ఉద్ఘోషింపఁబడినది జనులచేత - అయ్యో, పరివ్రాజకుఁడు చంపఁబడుచున్నాఁడు అని. ససంభ్రమమ్ = తొట్రుపాటుతో - అయ్యో ప్రమాదము (= అపాయము)! మాను తొట్రుపాటు - వినునుగాక అక్కయ్య - తతో విచ్ఛిన్న ... = అంతట తెగి చిక్కువడి ఆడుచున్న గొలుసుపేటలను మోచుచున్నదియు, దంతాలనడుమం గొనఁబడిన పరివ్రాజకుని మోచుచున్నదియు నగు దానిం

పరివ్రాజక ముద్వహ న్తం తం ప్రేక్ష్య కర్ణపూరకేణ మయా, న హి న హి, ఆర్యయా అన్నపిణ్డపుష్టేన దాసేన, వామచరణేన ద్యూతలేఖకం ఉద్ఘృష్యోద్ఘృష్య త్వరిత మాపణాత్ లోహదణ్డాం గృహీత్వా ఆకారితః స దుష్టహస్తీ.

[అలం సంభ్రమేణ. సుణాదు దావ అజ్జఆ. తదో విచ్ఛిణ్ణ విసంతుల సిఙ్ఖలాకలావఅం ఉవ్వహన్తం దన్తన్తరపరిగ్గహిదం పరివ్వాజఅం ఉవ్వహన్తం తం పేక్ఖిఅ కణ్ణఊరఏణ మఏ, ణ హి ణ హి, అజ్జఆఏ అన్నపిణ్డఉట్ఠేణ దాసేణ, వామచలణేణ జూదలేక్ఖఅం ఉఘ్ఘుసిఅ తురిదం ఆవణాదో లోహదణ్డం గేణ్హిఅ ఆఆరిదో సో దుట్ట హత్థీ].

వసన్త—తత స్తతః. [తదో తదో].

జూచి, కర్ణపూరకుఁడనైన నాచేత, కాదు కాదు, అక్కయ్యాయన్నపుముద్దలం బలిసిన దాసుని చేత, ఎడమకాలితో - దాసేన వామచరణేన ద్యూతలేఖకం (మాధురుని) ఉద్ఘృష్యోద్ఘృష్య త్వరితం ఆపణాత్ ... = ప్రాకృతము - ఉగ్ఘుసిఅ ఉగ్ఘుసిఅ - అని ఒక పాఠము. ఉద్ఘృష్యోద్ఘృష్య - ఎడమకాలితో అనఁగా అంత యవలీలగా జూదపులెక్కగానిని - దారిలో అడ్డముగా నున్నవానిని, అవలికి నెట్టి నెట్టి. నలిపి అరఁగదీసి ఉగ్ఘుసిఅ అను ప్రాకృతమునకు ఛాయ ఉద్ఘృష్య అనియు కావచ్చును, 'ఉద్ఘుష్య' (= అఱచి) అనియు కావచ్చును. 'అఱచి' యన్నదానికి వాఁడేమైనాఁడో. బదులుపలికినాఁడో, తొలగినాఁడో - అది యిందులేదు. తనకు సాయపడను కేక వేసినాఁడు అనుటకు తాను చెప్పుకొనుచున్న తన బలాధిక్యమునకు అది అసంగతమగును. వాఁడు దారిలో అడ్డముగా నున్న వానిని ఎడమపాదముతోనే ఎత్తి అవలికి నెట్టుచు - అనుట శ్రేయము - 'ఉద్ఘృష్య' అనుట వే. వేం. వారిచే అనుగృహీతము. త్వరితం ... = వడివడిగా అంగడి నుండి (లావు) యినుపకట్టను - గుదియను - ఎత్తుకొని అదుష్టగజము అదల్చి అఱచి 'రా, ఇటురా' అని యనంబడినది.

కర్ణ—

శ్లో. ఆహత్య సరోషం తం హస్తినం విన్ధ్యశైలశిఖరాభమ్
మోచితో మయా స దన్తాన్తరసంస్థితః పరివ్రాజకః. ౨౦

[ఆహణిఊణ సరోసం తం హత్థిం విఙ్ఝసెలసిహరాభమ్
మోఆవిఓ మఏ సో దన్తన్తరసంఠిఓ పరివ్వాజఓ]

వసన్త—సుష్ఠు త్వయా కృతమ్. తత స్తతః. [సుట్ఠు దే కిదమ్. తదో తదో].

కర్ణ—తత ఆర్యే, 'సాధు రే కర్ణపూరక, సాధు' ఇత్యేతావన్మాత్రం భణన్తీ, విషమభరాక్రాన్తా ఇవ నౌః, ఏకతః పర్యస్తా సకలోజ్జయి న్యాసీత్. తత ఆర్యే, ఏకేన శూన్యా న్యాభరణస్థానాని పరామృశ్య ఊర్ధ్వం ప్రేక్ష్య దీర్ఘం నిశ్వ స్యాయం ప్రావారకో మ మోపరి క్షిప్తః,

---

శ్లో. ౨౦. విన్ధ్య ... = భం = వింజపుకొండ కొమ్ముంబోని, తం హస్తినం = ఆ యేనుఁగును, సరోషం=కోపముతో (బుసకొట్టుచు ఘీంకరించుచు) ఉన్నదానిని, ఆహత్య = కొట్టి, మయా = నాచేత, సః దన్తాన్తరసంస్థితః = దంతాలనడుమ నున్న, ఆ, పరివ్రాజకః = సన్న్యాసి - శ్రమణకుఁడు, మోచితః = విడిపింపఁబడినాఁడు.

అగుడియంగొని నేను వింజపుఁగొమ్ముంబోని ఆ యేనుఁగును, కోపముతో బుసకొట్టుచున్నదానిని కొట్టి ఆసన్న్యాసిని దాని దంతాలసందున ఉన్నవానిని విడిపించితిని.

సుష్ఠు ...=భేష్‌గా చేసితివి! తర్వాత తర్వాత. తతః ఆర్యే ...=అంతట అక్కా, బళిరా కర్ణపూరక, బళిరా-అని మాత్రము పలుకుచు ఉజ్జయిని అంతయు, మోయరానంత బరువు ఒకతట్టు పేర్వఁబడిన యోడవలె, అటు ఒరిగి - ఒడ్డగిల్లి - నష్టైనది - ఉజ్జయిని జనులందఱు మెత్తముగా ఆ యేనుఁగును నన్ను సన్న్యాసినిం

[తదో అజ్జఏ 'సాహు రే కణ్ణఊరఅ, సాహు' త్తి ఎత్తి అమేత్తం భణాస్మి, విసమభరక్కన్తా విఅణావా, ఎక్కదో పల్హత్థా సఅలా ఉజ్జయిణీ ఆసి. తదో అజ్జఏ, ఎక్కేణ సుణ్ణాఇం ఆహరణట్ఠాణాఇం పరాముసిఅ ఉద్ధం పేక్ఖిఅ దీహం ణిససిఅ అఅం పావారఓ మమ ఉవరి ఖిత్తో].

వసన్త—కర్ణపూరక, జానీహి తావ త్కిమేష జాతీకుసుమవాసితః ప్రావారకో న వేతి. [కణ్ణఊరఅ, జాణీహి దావ కిం ఏసో జాదీకుసుమవాసిదో పావారఓ ణ వేత్తి].

కర్ణ—ఆర్యే, మదగన్ధేన సుష్ఠు తం గన్ధం న జానామి. [అజ్జఏ, మదగన్ధేణ సుట్టు తం గన్ధం ణ జాణామి].

వసన్త—నామాపి తావ త్ప్రేక్షస్వ. [ణామం పి దావ పేక్ఖ].

కర్ణ—ఇదం నామ, మార్యైవ వాచయతు. [ఇమం ణామం. అజ్జఆ ఎవ్వ వాఏదు] (ఇతి ప్రావారక ముపనయతి.

వసన్త—ఆర్యచారుదత్తస్య. [అజ్జచారుదత్తస్స].

(ఇతి వాచయిత్వా సస్పృహం గృహీత్వా ప్రావృణోతి.

జూచుటకు ఆతట్టుకు గుంపులువడి మూఁగిరి. అంతట, అక్కా - ఒకాయన. (తన) నగలుపెట్టుకొను చోట్లు - చేతులు బుజాలు మెడ మొదలైనవి, తడవుకొని, అవి శూన్యముగా నున్నందులకు మిన్ను చూచి నిట్టూర్చి, ఈయుత్తరీయము నామీఁద వేసినాఁడు. కర్ణపూరక జానీహితావత్ ... = కర్ణపూరక, ఎఱుఁగుదువా అది జాజులవాసన గుప్పిన ఉత్తరీయ మవునో కాదో అని? ఆర్యే, మదగన్ధేన ... = అక్క (అ) యేనుఁగు మదపువాసనచే, చక్కఁగా ఆవాసనను పసిపట్టనైతిని. నామాపి ... = పేరైనను చూడుము. ఇదిగో పేరు, అక్కయే చదువునుగాక - (నాకు అక్షరాలు తెలియవు) ఆర్యచారుదత్తస్య ... = చారుదత్తయ్యది. - అని

చేటీ—కర్ణపూరక, శోభత ఆర్యాయాః ప్రావారకః. [కణ్ణఊరఅ, సోహది అజ్జఆఏ పావారఓ]

కర్ణ—ఆం, శోభత ఆర్యాయాః ప్రావారకః. [ఆ, సోహది అజ్జఆఏ పావారఓ]

వసన్త—కర్ణపూర, ఇదం తే పారితోషికమ్. [కణ్ణఊరఅ, ఇదం దే పారితోసిఅమ్]. (ఇత్యాభరణం ప్రయచ్ఛతి.

కర్ణ—(శిరసా గృహీత్వా ప్రణమ్య చ) సాంప్రతం సుష్ఠు శోభత ఆర్యాయాః ప్రావారకః. [సంపదం సుట్ఠు సోహది అజ్జఆఏ పావారఓ]

వసన్త—కర్ణపూరక, ఏతస్యాం వేలాయాం కు త్రార్య చారుదత్తః? [కణ్ణఊరఅ, ఏదాఏ వేలాఏ కహిం అజ్జచారుదత్తో?].

కర్ణ—ఏతే నైవ మార్గేణ ప్రవృత్తో గన్తుం గేహమ్. [ఏదేణ జ్జేవ మగ్గేణ పవుత్తో గన్తాం గేహమ్].

వసన్త—చేటి, ఉపరితన మలిన్దక మారు హ్యార్యచారు దత్తం పశ్యామః. [హఞ్జే, ఉవరిదణం అలిన్దఅం ఆరుహిఅ అజ్జ చారుదత్తం పేక్ఖే హ్మ].

చదివి తమకముతో కైకొని తాను తన్ను కప్పుకొనును. కర్ణపూరక, శోభతే ఆర్యాయాః ...=అక్కగారి ఉత్తరీయము అందముగా ఉండలేదా? అవును అక్కగారి ఉత్తరీయము అందముగా ఉన్నది. కర్ణపూరక, ఇదం తే ...=ఇదిగో నీకు ఇనాము. అని ఆభరణము ఒసఁగుచున్నది. తలతో గ్రహించి, నమస్కరించి, ఇప్పుడు బలె ఒప్పియున్నది, అక్కగారి ఉత్తరీయము. కర్ణపూరక, ఏతస్యాం వేలాయాం ... = ఎక్కడరా ఈ వేళలో యిప్పుడు చారుదత్తయ్య? ఏతే నైవ ... = ఈ మార్గాననే ఇంటికి పోఁదొడంగినాఁడు, చేటి, (రావే), ఉపరితనం ... = ఎక్కి మిద్దెమీఁది తలవాకిటి పైగది (ముంగిలి - మొగసాల)నుండి అయ్యగారిని చూతము.

[ఇతి నిష్క్రాన్తాః సర్వే]

ఇతి ద్యూతకరసంవాహకో నామ

ద్వితీయోఽఙ్కః

నిష్క్రాన్తాఃసర్వే - అంకాంతమున సర్వపాత్రనిష్క్రమణముం జెప్ప వలసినదని శాస్త్రము.

తొలియంకము కడపట వసంతసేనయింటివాకిట అవెన్నెలలో అట్లు చారుదత్తవసంతసేనలు సానురాగదృష్టులతో ఒండొరుల వీడ్కొనిరి కదా. వసంతసేనకు ఆరాత్రి నిద్రపట్టని విరాళి కలిగియుండును-[చారుదత్తునికిని కలిగిన దని అతఁడు చెప్పఁగలఁడు - V - 37 - 'సదాప్రదోషో మమయాతి జాగ్రతః, సదాచమే నిశ్వసతో గతా నిశా ... ' అని] చారుదత్తుఁడు 'తిష్ఠతు ప్రణయః' అని ఈపూట ఇక్కడ నుండుము అన్నను - [చారుదత్తుని యీవాక్యమునకు ఇది భావమని వసంతసేనయే వ్యాఖ్యానించినది. కాదేని మఱేదేని భావప్రదర్శన వాక్య ముండి, గ్రంథ పాతమాయెనా? 1 '... నయుక్త మద్యేదృశేన ఇహాగతయా మయా ప్రతివస్తుమ్.] అన్నందులకు అంతకు వచ్చినాఁడని సంతసించినను [చతురో మధురోఽయ ముపన్యాసః] ఉండక, ఉపాయమని యెంచి, నగయిల్లడ పెట్టి వచ్చితిని గదా. అతనికి నామీఁద గట్టినలపే కలిగింపఁ గలిగితిని. కాని యిఁక పైయెత్తు, ఏమి, యెట్లు అని తలపోయుచు, ఆ చారుదత్తుని యందము నే భావించుకొనుచు, ఒక్కటే తన్మయముగా పరధ్యానముగా నిదురించి అట్లేమేల్కాంచినది. నాఁడు ప్రొద్దెక్కుచున్నను నిత్యస్నాన దేవతాపూజలకును తనకు ఓపిక లేదు. అప్పటికి మానుకొన్నది. ఆ పరధ్యానమున, మైమఱపున, చేటి తనతో ఏమియుం బలుకకున్నను 'తర్వాత తర్వాత' అని. తన విరాళితో దానికి తెలిసి పోయినది. అంతట ఆయనపేరు పేట అంతయు దానిచే నొకసారి చెప్పించుకొన్నది. ధనమునకు కాదే, గుణమునకును రమించుటకును నేను కామించుట, మీరు నవ్వుదురేమో; ఆయన మరల ఇక్కడికి వచ్చుటో నేను అక్కడికి పోవుటో జరుగనీ అని తాను నగను ఇల్లడ పెట్టివచ్చినట్లు దానితో తలపోసికొన్నది.

ఇంతలో జూదాన ఓడి సభికునిచే కొట్టి తఱుమఁబడుచున్న సంవాహకుఁడు ఇల్లు సొచ్చి శరణు అన్నాఁడు. ఔదార్యశీలముచే వానికి నిరభ్యంతరముగా 'సరి' అని, వాఁడు ప్రస్తావ వశమున చారుదత్తునికి సంవాహకుఁడుగా నున్న వాఁడని

అతనివలన చారుదత్తుని మేలి గుణములు మరల విని, తదీయుఁడని ఉపచరించి, అతనిని అప్పులవారివలన విడిపించి పంపినది. ఈ పెను ప్రత్యుపకారము ఏమి, ఎట్లు అన్న చింతతోనే వాఁడు సన్న్యసింపంబోయినాఁడు.

ఇంతలో ఆదారిం బోవుచు చారుదత్తుఁడు వసంతసేన నౌకరు కర్ణపూరకుఁడు అసహాయముగా కంబము విఱుచుకొని కట్టు తెంపుకొని వీథింబడిన దుండగాల వసంతసేనయేనుఁగును అవలీలగా పట్టి కట్టుటం జూచి, మెచ్చుకొని, తనచేత మఱేమియు లేమి, ఆ జాజుల వాసన యంగవస్త్రము అతనికి ఇనాము ఇచ్చి, నిరుత్తరీయముగా ఆదారిం బోవుచుండెను. వసంతసేన కర్ణపూరకుని వలన ఈ కథ యెల్ల విని, ఆ యంగవస్త్రముం దాఁగొని, కర్ణపూరునికి వేఱు ఇనామిచ్చి పంపి, దాన తన్నుం గప్పుకొని అట్లు తదంగస్పృష్ట స్పృష్టికతో తన విరాళి కాకను ఒకింత యార్చుకొనుచు, అప్పటికి తన వాకిటినే దాఁటి వీథిం బోవుచున్నాఁడు చారుదత్తుఁడు అని విని మిద్దెమీఁదికి యెక్కి అతనిని చూపుమేర దాఁటి పోవువఱకు కాంచుచు మొగసాలలో నిలంబడును. ఇది ఆ మఱునాఁటి పూర్వాహ్ణపుఁ గథ.

జూదపు జగడాల వలన రాజ్య ధర్మపాలన తెఱఁగు కొంత ఎఱుకపడును. రాజుం దొలఁగింప పితూరి రాజుచున్నదని జూదభ్రష్టుఁడు దర్దురకుఁడు పితూరి దారులం జేరఁ బోవును.

ఇది ద్యూతకరసంవాహకము

అను రెండవ యంకము

ముగిసినది



# తృతీయోఽఙ్కః



(తతః ప్రవిశతి చేటః)

చేటః—

శ్లో. సుజనః ఖలు భృత్యానుకమ్పకః
స్వామీ నిర్ధనకోఽపి శోభతే
పిశునః పున ర్ద్రివ్యగర్వితో
దుష్కరః ఖలు పరిణామదారుణః. ౧

[సుఅణో క్ఖు భిచ్చాణుకమ్పకే
శామిఏ ణిద్ధణకే వి శోహదే
పిశుణే ఉణ దవ్వగవ్విదే
దుక్కలే క్ఖు పలిణామదాలుణే]

---

తతః ప్రవిశతి చేటః - అంతట చేటుఁడు, చారుదత్తయ్య నౌకరు ప్రవేశించు చున్నాఁడు (= రంగాన అగపడుచున్నాఁడు.)

శ్లో. ౧. సుజనః = మంచి (సౌశీల్యాదార్యాదుల నడవడి కల) వాఁడు భృత్యానుకమ్పకః = నౌకరులందు దయగలవాఁడు నైన, స్వామీ = ఒడయుఁడు, నిర్ధనకః అపి = ధనములేని (బీద)వాఁడైనను, శోభతే ఖలు = రాణించును గదా - పిశునః = కొండీఁడు - ఉత్త తంటాలు చెప్పువాఁడు - చీటికిమాటికి తప్పు పట్టువాఁడు - నీచుఁడు - క్రూరుఁడు, పునః = మఱియు, ద్రవ్యగర్వితః = ధనముచే పొగరుకొన్నవాఁడును, పరిణామ దారుణః = ఫలకాలమున క్రూరుఁడు - అనుగ్రహము చూపనివాఁడును ఐన, (స్వామి, మిడిమేళపుదొర) దుష్కరః ఖలు = కొలువను సాధ్యపడఁడు గదా - అట్టివాని కొలువు శక్యము కాదు గదా.

అపి చ, [అవి అ],

శ్లో. సస్యలమ్పటబలీవర్దో న శక్యో వారయితు
మన్యప్రసక్తకలత్రం న శక్యం వారయితుమ్
ద్యూతప్రసక్తమనుష్యో న శక్యో వారయితుమ్
యో ఽపి స్వాభావికదోషో న శక్యో వారయితుమ్.

[శశ్శపలక్క వలహే ణ శక్కి వాలిదుం
అణ్ణపశత్తకలత్తే ణ శక్కి వాలిదుమ్
జూదపశత్తమణుశ్శో ణ శక్కి వాలిదుం
జే వి శహావిఅదోశే ణ శక్కి వాలిదుమ్].

కా ఽపి వేలార్యచారుదత్తస్య గాన్ధర్వం శ్రోతుం గతస్య. అతి క్రామ త్యర్ధజనీ. అ ద్యాపి న గచ్ఛతి. త ద్యావ ద్బహిర్ద్వార

మిక్కిలి దయగలిగియుండుటయు, కోపము లేకుండుటయు సాకరు కోరఁ దగిన ఒడయని గుణములు. అట్టివాని కొలువు సులువు. కలిమిచే పొగరుపోతు, చీటికిమాటికి తప్పులు పట్టి చాడీలు చెప్పి కడపటికి, ఏదేని యినాము ఈయవలసిన సమయమున ఏదేని వంక పెట్టి, నీవక్కఱలే దని తఱుముువాఁడు నైన వానికొలువు ఎంతయు కష్టము. మాచారుదత్తయ్య స్వామి అట్టి సుజనము! - అని యనుకొనుట.

శ్లో. ౨. సస్య లమ్పట బలీవర్దః = పైరుమరగిన - దాన నత్యాసక్తమైన యెద్దును - ఏమరుపాటున పొలముపైబడి పైరు మేయ మరగినట్టిది అనుట, వారయితుం న శక్యమ్ = మాన్పను అలవిపడదు, అన్య ప్రసక్త కలత్రం = పరపురుషుని మరగిన భార్య, వారయితుం న శక్యమ్ = (ఆ పురుషునుండి) మాన్పుటకు శక్యకాదు. ద్యూత ప్రసక్తమనుష్యః = జూదముమరగిన జనమును, వారయితుం న శక్యః = (అడఁ బోనీక) మాన్పుటకు అలవిపడఁడు. అట్లే యః అపి స్వాభావికదోషః = ఏది, తనంతటనే స్వభావము - పుట్టుక - చేతనే కలిగినదో, ఆదోషమును, వారయితుం న శక్యః = మాన్పరానిది అగును.

కా అపి వేళా = అబ్బా! ఎంతసే పైనదయ్యా! ఆర్యచారుదత్తస్య గాన్ధర్వం శ్రోతుం గతస్య = చారుదత్తయ్య పాటవినుటకు పోయి! అతిక్రామతి ... = దాఁటుచున్నది అర్ధరాత్రి! అద్యాపి ... = ఇప్పటికిని

శాలాయాం గత్వా స్వప్స్యామి. [ కావి వేలా అజ్జచారుదత్తశ్శ గన్ధవ్వం శుణిదుం గదశ్శ. అదిక్కమది అద్ధలఅణీ. అజ్జ వి ణ ఆఅచ్ఛది. తా జావ బాహిలదుఆలశాలాఏ గదుఅ శువిశ్శమ్. ]

(ఇతి తథా కరోతి

(తతః ప్రవిశతి చారుదత్తో విదూషకశ్చ)

చారు—అహో అహో, సాధు సాధు, రేభిలేన గీతమ్. వీణా హి నా మాసముద్రోత్థితం రత్నమ్. కుతః -

శ్లో. ఉత్కణ్ఠితస్య హృదయానుగుణా వయస్యా,
సంకేతకే చిరయతి ప్రవరో వినోదః,

---

రాకున్నాఁడు. తత్ ... = బయట వాకిటిశాలలో, పహారావారుండుచోటికి పోయి, నిద్రింతును. (ఇంతవఱకు ఎట్లో మేలుకొని యుండినాఁడు - ఇఁకను వాకిటినుండి ఆయనపిలుపు సులువుగా వినఁబడఁగల చోటికిపోయి ఐనను నిద్రింతును - అనుట ) అహో ... = ఆహా ఆహా, బలె, రేభిలభావపాట! బలేపాడినాఁడు రేభిలభావ! వీణ యనఁగా సముద్రమునం బుట్టని రత్నము గదా - అసాధారణమైన చోట పుట్టినదానికి మామూలు చోటిదానికన్నను గుణమెక్కువ, దానిని మించి నట్టిది అనుట. రేభిలుఁడు కోమటి - కావున మర్యాదగా భావ యనుట. నోటంబాడుచు వీణను వాయించినాఁడు. కుతః = ఏలయన.

శ్లో. 3. ఉత్కణ్ఠితస్య = విరహమున, సమాగమమునకై తహ తహ పడువానికి, హృదయానుగుణా వయస్యా = మనసుకు అనుకూలయయిన చెలి. - మధుర శబ్దములతో ఇంపులు పలికి సంతాపము హరించి ఓదార్చునది, సఙ్కేతకే = ఇక్కడ కలసికొందునని ఏర్పాటు చేసికొన్నవాఁడు, లేక ఇక్కడ కలసికొందము అను నిశ్చయము చేసికొన్నచోట. చిరయతి = స్త్రీయో పురుషుఁడో ముందువచ్చిన జనము అన్యజనము రాక ఏర్పాటు వేళ అతిక్రమించు చున్నప్పుడు, ప్రవరః = శ్రేష్ఠమైన - పా. - ప్రచురః = గొప్ప, వినోదః = కాలయాపనోపాయము - ఆ

సంస్థాపనా ప్రియతమా విరహాతురాణాం,
రక్తస్య రాగపరివృద్ధికరః ప్రమోదః. 3

విదూ—భోః, ఏహి, గృహం గచ్ఛావః. [భో, ఏహి, గేహం గచ్ఛేమ్హ].

చారు—అహో, సుష్ఠు భావ రేభిలేన గీతమ్.

విదూ—మమ తావ ద్ద్వాభ్యా మేవ హాస్యం జాయతే స్త్రియా సంస్కృతం పఠన్త్యా, మానుష్యేణ చ కాకలీం గాయతా.

కనుపెట్టుకొన వలయు వేళ క్షణ మొక కల్పముగా నుండును గాన, ప్రియతమా విరహాతురాణాం = (సమాసముగా) ప్రేయసివలని విరహముతో బాధపడువారికి, కాదా - (వ్యాసముగా) విరహాతురాణాం = వియోగముతో బాధపడువారికి, ప్రియతమా = ఎంతయు ప్రియమైన, సంస్థాపనా = దేహప్రాణములను నిలువరించు నది. - మేఘమున యక్షుని వియోగమున కాంతంగూర్చి కాళిదాసు -

ఉత్సఙ్గే వా మలినవసనే సౌమ్య నిక్షిప్య వీణాం
మద్గోత్రాఙ్కం విరచితపదం గేయ ముద్గాతుకామా - మేఘ II

రక్తస్య = అనురాగము గొన్నవానికి, రాగ = ఆయనురాగమును పెంచునట్టి, ప్రమోదః = సంతోషోత్సాహముల కారణము.

ఇందు ప్రథమపాదమున తొలుసారిగా అయోగదుఃఖితుఁ డైనవానిని చెలికత్తె ఊఱడించుటయు, రెండవపాదమున సంకేతము అనుటచే పరకీయాజారుల వినోదించుటయు, మూఁడవపాదమున పరిణయమై ప్రేమనిరూఢమైన వారి యెడ బాటున వారికి దేహప్రాణముల నిలువరించుటయు, నాలవపాదమున అట్టి యా యాపదను తొలఁగించుటయ కాక సంగడీనికి అనురాగము బెంచుటయు చెప్పఁబడినది.

భోః ఏహి గృహం గచ్ఛావః = రావయ్యా, ఇంటికి పోవుదము. ఆతనికి పాటలో రుచి లేదు - ఇంటికి (నిదురింపఁ) బోవ తొందర. మఱి చారుదత్తునికి ముగిసినను ఆపాట చెవిలో వినంబడు చున్నట్లే ఉన్నది రక్తిచేత ఇంకను. కావున అతనికి అదే తలంపు - బలే పాడినాఁడయ్యా రేభిలభావ!

మమ తావత్ ... = నాకన్నను రెంటిచేతనే నవ్వుకలుగును - ఆఁడుది సంస్కృతము పఠించుటయు, మానిసి - పురుషుఁడు - సూక్ష్మస్వక్త మధుర

స్త్రీ తావ త్సంస్కృతం పఠన్తీ, దత్తనవన స్యేవ గృష్టిః, అధికం సూసూశబ్దం కరోతి. మనుష్యో ఽపి కాకలీం గాయన్, శుష్క సుమనోదామ వేష్టితో వృద్ధపురోహిత ఇవ మన్త్రం జపన్, దృఢం మే న రోచతే.

[ మమ దావ దువేహిం జ్జేవ హాస్సం జాఅది. ఇత్థిఆవ సక్కఅం పఠన్తీఏ, మణుస్సేణ అ కాఅలీం గాఅన్తేణ. ఇత్థిఆ దావ సక్కఅం పఠన్తీ దిణ్ణణవణస్సా విఅ గిడ్డీ, అహిఅం సుసుఆఅది. మణుస్సో వి కాఅలీం గాఅన్తో, సుక్ఖసుమణోదామవేట్టిదో బుడ్ఢ పురోహిదో విఅ మన్తం జవన్తో, దిఢం మే ణ రోఅది ].

చారు—వయస్య, సుష్ఠు ఖల్వద్య గీతం భావరేభిలేన. నచ భవా న్పరితుష్టః !

శ్లో. రక్తం చ నామ మధురం చ సమం స్ఫుటం చ
భావాన్వితం చ లలితం చ మనోహరం చ

---

ధ్వని చేయుచు పాడుటయు. స్త్రీ యన్ననో సంస్కృతము పఠించుచో ముక్కు త్రాడు వేసిన తొలియీత యావువలె, ఎక్కువగా సూసూ శబ్దము చేయును. మానిసియు అవ్యక్త మధురముగా పాడుచు, ఎండిన పూలమాల చుట్టుకొని మంత్రజపము చేయుచున్న ముసలి బాపన పౌరోహితునివలె - ఇది నాకు ఎంతయు - ఇంచుకయు అనుట - ఇష్టము గాదు.

సుష్ఠు ఖలు ... = ఇప్పుడు ఎంతో చక్కఁగాకదా రేభిలభావ పాడినాఁడు ! మఱి అది నీకు పరితోషము కలిగింపదాయెను.

శ్లో. ర. నామ - ప్రసిద్ధమేసుమా ! (గీతము - పాట) రక్తం చ = వీణె గొంతుల స్వరము లొక్కటై మనస్సును హరించునది, మధురంచ = కమ్మగా, వినుటకు, తియ్యగా ఉన్నది, సమం చ = తొడంగినది మొదలు తుదివఱకు ఎట్లున్న ఒకే తీఱుగా నుండునో అట్లుండినది, స్ఫుటం చ = మాటలన్నియు చక్కఁగా తెలియునట్లు విడివిడిగా నుండినది, భావాన్వితమ్ = అందులో భావ మేమో అది తోఁచునట్లు దానితో కూడుకొని యుండినది, లలితం చ = సుకుమారముగా ఉండి నది, మనోహారం చ = (ఏల పలు మాటలు ?) మనసును దొంగిలునట్లు ఉండినది,

కిం వా ప్రశస్తి వచనై ర్బహుభి ర్మదుక్తై
రన్తర్హితా యది భవే ద్వని తేతి మన్యే ౪

అపి చ,

శ్లో. తం తస్య స్వర సంక్రమం మృదుగిరః
శ్లిష్టం చ తన్త్రీస్వనం
వర్ణానా మపి మూర్ఛనా న్తరగతం
తారం విరామే మృదుమ్
హేలాసంయమితం పునశ్చ లలితం

మదుక్తైః = నేను పలికెడు, ప్రశస్తివచనైః = మెచ్చుకోలుమాటలు, బహుభిః = పెక్కులు, వః కిం = నీకు ఎందులకు? (ఒక్కటే మాట!) అన్తర్హితా యది భవేత్ = కనుమఱుగున నుండెనేని, వనితా ఇతి = ఎంతయు అనురాగముగల స్త్రీయే అని, మన్యే = తలంతును.

రక్తము - రక్తి - స్వరములు వేర్వేరైనను ఒక్కటిగా పొందికపడుట. స్ఫుటం - అనఁగా అక్షరాలు పొల్లులు మాటలు లెస్సగా విడిగా వినంబడుట. పాటకు ఉండవలయు గుణము లన్నియు కలిగి సుకుమారమై ఒక యనురక్త స్త్రీయే మఱుంగున నుండి పాడుచున్నదా అనిపించినదే. మఱి నీకేమయ్యా బాగుగా లే దనుచున్నావు?

శ్లో. ౫. మృదుగిరః = చెవికి ఇంపైన పలుకు గల, తస్య = ఆ రేభిలుని యొక్క, తం = ఆ - ఇప్పటికిని నాచెవిం బడుచున్నట్లే ఉన్న, స్వరసఙ్క్రమమ్ = స్వరము స్వరమునం జొరుటయు, శ్లిష్టం = దానితో - వీడరాక వేర్పడకుండిన - తన్త్రీస్వనం = వీణ (తంతెల) మ్రోఁతయు, వర్ణానాం అపి = (గానపు) అక్షరముల యొక్క, మూర్ఛనాన్తరగతం = గొంతు ఎత్తుట దింపుటల లోని, తారం = గట్టి - పెద్ద - ధ్వనియు, విరామే = ముగింపున, మృదుమ్ = తేలికయైన - సుకుమారధ్వనియు, హేలాసంయమితం = తాళము యతి మొదలగు నెడల, అశ్రమముగా ఆయాకట్టుబాట్లు కలదియు - అఁగినదియు, పునః చ = మఱియు, లలితమ్ = సుకుమారముగా - ఆయాసము లేనియట్లుగా (మరల) తొడంగఁబడినదియు.

రాగద్విరుచ్చారితమ్
యత్సత్యం విరతే౽పి గీతసమయే
గచ్ఛామి శృణ్వన్నివ. ౫

అనఁగా అవసానమందేమి, ఆరంభమందేమి అనాయాసముగా - తన అభ్యాస నైపుణులచేత - కలిగింపఁబడిన తాళము లయ మొదలగు కొలతలు కలదియు, రాగద్విరుచ్చారితమ్ = రక్తివలన - తన(యు, శ్రోతలయు) తన్మయతచే, రెండు తూర్లు - రెట్టించి - పలుకఁబడినదియు - అన్నియు. యత్సత్యం = నిజము చెప్పుచున్నాను, గీతసమయే = పాటకాలము, విరతే అపి = ముగిసిపోయినను, ఆట నుండి బయలుదేరినవాఁడనైనను, శృణ్వన్ ఇవ = వినుచుంబోలెనే, గచ్ఛామి = నడచుచున్నాను.

కొన్ని పారిభాషిక పదాల వివరణము.—

(1) తం తస్య స్వరసఙ్క్రమం - తం పూర్వశ్రుతం - స్వరాణాం నిషాదర్షభ గాన్ధారాదీనాం సం సమ్యక్ క్రమమ్ - ఆరోహావరోహరూపమ్ - తన్త్రీ - వీణా; మూర్ఛనా.

(2) 'యథావటుమ్బినః సర్వే౽ప్యేకీభూతా భవన్తిహి,
తథా స్వరాణాం సన్దోహో మూర్ఛనేత్యభిధీయతే'
ఇతి వచనాత్ స్వరసమూహానాం ఏకీభావ ఇతి టీకాకారః.
'క్రమాత్ స్వరాణాం సప్తానాం ఆరోహణావరోహణమ్,
సా మూర్ఛేత్యుచ్యతే గ్రామస్థా ఏతాః సప్త సప్త చ' ఇతి వచనాత్,
మూర్ఛనా స్వరాణాం ఆరోహావరోహ ఇతి మల్లినాథః.

(3) వర్ణానాం గానాక్షరాణాం మూర్ఛనా తస్యా అన్తరగతం మధ్యగతమ్. తారమ్ ఉచ్చమ్ - విరామే సమాప్తౌ మృదుకోమలమ్.

(4) హేలా రాగస్య ఆరోహావరోహయోః అనౌచిత్యం. తత్ర సంయమితం నియమితం, అనౌచిత్యాన్నివృత్తమితి భావః. తమాషాగా ముక్తాయింపుకు వచ్చును.

(5) తథా లలితం లాలిత్యాఖ్యగుణాన్వితమితి భావః.

(6) తథా రాగేషు ద్విరుచ్చారితమ్ ద్విరుక్తం ఏవం భూతం గీతం శృణ్వన్ - ఇత్యన్వయః. రాగాద్విరుచ్చారితమితి పాఠాన్తరమ్.

విదూ — భో వయస్య, ఆపణాన్తర రథ్యావిభాగేషు సుఖం కుక్కురా అపి సుప్తాః, తద్గృహం గచ్ఛావః. (అగ్రతో ఽవలోక్య) వయస్య, పశ్య, పశ్య, ఏషో ఉపన్ధకార స్యేవావకాశం దద దన్తరిక్షప్రాసాదా దవతరతి భగవాం శ్చన్ద్రః. [భో వఅస్స, ఆవణన్తరరచ్ఛావిభాఏసు సుహం కుక్కురా వి సుత్తా. తా గేహం గచ్ఛేమ్హ. వఅస్స, పేక్ఖ పేక్ఖ. ఏసో వి అన్ధఆరస్స విఅ అవఆసం దేన్తో అన్తరిక్ఖపాసాదాదో ఓదరది భఅవం చన్దో].

రేభిలభావ శారీరము ఎంతయు మధురమైనది. వీణ (తంతె) క్రొఁత చెప్పవలయునా. రెండును విడదీయరాక ఒండొంటితో కలసిపోయినవి. ఇఁకను ఆపాట చెవికి అదెంత మధుర మగును! అందు ఆ స్వరము స్వరములో చొచ్చుట, రాగాలాపన మూర్ఛనలలో ఆయావర్ణములు మొదట గట్టిగాను కడపట తేలిక - కోమలము - గాను ఉండుట. అవలీలగానే తాళ లయలు తప్పకుండుట, ఆకట్టుబాట్లున్నను, ఉన్నట్లు తోఁపక మరల సుకుమారముగానే యుండుట, చొక్కులలో రాగమును గెట్టించుట - అదంతయు, అరరే! నిజముగా పాటముగిసి నేను అటనుండి బయలుదేఱినవాఁడ నైనను నా చెవులలో ఆపాట యింకను వినంబడుచునే ఉన్నదయ్యా!

భోవయస్య ... = ఓవయస్యా. (సరేలే త్వరగా నడువవయ్యా!) (అర్ధరాత్రి దాఁటినది.) (వీధిలో) అంగళ్ళ నడిమి ప్రదేశములయందలి వీథిభాగములయందు కుక్కలు సయితము హాయిగా నిద్రించుచున్నవి. (అది అర్ధరాత్రి దాఁటిన గుఱుతు - అంతవఱకు అవి తిరుగుచు మొఱుగుచు నుండి ఇప్పటికి కన్నులు మూసినవి.) అగ్రతః అవలోక్య = ఎదుట చూచి, ఆవీథి తూర్పునుండి పడమరగా పర్వినది కావలయు, వారు పడమరకు నడుచుచున్నారు. నాఁడు అష్టమియేమో - అర్ధరాత్రానంతరము చంద్రుఁడు ఎదురుగా అస్తమించుచున్నాఁడు. (దానినే విదూషకుఁడు చెప్పుచున్నాఁడు) వయస్య, చూడు చూడు, వీఁడుగో భగవంతుఁడు, చందురుఁడు చీకటికి చోటు ఇచ్చుచుంబలె, మింటిమేడనుండి దిగిపోవుచు (= అస్తమించుచు) ఉన్నాఁడు. (రాజునెదుర జనులు ఎడసి మఱుఁగున నుందురు. రాజులోపలికి పోఁగానే, అందఱును స్వేచ్ఛగా నడయాడుదురు.)

చారు—సమ్యగాహ భవాన్.

శ్లో. అసౌ హి దత్త్వా తిమిరావకాశ
మస్తం వ్రజత్యున్నతకోటి రిన్దుః
జలావగాఢస్య వనద్విపస్య
తీక్ష్ణం విషాణాగ్ర మి వావశిష్టమ్. ౬.

విదూ—భోః, ఇద మస్మాకం గేహమ్. వర్ధమానక, వర్ధ

---

శ్లో. ౬. అసౌ హి = వీఁడు - బాగుగా అగపడు చున్నాఁడు - శృంగములు సమముగా లేవు - ఒక దానికన్న ఒకటి ఎత్తు. పలుచదిముందు అదృశ్యమగును - ఎత్తుది ఒకటిగా అగపడుచుండి తరువాత అస్తమించును. కావున, ఉన్నత కోటిః = పైకి అగపడుచున్న కోటి (= కొన) కలవాఁడై, తిమిర అవకాశం దత్త్వా = చీకటికి అవకాశ మొసంగి, అస్తం వ్రజతి = అస్తమించు చున్నాఁడు. - క్రుంకుచో క్రింది కొన యగపడకపోయి, దేహమును క్రమముగా అగపడకపోయి, అగపడుచున్న పైకొనయును అగపడక మఱుఁగువడు చున్నాఁడు. అతఁ డెట్లున్నాఁడనఁగా - జలావగాఢస్య - (పెనుమడుఁగు) నీట మునిఁగిన, వనద్విపస్య = అడవి యేనుఁగుయొక్క, అవశిష్టం = మిగిలిన - (ఇఁక మునఁగవలసియున్న) తీక్ష్ణం = వాడియైన, విషాణ అగ్రం ఇవ = కొమ్ము - దంతము - కొనవలె.

వీఁడుగో చంద్రుఁడు అస్తమించుచున్నాఁడు - అష్టమి యగుటచే అర్ధబింబమగుటచే దానికి పైకోటి (కొన) క్రిందికోటియును గలవు, ఇప్పటికి క్రిందిది అస్తమున మఱుఁగుపడినది - పైది ఇంకను అగపడుచున్నది! (ఆదర్శనము రమణీయముగా నున్నది) ఇంతలో అదియును అగపడకయుం బోవును. ఏనుఁగును మడుఁగున మునిఁగి యీదులాడ నేర్చును - అప్పుడు ఒక్క కొమ్ముమాత్రము అగపడునట్లుగా, తక్కినదంతయును మునిఁగినట్లుగా ఉండనేర్చును, ఏనుఁగు - ఆదర్శనము రమణీయముగా నుండును.

ఏనుఁగే నల్లనిదైనను, దానిని మడుఁవులోముంచుట ఏక విషాణాగ్రదర్శనౌపమ్యసిద్ధికి. చీకటిపర్యాప్తమిన్ను, మునుఁగు ఏనుఁగువలె.

మానక. ఉద్ఘాటయ ద్వారమ్. [భోః ఏదం అమ్హాణం గేహమ్ వడ్ఢమాణఅ, వడ్ఢమాణఅ, ఉగ్ఘాటేహి దుఆరమ్].

చేటః—ఆర్యమైత్రేయస్య స్వరసంయోగః శ్రూయతే. ఆగత ఆర్యచారుదత్తః. తద్యావ ద్ద్వార మస్యోద్ఘాటయామి. (తథా కృత్వా) ఆర్య వన్దే. మైత్రేయ, త్వా మపి వన్దే, అత్ర విస్తీర్ణ ఆసనే, నిషీదతా మార్యౌ. [అజ్జమిత్తేఆహ శలశంజోఏ శుణీఅది. ఆగదే అజ్జచాలువత్తే. తా జావ దుఆలఅం శే ఉగ్ఘాడేమి. అజ్జ, వన్దామి. మిత్తేఅ, తుమం పి వన్దామి. ఏత్థ విత్థిణ్ణో ఆశణే ణిశే దన్తు అజ్జా].

(ఉభౌ నాట్యేన ప్రవిశ్యోపవిశతః)

విదూ—వర్ధమానక, రదనికా మాకారయ పాదౌ ధావితుమ్. [వర్ధమానక, రదణిఅం సద్దావేహి పాదాఇం ధోఇదుమ్].

చారు—(సానుకమ్పమ్) అలం సుప్తజనం ప్రబోధయితుమ్.

చేటః—ఆర్యమైత్రేయ, అహం పానీయం గృహ్ణామి. త్వం పాదౌ ధావ. [అజ్జమిత్తేఅ, అహం పాణిఅం గేణ్హ. తుమం పాదాఇం ధోవేహి].

ఉద్ఘాటయ ద్వారమ్ = వాకిలి తెఱవు. స్వరసంయోగః = పలుకుసవ్వడి. అత్ర విస్తీర్ణే ఆసనే = ఇటంబఱచిన ఆసనమందు ఆర్యులు ఇరువురుం గూర్చుందురుగాక. నాట్యేన = అభినయముచే - వాకిలి మొదలగున దంతయు అందు రంగాన అమరి యున్నదా? లేదు - ఉన్నట్లు. ప్రవేశించినట్లు, పట్టి అభినయము. శబ్దాపయ = పిలువుము, ధావితుమ్ = కడుగుటకు.

అలం సుప్తజనం ప్రబోధయితుమ్ - వలదు నిద్రించుజనమును లేపవలదు - 'అలం' - నిషేధార్థమున తృతీయతోను బోలె దీనికి తుమున్నతోను యోగము. చేటునకు మైత్రేయునిపై గౌరవమే, వారి చనవు - వర్ధమానకుఁడు.

విదూ—(సక్రోధమ్) భో వయస్య, ఏష ఇదానీం దాస్యాః పుత్రో భూత్వా పానీయం గృహ్ణాతి. మాం పున ర్బ్రాహ్మణం పాదౌ ధావయతి. [భో వఅస్స, ఏసో దాణిం దాసీఏ పుత్తో భవిఅ పాణిఅం గేణ్హది. మం ఉణ బహ్మణం పాదాఇం ధోవావేది].

చారు—వయస్య మైత్రేయ, త్వ ముదకం గృహాణ. వర్ధమానకః పాదౌ ప్రక్షాలయతు.

చేటః—ఆర్యమైత్రేయ, దేహ్యుదకమ్. [అజ్జమిత్తేఅ, దేహి ఉదఅమ్].

(విదూషక స్తథా కరోతి. చేట శ్చారుదత్తస్య పాదౌ ప్రక్షా ల్యాపసరతి)

చారు—దీయతాం బ్రాహ్మణస్య పాదోదకమ్.

విదూ—కిం మమ పాదోదకైః. భూమ్యా మేవ మయా తాడితగర్దభే నేవ పున రపి లోఠితవ్యమ్. [కిం మమ పాదోదఏహిం. భూమిఏ జ్జేవ మఏ తాడిదగద్దహేణ విఅ పుణోవి లోట్టిదవ్వమ్].

---

శూద్రుఁడు - నౌకరు. తాను పాదాలు కడుగవలసినవాఁడు, తాను నీరుపోయువా డనియు మైత్రేయుం గడుగుమనియు అనుచున్నాఁడు, అందులకు మైత్రేయుఁడు వానిని దాస్యాఃపుత్రః - (అలుక్ సమాసము, తిట్టు) లంజాకొడుక అనుచున్నాడు. - చారుదత్తుఁడు వారిని సరిపెట్టుచున్నాడు - వయస్య ... = గృహాణ, ... ప్రక్షాలయ - నీవు నీటిం గొనుము, వాఁడు పాదాలు కడుగును గాక.

ప్రక్షాల్య అపసరతి = కడిగి అవతలికి - తొలఁగి - పోవుచున్నాఁడు - మైత్రేయునికి నీళ్ళు ఈకయే. చారుదత్తుఁడు అనుచున్నాడు - దీయతాం ... = బ్రాహ్మణునికి కాలికి నీళ్ళు ఈఁబడును గాక - ఈరా అనుట. కిం మమ ... = నా కెందులకు కాలికి నీళ్ళు. నేలమీఁదనే మరల నేను పొరలాడవలసియున్నది - తాడితగర్దభః - కొట్టఁబడినగాడిద - కొట్టఁబడినను, ఎక్కువ బడలిక పడినను,

చేటః—ఆర్యమైత్రేయ, బ్రాహ్మణః ఖలు త్వమ్. [అజ్జ మిత్తేఅ, బమ్హణే క్ఖు తుమమ్].

విదూ—యథా సర్వనాగానాం మధ్యే డుణ్డుభః తథా సర్వబ్రాహ్మణానాం మధ్యే ఽహం బ్రాహ్మణః. [జధా సవ్వణాగాణం మజ్ఝే డుణ్డుహో, తథా సవ్వబమ్హణాణం మజ్ఝే అహం బమ్హణో].

చేటః—ఆర్యమైత్రేయ, తథాపి ధావిష్యామి. (తథా కృత్వా) ఆర్యమైత్రేయ, ఏతత్తత్సువర్ణభాణ్డం మమ దివా, తవ రాత్రౌ చ. తద్గృహాణ. [అజ్జ మిత్తేఅ, తధావి ధోఇశ్శమ్. అజ్జమిత్తేఅ, ఏదం తం శువణ్ణగణ్డఅం మమ దివా, తుహ లత్తిం చ. తా గేణ్హ]. (ఇతి దత్వా నిష్క్రాన్తః.)

---

గాడిద ఆనొప్పి అవయవములకు పోవుటకు నేలన వెల్లకిలి చాలసేపు పొరలాడును - దాన నొప్పిపోవును - (అట్లు గుఱ్ఱమును అలపు తీఱ నేలంబడి కాళ్ళు విదిలించుచు పొరలాడును.) మైత్రేయునికి మాటల నాజూకు తెలియదు - గాడిదవలె, అని తానే చెప్పుచున్నాఁడు.

యథా సర్వ నాగానాం మధ్యే డుణ్డుమః ... = ఎల్ల పాముల నడుమ ఇరుదలపాము - విసము లేనిది, చూచుటకును కోఁతగానుండునది ఎట్టిదో, బ్రాహ్మణులలో నేను అట్టివాఁడను - ఎందుకును పనికిమాలినవాఁడను - అనుట. మమ దివా తవ రాత్రౌ - అని కదా యేర్పాటు. మఱి దానిని ఇప్పుడు ఇతనిచేతికి ఇచ్చుటం జూడఁగా, రాత్రి రాకముందే వీరు పాటకచ్చేరికి పోయినారా? లేక పోయివచ్చువఱకు నీవు చూచుకో అని చారుదత్తుని సమ్మతితో అతనికడ ఉంచిపోయినాఁడు కాఁబోలు. (?)

కిం అత్ర ఉజ్జయిన్యాం ... = ఏమి ఈయుజ్జయినిలో దొంగ సయితము లేఁడా? దీనిని ఈలంజాకొడుకును (సువర్ణ భాణ్డం =) బంగారునగను, భాణ్డం... భూషణే - హైమః, 'భూషణమాత్రే' - ధరణిః. ... భూషా - మేదినీ. స్నా

విదూ—(గృహీత్వా) అద్యాప్యేత త్తిష్ఠతి. కి మత్రోజ్జయిన్యాం చౌరో ఽపి నాస్తి, య ఏతం దాస్యాః పుత్రం నిద్రాచోరం నాపహరతి. భో వయస్య, అభ్యన్తర చతుశ్శాలకం ప్రవేశ్యా మ్యేనమ్. [అజ్జ వి ఏదం చిట్ఠది. కిం ఏత్థ ఉజ్జయిణీఏ చోరో వి ణత్థి, జో ఏదం దాసీఏ పుత్తం ణిద్దాచోరం ణ అవహరది. భో వఅస్స, అబ్భన్తరచతుస్సాలఅం పవేసఆమి ణమ్].

చారు—

శ్లో. అలం చతుశ్శాల మిమం ప్రవేశ్య
ప్రకాశనారీధృత ఏష యస్మాత్
తస్మా త్స్వయం ధారయ విప్ర, తావ
ద్యావ న్న తస్యాః ఖలు భోః సమర్ప్యతే. 6

(నిద్రాం నాటయన్, 'తం తస్య స్వరసంక్రమమ్'
ఇతి పునః పఠతి)

నిద్రను దొంగలించుదానిని - దేనికోసము నేను మేలుకొనవలయునో దానిని అపహరింపను? ఓ వయస్యా, దీనిని నాలుగిండ్ల భవంతిలోఁగిట ప్రవేశ పెట్టెదను, అనఁగా అక్కడికి దొంగ రాఁజాలఁడు, నగరక్షణ సులువగును - అని.

శ్లో. 6. అలం = కూడదు, ఇమం చతుశ్శాలం ప్రవేశ్య = భవంతిలోపల దీనిని ప్రవేశపెట్టఁ గూడదు, యస్మాత్ = ఏలన, ప్రకాశనారీధృతః ఏషః = గృహిణి కులాంగన గాక - ఎల్లవారికి ప్రకాశముగా తెలియునట్లు - వెలి (=ప్రకాశయాలైన అవగూరినము లేని) స్త్రీచేత ధరింపఁబడినది. - మైల వస్తువు, బంగారునగ యైనను - తస్మాత్ = కావున, యావత్ న తస్యాః సమర్ప్యతే = దానికి ఈఁబడకుండు నంతవరకు, విప్రుఁడా, నీవే పట్టుకొని యుండుము.

భవంతిలోపలికి తేవచ్చునటయ్యా, వెలియాలు పెట్టుకొని తీసిన సొమ్మును. భవంతి మైలపడిపోవును. దానికి అప్పగించువఱకు అది నీచేత నే ఉండును గాక.

విదూ—అపి నిద్రాతి భవాన్. [అవి ణిద్దాఅది భవమ్].

చారు—అథ కిమ్.

శ్లో. ఇయం హి నిద్రా నయనావలమ్బినీ
లలాటదేశా దుపసర్పతీవ మామ్,
అదృశ్యరూపా చపలా జరేవ యా
మనుష్యసత్త్వం పరిభూయ వర్ధతే. ౮

విదూ—తత్స్వపివః. [తా సువేహ్మ]. (నాట్యేన స్వపితి.

అపి నిద్రాతి భవాన్ - అపి ప్రశ్నం దొడఁగును. నీవు నిద్ర పోయెదవా? నీకు నిద్రవచ్చుచున్నదా? అవును.

శ్లో. ౮. నయనావలమ్బినీ = (నా) కన్నులం బట్టుకొన్న, ఇయం హి నిద్రా = ఈ నిద్రయన్ననో, లలాటదేశాత్ = నొసటిచోటునుండి, మాం = నన్ను, ఉపసర్పతి ఇవ = డగ్గఱుచున్నదియుం బోలె నున్నది, యా = ఏది - ఇది యనుట, జరా ఇవ = ముదిమివలె, అదృశ్యరూపా = అగపడని - చూడ నందని - రూపము గలదై, చపలా = (త్వరతో కూడుకొన్నదై -) వణఁకు, ఊపు కలిగించునదై, మనుష్యసత్త్వం = మానిసి బలమును, పరిభూయ = తిరస్కరించి, పరవుసేయుక పైకొని, వర్ధతే = ఎదుగుచున్నది - వృద్ధిపొందుచున్నది.

పురుషుఁడు ముదియుచున్న తన్ను చూచి కనుగొననే లేఁడుగదా, శిరమున వెంట్రుకలు నరయుట, ఒడలంతట ముడుతలు ఏర్పడుట, వణఁకు అవయవములం బైకొనుట, శక్తి తఱుగుట - ఇవన్నియు కలుగుచునే యున్నను తాను ఆకలుగుటం జూడఁజాలఁడు. అట్లే నిద్రలోను తొలుత మనస్సువృత్తి నిలిచి పోవుటయు తల ప్రేలాడుటయు కన్నులు మూత పడుటయు అవయవములు ఓపక వ్రాలుటయు - ఇందు ఏది - కలుగుటయు మన కెఱుంగ శక్యము గాదు. మఱి కలుగును - నిద్ర సిద్ధించును. మనోవృత్తినిలిచి తల ప్రేలాడును గాన - లలాటము నుండి డగ్గఱుచున్న దన్నాఁడు.

తత్ స్వపివః - సరి, అలాగైన నిద్రింతము, నాట్యేన - నిద్రించుట నభినయించును.

(తతః ప్రవిశతి శర్విలకః)

శర్విలకః—

శ్లో. కృత్వా శరీరపరిణాహ సుఖప్రవేశం
శిక్షాబలేన చ బలేన చ కర్మమార్గమ్
గచ్ఛామి భూమిపరిసర్పణఘృష్టపార్శ్వో
నిర్ముచ్యమాన ఇవ జీర్ణతను భుజఙ్గః. ౯

---

తతః ప్రవిశతి శర్విలకః - అంతట శర్విలకుఁడు ప్రవేశించును. శర్విలకుఁడు ఒక బ్రాహ్మణుఁడు. దొంగతనము వృత్తిగా అవలంబించినాఁడు. వసంతసేన చేటిని కామించినాఁడు. దానిని విలుచుకొనఁ గోరినాఁడు. దానికి దానిసతనము మాన్పి తన భార్యం జేసికొన. దానికైన ధనార్జనకు దొంగతనము ఉపాయముగా అవలంబించినాఁడు. నేర్పు సంపాదించినాఁడు.

శ్లో. ౯. శిక్షాబలేన చ = అభ్యాస పాటవముచేతను. బలేన చ = దేహబలముచేతను, శరీర పరిణాహ సుఖ ప్రవేశమ్ = దేహపు వైశాల్యము అంతయు - ఒరయక గాయపడుట లేక - సులువుగా చొచ్చుట గల - చొచ్చుటకు అనుకూలమైన - చాలినంత, కర్మమార్గం = [(నా)పనికి కావలయు దారిని] కన్నమును. - ఎక్కువ పెద్దదియుం గాక ఎక్కువ చిన్నదియుంగాక చాలినపాటి దానిని అనుట. పెద్దదాన వృథా కాలనష్టము, వృథా కష్టము, గోడకును సెబ్బర. చాలనిదైన చొచ్చుటకు కష్టము. - కృత్వా = చేసి - వేసి, జీర్ణతనుః = శిథిలమై ఊడుచున్న దేహపుఁ దోలును - కుబుసమును, నిర్ముచ్యమానః = విడుచుచున్న, భుజఙ్గ ఇవ = పామువలె - (వంపులు తిరుగుచు ప్రాఁకునది అని వ్యు.) భూమిపరి ... శ్వః = నేలమీఁద ప్రాఁకుటచే రాచుకొన్న ప్రక్కభాగములు కలవాఁడనై, గచ్ఛామి = పోవుచున్నాను.

నేర్పుకొలఁదియు బలముకొలదియు నాదేహమునకు చాలినపాటి కన్నము చేసికొని, నేలమీఁద, ప్రక్కలు రాఁచుకొనుచు కుబుసము విడుచున్న పాము వలె, సులువుగా పోవుచున్నాను.

(నభో ఽవలోక్య సహర్షమ్) అయే, కథ మస్త ముపగచ్ఛతి స భగవా న్మృగాఙ్కః. తథా హి -

శ్లో. నృపతిపురుష శఙ్కితప్రచారం
పరగృహదూషణ నిశ్చితైకవీరమ్
ఘనపటల తమోనిరుద్ధతారా
రజని రియం జన నీవ సంవృణోతి. ౧౦

---

అయే - సంతోషము! కథం = ఎట్లూ! అస్తం ఉపగచ్ఛతి సభవాౝ మృగాఙ్కః - అస్తమించుచున్నాఁడు పూజ్యుఁడు (సభవాౝ అని ఒకటే మాట పూజార్థకము - భగవాౝ - అనియు పా. భగవంతుఁడు) చంద్రుఁడు.

శ్లో. ౧౦. నృపతి పురుష ... = రాజు నౌకరులచేత - కొత్వాలు పోలీసు మొదలగు బాటకాపరులచేత అనుట - సందేహింపఁబడుచున్న నడక కలవానిని, పరగృహ ... వీరమ్ = ఒరులయిండ్లను - ధనకనకాదులను దొంగిలించుటచే - దూషించుట యందు - వానికి సెబ్బరచేయుటయందు అసహాయవీరుని, (అట్టివాఁడనైన నన్ను అనుట - అట్టివారి నెల్లను) ఇయం రజనీ = ఈరాత్రి (కాలము), ఘనపటల తమో నిరుద్ధ తారా = దట్టంపు మూఁతం (ముసుకం) బోలిన చీకటిచేత అడ్డగింపఁబడిన నక్షత్రాలు గలదై, దట్టము ఐన పటలమనెడియు తిమిరమనెడియు కంటి రోగములచే బొత్తిగా అగపడనట్లు కప్పఁబడిన కంటిగ్రుడ్లు గల, జననీ ఇవ = తల్లివలె అట్లు గుడ్డిదైన తల్లి తనబిడ్డను తాఁకి తడవి కట్టుకొని, సంవృణోతి = కప్పును - దాఁచును - దాఁచి, అట్టివారి కంటఁ బడనీక, కాపాడును.

సమయమునకు సరిగా చంద్రాస్తమయ మైనది. చిమ్మచీకటి కమ్మినది. పోలీసులకు సందేహము కలుగనీక దాఁగి దాఁగి నడచుచున్నవానిని, ఇండ్లం దోఁచుటలో అసహాయశూరుని నన్ను నక్షత్రాలకాంతి కూడ తగులనీక, చక్కఁగా మూసి కాపాడుచున్నది. ఇది మాయమ్మయే - పాపము కండ్లు లేమిచే తాఁకి కౌగిలించుకొనియే బిడ్డసుఖము ననుభవింపఁ జాలినది.

వృక్షవాటికాపరిసరే సంధిం కృత్వా ప్రవిష్టో ఽస్మి మధ్యమకమ్. త ద్యావ దిదానీం చతుఃశాలక మపి దూషయామి. భోః,

శ్లో. కామం నీచ మిదం వదన్తు పురుషాః
స్వప్నే చ య ద్వర్ధతే
విశ్వస్తేషు చ వఞ్చనా పరిభవ శ్చౌర్యం
న శౌర్యం హి తత్
స్వాధీనా వచనీయ తాపి హి వరం
బద్ధో న సేవాఞ్జలి

---

వృక్షవాటికా పరిసరే = తోఁట చెంత - (అక్కడ చీకటి దట్ట మగును, ఎక్కువ మఱుఁగు కలుగును గాన) మధ్యమకమ్ = రెండు గోడల నడుమ - అవి కలియు మూలలో - (అచోటు తటాలున జనుల కంటఁబడదు, గాన), సంధిం కృత్వా = కన్నము చేసి, ప్రవిష్టోఽస్మి = చొచ్చినవాఁడ నైతిని. అనఁగా - తోఁటలోనికి వచ్చినాఁడు - ఇంకను ఇంటికి కన్నముచేసి ఇంటిలో ప్రవేశింప వలయును. రెండు కన్నములు - తోఁట గోడలో ఒకటియు, ఇంటిగోడలో ఒకటియు.

శ్లో. ౧౧. పురుషాః = లోకులు, చౌర్యం = దొంగతనమును, ఇదం = ఇది, నీచం = క్షుద్ర (వ్యాపార) మనియు, స్వప్నే వర్ధతే యత్ = ఏది-అనఁగా ఇది, నిదురలో పెంపొందును అనియు, విశ్వస్తేషు = నమ్మినవారియెడ, వఞ్చనా చ = మోసము (చేయుట) అనియు, పరిభవః = (వారిని) తిరస్కారము చేయుట యనియు, న తత్ శౌర్యం హి = అది పరాక్రమవ్యాపారము (హి =) ఎంత మాత్రము గాదనియు - కామం నిన్దన్తు = నిందింతురు గాక, వచనీయతా అపి = (ఈ) నిందా స్పదత్వము, స్వాధీనా = పరాధీనము కాక, స్వాయత్తముగా నుండున దగుటం జేసి, వరం హి = మేలేగదా, (మఱియు, ఒకరిని దేవురించుచు), సేవాఞ్జలిః = ఊడిగముకొఱకై (నమః అని) చేతులు జోడిం(చి నమస్కరిం)చుట, న బద్ధః = కూర్పఁబడలేదు. - (ఎంత ఏమి చెప్పినను ఇది సొంత యార్జనము, స్వతంత్రమైనది - ఊడిగము కాదు - అంతకన్నను మేలైనది. అంతియకాదు - ఇందులకు ప్రమాణ

ర్మార్గో హ్యేష నరేన్ద్రసౌప్తికవధే
పూర్వం కృతో ద్రౌణినా. ౧౧

తత్కస్మి న్నుద్దేశే సంధి ముత్పాదయామి.

శ్లో. దేశః కో ను జలావసేకశిథిలో
యస్మి న్న శబ్దో భవే
ద్భిత్తీనాం చ న దర్శనాన్తరగతః
సంధిః కరాలో భవేత్
క్షారక్షీణతయా చ లేష్టకకృశం జీర్ణం
క్వ హార్మ్యం భవే

మును పెద్దల యనుష్ఠానముం గూడ కలదు.) ఏష మార్గః = ఈదారి, పూర్వం = మునుపు, నరేన్ద్రసౌప్తికవధే = రాజులను (ధృష్టద్యుమ్నోపపాండవాదులను) నిదురలో చంపుటయందు, ద్రౌణినా = ద్రోణాచార్యుల(ంతటివాని) కొమారుఁడైన, అతిరథశ్రేష్ఠుఁడును ఐన అశ్వత్థామ (యంతటివాని)చే, కృతః హి = చేయఁబడినది కదా - అనుష్ఠించి - ఇట్లు నడువుడు అని మాబోంట్లకు - చూపంబడినది.

లోకులు దొంగతనము పరాక్రమకార్యము కాదు గీదు అని ఎంతెంత యేని నిందింతురు గాక. ఇది ఊడిగమునకంటె ఎంతయో మేలు. అశ్వత్థామవంటివారు నడచినదారి యిది.

తత్ కస్మిన్ ... మి = కావున ఏప్రదేశమందు కన్నము కలిగింతును - చేయుదును అనుట.

శ్లో. ౧౨. కః దేశః = (గోడలో) ఏచోటు, జలావసేకశిథిలః = నీరు పైనపోయుటచేత (తడిసి తడిసి) సడలి - క్రక్కదలి - పోయియున్నది? యస్మిన్ = ఎందు - అట్టిదానియందు, న శబ్దః భవేత్ = సద్దు కాకుండును. భిత్తీనాం - గోడలకు - గోడలలో, దర్శనాన్తరగతః = చూపుకు మఱుఁగున - ఎట్టెదుటం గాక, పడినట్టి, కాదా - కాన్తాలలో ఉన్నట్టిది - సంధిః = కన్నము, న కరాళః భవేత్ = పెద్దది, విపులమైనది, కాకపోవును - పెద్దదైనను పెద్ద దనిపించదు, హార్మ్యాణాం = (ఈ) మిద్దెయిల్లు, క్షారక్షీణతయా = ఉప్పూరిసి సన్నగిల్లుటచేత, చలేష్టకకృశం = రాలిన ఇటికలుకలదై, జీర్ణం చ = చాల ప్రాతగిల్లినదిగా, క్వ

కస్మిన్ స్త్రీజనదర్శనం చ న భవే
  త్స్యాదర్థసిద్ధి శ్చ మే. ౧౨

(భిత్తిం పరామృశ్య) నిత్యాదిత్యదర్శనోదకసేచనేన దూషితేయం భూమిః క్షారక్షీణా. మూషికోత్కరశ్చేహ. హన్త, సిద్ధోఽయమర్థః. ప్రథమమేతత్స్కన్దపుత్రాణాం సిద్ధిలక్షణమ్. అత్ర కర్మప్రారమ్భే కీదృశమిదానీం సంధిముత్పాదయామి. ఇహ ఖలు భగవతా కనకశక్తినా చతుర్విధః సంధ్యుపాయో దర్శితః. తద్యథా పక్వేష్టకానామాకర్షణమ్, ఆమేష్టకానాం ఛేదనమ్, పిణ్డమయానాం సేచనమ్, కాష్ఠమయానాం పాటనమితి. తదత్ర పక్వేష్టక ఇష్టికాకర్షణమ్. తత్ర

---

భవేత్=ఎక్కడనుండును? కస్మిన్ స్త్రీజన దర్శనం న భవేత్=ఎక్కడ నాకు స్త్రీలు కంటఁబడకుందురు? స్త్రీల కంటఁబడ కుందును? (స్త్రీలు పిఱికివారు, సులువుగా మేలుకొందురు, కేకలు వేయుదురు. కావున), (ఎందు - ఏచోట), మే అర్థసిద్ధిః చ = ప్రయోజన సిద్ధియు, నాకు, (భవేత్ = కలుగును?)

ఇన్ని విధములుగా చోటును గోడను కనిపట్టి కన్నము వేయవలయును - అట్లు వేసిననే అర్థసిద్ధి కలుగును.

భిత్తిం పరామృశ్య = గోడను తడవిచూచి, నిత్య ఆదిత్య దర్శన ... = (కప్పు ఏదియు లేమిచే) ఎప్పుడు సూర్యునికి అగపడుచునే - అనఁగా - ఎండలోనే ఉండి, నీటి పోఁత చేత (తడిసి), చెడి - మెత్తబడిపోయి యున్నది ఈచోటు. ఉప్పొరిసియు సన్నగిల్లినది, ఇక్కడ ఎలుకల త్రవ్వుటలును - వాని బొక్కలును, బళి, సంతోషము, ఈపని సిద్ధించినది - స్కందపుత్రాణాం = స్కందుని కొడుకులకు - స్కందుఁడు చౌర్యశాస్త్రప్రణేత - అతని శిష్యులను అతని పుత్రులు అనుట. దొంగలకు - మాబోంట్లకు - ఏతత్ ప్రథమం సిద్ధిలక్షణము - పని నెఱవేఱు ననుటకు - ఇది తొలి సూచన - కన్నమునకు మంచి సులువైన చోటు దొరకుట. అత్ర కర్మారమ్భే ... = ఇక్కడ కన్నమును - పనిని తొడంగుచో ఎట్టి కన్నము వేయుదును? ఈవిషయమున భగవానుఁడు కనకశక్తి (అను మా గొప్ప

శ్లో. పద్మవ్యాకోశం భాస్కరం బాలచన్ద్రం
వాపీ విస్తీర్ణం స్వస్తికం పూర్ణకుమ్భమ్
తత్కస్మిన్ దేశే దర్శయామ్యాత్మశిల్పం
దృష్ట్వా శ్వో యం యద్విస్మయం యాన్తి పౌరాః. ౧౩

తదత్ర పక్వేష్టకే పూర్ణకుమ్భ ఏవ శోభతే. తముత్పాదయామి.

---

యాచార్యుఁడు - దొంగతనపు శాస్త్రము (వ్రాసినవాఁడు) నాలుగు విధములగు కన్నపు టుపాయములం జెప్పియున్నాఁడు. అదేమనఁగా-బాగుగా కాలిన యిటికలను లాగివేయుట, పచ్చి యిటికలను తెగఁగొట్టుట, వట్టి (మట్టి) ముద్దలను తడుపుట, కొయ్యవానిని పగులఁగొట్టుట - అని. కావున ఇట కాలిన యిటికలదినయందు ఇటికలను లాగివేయుట (చేయఁదగును). చారుదత్తునియిల్లు గొప్పది చక్కఁగా కట్టఁబడిన బంగాళా యగును - కావున గోడ కాలిన యిటికలది.

శ్లో. ౧౩. కన్నములు ఆయాగోడలకు చోటులకు తగినవి పలుతెఱంగులు చెప్పఁబడినవి - పద్మవ్యాకోశం = పద్మవికాసము - వికసించిన పద్మపు టాకారము గలది, భాస్కరం = సూర్యుఁడును - సూర్యునివలె గుండ్రముగా నుండునదియు, బాలచన్ద్రం = చంద్రరేఖయాకారము గలదియు - వాపీ విస్తీర్ణం = (లావుపాటి గోడయైన) బావివలె లోతుగా విస్తరించినదియు, స్వస్తికం = నాలుగు మూల చదుకపు రూపు గలదియు, పూర్ణకుమ్భం = పెద్దకడుపు సన్నని మెడ - వీనితో పెద్ద బుంగవలె నుండునదియు, తత్ = కావున, కస్మిన్ దేశే = ఏయెడ, ఆత్మ శిల్పం దర్శయామి = నాకళ (నేర్పు)ను, చూపుదును ? యం = దేనిని - దానిని, శ్వః దృష్ట్వా = రేపు చూచి, పౌరాః = పురజనులు, యత్ విస్మయం యాన్తి = ఎందులకు ఎంతయు ఆశ్చర్యపడుదురో, అట్లు అందులకు !

కన్నములు ఎన్నియో రకములు కలవు. ఇక్కడ ఏచోట ఏరకమైన దానిని వేసి, రేపు తెల్లవాఱ - జనులను వెఱగుపఱతును !

తదత్ర ... = మఱి యిట ఈకాలిన యిటికల గోడలో, 'నిండుకుండ' - ఆ యాకారముగలది - రాణించును దానిని వేసెదను.

అన్యాసు భిత్తిషు మయా నిశి పాటితాసు
క్షారక్షతాసు విషమాసు చ కల్పనాసు
దృష్ట్వా ప్రభాతసమయే ప్రతివేశివర్గో
దోషాం శ్చ మే వదతి కర్మణి కౌశలం చ. ౧౪

నమో వరదాయ కుమారకార్త్తికేయాయ, నమః కనకశక్త్యే బ్రహ్మణ్యదేవాయ దేవవ్రతాయ. నమో భాస్కరనన్దినే, నమో యోగాచార్యాయ యస్యాహం ప్రథమః శిష్యః. తేన చ పరితుష్టేన యోగరోచనా మే దత్తా

శ్లో. ౧౪. మయా = నాచేత, నిశి = రాత్రి, పాటితాసు = పగులఁగొట్టఁబడిన - త్రవ్వఁబడిన, క్షారక్షతాసు = ఉప్పూరిసినట్టి, అన్యాసు భిత్తిషు = వేఱు గోడలలో, వానియెడ అనుట, విషమాసు = ఒక్కదానిం బోలక ఒక్కటిగా, ఉన్న - కాల్చిన యిటికలు, పచ్చి యిటికలు మొదలైన కారణమున అనుట - కల్పనాసు = (కన్నపు) రచనలయందు, ప్రతివేశివర్గః = ఇరుగుపొరుగు జనుల మొత్తము, ప్రభాతసమయే = తెల్లవాఱినంతట, దృష్ట్వా = చూచి, మే కర్మణి = నా(కన్నపుఁ)బని యందు, దోషాన్ చ కౌశలం చ వదతి = పొరపాటులను నేర్పును, వదతి = చెప్పుచుండును.

ఊరిలో నేను రాత్రుల వేసిన కన్నములను, ఆయాయెడలకు గోడలకు తగినట్లు వివిధముగా నుండువానిని, ఇరుగుపొరుగువారు తెల్లవాఱఁగానే చూచి, ఇదిగో ఇక్కడ పొరపాటు, ఇదిగో ఇక్కడ నేర్పు అని పలుకుకొనుచుందురు.

కుమారకార్త్తికేయుఁడు, కనకశక్తి, బ్రాహ్మణులపం గూర్చువాఁడైన దేవవ్రతుఁడు, భాస్కరనంది, యోగాచార్యుఁడు. అందఱు చౌర్యవిద్యాచార్యులు - ఇది వారి సంప్రదాయము కాఁబోలు. అందు కడపటివాఁడగు, యోగాచార్యునికి నేను సాక్షాత్తు శిష్యుఁడను, తొలివాఁడను, అసాధారణ శుశ్రూషువను, అసాధారణ శిక్ష పొందినవాఁడను, పరితుష్టేన = నాయెడ మిక్కిలి సంతోషము గలవాఁడైన యాతనిచేత, మే యోగరోచనా దత్తా = నాకు మందు మూలికలు చేర్చిన గోరోచనము - ఒక పూఁతమందు ఈఁబడినది.

శ్లో. అనయా హి సమాలబ్ధం న మాం ద్రక్ష్యన్తి రక్షిణః
శస్త్రం చ పతితం గాత్రే రుజం నోత్పాదయిష్యతి. ౧౫

(తథా కరోతి) ధి క్కష్టమ్. ప్రమాణసూత్రం మే విస్మృతమ్. (విచిన్త్య) ఆం, ఇదం యజ్ఞోపవీతం ప్రమాణసూత్రం భవిష్యతి. యజ్ఞోపవీతం హి నామ బ్రాహ్మణస్య మహా దుపకరణద్రవ్యమ్, విశేషతో ఽస్మద్విధస్య. కుతః

శ్లో. ఏతేన మాపయతి భిత్తిషు కర్మమార్గ
మేతేన మోచయతి భూషణ సంప్రయోగాన్,
ఉద్ఘాటకో భవతి యన్త్రదృఢే కపాటే
దష్టస్య కీటభుజగైః పరివేష్టనం చ. ౧౬

---

శ్లో. ౧౫. అనయా = దీనితో, సమాలబ్ధం = పూయఁబడిన, మాం = నన్ను, రక్షిణః ద్రక్ష్యన్తి = గస్తుతిరుగువారు, చూడలేరు - శస్త్రం చ = ఆయుధము - కత్తియో కటారియో బాణమో, అది, గాత్రే = దేహాన, పతితం = పడినట్టిది, రుజం న ఉత్పాదయిష్యతి = నొప్పి - గాయము సయితమును - కలిగింపదు, ప్రమాణ సూత్రం = కొలత త్రాడు నాచే మఱవఁబడినదే - ఆలోచించి, ఆం = అవును, జ్ఞప్తికి తెచ్చుకొనుమాట, యజ్ఞోపవీతం = జందెము, కొలత్రాడగును లే, జందె మనఁగా బ్రాహ్మణునికి గొప్ప యుపకరించు వస్తువు. విశేషముగా - అంమను అనుట - నాబోఁటికి. ఏలన

శ్లో. ౧౬. ఏతేన = దీనితో, భిత్తిషు = గోడలో, కర్మమార్గం = కన్నమును, మాపయతి = కొలుచును, ఏతేన = దీనితో, భూషణసంప్రయోగాన్ = నగల చీలలను కొలుకులను, మోచయతి = విడఁదీయును, యన్త్రదృఢే = ... చీల మొదలగుదానిచే గట్టిగా నున్న తలుపునెడ, ఉద్ఘాటకః భవతి = దానిని ఎత్తి. తలుపు తెఱచుసాధనమును అగును, కీటభుజగైః = పురువులచేతను పాముల చేతను. దష్టస్య = కఱవఁబడినవానికి - విసము ఎక్కనీక నెత్తురుకారనీక - పరివేష్టనం చ = చుట్టురా చుట్టుకట్టును. అగును.

జందెముతో కన్నపుదొంగకు ఇన్ని యుపయోగములు ఉన్నవి.

మాపయిత్వా కర్మ సమారభే. (తథా కృత్వావలోక్య చ) ఏకలోష్టావశేషో ఽయం సంధిః. ధి క్కష్టమ్. అహినా దష్టో ఽస్మి! (యజ్ఞోపవీతే నాఙ్గులీం బద్ధ్వా విషవేగం నాటయతి. చికిత్సాం కృత్వా) స్వస్థో ఽస్మి. (పునః కర్మ కృత్వా దృష్ట్వా చ) అయే, జ్వలతి ప్రదీపః, తథా హి,

శ్లో. శిఖా ప్రదీపస్య సువర్ణపిఞ్జరా
మహీతలే సంధిముఖేన నిర్గతా
విభాతి పర్యన్తతమః సమావృతా
సువర్ణరేఖేవ కషే నివేశితా. ౧౭

(పునః కర్మ కృత్వా) సమాప్తో ఽయం సంధిః. భవతు. ప్రవిశామి. అథవా న తావ త్ప్రవిశామి. ప్రతిపురుషం నివేశయామి.

---

మాపయిత్వా = కొలిచి, కర్మ = కన్నపుఁబనిని, ఏకలోష్టావశేషః - ఇంకను ఒక్క మట్టి పెళ్ళ మిగిలియున్నది, కన్నము పూర్తియగుటకు, ఇసీ అయ్యో! పాముచే కఱవఁబడితిని! విషవేగం నాటయతి = విసమెక్కిన బాధను అభినయించును, చికిత్సాం కృత్వా = వైద్యము - ప్రతిక్రియ - చేసికొని, స్వస్థః అస్మి - మానినవాఁడను - విషబాధ లేనివాఁడను అగుచున్నాను.

శ్లో. ౧౭. ప్రదీపస్య = పెద్దదీపముయొక్క, శిఖా = జ్వాల - దివ్వె. సువర్ణపిఞ్జరా = బంగరుపసిమిగలదై, సంధిముఖేన = కన్నపు దారిగుండ, మహీతలే = నేలమీఁద, నిర్గతా = వెలువడినదై, పర్యన్త తమః సమావృతా = ఇటునటు చీకటిచే ఆవృతయై, కషే = ఒరగంటిపై, నివేశితా = ఉంపఁబడిన - గీయఁబడిన - సువర్ణరేఖా ఇవ = బంగరు గీటువలె, విభాతి = ప్రకాశించుచున్నది.

చుట్టును చీకటి నిండియున్న నేలపై, కన్నమునుండి వెల్వడిన దీపపు వెలుఁగు (కన్నపులావే గలది) బంగరు నొరగంటిగీటువలె ప్రకాశించుచున్నది.

అథవా = అట్లుకాదు - నేను ప్రవేశింపను, ప్రతిపురుషం = మారుమానిసిని = మానిసి బొమ్మను, నివేశయామి = అందు పెట్టెదను - ప్రవేశించినట్లైన, లోపల ఎవరైనను - మేలుకొనియుండి ఏమేని చేయుదురా అని పరీక్షించుకొనుటకు,

(తథా కృత్వా) అయే, న కశ్చిత్, నమః కార్త్తికేయాయ (ప్రవిశ్య దృష్ట్వా చ) అయే, పురుషద్వయం సుప్తమ్. భవతు. ఆత్మ రక్షార్థం ద్వార ముద్ఘాటయామి. కథం జీర్ణత్వా ద్గృహస్య విరౌతి కపాటమ్. త ద్యావత్సలిల మన్వేషయామి. క్వ ను ఖలు సలిలం భవిష్యతి? (ఇత స్తతో దృష్ట్వా సలిలం గృహీత్వా క్షిప న్సశఙ్కమ్.) మా తావ ద్భూమౌ పత చ్ఛబ్ద ముత్పాదయేత్. భవతు. ఏవం తావత్. (పృష్ఠేన ప్రతీక్ష్య కపాట ముద్ఘాట్య) భవతు, ఏవం తావత్. ఇదానీం పరీక్షే కిం లక్ష్యసుప్తమ్, ఉత

దొంగతన కర్మకై యుంచుకొను సాధనసామగ్రిలో చేరినది, ఈబొమ్మ, అయే న కశ్చిత్ = బళి, ఎవరును లేరు. ఆత్మరక్షార్థం = నన్ను కాపాడుకొనుటకు - తటాలున పాఱిపోవలసివచ్చిన పాఱిపోవను సులభ మగుటకు - ద్వారం ఉద్ఘాటయామి = వాకిలి తెఱచియుంచెదను, జీర్ణత్వాత్ గృహస్య = ఇల్లు చాల ప్రాతదై శిథిలమై ఉన్నందున, కథం! విరౌతి కవాటమ్ = ఏమి! తలుపు (తెఱచినపుడు) మ్రోఁత కలుగుచున్నది! తుప్పుపట్టి బిగుసుకొని పోయినందున, క్వ ను ఖలు ... = నీరు ఎక్కడ నుండును? (అది తన సామగ్రిలో లేదు. ఇటు నటు చూచి, నీరు చేతం గొని చల్లుచు, అంతలో భయపడుచు), మా తావత్ ... = అది నేలమీఁద పడుచు మ్రోఁత కలిగింపకుండునుగాక, కానీలే ఇట్లు - అని తలుపును వీపుకు తగిలించుకొని - ఈక్ష్ ధాతువుకాదు ఇవ్ తలుపు తెఱచి, కిం లక్ష్య సుప్తం = ఏమి పైకి అగపడు మాత్రమైన కనుమూఁతయా? - అగపడు నిద్రయా, నేను భ్రమించుచున్నానా - లేక నిజమైన నిద్రయే యగునా? ఇందు నిద్రపోవువారి యభిప్రాయమునకు ఏమియు సూచన లేదు. వారినిద్ర తన భ్రమయా - నిజమేనా? - no need to simulate - అని వే. వేం. ఆప్టే - 'feigned sleep' అన్నాఁడు, ఇచట భేదము సూక్ష్మము. నిద్రలో మెలఁకువ వచ్చి మరల పట్టువఱకు ఊరకే కనులు మూసికొని యుండుట కలిగినదే. అది యగును గాని, అట్టి అభినయమునం దాత్పర్యముకలది గాదు. కావుననే త్రాసన యత్నము - వ్యాజ - ఛద్మ - సుప్తం - అని వ్యాఖ్యాతలు పొరపడినారు. ఆప్టేయు,

పరమార్థసుప్తమిదం ద్వయమ్. (త్రాసయిత్వా పరీక్ష్య చ) అయే, పరమార్థసుప్తే నానేన భవితవ్యమ్. తథా హి

శ్లో. నిఃశ్వాసోఽస్య న శఙ్కితః సువిశద
స్తుల్యాన్తరం వర్తతే
దృష్టి ర్గాఢ నిమీలితా న వికలా
నాభ్యన్తరే చఞ్చలా
గాత్రం స్రస్తశరీరసన్ధిశిథిలం
శయ్యాప్రమాణాధికం
దీపం చాపి న మర్షయే దభిముఖం
స్యా ల్లక్ష్యసుప్తం యది. ౧౮

---

'Feigned' అన్నాదే! లేక నిజమయిన నిద్రయా? త్రాసయిత్వా పరీక్ష్య = భయపెట్టి పరీక్షించి చూచి, అయే పరమార్థ ... = ఓహో, ఇది నిజమైన నిదురయే కావలయును - వీరు నిజముగానే నిదురించుచుండఁబోలును, తథా హి = అట్లేగదా - అన్నియు నిజమైన నిదుర కాఁదగిన లక్షణములే గదా -

శ్లో. ౧౮. అస్య = వీరికి - ఈద్వయమునకు, నిఃశ్వాసః = నిట్టూర్పు, న శఙ్కితః = జంకు, భయము కలిగినదిగా (బిగఁబట్టినదిగా) లేదు, సువిశదః = స్పష్టముగా (తెలియుచు వినంబడుచు) ఉన్నది; తుల్యాన్తరం వర్తతే = ఊర్పునకు ఊర్పునకు నడుమ సమానమైన ఎడము కలిగియున్నది - అభినయపు దొంగ నిద్రలో వారు ఎంత నేర్పరులైనను ఆయెడములో హెచ్చుతగ్గులు కలుగక పోవు అనుట, దృష్టిః = కన్ను - చూపు అని యేని, గాఢనిమీలితా = గట్టిగా సందు లేక అనికాదు, ఉన్నంతలు అంటుకొనినట్లు మూసికొనఁబడి యున్నది, న వికలా = అగపడి అగపడకుండునట్లు చూచుటలేదు, న అభ్యన్తరే చఞ్చలా = లోపల పాప కదలక ఆడకయ యున్నది; గాత్రం = దేహము, స్రస్తశరీర సన్ధి, శిథిలం = జారిన - బిగువు లేని - కీళ్ళు కలిగియున్నది, సళ్ళి (పడకం బడి) ఉన్నది, శయ్యాప్రమాణాదికం = పడుకకొలతకు సరిగాకాక, మిగిలి ఉన్నది - అపిచ = మఱియు, అన్నిటికిపైగా లక్ష్యసుప్తం స్యాత్ యది = (దొంగ =) అగపడుటకు మాత్రమైన నిద్రయగునేని, అభిముఖం = ఎదురుగా, దీపం = దీపమును, న మర్షయేత్ = ఓర్వదు, ఒప్పదు.

( సమన్తాదవలోక్య ) అయే, కథం మృదఙ్గః, అయం దర్దురః. అయం పణవః. ఇయ మపి వీణా. ఏతే వంశాః అమీ పుస్తకాః. కథం నాట్యాచార్యస్య గృహ మిదమ్! అథవా భవనప్రత్యయా త్ప్రవిష్టో ఽస్మి. త త్కిం పరమార్థదరిద్రో ఽయమ్, ఉత రాజ భయా చ్చోరభయా ద్వా భూమిష్ఠం ద్రవ్యం ధారయతి. త న్మ మాపి నామ శర్విలకస్య భూమిష్ఠం ద్రవ్యం! భవతు, బీజం ప్రక్షిపామి

---

వీరి నిద్ర నిజమైనదే, సందేహము లేదు, ఊర్పులో జంకు కొంకు లేకున్నది, స్పష్టముగా విడుపు పట్టు తెలియుచున్నది, ఊర్పును ఊర్పును ఎడము ఏకరీతిగా ఉన్నది. కంటిమూఁత ఉన్నంతలో గట్టిగా ఉన్నది. సళ్ళు లేదు, లోపల పాప అదుట లేదు, దేహము కీళ్ళుసళ్ళి అవశముగా, ఒక కాలు పడుకను ఒకటి పడకను తప్పియు, అట్లే చేతులును, పడకను వదలి మించి ఉన్నది. ఇంత ఏల? దొంగ నిద్ర ఎదుట దీపపు వెలుతురును ఓర్వనే ఓర్వదు.

సమన్తాత్ అవలోక్య - అంతటను కలయఁ జూచి, అయే - ఆశ్చర్యము! కథం = ఏమీ! ఎట్లూ! దదుఙ్గరః = ఒకవాద్యము, పిల్లనగ్రోవిం బోలినది, పణవః = ఉడుక - హుడుక్క - అని అదియు నొక వాద్యము - మృదంగము డోలుం బోనిది, ఏతే వంశాః = ఇవిగో పిల్లనగ్రోవులు, ఇవిగో పుస్తకములు - అచ్చువియో, వ్రాఁతవియో, ఏమీ నట్టువోజయిల్లా యిది! అథవా = అట్లు కాదు, నాకు తెలియదు - భవనప్రత్యయాత్ = ఇల్లు పెద్దదిగా నున్నదనుకొని అనమ్మకముతో నే, తత్ కిం - ... మఱి యితఁ డేమి నిజముగా నే దరిద్రుడా? లేక రాజావలని భయమునను - (అతఁడు సాకు పెట్టి బలాత్కారముగా గొను నని), దొంగల భయమునను, ధనమును (ఎక్కడ నేని) నేలలో (పూడ్చి) పెట్టి ఉంచు కొని యున్నాఁడా? ఏమి, నాకు శర్విలకునికి సయితము ధనము నేలలో పూడ్చి నది యగునా? - నేను శర్విలకుఁడను అన్ని యుపాయములు ఎఱిగినవాఁడనే - పాతాళమున పెట్టినను కనిపట్ట నేర్తునుగదా. కానీ - (కనిపట్టెదను, దాని యుపాయమును అనుష్ఠించి.) గింజ ఉంచెదను - (అది మంత్రింపఁబడినది - ఉంచి ఉంచిన గింజ.) నస్ఫారీభవతి = ఉబ్బ లేదు - ఉబ్బినధనము ఉన్నదని చోటును

(తథా కృత్వా) నిక్షిప్తం బీజం న క్వచి త్స్ఫారీభవతి. అయే, పరమార్థదరిద్రో ఽయమ్. భవతు, గచ్ఛామి

విదూ—(ఉత్స్వప్నాయతే) భో వయస్య, సంధి రివ దృశ్యతే, చౌర మివ పశ్యామి. త ద్గృహ్ణాతు భవా నిదం సువర్ణ భాణ్డమ్. [భో వఅస్స, సంధీ విఅ దిజ్జది. చోరం విఅ పేక్ఖామి. తా గేణ్హాదు భవం ఏదం సువణ్ణభణ్డఅమ్].

శర్వి—కిం న ఖ ల్వయ మిహ మాం ప్రవిష్టం జ్ఞాత్వా దరిద్రో ఽస్మీ త్యుపహసతి. త త్కిం వ్యాపాదయామి? ఉత లఘుత్వా దుత్స్వప్నాయతే? (దృష్ట్వా) అయే, జర్జరస్నానశాటీ నిబద్ధం దీపప్రభ యోద్దీపితం సత్య మే వైత దలంకరణ భాణ్డమ్. భవతు, గృహ్ణామి, అథవా న యుక్తం తుల్యావస్థం కులపుత్త్రజనం పీడ యితుమ్. త ద్గచ్ఛామి.

---

పట్టియిచ్చును, ఆ రెండును ఉబ్బలేదు, బీజమ్ - 'ఏక' వచనము - ఒకటే - అని - వే. వేం. జ్ఞాపిక. ఓహో ఇతఁడు నిజమైన దరిద్రుఁడే - సరే కానిమ్ము, ఇఁక ఇట నెందుకు? పోఁయెదను లే?

ఉత్స్వప్నాయతే = కలలో పలవరించును. కన్నమును దొంగను తలఁచు కొనుచునే నిద్రించినాఁడు గాన - కలయు పలవరింతయు. ... కన్నము వలె అగపడుచున్నది! దొంగవలె అగపడుచున్నాఁడు, కావున ఈబంగారునగను నీవు తీసికో. కిం న ... ఉపహసతి ? = ఏమియు ఎట్టి బంగారును లేని యీ చోటికి వచ్చితి నని ఇతఁడు నన్ను హేళనము చేయఁడుగదా. చంపుదునా? (మేలుకొన్నాఁడు, నన్ను వీఁ డేమేని చేయునేమో యని), లఘుత్వాత్ = పిఱికితనమువలన - మనసు తేలికయై (కన్నము దొంగ అని కలగని - అనుట) ఓహో! చింపిస్నానపు కోలికలో - గామంచాలో కట్టఁబడినది, దీపపు వెలుఁగున తళతళ యగపడుచున్నది, నిజముగానే ఇది, (అలంకార =) పెట్టుకొను బంగరు నగ! కానీ, తీసికొందును. అట్లు కాదు, కూడదు, సాటియవస్థలో - దారిద్ర్యములో అనుట - ఉన్న మంచి యింటిపుట్టువును కలిగిన బ్రాహ్మణుని పీడించుట. కావున, పోయెదను.

విదూ—భో వయస్య, శాపితో ఽసి గోబ్రాహ్మణకామ్యయా, య దేత త్సువర్ణభాణ్డం న గృహ్ణాసి. [భో వఅస్స సావిదో సి గోబమ్హణకామాఏ, జఇ ఏదం సువణ్ణభణ్డఅం ణ గేణ్హసి]

శర్వి—అనతిక్రమణీయా భగవతీ గోకామ్యా బ్రాహ్మణకామ్యా చ. త ద్గృహ్ణామి. అథవా జ్వలతి ప్రదీపః. అస్తి చ మయా ప్రదీపనిర్వాపణార్థ మాగ్నేయః కీటో ధార్యతే. తం తావ త్ప్రవేశయామి. త స్యాయం దేశకాలః. ఏష ముక్తో మయా కీటో యాత్యేవాస్య దీప స్యోపరి మణ్డలై ర్విచిత్రై ర్విచరితుమ్. ఏష పక్షద్వయానిలేన నిర్వాపితో భద్రపీఠేన. ధిక్కృత మన్ధకారమ్. అథవా మయా ప్యస్మద్బ్రాహ్మణకులేన ధిక్కృత మన్ధకారమ్,

శాపితః అసి - ఒట్టు పెట్టఁబడితివి, గోవు యొక్కయు బ్రాహ్మణుని యొక్కయు కోర్కి చేత - అనఁగా వారి కోర్కిం దీర్పమి చేత - అట్టి పాపము చేసినవాఁడ వగుదువు - అని ఒట్టు.

తత్ గృహ్ణామి = కావున కైకొందును. ఊహూ - కూడదు, కానను, దీపము వెలుఁగుచున్నదే - నేను తెలిసిపోవుదును - అనుట, గోకామ్యా = గోవులకు పెట్టి కోర్కిం దీర్చుకొనుట - బ్రాహ్మణకామ్యా - బ్రాహ్మణుని కోర్కిం దీర్చుట - వ్రత విశేషము - అధిష్ఠాతృదేవతగలది, కావుననే భగవతి యనుట, అస్తి - అని అవ్యయము - వాక్యాలంకారము - 'అవును' - అని సంభాషణలో పలుమాఱు వాక్యాలంకారముగా పలుకుదురు, స్మరణార్థకముగా, ఆగ్నేయః - నిప్పుమీఁదికి - వెలుతురు మీఁదికి - ఎగురునది - ఒకజాతి మిడుత. దానిని భద్రపీఠము - అందురు, తస్య అయం దేశకాలః - దాని (ప్రయోగాని)కి ఇదిచోటును. సమయమును. యాతి ఏవ - చీకటిలో దూఱి వెలుతురు లేక ఆ యొక్క దీపమే ఉన్నందున సూటిగా దానిమీఁదికే పోయినది. దీపము చుట్టును వలయములుగా ఎగురఁగా దాని ఱెక్కల గాలికి దీపము ఆఱిపోయినది, ధిక్ = ఇసీ, కృతం అన్ధకారమ్ - చీకటిచేయఁబడినది - నాకైనను ఇఁక నెట్లు చూచుటయు, చేయుటయు, నాపనిని, అథవా = అంతియ కాదు - ఇదేపాటి? అనుకొనుట - మయా అపి ... = నాచేతను, పురువు చేత ఈ బ్రాహ్మణగృహముం బోలెనే, మా బ్రాహ్మణకులమున - బ్రాహ్మణులలోనైన

అహం హి చతుర్వేదవిదోఽప్రతిగ్రాహకస్య పుత్రః శర్విలకో నామ బ్రాహ్మణో గణికామదనికార్థ మకార్య మనుతిష్ఠామి. ఇదానీం కరోమి బ్రాహ్మణస్య ప్రణయమ్. (ఇతి జిఘృక్షతి

విదూ—భో వయస్య, శీతల స్తేఽగ్రహస్తః. [భో వఅస్స, సీదలో దే అగ్గహత్థో].

శర్వి—ధి క్ప్రమాదః, సలిలసంపర్కా చ్ఛీతలో మేఽగ్రహస్తః. భవతు, కక్ష్యో ర్హస్తం ప్రక్షిపామి.

(నాట్యేన సవ్యహస్త ముష్ణీకృత్య గృహ్ణాతి

విదూ—గృహీతమ్? [గహిదమ్].

---

మాయింట, నా యీ నడవడిచే, ఎంతయు మాలిన్యము - పాపము - చీకటిం బోనిది - కలిగింపఁబడినది! ధిక్ - ఛీ, ఛీ! అహం హి ... = నేనో నాలుగు వేదములు నేర్చిన గొప్ప శ్రోత్రియునికి, ఎవరివలనను ఏమియు దానమైనను గొనని అత్యంత శుచియైనవానికి, కుమారుఁడను, శర్విలకుఁడని పేరువడ్డ బ్రాహ్మణుఁడను, (మతి) మదనిక అను భోగముదానికోసము - మదనిక వసంతసేన చేటికదా - ఈకూడని పనిని - చౌర్యమును, అందును బ్రాహ్మణుని ధనము దొంగిలుటను - చేయుచున్నాను. ఇప్పుడు బ్రాహ్మణుని - మైత్రేయుని - కోరికను తీర్చెదను. నగను తీసికొందును.

శీతలః తేఽగ్రహస్తః - నీ ముంజేయి చల్లగా ఉన్నదే! అది మైత్రేయునికి చారుదత్తుని నిద్రలో నున్నవాని చేయి కాదు అని సందేహము కలిగింపఁగా - అప్పుడే దానికి వేఁడి కలుగు ఉపాయము చేయుచున్నాఁడు, దొంగ. చల్లదనము నీళ్ళు తాఁకి తలుపుప్రాంత లేకుండుటకు పోసినందున, మైత్రేయుఁడు కలలో సువర్ణభాండమును చారుదత్తునికి అని, సమయానికి దానిని అందుకొన్న శర్విలకుని చేత ఇచ్చుచున్నాఁడు, ప్రమాదః = పొరపాటు, కక్షయోః హస్తం క్షిపామి - సంకలలో చేయి పెట్టుకొందును, దాన వేఁడియెక్కును గదా, ఎడమచేతిని వెచ్చగా చేసి భాండముం (=నగను) గొనుచున్నాఁడు, గృహీతమ్? = కైకొనఁబడినదిగదా?

శర్వి—అనతిక్రమణీయో ఽయం బ్రాహ్మణప్రణయః. త
ద్గృహీతమ్.

విదూ—ఇదానీం విక్రీతపణ్య ఇవ వణిక్, అహం సుఖం
స్వప్స్యామి. [ దాణిం విక్కిణిదపణ్ణో విఅ వాణిఓ, అహం సుహం
సువిస్సమ్ ].

శర్వి—మహాబ్రాహ్మణ, స్వపిహి వర్షశతమ్. కష్ట మేవం
మదనికా గణికార్థే బ్రాహ్మణకులం తమసి పాతితమ్. అథవా
ఆత్మా పాతితః

శ్లో. ధి గస్తు ఖలు దారిద్ర్య మనిర్వేదితపౌరుషమ్
యదేత ద్గర్హితం కర్మ నిన్దామి చ కరోమి చ. ౧౯

అనతిక్రమణీయః ... = బ్రాహ్మణునికోరిక మానఁగూడదని దానిచేత తీసికొనఁబడినది, ఇదానీం ... = ఇప్పుడు బేరపువస్తువును అమ్మివేసికొన్న - కోమటివలె, నేను సుఖముగా చింత లేక నిదురింతును. - కోమటికి వస్తువు అమ్ముడుపోయిన - దానిదైన వెలయు లాభమును చెందును, కాపాడవలయు క్లేశముపోవును - అతఁడు ఆదమఱచి హాయిగా నిద్రించును. ఇదంతయు మైత్రేయునికి కళ పనియు, శర్విలకునికి మేలుకొనియున్న దొంగపనియు - ఇదేదియు చారుదత్తయ్యవ పాటకచ్చేరి విని ప్రొద్దుపోయినందున గాఢముగా నిద్రించుచున్నవానికి తెలియదు,

కష్టం = కట్టా - అయ్యో - మదనికాగణికార్థే = భోగము మదనికకోసము - బ్రాహ్మణకులం = బ్రాహ్మణ చారుదత్త గృహమును, మా బ్రాహ్మణ శ్రోత్రియకులమును దీప మార్పియు, పాపము చేసియు చీకటిలో - పాపమున - పడవేయఁబడినది, క్రమముగా శ్లేషచే అన్వయమును. కాదు కాదు - నాయాత్మ (రౌరవనరకమునం) ద్రోయఁబడినది!

శ్లో. ౧౯. దారిద్ర్యం ధిక్ అస్తు కిల = దారిద్ర్యమును గూర్చి చీ! చీ!. చీకొట్టుదును గాక - (అదెట్టిదనఁగా) అనిర్వేదిత పౌరుషమ్ = వానిం దీర్చుకొనుటకైన పురుషప్రయత్నము నెడ రోఁతతోఁపనిది, యత్ = ఏలన, ఏతత్ గర్హితం కర్మ = ఈనింద్యమైన పనిని, నిందించుచునున్నాను, మఱి చేయుచునున్నానే! కాదా దుఃఖములేని పురుషకారముగలది. దుఃఖపడవలసినవానిని దుఃఖపడనీక చేయించుచున్నది.

తద్యావన్మదనికాయా నిష్క్రయణార్థం వసన్తసేనాగృహం గచ్ఛామి. (పరిక్రమ్యావలోక్య చ) అయే, పదశబ్ద ఇవ. మా నామ రక్షిణః. భవతు. స్తమ్భీభూత్వా తిష్ఠామి. అథవా మమాపి నామ శర్విలకస్య రక్షిణః. యోఽహం

శ్లో. మార్జారః క్రమణే, మృగః ప్రసరణే,
శ్యేనో గ్రహాలుఞ్చనే,
సుప్తాసుప్తమనుష్యవీర్యతులనే
శ్వా, సర్పణే పన్నగః,
మాయా రూపశరీరవేశరచనే

ఛీ ఛీ పాడు పేదతికము! (దానిం బాపుకొననైన) ప్రయత్నము నెడ రోఁతగొనను కదా. నిందించుచునే చేయుచును ఉన్నానే - ఛీ! ఛీ!

తత్ = కనుక. ఇఁక, మదనికాయాః నిష్క్రయణార్థం = (ధనము ఇచ్చి) మదనిక దానిసతనముం బాపుటకు - విలిచి నా భార్యం జేసికొనుటకు, వసంతసేనయింటికి పోయెదను. అంతయు ఆరాత్రికాలముననే. పదశబ్ద ఇవ = అడుగుల చప్పుడువలె నున్నది. మా నామ రక్షిణః = ఆరెకులు - పోలీసులు కారుగదా. కానీ. స్తంభమ నయ్యెదను - స్తంభమువలె - నిలుతును. అథవా = ఏల? ఎందులకు అట్లు చేయుట? చేయను, నాకును శర్విలకునికి పోలీసులా! నేను ఎట్టి వాఁడను అనుకొందురు?

శ్లో. అం. క్రమణే = దాఁటుటయందు లఘువున, మార్జారః = పిల్లి - పిల్లి గంతులం బోవుదును. ప్రసరణే = పేరెమున, మృగః = జింకను. - మృగజవమని ప్రసిద్ధి - గ్రహాలుఞ్చనే = పట్టును చీల్చుకొని, ఒడిసికొని, ఒడుపు తప్పించుకొని పోవుటయందు, - పట్టుకొనుట కాక విడిపించుకొనుటయే ఇట ప్రసక్తము - శ్యేనః = డేగను. సుప్తాసుప్త మనుష్య వీర్య తులనే = నిదురించినట్టియు, నిదురింపక (మేలుకొని) ఉన్నట్టియు జనుల వీర్యమును అంచనవేయుటయందు, శ్వా = కుక్కను, సర్పణే = ప్రాఁకుచుం బోవుటయందు, పన్నగః = పామును, రూపశరీర వేషరచనే = రూపమును దేహమును వేషమును - దేశ కాలముల నిష్టమైనట్లు, - తాల్చుటయందు, మాయా = మాయాదేవినే - దేవునికి సహకారిణిగా

వా గ్దేశభాషాన్తరే,
దీపో రాత్రిషు, సంకటేషు డుడుమో,
వాజీ స్థలే, నౌ ర్జలే. ౨౦

అపి చ,

శ్లో. భుజగ ఇవ గతౌ, గిరిః స్థిరత్వే,
పతగపతేః పరిసర్పణే చ తుల్యః,
శశ ఇవ భువనావలోకనే ఽహం,
వృక ఇవ చ గ్రహణే, బలే చ సింహః. ౨౧

ఎల్లవారికి ఆయాదూపదేశా వేషములను గొల్పునది, దేశభాషాన్తరే = దేశభాషల యెడ, వాక్ = వాగ్దేవిని, రాత్రిషు = రాత్రులయందు, దీపః = దీపమును. (నేను చీకటిని సరకుగొనను, చీకటిలో దీపమెట్లో అట్లు నేను నడయాడుచును అన్నింటిం జూచుచును ఉందును, సఙ్కటేషు = సంకటములందు, ఇఱుకులందు, డుండుమః = ఇరుదలపామును - పామే ఒదుగగలదు, ఇరుదలది మఱి చెప్పవల యునా? స్థలే = నేల (పై గమనము)న, వాజీ = గుఱ్ఱమును, జలే = నీట, నౌః = నావను.

ఆయాపనులయందు ఆయాయవి ప్రసిద్ధములు, వానిని మించినవిలేవు. అట్లే ఆయాపనులయందు కరము నెప్పరిని.

శ్లో. ౨౧. ఇంకను తన మహిమలం జెప్పుచున్నాఁడు. గతే = గమనమున, భుజగ ఇవ = పామువంటివాఁడను, మునుపు చెప్పినది సర్పణము - ప్రాకుట - ఇట వేగమునం దాత్పర్యము; కనఁబడి అంతలో అదృశ్య మగును; స్థిరత్వే = చలింపమిని, గిరిః = కొండను. స్తమ్భీభూతాత్వా తిష్ఠామి అన్నాఁడే, అంతకన్నను గూడ నేర్పుఱం జూపుట; పరిసర్పణే = సుడిసి తిరుగుటయందు, పతగపతేః తుల్యశ్చ = గరుత్మంతునికి సమానుఁడను; అహం = నేను, భువనావలోకనే = (తా) సన్నచోటు (నాలుగుమూలలు ఆకళించి యెఱుంగుటయందు, శశ ఇవ = కుందేలువలె, గ్రహణే = పట్టుకొనుటయందు - పట్టుం గొనుటయందు మఱి యొడిసి తప్పించుకొననీక, వృక ఇవ = తోడేటివలె. బలే = భుజబలమందు - ఎంతటివానిని నొంచుటయందును, ఎంతటిదానిని ఎత్తుకొని పోవుటయందును, సింహః చ = సింగమును - ఎద్దుంబోని యెంతబరువైనదాని నైనను సింగము - నోటికోఱలతో పట్టుకొని ఎత్తుకొనిపోవును.

[ప్రవిశ్య]

రదనికా—హా ధిక్, హా ధిక్, బహిర్ద్వారశాలాయాం ప్రసుప్తో వర్ధమానకః. సో ఽప్యత్ర న దృశ్యతే. భవతు. ఆర్యమైత్రేయ మాహ్వాయామి. [హద్ధీ హద్ధీ. బహిరదుఆరసాలాపసుత్తో వడ్ఢమాణఓ. సో వి ఎత్థ ణ దీసఇ. భోదు. అజ్జమిత్తేఅం సద్దావేమి.] (ఇతి పరిక్రామతి.

శర్వి—(రదనికాం హన్తు మిచ్ఛతి. నిరూప్య) కథం స్త్రీ. భవతు. గచ్ఛామి. (ఇతి నిష్క్రాన్తః.

రద—(గత్వా సత్రాసమ్) హా ధిక్, హా ధిక్, అస్మాకం గృహే సంధిం కర్తయిత్వా చౌరో నిష్క్రామతి. భవతు. మైత్రేయం గత్వా ప్రబోధయామి. ఆర్యమైత్రేయ ఉత్తిష్ఠోత్తిష్ఠ

---

ఇట్లు తన మహిమలం దాఁ దనియువఁఆకు ఉగ్గడించుకొని తనిసినాఁడు. బాపనవాఁడయ్యు ఈపనిలో అనితరసదృశ మహిమను ఆర్జించినాఁడు.

రదనికకు మెలఁకువ వచ్చినది. వర్ధమానకుఁ డేఁడి అని చూచినది - అగపడలేదు.

హాధిక్ ... = ఛీ ఛీ, (అప్పుడు) బహిర్ద్వార ... = బయటి వాకిటికడనున్న శాలలో నిద్రించినాఁడు, వర్ధమానకుఁడు ఇప్పుడు అక్కడ లేఁడు. మైత్రేయచారుదత్తులు వచ్చినప్పుడు, వారికి తలుపు తీసి, కాళ్లు కడిగికొన నీళ్లిచ్చి, నగను మైత్రేయునికి అప్పగించి, తాను అక్కడలేక లోపలికి పోయి పరుండెను. అది రదనిక ఎఱుఁగదు. కావున వాఁ డక్కడలేమికి చీకొట్టుచున్నది. ... = కాని, మైత్రేయయ్యను పిలిచెదను - ఇట్లు మేలుకొని మాటలాడు మానిసిని చీకటిలో చూచి దొంగ దిగులుపడి చంపఁబోయి, ఇంతలో స్త్రీ అని కనుగొని, మానుకొని, తాను బయటికి పోయినాఁడు దొంగ.

గత్వా = పోయి, అనఁగా మైత్రేయుం గాన నడిచి. సత్రాసమ్ = భయములో, అస్మాకం గృహే ... = అయ్యో అయ్యయ్యో మన యింట కన్నము వేసి,

అస్మాకం గేహే సంధిం కర్తయిత్వా చౌరో నిష్క్రాన్తః. [హద్ధీ, హద్ధీ, అమ్హాణం గేహే సంధిం కప్పిఅ చోరో ణిక్కమది. భోదు, మిత్తేఅం గదుఅ పబోధేమి. (విదూషక ముపగమ్య) అజ్జమిత్తేఅ, ఉట్ఠేహి. అహ్మాణం గేహే సంధిం కప్పిఅ చోరో ణిక్కన్తో.]

విదూ—(ఉత్థాయ) ఆః దాస్యాః పుత్రికే, కిం భణసి 'చౌరం కర్తయిత్వా సంధి ర్నిష్క్రాన్తః'. [ఆః దాసీఏధీఏ. కిం భణాసి - 'చోరం కప్పిఅ సంధీ ణిక్కన్తో'].

రద—హతాశ, అలం పరిహాసేన, కిం న ప్రేక్షస ఏనమ్. [హదాస. అలం పరిహాసేణ. కిం ణ పేక్ఖసి ఏణమ్].

విదూ—ఆ దాస్యాఃపుత్రికే, కిం భణసి 'ద్వితీయ మివ ద్వార ముద్ఘాటితమ్' ఇతి. భో వయస్య చారుదత్త, ఉత్తి ష్ఠోత్తిష్ఠ, అస్మాకం గేహే సంధిం దత్వా చౌరో నిష్క్రాన్తః.

చారు—భవతు. భోః, అలం పరిహాసేన.

విదూ—భోః, న పరిహాసః, ప్రేక్షతాం భవాన్. [భో, ణ పరిహాసో, పేక్ఖదు భవమ్].

---

(కొట్టి,) దొంగ బయటికి పోవుచున్నాఁడు. కాని మైత్రేయుని కడకు పోయి - ఇక్కడనుండి పిలిచిన వినఁబడునో పడదో - నిద్రలేపెదను - అయ్యా మైత్రే యయ్యా, లెమ్ము లెమ్ము, మన యింట కన్నము వేసి దొంగ బయటికి వెడలిపోయి నాడు!

ఆః దాస్యాఃపుత్రికే ... = (నిద్ర లేపినదన్న చిరాకుతో) ఆః - ఏమే, లంజకూతురా, ఏమి చెప్పుచున్నావు? - దాస్యాః ... = అలుక్క - అర్థముతిట్టు. దొంగను వేసి కన్నము వెడలిపోయినదా - అని ఆమాటలను హేళనగా విపరీత ముగా త్రిప్పి పలికినాఁడు. వానికి నమ్మకము లేదు, ఆదరిద్రపు టింటికి దొంగ వచ్చునని, కావున, హతాశ = చెడిబదికినవాఁడా, అలం ... = మాను ఎగతాళి. ఏమి దీనిని చూడవా? ద్వితీయం ద్వారం ఉద్ఘాటిత ఇవ = రెండవ - ఉన్నది

చారు—కస్మి న్నుద్దేశే?

విదూ—భోః ఏషః. [భో, ఏసో].

చారు—(విలోక్య) అహో దర్శనీయో உయం సంధిః.

శ్లో. ఉపరితల నిపాతితేష్టకో உయం
శిరసి తను ర్విపుల శ్చ మధ్యదేశే
అసదృశజనసంప్రయోగభీరో
ర్హృదయ మివ స్ఫుటితం మహాగృహస్య. ౨౨

కథ మస్మి న్నపి కర్మణి కుశలతా!

---

కాక మతిరెుుక - వాకిలి తెఱచినట్లున్నది - అనియా? కస్మిన్ ఉద్దేశే = ఏ ప్రదేశమున - ఏచోట? భోః ఏషః = ఓయి, ఇదిగో (ఇది). అహో ... దర్శనీయః = ఎంత అందముగా ఉన్నది, ఈకన్నము?

శ్లో. ౨౨. ఉపరితలనిపాతితేష్టకః = పైతట్టు పడఁద్రోయఁబడిన - యిటికలుగల, ఉపరి = పైనను, తల = అడుగునను, పడఁద్రోయఁబడిన - అనియు, అయం = ఇది, శిరసి = పైన తలంబోనిచోట, అంతటికి పైన అనుట - తనుః = సన్నమును, మధ్యదేశే = నడిమి ప్రదేశమందు, విపులఃచ = విశాలమును ఐ, అసదృశ జన సంప్రయోగ భీరోః = చెడునడవడిగల - దొంగ, ఘాతుకుఁడు - మానిసి పైన తాఁకుటచే బెదరి పిఱికివడిన, మహాగృహస్య = బంగాళాయొక్క, స్ఫుటితం = పగిలిన, హృదయం ఇవ = గుండెయో యన - (తోఁచుచున్నది.)

పైన మెడవద్ద(ను, అడుగునను,) ఇటికలు పడఁద్రోయఁబడినవి. నడుమ విశాలముగా నున్నది, ఈకన్నము. దొంగ తన్ను తాఁకినందులకు బంగాళా పిఱికివడఁగా పగిలిన (దాని) గుండెయో యనఁ దోచుచున్నది.

గుండెయో - అను సంభావనచే ఉత్ప్రేక్ష - అలంకారము.

కథం = ఎట్లూ! ... = ఈపనియందును నేర్పు!

విదూ—భో వయస్య, ఏష సంధి ర్ద్వాభ్యా మేవ దత్తో భవేత్. అథ వాగన్తుకేన శిక్షితుకామేన వా, అన్యథా త్రోజ్జయిన్యాం కో ఽస్మాకం గృహవిభవం న జానాతి. [భో వఅస్స, అఅం సంధీ దువేహిం జ్జేవ దిణ్ణో భవే. ఆదుఆగన్తుపణ, సిక్ఖిదుకామేణ వా, అణ్ణధా ఇధ ఉజ్జఇణీప కో అహ్మాణం ఘరవిహావం ణ జాణాది ].

చారు—

శ్లో. వైదేశ్యేన కృతో భవే న్మమ గృహే
వ్యాపార మభ్యస్యతా
నాసౌ వేదితవా న్ధనై ర్విరహితం
విస్రబ్ధసుప్తం జనమ్
దృష్ట్వా ప్రా జ్మహతీం నివాసరచనా

---

ఏష సన్ధిః ... = ఈకన్నమును (ఈ) యిరువురే వేసియుండఁ దగును. ఈయూరికి క్రొత్తగా వచ్చిన పొరుగూరివాఁడో - కాదా - (ఊరివాఁడే అగునేని) పని క్రొత్తగా నేర్చుకొనువాఁడో - అనఁగా ఈయింటి గుట్టు ఎఱుంగని వాఁడు - అట్టివాఁడో, ఇట్టివాఁడో - అన్యథా ... = కానన్న, ఈ యుజ్జయినిలో మనయింటి సంపద(పస) ఎవఁడు ఎఱుఁగఁడు ?

శ్లో. ౨౩. (క్రొత్తగా నేర్చుకొనువాఁడైనను, ఊరివాఁడు ఏమియు దొరకఁబోనిచోట ఏల ఈశ్రమ పడును. కావున) వైదేశ్యేన = పరాయియూరివాని చేత - అందును - వ్యాపారం అభ్యస్యతా = (ఈ) పని - దొంగతనము నేర్చుకొనుచున్నవాని చేత, మమ గృహే = నాయింట, కృతః భవేత్ = (కన్నము) వేయఁబడియుండును. అసౌ = వీఁడు, ధనైః విరహితం = ధనములేనిదియు - కావున నే - విస్రబ్ధసుప్తం = (దిగులు విచారము లేక) హాయిగా నమ్మకముతో నిద్రించుచున్నదియు, అగు, జనం = ఇంటిలోని జనమును - కావున జనము హాయిగా నిదురించుచుందురని అనుట - న వేదితవాన్ = ఎఱిఁగినవాఁడు కాఁడు. ప్రాక్ = తొలుత, అస్మాకం = మనయొక్క, మహతీం నివాసరచనామ్ = చాల

మస్మాక మాశాన్వితః
సంధిచ్ఛేదనఖిన్న ఏవ సుచిరం
పశ్చా న్నిరాశో గతః. ౨3

తతః సుహృద్భ్యః కి మసౌ కథయిష్యతి తపస్వీ - 'సార్థవాహసుతస్య గృహం ప్రవిశ్య న కించి న్మయా సమాసాదితమ్' ఇతి.

విదూ—భోః, కథం త మేవ చౌరహతక మనుశోచసి. తేన చిన్తితం మహా దేత ద్గృహమ్. ఇతో రత్నభాణ్డం సువర్ణభాణ్డం వా నిష్కా్రమయిష్యామి. (స్మృత్వా సవిషాదమాత్మగతమ్) కుత్ర త త్సువర్ణభాణ్డమ్ (పున రనుస్మృత్య, ప్రకాశమ్) భో

గొప్పదైన యింటి యందమైన నిర్మాణమును (కట్టుటను), దృష్ట్వా = చూచి, ఆశాన్వితః = (ఎంతయో ఏమేమో దొరకునను) ఆసతో కూడుకొన్నవాఁడై, సుచిరం = చాలసేపు, సన్ధిచ్ఛేదనఖిన్నః = కన్నముకొట్టుటలో అలసినవాఁడై, పశ్చాత్ = అనంతరము, నిరాశః = ఆశభంగమైనవాఁడై, గతః = పోయినాడు,

అట్టివాఁడో ఇట్టివాఁడో అన్నావు. కాదు, వాఁడు పరాయియూరివాఁడును పనికి క్రొత్తవాఁడునుం గూడ. ఈ యూరివాఁడు కానేకాఁడు. ఈయింట ధనము లేదు, జనము హాయిగా - దిగులు లేక - నిద్రించుచుందు రనియు ఎఱుఁగఁడు. ఇంటి యందమైన నిర్మాణము, బ్రహ్మాండమంతగా నున్నందున, ఇందు ఎంతో ఏమో ఉండును అని చాల ఆసపడినాఁడు. పాపము, కన్నము కొట్టు కష్టము పడినాఁడు. చూడఁగా ఇం దేమియు లేకపోఁగా - నిరాశుఁడై, పోయి యుండును. కన్నముఁ గొట్టిన కష్ట మొక్కటే వానికి!

తతః ... = తర్వాత ఈ దీనుఁడు (దొంగ), తన స్నేహితులతో ఏమి చెప్పఁగలఁడు! కోమటి - సాహుకారుకొడుకు నింట చొచ్చితిని - కాని, నాకేమియు దొరకలేదు - అని (కదా).

భోః ... = ఏమయ్యా! (ఎంత సేపైనను) ఆదొంగముండాకొడుకునే తలఁచుకొని వానికై దుఃఖపడెదవు! ఇందుండి రతనాలనగయో, బంగారునగయో - బయటికి కొనిపోఁగల నని అనుకొన్నాఁడు. కుత్ర తత్ ... = ఆబంగారు నగ

వయస్య, త్వం సర్వకాలం భణసి-'మూర్ఖో మైత్రేయః, అపణ్డితో మైత్రేయః' ఇతి. సుష్ఠు మయా కృతం తత్సువర్ణభాణ్డం భవతో హస్తే సమర్పయతా. అన్యథా దాస్యాః పుత్రేణాపహృతం భవేత్.

[భో, కథం తం జ్జేవ చోరహదఅం అణుసోచసి. తేణ చిన్తిదం మహన్తం ఏదం గేహమ్. ఇదో రఅణభణ్డం సువణ్ణభణ్డం వా ణిక్కమిస్సమ్. (స్మృత్వా ...) కహిం తం. సువణ్ణభణ్డఅమ్ (పున ...) భోవఅస్స, తుమం సర్వకారం బణాసి - 'ముక్ఖో మిత్తేఅఓ, అపణ్డిదో మిత్తేఅఓ' త్తి. సుట్ఠు మవ కిదం తం సువణ్ణ భణ్డఅం భవదో హత్థే సమప్పఅన్తేణ. అణ్ణధా దాసీవ పుత్తేణ అవహిదం భవే.]

చారు—అలం పరిహాసేన.

విదూ—భోః, యథానామాహం మూర్ఖస్తత్కిం పరిహాసస్యాపి దేశకాలం న జానామి. [భో, జహ ణామ అహం ముక్ఖో తా కిం పరిహాసస్స దేశఆలం ణ జాణామి].

చారు—కస్యాం వేలాయామ్?

విదూ—భోః, యదా త్వం మయా భణితో௨సి - 'శీతలస్తే ఉగ్రహస్తః' [భో, జదా తుమం మవ భణిదో సి - 'శీదలో దే అగ్గహత్థో']

ఏది? ... = నీవు ఎప్పుడును చెప్పుచుందువు - మూర్ఖుడు మైత్రేయుఁడు, చదువు సంధ్య లేనివాఁడు అని. నేను ఎంతయు చక్కఁగా చేసితిని. ఆబంగారువగను నీచేత పెట్టితినే. అది మంచిపని. అట్లు చేయకున్న (ఈ) లంజకొడుకుచేత దొంగిలింపఁబడియుండును.

మాను పరిహాసము. ఓయి, నేను మూర్ఖుఁడను ఐననే మాత్రము, ఎగతాళి కైనను వేళ పాళ ఎఱుఁగనా? ... ఏవేళయందు? ఓయి, ఎప్పుడు నేను 'చల్లగా ఉన్నదే, నీముంజేయి' అని నీతో అంటినో అప్పుడు. ఒకవేళ అట్లును అగునా?

చారు—కదాచి దేవ మపి స్యాత్. (సర్వతో నిరూప్య సహర్షమ్) వయస్య, దిష్ట్యా! తే ప్రియం నివేదయామి.

విదూ—కిం నాపహృతమ్? [కిం ణ అవహిదమ్].

చారు—హృతమ్.

విదూ—తథాపి కిం ప్రియమ్? [తహా వి కిం పిఅమ్]

చారు—య దసౌ కృతార్థో గతః.

విదూ—న్యాసః ఖలు సః. [ణాసో క్ఖు సో].

చారు—కథం న్యాసః! (మోహ ముపగతః).

విదూ—సమాశ్వసితు భవాన్, యది న్యాస శ్చోరే ణాప హృత స్త్వం కిం మోహ ముపగతః. [సమస్ససదు భవమ్. జఇ ణాసో చోరేణ అవహిదో తుమం కిం మోహం ఉవగదో].

చారు—(సమాశ్వస్య) వయస్య,

నిరూప్య = పరికించి, దిష్ట్యా! తే ప్రియం నివేదయామి = బళి, నీకు తియ్యని - ఇంపైన - మాటం జెప్పెదను. ఏమి! దొంగిలింపఁబడలేదా? పడినది. దానిని ఎత్తికొని పోయినాఁడు, తథాపి కిం ప్రియమ్ = అట్లైనను ప్రియము ఏమి?- ప్రియ మనుచున్నావే? యత్ అసౌ కృతార్థః గతః = ఏమనఁగా - వీఁడు (దొంగ) ధన్యుఁడై, పోయినాఁడు, (ఉత్త చేతులతో పోకుండ, చేతులనిండ ఎత్తుకొని పోయినాఁడు.) న్యాసః ఖలు సః = ఇల్లడ కదా అది? (కాపాడి ఒడయనికి అప్పగింపవలసిన వస్తువు!) కథం! న్యాసః! = ఎట్లూ! ఇల్లడయా! మోహం ఉపగతః = మూర్ఛపోయినాఁడు, యది న్యాసః ... = ఇల్లడ దొంగచే దొంగిలింపఁబడినట్లైన, నీ వేల ఇట్లు మూర్ఛిల్లితివి?

శ్లో. కః శ్రద్ధాస్యతి భూతార్థం? సర్వో మాం తూలయిష్యతి.
శఙ్కనీయా హి లోకే ఽస్మి న్నిష్ప్రతాపా దరిద్రతా, ౨౪

భో॰, కష్టమ్.

శ్లో. యది తావ త్కృతాన్తేన ప్రణయో ఽర్థేషు మే కృతః,
కి మిదానీం నృశంసేన చారిత్ర మపి దూషితమ్? ౨౫

విదూ—అహం ఖ ల్వపలపిష్యామి - 'కేన దత్తమ్, కేన గృహీతమ్. కో వా సాక్షీ' ఇతి. [అహం క్ఖు అవలవిస్సమ్ - 'కేణ దిణ్ణమ్, కేణ గహీదమ్. కో వా సక్ఖీ.' త్తి.

శ్లో. ౨౪. కః = ఎవఁడు, భూతార్థం = పరమార్థమును - నిజమును, - దొంగిలింపఁబడిన దనుటను, శ్రద్ధాస్యతి = నమ్మఁగలఁడు? సర్వః = ఎల్లరు, మాం = నన్ను, తూలయిష్యతి = తూలనాడుదురు (చులుకనచేయుదురు) కాదా; అల్పులతో సమీకరింతురు. అస్మిన్ లోకే = ఈలోకాన, నిష్ప్రతాపా = పౌరుషహీనమైన, దరిద్రతా = (ఈ) లేమిడి, శఙ్కనీయా హి = గుమాను పడదగినది గదా!

ఇట్టి సందర్భములలో లోకాన నిజమును ఎవఁడు నమ్మును? నేనే కన్నము వేయుట మొదలగువానిని పైకి చూపి, దానిని నేనే హరించితిని - తినివేసతిని అని యనుకొందురు. దారిద్ర్యము అంత బలహీనము, పసలేనిది; లోకాన అన్నిగుమానులకు ఆస్పదము.

భో॰ కష్టమ్ = కటకటా!

శ్లో. ౨౫. కృతాన్తేన = విధిచేత, నృశంసేన = దయమాలి (నవ్వానివేత,) మే అర్థేషు = సాధనమునందు, ప్రణయః = కోరిక, యది కృతః తావత్ = ఒకవేళ వహింపఁబడెనేని, (సర్వమును హరింపఁబడినది - లేమిడి వచ్చినది - సరే -) ఇదానీం = ఇప్పుడు, చారిత్రం అపి దూషితం కిమ్ = శీలము సయితము చెఱుపఁబడినదే, ఏమి?

నాయాస్తి సర్వము పోయినపోనీ, నాదురదృష్టముచేత. నాపేరుకూడ, నన్ను దొంగనుచేసి, చెఱుపవలెనా? హాతవిధీ!

అహం ఖలు అపలపిష్యామి = నేనే ఇయ్యలేదని చెప్పెదను - కేన దత్తమ్ ... = ఎవరు ఇచ్చినారు, ఎవరు తీసికొన్నారు, ఎవరు సాక్షి - అని.

చారు—అహ మిదానీ మనృత మభిధాస్యే?

శ్లో. భైక్ష్యేణా ప్యర్జయిష్యామి పున ర్న్యాసప్రతిక్రియామ్,
అనృతం నాభిధాస్యామి చారిత్రభ్రంశకారణమ్. ౨౬

రద—(ససంభ్రమమ్) త ద్యావ దార్యాధూతాయై గత్వా నివేదయామి. [తా జావ అజ్జధూదాఏ గదుఅ ణివేదేమి].

(ఇతి నిష్క్రాన్తా.)

(తతః ప్రవిశతి చేట్యా సహ చారుదత్తవధూః)

వధూః—(ససంభ్రమమ్) అయి, సత్య మపరిక్షతశరీర ఆర్యపుత్త్రః, ఆర్యమైత్రేయేణ సహ? [అఇ, సచ్చం అపరిక్ఖదసరీరో అజ్జఉత్తో అజ్జమిత్తేఏణ సహ]

చేటి—భర్త్రి, సత్యమ్, కిం తు యః స వేశ్యాజన స్యాలంకారకః సో ఽపహృతః. [భట్టిణి, సచ్చమ్. కిం తు జో సో వేస్సాజణకేరకో అలంకారఓ సో అవహిదో].

(వధూ మోహం నాటయతి)

చేటీ—సమాశ్వసి త్వార్యాధూతా. [సమస్ససదు అజ్జాధూదా].

అహం ఇదానీం ... ధాస్యే = నేను ఇప్పుడు బొంకు పలుకఁగలనా?

శ్లో. ౨౬. న్యాసప్రతిక్రియాం = ఇల్లడ తీర్పుఁను, - దానికి ఈడగు సొమ్మును అనుట, భైక్ష్యేణ అపి = బిచ్చ మెత్తుట చేసైనను, అర్జయిష్యామి = సంపాదింపఁగలను. చారిత్ర భ్రంశ కారణం = శీలము తొలఁగుటకు కారణ మగు, అనృతం = అసత్యమును, న అభిధాస్యామి = చెప్పఁజాలను.

నేను బిచ్చమెత్తియైనను సంపాదించి ఇల్లడం దీర్తుఁను, కాని, అబద్ధము చెప్పి, శీలము చెఱుపుకొనను.

వధూః—(సమాశ్వస్య) చేటి, కిం భణసి - 'అపరిక్షతశరీర ఆర్యపుత్రః' ఇతి. వర మిదానీం స శరీరేణ పరిక్షతః, న పున శ్చారిత్రేణ. సాంప్రత ముజ్జయిన్యాం జన ఏవం మన్త్రయిష్యతి - 'దరిద్రత యార్యపుత్రే ణై వేదృశ మకార్య మనుష్ఠితమ్' ఇతి. (ఊర్ధ్వ మవలోక్య నిఃశ్వస్య చ) భగవ న్కృతాన్త, పుష్కర పత్రపతిత జలబిన్దుచఞ్చలైః క్రీడసి దరిద్రపురుషభాగధేయైః. ఇయం చ మమ ఏకా మాతృగృహాలబ్ధా రత్నావలీ తిష్ఠతి. ఏతా మ ప్యతిశౌణ్డీరత యార్యపుత్రో న గ్రహీష్యతి. చేటి, ఆర్యమైత్రేయం తావ దాహ్వాయ.

---

త ద్యావత్ - మతి యన్తైన, నేను పోయి ధూతమ్మకు ఎఱింగింతును. (ఈజరిగిన దానిని చెప్పిన దానిని - అంతటిని) చారుదత్తవధూః = చారుదత్తుని యిల్లాలు - (చారుదత్తునియాఁడామె); తొట్రుపాటుతో (= ససంభ్రమమ్)

అయి - ఏమె, అపరిక్షత ... = ఆర్యపుత్రునికి ఏమి దెబ్బ, గాయము తగులలేదు గదటే, మైత్రేయయ్యకు కూడ. భర్త్రిణి = దొరసానమ్మ, నిజమే - (తగుల లేదు.) కింతు = మఱేమనఁగా ... = ఆభోగముదాని నగ యుండినదే, అది అపహరింపఁబడినది. వధూః ... = ఆమె మూర్ఛను అభినయించుచు - ఇది వేషగానికి అభినయోపదేశము, కథలో మోహము' నిజమే, నటన గాదు. చేటి ... = ఓసి చేటి. ఆర్యపుత్రునికి ఏమియు గాయముకాలేదు అనెదవేమే - ఇపుడు ఆయనకు దేహమునకు గాయ మయినను పరవాలేదు, చారిత్రమునకు - శీలమునకు, మంచి పేరునకు, దెబ్బ తగులుట మేలు కాదే - అది చాల సెబ్బర. ఇప్పుడు ఉజ్జయినిలో జనులు ఇట్లు చెప్పఁగలరు. దరిద్రుఁడగుటచేత ఆర్యపుత్తునిచేతనే ఇట్టి కూడని పని చేయఁబడినది - అని. స్వామి, కృతాంతుఁడా (= విధీ).

పుష్కరపత్త్రి ... = తామరాకుపైఁ బడిన నీటిబొట్టువలె నిలుకడ లేని దరిద్రపు మానుసుల భాగ్యముతో - నెత్తివ్రాఁతతో - ఆటలాడుదువే. ఇయం చ... = ఇదిగో, ఇదొక్కటి మాయమ్మయింట పొందఁబడినది - మాయమ్మ నాకు పెట్టినట్టిది - రతనాలహారము ఉన్నది. ఏతాం అపి ... = దీనినైనను, అత్యున్నత

[హఞ్జే, కిం భణాసి – 'అవరిక్ఖదసరీరో అజ్జఉత్తో' త్తి. వరం దాణిం సో సరీరేణ పరిక్ఖదో, ణ ఉణ చరిత్తేణ. సంపదం ఉజ్జఇణీఏ జణో ఎవ్వం మన్తఇస్సది – 'దలిద్దదాఏ అజ్జఉత్తేణ జ్జేవ ఈదిసం అకజ్జం అణుచిట్ఠిదమ్'. త్తి. భఅవం. కఅన్త, పోక్ఖరవత్తపడిదజల బిన్దుచఞ్చలేహిం కీలసి దలిద్దపురిసభాఅధేఏహిం. ఇఅం చ మే ఏక్కా మాదుఘరలద్ధా రఅణావలీ చిట్ఠది. ఏదం పి అదిసోణ్డీరదాఏ అజ్జఉత్తో ణ గేణ్హిస్సది. హఞ్జే, అజ్జమిత్తేఅం దావ సద్దావేహి].

చేటీ—యదార్యాధూ తాజ్ఞాపయతి. (విదూషక ముపగమ్య) ఆర్యమైత్రేయ, ధూతా త్వా మాహ్వాయతి. [జం అజ్జా ధూదా ఆణవేది. అజ్జమిత్తేఅ, ధూదా దే సద్దావేది].

విదూ—కుత్ర సా. [కహిం సా].

చేటీ—ఏషా తిష్ఠతి. ఉపసర్ప. [ఏసా చిట్ఠది. ఉవసప్ప].

విదూ—(ఉపసృత్య) స్వస్తి భవత్యాః. [సోత్థి భోదీఏ].

వధూ—ఆర్య, వన్దే. ఆర్య, పురస్తాన్ముఖో భవ. [అజ్జ వన్దామి. అజ్జ, పౌరత్థిమాముహో హోహి].

విదూ—ఏష భవతి, పురస్తాన్ముఖః సంవృత్తో౽స్మి. (ఏసో భోది, పౌరత్థిమాముహో సంవుత్తో హ్మి].

వధూ—అజ్జ, పడిచ్ఛ ఇమమ్. [ఆర్య ప్రతీచ్ఛేమామ్].

విదూ—కిం న్విదమ్. [కిం ణ్ణేదమ్].

చిత్తుఁడు - మనస్వి - యగుటచేత, ఆత్మగౌరవము కలవాఁడగుటచేత - ఎంత వచ్చినను భార్యనగను పుచ్చుకొందునా అనుచిత్తోన్నతిచేత - పుచ్చుకొనఁబోఁడు. ఓసి, చేటి, మైత్రేయయ్యను పిలువవే.

ఉపగమ్య = చేరఁబోయి, శబ్దాపయతి = పిలుచుచున్నదయ్యా, ఏషా తిష్ఠతి - ఇదిగో - ఇక్కడ అనుట - ఉన్నది, భవత్యాః = అమ్మగారికి - పురస్తాన్ముఖః భవ = తూర్పు మొగము గలవాఁడవు కమ్ము. ప్రతీచ్ఛ = పుచ్చుకో, కిం ను ఇదమ్ = ఇది ఏమిటి ?

వధూ—అహం ఖలు రత్నషష్ఠీ ముపోషి తాసమ్. తత్ర యథావిభవానుసారేణ బ్రాహ్మణః ప్రతిగ్రాహితవ్యః. సచన ప్రతిగ్రాహితః త త్తస్య కృతే ప్రతీచ్ఛేమాం రత్నమాలికామ్. [అహం క్ఖు రఅణసట్ఠిం ఉవవసిదా ఆసి. తహిం జధా విహవాణుసారేణ బహ్మణో పడిగ్గా హిదవ్వో. సో అ ణ పడిగ్గాహిదో. తా తస్స కిదే పడిచ్ఛ ఇమం రఅణమాలిఅమ్].

విదూ—(గృహీత్వా) స్వస్తి. గమిష్యామి ప్రియవయస్యస్య నివేదయామి. [సోత్థి. గమిస్సమ్. పిఅవఅస్సస్స ణివేదేమి].

వధూ—ఆర్యమైత్రేయ, మా ఖలు మాం లజ్జితాం కురు. [అజ్జమిత్తేఅ, మా క్ఖు మం లజ్జావేహి]. (ఇతి నిష్క్రాన్తా)

విదూ—(సవిస్మయమ్) అహో, అస్యా మహానుభావతా. [అహో, సే మహాణుభావదా].

చారు—అయే, చిరయతి మైత్రేయః. మా నామ వైక్లబ్యాదకార్యం కుర్యాత్. మైత్రేయ, మైత్రేయ.

---

రత్నషష్ఠీం ఉపోషితా ఆసమ్ = రత్నషష్ఠియంతయు - ద్వితీయకు అత్యంత సంయోగము అర్థము - ఉదయము మొదలు మఱు ఉదయమువఱకు అనుట - ఉపవాసము - శుష్కోపవాసము - నిట్టు. అనుట - ఉంటిని - చేసితిని - షష్ఠి మూఁడు దినాలక్రింద, నేఁడునవమి. మఱి అందు - అనఁగా దానికోసము, బ్రాహ్మణుఁడు = విభవముకొలఁదియు, దాన మీయఁబడవలయును. అది ఈఁబడలేదు. కావున, దానికోసము (=తస్యకృతే) ఈరతనాలమాలను పుచ్చుకో. ప్రియవయస్యస్య నివేదయామి - ప్రియవయస్యునికిం జెప్పెదను. ... = అయ్యా, నన్ను సిగ్గుపఱుపకు - ఎంతెంతలేసియో దానము లిచ్చినయాయనకు ఈ నాదానపుమాట చెప్పకు నాకు సిగ్గగును - నేను ఏపాటి, నా యిచ్చినది యేపాటి అనుట. కాదా దీనిని ఆయన గ్రహించునట్లు చేయుము. నాకు సిగ్గు తేకుము.

సవిస్మయమ్ = ఆశ్చర్యముతో - ఆమెవినయమునకును పాతివ్రత్యమునకును, ఎంత మహానుభావురాలు ఈమె! చిరయతి = జాగుసేయుచున్నాఁడు. మా నామ

విదూ—(ఉపసృత్య) ఏషో ౾స్మి. గృహాణైతామ్. [ఏసో హ్మి, గేణ్హ ఏదమ్]. (రత్నావలీం దర్శయతి

చారు—కి మేతత్?

విదూ—భోః, య త్తే సదృశదారసంగ్రహస్య ఫలమ్. [భో, జం దే సరిసదారసంగహస్స ఫలమ్].

చారు—కథమ్! బ్రాహ్మణీ మా మనుకమ్పతే. కష్టమ్. ఇదానీ మస్మి దరిద్రః.

శ్లో. ఆత్మభాగ్యక్షతద్రవ్యః స్త్రీద్రవ్యే ణానుకమ్పితః
అర్థతః పురుషో నారీ యా నారీ సార్థతః పుమాన్. ౨౭

అథవా, నాహం దరిద్రః. యస్య మమ

---

వైక్లబ్యాత్ ... = వీఁడు పిఱికితనముచేత, దిటవులేమిచేత, కూడని పని యేమియు చేయకుండునుగాక. కిం ఏతత్ = ఏమి యిది? భోః ... = ఓయి, ఇది తగిన భార్యం బెండ్లియాడినందుల ఫలము.

కథమ్ = ఏమి! - ఆశ్చర్యార్థకము. బ్రాహ్మణి, నాయిల్లాలు, నామీఁద దయఁ బూనుచున్నదా - జాలిగొనుచున్నదా! కష్టం = అయ్యో - ఇదానీం అస్మి- ఇప్పుడయ్యో అగుచున్నాను (నిజముగా.) ఇన్నాళ్ళును నేను దరిద్రుఁడను కాను.

శ్లో. ౨౭. ఆత్మభాగ్యక్షతద్రవ్యః = తన యదృష్టమున - దురదృష్టము చేత అనుట - నాశనమైన ద్రవ్యము కలవాఁడై, స్త్రీ ద్రవ్యేణ అనుకమ్పితః = భార్యధనముచేత జాలిగొని ఆదుకొనఁబడిన, పురుషః = మగవాఁడు, అర్థతః = ప్రయోజనముం బట్టి (నిజముగా), నారీ = స్త్రీ, యా నారీ = అట్టిదైన స్త్రీ యేదో, సా = అది - అట్టిది, అర్థతః = అర్థముం బట్టి - నిజముగా, పుమాన్ = పురుషుఁడు.

తన భాగ్యహానిచే ధనహానిపొంది, తన స్త్రీ ధనముతో ఆదుకొనఁబడిన వాఁడు, తా మగవాఁడయ్యును ఆఁడుదానింబోలె. అట్టియాడుది యాడుది యయ్యు, తాను మగవానింబోలె.

అట్లుకాదు (= అథవా). నేను దరిద్రుఁడం గాను. యస్య మమ = ఏనాకు - ఏలయన, నాకు అనుట.

శ్లో. విభవానుగతా భార్యా సుఖదుఃఖసుహృద్భవాన్
సత్యం చ న పరిభ్రష్టం యద్దరిద్రేషు దుర్లభమ్. ౨౭

మైత్రేయ, గచ్ఛ రత్నావలీ మాదాయ వసన్తసేనాయాః సకాశమ్. వక్తవ్యా చ సా మద్వచనాత్ – 'యత్ ఖ ల్వస్మాభిః సువర్ణభాణ్డ మాత్మీయ మితి కృత్వా విస్రమ్భా ద్ద్యూతే హారితమ్. తస్య కృతే గృహ్యతా మియం రత్నావలీ' ఇతి.

---

శ్లో. ౨౭. విభవానుగతా భార్యా = విభవమునకు తగిన వ్యవహారము (= నడువడి) గల, భార్యయు, సుఖదుఃఖసుహృత్ = సుకములందును కష్టములందునుం గూడ - ఒక్కటిత్రైన - సర్వకాలపు - మిత్రమును; నామేలు కోరు చుండువాఁడవు - నీవు ఇచ్చినదానిం గూడ, నాకు తెచ్చియిచ్చు చున్నావు - సత్యం చ = నిజమును, న పరిభ్రష్టం = నాశము కాలేదు - యత్ = ఏది - యనుట - ఈత్రయము, మూఁడును అనుట, దరిద్రేషు = పేదవారియెడ, దుర్లభమ్ = అరుదు.

మానిసి పేదపడిన, భార్య (అతని) మాటవినక అలక్ష్యము చేయును - మిత్రము వీడి పోవును - సత్యమును దూరమగును - బొంకుచు కలుగును. నాకు ఈ దరిద్ర లక్షణము లొక్కటియు లేవు. కావున నేను దరిద్రుఁడం గాను.

ఇప్పుడు, భార్యచే ఆదుకొనఁబడఁగా, నేను దరిద్రుఁడను అని, అంతట మరల లెస్సగా విచారించి నే దరిద్రుఁడంగాను. అనుటచే అలంకారము ఆక్షేపము. 'ఆక్షేపః స్వయము క్తస్య ప్రతిషేధో విచారణాత్.'

మైత్రేయ గచ్ఛ, రత్నావళీం ... = మైత్రేయ, పొమ్ము, రత్నావళిని తీసికొని వసంతసేనకడకు, ఆమెతో నామాటగా చెప్పుము - "యత్ = ఏకారణమున, సువర్ణభాణ్డం ... = (ఆ) బంగారునగ, ఆత్మీయం ఇతి కృత్వా = నాదే అని యెంచి, విస్రమ్భాత్ = నమ్మకమువలన, (ఓటమిరాదు గదా అని నమ్మి, ఒడ్డి), హారితమ్ = ఓడి, పోఁగొట్టుకొనఁబడినదో, అందులకై ఈరత్నాలహారము తీసికొనఁబడునుగాక - అని.

విదూ——మా తావ దఖాదిత స్యాభుక్త స్యాల్పమూల్యస్య చౌరై రపహృతస్య కారణా చ్చతుఃసముద్రసారభూతా రత్నావలీ దీయతే. [ మా దావ అక్ఖాదఇస్స అభుత్తస్స అప్పముల్లస్స చోరేహిం అవహిదస్స కారణాదో చతుఃసముద్దసారభూదా రఅణావలీ దీఅది ].

చారు——వయస్య, మా మైవమ్.

శ్లో. యం సమాలమ్బ్య విశ్వాసం
న్యాసో ఽస్మాసు తయా కృతః,
త స్యైత న్మహతో మూల్యం
ప్రత్యయ స్యైవ దీయతే. ౨౯

---

మా తావత్ ... = కూడదు. కూడదు, అఖాదితస్య = తినఁబడని, అభుక్తస్య = అనుభవింపఁబడనిదానికి, అల్పమూల్యస్య = కొద్ది వెలగలదానికి, చౌరై ... = దొంగలచే హరింపఁబడిన దానికిని ఐన, కారణాత్ = కారణము వలన - అనఁగా అట్టిదానికోసము చతుః ... = దీయతే = నాలుగుసముద్రాల, సారమైన, రత్నాలహారము - దీయతే = ఈఁబడుచున్నదే - ఎంతమాత్రము ఆపని చేయకూడదు.

రత్నము రత్నాకరమగు సముద్రపు సారము - ఎన్ని రత్నములు ఎంతెంతలు ఆరత్నావళిలో నుండునవి! అట్టి దానిని ఆసువర్ణభాండమునకు బదులుగా ఇచ్చివైచుటయా? ఎంతమాత్రము కూడదు - దాని నేమి మనము తిన్నామా, పెట్టుకొన్నామా, ఏమియుఁగూడదు - అని భా.

శ్లో. ౨౯. (వయస్య, నీవు చెప్పుమాట సరికాదోయి. అట్లు కాదు, కాదు. చూడు.) యం విశ్వాసం = ఏ విశ్వాసమును, (నమ్మకమును అనుట), సమాలమ్బ్య = పట్టుకొని, - కారణముగాఁ గొని, తయా = ఆమెచేత, అస్మాసు = నాయెడ - నాచేత, న్యాసః కృతః = ఇల్లడయుంపఁబడెనో, తస్య మహతః ప్రత్యయస్య ఏవ = ఆగొప్ప నమ్మకమునకే, మూల్యం ఏతత్ = వెలయైన యిది, దీయతే = ఇయ్యఁబడుచున్నది,

తద్వ్యయస్య, అస్మచ్ఛరీరస్పృష్టికయా శాపితో ఽసి, నైనా మగ్రాహయిత్వాత్రా గన్తవ్యమ్. వర్ధమానక,

శ్లో. ఏతాభి రిష్టికాభిః సంధిః
క్రియతాం సుసంహతః శీఘ్రమ్
పరివాద బహుల దోషా
న్న యస్య రక్షాం పరిహరామి. 30

---

ఇది అనువర్ణ భాండమునకు ఈడగు వెల అని కాదు, ఇట్లు ఈఁబడుట. న్యాసముంచినపుడు ఆమె ఏమి చెప్పినది; ఇది వట్టి తొత్తికొంపయే యని నే నన్నందులకు? కొంపయందు కాదు ఇల్లడ పెట్టుట, మానిసియందు కదా. అని యనెనుగదా. దరిద్రుఁడనైన నేమి? ఆగొప్ప నమ్మకమునకు వెల యింత యని చెప్ప నలవిపడునా? దాని వెలగా, ఈడుగా దీనిని ఇచ్చుట.

తత్ = కావున, అస్మత్ శరీర స్పృష్టికయా = నాయొళ్ళు తాఁకుటచే - నాయొంటిమీఁద, శాపితః అసి = ఒట్టుపెట్టఁబడితివి. - అనఁగా ఈపని నీవు చేయకున్న నీవు నన్ను చంపుకొన్నట్లు - అది ఒట్టు పెట్టు తీఱు. ఏనాం అగ్రాహయిత్వా = దీనిని ఆమె ఒప్పుకొని తీసికొనునట్లు చేయక, న అత్ర ఆగన్తవ్యమ్ = (మఱి) ఇక్కడికి రాఁగూడదు. (ఏమనుకొన్నావో - అని అంతగట్టిగా చెప్పి పంపుచున్నాఁడు. వర్ధమానకుఁడు చారుదత్తయ్య నౌకరు.

శ్లో. 30. ఏతాభిః ఇష్టకాభిః = ఈ యిటికలతో, సన్ధిః = కన్నము, శీఘ్రం = త్వరగా, తెల్లవారకమునుపే, సుసంహతః = చక్కఁగా మూయఁబడినదిగా, క్రియతాం = చేయఁబడును గాక. పరివాద బహుల దోషాత్ = నిందవలని గొప్ప తప్పువలన, అనఁగా అడికలుగనీక, యస్య = దేనియొక్క, అనఁగా దీని యొక్క, రక్షామ్ = కాపాడుటను - అనఁగా ఇట్లు మూయుటను, నపరిహరామి = మానఁజాలను.

దీనిని ఇప్పుడే ఈయిటికలతోనే చక్కఁగా, గుఱుతు తెలియనీక, మూసి వేయుము. ఆలస్యము చేయఁగూడదు - తెల్లవాఱి, యిది అందఱి కంటను పడిన

వయస్య మైత్రేయ, భవతా ప్యకృపణశౌణ్డీర్య మభిధాతవ్యమ్.

విదూ—భోః, దరిద్రః కి మకృపణం మన్త్రయతి? [భో, దలిద్దో కిం అకివణం మన్తేది?]

చారు—అదరిద్రో ౽స్మి సఖే, యస్య మమ [ 'విభవానుగతా భార్యా' ఇత్యాది పునః పఠతి. ] తద్గచ్ఛతు భావాన్. అహమపి కృతశౌచః సంధ్యా ముపాసే.

లేనిపోని గొప్పనింద కలుగును. కావున దీని రక్షను - అనఁగా, ఇప్పుడే చక్కఁగా కట్టుటను, అది లేకుండఁజేయుటను - నేను మానలేను - వాయిదా వేయలేను - ఆలస్యము చేయఁగూడదు.

ఓరి, వర్ధమానా, ఈకన్నమును ఇప్పుడే ఈయిటికలతోనే గట్టిగా మూసివేయుము. గుఱుతు తెలియఁగూడదు. ఇతరుల కంటఁ బడిన లేనిపోని నిందలు పలుకుదురు. అది పెద్ద దోష మగును. అది లేకుండ, మఱి వాయిదా - తర్వాత రేపు అని - వేయక - బొక్కను పూడ్పవలయును. బొక్కకు రక్ష పూడుపే.

వయస్య ... = నీవును - (భవతా అపి), దైన్యముతోఁ పనిక గబ్బిగా - బింకముగాను పొంకముగాను - పలుక వలయును.

భోః ... = ఓయి, దరిద్రుఁడు అదీనముగా పలుకునా? నేను దరిద్రుఁడను కాను, మిత్రమా, ఏనాఁకు - విభవమునకు తగినట్లు నన్ను అనుసరించు భార్యయు ... ఇత్యాది - మరల పఠించి - కావున నీవు తప్పక పొమ్ము - నేనును శౌచము - ప్రాతః - మడియగుటకు చేసికొనవలసిన దెల్ల చేసికొన్నవాఁడనై - స్నాన ధౌత ధారణాది యంతయు చేసికొని, సంధ్యా ముపాస్యే = సంధ్యావందనము చేసెదను. వేఁకువ, నక్షత్రములు మాసిపోకముందే సంధ్య ఆరంభించి, ఉదయమునకు ఉపస్థానము చేయవలసినదని - శాస్త్రము. పేదవడినను ఈమడియను స్థానముల నొక్కటియు మానఁడు, చారుదత్తుఁడు. తొలియంకమున (సాయం) సంధ్యావందనాంగ గాయత్రీజపము కావించినాఁడని యున్నది. ఇందు వేఁకువనే, కాలాతిక్రమణము చేయక అందులకుం గడంగునట్లు చెప్పఁబడినది.

[ఇతి నిష్క్రాన్తాః సర్వే]

ఇతి సంధిచ్ఛేదో నామ

తృతీయోఽఙ్కః

---

మదనత్రయోదశినాఁడు వసంతసేన చూపులచే చారుదత్తునికి 'మేజనిరః కామః' అని అభిలాష అంకురించినది. ఒక వారము గడవకపూర్వమే ఆమె తానై యింటికి వచ్చినది. చంద్రరేఖవలె కన్నులను మిఱుమిట్లు గొల్పినది. తానేమో మాటలాడినాఁడు. మగవారితో ధారాళముగా మాటలాడున దయ్యు బదులుపలు కను బిడియపడినది. అట్లు తన మనసును చారుదత్తునికి పట్టియిచ్చినది. అతఁడు పరిచారిక యనుకొన్నందులకు తలవాల్చి మన్నింపు అడుగఁగా, తానును అనుమతి లేక లోపలికి వచ్చినందులకు మన్నింపు అడిగినది.

అంతట అంత గబ్బిగానుండువాఁడె చారుదత్తుఁడు 'కానీ, అనురాగము నిలుపు' అన్నాఁడు. దాన తన్ను ఆపూట అక్కడ నుండు మనుచున్నాఁడు రతికై అని మనస్సు ఎంతో చలించియు, అప్పుడే అక్కడ నిలువకూడ దని, దారి భయాని కింబోలె తన నగను వానికడ ఇల్లడపెట్టిపోవుచు మైత్రేయుని తోడు పంపు మనఁగా తానే వెన్నెలలో తోడుపోయి ఇల్లు సేర్చి అనురాగపుఁ జూపులతో వీడ్కొని మరలినాఁడు. మఱి యతని చిత్తము ఎంత విరాళికి అగ్గమై యుండదు! సాయంరాత్రులు జాగరములే. దినములుఁ గడచుచున్నవి. 15, 20 దినాలైనవి. వైశాఖ శుక్లనవమి కాఁబోలు, నాఁడు రేభిలభావ వీణకచ్చేరి ఎందో జరుగఁగా, తాను ఎంతయో సంగీతరసికుఁడు, దానికి పోయినాఁడు – ఆనందముతో మరలి నాఁడు. వీణెంగూర్చి అతని తొలి తలంపులు 'ఉత్కణ్ఠితస్య హృదయానుగుణా వయస్యా' 'రక్తస్య రాగపరివృద్ధికరః ప్రమోదః' అని. ఆపాట చెవిలోవినంబడుచుం బోలెనే ఉండఁగా, ఆయిల్లడమాట వసంతసేనను జ్ఞప్తిసేయఁగా ఆయపరరాత్ర మున గాఢముగానే నిదురపోయినాఁడు.

మఱి యింట దొంగ సొచ్చి ఆయిల్లడనగనే దొంగిలించుకొని పోయినాఁడు. అది యిల్లడయే, ఇఁక దానికి ఎట్లు తీర్పు అని మనసున నెంతయు అందోళనపడి నాఁడు. దొంగతనమునకు దుఃఖితయైన ధూత తన రత్నహారమును షష్ఠిదానమిషచే

మైత్రేయునకు దాన మీయఁగా, దానిం గొని చీకటితోనే తాను ఇల్లడకు పంపిన తీర్పుగా వానిచేతనే వసంతసేనకుం బంపినాఁడు, చారుదత్తు ననురాగము న్యాస చౌర్యముచే దెబ్బతినునా? రత్నాలహార నిష్క్రియశౌండీర్యముచే మఱియు గాట మగును. ఆ నిష్క్రియ దూత్య ఫలమును ఎదురుసూచు చున్నాఁడు - దానిం దాల్చిన వసంతసేనను చూడఁగోరునేమో. (మఱి యీశర్విలకుడే ఆ పితూరి సర్వ నాయకుఁడు.)

ఇది కన్నము వేయుట

అను మూఁడవ యంకము

ముగిసినది



# చతుర్థో௨ఙ్కః



(తతః ప్రవిశతి చేటీ)

చేటీ—ఆజ్ఞప్తాస్మి మాత్రార్యాయాః సకాశం గన్తుమ్. ఏషార్యా చిత్రఫలక నిషణ్ణదృష్టి ర్మదనికయా సహ కి మపి మన్త్రయన్తీ తిష్ఠతి. త ద్యావ దుపసర్పామి. (ఇతి పరిక్రామతి) [ఆణ్ణత్తహ్మి అత్తాఏ అజ్జఆఏ సఆసం గన్తుమ్. ఏసా అజ్జఆ చిత్తఫలఅణిసణ్ణదిట్ఠీ మదణిఆఏ సహ కింపి మన్తఅన్తీ చిటిది. తాజావ ఉవసప్పామి].

(తతః ప్రవిశతి యథానిర్దిష్టా వసన్తసేనా మదనికా చ)

వసన్తసేనా—చేటి మదనికే, అపి సుసదృశీయం చిత్రాకృతి రార్యచారుదత్తస్య. [హఞ్జే మదణియే, అవి సుసదిసీ ఇఅం చిత్తాకిదీ అజ్జచారుదత్తస్స].

---

ఇం(క నిందు మదనికను దాస్యమునుండి విడిపింపను శర్విలకుఁడు - అందుకు తగినవెలయగునని తాను దొంగిలించిన బంగారునగను వసంతసేనకు ఇచ్చుటయు, మైత్రేయుఁడు ఇల్లడం దీర్చుటకై చారుదత్తుఁడు పంపిన రత్నావళిని ఇచ్చుటయు - ప్రస్తావింపఁ బడుచున్నది.

తతః ... = అంతట (వసంతసేన) చేటి - దాసి - ప్రవేశించుచున్నది, ఆజ్ఞప్తా అస్మి ... అమ్మచే ఉత్తరువు చేయఁబడితిని - అక్కకడకు పోవుటకు. ఏషా ఆర్యా ... = ఇదిగో అక్క, చిత్తరుపలకపై చూపు నిలిపి, మదనికతో ఏమో చెప్పుచున్నది. తత్ యావత్ ... = కావున సమీపించెదను, (అని పరిక్రమించును.)

అంతట యథానిర్దిష్ట - అనఁగా చిత్తరువును పరకాయించి చూచుచు మదనికతో మాటలాడుచు వసంతసేన ప్రవేశించుచున్నది. హఞ్జే - అని దాసికి 'పిలుపు' మాట - ఓసి అనుట. అపి సుసదృశీ ... = ఈ చిత్తరువులోని యాకా

మదనికా—సుసదృశీ. [సుసదిసీ].

వసన్త—కథం త్వం జానాసి? [కథం తుమం జాణాసి?]

మద—యేనార్యాయాః సుస్నిగ్ధా దృష్టి రనులగ్నా. [జేణ అజ్జఆఏ సుసిణిద్ధా దిట్ఠీ అణులగ్గా].

వసన్త—చేటి, కిం వేశవాసదాక్షిణ్యేన మదనికే, ఏవం భణసి? [హఞ్జే, కిం వేశవాసదాక్ఖిణ్ణేణ మదణిఏ, ఎవ్వం భణాసి?]

మద—ఆర్య్య, కిం య ఏవ జనో వేశే ప్రతివసతి, స ఏ వాలీకదక్షిణో భవతి? [అజ్జఏ, కిం జో జ్జేవ జణో వేసే పడివసది, సో జ్జేవ అలీఅ దక్ఖిణో భోది].

వసన్త—చేటి, నానాపురుషసఙ్గేన వేశ్యాజనో ఽలీకదక్షిణో భవతి. [హఞ్జే, ణాణాపురిససఙ్గేణ వేస్సాజణో అలీఅ దక్ఖిణో భోది].

---

రము చారుదత్తయ్యను చక్కఁగా పోలియున్నదటే. సుసదృశీ ... = అవును, చక్కఁగా పోలియున్నది. నీవు ఎట్లు ఎఱుఁగుదువు? యేన ఆర్యాయాః ... = ఎట్లా? అక్క ప్రేమతోనుకు చూపు అందు తగులుకొని యున్నందున. ఇఁక వేఱు రుజువు ఎందులకు దానికి? _ అనుట.

కిం వేశవాస ... = ఏమె, భోగమువీధివారి సాజమైన మోమోటమిచేత ఇట్లు పలుకుచున్నావటే? _ వేశవాసజనమునకు డబ్బుమీఁదనే ఆస. వారు అది పొందను ఇతరుల యభిప్రాయమునే మోమోడి అనుసరించు చుందురు. ఆ వాడుక చేత అట్లు కల్లబొల్లిగా పలుకుచున్నావా అనుట. ఆర్యే, కిం య ఏవ ... = అక్కా, ఏ జనము వేశ్యలవాడలో కాపురముండునో ఆజనము కపటపు మోమోటమి కలదియగునా? అనఁగా అందుకాపుర మున్నమాత్రన ఎల్లవారు కపటము గానే ఉందురా _ అనుట. నానాపురుష ... = అనేక విధములగు పురుషుల తోడికూడిక వలన, అందతిని అనుసరింపవలసినందున భోగమువారు బొల్లు దాక్షి

మద—యత స్తావ దార్యాయా దృష్టి రి హాభిరమతే హృదయం చ, తస్య కారణం కిం పృచ్ఛ్యతే ? [జదో దావ అజ్జఆఏ దిట్ఠీ ఇధ అభిరమది హిఅఅం చ, తస్స కారణం కిం పుచ్ఛీఅది ?]

వసన్త—చేటి, సఖీజనా దుపహాసనీయతాం రక్షామి. [హఞ్జే, సహీజణాదో ఉవహాసణీఅదాం రక్ఖామి].

మద—ఆర్యే, ఏవం నేదమ్. సఖీజనచిత్తానువర్త్యబలా జనో భవతి. [అజ్జఏ, ఎవ్వం ణేదమ్. సహీజణచిత్తాణువత్తి అబలా జణో భోది].

ప్ర. చేటీ—(ఉపసృత్య) ఆర్యే, మాతా జ్ఞాపయతి - 'గృహీతావగుణ్ఠనం పక్షద్వారే సజ్జం ప్రవహణమ్. త ద్గచ్ఛ' ఇతి. [అజ్జఏ, అత్తా ఆణవేది - 'గహిదావగుణ్ఠణం పక్ఖదుఆరఏ సజ్జం పవహణమ్. తాగచ్ఛ' త్తి].

---

న్యాము గలవారు అగుదురు. యతః తావత్ ... = మఱి యెందువలన అక్క చూపు ఇందు ప్రీతి గొనుచున్నదో, అట్లే హృదయమును ప్రీతి గొనుచున్నదో, అందుల కారణము అడుగఁబడునా ? అది సిద్ధమే కదా ?

హఞ్జే సఖీజనాత్ ... = ఓసి, సఖీజనమువలన ఎగతాళి చేయఁబడుటను (రక్షామి = ) తప్పించుకొనుచున్నాను. ఎగతాళి చేయుదురేమో అని చెప్పకున్నాను.

ఆర్యే ఏవం న ఇదమ్ = అక్కా ఇట్లు గాదు, ఇది. సఖీ జన చిత్తాను వర్తీ ... = చెలుల ( = వసంతసేనబోంట్ల) చిత్తమును - అభిప్రాయమును - అనువర్తించునది కదా, అబలాజనము (మదనికాది) అగును. వసంతసేన యెడ చనవుచే సఖియనిఉపచారము. అక్క చిత్తమును నేను అనువర్తింపనా ? ఎగతాళి చేయుదునా ? చెలిని కదా నేను - ఏల చేయుదును ? అనుట. అమ్మ ఆజ్ఞాపించుచున్నది. గృహీతావగుణ్ఠనం ... = ముసుకు వేయఁబడినదై దిడ్డి - వాకిటి చెంత

వసన్త—చేటి, కి మార్యచారుదత్తో మాం నేష్యతి? [హఞ్జే, కిం అజ్జ చారుదత్తో మం ణఇస్సది?]

చేటీ—ఆర్యే, యేన ప్రవహణేన సహ సువర్ణదశసాహస్రికో ఽలంకారో ఽనుప్రేషితః. [అజ్జఏ, జేణ పవహణేణ సహ సువణ్ణ దససాహస్సిఓ అలంకారవో అణుప్పేసిదో].

వసన్త—కః పునః సః. [కో ఉణ సో].

చేటీ—ఏష ఏవ రాజశ్యాలకః సంస్థానకః. [ఏసో జ్జేవ రాఅస్సాలో సంఠాణఓ].

వసన్త—(సక్రోధమ్) అపేహి, మా పున రేవం భణిష్యసి. [అవేహి మా పుణో ఎవ్వం భణిస్ససి.]

చేటీ—ప్రసీదతు ప్రసీదతు ఆర్యా. సందేశే నాస్మి ప్రేషితా. [పసీదదు పసీదదు అజ్జఆ. సందేసేణ మ్హి పేసిదా].

సిద్ధముగా నున్నది బండి. కావున పొమ్ము - అని. హఞ్జె కిం ఆర్యచారుదత్తః ... = ఏమే, చారుదత్తయ్య నన్ను కొనిపోవు చున్నాఁడా? - నాకోసము బండి పంపి నాఁడా? - అనుట.

ఆర్యే, యేన ప్రవహణేన...ఎవనిచేత బండితో కూడ పదివేల సువర్ణాల అనఁగా మొహారీల వెలగల అలంకారము (= నగ) (సువర్ణము - అనునది ఎనుబదిరతుల బరువుగల నాణెము). పంపఁబడినదో. కః పునః సః = ఎవఁడే మఱి వాఁడు? ఏష ఏవ ... = వాఁడేఅక్కా, రాజుమఱఁది, సంస్థానకుఁడు. సక్రోధమ్ = కోపముతో - సంస్థానకుని పేరు వినఁగానే కోపము వచ్చినది. అపేహి ... = పో అవతలకు. పలుక బోకు మరల ఇట్లు. ప్రసీద ... = మన్నించు అక్కా మన్నించు - సన్దేశేన = సమాచారముతో - సమాచారము చెప్పుము అని - పంపఁ బడితిని నేను.

వసన్త—అహం సందేశ స్యైవ కుప్యామి. [అహం సందేసస్స జ్జేవ కుప్పామి].

చేటి—తత్ కిమితి మాతరం విజ్ఞాపయిష్యామి? [తా కిం త్తి అత్తం విణ్ణవిస్సమ్?]

వసన్త—ఏవం విజ్ఞాపయితవ్యా - 'యది మాం జీవన్తీ మిచ్ఛతి, త న్నైవం న పున రహం మాత్రాజ్ఞాపయితవ్యా' [ఎవ్వం విణ్ణవిదవ్వా - జఇ, మం జీఅన్తీం ఇచ్ఛసి తా ఎవ్వం ణ పుణో అహం అత్తాఏ ఆణ్ణావిదవ్వా'].

చేటి—యథా తే రోచతే. [జధా దే రోఅది],

(ఇతి నిష్క్రాన్తా)

[ప్రవిశ్య]

శర్విలకః—

శ్లో. దత్త్వా నిశాయా వచనీయదోషం
నిద్రాం చ జిత్వా నృపతే శ్చ రక్షాన్

అహం సందేశాయ ఏవ ... = నేను (ఆ) సమాచారమునకే కోపపడుచున్నాను. తత్ కిం ఇతి ... = మరి నేను అమ్మతో ఏమని మనవి చేయుదుము? - ఆమెతో నన్ను ఏమి చెప్పుమందువు? ఏవం విజ్ఞాపయితవ్యా ... = (ఆమెతో) ఇట్లు విన్నపము చెప్పవలసినది. యది మాం జీవన్తీం ... = నేను బ్రదికియుండవలయునని కోరుదువేని ఆపక్షమున ఇఁక నెప్పుడును నేను అమ్మచే ఇట్లు ఆజ్ఞాపింపఁ బడఁగూడదు - ' అని. నేను బ్రదికియుండవలయు ననుకొన్నచో నీవ అమ్మ ఇఁక నెప్పుడును ఇట్టి సమాచారము పంపఁగూడదు - యథా తే రోచతే = నీకు ఇష్టము వచ్చినట్లు. అనఁగా నీయిచ్ఛచొప్పుననే చెప్పుదును అని.

శ్లో. ౧. నిశాయాః = రాత్రికి, వచనీయదోషం = నిందింపఁదగినది అను తప్పును - సొద్దును, దత్త్వా = ఒసంగి - అనఁగా కలిగించి, లోకులు పాపనిని దూషింపరు, రాత్రి యనఁగా అట్టిది యిట్టిది అని దూషింతురు - అట్లు దానికి సొద్దు కలిగించి, నిద్రాం చ జిత్వా = నిద్రను జయించియు - నిదుర కాచియు, (అట్లే) నృపతేః రక్షాన్ చ = రాజు కావలివారిని కూడ జయించి - అనఁగా వారికి దొర

స ఏష సూర్యోదయ మన్ద రశ్మిః
క్షపాక్షయా చ్చన్ద్ర ఇ వాస్మి జాతః. ౧

అపి చ,

శ్లో. యః కశ్చి త్త్వరితగతి ర్నిరీక్షతే మాం
సంభ్రాన్తం ద్రుత ముపసర్పతి స్థితం వా,
తం సర్వం తులయతి దూషితో ఽన్తరాత్మా
స్వై ర్దోషై ర్భవతి హి శఙ్కితో మనుష్యః. ౨

కక తప్పించుకొని, సఏషః = ఇదిగో నేను, క్షపాక్షయాత్ = రాత్రిముగియుట వలన, సూర్యోదయ మన్దరశ్మిః = సూర్యుని పొడుపుచే మాసిపోయిన కాంతిగల, చన్ద్రఇవ = చంద్రునివలె, జాతః అస్మి = ఐనవాఁడనైతిని - ఐతిని - అనుటయే.

రాత్రి యనునది వట్టి పాడుకాలము - దొంగలు అంపటాంద్రు తిరిగి ఏమేమో చేయు కాలము అను నిందను - దానికి కలిగించితిని - నేను దొంగతనము చేసితిని. తెల్లవాఱువఱకు నిద్రం గాచితిని - మానితిని. సర్కారువారి యారెకలం దప్పించుకొంటిని. అట్లు నామహిమ యెల్ల కలిగియుంటిని. ఇపుడు సూర్యోదయమున చంద్రాస్తమయమున - ఆమహిమ లేవియు లేని, వట్టి మానిసిగా కాంతిలేక పాలిన చంద్రునివలె - ఐతిని. ఇటు వచ్చితిని - అనుట.

౨. యః కశ్చిత్ = ఎవఁడేని యొకఁడు, త్వరితగతిః = వడివడిగా నడమచున్న, మాం = నన్ను, నిరీక్షతే = చూచును. సంభ్రాన్తం = భయముగొన్నవాఁడనై, ఆకులితుఁడనై, స్థితం = నిలుచున్నవానిని, (మాం = నన్ను - అనుట), ద్రుతం = వడివడిగా, ఉపసర్పతి = సమీపించును. అట్లు వాఁడు చూడవచ్చుట చేతనే నాకు సంభ్రమము - భయమును ఆకులతయు - అనుట. తం సర్వం = దాని నెల్ల, ఆనిరీక్ష ణోపసర్పణాదికము నంతయు, దూషితః = నాతప్పులచేత దెబ్బతిన్నదైన, అన్తరాత్మా = (నా) మనసు, తులయతి = పోల్చుచుండును - అట్లు కాఁబోలు, ఇట్లు కాఁబోలు - అట్లనుకొన్నాఁడు - కాఁబోలు, ఇట్లనుకొన్నాఁడు కాఁబోలు - అని, సరిపెట్టుచుండును. మనుష్యః = మానవుఁడు, స్వదోషైః = తన తప్పులచేతనే, శఙ్కితః = జంకు - భయము - గలవాఁడు, భవతిహి = అవునుగదా.

నేను వడిగా పోవుటను ఒకఁడు అక్కఱతో చూచును, నేను ఒకచోట నిలుచున్నప్పుడును, ఒకఁడు నన్ను సమీపించి అక్కఱతో చూచును. దాన నాకు

మయా ఖలు మదనికాయాః కృతే సాహస మనుష్ఠితమ్.

శ్లో. పరిజనకథాసక్తః కశ్చి న్నరః సముపేక్షితః,
క్వచి దపి గృహం నారీనాథం నిరీక్ష్య వివర్జితమ్,
నరపతిబలే పార్శ్వాయాతే స్థితం గృహదారువ
ద్వ్యవసితశతై రేవంప్రాయై ర్నిశా దివసీకృతా. 3

(ఇతి పరిక్రామతి.

మనసు ఆకులపాటు చెందును, - వీఁ డెవఁడో ఎందులకో నన్ను నిలిచి చూచు చున్నాఁడే అని. వాఁడును న న్నేమియు చేయలేదు, వీఁడును న న్నేమియు చేయలేదు. తప్పులే చేయు సామనసే దాని నెల్ల అట్లు కాఁబోలు, ఇట్లు కాఁబోలు - అని సామిూఁదికి సరిపెట్టుకొనుచుండును. లోకాన మానిని తన కావించు తప్పుల చేత నే జంకు కలవాఁడగును - అంతే. తన దోషానికై తానే భయపడు చుండును.

ఇందు అలంకారము అర్థాంతరన్యాసము, స్వదోషైః ఇత్యాది సామాన్యము చేత తక్కిన విశేషము లెల్ల సమర్థింపఁ బడినందున.

ఉక్తి రర్థాన్తరన్యాసః స్యా త్సామాన్య విశేషయోః
సామాన్యం వా విశేషో వా త దన్యేన సమర్థ్యతే
యత్తు సోఽ ర్థాన్తరన్యాసః సాధర్మ్యే ణేతరేణ వా.

మయా ఖలు ... = తమ్ = నాచేత మదనికకోసము గదా యీసాహసము - తెగించినపని - చేయఁబడినది.

శ్లో. 3. కశ్చిత్ నరః = ఒక మానిసి, పరిజన కథాసక్తః = నౌకరుల తోడి మాటలలో తవిలియున్నవాఁడు, సముపేక్షితః = ఉప్పరికింపఁబడినాఁడు - దాన వానిం దప్పించితిని అనుట. క్వచిత్ అపి = మఱియొక చోటను, గృహం = ఇల్లు, నారీనాథం = ఆఁడువారిపెత్తనములో నున్నదానిని - ఉండుటను అనుట, నిరీక్ష్య = పరికించి, వివర్జితం = విడువఁబడినది, నరపతి బలే = రాజు సేన - పోలీసులు?, పార్శ్వాయాతే = నాప్రక్కకు రాఁగా, గృహదారువత్ = (దాపున నున్న) ఇంటి కొయ్య(స్తంభము)వలె, స్థితం = ఉంటిని. ఏవం ప్రాయైః = ఇట్టివైన, వ్యవసితశతైః = నూర్ల యుపాయములచేతను - చేష్టలచేతను - నిశా = రాత్రి, (వ్యతి వ్యాపారాణ = వ్యాపారములు లేనిది.) దివసీకృతా = పగలుగా - విశ్రాంతి లేనిదిగా - చేయఁబడినది.

వసన్త—చేటి, ఇమం తావ చ్చిత్రఫలకం మమ శయనీయే స్థాపయిత్వా తాలవృన్తం గృహీత్వా ల ఘ్వాగచ్ఛ. [హఞ్జె, ఇమం దావ చిత్తఫలఅం మమ సఅణీఏ ఠావిఅ తాలవేణ్టఅం గేణ్హిఅ లహు ఆఅచ్ఛ].

మద—యదార్యాజ్ఞాపయతి. [జం అజ్జుఆ ఆణవేది].

(ఇతి ఫలకం గృహీత్వా నిష్క్రాన్తా.)

శర్వి—ఇదం వసన్తసేనాయా గృహమ్. త ద్యావ త్ప్రవిశామి. (ప్రవిశ్య) క్వ ను మయా మదనికా ద్రష్టవ్యా?

(తతః ప్రవిశతి తాలవృన్త హస్తా మదనికా)

శర్వి—(దృష్ట్వా) అయే, ఇయం మదనికా!

---

ఒక యింటికడ మానిసి పరిజనులతో మాటలం దవిలి, కావున నే వారును దానును కూడ, మేల్కొని యున్నారని పరికించి, దానిని వదలితిని. ఒక యింట ఆడువాది పెత్తన ముంటంగని, - వారు భీరువులు, గాఢముగా నిద్రింపరు, ఏరవంత సా కన్నను మేలుకొందురు పెద్దగా కేకలు వేయుదురు - వారిం జంపను గూడదు - అని అటను కన్నపు - పాటుపడనైతిని. మఱొక్కయెడ పోలీసులు నాప్రక్కకు వచ్చిరి. అంతట చెంగటి యింటి కూచమువలె కదలక నిలంబడితిని. ఇట్లు అందఱు విశ్రాంతి గొనుకాలమైన రాత్రి, నానోపాయములు మెలఁకువలు అవలంబించుటచేత పనులపాటుతో నిండిన పగలుగా చేయఁబడినది.

పరిక్రామతి - రంగాన కొన్నియడుగులు నడచును. హాఞ్జే = ఓసి, చేటి, ఇమంతావత్ చిత్రఫలకం ... = ఈ చిత్తరుబలకను నా పడుకటింట జాగ్రత్తగా పెట్టి - సెలకొల్పి, విసనకఱ్ఱ చేతఁ గొని త్వరగా (= లఘు) రమ్ము. క్వను మయా మదనికా ద్రష్టవ్యా = మదనికను ఎక్కడ గాంతును, విసనకఱ్ఱ చేతఁగొని మదనిక ప్రవేశించును.

అయే ఇయం మదనికా - ఓహో, ఇదిగో మదనిక.

శ్లో. మదన మపి గుణై ర్విశేషయన్తీ
రతి రివ మూర్తిమతీ విభాతి యేయమ్
మమ హృదయ మనఙ్గ వహ్నితప్తం
భృశ మివ చన్దనశీతలం కరోతి. ౮

మదనికే.

మద—(దృష్ట్వా) ఆశ్చర్యమ్. కథం శర్విలకః! శర్విలక, స్వాగతం తే. కుత్ర త్వమ్? [అమ్మో, కధం సవ్విలఓ! సవ్విలఅ సాఅదం దే. కహిం తుమమ్.]

---

శ్లో. ౮. గుణైః = రూపము యౌవనము మొదలగు గుణములచే, మదనం అపి = మన్మథుని సైతము, ఎల్ల వారిని కైపు కొలుపువానిని, విశేషయన్తీ = మించుచున్నదై, - మగవానిని ఆడుది గుణాలతో మించుటేమి? ఏల, ఆకైపు కొలుపుటయందే, ఆప్టే పండితుఁడును నిఘంటువున విశేషయన్తీ అనియే పఠించినాఁడు. విశోషయన్తీ - అనిపా. అగునా? వియోగతాపాన చిక్కిపోవునట్లు చేయుచున్నదై. - మూర్తిమతీ = రూపుగొన్న, రతిః ఇవ = నాప్రీతియో - అనురాగమో - యన, - రతీదేవి - అనంగుని వలె మూర్తిలేనిది కాదే, మఱి మూర్తిమతి యన నేల? - ప్రత్యక్షమైన అని యనవచ్చునేమో - అయినను పరభార్య కదా యగును. ఇక్కడ ప్రీతియే. ఇయం విభాతి = ఈమె ఒప్పారుచున్నది. యా = ఏమె - అనఁగా-ఈమె, మమ హృదయం = నామనస్సును, అనఙ్గవహ్నితప్తం = మదనాగ్నిచే ౘాగినదానిని, భృశం = ఎంతయు, చన్దనశీతలమ్ = గందపుఁ బూతతో చల్లనైనదానింగా, కరోతి ఇవ = చేయుచుం బోలె ఉన్నది.

మదనిక యన వలపుకైపు గొల్పునది. అంద చందములచే, మదనునైనను ౘాఁప వలంతి. నా యనురాగమే ఇట్లు, రూపుగొన్నదా యన విరాజిల్లుచున్నది. ఈమెం జూడఁగానే, అనంగాగ్నిలో ౘాఁగిన నాహృదయమునకు చల్లని గుబాళించు గందపుఁబూఁత చిక్కఁగా అలందినట్లు ఆప్యాయముగా నున్నదే,

విభాతి ఇవ, కరోతి ఇవ - అనుటచే అలంకారము ఉత్ప్రేక్ష.

సంభావనా స్యా దుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా. అమ్మో! కథం శర్విలకః! = అమ్మో! ఎట్లు! శర్విలకుఁడు! వచ్చినాఁడే! - అని శేషము. సంతో

శర్వి—కథయిష్యామి.

(ఇతి సానురాగ మన్యోన్యం పశ్యతః.

వసన్త—చిరయతి మదనికా. తత్కుత్ర ను ఖలు సా? (గవాక్షకేన దృష్ట్వా) కథమ్! ఏషా కే నాపి పురుషకేణ సహ మన్త్రియన్తీ తిష్ఠతి. యథాతి స్నిగ్ధయా నిశ్చలదృష్ట్యా పిబన్తీ వైతం నిధ్యాయతి తథా తర్కయామి, ఏష స జన ఏనా మిచ్ఛ త్యభుజిష్యాం కర్తుమ్. తద్రమతామ్. రమతామ్. మా కస్యాపి ప్రీతిచ్ఛేదో భవతు. న ఖల్వాకారయిష్యామి.

[చిరఅది మదణిఆ. తా కహిం ణు క్ఖు సా. కథమ్! ఏసా కేనావి పురిసకేణ సహ మన్తఅన్తీ చిట్ఠది. జధా అదిసిణిద్ధాఏ ణిచ్చలదిట్టీఏ ఆపిబన్తీ విఅ ఏదం ణిజ్ఝాఅది తధా తక్కేమి ఏసో సో జణో ఏదం ఇచ్ఛది అభుజిస్సం కాదుమ్. తా రమదు, రమదు. మా కస్సావి పీదిచ్ఛేదో భోదు. ణక్ఖు సద్దావిస్సమ్]

మద—శర్విలక కథయ. [సవ్విలఅ. కధేహి].

ప.ము - కుత్ర త్వమ్ = ఎక్కడ నీవు? కథయిష్యామి = ఇదిగో చెప్పెదను - ఇతి సానురాగం ... = అని అనురాగముతో ఒండొరులం జూచుకొందురు. గవాక్షేణ దృష్ట్వా = కిటికీగుండ చూచి - కథమ్! = ఎట్లూ! - ఆశ్చర్యముం దెలుపును. ఏషా కేన అపి ... = ఈపె ఎవనితోనో మగవానితో మాటలాడుచు నిలుచున్నది. యథా అతిస్నిగ్ధయా ... = దేన ఎంతయు స్నేహాము తొనుకుచు కదలని ఏకతా నపుఁ జూపుతోడి కంట త్రాఁగివేయు చున్నదియుం బోలె వీనిని పరకాయించి చూచుచున్నదో దాన ఊహింతును, ఇతఁడు అల్ల యా జనుఁడు, దీనిని బోగపు దాస్యము తీఱినదానింగా చేయఁగోరినవాఁడు అని. కావున, రమింపనీ, సంతోషిం పనీ, తృప్తిపడనీ. ఎవరికి గాని ప్రీతిచ్ఛేదము (= నాశము) కలుగకుండును గాక. నేను పిలువఁబోను. సశఙ్కం దిశః అవలోకయతి - జంకుతో - భయముతో - చుట్టు - దిక్కులు చూచును.

( శర్విలకః సశఙ్కం దిశో ఽవలోకయతి )

మద—శర్విలక, కిం న్విదమ్. సశఙ్క ఇవ లక్ష్యసే. [సవ్విలఅ. కిం ణ్ణేదమ్. ససఙ్కో విఅ లక్ఖీఅసి].

శర్వి—వక్ష్యే త్వాం కించి ద్రహస్యమ్. త ద్వివిక్త మిదమ్.

మద—అథ కిం. [అధ ఇం].

వసన్త—కథం పరమరహస్యమ్! త న్న శ్రోష్యామి. [కధం పరమరహస్సమ్! తా ణ సుణిస్సమ్].

శర్వి—మదనికే, కిం వసన్తసేనా మోక్ష్యతి త్వాం నిష్క్రయేణ ?

వసన్త—కథం మమ సంబన్ధినీ కథా. త చ్ఛ్రోష్యా మ్యనేన గవాక్షే ణాపవారిత శరీరా. [కధం మమ సంబన్ధిణీ కధా. తా సుణిస్సం ఇమిణా గవక్ఖేణ ఓవారిదసరీరా].

మద—శర్విలక, భణితా మ యార్యా తదా భణతి – 'యది మమ ఛన్ద స్తదా వినార్థం సర్వం పరిజన మభుజిష్యం కరిష్యామి.'

కిం సశఙ్క ఇవ లక్ష్యసే – ఏమి, భయముగలవానివలె అగపడుచున్నావే! కిం ను ఇదమ్ ? = ఇదేమి ? తత్ వివిక్తం ఇదమ్ = మఱి ఇట నిర్జనమేకదా – ఎవరు లేరు కదా. అథకిం = అవును; లేదు నిర్జనమే. కథం పరమరహస్యమ్ – ఏమీ, మిక్కిలియు రహస్యమా ? ఇట్లుపలించుటమేలో – పరరహస్యం – ఇతరుల రహస్యము వినఁగూడదు అని. తత్ న శ్రోష్యామి=కావున, నేను వినను. కిం వసన్తసేనా మోక్ష్యతి త్వాం నిష్క్రయేణ = ఏమి! వసంతసేన నిన్ను విడుదల చేయునా, నిష్క్రియమునకు – దానితనము తీర్చు వెలకు ?

కథం! మమ సమ్బన్ధినీ కథా – ఏమీ! నాకు సంబంధించినదే మాటలు! తత్ ... = కావున విందును, ఈకిటికీ చేత మఱుగుపఱుపఁబడిన యొళ్ళు కలదాననుగా. శర్విలక, చెప్పితిని నేను అక్కతో – దానికి చెప్పుచున్నది – 'నాయిచ్ఛ

అథ శర్విలక, కుత స్త్వ ఏతావా న్విభవః, యేన మాం మార్యాస కాశా న్మోచయిష్యసి? [సవ్విలఅ, భణిదా మఏ అజ్జఆ, తదో భణాది - 'జఇ మమ ఛన్దో తదా విణా అత్థం సవ్వం పరిజణం అభుజిస్సం కరఇస్సమ్.' అథ సవ్విలఅ, కుదో దే ఏత్తిఓ విహవో. జేణ మం అజ్జఆసఆసాదో మోఆఇస్ససి].

శర్వి—

శ్లో. దారిద్ర్యే ణాభిభూతేన త్వత్స్నేహానుగతేన చ
అద్య రాత్రౌ మయా భీరు త్వదర్థే సాహసం కృతమ్. ౫

వసన్త—ప్రస న్నా స్యాకృతిః సాహసకర్మతయా పున రుద్వేజనీయా. [పసణ్ణా సే ఆకిదీ. సాహసకమ్మదాఏ ఉణ ఉవ్వేఅణీఆ].

(పాటింపఁబడున) యేని, అప్పుడు ధనము ( = నిష్క్రియము) లేకయే, పరిజనము నెల్ల బానిస కానిదానింగా - స్వేచ్ఛకలదానింగా, చేయఁగలను - అని. అథ - మఱి యడిగెదను - శర్విలక, కుతః ... = ఎక్కడిది నీవు ఇంత ధనము నన్ను అక్కడనుండి విడుదల చేయఁగలంత ?

శ్లో. ౫. భీరు = ఓభయశాలినీ, పిఱికిదానా, దారిద్ర్యేణ అభిభూతేన = పేదఱికము పైకొన్నట్టియు, త్వత్ స్నేహ ... = నీమీఁద మరులుకొన్నట్టియు, మయా - నేను - కర్మణికి కర్తరిగా తెలుఁగు - అద్య రాత్రౌ = ఈ రాత్రి యందు, త్వదర్థే = నీకోసము, సాహసం కృతమ్ = సాహసము = తెగువపని - దొంగతనము - చేసితిని.

నే నేమో దరిద్రుఁడను. మఱి నాకు నీమీఁద ఇంతంత యనరాని యనురాగము. కావున నీకోసము, పిఱికిదానా - భయపడకు, ఈరాత్రివేళలో తెగించి దొంగతనమును చేసితిని - దొంగిలించి తెచ్చితిని కావలసిన ధనమును.

ప్రసన్నా అస్య ఆకృతిః = వీని యాకారము నిర్మలముగాను దయ సంతోషములతో నిండియు, ఉన్నది. (పునః = కాని,) సాహసంపుఁ బని చేసినవాఁ

మద—శర్విలక, స్త్రీకల్యావర్తస్య కారణే నోభయ మపి సంశయే వినిక్షిప్తమ్. [సవ్విలఅ, ఇత్థీ కల్లవత్తస్స, కారణేణ ఉహాలం పి సంసఏ ణిక్ఖిత్తమ్].

శర్వి—కిం కిమ్.

మద—శరీరం చారిత్రం చ. [సరీరం చారిత్తం చ].

శర్వి—అపణ్డితే, సాహసే శ్రీః ప్రతివసతి.

మద—అఖణ్డిత చారిత్రో౽సి, త న్న ఖలు త్వయా మమ కారణా త్సాహసం కుర్వ తాత్యన్త విరుద్ధ మాచరితమ్. [సవ్విలఅ, అఖణ్డిద చారిత్తో సి. తా ఖు తే మమ కారణాదో సాహస కరన్తేణ అచ్చన్తవిరుద్ధం ఆచరిదమ్].

శర్వి—

శ్లో. నో ముష్ణా మ్యబలాం విభూషణవతీం
ఫుల్లా మి వాహం లతాం;
విప్రస్వం న హరామి కాఞ్చన మథో

---

డగుటచేత భయము (వెగటు) కలిగించునదిగాను ఉన్నది. స్త్రీ కల్యవర్తస్య కారణాత్ = ఆఁడుది యను సద్దికూటికోసము, సద్దికూటిపాటిదైన యాఁడుదాని కోసము, సంశయే = ఆపదయందు, నిక్షిప్తం = ఉంపఁబడినది, దేహమును, శీలమును, అపణ్డితే = తెలియనిదానా, సాహసే శ్రీః = సాహస (కృత్య) మున - తెగువన సంపద - తెగింపకున్న కలుగునటే. ఆశ్రీనీవే. అఖణ్డితచారిత్రః - పొచ్చెము లేని - ఎప్పుడును మేలైన - నడువడి కలవాఁడవు, అగుదువు. మఱి నాకోసము తెగువపని చేయువాఁడవై, ఎంతయు కూడనిపని చేసినవాఁడవు కాలేదు గదా ?

శ్లో. ౬. లేదు లేదు - అని యనుచున్నాఁడు. ఎట్లనఁగా - ఫుల్లాంలతాం ఇవ = పూచినట్టి తీవం బోలె నున్న, విభూషణవతీం = సొమ్ములు పెట్టుకొనియున్న, అబలాం = స్త్రీని - తన్నుఁ దాఁ గాఁచుకొనలేని దానిని, న ముష్ణామి = దొంగిలను - దోఁపను; అబలను నిన్ను బానిసతనమునుండి విడిపింపఁబూనితిని కదా - అదే తార్కాణ - విప్రస్వం - బ్రాహ్మణుని ధనమును, న హరామి = దొంగిలు

యజ్ఞార్థ మభ్యుద్ధృతమ్ ;
ధాత్ర్యుత్సఙ్గగతం హరామి న తథా
బాలం ధనార్థీ క్వచి ;
త్కార్యాకార్యవిచారిణీ మమ మతి
శ్చౌర్యే ఽపి నిత్యం స్థితా. ౬

తద్విజ్ఞాప్యతాం వసన్తసేనా

శ్లో. 'అయం తవ శరీరస్య ప్రమాణా దివ నిర్మితః
అప్రకాశో హ్యలంకారో మత్స్నేహా ద్ధార్యతా మితి'. ౭

---

వాఁడ గాను. అథో = అథ = తర్వాత, మఱియు, యజ్ఞార్థం = జన్నము కోసము - వేలుగా పెట్టుకొనఁబడిన - సమకూర్చుకోఁబడిన, కాఞ్చనం = బంగారును గాని - ధనమును అనుటయే, (న హరామి.) తథా = అట్లే - మఱియు - అనుట; క్వచిత్ - ఎక్కఁడగాని, ధనార్థీ = డబ్బుకోరినవాఁడనై - దానికోసము, ధాత్ర్యుత్సఙ్గగతం = దాదియొడిలోనున్న, బాలం = (మగ) బిడ్డను, న హరామి = దొంగిలను. మమ మతిః = నాబుద్ధి, చౌర్యే అపి = దొంగతనమందైనను, నిత్యం = ఎల్లప్పుడును, కార్యాకార్య విచారిణీ = ఇది తగినపని ఇది తగనిపని అను పర్యాలోచన కలదిగానే, స్థితా = ఉన్నది.

దొంగతనముం బూనుకొన్నను, నేను ఎప్పుడును ఇది దొంగిలింపఁ దగును, ఇది కూడదు - అను వివేకము కలిగియే చేయుదును. పూచిన తీఁగలో పూవులు కోసినట్లు, న న్నెవ రడుగుదురు అని దయ మాలి అబలనగలను దొంగిలింపను. బ్రాహ్మణధనమునుగాని, యజ్ఞమునకు కూడఁబెట్టుకొన్నదానిం గాని దొంగిలను. దాదియొడిలో సుమాళముగా నున్న పాపను, దానిమీఁది నగలు తీసికొందమనియో - దానినే అమ్ముకొందమనియో - దొంగిలింపను.

తత్ విజ్ఞాప్యతాం వసన్తసేనా = కావున విన్నపించు, వసంతసేనకు.

శ్లో. ౭. అయం = ఇదిగో, తవ శరీరస్య ప్రమాణాత్ ఇవ = నీదేహమునకు అదిపెట్టినట్లుం బోలె, నిర్మితః = చేయఁబడినది, అప్రకాశః = ఎవరు ఎఱుఁగనిది, రహస్యమైనది, అలఙ్కారః హి = నగ గదా, అక్కా, మత్స్నేహాత్ = నాకైన కూరిమివలన, ధార్యతాం - ఇతి ... = పెట్టుకొనఁబడును గాక అని.

మద—శర్విలక, అప్రకాశో ఽలంకారః, అయం చ జన ఇతి ద్వయ మపి న యుజ్యతే. త దుపనయ తావత్. పశ్యా మ్యేన మలంకారమ్. [సవ్విలఅ అప్పకాసో అలంకారఓ. అఅం చ జణో త్తి దువే వి ణ జుజ్జది. తా ఉవణేహి దావ. పేక్ఖామి ఏదం అలంకారఅమ్].

శర్వి—ఇద మలంకరణమ్. (ఇతి సశఙ్కం సమర్పయతి.

మద—(నిరూప్య) దృష్టపూర్వ ఇ వాయ మలంకారః. త ద్భణ కుత స్త ఏషః. [దిట్ఠపువ్వో విఅ అఅం అలంకారఓ. తా భణేహి కుదో దే ఏసో].

శర్వి—మదనికే, కిం త వానేన? గృహ్యతామ్.

మద—(సరోషమ్) యది మే ప్రత్యయం న గచ్ఛసి, త త్కిం నిమిత్తం మాం నిష్క్రీణాసి. [జఇ మే పచ్చఅం ణ గచ్ఛసి. తా కిం ణిమిత్తం మం ణిక్కిణాసి].

అక్క, నీదేహమునకు అది చూచియుం బోలె రహస్యముగా చేయఁబడిన యీనగను, నామీఁది కూరిమివలన పెట్టుకో - అని.

అప్రకాశః అలఙ్కారః = రహస్యమైనది నగ, అయం చ జనః - ఇదియు జనము - బోగముది, రహస్యము గానిది, బజారుది. 'ప్రకాశనారి'. ఈ రెండును ఒండొంటికి సరిపడవు. సరే, తే ఇటు, చూచెదను ఆయలంకారమును. ఇదం అలం కరణమ్ - ఇదిగో నగ. - అని జంకుచు - భయముతో - చేతికి ఇచ్చుచున్నాఁడు. నిరూప్య = పరిశీలించి చూచి, దృష్టపూర్వ ఇవ ... = మునుపు (ఎక్కడనో) చూడఁబడినదియుం బోలె నున్నది, ఈనగ. తత్ భణ ... = కావున చెప్పు - ఎక్కడిదో నీకు ఇది. మదనికే కిం ... = మదనికా, ఎందులకు, నీకు దానితో. నీకు దానితో - ఎక్కడి దగునో అనుదానితో - ఏమి? తీసికో. సరోషమ్ = కోపముతో, యది మే ప్రత్యయం న గచ్ఛసి = నా - నామీఁద - నమ్మకము పొందవేని - నామీఁద నీకు నమ్మకము లేదేని, తత్ కిం ... = మఱి నన్ను ఎందుకు డబ్బు పెట్టి విడుదల చేసెదవు - విలుతువు?

శర్వి—అయి, ప్రభాతే మయా శ్రుతం శ్రేష్ఠిచత్వరే. యథా - 'సార్థవాహస్య చారుదత్తస్య' ఇతి.

(వసన్తసేనా మదనికా చ మూర్ఛాం నాటయతః)

శర్వి—మదనికే, సమాశ్వసిహి. కి మిదానీం త్వం.

శ్లో. విషాదత్రస్తసర్వాఙ్గీ సంభ్రమభ్రాన్తలోచనా
నీయమానా భుజిష్యా త్వం కమ్పసే నానుకమ్పసే. ౮

---

అయి - ఒలే, మంచిదానా, ప్రభాతే ... = తెల్లవాఱఁగానే నాచేత సెట్ల చావడిలో వినఁబడినది - యథా - ఏమని యనఁగా సెట్టిమహాత్తరుఁడైన చారుదత్తుని - (అని - అనఁగానే - వసంతసేన - కిటికీమఱుఁగున తాను ఉన్నచోటను, మదనిక శర్విలకుని యెదుటను, మూర్ఛను నటింతురు - అభినయింతురు - అని యిది యా వేసాలవారికి ఉపదేశము, కవిచేయునది.

మదనికే సమాశ్వసిహి ... = మదనికా ఊఱడిల్లవే. ఎందులకే ఇప్పుడు నీవు.

శ్లో. ౮. విషాదత్రస్తసర్వాఙ్గీ = దుఃఖమువలన అదరుచున్న యెల్ల యంగములు గలిగి, సంభ్రమభ్రాన్తలోచనా = తొట్రుపాటుచే సుడియు కన్నులు గలదానవై, భుజిష్యా = భోగముదానవు, నీయమానా = (ఇదిగో, ఇప్పుడే విడిపించి) కొనిపోఁబడుచున్నదానవే, త్వం = నీవు, కమ్పసే = అదరెదవు, వణఁకుతో నిండియున్నావు - న అనుకమ్పసే = (అందులకై నాపడినశ్రమకు నాపై) దయ గొనకున్నావు.

(ఇప్పుడే) విడుపు - స్వేచ్ఛ - పొందుచున్న - పొందఁబోవుచున్న అనుట - భోగముదానవు నీవు ఇట్లు వణఁకుచున్నావేమే! దుఃఖముచే నీయంగము లన్నియు జాఱినట్లు వణఁకు చున్నవి! కన్నులు తొట్రుపాటుతో సుడియుచున్నవి! యింత శ్రమపడిన నాపై అనుకంప - జాలి - దయకొనకున్నావే.

నీకై నే నెంత కష్టపడినాను! ఇదిగో నీవు బానిసతనమునుండి విడుదల పొందుచున్నావు - పొందినట్లే - నేను దానికి తగినంత సొమ్ము తెచ్చితిని. మఱి వణఁకెదవేమే - దుఃఖపడెదవేమే - తొట్రు పడెదవేమే - కన్నులు సుడియింతువేమే! మఱి నాపై జాలిగొనకున్నావేమే.

మద—(సమాశ్వస్య) సాహసిక, న ఖలు త్వయా మమ కారణా దిద మకార్యం కుర్వతా తస్మి న్గేహే కో ఽపి వ్యాపాదితః పరిక్షతో వా? [సాహసిఅ, ణ క్ఖు తుఏ మమ కారణాదో ఇమం అకజ్జం కరన్తేణ తస్సిం గేహే కోవి వావాదిదో పరిక్ఖదో వా?]

శర్వి—మదని కే భీతే సుప్తే న శర్విలకః ప్రహరతి. త న్మయా న కశ్చి ద్వ్యాపాదితో నాపి పరిక్షతః.

మద—సత్యమ్? [సచ్చమ్?]

శర్వి—సత్యమ్.

వసన్త—(సంజ్ఞాం లబ్ధ్వా) ఆశ్చర్యమ్, ప్రత్యుపజీవి తాస్మి. [అమ్మహే, పచ్చువజీవిదమ్హి].

మద—ప్రియమ్. [పిఅమ్].

శర్వి—(సేర్ష్యమ్) మదని కే, కిం నామ ప్రియ మితి?

---

విషాదగ్రస్త - అనియు పారము - దుఃఖాన తూలియాడు ... = సమాశ్వస్య = ఊఱడిల్లి ... = నాకోసము ఈకూడని పని చేయుచో, నీచేత ఆయింట నెవ్వరు చంపఁబడలేదు గదా, గాయపడునట్లు చేయఁబడలేదు గదా.

మదని కే ... = మదనికా, (ఈ) శర్విలకుఁడు భయపడిన వానిం గాని, నిద్రపోవుచున్న వానిం గాని కొట్టఁడు. కావున నాచే ఎవ్వరు చంపఁబడలేదు. గాయపఱుపఁబడను లేదు. నిజమా? నిజము.

సంజ్ఞాంలబ్ధ్వా = (మూర్ఛనుండి) తెలివి పొంది, ప్రత్యుజ్జీవితా అస్మి - మరల బ్రదికితిని.

ప్రియం = ప్రియముగా నున్నది - ప్రీతి కలిగించుచున్నది. ఆం దెవ్వరిని చంపలేదు కొట్టలేదు అని యనఁగా - ఇది నాకు కూచుననది యని నే ననుకొను చున్నట్టిది - ఆమాటను 'ప్రియం' అనుచున్నదే - దీనికి మఱి యెవరితోను, అందును ఆయింట, ఏమి అని వానికి ఈర్ష్య కలిగినది? కిం నామ ప్రియం ఇతి - ప్రియ మనఁగా ఏమిటే? 'ప్రియం' అనుచున్నావే!

శ్లో. త్వత్స్నేహబద్ధ హృదయో హి కరో మ్యకార్యం
సద్వృత్త పూర్వపురుషే ఽపి కులే ప్రసూతః
రక్షామి మన్మథవిపన్నగుణో ఽపి మానం
మిత్రం చ మాం వ్యపదిశ స్యపరం చ యాసి. ౯

(సాకూతమ్)

శ్లో. ఇహ సర్వస్వఫలినః కులపుత్త్రమహాద్రుమాః
నిష్ఫలత్వ మలం యాన్తి వేశ్యావిహగభక్షితాః ౧౦

శ్లో. ౯. సద్వృత్త పూర్వ పురుషే కులే ప్రసూతః అపి = మంచి నడువడిగల తొంటి పురుషులుగల వంశమున పుట్టినవాఁడ నయ్యు, త్వత్ స్నేహ బద్ధ హృదయః హి = నీకైన స్నేహముతో - అనురాగముతో కట్టఁబడిన - కూడు కొన్న - మనసు గలవాఁడనై కదా, (అందులకై) కూడని పనిం జేయుదును. మన్మథ విపన్న గుణః అపి = మన్మథునిచే - మనసునే త్రచ్చువానిచే - ఆపదంబొందిన - అనఁగా పోయిన సత్యశౌచాది గుణములు గలవాఁడ నయ్యు, మానం రక్షామి = పరువును కాపాడుచున్నాను - పోనీక యున్నాను. మాం = నన్ను, మిత్రం = నేస్తగానింగా, వ్యపదిశసి చ = ప్రకటముగా పలికెదవు - ప్రకటింతువు, అపరం యాసి చ = అన్యుం బొందెదవు - కూడుదువు. ఏమిటే ఇదంతయు ?

మా కులపుఁ బూర్వపు పెద్దలు ఎంతెంతవారు! అట్టి కులమున పుట్టితిని. మఱి నీపై మనసుపడితిని - అందుచేత కదా కూడని (దొంగతనంపు) పనిని చేసిన వాఁడ నైతిని. మన్మథుఁడు - నీమీఁదివలపు - నా సత్య శౌచాదిమంచి గుణములను పోఁగొట్టినాఁడు. అయినను, ఎంత యయినను, పరువును మానకున్నాను. నన్ను నేస్తగాఁడని ప్రకటింతువు - మఱి యన్యుం గూడెదవు. కాకున్న ఏమో 'ప్రియం' అన్నావే, అ దేమిటి? అదియు నా యెదురనే, నాతోడనే!

సాకూతమ్ = అభిప్రాయగర్భముగా.

శ్లో. ౧౦. ఇహ = లోకాన, సర్వస్వ ఫలినః = తమ సకల (స్వ = ) ధనమే ఫలములుగా గలవైన, కులపుత్ర మహాద్రుమాః = గొప్పవంశమున పుట్టిన కొడుకు లను పెనువృక్షములు - ఎత్తును వైశాల్యమును దట్టపునీడయు గల్గి ఎల్ల వారికి ఆశ్రయము కాఁగలవి - వేశ్యావిహగ భక్షితాః = భోగమువా రను పక్షు లచే తినఁబడినవై, అలం = ఎంతయు, నిష్ఫలత్వం = పండ్లులేమిని - ఐపోవుటను, యాన్తి = పొందును.

శ్లో. అయం చ సురతజ్వాలః కామాగ్నిః ప్రణయేన్ధనః
నరాణాం యత్ర హూయన్తే యౌవనాని ధనాని చ. ౧౧

వసన్త—(సస్మితమ్) అహో, అస్యాస్థాన ఆవేగః! [అహో, సే అత్థాణే ఆవేఓ].

---

ఈలోకాన గొప్పయింట పుట్టిన యువలు, పెద్ద మ్రాకులం బోని వారు. వారి సవర్ణస్వమే - సకలసంపదయే - వాని పండ్లు. దానిని భోగమువారే, పక్షులు వాని పండ్లనుం బోలె, తిని వేయుదురు - హరింతురు. చెట్లు ఫలహీనము లయినట్లు, వారును సంపద్దీనులు - దరిద్రులు అగుదురు. ఇందు వేశ్యల దోషము చెప్పఁబడినది.

శ్లో. ౧౧. చ - మఱియు, అయం కామాగ్నిః = కామము అను ఈయగ్ని, ప్రణయేన్ధనః=అనురాగమే కట్టెలుఁగాఁగలది. సురతజ్వాలః = సురతమే జ్వాలగాఁ గలది. యత్ర = ఎందు, దానిలో అనుట, నరాణాం = పురుషుల, యౌవనాని, జవ్వనములును, ధనాని చ =(అన్ని విధాల) ధనమును సంపదయు, హూయన్తే = వేల్వఁబడును.

ఈకామము అగ్నింబోనిది, ఎంతయు తాపము కలిగించున దగుటం జేసి. ప్రణయము - అనురాగమే దానికి కట్టెలం బోనిది. దాన అది రాఁజును. సురతమే - కామఫలమైనది - ఆయగ్నికి జ్వాల - మంట - దానింబోనిది అనుట. అట్లు రాఁజి అట్లు మండు నాయగ్నిలో పురుషుల యౌవనములు - హోమద్రవ్యములు వోలె వేల్వఁబడును. సవర్ణమును వ్యయమగును - ముసలి తనమును పేదఱికమును పైకొనును. ఇందు భోజుంగుల దోషము చెప్పబఁడినది.

ఈరెంటను సావయవ రూపకాలంకారము. చెట్టుయొక్క యవయవము లన్నియు నిప్పుయొక్క యవయవములన్నియు వరుసగా కులపుత్రులందును కామునందును రూపింపఁబడినవి.

విషయ్యభేద తాద్రూప్య రఞ్జనం విషయస్య యత్ రూపకం తత్.

(ఈసుభాషితముం గనఁదగును. (శ్లో॥ 11)

వేశ్యాసౌ మదనజ్వాలా రూపేన్ధన సమేధితా
కామిభి ర్యత్ర హూయన్తే యౌవనాని ధనాని చ.)

శర్వి—సర్వథా

శ్లో. అపణ్డితాస్తే పురుషా మతా మే
యే స్త్రీషు చ శ్రీషు చ విశ్వసన్తి;
శ్రియో హి కుర్వన్తి తథైవ నార్యో
భుజఙ్గకన్యా పరిసర్పణాని. ౧౨

శ్లో. స్త్రీషు న రాగః కార్యో,
రక్తం పురుషం స్త్రియః పరిభవన్తి.
రక్తైవ హి రన్తవ్యా
విరక్తభావా తు హాతవ్యా. ౧౩

—

శ్లో. ౧౨. ఎటు చూచినను - ఎల్ల తెఱంగులను - యే = ఎవరు - ఏ పురుషులు, స్త్రీషు = ఆఁడువారియందును, శ్రీషుచ = సంపదలందును, విశ్వసన్తి = నమ్మకము ఉంతురో, తే పురుషాః = ఆజనులు, మే = నాకు, అపణ్డితాః = ఎఱుక లేనివారు, తత్త్వ మెఱుంగనివారు అని, మతాః = తోఁచుదురు. హి = ఏలన, శ్రియః = సంపదలును, తథా ఏవ = అట్లే, నార్యః = స్త్రీలును, భుజఙ్గకన్యా పరిసర్పణాని = పాము చెలువ ప్రాకుటలను - గమనములను, కుర్వన్తి = చేయుదురు. పాము అంతలో అగపడును, అంతలో మాయమగును. స్త్రీలమనోవృత్తియు అతిచపలము - 'క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్ ...' భుజఙ్గ - (విటులు) పాము పిల్లలు అని శ్లేష. దగ్గఱిన కఱచునని భయము.

సిరులు గాని నారులు గాని అతిచపలలు - నిలుకడ లేనివారు, వారిని నమ్మనే రాదు. నమ్ముట తెలివిమాలిన పని.

శ్లో. ౧౩. స్త్రీషు = స్త్రీలయందు, రాగః - అనురాగము, న కార్యః = ఉంపఁగూడదు. (ఏలయన,) రక్తం పురుషం = రాగ ముంచిన మగవానిని, స్త్రియః = స్త్రీలు, పరిభవన్తి = అవమానింతురు. మఱి - రక్తా ఏవ = అనురాగము కలదేని, రన్తవ్యా = రమింపఁబడదగును - విరక్తభావా తు = రాగములేని చిత్తవృత్తికల దన్ననో, హాతవ్యా = విడిచిపెట్టఁబడ దగినది.

నేను ఈమదనికయందు ఎంతయో అనురాగ ముంచితిని. మఱి అది యిట్లు న న్నవమానించినది. రాగము కలదానితోనే రమింపఁదగును - నిజమైన తృప్తి

అన్యత్ర ముఞ్చన్తి మదప్రసేక
మన్యం శరీరేణ చ కామయన్తే. ౧౮

సూక్తం ఖలు కస్యాపి,

శ్లో. న పర్వతాగ్రే నలినీ ప్రరోహతి
న గర్దభా వాజిధురం వహన్తి
యవాః ప్రకీర్ణా న భవన్తి శాలయో
న వేశజాతాః శుచయ స్తథాఙ్గనాః. ౧౯

కన్నను వేఱొక్కనియెడ, - లేక వేఱొక్కనిచేత అనికాని, మదప్రసేకం = వీర్య స్రావమును, ముఞ్చన్తి - విడుతురు, విడుచునట్లు చేయుదురు. శరీరేణ చ = దేహముతో, అన్యం కామయన్తే = మఱొకనిం గామింతురు.

వెలయాండ్రు అతిచపలలు. మెఱపుఁదీగెం బోని వారు. మనసున ఒక్కని ఉంచుకొందురు. వేఱొకని చూపులచే రమ్యందురు. వేఱొక్కని యెడ మద ( = Semen Virile - Apte 11.)పు నిషేకమును (వెలువరింపును, వమ్మరింపును) చేయుదురు. కాదా వేఱొక్కనిచే చేయింతురు. అంతకన్న వేఱు మానిసిని దేహముతో - చుంబనాలింగనాదులు చేసి, కామింతురు.

సూక్తం ఖలు కస్య అపి = ఇది యెవనిదో సూక్తి - లెస్సయైన మాట - కదా - ఏదనఁగా.

శ్లో. ౧౯. పర్వతాగ్రే = కొండకొనన - ఱాతిపై, నళినీ = తామర, న ప్రరోహతి = మొలవదు - (సరస్సుననే) గర్దభాః = గాడిదెలు, వాజిధురం = గుఱ్ఱాల బరువును, న వహన్తి = మోయ (లాఁగ)ఁజాలవు. యవాః ప్రకీర్ణాః = చల్లినయవలు, న శాలయః భవన్తి = వరులు గావు. తథా = అట్లే, వేశజాతాః = భోగము వీథిలోపుట్టిన, అఙ్గనాః = సొగసుకత్తెలు - స్త్రీలు, న శుచయః = శీలాది శౌచము (చిత్తశుద్ధి) గలవారు కారు.

విత్తన మొకటియు చెట్టొకటియు ఎన్నటికిని కాదు. వేశవాడపుట్టు వేమి! మడిగా ఉండు టేమి? తామర కొండకొనన రాతిపై మొలచునా? గాడిద ఏపాటి గుఱ్ఱమునకు ముందు. అది దాని బరువును మోయఁగలదా?

ఆః దురాత్మన్ చారుదత్తహతక, అయం న భవసి.

(ఇతి కతిచి త్పదాని గచ్ఛతి.

మద—(అఞ్చలే గృహీత్వా) అయి అసంబద్ధభాషక, అసంభావనీయే కుప్యసి. [అఇ అసంబద్ధభాసఅ, అసంభావణీఏ కుప్పసి].

శర్వి—కథ మసంభావనీయం నామ?

మద—ఏష ఖ ల్వలంకార ఆర్యాసంబన్ధీ. [ఏసో క్ఖు అలంకారఓ అజ్జఆకేరఓ].

శర్వి—తతః కిమ్?

మద—స చ త స్యార్యస్య హస్తే వినిక్షిప్తః. [స చ తస్స హత్థే ణిక్ఖిత్తో].

శర్వి—కిమర్థమ్?

మద—(కర్ణే) ఏవ మివ. [ఎవ్వం విఅ]

---

ఆః దురాత్మన్ – ఓరీదురాత్మా, పాడుముండా కొడుకా, చారుదత్తిగా – ఇదె ఇఁక నీవు బ్రదుకవురా – (చంపివేయుదును నిన్ను – నేను కామించిన మదని కను నిన్ను కామింపఁ జేసికొందువా! అని కొన్నియడుగులు నడచును.

అబ్బ! యెంత యస్థానసంభ్రమము – 4 పుటలయు 9 శ్లోకాలయు విస్తరము గలది!

అఞ్చలే గృహీత్వా = నుడ్డకొసన పట్టుకొని, అసంబద్ధభాషక = సంబంధము – పొందిక – లేని మాటలవాఁడా, అసమ్భావనీయే = కలుగునని ఊహింప నేని పొసఁగనిదానికై కోపింతువు. కథం అసమ్భావనీయం నామ – అసంభావనీయము అన్న అదెట్లు? ఏష ఖలు అలఙ్కారః ... = ఇది కలదే అలంకారము, అది అక్కది – అక్క సంబంధముగలది. తతః కిమ్ = ఐననేమి? స చ తస్య ఆర్యస్య ... = అది ఆయయ్యచేత కాపాడుమని ఇల్లడపెట్టఁబడినది. కిమర్థమ్ = ఎందులకు? కర్ణే = చెవిలో చెప్పును – ఇట్లు ఇట్లు – ఇందులకు – అని. సవైలక్ష్యమ్ = ఆశ్చర్యముతోడి సిగ్గుతో – వైలక్ష్యము, ఇతరు లెవరు ఎఱుఁగరనుకొని గుట్టు దాఁక నాడినపుడు కలుగు సిగ్గుతోడి ఆశ్చర్యము,

శర్వి—(సవైలక్ష్యమ్) భోః కష్టమ్,

శ్లో. ఛాయార్థం గ్రీష్మసంతప్తో
యాం మే వాహం సమాశ్రితః
అజానతా మయా సైవ
పత్రైః శాఖా వియోజితా. ౧౮

వసన్త—కథ మేషో ఽపి సంతప్యత ఏవ. త దజాన తైతే నైవ మనుష్ఠితమ్. [కధం ఏసోవి సంతప్పది జ్జేవ. తా అజాణన్తేణ ఏదిణా ఎవ్వం అణుచిట్ఠిదమ్].

భోః కష్టమ్ = అయ్యో, కటా.

శ్లో. ౧౮. గ్రీష్మ సంతప్తః = ఎండవేడిచే మాడ్చఁబడినవాఁడనై, ఛాయార్థం = నీడకోసము, యాం ఏవ = ఎవతెనే, అహం సమాశ్రితః = నేను ఆశ్రయించితినో, సా ఏవ శాఖా = ఆకొమ్మయే, అజానతా మయా = ఎఱుంగని నాచేత, పత్రైః వియోజితా = ఆకులుగిల్లివేయఁబడినదిగా చేయఁబడినది.

ఎండవేడికి తాళలేక నీడకై ఏకొమ్మను ఆశ్రయించితినో దాని యాకులనే దుల్చితినే.

నీమీఁది మరులుకాకం దీచుఁకొన, నిన్ను నాకు అమ్మ మని యెవతెను ఆశ్రయించితినో, ఆవసంతసేన చేత - చారుదత్తునిమీఁది మరులుకై, అతనికడ తనభావపుఁ బ్రతినిధిగా ఏయిల్లడ యుంపఁబడెనో, దానినే హరించితినే.

ఇందు అలంకారము అప్రస్తుతప్రశంస - నీడ నొసంగి బ్రోచినకొమ్మ యాకులనే దుల్చుటయను నప్రస్తుతము - శర్విలకచౌర్యవృత్తమను ప్రస్తుతమును ఆశ్రయించియున్నది.

అప్రస్తుతప్రశంసా స్యాత్ సా యత్ర ప్రస్తుతాశ్రయా.

కథం! ఏషః అపి సంతప్యత ఏవ - ఎట్లూ! ఇతఁడును (పశ్చాత్) తాపము చెందుచునే యున్నాఁడు. తత్ అజానతా ... = కావున, పాపము, ఇతఁడు ఎఱుఁగకయే ఇట్లు చేసినాఁడు.

శర్వి—మదనికే, కి మిదానీం యుక్తమ్.

మద—అత్ర త్వ మేవ పణ్డితః. [ఇత్థం తుమం జ్జేవ పణ్డిఓ].

శర్వి—నైవమ్; పశ్య

శ్లో. స్త్రియో హి నామ ఖ ల్వేతా నిసర్గా దేవ పణ్డితాః
పురుషాణాం తు పాణ్డిత్యం శాస్త్రై రే వోపదిశ్యతే. ౧౮

మద—శర్విలక, యది మమ వచనం శ్రూయతే, తదా తస్యైవ మహానుభావస్య ప్రతినిర్యాతయ. [సవ్విలఅ, జఇ మమ వఅణం సుణీఅది, తా తస్స జ్జేవ మహాణుభావస్స పడిణిజ్జాదేహి].

శర్వి—మదనికే, య ద్యసౌ రాజకులే మాం కథయతి?

మద—న చ న్ద్రా దాతపో భవతి. [ణ చన్దాదో ఆదవో హోది].

వసన్త—సాధు మదనికే సాధు. [సాహు మదణిఏ సాహు].

కిం ఇదానీం యుక్తమ్ = ఏది ఇప్పుడు తగును? ఇందుల కిపుడు ఏమి చేయఁదగును? ఏమి యుపాయము? అత్ర త్వం ఏవ ... = ఈ విషయమున - ఈ యుపాయచింతలో నీవే పండితుఁడవు - అన్ని దారులు ఎఱిఁగినవాఁడ వనుట. మా ఏవం = ఇట్లుగాదు, పశ్య = చూడు.

శ్లో. ౧౮. ఏతాః - స్త్రియః = ఈ స్త్రీలు, హి నామ ఖలు - ఇది లోకాన ఎంతయుఁ బ్రసిద్ధము - ప్రసిద్ధిం దెలుపు మాట తునుకల ప్రోవు ఇది; నిసర్గాత్ ఏవ = స్వభావముచేత నే, పణ్డితాః = ఎంతయు (పండ = ) నిశితబుద్ధి గలవారు. పురుషాణాం తు = మగవారికన్ననో, పాణ్డిత్యం = తెలివి, శాస్త్రైః ఏవ = శాస్త్రములచేత నే, ఉపదిశ్యతే = నేర్పఁబడును.

స్త్రీలు పుట్టు పండితలు. పురుషులు నేర్చుకొనవలసినవారు - స్త్రీణామశిక్షిత పటుత్వ మమానుషీషు సందృశ్యతే - ఇత్యాది. శాకు - V.

యది మమ వచనం శ్రూయతే ... = నీవు నామాట విందువేని, అప్పుడు - ఆపక్షాన - ఆమహానుభావునికే మరల కొనిపోయి యిమ్ము. యది అసౌ ... = ఒకవేళ అతఁడు నన్ను రాజుకచ్చేరిలో చెప్పి పట్టియిచ్చునేని? ఈయఁడు - న చన్ద్రాత్ ఆతపః భవతి = చంద్రునివలన ఎండకలుగునా? సాధు ... = బళి, మదనికా, బళి.

శర్వ — మదనికే

శ్లో. న ఖలు మమ విషాదః సాహసే ఽస్మి న్భయం వా,
కథయసి హి కి మర్థం తస్య సాధో ర్గుణాం స్త్వమ్?
జనయతి మమ వేదం కుత్సితం కర్మ లజ్జాం
నృపతి రిహ శఠానాం మాదృశాం కిం ను కుర్యాత్? ౨౦

తథాపి నీతివిరుద్ధ మేతత్. అన్య ఉపాయ శ్చిన్త్యతామ్.

మద — సో ఽ ప్యయ మపర ఉపాయః. [సో అఅం అవరో ఉవాఓ].

వసన్త — కః ఖ ల్వపర ఉపాయో భవిష్యతి? [కో క్ఖు అవరో ఉవాఓ హువిస్సది?]

---

శ్లో. ౨౦. అస్మిన్ సాహసే = ఈ ప్రాణమునకు తెగించిన పనియందు, మమ = నాకు, న ఖలు విషాదః = విషాదము (ఇంచుకయు) లేదుగదా - భయం వా = భయముగాని లేదుగదా. తస్య సాధోః - ఆసజ్జనునియొక్క, గుణాన్ = (మేలి) గుణములను, త్వం = నీవు, కిమర్థం కథయసి హి? = ఎందుల కింత ఉగ్గడింతువో? మమ = నాకు, ఇదం కుత్సితంకర్మ = ఈనింద్యమైనపని, లజ్జాం = సిగ్గును, జనయతి వా = కలిగించునా? నృపతిః = రాజును, ఇహ = ఈవిషయమున, మాదృశాం శఠానాం= నాబోఁటిఖలులకు, కిం ను కుర్యాత్ =ఏమి సేయఁగలఁడు?

ఈసాహసపుఁబనియందు నాకు దుఃఖము లేదు, భయమును లేదు - నా కందుకు నీవు ఆసాధువుయొక్క గుణములను పారాయణము చేయుదువు? నాకు దాన సిగ్గా? రాజు మాత్రము నాబోఁటి శఠుల నేమి సేయఁగలఁడు? దిద్ది తీర్పఁ గలఁడా. నేను అన్నిటికి అన్నివిధాల కాయకాచినవాఁడను. నన్ను దిద్దగలది ఏదియు లేదు.

నీవు చెప్పినట్లు నేను చేయఁగలను. తథా అపి = ఐనను, నీతి విరుద్ధం ఏతత్ = ఇది న్యాయ్యము గాదు - న్యాయమునకు విరుద్ధము - నేనేదొంగిలి తినని చెప్పి నేనే మరల ఇచ్చుట - న్యాయమునకు తగియుండదు. అన్య ఉపాయః ... =

మద — త స్యైవార్యస్య సంబన్ధీ భూ త్వేమ మలంకారక మార్యాయా ఉపనయ. [ తస్య జ్జేవ అజ్జస్స కేరఓ భవిఅ ఏదం అలం కారఅం అజ్జఆఏ ఉవణేహి ].

శర్వి — ఏవం కృతే కిం భవతి?

మద — త్వం తావ దచోరః, సోఽ ప్యార్యో ఽనృణః, ఆర్యాయా స్వకో ఽలంకార ఉపగతో భవతి. [ తుమం దావ అచోరో, సోవి అజ్జో అరిణో, అజ్జఆఏ సకం అలంకారఅం ఉవ గదం భోది ].

శర్వి — న న్వతి సాహస మేతత్.

మద — అయి, ఉపనయ, అన్య థాతిసాహసమ్. [ అఇ, ఉవణేహి. అణ్ణథా అదిసాహసమ్ ].

వసన్త — సాధు మదనికే, సాధు. అభుజి ష్యేవ మన్త్రితమ్. [ సాహు మదణిఏ, సాహు. అభుజిస్సఏ విఅ మన్తిదమ్ ].

శర్వి —

శ్లో. మ యాప్తా మహతీ బుద్ధి ర్భవతీ మనుగచ్ఛతా
నిశాయాం నష్టచన్ద్రాయాం దుర్లభో మార్గదర్శకః. ౨౧

ఒండుపాయము ఆలోచింపుము. తస్య ఏవ ఆర్యస్యసమ్బన్ధీ భూత్వా = ఆయయ్య యొక్కయే సంబంధము గలవాఁడవు - వాని దూతవు ఐ, ఈనగను అక్కకు ఇమ్ము. ఏవం కృతే కింభవతి = ఇట్లు చేసిన, ఏమగును? నీవేమో దొంగవు కాక పోవుదువు. ఆయయ్య (ఇల్లడ) అప్పు తీఱినవాఁ డగును. అక్కకును ఆమె సొంత నగ ఆమెకు చేరిన ట్లగును. అతిసాహసం నను ఏతత్ = అతిసాహసముగదా ఇది? అయి, ఉపనయ - ప్రియుఁడా, ఇవ్వవయ్యా. అన్యథా - ఈకున్న నే - మఱియొటు చేసిననే - అతిసాహసమ్ = మిక్కిలి సాహసము అగును. సాధు ... = బళి మదనికా బళి. దాసి కానట్లు - దొరసానివోలె - చెప్పితివి.

శ్లో. ౨౧. భవతీం అనుగచ్ఛతా = నిన్ను అనువర్తించువాఁడనైన, మయా = నాచేత. మహతీ బుద్ధిః = గొప్ప బుద్ధి, ఆప్తా = పొందఁబడినది. నష్ట చన్ద్రాయాం = చందురుఁడు లేని - అస్తంగతుఁడైన - రాత్రియందు, మార్గ దర్శకః = దారి చూపువాఁడు, దుర్లభః = దొరకఁడు.

మద—తేన హి త్వ మస్మి న్కామదేవగేహే ముహూర్తకం తిష్ఠ. యావ దార్యాయై త వాగమనం నివేదయామి. [ తేణ హి తుమం ఇమస్సిం కామదేవగేహే ముహుత్తఅం చిట్ఠ, జావ అజ్జఆప తుహ ఆగమణం ణివేదేమి ].

శర్వి—ఏవం భవతు.

మద—( ఉపసృత్య ) ఆర్యే, ఏష ఖలు చారుదత్తస్య సకాశా ద్బ్రాహ్మణ ఉపగతః. [ అజ్జప, ఏసో క్ఖు, చారుదత్తస్స సఆసాదో బహ్మణో ఆఅదో ].

వసన్త—చేటి, తస్య సంబన్ధీతి కథం త్వం జానాసి? [ హఞ్జే, తస్స కేరఅం త్తి కథం తుమం జాణాసి ].

మద—ఆర్యే, ఆత్మసంబన్ధిన మపి న జానామి? [ అజ్జప, అత్తణ కేరఅం వి ణ జాణామి? ]

వసన్త—( స్వగతమ్, సశిరఃకమ్పం విహస్య ) యుజ్యతే ( ప్రకాశమ్ ) ప్రవిశతు. [ జుజ్జది. పవిసదు ].

---

చంద్రుఁడులేని రాత్రియందుం బోలె, దారి తెలియక, ఇతికర్తవ్యతామూఢుఁడనై యుండఁగా నాకు ఉపాయము - దారి - ఉపదేశించితివి - వెలుఁగుం జూపితివి,

తేనహి - అట్లేని - ఇందులకు ఒప్పుకొని నీవు ఇట్లు చేయుదువేని, త్వం ... = నీవు ఇదిగో కామునిదేవళమైన ఈయఱలో ఉండు, ఒక ముహూర్తము. నేను అక్కకు నీరాకను ఎఱింగింతును. ఆర్యే, ఏష ఖలు ... = అక్కా, వీఁడుగో చారుదత్తునికడనుండి బ్రాహ్మణుఁడు వచ్చినాఁడు, తస్య సమ్బన్ధీ = ఆయనకు సంబంధించినవాఁ డని నీవు ఎట్లెఱుఁగుదువు? ఆర్యే ... = అక్కా, ఏమి (మన) సొంతబంధువుల సయితము ఎఱుఁగనా?

స్వగతం సశిరఃకమ్పం విహస్య - తనలో మదనిక ప్రత్యుత్పన్నమతిత్వమునకు - సమయానికి తగినమాటలు తోఁచిన జాణతనము మెచ్చునకు తలయూచు

మద—యదార్యాజ్ఞాపయతి (ఉపగమ్య) ప్రవిశతు శర్విలకః. [జం అజ్జఆ ఆణవేది. పవిసదు సవ్విలఓ].

శర్వి—(ఉపసృత్య సవైలక్ష్యమ్) స్వస్తి భవత్యై.

వసన్త—ఆర్య, వన్దే, ఉపవిశత్వార్యః. [అజ్జ, వన్దామి. ఉపవిసదు అజ్జో].

శర్వి—సార్థవాహ స్త్వాం విజ్ఞాపయతి–'జర్జరత్వా ద్గృహస్య దూరక్ష్య మిదం భాణ్డమ్. త ద్గృహ్యతామ్'.

(ఇతి మదనికాయాః సమర్ప్య ప్రస్థితః.

వసన్త—ఆర్య, మ మాపి తావ త్ప్రతిసందేశం త త్రార్యో నయతు. [అజ్జ, మమా వి దావ పదిసందేసం తహిం అజ్జో ణేదు].

శర్వి—(స్వగతమ్) క స్తత్ర యాస్యతి? (ప్రకాశమ్) కః ప్రతిసందేశః?

---

టయు, నవ్వుటయు. అనఁగా మదనికా శర్విలకుల పన్నకమంతయు తాను కిటికీ చాటుననుండి చూచుచు వినుచు నున్నది గదా. యుజ్యతే = పొసఁగియె యున్నది. ప్రవిశతు = ప్రవేశించును గాక. సవైలక్ష్యమ్ – వైలక్ష్యముతో – అనఁగా దానిని కప్పుకొననేరఁ డాయెను.

సార్థవాహః = వర్తకముఖ్యుఁడు నీతో మనవిచేయు చున్నాఁడు – జర్జరత్వాత్ గృహస్య – ఇల్లు గులగులగా నున్నందున, ఇదంభాణ్డమ్ = ఈనగ, దూరక్షమ్ – దుః రక్షమ్ – కాపాడను శక్యము గాదన్నది. తత్ గృహ్యతామ్ = కావున (ఇది) పుచ్చుకొనఁబడును గాక. అని మదనికచేత నుంచి బయలుదేరినాఁడు. ... తత్ర ఆర్యః నయతు = అక్కడికి చారుదత్తయ్యకు ఆర్యుఁడు కొనిచనును గాక.

స్వగతమ్ = తనలో, కః తత్ర యాస్యతి = ఎవఁ డక్కడికి పోవును? నేను అక్కడినుండి రానులేదు – అక్కడకి పోవనుం బోను. ఇదంతయు వట్టి

వసన్త—ప్రతీచ్ఛ త్వార్యో మదనికామ్. [పడిచ్ఛదు అజ్జో మదణిఅమ్].

శర్వి—భవతి, నఖ ల్వవగచ్ఛామి.

వసన్త—అహం అవగచ్ఛామి. [అహ మవగచ్ఛామి].

శర్వి—కథ మివ

వసన్త—అహ మార్యచారుదత్తేన భణితా - 'య ఇమ మలంకారం సమర్పయిష్యతి, తస్య త్వయా మదనికా దాతవ్యా. త త్స ఏ వైతాం తే వదా తీ త్యేవ మార్యే ణావగన్తవ్యమ్. [అహం అజ్జచారుదత్తేణ భణిదా - 'జో ఇమం అలంకారఅం సమప్పఇస్సది, తస్స తుఏ మదణిఆ దాదవ్వా' - తా సో జ్జేవ ఏదం దేదిత్తి ఏవ్వం అజ్జేణ అవగచ్ఛిదవ్వమ్].

శర్వి—(స్వగతమ్) అయే, విజ్ఞాతో ఽహ మనయా. (ప్రకాశమ్) సాధు ఆర్యచారుదత్త, సాధు.

---

పన్నకముగదా - మదనికా శర్విలకులది. ఆర్యుఁడు మదనికను కైకొనునుగాక. ఈమాటలు అతని కేమియు బోధపడలేదు. ఆమాటే అనుచున్నాఁడు - అందు లకు వసంతసేన యనుచున్నది - నేను చక్కఁగా బోధపఱుచుకొన్నాను - నాకు చక్కఁగా బోధపడుచున్నది. ఎటువలె? నాతో చారుదత్తయ్య చెప్పినాఁడు - ఎవఁడు ఈయలంకారమును నీకు సమర్పింపఁగలఁడో, అతనికి నీవు మదనికను ఈవలసినది. కావున ఆయనే ఈమెను నీకు ఇచ్చుచున్నాఁడని యిట్లు ఆర్యుఁడు ఎఱుంగవలయును. అయే విజ్ఞాతః అహం అనయా = అహో, నేను ఈమెకు తెలిసి పోయితిని. నన్ను ఈమె తెలిసికొన్నది - చారుదత్తయ్య బళి! నేనుఁ దొంగి లించితినని కొంకితినని కనుగొన్నది!

శ్లో. గుణేష్వేవ హి కర్తవ్యః ప్రయత్నః పురుషైః సదా
గుణయుక్తో దరిద్రోఽపి నేశ్వరై రగుణైః సమః. 22

అపి చ,

శ్లో. గుణేషు యత్నః పురుషేణ కార్యో
న కించి దప్రాప్యతమం గుణానామ్.
గుణప్రకర్షా దుడుపేన శంభో
రలంఘ్య ముల్లఙ్ఘిత ముత్తమాఙ్గమ్. 23

---

శ్లో. 22. పురుషైః = మానుసులచేత, సదా = ఎల్లప్పుడును, గుణేషు ఏవ హి = గుణములయందే - గుణసంపాదనమందే అనుట, ప్రయత్నః = జతనము, కర్తవ్యః = చేయఁబడఁదగును. గుణయుక్తః = గుణములుగలవాఁడు, దరిద్రః అపి = దరిద్రుఁడైనను, అగుణైః = గుణహీనులైన, ఈశ్వరైః = దొరలతో, న సమః = తుల్యుఁడు - సాటి - కాఁడు.

ఈశ్వరుఁడు అగుణుఁడైన, గుణియగు దరిద్రునకు సాటి కాఁడు. అగుణేశ్వరుని కన్న సగుణదరిద్రుఁడు మేలు అనుట.

శ్లో. 23, పురుషేణ = మానిసిచేత, గుణేషు = గుణములయెడనే - వానిని సంపాదించుటయందే, అనుట, యత్నః = జతనము, కార్యః = చేయఁదగును. గుణానాం = గుణాలకు, అప్రాప్యతమమ్ = పొందరానిది లేదు. గుణప్రకర్షాత్ = గుణముల పెంపువలన. ఉడుపేన = నక్షత్రాల దొరయగు చంద్రుని చేత, అలఙ్ఘ్యం = దాట (పొంద) నలవిగాని, శమ్భోః = ఈశ్వరునియొక్క, ఉత్తమాఙ్గమ్ = శిరస్సు ఉల్లఙ్ఘితమ్ = (ఎగిరి) పొందఁబడినది. గుణ, ఉడుప - త్రాడు పడవ అని శ్లేషయును నిర్వాహ్యము.

ప్రకాశకత్వము, ఆహ్లాదకత్వము, చల్లదనము మొదలగు గుణముల పెంపువలననే, వలచి, శంభుఁడే చంద్రుని తన తలపై దాల్చినాఁడు. కావున గుణములు పొందనే ప్రయత్నింపవలయును. గుణములున్న వారికి మఱి పొందరానిది ఉండదు - అనుట.

వసన్త—కో௽త్ర ప్రవహణికః? [కో ఎత్థ పవహణిఓ].

[ప్రవిశ్య సప్రవహణః]

చేటః—ఆర్యే, సజ్జం ప్రవహణమ్. [అజ్జఏ సజ్జం పవహణమ్].

వసన్త—చేటి మదనికే, సుదృష్టాం మాం కురు. దత్తాసి. ఆరోహ ప్రవహణమ్. స్మరసి మామ్. [హఞ్జే మఅణిఏ, సుదిట్ఠం మం కరేహి. దిణ్ణాసి. ఆరుహ పవహణమ్. సుమరేసి మం].

మద—(రుదతీ) పరిత్యక్తా స్మ్యార్యయా. [పరిచ్చత్తమ్హి అజ్జఆఏ].
(ఇతి పాదయోః పతతి.

వసన్త—సాంప్రతం త్వమేవ వన్దనీయా సంవృత్తా. తద్గచ్ఛ. ఆరోహ ప్రవహణమ్. స్మరసి మామ్. [సంపదం తుమం జ్జేవ వన్దణీఆ సంవుత్తా. తా గచ్ఛ. ఆరుహ పవహణమ్. సుమరేసి మమ్].

శర్వి—స్వస్తి భవత్యై. మదనికే,

---

కః అత్ర ప్రవహణికః - ఎవఁడురా అక్కడ బండివాఁడు. ? 'ఎవరురా అక్కడ -'— ఇది దొరలు దొరసానులు నౌకరులను ఎచ్చరించుమాట. పెక్కు - అన్ని - నాటకములందును ఇట్లే యుండును. సజ్జమ్ = సిద్ధముగా ఉన్నది. సుదృష్టాం మాం కురు - నన్ను బాగుగా చూడవే. దత్తా అసి ... = ఇచ్చివేయఁబడితివి, ఎక్కు బండి. నన్ను మఱవకే. పరిత్యక్తా అస్మి ఆర్యయా = అక్క చేత విడిచి పెట్టఁబడితిని. ఈవియోగమునకు - చిరకాల స్నేహ సంయోగఁపు తలంపు వలన కంట నీరు ఉబుకుచున్నది - ఈవియోగమునకు. సాంప్రతం త్వం ఏవ వన్దనీయా సంవృత్తా. ఏలయన తా నేమో బోగముదే - మదనిక ఇపుడు కులపుత్త్రి బ్రాహ్మణ శర్విలకుని భార్య యయిపోయినది. స్మరసి మామ్ = నన్ను స్మరింతువా ?

స్వస్తి భవత్యై - స్వస్తి అమ్మకు - వసంతసేనకు - అనుట.

శ్లో. సుదృష్టః క్రియతా మేష శిరసా వన్ద్యతాం జనః
యత్ర తే దుర్లభం ప్రాప్తం వధూశబ్దావగుణ్ఠనమ్. ౨౪

(ఇతి మదనికయా సహ ప్రవహణ మారుహ్య గన్తుం ప్రవృత్తః.

[నేపథ్యే]

కః కో ఽత్ర భోః. రాష్ట్రియః సమాజ్ఞాపయతి. — 'ఏష ఖ ల్వార్యకో గోపాలదారకో రాజా భవిష్య తీతి సిద్ధాదేశ ప్రత్యయ

---

శ్లో. ౨౪. ఏషః జనః = ఈజనము - ఈమె, వసంతసేన, సుదృష్టః = స్నేహముతోను కృతజ్ఞతతోను లెస్సగా - కంట కన్నునిలిపి - చూడఁబడినదిగా చేయఁబడునుగాక - అట్లు చూడుము - ఈమెను. ఆచూచుటయొక్క అభిప్రాయమును ప్రాధాన్యమును తెలుపుట, ఇంతగా ఇట్లు చెప్పుట. శిరసా వన్ద్యతాం = తలతో - తల మోపి నమస్కరింపఁబడునుగాక. యత్ర = ఎక్కడ - ఈమెకడ - అనుట, తే = నీకు, దుర్లభం = సులువుగా పొందరాని, వధూశబ్ద అవగుణ్ఠనమ్ - భార్య అనుమాటతో కూడిన మేలు ముసుఁగు, ప్రాప్తం = పొందఁబడినదో, పడినది అనుట. కులాంగనకు మేలుముసుగు ధరించుట మర్యాద - గౌరవసూచకము. 'మదనికాంబ' ఐపోయినది.

మదనికా, అమ్మకడ సెలవుగొనుము - కంట కన్ను కలిపి స్నేహకృతజ్ఞతలతో చూడుము - శిరసు మోపి నమస్కరింపుము - ఆమెవలన కదా వచ్చినది నీకు - 'వధువు' అన్న పేరును, అవగుంఠనమును.

అని మదనికం గూడి బండి యెక్కి పోవ సమకట్టినాఁడు. ఇంతలో లోపలి నుండి - అనుగా ఉజ్జయినిరాజవీథినుండి వినవచ్చినది...ఏమనగా.

ఓహోయి - ఎవరు ఎవరు అక్కడ! రాష్ట్రియుఁడు - గట్టిగా ఉత్తరువు చేయుచున్నాఁడు - రాష్ట్రియుఁడు - అనఁగా రాష్ట్రమున కొత్వాలు - పోలీసు అధికారి - సాధారణముగా అతడు రాజు భార్యకు వణాఁవరుఁడగు తోఁబుట్టువుగా నుండును. ఇందు శకారుఁడుగా అగపడినవాఁడు - వానిమాటగా, వానివాఁడు, ఒకఁడు పలుకుచున్నాఁడు - ఏమనఁగా - వీఁడు గదా ఆర్యకుఁడు గోపాల

పరిత్రస్తేన పాలకేన రాజ్ఞా ఘోషా దానీయ ఘోరే బన్ధనాగారే బద్ధః. తతః స్వేషు స్వేషు స్థానే ష్వ ప్రమత్తై ర్భవద్భి ర్భవితవ్యమ్.’

శర్వి — (ఆకర్ణ్య) కథం రాజ్ఞా పాలకేన ప్రియసుహృ దార్యకో మే బద్ధః! కలత్రవాం శ్చాస్మి సంవృత్తః. ఆః కష్టమ్. అథవా

శ్లో. ద్వయ మిద మతీవ లోకే
ప్రియం నరాణాం సుహృ చ్చ వనితా చ.
సంప్రతి తు సున్దరీణాం
శతా దపి సుహృ ద్విశిష్టతమః. ౨౫

భవతు. అవతరామి. (ఇ త్యవతరతి.

దారకుఁడు ( = గొల్లపిల్లవాఁడు) రాజు కాఁగలఁ డన్న సిద్ధుని యాదేశమునందలి నమ్మకముచే భయపడిన రాజైన పాలకుని చేత గొల్లపల్లెనుండి తెచ్చి భయంకరమైన జైలులో చెఱసాలలో కట్టివేయఁబడినాఁడు. కావున మీరు అందఱును వారి వారి స్థానములయందు అప్రమత్తులుగా - మెలఁకువ గల వారుగా ఉండవలసినది.”

కథం! = ఎట్లూ! పాలకరాజుచేత నాప్రియమిత్రము ఆర్యకుఁడు కట్టివేయఁబడినాఁడా! నేనా భార్యగలవాఁడ నైతిని అయ్యో కటకటా! అయినను.

శ్లో. ౨౫. లోకే = ఈలోకాన, ఇదం ద్వయం = ఈ రెండును, నరాణాం = జనులకు, అతీవ ప్రియమ్ = మిక్కిలియు ఇష్టము, సుహృత్ = మిత్రమును, వనితా చ = భార్యయు - సంప్రతి తు = ఇప్పు డన్ననో - ఈయిక్కట్టున ఆపదలో, అనుట - సున్దరీణాం శతాత్ అపి = నూఱు చెలువల - భార్యలకన్నను, సుహృత్ = మిత్రము, విశిష్టతమః = మిక్కిలియు విశేషముతో కూడుకొన్నవాఁడు.

లోకాన మనుజునికి భార్యయు మిత్రమును రెండును ప్రియములే - ఇరువురును ప్రియులె - ఐనను, ఇట్టి యాపదలో - మిత్రునికి కలిగినదానియందు - వానిం గావ, నూరురు చెలువలనైనను విడిచి, పూనిక వహింపఁదగును.

కావున, కానీ, దిగెదను (బండినుండి). అని దిగును. మదనిక - కన్నీళ్ళతో కేల్మోడ్చి, ఇట్లు కాదు ఇది - అనఁగా నన్ను బండిలో విడిచి తటాలున దిగఁ

మద—( సాస్ర మఞ్జలిం బధ్వా ) ఏవం నేదం. త త్పరం నయతు మామార్యపుత్రః సమీపం గురుజనానామ్. [ ఎవ్వం ణేదమ్. తా పరం ణేదు మం అజ్జఉత్తో సమీపం గురుఅణాణమ్ ].

శర్వి—సాధు ప్రియే. సాధు. అస్మచ్చిత్తసదృశ మభిహితమ్. ( చేట ముద్దిశ్య ) భద్ర, జానీషే రేభిలస్య సార్థవాహ స్యోద వసితమ్.

చేటః—అథ కిమ్. [ అధ ఇం ].

శర్వి—తత్ర ప్రాపయ ప్రియామ్.

చేటః—య దార్య ఆజ్ఞాపయతి. [ జం అజ్జో ఆణవేది ].

మద—య థార్యపుత్రో) భణతి, అ ప్రమ త్తే న తావ దార్యపుత్రేణ భవితవ్యమ్. [ జధా అజ్జఉత్తో భణాది. అప్పమత్తేణ దావ అజ్జఉత్తేణ హోదవ్వమ్ ]. ( ఇతి నిష్క్రా )న్తా.

శర్వి—అహ మిదానీం

గూడదు. తత్పరం = (ముందుగా) అక్కడితో అమ్మనాయనలకడకు - అనఁగా అత్తమామలకడకు చేర్చునుగాక ఆర్యపుత్త్రుఁడు - భార్య ఐనందున మగని యథాసముదాచారముగా ఆర్యపుత్ర అనుచున్నది. - ఇంతకు ముందువఱకు శర్విలక అని పేరుతో పిలుచుచుండినది. ప్రియా సరే, మంచిది, మేలు - అట్లే - అస్మత్ చిత్తసదృశం అభిహితమ్ = నామనసునకు - అభిప్రాయమునకు ఎంతయు తగినట్లు చెప్పితివి. భద్ర, రేభిలుఁడని కలఁడే సెట్టి, వాని యిల్లు ఎఱుఁగుదువా? యథా ఆర్యపుత్రో భణతి - ఆర్యపుత్రుఁడు చెప్పినట్లే కానిమ్ము. ఆర్యపుత్రుఁడు ప్రమాద పడక (ఈపనిలో) ఎంతయు మెలఁకువ గలిగి ఉండవలయును.

శ్లో. జ్ఞాతీ న్విటా న్స్వభుజ విక్రమ లబ్ధవర్ణా
న్రాజాపమానకుపితాం శ్చ నరేన్ద్రభృత్యాన్
ఉత్తేజయామి సుహృదః పరిమోక్షణాయ
యౌగన్ధరాయణ ఇవోదయనస్య రాజ్ఞః. ౨౬

అపి చ,

శ్లో. ప్రియసుహృద మకారణే గృహీతం
రిపుభి రసాధుభి రాహితాత్మశఙ్కైః

---

శ్లో. ౨౬. రాజ్ఞః ఉదయనస్య (పరిమోక్షణాయ) యౌగన్ధరాయణ ఇవ = ఉదయనరాజును విడిపింప యౌగంధరాయణుం బోలె, సుహృదః = మిత్రము యొక్క, పరిమోక్షణాయ = విడుదలకు, జ్ఞాతీన్ = జ్ఞాతులను - జ్ఞాతిశ్చేత్ - అవలేన కిం అని జ్ఞాతులు సహజశత్రువు లగుదురు-వారిని, విటాన్=భోగము వారితో తిరుగు సోమరి విలాసిజనమును జూదరులును - అట్టివారు దండనభయమునకు రాజు నెడ అపరక్తులుగా నుందురు, జనులలో గ్రాహ్య వాక్కు లగుదురు. సమయాన తిరుగఁబడి పరాక్రమకీర్తులు పొందుదురు - అట్లే వారికిని స్వభుజవిక్రమేత్యాది చెల్లునేమో, స్వభుజవిక్రమలబ్ధవర్ణాన్ = తమ బాహువిక్రమముచేత - సమయాన - పొందఁబడిన కీర్తిగలవారును, రాజు కావించినమానహానికి కోపించిన వారును ఐన నరేన్ద్రభృత్యాన్ = రాజునౌకరులను, ఉత్తేజయామి = ఉత్సాహము పెంచి రగిల్చెదను.

మిత్ర - గోపాలదారక - ఆర్యక - విమోచనమునకు నాచేతనైనంత ప్రయత్నము చేయుదును. ఎవ రెవరిని ఎట్లెట్లు రెచ్చఁగొట్టఁ దగునో అట్లెల్ల కావించి అందఱిని ప్రోవు చేసెదను, మిత్రుని విడిపింప. మునుపే II. లో దర్దురకుఁడు చెప్పినాఁడు గదా - వాఁడు వీనికి ప్రియవయస్యుఁడట - (చూ. పు.) నాబోంట్లం దఱు వానిని - ఆర్యకుని - అనుసరించుచున్నారని.

శ్లో. ౨౭. అసాధుభిః = దుర్మార్గులును, ఆహితాత్మశఙ్కైః = తమ (దుండగములకై) తమమీద తమకే శంకగలవారును ఐన, రిపుభిః = శత్రువులచే, అకారణే = నిష్కారణముగా - అతఁడు ఎవరికిని ఏమియు అపకారము చేయక

సరభస మభిపత్య మోచయామి
స్థిత మివ రాహుముఖే శశాఙ్కబిమ్బమ్. ౨౭

(ఇతి నిష్క్రాన్తః.

[ప్రవిశ్య]

చేటీ—ఆర్యే, దిష్ట్యా వర్ధసే. ఆర్యచారుదత్తస్య సకాశా ద్బ్రాహ్మణ ఆగతః. (అజ్జఏ, దిట్ఠిఆ వడ్ఢసి. అజ్జచారుదత్తస్స సఆసాదో బమ్హణో ఆఅదో].

వసన్త—అహో రమణీయ తాద్య దివసస్య. త చ్చేటి, సాదరం బన్ధులేన సమం ప్రవేశ యైనమ్. [అహో రమణీఅదా అజ్జ దివసస్స. తా హఞ్జే, సాదరం బన్ధులేణ సమం పవేసేహి ణమ్].

చేటీ—య దా ర్యాజ్ఞాపయతి. [జం అజ్జఆ ఆణవేది].

(ఇతి నిష్క్రాన్తా.

---

న్నను, ఎవఁడో సిద్ధుఁడు ఏమో చెప్పినాఁ డని, పట్టుకొనఁబడిన, ప్రియసుహృదం = నాయనుంగు మిత్రుని - ఆర్యకుని. సరభసం అభిపత్య = వీఁకపై (ఆశత్రువుల) పైఁబడి యెదుర్కొని, రాహుముఖే = రాహువునోట, స్థితం శశాఙ్క బింబమ్ ఇవ = ఉన్నట్టి చంద్రబింబముం బోలె, మోచయామి = విడిపింతును. తప్పక అని సూ.

శత్రువులు నా ఆర్యకుని నిష్కారణముగా పట్టి చెఱం బెట్టినారు. అందు ఒక్కఁడైనను సుజనుఁడు లేఁడు, అందఱు వట్టి దుర్మార్గులు, తమ తప్పులకు తమమీఁద తమకే జంకుగలవారు - వట్టి పిఱికులు - వీఁకతో వారిపై దూఁకి రాహు ముఖమునుండి చంద్రుంబోలె ఇదె విడిపింతును.

దిష్ట్యా వర్ధసే = నీకు బలె అదృష్టము! చారుదత్తయ్యకడనుండి బ్రాహ్మణుఁడు వచ్చినాఁడు.

అహో రమణీయతా ... = అహో ఎంత రమణీయమే ఈదినము! వదినె ఓసి చేటి, ఆయనను ఎంతయు ఆదరముతో ఒక లంజకొడుకును తోడుచేసి ప్రవేశ పెట్టుము - అట్లు తోడుచేయుటయు భోగముదానియింటి మర్యాదలలో చేరినది కాఁబోలు.

(విదూషకో బన్ధులేన సహ ప్రవిశతి)

విదూషకః—ఆశ్చర్యం భోః, తపశ్చరణక్లేశవినిర్జితేన రాక్షసరాజో రావణః పుష్పకేణ విమానేన గచ్ఛతి. అహం పునర్బ్రాహ్మణో ఽకృత తపశ్చరణక్లేశో ఽపి నరనారీజనేన గచ్ఛామి. [హీ, హీ, భోః తవచ్చరణకిలేసవిణిజ్జిదేణ రక్ఖసరాఅ రావణో పుప్ఫకేణ విమాణేణ గచ్ఛది. అహం ఉణ బహ్మణో అకిద తవచ్చరణకిలేసో వి ణరణారీజణేణ గచ్ఛామి].

చేటీ—ప్రేక్షతా మార్యో ఽస్మదీయం గేహద్వారమ్. [పేక్ఖదు అజ్జో అహ్మకేరకం గేహ దుఆరమ్].

విదూ—(అవలోక్య సవిస్మయమ్) అహో సలిలసిక్త మార్జిత కృత హరితోపలేపనస్య వివిధసుగన్ధికుసుమోపహార చిత్రలిఖిత భూమి భాగస్య గగనతలావలోకన కౌతూహల దూరోన్నామిత శీర్షస్య దోలాయమానావలమ్బితైరావణ హస్తభ్రమాగత మల్లికా

---

తపశ్చరణక్లేశవినిర్జితేన = తపస్సు చేయు శ్రమచే - తపస్సు చేసి యెంతో శ్రమపడి యట్లు ఒడిచికొన్న - ఇదెల్ల చారుదత్తయ్య చెప్పిన 'గబ్బి' తనపు మాటల తెఱఁగు కాఁబోలు. అహం పునః - మఱి నేనో - బ్రాహ్మణమాత్రుఁడను, అట్టి క్లేశాలు పడ్డ వాఁడఁ గాను - మఱి నాకు ఇటు చేటియు అటు బంధులుఁడును పరివారించుచున్నారు. అట్లు పోవుచున్నాను. పుష్పకమువలె అనివారితగతిని.

ప్రేక్షతాం ఆర్యః అస్మదీయం గేహద్వారం = చూచునుగాక, అయ్యా, మా యింటి వాకిలిని, అహో-ఎంత ఆశ్చర్యకరముగా ఉన్నది! సలిలసిక్త ... = నీటితో తడుపఁబడి చిమ్మఁబడి. ఆకుపచ్చని పూఁతపూయఁబడినది. గోమయము అలుకుటచే అని వ్యాఖ్యాతలు - కాక రంగుపూఁత యగునా? వివిధసుగన్ధి ... గస్య - అచటి ప్రదేశ మంతయు పలు తెఱంగులును పరిమళించునవియు నగు పూల (ఉపహార = ) ప్రోవులచే చిత్తరువులు వ్రాయఁబడిన ట్లున్నది - పూవుల ప్రోవులతోనే ముగ్గులు పెట్టఁబడినదియుం బోలె నున్నది. గగనతల అవలోకన ... = మింటిం జూడ వేడుకపడి మిక్కిలిగా ఎత్తఁబడిన తల - పైపట్టె - కలది - మింటి నొరయుచున్నది అనుట - అతిశయోక్తిం బుట్టిన హేతూత్ప్రేక్ష; దోలాయమాన ... =

దామగుణాలంకృతస్య సముచ్ఛ్రిత దన్తి దన్తతోరణావభాసితస్య మహారత్నోపరాగోపశోభినా పవనబలాన్దోలనాలల చ్చఞ్చలాగ్ర హస్తేన 'ఇత ఏహి' ఇతి వ్యాహరతేవ మాం సౌభాగ్యపతాకా నివహేనోపశోభితస్య తోరణధరణస్తమ్భవేదికా నిక్షిప్త సముల్లసద్ధరిత చూతపల్లవ లలామస్ఫటిక మఙ్గల కలశాభిరామోభయపార్శ్వస్య మహాసుర వక్షఃస్థల దుర్భేద్యవజ్ర నిరన్తరప్రతిబద్ధ కనక కపాట దుర్గతజనమనోరథాయాసకరస్య వసన్తసేనాభవనద్వారస్య సశ్రీకతా! యత్సత్యం మధ్యస్థ స్యాపి జనస్య బలా ద్దృష్టి మాకారయతి.

---

(గాలికి) ఊఁగులాడుచున్న - వ్రేలఁగట్టిన - ఐరావతముయొక్క - తొండమో - ఐరావతము తెల్లయేనుఁగుగదా - యను భ్రమగొల్పు మల్లికాహారముతో - మాలతో - అలంకరింపఁబడినది - సముచ్ఛ్రిత ... = ఎత్తైన ఏనుఁగుదంతపుఁ దోరణము తో ప్రకాశించుచున్నది; మహారత్న ... = పెను (వెలలేని అనుట) రత్నముల కాంతితో ప్రకాశించుచున్నదియు, పవనబల ... = గాలివేగముచే కదలాడుచు ఒప్పారుచు (= లలత్) కదలు అంచు అను ముంజేతితో నన్ను - 'ఇక్కడికి రా' అని పలుకుచు పిలుచుచుంబోలె సౌభాగ్యపు - గుఱుతైన - జెండాల గుంపుతో ఒప్పారుచున్నది; తోరణధరణ ... = తోరణమును మోయు స్తంభముల యడుగున రంగులపై ఉంపఁబడి కాంతులీను పచ్చని మావి చివుళ్ళ యలంకారపు - చివుళ్ళే అలంకారమైన - మంగళార్థమైన పటికంపుఁ గుండలతో సొబగారు ఇరుపార్శ్వములు గలది; మహాసురవక్షఃస్థల ... = (హిరణ్యకశిపు రావణులంబోని) గొప్పరాక్షసుల యురముంబోలి పగల్ప నలవిపడనిదియు, వజ్రాలే (గుబ్బలుగా) సందులేక తాచిన బంగరు తలుపు గలది, అదృష్టహీనులైన - పేదలైన - జనుల కోరికలకు ఆయాసము కలిగించునది. - వారికి (చూడ) అందని దగుటచేత ననుట - వసన్త ... = వసంతసేనయింటి వాకిటి యందము - యత్ సత్యం = నిజముగా, మధ్యస్థస్య అపి = ఉదాసీనుని యొక్కయు - అందమైనది - కానిది అను భేదమును జయించిన నిస్పృహునియొక్కయు, చూపును - ఇటురా - ఇటు తిరుగు అనుచుంబోలె, - బలాత్ = బలాత్కారముగా - పిలుచుచున్నది.

[అహో సలిలసిత్త మజ్జిద కిదహరిదోవలేవణస్స వివిహ సుఅన్ధికుసుమోవహార చిత్త విహిద భూమి భాఅస్స గఅణతలా అలోఅణ కోదూహల దూరుణ్ణామిదసీసస్స దోలాఅమాణావలమ్బిదైరావణ హత్థ బ్భమాఇద మల్లిఆదామ గుణాలంకిదస్స సముచ్ఛిద దన్తి దన్త తోరణావభాసిదస్స మహారఅణోవ రాఓవసోహిణా పవణబలన్దోలణాల లన్తచఞ్చల గ్గహత్థేణ 'ఇదో ఏహి' త్తి వాహర న్తేణ విఅ మం సోహగ్గ పడాఆణివహేణోవసోహిదస్స తోరణధరణ త్థమ్బవేది ఆణిక్ఖిత్త సముల్లసన్త హరిద చూద పల్లవ లలామ ఫటిహ మజ్జల కలసాభిరామోహ అపాస్సస్స మహాసురవక్ఖత్థల దుబ్భేజ్జ వజ్జణిరన్తర పడిబద్ధకణఅ కవాడస్స దుగ్గద జణమణోరహాఆసకరస్స వసన్తసేణాభవణ దుఆరస్స సస్సిరీఅదా! జం సచ్చం మజ్ఝత్థస్స వి జణస్స బలా ద్దిట్ఠిం ఆఅరేది].

చేటీ—ఏత్వేతు, ఇమం ప్రథమం ప్రకోష్ఠం ప్రవిశ త్వార్యః. [ఏదు ఏదు. ఇమం పఢమం పఓట్ఠం పవిసదు అజ్జో].

విదూ—(ప్రవిశ్యావలోక్య చ) ఆశ్చర్యం! భోః, అత్రాపి ప్రథమే ప్రకోష్ఠే శశిశఙ్ఖమృణాలసచ్ఛాయాః వినిహితచూర్ణముష్టిపాణ్డురావివిధరత్నప్రతిబద్ధకాఞ్చనసోపానశోభితాః ప్రాసాద పఙ్క్తయో

---

ఇమం ప్రథమం ప్రకోష్ఠం ... = ఈ మొదటిలోగిటిని, ప్రవిశతు ఆర్యః - అయ్య ప్రవేశించును గాక. ఆశ్చర్యం! అత్రాపి ప్రథమప్రకోష్ఠే = ఈ మొదటి లోగిటిలోను, ప్రాసాదపఙ్క్తయః - నగళ్ళవరుసలు - శశిశఙ్ఖ...యాః = చంద్రుని తోను శంఖములతోను, తామరతూళ్ళతోను సమానమైన (తెల్లని తళతళని) కాంతి గలవి; వినిహిత ... = చక్కగా - అనగా - అందమైన ముగ్గులుగా - పెట్ట బడిన (తెల్లని) వాసనపొడుల - పిడికిళ్ళం దెల్లనైనవి, నానావర్ణముల రత్నాలు

ఽవలమ్బిత ముక్తాదామభిః స్ఫటిక వాతాయనముఖచన్ద్రై ర్నిధ్యాయ న్తీ వోజ్జయినీమ్. శ్రోత్రియ ఇవ సుఖోపవిష్టో నిద్రాతి దౌవారికః. సదధ్నా కలమోదనేన ప్రలోభితా న భక్షయన్తి వాయసా బలిం సుధాసవర్ణతయా. ఆదిశతు భవతీ.

[హీ, హీ భో:, ఇధో వి పఢమే పఓట్ఠే ససిసజ్జముణాల సచ్ఛాహాఓ విణిహిద చుణ్ణ ముట్ఠి పాణ్డురాఓ వివిహరఅణ పడిబద్ధ కఞ్చణ సోవాణా సోహిదాఓ పాసాదపన్తిఓ ఓలమ్బిద ముత్తాదా మేహిం ఫటిహవాదాఅణముహచన్దేహిం ణిజ్ఝాఅన్తీ విఅ ఉజ్జయి ణీమ్. సోత్తిఓ విఅ సుహోవవిట్టో ణిద్దాఅది దోవారిఓ. సదహిణా కలమోదణేణ పలోహిదా ణ భక్ఖన్తి వాయసా బలిం సుధాసవణ్ణదాఏ. ఆదిసదు భోదీ].

చేటీ—ఏ త్వే త్వార్యః, ఇదం ద్వితీయం ప్రకోష్ఠం ప్రవిశ త్వార్యః. [ఏదు ఏదు అజ్జో, ఇమం దుదిఅం పఓట్ఠం పవిసదు అజ్జో].

విదూ—(ప్రవి శ్యావలోక్య చ) ఆశ్చర్యం భోః, ఇహాపి ద్వితీయే ప్రకోష్ఠే పర్యన్తో పనీత యవసబుసకవలసుపుష్టా స్తైలాభ్యక్త

తాపిన బంగరు మెట్లతో - ఒప్పారునవి; (అట్టినగళ్ళు) అవలమ్బిత = వ్రేలఁ గట్టిన, ముత్యాలసరులు గల పటికంపు కిటికీ లనెడు చందురుంబోలిన మొగాలలో, ఉజ్జయనీం = ఉజ్జయిని నగరమును చక్కఁగా చూచుచుంబోలె నున్నవి. దౌవారి కుఁడు - వాకిటి కావలివాఁడు, వైదికబ్రాహ్మణునివలె, హాయిగా కూచుండి, తూఁగాడు చున్నాఁడు - సదధ్నా ... = పెరుఁగుతోడి కలమాన్నముతో ఆస గొల్పఁబడినను, కాకులు, సున్న పురంగు కలదగుటచేత, ఆ (భూత) బలిని తినకున్నవి. ఆదిశతు భవతీ - (తరువాత) సెల విచ్చును ( = చెప్పుము) గాక అమ్మ. ఆదిశతు అనుట మర్యాదకు. ద్వితీయం ప్రకోష్ఠం = రెండవకక్ష్యను. పర్యన్తఉపనీత ... = చుట్టుపట్టులనుండి తేఁబడిన గడ్డిపొల్లు కడులతో చక్కఁగా బలిసినవియు, (రంగు)

విషాణా బద్ధాః ప్రవహణబలీవర్దాః. అయ మన్యతరో ఽవమానిత ఇవ కులీనో దీర్ఘం నిశ్వసితి సైరిభః. ఇత శ్చాపనీతయుద్ధస్య మల్లస్యేవ మర్ద్యతే గ్రీవా మేషస్య. ఇత ఇతో ఽపరేషా మశ్వానాం కేశకల్పనా క్రియతే. అయ మపరః పాటచ్చర ఇవ దృఢబద్ధో మన్దురాయాం శాఖామృగః. (అన్యతో ఽవలోక్య చ) ఇత శ్చ కూరచ్యుతతైలమిశ్రం పిణ్డం హస్తీ ప్రతిగ్రాహ్యతే మాత్రపురుషైః. ఆదిశతు భవతీ.

[హీ హీ, భోః, ఇదోవి దుదిఏ పఓట్టే పజ్జన్తోవణీద జవస బుసకవల సుపుట్టా తేలబ్భఙ్గిదవిసాణా బద్ధా పవహణ బఇల్లా. అఅం

తైలము పూసిన కొమ్ములుగలవియు, బండియెద్దులు కట్టివేయఁబడియున్నవి. అయం అన్యతరః - ఇది మఱియొకటి, సైరిభః = ఎనుబోతు - అవమానితః కులీనః ఇవ = అవమానింపఁబడిన గొప్పకులమున పుట్టినవానివలె, దీర్ఘం నిశ్వసితి = పెద్దగా బుసకొట్టుచున్నది. ఇతః చ ... = మఱి యిక్కడ, అపనీతయుద్ధస్య = ద్వంద్వము నుండి తొలఁగింపఁబడిన మేషస్య = పొట్టేలుయొక్క, మల్లస్య ఇవ = జెట్టియొక్కయుంబోలె, గ్రీవా మర్ద్యతే = మెడ - నొప్పి తీఱుటకు మరలపోట్లాటకు సిద్ధముగా నుండుటకు - పిసుకఁబడుచున్నది. ఇతః ఇతః = ఇక్కడను ఇక్కడను - ఇరువైపులను, అపరేషాం = ఇతరములైన ... = గుఱ్ఱాలకు కేశకల్పనా క్రియతే - జూలు కత్తిరింపు చేయఁబడుచున్నది. అయం అపరః - ఇది మఱియొకటి - పాటచ్చర ఇవ = దొంగవలె, దృఢబద్ధః = గట్టిగాకట్టి వేయఁబడియున్నది, మందురాయాం = తబేలాలో, శాఖామృగః = కోతి. తబేలా వాకిట కోతినికట్టవలసిన దని శాస్త్రము ... =.

'సరటం వారయే ద్యత్నాత్ ప్రవిశన్తం హయాలయమ్.

మన్దురాగ్రే తథా ధార్యో రక్తవక్త్రో మహాకపిః' - శార్ఙ్గధరః - సరట మనఁగా తొండ, తొండను తబేలాకు రానీకూడ దఁట. అందులకు వాకిట కోతిని కట్టుట, ఇతః చ = మఱియిక్కడ, కూరచ్యుతతైలమిశ్రంపిణ్డం ... = అన్నమునుండి కాఱిన తైలము కలిపిన ముద్దను - తైలము - నెయియే కాఁబోలు - కాఱుచుండఁ గలిపిన యన్నపు ముద్దను - ముద్దలను అనుట - మావటీండ్రచేత

అణ్ణదరో అవమాణిదో విఅ కులీణో దీహంణీససది సేరిహో. ఇదో అ అవణీదజుజ్ఝస్స మల్లస్స విఅ మద్దీఅది గీవా మేసస్స. ఇదో ఇదో అవరాణం అస్సాణం కేసకప్పణా కరీఅది. అఅం అవరో పాడచ్చరో విఅ దిడబద్ధో మన్దురాఏ సాహామిఓ. ఇదో అ కూరచ్చుఅ తేల్ల మిస్సం పిణ్డం హత్థీ పడిచ్ఛావీఅది మేత్థ పురిసేహిం. ఆదిసదు భోదీ].

చేటీ—ఏత్వేత్వార్యః. ఇమం తృతీయం ప్రకోష్ఠం ప్రవిశత్వార్యః. [ఏదు ఏదు అజ్జో. ఇమం తుఇఅం పఓట్ఠం పవిసదు అజ్జో].

విదూ—(ప్రవిశ్య దృష్ట్వా) ఆశ్చర్యం, ఇహాపి తృతీయే ప్రకోష్ఠే ఇమాని తావత్కులపుత్రజనోపవేశననిమిత్తం విరచితాన్యాసనాని. అర్ధవాచితం పాశకపీఠే తిష్ఠతి పుస్తకమ్. ఏతచ్చ స్వాధీనమణిమయసారికా సహితం పాశకపీఠమ్. ఇమే చాపరే

ఏనుఁగు తినిపింపఁబడు చున్నది. బతిమాలుకొనక తినదు. ఇఁక మూఁడవకక్ష్య - ఇమాని తావత్ = ఇవి యన్ననో - కాదా - ఇవి యన్నియు, కులపుత్ర ... = గొప్పయింటికొడుకులు, ఆగర్భశ్రీమంతులు, కూర్చుండుటకొఱకు (వరుసలుగా) ఏర్పాటుచేయఁబడిన ఆసనములు - కుర్చీలు - సోఫాలు మొదలైనవి - అర్ధవాచితం - సగము - కొంత - చదువఁబడిన పుస్తకము - పాశకఫీఠే - తరువాత మరల పాచికలతోడంగూడ ఆయాటపీట చెప్పఁబడినందున - పాశకపీఠం అనియే - ఈపాశకపీఠము 'పారకపీఠం' అనుటకుం బొరపాటు కానోపును. కాదా తాళ్ళతో పీటవలె అల్లిన దేనియునగును - వ్యాసపీఠము. పుస్తకమ్ - అనఁగా కామశాస్త్రమును కౌతుక కథలు మొదలైనవియు - అందుర - యువలకు యువతులకు కాలక్షేపము నకుం దగినది. స్వాధీనమణిమయ ... = స్వాధీన అనఁగా ఎవరు చేత గొన్నను వారికి అధీనముగానుండు - మంత్రబద్ధములు కృత్రిమములుం గావు - శకుని పాండవులతో ఆడినట్టివియు, పుష్కరుఁడు నళునితో ఆడినట్టివియుం గావు. ఎవరేని ఋజువుగా ధర్మముగా ఆడఁదగినవి. అవి వసంతసేనయింటికిం దగినట్లు రతనాలు తాపి యున్నవి. స్వాధీన-అవే-సునువుగా నున్నందున-సులువుగా దొరలునవి-అని యేని.

మదనసంధివిగ్రహచతురా వివిధవర్ణికావిలిప్త చిత్రఫలకాగ్రహస్తా ఇత స్తతః పరిభ్రమన్తి గణికా వృద్ధవిటా శ్చ. ఆదిశతు భవతీ.

[హీ, హీ, భో. ఇదో వి తఇఅ పఓట్ఠే ఇమాఇం దావ కులఉత్తజణోవవేసణణిమిత్తం విరచిదాఇం ఆసణాఇం, అద్ధవాచిదో పాసఅపీఠే చిట్ఠఇ పోత్థఓ, ఏసో అ సాహీణమణిమఅసారిఆసహిదో పాసఅపీఠో ఇమే అ అవరే మఅణసంధివిగ్గహచదురా వివిహావణ్ణిఆవిలిత్త చిత్తఫలఅగ్గహత్థా ఇదో తదో పరిబ్భమతి గణిఆ బుడ్ఢవిటా అ. ఆదిసదు భోదీ].

చేటీ—ఏ త్వే త్వార్యః. ఇమం చతుర్థం ప్రకోష్ఠం ప్రవిశత్వార్యః. [ఏదు ఏదు అజ్జో. ఇమం చఉట్ఠం పఓట్ఠం పవిసదు అజ్జో].

విదూ—(ప్రవి శ్యావలోక్య చ) ఆశ్చర్యం భోః, ఇ హాపి చతుర్థే ప్రకోష్ఠే యువతికరతాడితా జలధరా ఇవ గమ్భీరం నదన్తి మృదఙ్గాః. క్షీణపుణ్యా ఇవ గగనా త్తారకా నిపతన్తి కాంస్య

---

ఇమే చ అపరే_వీరుగో మఱియు ఇతరులు_గణికాః వృద్ధవిటాః చ_భోగమువారును, ముసలి బొజుంగులును – మదన సంధి విగ్రహ చతురాః – వలపుకూటములలోను వలపుజగడాలలోను – కూర్పఱను వేర్పఱుపను విడదీయను ఐన మాటలనిపుణులు – పలురంగులు పూసిన చిత్తరుఁబలకలను చేతఁ గొని తిరుగాడుచునే ఉన్నారు. ఇఁక నాలవది. – కక్ష్య. – యువతికర తాడితాః = జవ్వనులచేతులతో వాయింపఁబడినవై, మృదంగములు (గమ్భీరం) లోతుప్రమోతకలవై మేఘములవలె ప్రమోగుచున్నవి. కాంస్యతాళాః = కంచుతాళములు, క్షీణపుణ్యాః = చేసినపుణ్యము – అనుభవముచే – క్షీణించి పోయిన, తారకాఇవ = నక్షత్రాకారమున నున్నవారిం బోలె – కావున నక్షత్రములంబోలె – అనుట – గగనాత్ = మింటినుండి – వాదననైపుణిచే పైకి మింటికి ఎగురవేయఁబడినవై అందుండి – అనఁగా పైనుండి – నేలకు చేతిలోనికి (అందముగా శబ్దించుచు) పడుచున్నవి. మింటినుండి అపుడపుడు నక్షత్రములు రాలుట కాననగును. దానిని కొందరు చచ్చి నక్షత్రా

తాలాః. మధుకరవిరుత మివ మధురం వాద్యతే వంశః. ఇయ మపరేర్ష్యాప్రణయ కుపిత కామి నీ వాఙ్కా రోపితా కరరుహ పరామర్శేన వాద్యతే వీణా. ఇమా అపరాః కుసుమరసమత్తా ఇవ మధుకర్యోఽతిమధురం ప్రగీతా గణికాదారికా నర్త్యన్తే. నాట్యం పాఠ్యన్తే సశృఙ్గారమ్. అపవల్గితా గవాక్షేషు వాతం గృహ్ణన్తి సలిలగర్గర్యః. ఆదిశతు భవతీ.

---

కారమును - దేవతాకారమును అనుట - చెందినవారు - 'క్షీణే పుణ్యే' అన్న శాస్త్రము బడి, అందుండి రాలి పోవుదురనుట కలిగినదే. తాళములు - కంచువి - గుండ్రమైనవి నిరంతరము వాదనలో ఒరయికకలిగి, తళతళ నక్షత్రములవలె ప్రకాశించుచుండును. వానిని తాళనిపుణులు అందముగా ఎగిరిపడునట్లు చేయుదురు. అపుడది మింటినుండి దుల్లిన నక్షత్రమువలె తళతళలాడు చుండును. వంశః = పిల్లనగ్రోవి - తుమ్మెదల మోఁతవలె ఇంపుగా వాయింపఁ బడుచున్నది. గ్రోవి మోఁతను తుమ్మెదధ్వనియనుట మైత్రేయుని వర్ణన. ఇయం అపరా వీణా - ఇదిగో మఱియొకటి, వీణె., ఈర్ష్యాప్రణయకుపిత ... = ఈర్ష్యచే ప్రణయకుపితయైన కామినివోలె. - కోపముతీర్చుటకు నాయకుని ఒడిలోనికి ఎక్కించుకోఁబడిన దానివలె - ఒడిలో పెట్టుకొనఁబడినదై, గోళ్ళ మీటుటచే వాయింపఁబడుచున్నది - కామినియు కాంతుని చుంబన కరరుహపరామర్శలం బొందును, అలుక తీర్చును. ఇమే అపరే గణికాదారికాః ... = వీరుగో. వీరు వేఱు - భోగముపిల్లలు, కుసుమరసమత్తా మధుకర్య ఇవ - మకరందముచే మత్తగొన్న ఆడుతుమ్మెదలవలె అతిమధురం ప్రగీతాః = ఎంతయు చెవికి ఇంపుగా పాడుచున్నవారై, నాట్యము నేర్పఁబడుచున్నారు - ఆడింపఁబడు చున్నారు, శృంగారముతో కూడుకొన్న నాట్యమును - నాట్యవస్తువును, పాఠ్యన్తే = చదివింపఁబడు చున్నారు. వాచికాభినయము నేర్పఁబడు చున్నారు. వాక్యముల యుచ్చారణలో అర్థానుగతమగు మెలఁకువలు ఎన్నియో కలవు. అదెల్ల నేర్పఁబడుచున్నది. గవాక్షేషు = కిటికీలయందు, సలిలగర్గర్యః = నీటికుండలు, గరగలు, అపవల్గితాః = వ్రేలఁగట్టఁబడినవై, వాతం = గాలిని, గృహ్ణన్తి = గ్రహించుచున్నవి - అట్లు గాలికి వాటముగా నుంచిన కుండలనీరు ఎక్కువ చలువగలదియగును.

[హీ హీ భో. ఇదో వి చఉత్థే పఓట్ఠే జువదికరతాడిదా జలధరా విఅ గమ్భీరం ణదన్తి ముదఙ్గా. హీణపుణ్ణాఓ విఅ గఅణాదో తారఆఓ ణివడన్తి కంసతాలా, మహుఅరవిరుఅం విఅ మహురం వజ్జది వంసో. ఇఅం అవరా ఈసాప్పణఅ కువిదకామిణీ విఅ అఙ్కారోవిదా కరరుహపరామరిసేణ సారిజ్జది వీణా. ఇమాఓ అవరాఓ కుసుమరసమత్తాఓ విఅ మహుఅరిఓ అదిమహురం పగీదాఓ గణిఆదారిఆఓ ణచ్చీఅన్తి, ణట్టఅం పఢీఅన్తి, ససిఙ్గారఓ. ఓవగ్గిదా గవక్ఖేసు వాదం గేణ్హన్తి సలిలగగ్గరీఓ. ఆదిసదు భోదీ].

చేటీ—ఏత్వే త్వార్యః. ఇమం పఞ్చమం ప్రకోష్ఠం ప్రవిశత్వార్యః. [ఏదు ఏదు అజ్జో. ఇమం పఞ్చమం పఓట్ఠం పవిసదు అజ్జో].

విదూ—(ప్రవిశ్య దృష్ట్వా చ) ఆశ్చర్యం భోః, ఇహాపి పఞ్చమే ప్రకోష్ఠే ఽయం దరిద్రజనలోభోత్పాదనకర ఆహారత్యుపచితో హిఙ్గుతైలగన్ధః. వివిధ సురభిధూమోద్గారై ర్నిత్యం సంతాప్యమానం నిఃశ్వసి తీవ మహానసం ద్వారముఖైః అధికముత్సుకాయతే. మాం సాధ్యమాన బహువిధభక్ష్యభోజనగన్ధః.

ఇఁక - పఞ్చమం - ఐదవకక్ష్య.

దరిద్రజన ... = పేదలకు ఆసపుట్టించువది, అయం = ఇదిగో, ఉపచితః = పేరిన, హిఙ్గుతైలగన్ధః - ఇంగువ (కూడిన) నూనియవాసన అంతటను ఆకర్షించుచున్నది. నిత్యం సంతప్యమానం ... = ఎల్లప్పుడు, వేఁగుచున్నదై, మహానసం = వంటయిల్లు, ద్వారముఖైః = ద్వారము అను నోళ్లగుండ, వివిధసురభి ... = పలుతెఱంగుల సువాసనలుగల పొగల త్రేన్పులతో, నిట్టూర్చుచుం బోలె నున్నది. ఉత్ప్రేక్ష. మాం అధికం ఉత్సుకయతి = నన్ను మిక్కిలి ఆసగొల్పుచున్నది - నాకు తిను నాస పుట్టించుచున్నది, - (ఏదనఁగా) సాధ్యమాన ... = తయారు చేయఁబడుచున్న పలుతెఱంగుల తినుబండములయు (అప్పచ్చులయు), చిత్రాన్న

అయ మపరః పటచ్చర మివ హతపశూదర పేశిం ధావతి రూపిదారకః. బహువిధాహార వికార ముపసాధయతి సూపకారః. బధ్యన్తే మోదకాః, పచ్యన్తే ఽపూపకాః. (ఆత్మగతమ్) అపీదానీ మిహ వర్ధితం భుఙ్క్ష్వ ఇతి పాదోదకం లప్స్యే. (అన్యతో ఽవలోక్య చ) ఇహ గన్ధర్వాప్సరోగణై రివ వివిధాలంకార శోభితై ర్గణికాజనై ర్బన్ధులై శ్చ యత్సత్యం స్వర్గాయత ఇదం గేహమ్. భోః కే యూయం బన్ధులా నామ.

[హీ హీ భో, ఇదో వి పఞ్చమే పఓట్ఠే అఅం దలిద్ద జణాలోహుప్పావణఅరో ఆహారఇ ఉవచిదో హిఙ్గుతెల్లగన్ధో. వివిహసురహిధూముగ్గరేహిం ణిచ్చం సంతావిజ్జమాణం ణీససది విఅ మహాణసం దువారముహేహిం. అధిఅం ఉసుసావేది మం సాహిజ్జమాణ బహువిహ భక్ఖభోఅణగన్ధో. అఅం అవరో పడచ్చరం విఅ పోట్టిం ధోఅది రూపి

ములయొక్క వాసన. అయం అపరః - ఇది మఱియొకటి - రూపి దారకః = సూనరి బాలుఁడు - వంటకు జంతువులను జంపి మాంసాదికము సిద్ధముచేయువాఁడు - గుడ్డ పేలికవలె చంపినదాని పొట్టలోని మాంసఖండమును - ధావతి = కడుగుచున్నాఁడు. నెత్తుటిమరకలు మొదలైన మైల పోవునట్లు - సూపకారః - వంటవాఁడు, బహుఁ విధ - ఆహారవికారం = పలుతెఱంగుల యాహారముల (వికార = ) కలపుటలను చేయుచున్నాఁడు. మోదకాః = లడ్డులు - (మొదలైనవి) బధ్యన్తే = ముద్దపట్టఁ (కట్టఁ) బడుచున్నది. అపూపకాః - వడలు మొదలైనవి, పచ్యన్తే = ఉడికింపఁ బడుచున్నవి. వీని నన్నింటిని చూడఁగా బాపనయ్యకు నోరు ఊరిపోవుచున్నది. ఆత్మగతమ్ - తనలో అనుకొనుచున్నాఁడు - ఇదానీం ... = ఇప్పుడు ఇక్కడ వడ్డన చేయఁబడును - భోజనము చేయుము అని - పాద్యము పొందుదునా? తినఁబోవు ముందు కాళ్ళు కడుగుకొనుటకు. - ఈలంజ ఆమాట యనఁగూడదా అని వాని యాస - అన్యతః అవలోక్య = మఱియొక వైపు చూచి. ఇక్కడ - గన్ధర్వాప్సరోగణైః ఇవ ... = గంధర్వులయు అచ్చరలయు గుంపులచేతం బోలె పలుతెఱంగుల యలంకారములతో రాణించు భోగమువారిచేతను బంధులులచేతను, (యత్ సత్యం = ) నిజము చెప్పెదను, స్వర్గమో యన నున్నది యీయిల్లు. భో కే యూయం... మీరెవరు, బంధులులు అనఁగా.

దారఓ బహువిహాహార విఆరం ఉవసాహేది సూవఆరో. బజ్ఝన్తి మోదఆ. పచ్చన్తి అపూవఆ. అవి దాణిం ఇహ బడ్ఢిఅం భుఞ్జసు త్తి పాదోదఅం లహిస్సమ్. ఇదో గన్ధవ్వచ్ఛరగణేహిం విఅం వివిహాలంకార సోహిదేహిం గణికా జణేహిం బన్ధులేహిం అ జం సచ్చం సగ్గిఅది ఏదం గేహమ్. భో, కేతుహ్మే బన్ధులా ణామ ].

బన్ధులా—వయం ఖలు

శ్లో. పరగృహలలితాః పరాన్నపుష్టాః
పరపురుషైర్జనితాః పరాఙ్గనాసు,
పరధననిరతా గుణే ష్వవాచ్యా
గజకలభా ఇవ బన్ధులా లలామః. ౨౮

విదూ—ఆదిశతు భవతీ. [ఆదిసదు భోదీ].

చేటీ—ఏ త్వే త్వార్యః, ఇమం షష్ఠప్రకోష్ఠం ప్రవిశత్వార్యః. [ఏదు ఏదు అజ్జో. ఇమం ఛట్ఠం పఓట్ఠం పవిసదు అజ్జో].

---

శ్లో. ౨౮. పరాఙ్గనాసు = పరాయిస్త్రీలకు, పరపురుషైః = పరాయి పురుషులచే, జనితాః = పుట్టినారము - పరగృహలలితాః = పరాయివారి యిండ్లలో ఆడుకొన్నాము - పసితనము గడపినా మనుట, పరాన్నపుష్టాః = పరాయివారి అన్నముతో బలిసినారము, పరధననిరతాః = పరాయివారి ధనమునందే ఎప్పుడును ఆసక్తులము, గుణేషు = గుణములయందు - అప్రస్తావమున, అవాచ్యాః = చెప్పఁగూడనివారము, గజకలభాఇవ = ఏనుఁగు గున్నలవలె, లలామః = విలసిల్లుదుము.

ఒకనికి, పరాయివానికే, ఒక పరాయివానియందు పుట్టి, మఱొక పరాయి యింట పెరిఁగి, పరులయన్నముతో బలిసినారము, పరాయివాఁడే మాపనులయు డబ్బు పెట్టును, - మంచి గుణాలప్రస్తావమున, మాపేరైనను చెప్పఁగూడదు. ఏనుఁగు గున్నలవలె, హాయిగా విచ్చలవిడి విలసించుచుందుము - విలాసముగా తిరుగుచుందుము.

ఇఁక ఆఱవకక్ష్య - కట్టుట చెక్కుట మలచుట సానపట్టుట మొదలగు నన్నిపనుల నేర్పఱులగు అగసాలెలు ఉన్నారు - ఇక్కడ - శిల్పినః - శిల్పులు -

విదూ—(ప్రవిశ్యావలోక్య చ) ఆశ్చర్యం భోః, ఇహాపి షష్ఠే ప్రకోష్ఠే ఽమూని తావత్సువర్ణరత్నానాం కర్మతోరణాని నీలరత్నవినిక్షిప్తా నీన్ద్రాయుధస్థాన మివ దర్శయన్తి. వైడూర్యమౌక్తికప్రవాలకపుష్పరాగేన్ద్రనీలకర్కేతరకపద్మరాగమరకతప్రభృతీన్రత్నవిశేషా నన్యోన్యం విచారయన్తి శిల్పినః. బధ్యన్తే జాతరూపైర్మాణిక్యాని. ఘట్యన్తే సువర్ణాలంకారాః. రక్తసూత్రేణ గ్రథ్యన్తే మౌక్తికాభరణాని. ఘృష్యన్తే ధీరం వైడూర్యాణి. ఛిద్యన్తే శఙ్ఖాః. శాణైర్ఘృష్యన్తే ప్రవాలకాః. శోష్యన్త ఆర్ద్రకుఙ్కుమప్రస్తరాః. సార్యతే కస్తూరికా. విశేషేణ ఘృష్యతే చన్దనరసః. సంయోజ్యన్తే గన్ధయుక్తయః. దీయతే గణికాకా

---

నక్షి పనివారు - సువర్ణరత్నానాం ...=బంగారుయొక్కయు రతనాలయొక్కయు నక్షి తోరణములు, ఇంద్రనీలములు తాపినవి, ఇంద్రాయుధము - ఇంద్రధనుస్సు ఉండు చోటుం బోలె, శోభించుచున్నది. వైదూర్య ... = మొదలగునవి నవరత్న భేదములు - కర్కేతనక - ఇదియు ఒకరకపు రత్నము - అన్యోన్యం విచారయన్తి - ఒండొరులతో ఆలోచించుకొనుచున్నారు - మంచిసెబ్బరలను - ఇట్లు కూతుఁమా అట్లు కూతుఁమా అని. బంగారుతో మాణిక్యములఁ గట్టుచున్నారు - (కొందఱు) బంగారునగలే చేయుచున్నారు - రక్తసూత్రేణ ... = ఎఱ్ఱని దారముతో ముత్యాల యాభరణములు - హారములు - అనుట. కట్టఁబడుచున్నవి. ఎఱ్ఱ దారమైన తెలుపు ఎఱుపుఁగూడి దండ ఎక్కువ యందముగా నుండును. ఘృష్యన్తే ధీరం ... = వైడూర్యములు (ధీరం =) గట్టిగా - అవి చాల కఠినమైన వైనందున - సానపట్టఁబడుచున్నవి - శంఖములు పగులఁగొట్టఁబడుచున్నది, ప్రవాలకాః = పగడాలు - శాణైః = సానలతో - ఆర్ద్రకుఙ్కుమప్రస్తరాః - పచ్చి కుంకుమ చట్టలు గందపుబిళ్ళలవలె శోష్యన్తి = ఆఱపెట్టఁ బడియున్నవి - సార్యతే = కఱగఁబడుచున్నది - కస్తూరి - విశేషేణ ... = ఎక్కువగా చందనద్రవము సానపై తీయఁబడుచున్నది - సంయోజ్యన్తే = కలుపఁబడుచున్నవి - (నానా) సువాసనలు - పరిమళద్రవ్యములు - గణికా కాముకానాం = భోగమువారి (కిని వారి)ం గూడవచ్చిన కాముకులకు - కోడెకాండ్రకు - పచ్చకప్పు

ముకయోః సకర్పూరం తామ్బూలమ్. అవలోక్యతే సకటాక్షమ్. ప్రవర్తతే హాసః. పీయతే చానవరతం ససీత్కారం మదిరా. ఇమే చేటాః, ఇమాశ్చేటికాః, ఇమే అపరే ఉవధీరితపుత్రదారవిత్తా మనుష్యా ఆసవకరకాపీతమదిరైర్గణికాజనైర్ముక్తాస్తే పిబన్తి. ఆదిశతు భవతీ.

[హీ, హీ భోః. ఇదో వి ఛట్టే పఓట్ఠే అముం దావ సువణ్ణ రఅణాణం కమ్మతోరణాఇం ణీలరఅణవిణిక్ఖిత్తాఇం ఇన్దాఉహట్ఠాణం విఅ దరిసఅన్తి. వేదురిఅ మోత్తిఅ పవాలఅ పుప్పరాఅ ఇన్దణీల కక్కేతరఅ పద్మరాఅ మరగఅ పహుదిఆఇం రఅణవిసేసాఇం అణ్ణోణ్ణం విచారేన్తి సిప్పిణో. బజ్ఝన్తి జాదరూవేహిం మాణిక్కాఇం, ఘడిజ్జన్తి సువణ్ణాలంకారా, రత్తసుత్తేణ గత్థీఅన్తి మోత్తిఆభరణాఇం. ఘసీఅన్తి ధీరం వేదురిఆఇం. ఛేదీఅన్తి సఙ్ఖఆ. సాణీజ్జన్తి పవాలఆ. సుక్ఖవిఅన్తి ఓల్లవిదకుఙ్కుమపత్థరా. సాలీఅది సలజ్జఅమ్. విస్సాణీఅది చన్దణరసో. సంజోఈఅన్తి గన్ధజుత్తిఓ. దీఅది గణిఆకాముకా

రముతోడి తాంబూలము ఒసంగఁబడుచున్నది. అవలోక్యతే సకటాక్షం = కడకంటం జూడఁబడుచున్నది - ప్రవర్తతే ... = నవ్వులు ప్రవర్తిల్లుచున్నవి. అనవరతం ... = తెంపులేక, నిముసమేని నిలుపక, 'సీ' అనుమ్రోఁతతో చప్పరింపఁబడుచున్నది, కల్లు. ఇమే చేటాః = వీరుఁగో నౌకరులు - చేటులు - చేటికలు - ఆఁడుదాసీజనము - ఇంకను వీరుగో, మఱికొందఱు, మనుష్యాః = మానుసులు - అవధీరిత ... = సరకుసేయఁబడని కొడుకులు భార్యలు ధనము గలవారు - సర్వము మానుకొని భోగమువారిపాలైనవారు, అక్కడ ధనము ఐపోఁగా, వారిచే విడిచిపెట్టఁబడినవారు - ఐనను వారిని మానఁజాలక వారివాకిటనే పడియుండువారు. ఆసవకరకాపీత మదిరైః - (కల్లు) దుత్తలతో త్రాఁగఁబడిన కల్లుగల, గణికాజనైః = భోగముపిల్లలచేత ఇఁక పొమ్మని విడిచిపెట్టఁబడినవారు - కల్లుగోష్ఠిలోనికి రానీఁబడనివారు - అందఱు (కల్లు) త్రాఁగుచున్నారు - గోష్ఠికి - అపానమునకు పోఁగా - మిగిలిన దానిని అనుట.

ణాం సకపూప్పరం తామ్బూలం. అవలోఈఅది సకడక్ఖఅమ్. పఅట్టది హాసో. పిబీఅది అ అణవరఅం ససిక్కారం మఇరా. ఇమే చేడా, ఇమా చేడిఆఓ, ఇమే అవరే అవధీరిద పుత్తదారవిత్తా మణుస్సా ఆసవకరఆపీదమదిరేహిం గణిఆజణేహిం జే ముక్కా తే పిఅన్తి. ఆదిసదు భోదీ ].

చేటీ—ఏ త్వే త్వార్యః. ఇమం సప్తమం ప్రకోష్ఠం ప్రవిశ త్వార్యః. [ ఏదు ఏదు అజ్జో. ఇమం సత్తమం పఓట్ఠం పవిసదు అజ్జో ].

విదూ—(ప్రవిశ్యావలోక్య చ) ఆశ్చర్యం భోః, ఇహాపి సప్తమే ప్రకోష్ఠే సుశ్లిష్టవిహఙ్గవాటీసుఖనిషణ్ణాన్యన్యోన్యచుమ్బన పరాణి సుఖ మనుభవన్తి పారావత మిథునాని. దధిభక్తపూరితోదరో బ్రాహ్మణ ఇవ సూక్తం పఠతి పఞ్జరశుకః. ఇయ మపరా సంమాననాలబ్ధప్రస రేవ గృహదాసీ అధికం కురకురాయతే మదన

ఇఁక (సప్తమ = ) ఏడవకక్ష్య - లోఁగిలి. - ఇహా అపి = ఇందును - వానం బోలెనే - పారావతమిథునాని - పావురా జతలు - పెంటియు పోతును కూడినవి, - సుశ్లిష్ట ... = అందముగా అమర్పఁబడిన పక్షులవాడలో హాయిగా కూచుండి, ఒండొంటిని ముద్దుగొనుటయందు ఆసక్తమైనవి, హాయి యనుభవించుచున్నవి, దధి భక్త ... = పెరుఁగుకూటితో నింపఁబడిన పొట్ట - కడుపు - గలదై, (అట్లు పొట్ట నింపుకొన్న) బ్రాహ్మణునివలె (సూక్తం = ) చక్కఁగా సేపిఁగన మంచి మాట లను - పౌరుషాదివేదసూక్తముంబోలె - పలుకుచున్నది. ఇయం అపరా - ఇది మఱి యొకటి, మదనసారికా - మదన లేఖలం గొని పోవును కాంబోలు - (దీని మాఱిన దేశ్యరూప మగునా - మైనాపకిరివి-అని వే. వేం.శాస్త్రిలవారి యాశంక.) ఈసారిక - గోరవంక. సమ్మానసా లబ్ధప్రసరాఇవ - మఱింత ఆదరముతో చూచుటచే ఎక్కువ చనువు - చొరవ - పొందినదై, అట్టిదే ఐన యింటి పనికత్తెవలె, అధికం = పెల్లుగా, కురకురయనుచునే యున్నది - పనికత్తెయు అట్టిది, కలుగఁజేసికొని, ఏదియో గొణు

సారికా. అనేకఫలరసాస్వాదప్రహృష్టకణ్ఠా కుమ్భదా సీవ కూజతి పరపుష్టా. ఆలమ్బితా నాగదన్తేషు పఞ్జరపరమ్పరాః. యోధ్యన్తే లావకాః. ఆలాప్యన్తే కపిఞ్జలాః. ప్రేష్యన్తే పఞ్జరకపోతాః. ఇత స్తతో వివిధమణి చిత్రిత ఇ వాయం సహర్షం నృత్య న్రవికిరణ సంతప్తం పక్షోత్క్షేపై ర్విధువ తీవ ప్రాసాదం గృహమయూరః. (అన్యతో ఽవలోక్య) ఇతః పిణ్డీకృతా ఇవ చన్ద్రపాదాః పదగతిం శిక్షమాణా నీవ కామినీనాం పశ్చా త్పరిభ్రమన్తి రాజహంసమిథునాని. ఏతే ఽపరే వృద్ధమహల్లకా ఇవ ఇత స్తతః సంచరన్తి

---

గుచు చెప్పుచునే యుండును. అనేక ఫలరసాస్వాద ప్రహృష్ట కణ్ఠా - నానాఫలముల రసములు రుచిగా త్రాఁగి సంతసమున రక్తియెక్కిన గొంతుతో, ఆఁడుకోయిల కూయుచున్నది - కుమ్భదాసీ ఇవ - తాపుఁ గుడుకత్తెవలె - (ఆట్టె), దేవళములలో హారతియెత్తు కుంభ(దీప)మును తెచ్చునది - కాఁబోలు - అది హారతిపాటయుం బాడును. ఒక వ్యాఖ్యాత - ఇంటికి నీటికుండ మోయు పనికత్తె, కుండ మోఁతలో శ్రమవినోదమునకు (మధురముగానే) హుంకరించునది - అన్నాఁడు. నాగదంతములయందు - గోడలో నిడుపుగా బిగించిన మేకులందు - పఞ్జరపరమ్పరాః = పంజరముల బారులు - లావకాః - లావుకపిట్టలు - యోధ్యన్తే = యుద్ధము చేయింపఁబడుచున్నవి - అదియు వినోదముగా చూడఁదగియుండును - కపిఞ్జలాః = కముజులు - పిట్టవిశేషము - ఆలాప్యన్తే = మాటాడింపఁబడుచున్నవి. పఞ్జరకపోతాః - పంజరములందలి పావురములు - జాబులతో - ఊరకే - కాని, ప్రేష్యన్తే = పంపఁబడుచున్నవి. అట్లవి పోయి మింట తిరిగి మరల ఏవేళకు ఇంటికి చేరఁబాఱును. గృహమయూరః - పెంపుడునెమలి, వివిధమణి చిత్రిత ఇవ = నానారంగుల మణులు తాపినదియుంబోలె, ఇతః తతః = ఇక్కడ అక్కడ సంతోషముతో ఆడుచున్నదై, రవికిరణ సంతప్తం = సూర్యకిరణములకు వేఁడియెక్కిన, ప్రాసాదం = మేడను, పక్ష ఉత్క్షేపైః = రెక్కలను పైకివిసరుటలతో, వీఁచుచుంబోలె నున్నది, ఇతః = (మఱి) యిక్కడ, పిణ్డీకృతాః - మొత్తముచేయఁబడిన, చన్ద్రపాదా ఇవ = చంద్రకిరణములంబోనివి, రాజహంసమిథునాని = రాయంచలజతలు - పెంటిగండ్లు, పదగతిం శిక్షమాణాని ఇవ = పదముల నడకను నేర్చుకొనుచున్నవియుం బోలె, కామినీనాం పశ్చాత్ = హొయలుకత్తియల వెనువెంటనే,

గృహసారసాః. ఆశ్చర్యం భో, ప్రసారణం కృతం గణికాయా నానాపక్షిసమూహైః, యత్సత్యం ఖలు నన్దనవన మివ మే గణికా గృహం ప్రతిభాసతే. ఆదిశతు భవతీ.

[హీ హీ భో, ఇధో వి సత్తమే పఓట్ఠే సుఓలిట్ఠ విహఙ్గ వాడీసుహణిసణ్ణాఇం అణ్ణోణ్ణ చుమ్బణపరాఇం సుహం అణుభవన్తి పారావదమిహుణాఇం. దహిభత్తపూరిదోదరో బమ్హణో విఅ సుత్తం పఢది పఞ్జరసుఓ. ఇఅం అవరా సంమాణణాలద్ధపసరా విఅ ఘర దాసీ అధిఅం కురుకురాఅది మదణసారిఆ. అణేఅఫలరసాస్సాద పహుట్ఠకణ్ఠా కుమ్భదాసీ విఅ కూఅది పరపుట్ఠా. ఆలమ్బిదా ణాగ దన్తేసు పఞ్జరపరమ్పరాఓ. జోధీఅన్తి లావఆ. ఆలవీఅన్తి కపిఞ్జలా. పేసీఅన్తి పఞ్జలకవోదా, ఇదో తదో వివిహ మణిచిత్తలిదో విఅ అఅం సహరిసం ణచ్చన్తో రవికిరణ సంతత్తం పక్ఖుక్ఖేవేహిం విధువేది విఅ పాసాదం ఘరమోరో. ఇదో పిణ్డీకిదా విఅ చన్దపాదా పదగదిం సిక్ఖన్తా విఅ కామిణీణం పచ్చాదో పరిబ్భమన్తి రాఅహంసమిహుణా. ఏదే అవరే వుడ్ఢమహల్లకా విఅ ఇదోతదో సంచరన్తి ఘరసారసా. హీ హీ భో. పసారణఅం కిదం గణిఆప ణాణాపక్ఖిసమూహేహిం. జం సచ్చం క్ఖు ణన్దణవణం విఅ మే గణిఆఘరం పడిభాసది. ఆదిసదు అజ్జో.]

---

ఇటునటు తిరుగుచున్నవి – పెంపుడువి కావున వెంటందిరుగుట – అది గతి నేర్చు కొనుటకో యని ఉత్ప్రేక్ష – గృహసారసాః – పెంపుడు బెగ్గురులు – వృద్ధమహల్లకా ఇవ = ముసలి పండుల – పేడులవలె, నానాపక్షిసమూహైః – ఈ పలు తెఱంగుల పక్షుల గుంపులచేత, గణికాయాః ప్రసారణం కృతం = భోగముదానియొక్క – వసంతసేనయొక్క వ్యాప్తి – కీర్తి ప్రతిష్ఠాపనము అనుట – కృతం = కావింపఁబడి నది. యత్సత్యం – (ఇంతయెందులకు?) నిజముపలికెదను – నన్దనవనం ఇవ = ఇం ద్రునితోఁటవలె – అనఁగా ఈలోకాన మఱి యేదియు సాటి గాదు – ఈబంగాళాకు. గణికాగృహం – భోగముదాని – వసంత సేనయొక్క – ఇల్లు, ప్రతిభాసతే ఖలు – తోఁపింపఁజేయుచు ప్రకాశించుచున్నది.

చేటీ—ఏ త్వే త్వార్యః. ఇమ మష్టమం ప్రకోష్ఠం ప్రవిశ త్వార్యః. [ఏదు ఏదు అజ్జో. ఇమం అట్ఠమం పఓట్ఠం పవిసదు అజ్జో.]

విదూ—(ప్రవి శ్యావలోక్య చ) భవతి, క ఏష పట్టప్రావా రక ప్రావృతో ఉధికతర మత్యద్భుత పునరుక్తాలంకారాలంకృతో ఉజ్జభ జ్గైః పరిస్ఖల న్నిత స్తతః పరిభ్రమతి.

[భోది, కో ఏసో పట్టపావారఅపాఉదో అధిఅదరం అచ్చబ్భుద పుణరుత్తాలంకారాలంకిదో అజ్జభ జ్గేహిం పరిక్ఖలన్తో ఇదో తదో పరిబ్భమది].

చేటీ—ఆర్య, ఏష ఆర్యాయా భ్రాతా భవతి. [అజ్జ, ఏసో అజ్జఆఏ భాదా భోది].

విదూ—కియ త్తపశ్చరణం కృత్వా వసన్తసేనాయా భ్రాతా భవతి. అథవా [కిత్తిఅం తవచ్చరణం కదుఅ వసన్తసేణాఏ భాదా భోది. అథవా]

ఇది యెనిమిదవ కక్ష్య -

ప్రవిశ్య అవలోక్య - ప్రవేశించి చూచి, భవతి, క ఏషః ... = అమ్మా, ఎవఁడీయన, పట్టు ఉత్తరీయముతో కప్పఁబడినవాఁడై, అత్యద్భుతములైన, రకమునకు రెండును, మూఁడును ఐన ఆభరణములతో - అధికతరం = ఎక్కువగా అలంకరింపఁబడినవాఁడై, అజ్జభ జ్గైః = ఒడలి విఱుపులతో, తొట్రుపడుచు, ఇటునటు తిరుగాడుచున్నాఁడు!

ఆర్యాయాః భ్రాతా = అక్కకు - వసంతసేనకు - తోఁబుట్టువు - అన్న - కియత్ తపశ్చరణం కృత్వా ... = ఎంత తపస్సు చేసి వసంతసేనకు అన్నయగును ? అథవా = అట్లుగాదు.

శ్లో. మా తావ ద్ద్య ద్ద్య ప్యేష
ఉజ్జ్వలః స్నిగ్ధశ్చ సుగన్ధశ్చ
తథాపి శ్మశానవీథ్యాం
జాత ఇవ చమ్పకవృక్షో ఽనభిగమనీయో లోకస్య. ౨౯

[మా దావ జఇ వి ఏసో
ఉజ్జలో సిణిద్ధో అ సుఅన్ధో అ
తహా వి మసాణవీధీ
ఏజాదో విఅ చమ్పఅరుక్ఖో అణహిగమణీఓ లోఅస్స].

(అన్యతో ఽవలోక్య) భవతి ఏషా పునః కా పుష్పప్రావారక ప్రావృ తోపానద్యుగుల నిక్షిప్త తైల చిక్కణాభ్యాం పాదాభ్యా ముచ్చాసన ఉపవిష్టా తిష్ఠతి. [భోది, ఏసా ఉణ కా పుల్లపావార ఆపాఉదా ఉవాణజహుఅలణిక్ఖిత్త తేల్ల చిక్కణేహిం పాదేహిం ఉచ్చాసణే ఉవవిట్టా చిట్ఠది].

శ్లో. ౨౯. మా తావత్ = కూడదు కూడదు – అట్లనంగూడదు – యద్యపి ఏషః ఉజ్జ్వలః ... = ఇతఁడు ప్రకాశించుచున్నను. ఇతని దేహము నున్నగా తళతళన ఉన్నను, – అట్లున్ననుం గూడ, శ్మశానవీథ్యాం ... = మస నంపు వాడలో మొలచిన సంపెంగ – చెట్టు వలె, లోకమునకు – జనులకు – చేరఁబోఁరానివాఁడు – కూడఁగూడనివాఁడు.

భవతి, ఏషా పునః ... = అమ్మా మఱి ఈమె! పూలు అద్దిన ఉత్తరీయ ముతో – ముసుగుతో – కప్పఁబడినదై. ఉపానద్యుగళ ... = చెప్పులజోడులో పెట్టఁబడినవియు – చెప్పులు తొడుగఁబడినవియు – నూనె(తాలుచుం) బోలె నున్నగా నున్నవియు నగు పాదాలతో (కూడుకొన్నదై) ఎత్తైన ఆసనమున కూచుండియున్నది.

చేటీ—ఆర్య, ఏషా ఖ ల్వస్మాక మార్యాయా మాతా. [అజ్జ ఏసా క్ఖు అహ్మాణం అజ్జఆఏ అత్తిఆ].

విదూ—అహో అస్యాః కపర్దకడాకిన్యా ఉదరవిస్తారః. త త్కిం మేతాం ప్రవేశ్య మహాదేవ మివ ద్వారశోభా ఇహాగృహే నిర్మితా? [అహో సే కవట్టడాఇణీఏ పోట్టవిత్థారో. తా కిం ఏదం పవేసిఅ మహాదేవం విఅ దుఆరసోహా ఇహ ఘరే ణిమ్మిదా?]

చేటీ—హాతాశ, మైవ ముపహ సాస్మాకం మాతరమ్. ఏషా ఖలు చాతుర్థికేన పీడ్యతే. [హదాస, మా ఎవ్వం ఉవహస అహ్మాణం అత్తిఅమ్, ఏసా క్ఖు చాఉత్థిఏణ పీడీఅది].

విదూ—(సపరిహాసమ్) భగవం శ్చాతుర్థిక, ఏతే నోప కారేణ మా మపి బ్రాహ్మణ మవలోకయ. [భఅవం చాఉత్థిఅ, ఏదిణా ఉవఆరేణ మం పి బమ్హణం ఆలోఏ హి].

---

ఆర్య ఏషా ... = అయ్యా, ఈమె మాయక్కకు అమ్మగదా? అహో - ఆశ్చర్యము - అస్యాః = ఈమెకు - అపవిత్రాన్నము తినుడాకినికిం బోలె - పిశాచమునకుం బోలె పొట్టపెంపు! తత్ కిం = మఱి ఏమి, ఏతాంప్రవేశ్య ... = ఈమెను, మహాదేవం ఇవ = పెద్దదేవుని (విగ్రహముం) బోలె - లోపల ప్రవేశ పెట్టి ఈయింట - ద్వార శోభా = ద్వారము, దాని యలంకారము - అదంతయు, నిర్మితా కిం = నిర్మింపఁబడినదా - కట్టి తయారుచేయఁబడినదా? ఈమెను ఈమెపొట్టనుం జూచిన ఆవి ద్వారమున పట్టునట్లు లేదే.

హతాశ - నిర్భాగ్యుఁడా, మాయమ్మను ఇట్లు ఎగతాళిచేయకు. ఈమె చాతుర్థికము అను రోగముచే బాధపడుచున్నది - చాతుర్థికము అని ఒకవిధమైన జ్వరము - అది ప్రతి నాలుగుదినములకు ఒకతూరి కాయును - జ్వరముల - విధములు - దినము మార్చి దినము వచ్చునది, రెండు దినాలకు ఒక దినము కాయునది - మూఁడుదినాలకు - నాలుగుదినాలకు - అని కలవు.

భగవన్ చాతుర్థిక ... = స్వామీ చాతుర్థికయ్యా, ఏతేన ఉప కారేణ ... = ఈ యుపకారముతో - ఇంత పొట్టపెట్టుట మొదలైనదానితో - బ్రాహ్మణుని నన్నుం గూడ చూడుమా. అనుగ్రహింపుమా,

చేటీ—హతాశ, మరిష్యసి. [హదాస మరిస్ససి].

విదూ—(సపరిహాసమ్) దాస్యాఃపుత్రి, వర మీదృశః శూనపీనజఠరో మృత ఏవ [దాసీఏ ధీఏ వరం ఈదిసో శూణపీణ జఠరో ముదో జ్జేవ.]

శ్లో. సీధుసురాసవమత్తా
ఏతావదవస్థాం గతా హి మాతా
యది మ్రియతే ఽత్ర మాతా
భవతి శృగాలసహస్రపర్యాప్తికా. 30

[సీధుసురాసవమత్తిఆ ఏఆవత్థం గదాహి అత్తిఆ
జఇ మరఇ ఏత్థ అత్తిఆ భోది సిఆలసహస్సపజ్జత్తిఆ.]

---

హతాశ, మరిష్యసి - నిర్భాగ్యుఁడా, చత్తువు - ఆజ్వరాన. దాస్యాః పుత్రి ... = లంజెకూతురా, ఈదృశః ... = ఈవాపు (= ఉబ్బు), బలుపు - ఎత్తును వైశాల్యమును గల పొట్ట కలిగినవాఁడు, మృత ఏవ వరం = చచ్చిననే మేలు.

శ్లో. 30. సీధు సుర ఆసవ మత్తా - చెఱకు పండినట్టైన దాని రసాన వచ్చునది సీధువు, లేఁతదైన, ఆసవము - వరిదంటు బెల్లము పిండి - మొదలైనవాన తయారగునది సుర - ఇవి మద్యభేదములు - వీనితో కైపెక్కి, ఏతావద్ ... = ఇంతటి యవస్థకు వచ్చినదిగదా, అత్తా - అమ్మ, మాతా = అమ్మ, యది అత్ర మ్రియతే = ఇక్కడ చచ్చునేని, శృగాల ... కాభవతి = నక్కలు వేయింటికి - వేయి నక్కలకు (తృప్తికి) చాలినట్టిది అగును.

అన్ని విధాల మద్యములు త్రాఁగి అమ్మ ఇట్లు ఇంతగా బలిసినదే - అమ్మ యిక్కడ చచ్చెనా - ఈ కళేబరము వేయినక్కల యాహారమునకు చాలఁ బోలును.

భవతి, కిం యుష్మాకం యానపాత్రాణి వహన్తి? [భోది, కిం తుమ్హాణం జాణవత్తా వహన్తి?]

చేటీ—ఆర్య, నహి నహి. [అజ్జ, ణహి ణహి].

విదూ—కిం వాత్ర పృచ్ఛ్యతే. యుష్మాకం ఖలు ప్రేమ నిర్మలజలే మదనసముద్రే స్తనితమ్బజఘనా న్యేవ యానపాత్రాణి మనోహరాణి. ఏవం వసన్తసేనాయా బహువృత్తాన్త మష్టప్రకోష్ఠం భవనం ప్రేక్ష్య యత్సత్యం జానామి, ఏకస్థ మివ త్రివిష్టపం దృష్టమ్. ప్రశంసితుం నాస్తి మే వాగ్విభవః. కిం తావ ద్గణికాగృహమ్, అథవా కుబేరభవనపరిచ్ఛేద ఇతి. కుత్ర యుష్మాక మార్యా.

[కిం వా ఏత్థ పుచ్ఛీఅది. తుమ్హాణం క్ఖు పేమ్మణిమ్మలజలే మఅణసముద్దే త్థణణిఅమ్బజహణా జ్జేవ జాణవత్తా మణహరణా. ఏవ్వం వసన్తసేణాఏ బహువుత్తన్తం అట్ఠపఓట్ఠం భవణం పేక్ఖిఅ జం సచ్చం జాణామి, ఏకత్థం విఅ తివిట్టఅం దిట్టమ్. పసంసిదుం ణత్థి మే వాఆవిహవో. కిం దావ గణిఆఘరో అహవా కుబేర భవణ పరిచ్ఛేదో త్తి. కహిం తుమ్హాణం అజ్జఆ].

భవతి, కిం యుష్మాకం యానపాత్రాణి వహన్తి - ఏమి మీకు ఓడలు (వ్యాపారమునకు) ప్రయాణము చేయునా? ఓడ వ్యాపారమునం గాక ఇంత సంపద కలుగునా! - అని అడుగుచున్నాఁడు.

ఆర్య నహి ... అయ్యా, లేదు లేదు.

కిం వా అత్ర పృచ్ఛ్యతే - ఈవిషయమున అడుగవలయునా? యుష్మాకం ఖలు ... = మీకు ప్రేమయను నిర్మల - ఉప్పన కాని జలము గల మదన - కాముఁడను - సముద్రమందు, స్తన ... = పాలిండ్లు పిఱ్ఱలు మొలలునే ఓడలు.

ఏవం వసన్తసేనాయా ... = ఇట్లు వసంతసేనం గూర్చిన చాలవృత్తాంతము, ఎనిమిది లోగిళ్ల భవనముం జూచి నిజము చెప్పుచున్నాను, నాకు ఏమి తోఁచిన దనఁగా ఒక్కటం జేరిన ముల్లోకములం జూచితి నని. దానిం బొగడుటకు నాకు

చేటీ—ఆర్య, ఏషా వృక్షవాటికాయాం తిష్ఠతి. తత్ప్రవిశ త్వార్యః. [అజ్జ ఏసా రుక్ఖవాడిఆఏ చిట్ఠది. తా పవిసదు అజ్జో].

విదూ—(ప్రవిశ్య దృష్ట్వా చ) ఆశ్చర్యం భోః, అహో వృక్షవాటికాయాః సశ్రీకతా. అచ్ఛరీతికుసుమప్రస్తారా రోపితానేక పాదపాః, నిరన్తరపాదపతల నిర్మితా యువతిజఘన ప్రమాణా పట్టదోలా, సువర్ణయూథికా శేఫాలికా మాలతీ మల్లికానవమల్లికా కురబకాతిముక్తక ప్రభృతి కుసుమైః స్వయం నిపతితై ర్యత్సత్యం లఘూకరోతీవ నన్దనవనస్య సశ్రీకతామ్. (అన్యతో ఉవలోక్య) ఇతశ్చ ఉదయతసూర్యసమప్రభైః కమలరక్తోత్పలైః సంధ్యాయతే ఇవ దీర్ఘికా. అపి చ

[హీ హీ, భో, ఏసా రుక్ఖవాడిఆఏ సస్సిరీఅదా. అచ్ఛరీది కుసుమ పత్థారా రోవిదాఅణేఅ పాదవా, ణిరన్తరపాగవతలణిమ్మిదా జువదిజహణప్పమాణా పట్టదోలా, సువణ్ణజూధిఆ సేహాలిఆ మాలఈ మల్లిఆ ణోమాలిఆ కురబఆ అదిమోత్తఅప్పహుది కుసుమేహిం సఅం

---

మాటలసంపద - శక్తి - చాలదు. ఇదేమి బోగముసానియిల్లా - లేక కుబేరుని బంగాళా పెద్ద తునకయా! ఎక్కడ మీయక్క? ఇదిగో ఈతోఁటలో ఉన్నది. తత్ ... = కావున అయ్య ప్రవేశించునుగాక. అహో - ఆశ్చర్యము - వృక్షవాటికా ... = ఏమి తోఁటరామణీయకము! రోపితానేకపాదపాః = పెంపఁబడిన నానావిధ వృక్షములు, అచ్ఛరీతి కుసుమ ప్రస్తారాః = ఎక్కువ తక్కువలు లేక ఎగుడు దిగుడులు లేక ఒక్క తెఱంగైన పూలసమృద్ధులు గలిగి యున్నవి - నిరన్తర పాదప తల నిర్మితాః = సందులేక చెట్ల క్రింద నిర్మింపఁ బడియున్నవి, ఆచెట్లకే వ్రేలునట్లు అనుట. యువతి ... జవ్వనుల మొలకొలతకు సరిపోవునట్టివి పట్టుత్రాళ్లవ్రేలగట్టిన (పట్టు) ఉయ్యాలలు. సువర్ణ ... = చంపకములు, అడవిమల్లెలు, వావిలులు, జాజులు, మల్లెలు, విరజాజులు గోరటలు బండిగురువెందలు మొదలగు పూలచేత నందనవనరామణీయకమును చులకన చేయుచుంబోలె నున్నది. మఱియు.

ణివడిదేహి. జం సచ్చం లహుకరేది విఅ ణన్దణవణస్స సస్సిరీఅదమ్. ఇదో అ ఉవఅన్తసూరసమప్పహేహిం కమలరత్తోప్పలేహిం సంఝా అది విఅ దీహిఆ. అవి అ,]

శ్లో. ఏషో ఽశోకవృక్షో నవనిర్గమకుసుమ పల్లవో భాతి
సుభట ఇవ సమరమధ్యే ఘనలోహితపఙ్కచర్చికః. 30

[ఏసో అసోఅవుచ్ఛో ణవణిగ్గమ కుసుమపల్లవో భాది
సుభడో వ్వ సమరమజ్ఝే ఘణలోహిదపఙ్కచచ్చికో ].

భవతు. తత్కుత్ర యుష్మాక మార్యా. [భోదు, తా కహిం తుమ్హాణం అజ్జఆ.]

చేటీ—ఆర్య, అవనమయ దృష్టిమ్. పశ్యార్యామ్. [అజ్జ ఓణామేహి దిట్టిమ్. పేక్ఖ అజ్జఅమ్].

విదూ—(దృష్ట్వా ఉపసృత్య) స్వస్తి భవత్యై. [సోత్థి భోదీప].

---

శ్లో. 30. ఏషః అశోకవృక్షః = ఈ అశోకవృక్షము, నవనిర్గమ ... = క్రొత్తగా మొలతెంచిన పూలును చివుళ్లును గలదై - అన్నియు ఎఱ్ఱనివే - సమరమధ్యే = యుద్ధము నడుమనున్న - దట్టంపు రక్తచందనపు బురద పూఁత గలిగి మేలి - మొనగాఁడైన సిపాయివలె, భాతి = ప్రకాశించుచున్నది.

పూతయు చివురును - చెట్టు నిండి యున్నట్టివి - రెండును యెఱుపే ఐనందున, అవి నిరంతరముగా నున్న యాయశోకము యుద్ధమునడుమ నున్న ఎఱ్ఱని చిక్కని మైపూఁతతోడి మేలి భటుఁడో యన ఉన్నది.

అవనమయ దృష్టిం = చూపును వంచు - క్రిందికి చూడు - చూడు అక్కను. దృష్ట్వా ఉపసృత్య - చూచి సమీపించి - స్వస్తి భవత్యై - అమ్మా, నీకు స్వస్తి. వసంతసేన, సానియగుటచే సంస్కృతమును ఎఱుఁగును. తన గొప్ప తెలియుటకై

వసన్త—(సంస్కృత మాశ్రిత్య) అయే, మైత్రేయః! (ఉత్థాయ) స్వాగతమ్. ఇద మాసనమ్. అత్రోపవిశ్యతామ్.

విదూ—ఉపవిశతు భవతీ. (ఉపవిసదు భోదీ).

[ఉభా వుపవిశతః]

వసన్త—అపి కుశలం సార్థవాహపుత్రస్య

విదూ—భవతి, కుశలమ్. (భోది, కుశలమ్).

వసన్త—ఆర్య మైత్రేయ, అపీదానీమ్

శ్లో. గుణప్రవాలం వినయప్రశాఖం
విశ్రమ్భమూలం మహనీయపుష్పమ్
తం సాధువృక్షం స్వగుణైః ఫలాఢ్యం
సుహృద్విహఙ్గాః సుఖ మాశ్రయన్తి? 32

---

వీనితో సంస్కృతము మాటలాడు చున్నది. అయే ... = ఓహో మైత్రేయయ్యా - ఉత్థాయ - లేచి నిలబడి - మర్యాదకు - ఇతనికి సొంతముగాను, చారుదత్తుని మానినియగుటకును. ఇదం ఆసనమ్ = ఇదిగో ఆసనము - ఇందు కూర్చుండుము - అమ్మా నీవును కూర్చుండుము - ఉభయులును కూర్చుందురు, అపి కుశలం - అపి - ప్రశ్నందొడంగును - కుశలమా - వర్తకపుత్రునికి - ఇంచుమించుగా 'ఆర్య పుత్రునికి' అనుటంబోనిదే ఇది. - నాజూకైన నిర్దేశము. పేరు గ్రహింపదు.

శ్లో. 32. గుణప్రవాళం = (ఔదార్యాదిమేలి) గుణములే చివుళ్లుగాఁ గలది, వినయప్రశాఖం = అడఁకువయే కొమ్మలుగాఁ గలది, విశ్రమ్భమూలం = నమ్మకమే వేరుగాఁ గలది, మహనీయ(తా)పుష్పం = గౌరవార్హతయే-కీర్తియే-పూతగా గలదియు ఐన, తం సాధువృక్షం = ఆగొప్ప - మంచి - వాఁడు - మేటి వర్తకుఁడు అను చెట్టును, స్వగుణైః = తన యుపకారముల చేత నే. ఫలాఢ్యం = (ఆవియే) పంటగా, కాపుగా గలదానిని, సుహృద్విహఙ్గాః = మిత్రులను పక్షులు, సుఖం సులువుగాప్రీతితో, ఆశ్రయన్తి = ఆశ్రయింతురా?

మంచివాఁడైన - వర్తకుఁడైన అతఁడే చెట్టు - నమ్మకమే - నమ్మఁదగుటయే - వేరు - ఇంద్రియనిగ్రహము - అడఁకువ కొమ్మలు - గుణాలే చివుళ్లు, గొప్ప

విదూ—(స్వగతమ్) సుష్ఠూపలక్షితం దుష్టవిలాసిన్యా (ప్రకాశమ్) అథ కిమ్. [సుట్ఠు ఉవలక్ఖిదం దుట్ఠవిలాసిణీఏ. అథ ఇం].

వసన్త—అయే, కిమాగమనప్రయోజనమ్?

విదూ—శృణోతు భవతీ. తత్రభవాం శ్చారుదత్తః శీర్షే ఉఞ్జలిం కృత్వా భవతీం విజ్ఞాపయతి. [సుణాదు భోదీ. తత్తభవం చారుదత్తో సీసే అఞ్జలిం కదుఅ భోదిం విణ్ణవేది].

వసన్త—(అఞ్జలిం బద్ధ్వా) కిమాజ్ఞాపయతి.

విదూ—మయా తత్సువర్ణభాణ్డాం విశ్రమ్భా దాత్మీయ మితి కృత్వా ద్యూతే హారితమ్. స చ సభికో రాజవార్త్తాహారీ న జ్ఞాయతే

---

తనమే పూత - ఉపకారమే పంట - అన్నియు ఆశ్రయాహాణాతం దెలుపును - కావున మిత్రపక్షులు సులువుగా ఆశ్రయించుచున్నారా? (న్నవా?) సుష్ఠు ఉపలక్షితం - చక్కఁగా కనిపట్టినది, వర్ణించినది ఈకొంటె భోగముది! అథకిం = అవును, అట్లే. అయే కిం ఆగమనప్రయోజనమ్ - ఓయి, అయ్యా, ఏమి వచ్చిన పని? తత్రభవాణ్ - పూజ్యుఁడైనవాఁడు; శీర్షేణ అఞ్జలిం బధ్వా = తలపై కేల్మోడ్చి - బ్రాహ్మణుఁడు నాయకుఁడు, భోగముదానికి నాయికకు ఇట్లు నమస్కరించుట ఉచితమా? 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' - జగత్తంతయు బాణకవి యెంగిలియే - అనఁగా అతఁడు చెప్పనిది లేదు - మఱి యతనికి సాటి పండితుఁడును కవియు లేఁడు. అతఁడు కాదంబరీ చంద్రాపీడులు ఒండొరులకు అంజలి జేయుటం జెప్పినాఁడు. సీతపాదములకు-(మాటిమాటికిని కడసారిగాను)-రాముఁడు మొక్కుటను-భవభూతి చెప్పినాఁడు. కాళిదాసు దుష్యంతుఁడు శకుంతల పాదముల వ్రాలుటయు చెప్పినాఁడు. కావున కూడినదే అట్టి యుపచారము. చూ. I కడవేటను. విస్రమ్భాత్ = నమ్మకమువలన-ఓడను గదా అనియు, ఓడినను దానిని మరల తీసి ఈలేనా అనియు నమ్మకమువలన, ఆత్మీయం ఇతి కృత్వా = తనదే అని యెంచి, జూదాన పోఁగొట్టుకొనఁ - ఓడఁ - బడినది. స చ సభికః - ఆయాటలో మేస్త్రి, రాజవార్తాహారీ - సరకారు దూత - వార్తలు, సందేశాలు సమాచారాలు - కొని పోవువాఁడు - ఒక చోట నిలుకడగా నుండువాఁడు కాఁడు, అతని పోబడి

కుత్ర గత ఇతి. [మఏ తం సువణ్ణభణ్డఅం విస్సమ్భాదో అత్తణాకేర కేత్తి కదుఅ జూదే హారిదమ్. సో అ సహిఅ రాఅవత్థహారీ ణ జాణీఅది కహిం గదో త్తి].

చేటీ—ఆర్యే, దిష్ట్యా, వర్ధసే ఆర్యో ద్యూతకరః సంవృత్తః. [అజ్జఏ దిట్ఠిఆ వడ్ఢసి. అజ్జో జూదిఅరో సంవుత్తో].

వసన్త—(స్వగతమ్) కథమ్, చౌరేణాపహృత మపి శౌణ్డీరతయా ద్యూతే హారిత మితి భణతి. అత ఏవ కామ్యతే [కథమ్ చోరేణ అవహిదం పి సోణ్డీరదాఏ జూదే హారిదం త్తి భణాది. అదో జ్జేవ కామీఅది.

విదూ—త త్తస్యకారణా ద్గృహ్ణాతు భవ తీమాం రత్నావలీమ్. [తా తస్స కారణాదో గేణ్హాదు భోదీ ఇమం రఅణావలిమ్].

వసన్త—(ఆత్మగతమ్) కిం దర్శయామి తావ దలంకారమ్. [కిం దంసేమి తం అలంకారఅమ్] (విచిన్త్య) అథవా న తావత్. [అధవా ణ దావ].

---

(తెలియలేదు.) కావున ఆసువర్ణ భాండమునే (బంగారునగనె -) తీసి ఇయ్యను వీలు కాలేదు. ఆర్యే, దిష్ట్యా వర్ధసే - అక్కా, ఏమమ్మా నీయదృష్టము, బళి! - అనుట ... = అయ్య జూదగాఁ డైనాఁడు!

కథమ్ = ఎట్లూ! చౌరేణ ... = దొంగచే దొంగిలఁబడినదానినైనను, పరువుచేత జూదాన ఓడఁబడినదని చెప్పుచున్నాఁడు - అత ఏవ = అంత పరువు, ప్రతిష్ఠ, చిత్తోన్నతి కలవాఁడ వయినందుననే నేను నిన్ను కామింతును - నీకై మేలుపడుదును - తత్ = కావున, తస్యకారణాత్ = దానికోసము - అమ్మ దీనిని అంగీకరించును గాక, ఆత్మగతమ్ = తనలో అనుకొనుచున్నది - చూపుదునా (ఇతనికి) ఆయలంకారమును - శర్విలకునివలన మదనిక కోసము తన చేతికి వచ్చియున్నదానిని. విచిన్త్య - ఆలోచించి - అది యితనికి చూపఁగూడదు - అది నాకు సొంతముగా ఆతనిం జూచుటకు కారణము కాఁగలదులే - అని. 'అథవా నతావత్' - అనుటయు స్వగతమునం జేరినదే. తటాలున జవాబుచెప్పక కొంచెము

విదూ__కిం తావ న్న గృహ్ణాతి భవ తీమాం రత్నావలీమ్. [కిం దావ ణ గేణ్హది భోదీ ఎదం రఅణావలిమ్],

వసన్త__(విహస్య సఖీముఖం పశ్యన్తీ) మైత్రేయ, కథం న గ్రహీష్యామి రత్నావలీమ్? [మిత్తేఅ, కధం ణ గేణ్హిస్సం రఅణావలిమ్]. (ఇతి గృహీత్వా పార్శ్వే స్థాపయతి. స్వగతమ్) కథం హీనకుసుమా దపి సహకారపాదపా న్మకరన్ద బిన్దవో నిపతన్తి. [కధం హీణకుసుమాదో వి సహఆరపాదవాదో మఅరన్దబిన్దఓ ణివడన్తి] (ప్రకాశమ్) ఆర్య, విజ్ఞాపయ తం ద్యూతకరం మమ వచనే నార్యచారుదత్తమ్ - 'అహ మపి ప్రదోష ఆర్యం ప్రేక్షితు మాగచ్ఛామి.' - ఇతి. [అజ్జ, విణ్ణవేహి తం జూదిఅరం మమ వఅణేణ అజ్జచారుదత్తమ్ - 'అహం పి పదోసే అజ్జం పేక్ఖిదుం ఆఅచ్ఛామి' - త్తి.

విదూ__(స్వగతమ్) కి మన్య త్తత్ర గత్వా గ్రహీష్యతి? [కిం అణ్ణం తహిం గదుఅ గేణ్హిస్సది] (ప్రకాశమ్) భవతి, భణామి

అనుమానించు చున్నట్లు ఆలస్యము చేసినందున - ఊతలపోతలతో, కిం తావత్ ... = ఏమి అమ్మ దీనిం దీసికొనదా? విహస్య - పెద్దగా నవ్వి, - చారుదత్తుని - యీపని మాటలు అన్నియు, అబద్ధమును, నిజమును దాఁచుటకును - పరువునకును, పడుపాట్లును అని - తన మనసునకు తెలియును గావునను, ఈహారము తనకు మరల నొక మాఱు చారుదత్తుం జూడఁబోవ నవకాశము కలిగించును గావునను, ఇంచుక హేళనమును గర్భమున ఉన్న పెద్దనవ్వు - ఇది. చెలి మొంగము చూచుచు - మైత్రేయ, ఎట్లు! తీసికొన కుందునా? అని చేతం గొని తన ప్రక్కన ఉంచుకొన్నది - తనలో అనుకొనుచున్నది. ఎట్లూ! పూలు లేనిదాని నుండియు, తీయమామిడినుండి పూఁదేనెబొట్లు రాలు చున్నవి! ప్రకాశమ్ - మైత్రేయునితో - అయ్యా, నామాటగా అజూదరికి చారుదత్తయ్యకు విన్నపించు. నేనును, మునుమాపున అయ్యాను చూడను వచ్చుచున్నాను - అని. స్వగతమ్ - వాఁడు అనుకొనుచున్నాఁడు - ఏమి ఇంకను దేనినైనను - దానికి ఇది చాలదు అని - అడిగి కైకొనఁగలదా? భవతి, భణామి = అమ్మా (అట్లే) చెప్పెదను - అని

(స్వగతమ్) 'నివర్తతా మస్మా ద్గణికాప్రసఙ్గాత్' ఇతి. [ణిఅత్త అదు ఇమాదో గణిఆపసఙ్గాదో త్తి]. (ఇతి నిష్క్రాన్తః.

వసన్త—చేటి, గృహాణైత మలంకారమ్. చారుదత్తమ్ అభిరన్తుం గచ్ఛామః. [హఞ్జే, గేణ్హ ఏదం అలంకారఅమ్. చారుదత్తం అహిరమిదుం గచ్ఛమ్హ].

చేటి—ఆర్యే పశ్య పశ్య, ఉన్నమ త్యకాలదుర్దినమ్. [అజ్జఏ పేక్ఖ పేక్ఖ, ఉణ్ణమది అకాల దుద్దిణమ్].

వసన్త—

శ్లో. ఉదయన్తు నామ మేఘా
భవతు నిశా వర్ష మవిరతం పతతు
గణయామి నైవ సర్వం
దయితాభిముఖేన హృదయేన. 33

చేటి, హారం గృహీత్వా శీఘ్ర మాగచ్ఛ. [హఞ్జే, హారం గేణ్హిఅ లహుం ఆఅచ్ఛ].

---

మనసున తాను చెప్పఁబోవుమాటలు ఇవి - 'చెప్పెదను' కు వేలు కమణాం దెప్పుచున్నాఁడు - 'మానుకొనవయ్యా మరల్చుకోవయ్యా మనసును - ఈబోగముప్రసంగము - ప్రస్తావము - నుండి - అని. అని వెడలిపోయినాఁడు. అభిరన్తుమ్ = సంతోషపెట్టుటకు - అతఁడు నగయిచ్చి సందేశము పంపినాఁడు - నేను బదులు ఆయనకడకే పోయి మంచిమాట చెప్పవలదా - వ్యవహారంపు నాణెమునకు - ఉన్నమతి - పైకొనుచున్నది - అకాలదుర్దినం - అకాలవర్షము. మొయిళ్ళు కమ్ముట.

శ్లో. 33. ఉదయన్తు ... = లేచును గాక మబ్బులు, అగును గాక రాత్రి, పడునుగాక వాన తెంపులేక, అన్నింటిని - దేనినింగూడ - లెక్కింపను - కాంతుమీఁదికి మళ్లిన చిత్తముతో.

నాకు మనసున అకోరిక, ఆయనం గలసికొనవలెనని పొడమినది - ఇఁక మానను, నిలువను, ఓసి హారముం గొని త్వరగా రావే.

[ఇతి నిష్క్రాన్తాః సర్వే]

మదనికా శర్విలకో నామ

చతుర్థో௨ఙ్కః

---

తాను దొంగిలించిన నగతో శర్విలకుఁడును, ఆయిల్లడతీర్పుకైన రత్నావళితో మైత్రేయుఁడును ఆయుదయముననే వసంతసేనయింటికి బయలుదేరినారు కదా.

వసంతసేన తా చారుదత్తుం జూచి ఇరువది దినాలు కావచ్చినది. విరాళి వినోదముగా చారుదత్తుని ఫలకాన చిత్రించి చూచుచు వినోదించుకొనుచున్నది.

ఇంతలో సంస్థానకుఁడు పదివేల మొహరీలనగతో కూడ బండి పంపినాఁడు, పోవే అన్న యమ్మసందేశముం దెచ్చిన చేటిని, ఇఁక నిట్టి సందేశములు పంపిన తాను ప్రాణత్యాగము చేయుదునని అమ్మకు ప్రతిసందేశించి పంపివేసినది.

అంతట వసంతసేన ఆచిత్రఫలకమును తన పడుకటింట పెట్టి, (వేసంగి కదా అని) విసనకఱ్ఱను త్వరగా తెమ్మన్నది మదనికను. ఆమెను అట్లే దానిం గొని మరలు దారిలో శర్విలకుఁడు కలసికొన్నాఁడు. తాను ఎంతయో సాహసమునకు ఓర్చి దాని నిష్క్రియమునకు చాలగల నగను దొంగిలించి తెచ్చితి నని చూపును. వీరి మాటలను వసంతసేన అందు తన పేరు వచ్చినందున పొంచి వినుచున్నది. ఆనగ చారుదత్తునింట వసంతసేన యుంచినదే, వసంతసేనదే, దానితో నెట్లు నిష్క్రియము అని, ఇఁక ఆబేరము చెడినదని మదనికా శర్విలకులు తలంతురు. మఱి నగను ఏమి సేయుట యని ఆలోచించి, మదనికసలహాతో, చారుదత్తుమానిసిగా శర్విలకుఁడు దానిని వసంతసేనకు ఇచ్చి పోఁదగునని యనుకొని, అట్లే శర్విలకుఁడు దానిని వసంతసేనకు ఇచ్చి పోఁదొడంగినాఁడు. ఈసంవిధానము నంతయు చూచుచు వినుచు నుండిన వసంతసేన వానిం బ్రతిసందేశముం గొనిపొమ్మని బిలిచి, చారుదత్తయ్య ఇది నాకు తెచ్చియిచ్చినవానికి మదనికను ఇమ్మన్నాఁడని యన్నది. అంతట శర్విలకుఁడు తన గుట్టంతయు తెలిసిపోయినదని ఎకరారుపడి చారుదత్తు గుణములం దలంచి పూజించి, వసంతసేనను మహోపకారిణినిగా నెంచి, మదనికం బుచ్చుకొని తన జనముకడకుం దరలి, ఇంతలో తన ప్రాణమిత్రము గోపాలబాలుఁడు ఆర్యకుఁడు రాజుచే పట్టి బంధింపఁబడినాఁడని విని, మదనికను దారిలో రేభిలభావయింటికిఁ బంపి తాను వానిని విడిపించు జతనములు సేయం బోయినాఁడు, ఇంతలో మైత్రేయుఁడు వచ్చి, తనకు వసంతచేటి అబంగళానం

తియు ఎంతయో గౌరవముగా చూపఁగా చూచి, ఆసంపదకు అబ్బురపడి వసంతసేనం గలసికొని చారుదత్తసందేశమును - బంగారునగను తాను జూదాన ఓడితిననియు, ఆజూదరి మరల దొరకలేదనియు దానికి బదులు ఆరత్నాలహారముం బంపితిననియు-అను దానిం జెప్పెను. వసంతసేన-చౌర్యమును జూదపుటోటమిగా చెప్పి, రత్నాలహారము పంపిన యాశౌండీర్యమునకు "అత ఏవ కామ్యతే" అని తన యనురాగము కలుజాలు తెగఁబాఱఁగా, తాను ఆప్రదోషముననే ఆయనం జూడ వత్తునని ప్రతిసందేశము పంపివేసి అందులకు కడంగినది.

అని - అందఱును నిష్క్రమింతురు

## మదనికా శర్విలకము అను
## ( మదనికా ప్రదానము )

### నాలవ యంకము

### ముగిసినది



# పఞ్చమోఽఙ్కః



(తతః ప్రవిశ త్యాసనస్థః సోత్కణ్ఠ శ్చారుదత్తః)

చారుదత్తః—(ఊర్ధ్వ మవలోక్య) ఉన్నమ త్యకాలదుర్దినమ్. యదేతత్

శ్లో. ఆలోకితం గృహశిఖణ్డిభి రుత్కలాపై
ర్హంసై ర్యియాసుభి రపాకృత మున్మనస్కైః
అకాలికం సపది దుర్దిన మన్తరిక్ష
ముత్కణ్ఠితస్య హృదయం చ సమం రుణద్ధి. ౧

తతః ప్రవిశతి ... = అంతట ఆసనమునం గూర్చుండి ఉత్కంఠితుఁడు - వసంతసేన వియోగముచే - ఆసంయోగము ఎట్లు కలుగునా అను కోరికగలవాఁడు ప్రవేశించుచున్నాఁడు చారుదత్తుఁడు - ఊర్ధ్వం అవలోక్య ... = ఊర్ధ్వం - పైకి - మింటివంక - చూచి - అకాలదుర్దినమ్ = అసమయమున, వర్ష కానప్పుడు, మేఘాలు కమ్మిన - వాన - దినము పైకొను చున్నదే - అనును. వాన మొయిలుదర్శనము ఉద్దీపకము.

శ్లో. ౧. గృహ శిఖణ్డిభిః = (ఇంటి) పెంపుడు నెమిళ్ళచేత, ఉత్కలాపైః = ఎగ విప్పిన పురులు గలవానిచేత, సంతోషముతో అట్లు పురులు విప్పుకొని - అనుట - ఆలోకితం = చూడఁబడినదియు, (భావేక్త) హంసైః = అంచలచేత, యియాసుభిః - (మానస సరస్సుకు) పోఁగోరినవియు, ఉన్మనస్కైః = ఉత్కంఠతో కూడినమనస్సు గలవియు, ఐనవానిచేత, అపాకృతం = నిరసింపఁబడినదియు, అగుచు, అకాలికం = కాలముకాని కాలాన కలిగినదియునగు, దుర్దినమ్ = ఈమబ్బుకమ్మిన (వాన)దినము, సపది = ఇప్పుడే, అన్తరిక్షం = ఆకసమును, ఉత్కణ్ఠితస్య హృదయం చ = వియోగమున, సంయోగము ఎట్లగునా అని కోరిక గలవాని హృదయమును - నాహృదయమును అనిభా. రెంటిని, సమం = ఒక్కమ్మడి, రుణద్ధి = ఆవరించుచున్నది - అడ్డగించుచున్నది.

అపి చ,

శ్లో. మేఘో జలార్ద్రమహిషోదరభృఙ్గనీలో
విద్యుత్ప్రభారచితపీతపటోత్తరీయః
ఆభాతి సంహతబలాకగృహీతశఙ్ఖః
ఖం కేశవో ఽపర ఇవాక్రమితుం ప్రవృత్తః. 2

అపి చ,

శ్లో. కేశవగాత్రశ్యామః కుటిలబలాకావలీరచితశఙ్ఖః
విద్యుద్గుణకౌశేయశ్చక్రధర ఇవోన్నతో మేఘః. 3

తటాలున ఉన్నట్టుండి మబ్బులుకమ్మినవి – అంతట సంతోషాన నెమిళ్ళు పురులు విప్పుకొన్నవి. మింట చూపు నిలిపినవి – ఆడనుం దొడంగినవి అనుట. అంచలకు ఇక్కడ ఇఁక నుండఁగూడదని మనసు కలఁత చెందినది. మానసమునకుం బోవ నాస కలిగినది. అవి మింటిని చీకొట్టినవి – తటాలున ఈ మేఘాడంబరము విరహుల మనస్సును అడ్డగించినది – వారికి ఏమియుతోఁపకుండఁ జేసినది. మింటిని కమ్మినది. తన యవస్థనే సూచించుచున్నాఁడు.

శ్లో. 2. జలార్ద్ర ... నీలః = నీటి తడితో నున్నవి కావున మఱియు నలుపెక్కిన ఎనుముకడుపువలెను తుమ్మెదలవలెను నల్లనై, విద్యుత్ ... = మెఱపుకాంతిచే అమర్పఁబడిన పీతాంబరోత్తరీయము గలదై, సంహత ... = మొత్తములైన కొంగలచే, శంఖముం గలది యై, మేఘః = మబ్బు, అపరః కేశవః ఇవ = మఱియొక కేశవుఁడో యన, ఖం = మింటిని, ఆక్రమితుం ప్రవృత్తః = కమ్మఁ దివిరినది.

త్రివిక్రమమున (రెండవ విక్రమమున =) మలిదాఁటున. పాదమున మింటిం గమ్మెను కదా, కేశవుఁడు – ఒండు కాలమునను ఇపుడు తాను కమ్మ విజృంభించిన నల్లని దేహమువాఁడు, పీతాంబరోత్తరీయుఁడు, చేత బలాకా ధవళ (పాంచజన్య) శంఖము గలవాఁడో! అట్లు కమ్మఁ బడినట్లున్నది, మిన్ను – నీటిమబ్బుచేత, మెఱుపుఁదీఁగతోడి దానిచేత, వెంటబలాకల గుంపు చేరుకఁగలదాని చేత.

శ్లో. 3. కేశవగాత్ర ... = కేశవుని ఒడలివలె నల్లనై, కుటిల ... = వంకర (వంపు) తిరిగిన కొంగల గుంపుచే ఏర్పఱుపఁబడిన శంఖము గలదై, మెఱుపుఁదీగెయను పచ్చపట్టు (ఉత్తరీయము) గలదై, మేఘః = మేఘము, చక్రధర ఇవ = విష్ణువువలె, ఉన్నతః = పైకి లేచినది.

శ్లో. ఏతా నిషిక్తరజతద్రవసంనికాశా
ధారా జవేన పతితా జలదోదరేభ్యః
విద్యుత్ప్రదీపశిఖయా క్షణనష్టదృష్టా
శ్ఛిన్నా ఇ వామ్బరపటస్య దశాః పతన్తి. ౪

శ్లో. సంసక్తై రివ చక్రవాకమిథునై ర్హంసైః ప్రడీనై రివ
వ్యావిద్ధై రివ మీనచక్రమకరై ర్హర్మ్యై రివ ప్రోచ్ఛ్రితైః
తై స్తై రాకృతివిస్తరై రనుగతై ర్మేఘైః సముభ్యున్నతైః
పత్రచ్ఛేద్య మి వేహ భాతి గగనం విశ్లేషితై ర్వాయునా. ౫

2 న చెప్పినదానినే ఇందును అంతగా మార్పులేకయే చెప్పినాఁడు. ఐనను ఏకొంతయో మార్పు గలదు. దేవునియా దాఁటు కవిభావనలో అంతయున్నది.

శ్లో. ౪. ఏతాః = ఇవిగో, నిషిక్త రజతద్రవ ... = (కరఁగి) కాఁచిన వెండినీటిం బోలి, జలదోదర ... = మేఘముల కడుపులనుండి వడితో పడిన (వాన) ధారలు, విద్యుత్ ప్రదీప ... = మెఱపు - అను పెద్దదీపజ్వాలచేత, క్షణ నష్టదృష్టాః = నిముసము అగపడి అంతలో అగపడకపోయినట్టివి, అమ్బర పటస్య = ఆకసమను వస్త్రముయొక్క తెగిన కొసలో యన పడుచున్నవి.

ఇవిగో వానధారలు పెల్లుగా పడుచున్నవి, మేఘాల కడుపునుండి మెఱపు పెద్ద జ్వాల తళుక్కున వెలుతురున (తెల్లగా) కరఁగిన వెండిధారలో యన పడుచున్నవి. మిన్నను వస్త్రముయొక్క తాల్పఁగా వ్రేలు తెగిన కొసలో యన పడుచున్నవి.

శ్లో. ౫. సంసక్తైః చక్రవాకమిథునైః ఇవ = ఒండొంటింగూడిన చక్రవాకముల - అలుగండ్ల - జంటలచేతనుం బోలెను, ప్రడీనైః హంసైః ఇవ = ఎగిరిన హంసలచేతనుం బోలెను, వ్యావిద్ధైః = పొడువఁబడినట్లు త్రుళ్ళిపడిన చేపల గుంపులచేతను మొసళ్ళచేతనుం బోలెను, ప్రోచ్ఛ్రితైః ... = మిక్కిలియు ఎత్తుగా పెరిఁగిన మేడలచేతనుం బోలెను, వాయునా విశ్లేషితైః = గాలిచేత, వేఱులు చేయఁబడినవై, చెదరఁగొట్టఁబడినవై, సముభ్యున్నతైః = మిక్కిలియు ఎత్తులోనున్నవై, తైః తైః ఆకృతివిస్తరైః = ఈ చెప్పఁబడినవియు, ఇంకను ఇతరములునైన రూపభేదముల పెంపుతో, అనుగతైః = కూడుకొన్నవైన మేఘముల చేత, ఇహ = ఇక్కడ, గగనం = ఆకసము, పత్త్రచ్ఛేద్యం ఇవ = పత్రభంగము

శ్లో. ఏతత్తద్ధృతరాష్ట్రవక్త్రసదృశం మేఘాన్ధకారం నభో
హృష్టో గర్జతి చాతిదర్పితబలో దుర్యోధనో వా శిఖీ
అక్షద్యూతజితో యుధిష్ఠిర ఇవాధ్వానం గతః కోకిలో
హంసాః సంప్రతి పాణ్డవా ఇవ వనాదజ్ఞాతచర్యాం గతాః. ౬

వలె - అలంకారార్థము నానాకారములుగా - కర్పూర చందన కుంకుమాదులతో మకరికాద్యాకారములతో గీయఁబడిన 'పత్రభంగము' అనఁబడు దానివలెనున్నది.

గాలిచే చెదరఁగొట్టఁబడి మేఘములు - మింట నానాకారములుగా - జక్కవజంటలవలెను హంసలవలెను చేపలగుంపువలెను మొసళ్లవలెను ఎత్తైన మేడలవలెను పర్వియున్నవి. దాన మిన్నే పత్త్రిభంగమువలెను, నానాకారముల గీతల బొమ్మలప్రోవువలె ప్రకాశించుచున్నది.

శ్లో. ౬. ఏతత్ తత్ నభః - ఇదిగో ఆయాకసము, మేఘా ... రం = మేఘముల చీకటితో కూడుకొన్నది, ధృత ... శం = ధృతరాష్ట్రుని మొగమువలె (నున్నది). రెండు కన్నులు లేమిచే వానికి మొగము పెనుకాఱుచీకటివలెనే యుండును, శిఖీ = నెమిలి, సంతోషముగలదై, ఎంతయు గర్వముతోడి బలముగలదై కూయుచున్నది, దుర్యోధనోవా = దుర్యోధనుఁడో యన, కోకిలః .. = కోయిల దారిలోకి - బాటలో వలసపోయినది. అక్షద్యూతజితః = పాచికల జూదాన గెలువఁబడిన యుధిష్ఠిరునివలె, ఇపుడు, హంసలు, వనాత్ = నీటినుండి (అడవినుండియు అని పాండవ పరము), అజ్ఞాతచర్యాం = ఎఱుంగఁబడక తిరుగాడుటను - మానసముకడ నుండుటను, (మత్స్యరాజాస్థానమున) పాండవా ఇవ = పాండవులవలె, గతాః = పొందినవి.

ఉపమేయములకు - ప్రకృతములకు, ఉపమానములు విధేయములుగా అన్వయము.

ఈ వర్షవృత్తము మహాభారతవృత్తముగా తోఁచుచున్నది. చీకట్లమిన్ను ధృతరాష్ట్రుని గ్రుడ్డి మొగమువలెను, పొగరుకొని సంతోషముతో కూయు నెమిలి దుర్యోధనునివలెను, కోకిల, దారిలోనికి వచ్చినది (కూయుట)యు - జూదాన ఓడి అడవిదారింబట్టిన యుధిష్ఠిరునివలెను, హంసలు నీళ్లుమానుకొని అగపడకుండ మానసమునకుం బోయినవి - పాండవులు అడవినుండి అజ్ఞాతవాసమునకుం బోయినట్లు, చారుదత్తునికి తన దారిద్ర్యమున ఈ పాండవవృత్తము స్మారితమైనది, ఉపమానముగా.

(విచిన్త్య) చిరం ఖలు కాలో మైత్రేయస్య వసన్తసేనాయాః సకాశం గతస్య. నా ద్యాపి ఆగచ్ఛతి.

[ప్రవిశ్య]

విదూ.—అహో గణికాయా లోభో ఉదక్షిణతా చ, యతో న కథాపి కృతాన్యా. అనేకధా స్నేహానుసారం భణిత్వా కిమపి, ఏవ మేవ గృహీతా రత్నావలీ. ఏతావత్యా ఋద్ధ్యా న త యాహం భణితః - 'ఆర్యమైత్రేయ, విశ్రమ్యతామ్. మల్లకేన పానీయ మపి పీత్వా గమ్యతామ్' ఇతి. తన్మా తావ ద్దాస్యాః పుత్త్రి గణికాయా ముఖ మపి ద్రక్ష్యామి. (సనిర్వేదమ్) సుష్ఠు ఖలూచ్యతే - 'అకన్ద(కర్దమ - పా)సముత్థితా పద్మినీ, అవఞ్చకో వణిక్, అచౌరః సువర్ణకారః, అకలహో గ్రామసమాగమః, అలుబ్ధా గణి

విచిన్త్య - ఆలోచించి, చాలసేపైనదికదా మైత్రేయుఁడు వసంతసేన కడకుం బోయి. ఇంకను రాకున్నాఁడు. ఇది మైత్రేయ ప్రవేశ సూచనయు, నగ పోవుట, తాను రత్నావళిం బంపుట - దీన వసంతసేన ఏమనుకొనునో అని అదే స్మరణగానున్నది.

అహో గణికాయాః లోభః - ఏమి బోగముదాని ఆస! పిసినితనము, పోమోటమి లేమియు. ఏలన - ఆట్లేల యందుననఁగా - వేరేమాట ప్రస్తావము కూడ చేయులేదు, అనేకధా ... పెక్కుభంగుల, స్నేహమువకుం దగినట్లు ఏమో పలికి, ఇట్లే రత్నావళిని తీసికొన్నది. ఏతావత్యా ఋద్ధ్యా ... = ఇంత సంపద తోను - ఈమాట - ఈపాటిమాట యైనను అనలేదు - మైత్రేయయ్యా, సేదదేఱ వయ్యా, మల్లకేన ... = చిప్పతో - టెంకాయచిప్పతో మంచినీళ్ళైనను త్రాఁగి పొమ్ము. - అని, తత్ మా తావత్ ... = కావున ఆ బోగము లంజెకూతు మొగ మైనను చూడఁబోను, సనిర్వేదమ్ - విసుకుతో - వైరాగ్యముతో - ఇది ఎంతయో చక్కఁగా చెప్పఁబడినది - అకన్ద ... = గడ్డలో మొలవని తామర, మోసము చేయని కోమటి, దొంగ కాని కంసాలి, జగడములేని పల్లె(జను)ల కూడిక, లుబ్ధ

కేతి దుష్కర మేతే సంభావ్యన్తే' - తత్ప్రియవయస్యం గత్వాస్మా ద్గణికా ప్రసఙ్గా న్నివర్తయామి. (పరిక్రమ్య దృష్ట్వా) కథం ప్రియ వయస్యో వృక్షవాటికాయా ముపవిష్ట స్తిష్ఠతి. త ద్యావ దుప సర్పామి. (ఉపసృత్య) స్వస్తి భవతే. వర్ధతాం భవాన్.

[అహో గణిఆఏ లోభో అదక్ఖిణదా అ, జదో ణ కధా వి కిదా అణ్ణా. అణేకహో సిణేహాణుసారం భణిఅ కిం పి, ఏమ మేఅ గహిదా రఅణావలీ. ఏత్తిఆఏ బుద్ధీఏ ణ తఏ అహం భణిదో - 'అజ్జమిత్తేఅ, వీసమీఅదు, మల్లకేణ పాణీఅం పి పిబిఅ గచ్ఛీఅదు' త్తి. తా మా దావ దాసీఏ ధీఆఏ గణిఆఏ ముహం పి పేక్ఖిస్సమ్. సుట్ఠు క్ఖు వుచ్చది. - అకన్ద సముత్థితా పఉమిణీ, అవఞ్చఓ వాణిఓ, అచోరో సువణ్ణఆరో, అకలహో గామసమాగమో, అలుద్ధా గణిఆ త్తి దుక్కరం ఏదే సంభావీఅన్తి'. తా పిఅవఅస్సం గదుఅ ఇమాదో గణిఆ పసఙ్గాదో ణివత్తావేమి. కధం పిఅవఅస్సో రుక్ఖ వాడిఆఏ ఉవవిట్ఠో చిట్ఠది. తా జావ ఉపసప్పామి. సోత్థి భవదే. వడ్ఢదు భవమ్.]

చారు — (విలోక్య) అయే, సుహృ న్మే మైత్రేయః ప్రాప్తః. వయస్య, స్వాగతమ్, ఆస్యతామ్.

విదూ — ఉపవిష్టో ఽస్మి. [ఉవవిట్ఠో మ్హి].

చారు — వయస్య, కథయ త త్కార్యమ్.

(పిసిని) కాని బోగముది, - అని ఇవి, కలుగుట చాల కష్టము అని, తత్ ... = కావున ప్రియవయస్యునికడకు పోయి ఈగణిక జోలినుండి మరల్చెదను - మాన్పెదను, కథం ... = ఏమి, ప్రియవయస్యుఁడు తోఁటలో కూర్చుండియున్నాఁడు. సమీపించి - స్వస్తి భవతే ... = స్వస్తి నీకు, దీర్ఘాయువవుకమ్ము - మేళ్ళు పొందుము.

కథయ తత్ కార్యం = చెప్పు ఆపనిని - ఏమైనదో చెప్పు - అనుట. వానికి అంత ఆత్రముగా ఉన్నది తన ఘరానాకై, తన ప్రియురాలియెడ, తత్ ...

విదూ—తత్ఖలు కార్యం వినష్టమ్. [తం క్ఖు కజ్జం విణట్టమ్].

చారు—కిం తయా న గృహీతా రత్నావలీ?

విదూ—కుతో ఽస్మాక మేతావ ద్భాగధేయమ్. నవనలిన కోమల మఞ్జలిం మస్తకే కృత్వా ప్రతీష్టా. [కుదో అమ్హాణం ఏత్తిఅం భావధేఅమ్. ణవణలిణకోమలం అఞ్జలిం మత్థఏ కదుఅ పడిచ్ఛిఅ].

చారు—తత్కిం బ్రవీషి వినష్ట మితి?

విదూ—భోః, కథం న వినష్టమ్? య దభుక్తపీతస్య చౌరై రపహృత స్యాల్పమూల్యస్య సువర్ణభాణ్డస్య కారణా చ్చతుః సముద్ర సారభుతా రత్నమాలా హారితా. [భో కథం ణ విణట్టమ్, జం అభుత్తపీదస్స చోరేహిం అవహిదస్స అప్పముల్లస్స సువణ్ణభణ్డా అస్స కారణాదో చదుస్సముద్దసారభూదా రఅణమాలా హారిదా].

---

నష్టం = అపని నాశనమైనదిగదా, కిం తయా ... = ఏమి ఆమెచేత రత్నావళి తీసికొనఁబడలేదా? కుతః అస్మాకం ... = మనకు అంత అదృష్టమెక్కడిది? క్రొందామరయంత కోమలముగా - అందముగా - బోగముదాని నేర్పుతో అనుట - తన తలపై కేలు మొగిడ్చి, గ్రహింపఁబడినది, తత్ కిం ... = మఱి ఏమిటి నష్టమైనది అంటివే, భోః కథం ... = ఓయి ఎట్లు నష్టము కాలేదు? ఏలన - తినని(యు) త్రాఁగని(యు) దానియొక్క, దొంగలచే అపహరింపఁబడిన దాని యొక్క, కొద్ది వెలగలదాని యొక్క, బంగారునగయొక్క కారణమువలన, నలు సముద్రముల సారమైన - అంత మేలి రత్నములదైన - రత్నావళి పోఁగొట్టుకొనఁ బడినది - కైకొనునట్లు చేయఁబడినది.

ఆకేల్మోడ్పును, గ్రహణమును, చారుదత్తుఁడు చిత్తాన సరిగానే గ్రహించి నాఁడు. కావున, వయస్య మా మా ఏవమ్ - వయస్యా, కాదు, అట్లు కాదు -

చారు — వయస్య, మా మైవమ్.

శ్లో. యం సమాలమ్బ్య విశ్వాసం న్యాసో ఽస్మాసు తయా కృతః
తస్యైత న్మహతో మూల్యం ప్రత్యయస్యైవ దీయతే. ౮

విదూ — భో వయస్య, ఏత దపి మే ద్వితీయం సన్తాప కారణం య త్సఖీజనదత్తసంజ్ఞయా పటాన్తాపవారితం ముఖం కృత్వాహ ముపహసితః. త దహం బ్రాహ్మణో భూ త్వేదానీం భవన్తం శీర్షేణ పతిత్వా విజ్ఞాపయామి — 'నివర్త్యతా మాత్మా స్మా ద్బహుప్రత్యవాయా ద్గణికాప్రసఙ్గాత్' — గణికా నామ పాదుకాన్తరప్రవి ష్టేవ లేష్టుకా దుఃఖేన పున ర్నిరాక్రియతే. అపి చ భో వయస్య, గణికా హస్తీ కాయస్థో భిక్షు శ్చాటో రాసభ శ్చ య త్రైతే నివసన్తి తత్ర దుష్టా అపి న జాయన్తే.

---

శ్లో. ౮. చూ. III - 29.

వయస్య - ఏతత్ అపి ... = వయస్యుఁడా, ఇదియు నా సంతాపమునకు - దుఃఖమునకు రెండవ కారణము - యత్ ... = ఏదనఁగా సఖులకు సన్న చేసి, గుడ్డచే మొగము కనఁబడనీక అడ్డము పెట్టి, కప్పికొని అనుట - (దానిచే) నేను నవ్వఁబడితిని - హేళనము చేయఁబడితిని - చతుర్థాంకాంతమున రత్నావళిం గొనుచో ఇట్లన్నది కదా - చూ. పు - 'విహస్య సఖీముఖం దృష్ట్వా, మైత్రేయ కథం న గ్రహీష్యామి ... - ఇత్యాది దానిని వసంతసేన అటను చారుదత్తుఁడు ఇటను సరిగా గ్రహించిరి. ... = అహం బ్రాహ్మణః - నేను బ్రాహ్మణుఁడను తలతో పడి - నీపాదాలకు తల తాఁకించి - విన్నవింతును, బహుప్రత్యవాయాత్ = అనేక దోషములున్నందువలన, పాదుకాన్తం ప్రవిష్టా = ముచ్చెలో దూఱిన మట్టి తునుక - గులక వలె, చాలకష్టముతో తొలగింపఁబడును - అపిచ ... = మఱియు, భోగముది - (సర్వస్వము హరించునది), ఏనుఁగు - (అసాధ్యపు వ్యయము చేయించునది - మేఁతకు గీతకు,) కాయస్థుఁడు - (దొంగలెక్కలువ్రాసి దివాలా తీయించును) సన్న్యాసి - (వైరాగ్య ముపదేశించుచు - ఏసుఖమును అనుభవింపనీఁడు.) చాటుఁడు, దూబగాఁడు, మెల్లఁగా స్నేహము సంపాదించి, దుర్వ్యయాదులు చేయించి దుర్మార్గమున నడిపించి కొల్లగొట్టి నాశనముచేయు మోసగాఁడు. రాసభః చ = గాడిదయు - (పైరు మేసివేయును, దర్శనమే అశుభావహ మందురు.)

[భో వఅస్స, ఏదం పి మే దుదిఅం సంతావకారణం జం సహీఅణదిణ్ణ సంణ్ణాప పడన్తోవారిదం ముహం కదుఅ అహం ఉవహసిదో. తా అహం బమ్హణో భవిఅ దాణిం భవన్తం సీసేణ పడిఅ విణ్ణవేమి – 'ణివత్తిఅదు అప్పా ఇమాదో బహుపచ్చవాఆదో గణిఆపసఙ్గాదో' – గణిఆ ణామ పాదుఅన్తరప్పవిట్ఠా విఅ లేట్టుఆ దుక్ఖేణ ఉణ ణిరాకరీఅది. అవిఅ భో వఅస్స, గణిఆ హత్థీ కాఅత్థో భిక్ఖు చాటో రాసహో అ జహిం ఏదే ణివసన్తి తహిం దుట్ఠా వి ణ జాఅన్తి].

చారు—వయస్య, అల మిదానీం సర్వం పరివాద ముక్త్వా. అవస్థ యై వాస్మి నివారితః. పశ్య,

శ్లో. వేగం కరోతి తురగ స్త్వరితం ప్రయాతుం
ప్రాణవ్యయా న్న చరణాస్తు తథా వహన్తి
సర్వత్ర యాన్తి పురుషస్య చలాః స్వభావాః
ఖిన్నా స్తతో హృదయ మేవ పున ర్విశన్తి. ౮

---

వారు, అవి యున్నచోట దుష్టులు సయితము – పుట్టరు – వర్ధిల్లరు – అనుట. అలం ... ఉక్త్వా – ఈదూషణ మెల్ల చెప్పవలదు – 'అల' మనకు 'క్త్వా' యోగమునను నిషేధము అర్థము – అవస్థయాఏవ ... = అవస్థచేతనే – నా పేదతనముచేతనే – నేను ఏమియు (అట్టివి) చేయకుండ – భోగముదాని పొందు మొదలైనవి చేయకుండ, మాన్పఁబడితినే. చూడు – చారుదత్తుఁడు ఉత్కంఠ గట్టుపోగలినను, ఈమైత్రేయునికి పట్టియియ్యఁడు. గబ్బిగానే పలుకుచున్నాఁడు,

శ్లో, ౮. తురగః = గుఱ్ఱము, త్వరితం ప్రయాతుం = వడిగా పోవుటకు, వేగంకరోతి = వేగ (ప్రయత్నము – పూనికను – అనుకొనుటను,) మును చేయును. తు = కింతు = కాని, ప్రాణ వ్యయాత్ = (ముసలితనము మొదలైనకారణములచేత) బలము తఱుగుటవలన, చరణాః=కాళ్లు, న తథా వహన్తి = అట్లు – ప్రయత్నమునకు తగినట్లుగా – పాఱవు, పరువెత్తవు – పురుషస్య = మానిసియొక్క, చలాః స్వభావాః = చంచలములైన (స్వ =) సొంత (భావాః = ) అభిప్రాయములు,

అపి చ వయస్య,

శ్లో. యస్యార్థా స్తస్య సా కాన్తా ధనహార్యో హ్యసౌ జనః
(స్వగతమ్) న గుణహార్యో హ్యసౌ జనః (ప్రకాశమ్) -
వయ మర్థైః పరిత్యక్తా నను త్యక్తైవ సా మయా. ౯

---

సర్వత్ర యాన్తి = అంతటను - మనోవేగముతో ననుట - పోవును, (పోయి, ఏమియు చేయలేక) ఖేదము - అలపు - చెందినవై, తతః = అక్కడినుండి, హృదయం ఏవ = మనసునే, పునః విశన్తి = మరల ప్రవేశించును.

గుఱ్ఱము ముసలిదై బక్క - చిక్కినది - కమిచీదెబ్బ తగులునేమో యని, తగిలినను గూడ, అది యెంత ప్రయత్నించినను - బలము తఱిగిపోయినందున, కాళ్లు రానందున, అట్లు పోఁజాలదు. మానిసి మనసులో భావములు, అతి చపలములు - అనుకొనునంతలో ప్రపంచ మంతయు చుట్టి రాఁగలవు - మఱి ఏమియు సాధింపలేక దుఃఖముతో, ఎక్కడినుండియు, మరల మనసునే ప్రవేశించును. దరిద్రునికి కోరికలు ఉన్నను ఫలించునా అనుట.

ఈ సంవాదముం గన నగు - (V. 8)

ఉత్థాయ హృది లీయన్తే దరిద్రాణాం మనోరథాః
బాల్యవైధవ్యదగ్ధానాం కులస్త్రీణాం కుచా ఇవ.

శ్లో. ౯. యస్య అర్థాః = ఎవనికి ధనమో - ధనము కలదో అనుట, తస్య సా కాన్తా = వానికి ఆ కాంత, చెలువ. హి = ఏలన, అసౌ జనః = ఈజనము భోగముది. ధనహార్యః = ధనముచే పొందఁదగినది - వెలయాలు గదా - వెలకు ఆలు. తనలో అనుకొనును - న గుణహార్యః ... = గుణములచే - సత్యశౌచ శీలాదులచే, పొందఁగినది కాదే - వయం = నేను, అర్థైః = సంపదచే - ధనముచే, పరిత్యక్తాః = విడువఁబడినవాఁడను, (కావున) సా = ఆమె - ఆసాని, మయా త్యక్తా ఏవ నను = నాచే విడిచిపెట్టఁబడినదే కదా - నేను దానిని మానుకోవలసినదే కదా.

కావున నీకెందులకు ఆదిగులు, అది నన్నేమేని చేయు నని. అది దరిద్రుఁడనైన నాకడకు ఏల వచ్చును? రానేరాదు,

విదూ—(అధో ఽవలోక్య స్వగతమ్) య ధైష ఊర్ధ్వం ప్రేక్ష్య దీర్ఘం నిశ్వసితి, తథా తర్కయామి మయా వినివార్యమాణ స్యాధికతరం వృద్ధా స్యోత్కణ్ఠా. త త్సుష్ఠు ఖ ల్వేవ ముచ్యతే - 'కామో వామః' ఇతి. (ప్రకాశమ్) భో వయస్య, భణితం చ తయా - భణ చారుదత్తమ్ - 'అద్య ప్రదోషే మ యా ప్రాగ న్తవ్యమ్' ఇతి. త త్తర్కయామి రత్నావల్యా అపరితు ష్టాపరం యాచితు మాగమిష్య తీతి.

[జధా ఏసో ఉద్ధం పేక్ఖిఅ దీహం ణిస్ససది, తధా తక్కేమి మఏ ణివారిఅన్తస్స అధిఅదరం వడ్ఢిదా సే ఉక్కణ్ఠా. తా సుట్ఠు క్ఖు ఏవ్వం వుచ్చది - 'కామో వామో' త్తి. భో వఅస్స, భణిదం అ తాఏ - భణేహి చారుదత్తమ్ - 'అజ్జ పదోసే మఏ ఏత్థ ఆఅన్తవ్వం' త్తి. తా తక్కేమి రఅణావలీఏ అపరితుట్టా అవరం మగ్గిదుం ఆఅమిస్సది త్తి].

చారు—వయస్య, ఆగచ్ఛతు. పరితుష్టా యాస్యతి.

యథా ఏష ఊర్ధ్వం ప్రేక్ష్య ... = ఎట్లు - ఏకారణాన - ఇతఁడు పైకి చూచి, బిట్టు నిట్టూర్చుచున్నాఁడో, అట్లు - ఆకారణాన ఊహించుచున్నాను - నాచే మాన్పఁబడుకొలఁదియు ఇతనికి ఉత్కంఠ - పొందఁగోరిక - వసంతసేనా విరహమునం గలిగినది - పెరిగినది అని. కావున ఇట్లు చెప్పఁబడునే - సామెత - అది లెస్స - కదా - ఏమనఁగా - 'కామో వామః' - కాముఁడు ప్రతికూలుఁడు, వంకరవాఁడు - అని. నా తగ్గింపుఁకు మాన్పుటకు నైన ప్రయత్నాన వృద్ధి పొందు టయు, ఆవంకకు మఱింత మరలుటయు కలుగును - తత్ = కావున, తర్క యామి ... = ఊహింతును, - రత్నహారమునకు తృప్తిపడక ఇంకను ఏమేని (ఇమ్మని) అడుగుటకు రాఁగలదు - అని. పరితుష్టా యాస్యతి = తృప్తిపడినదై, పోఁగలదు. మనసున చారుదత్తుఁడు వసంతసేన చిత్తమును చక్కఁగా కనిపట్టును, మైత్రేయుని మాటలతోఁ పని లేదు.

చేటః—(ప్రవిశ్య) అవేత మానవాః, [అవేధ మాణహే],

శ్లో. యథా యథా వర్ష త్యభ్రఖణ్డం
తథా తథా తిమ్యతి పృష్ఠచర్మ
యథా యథా లగతి శీతవాత
స్తథా తథా వేపతే మే హృదయమ్. ౧౦

[జధా జధా వర్శ్యతి అమ్భఖణ్డే
తధా తధా తిమ్మది పుట్ఠిచమ్మే
జధా జధా లగ్గది శీదవాదే
తధా తధా వేవది మే హలక్కే].

(పశ్య)

శ్లో. వంశం వాదయామి సప్తఛిద్రం సుశబ్దం
వీణాం వాదయామి సప్తతన్త్రీం నదన్తీమ్

---

అపేత మానవాః - మానవులారా, తొలఁగుఁడు.

శ్లో. ౧౦. యథా యథా వర్షతి అభ్రఖణ్డం = మబ్బుతునుక, ఎట్లెట్లు - ఎంతెంత - వర్షించుచున్నదో - తథా ... = అట్లట్లు అంతంత, పృష్ఠచర్మ = వీఁపు (మీఁది) తోలు, తిమ్యతి = (తిమ్మిరిగా) తడియుచున్నది. (వానలో నడచుటచేత.) యథా యథా = ఎట్లెట్లు - ఎంతెంత - చల్లగాలి తగులుచున్నదో, అట్లట్లు - అంతంత - నాగుండె అదరుచున్నది.

వీనిది పైన ఉత్తరీయపుఁ గప్పు లేనిపాటి యొడుపే - కావున వానకొలఁది వీఁపు తడియుచున్నది - గుండె - ఱొమ్ము - అదరుచున్నది.

ప్రహస్య - పెద్దనవ్వుఁ నవ్వి -

శ్లో. ౧౧. సప్తచ్ఛిద్రం సుశబ్దమ్ ... = ఏడు రంధ్రములుగలదియు మధురమైన (పెద్ద) శబ్దముగలదియు నగు పిల్లనగ్రోవిని వాయింతును - వీణాం ... = వీణెను, ఏడుతంత్రులుగలిగి మొరయుచున్నదానిని వాయింతును. గర్దభస్య అను

గీతం గాయామి గర్దభ స్యానురూపం
కో మే గానే తుమ్బురు ర్నారదో వా. ౧౧

[వంశం వాప శత్తఛిద్దం శుశద్ధం
వీణం వాప శత్తతన్తిం ణదన్తిమ్
గీఅం గాప గద్దహ శ్శాణులూఅం
కే మే గాణే తుమ్బులూ ణాలదే వా].

ఆజ్ఞప్తోఽస్మి ఆర్యయా వసన్తసేనయా - 'కుమ్భీలక, గచ్ఛ త్వమ్. మ మాగమన మార్యచారుదత్తస్య నివేదయ.' ఇతి. త ద్యావ దార్యచారుదత్తస్య గేహం. గచ్ఛామి. (పరిక్రమ్య ప్రవిష్టకేన దృష్ట్వా) ఏష చారుదత్తో వృక్షవాటికాయాం తిష్ఠతి. ఏషో ఽపి స దుష్టవటుకః. త ద్యావ దుపసర్పామి. కథ మాచ్ఛాదితం ద్వారం వృక్షవాటికాయాః. భవతు. ఏతస్య దుష్టవటుకస్య సంజ్ఞాం దదామి. (ఇతి లోష్టగుటికాః క్షిపతి).

---

రూపం = గాడిదకు తగిన - సమానమైన, గీతం గాయామి = పాట పాడెదను, గానే మే = పాటలో నాకు, తుంబు ... = కః - అతఁడుగాని ఇతఁడుగాని ఎవఁడు. నాముందు వారు ఎక్కడ, ఏపాటి? చేటుఁడు బోగముదానియింటి నౌకరు - భాష, భావము, సంభాషణలో, దానికిం దగినట్లు త్రుళ్లుపాటు కలిగి ఉండును. అధికప్రసంగము కలిగి యుండును. ఆయింట నుండువాఁడు గావున, అక్కడ వానికి అన్ని వాద్యములు, నోటిపాట, కొంతపరిచితములే. ఎవరు లేక చూచి ఒక్కొక్కదానిని మోగించి చూచుచుండును. నోటనుం బాడుచునే యుండును. ఈ పెద్దయింటికి వచ్చినందున నోరు చేతులు పురపురలాడుచున్నవి.

నివేదయ - తెలుపుము - ఏష చారుదత్తః ... = వీఁడుగో చారుదత్తుఁడు తోఁటలో ఉన్నాఁడు - స్వగతమున ఈబోగమింటివానికి - చారుదత్తనామము నకు 'అయ్య' కూడ లేదు. మైత్రేయుని, బాపని ఇట్లు అనును. దుష్టవటుకః - కొంటెవడుగు. సంజ్ఞాం దదామి = సన్న చేసెదను. లోష్ట గుటికాః క్షిపతి = మట్టి

[ఆణత్తమ్హి అజ్జఆఏ వసన్తశేణాఏ - 'కుమ్భీలఆ, గచ్ఛ తుమమ్. మమ ఆగమణం అజ్జచారుదత్తశ్శ ణివేదేహి' త్తి. తా జావ అజ్జచారుదత్తశ్శ గేహం గచ్ఛామి. ఏశే చాలుదత్తే రుక్ఖవాడిఆఏ చిట్ఠది. ఏశే వి శే దుట్టవడుకే. తా జావ ఉవశప్పామి. కధం ఢక్కిదే దువాలే రుక్ఖవాడిఆఏ. భోదు. ఏదశ్శ దుట్టవడుకశ్శ శణ్ణం దేమి].

విదూ___అయే, క ఇదానీ మేష ప్రాకారవేష్టిత మివ కపిత్థం మాం లోష్టకై స్తాడయతి. [అఏ, కో దాణిం ఏసో పాఆరవేట్టిదం విఅ కఇత్థం మం లోట్టకేహిం తాడేది].

చారు___ఆరామప్రాసాదవేదికాయాం క్రీడద్భిః పారావతైః పతితం భవేత్.

విదూ___దాస్యాఃపుత్ర, దుష్టపారావత, తిష్ఠ తిష్ఠ యావదేతేన దణ్డకాష్ఠేన సుపక్వ మివ చూతఫల మస్మాత్ప్రాసాదాద్భూమౌ పాతయిష్యామి. [దాసీఏపుత్త దుట్టపారావఅ, చిట్ఠ చిట్ఠ, జావ ఏదిణా దణ్డకట్ఠేణ సుపక్కం విఅ చూఅఫలం ఇమాదో పాసాదాదో భూమిఏ పాడఇస్సమ్]

(ఇతి దణ్డకాష్ఠ ముద్యమ్య ధావతి.

చారు___(యజ్ఞోపవీత ఆకృష్య) వయస్య, ఉపవిశ. కిమనేన. తిష్ఠతు దయితాసహిత స్తపస్వీ పారావతః.

పెళ్లయుండలు వేయుచున్నాఁడు - ప్రాకారవేష్టితం కపిత్థం ఇవ - (ఎక్కనీక) వెలుఁగు - వరణము - చే చుట్టఁబడిన వెలఁగనుం బోలె (కాయలకై చెట్టుంబోలె) నన్ను మంటిపెళ్లలం గొట్టుచున్నాఁడు, ఆరామప్రాసాద ... = బంగాళా యరఁగు మీఁద నాఁడుకొను పావురాళ్లు పడవేసియుండును - దాస్యాఃపుత్ర దుష్టపారావత ... = లంజాకొడుకా కొంటెపావురమా, ఉండు ఉండు - ఈకఱ్ఱతో బాగుగా పండినమామిడిపండుంబోలె, మేడనుండి నేలపై పడునట్లు కొట్టెదను. యజ్ఞోపవీతం ఆకృష్య = జందెమును లాఁగి - అది తెగునని ఇఁక కదలకుండుమ - దిశః

చేటః—కథం పారావతం పశ్యతి. మాం న పశ్యతి. భవతు. అపరయా లోష్టగుటికయా పున రపి తాడయిష్యామి. [కథం పారావదం పేక్ఖది. మం ణ పేక్ఖది. భోదు. అవరాఏ లోట్టగుడికాఏ పుణో వి తాడఇస్సమ్]. (తథా కరోతి.

విదూ—(దిశో ఽవలోక్య) కథం కుమ్భీలకః. త ద్యావ దుపసర్పామి. (ఉపసృత్య, ద్వార ముద్ఘాట్య) అరే కుమ్భీలక, ప్రవిశ, స్వాగతం తే. (కథం కుమ్భీలఓ. తా జావ ఉవసప్పామి. అరే కుమ్భీలఅ, ప్రవిశ. సాఅదం దే].

చేటః—(ప్రవిశ్య) ఆర్య, వన్దే. [అజ్జ, వన్దామి].

విదూ—అరే, కుత్ర త్వమీదృశే దుర్దినే ఽన్ధకార ఆగతః. [అరే, కహిం తుమం ఈదిసే దుద్దిణే అన్ధఆరే ఆఅదో].

చేటః—అరే, ఏషా సా. [అలే, ఏశా శా].

విదూ—కైషా, కా. [కా, ఏశా శా].

చేటః—ఏషా సా. [ఏశా శా].

విదూ—కి మిదానీం దాస్యాఃపుత్ర, దుర్భిక్షకాలే వృద్ధరజ్జు ఇ వోర్ధ్వకం శ్వాసాయసే–'ఏషా సా సా'–ఇతి. [కిం దాణిం దాసీఏ పుత్తా, దుబ్భిక్ఖకాలే వుడ్ఢరజ్జూ విఅ ఉద్ధకం సాసాఅసి–'ఏసా సా సే' త్తి.

అవలోక్య-(నలు) దిక్కులు చూచి_కథం కుమ్భీలకః! ఓహో కుంభీలకుఁడు! ద్వారం ఉద్ఘాట్య - వాకిలి తెఱచి, అరే, కుత్ర ... = ఓరి, ఎక్కడరా నీవు ఈ వానలోను చీకటిలోను వచ్చితివి. అరే ఏషా సా ... = ఒరే ఇదిగో ఆమె_కా ఏషా కా - ఎవరురా, ఎవరురా ఆమె_కిం ఇదానీం ... = ఏమి_ఎందులకు - ఇప్పుడు కఱవుకాలాన ముసలిసన్నాసివలె ఎగశ్వాసించెదవు_ఆయాసపడెదవు -

చేటః—అరే, త్వమ పీదానీ మిన్ద్రమహాకాముక ఇవ సుష్ఠు కిం కా కా ఇతి. [అలే, తుమం పి దాణిం ఇన్దమహాకాముకో విఅ సుట్ఠు కిం కాకాఅసి - 'కాకే' త్తి]

విదూ—తత్కథయ. [తా కహేహి].

చేటః—(స్వగతమ్) భవతు. ఏవం భణిష్యామి. (ప్రకాశమ్) అరే ప్రశ్నం తే దాస్యామి [భోదు. ఏవ్వం భణిశ్శమ్. అలే, పణ్హాం తే దఇశ్శమ్].

విదూ—అహం తే మస్తకే పాదం దాస్యామి. [అహం దే ముణ్డే గోడ్డం దఇశ్శమ్].

చేటః—అరే, జానీహి తావత్, తేన హి. కస్మిన్ కాలే చూతా ముకులితా భవన్తి. [అలే, జాణాహి దావ, తేణహి. కశ్శిం కాలే చూఆ మోాలేన్తి].

విదూ—అరే దాస్యాఃపుత్ర, గ్రీష్మే. [అరే దాసీఏ పుత్తా, గిమ్హే].

చేటః—(సహాసమ్) అరే, నహి నహి. [అలే, ణహి ణహి].

విదూ—(స్వగతమ్) కిమిదానీ మత్ర కథయిష్యామి. (విచిన్త్య) భవతు చారుదత్తం గత్వా ప్రక్ష్యామి. (ప్రకాశమ్)

---

ఏషా సా సా సా సా అని. అరే త్వం అపి - ఓరి నీవును ఇంద్రోత్సవమునకై ఆస గొన్నవానివలె బాగుగా కాకివలె కా కా కా కా అని యనుచున్నావే. తత్ కథయ - కావున అదేమో చెప్పు - ఒరే నేను నీ కొక ప్రశ్నఇత్తును - ని న్నొక ప్రశ్న యడిగెదను - అనుట. అహం తే మస్తకే ... = నేను నీతలపై పాదము ఉంతును - జవాబు చెప్పి ఓడింతును, అడుగురా - అనుట - అరే జానీహి ... = తేన హి - అట్లైని, నీవు అంతటివాఁడవేని - ఎఱుఁగుదువా ... చెప్పుము, ఏకా లాన మామిళ్లు మొగ్గలొడుగును ? ఓరి లంజాకొడుకా, ఎండకాలమునరా - వాని జవాబునకు వానికి నవ్వువచ్చినది. ఓరి కాదు కాదు. కిం ఇదానీమ్ ... మఱి యిపుడు ఏమి చెప్పుదును - కానీ, పోయి చారుదత్తుని అడిగెదను. ఓరి రవంత సేపు ఉండు -

అరే, ముహూర్తకం తిష్ఠ. (చారుదత్త ముపసృత్య) భో వయస్య, ప్రక్ష్యామి తావత్, కస్మి న్కాలే చూతా ముకులితా భవన్తి. [కిం దాణిం ఏత్థ కహిస్సమ్. భోదు, చారుదత్తం గదుఅ పుచ్ఛిస్సమ్. అరే ముహుత్తఅం చిట్ఠ. భో వఅస్స, పుచ్ఛిస్సం దావ, కస్సిం కాలే చూఆ మోఉలేన్తి].

చారు—మూర్ఖ, వసన్తే.

విదూ—(చేట ముపగమ్య) మూర్ఖ, వసన్తే. [ముక్ఖ, వసన్తే].

చేటః—ద్వితీయం తే ప్రశ్నం దాస్యామి. సుసమృద్ధానాం గ్రామాణాం కా రక్షాం కరోతి. [దుదిఅ దే పణ్హం దఇశ్శమ్. శుశమిద్ధాణం గామాణం కా లక్ఖఅం కలేది].

విదూ—అరే, రథ్యా, [అరే రచ్ఛా]

చేటః—(సహాసమ్) అరే, నహి నహి. [అలే, ణహి ణహి].

విదూ—భవతు, సంశయే పతితో ఽస్మి. (విచిన్త్య) భవతు చారుదత్తం పునరపి ప్రక్ష్యామి. [భోదు, సంసఏ పడిదమ్హి. భోదు, చారుదత్తం పుణో వి పుచ్ఛిస్సమ్).

(పున ర్నివృత్య చారుదత్తం తథై వోదాహరతి

చారు—వయస్య, సేనా.

---

మూర్ఖ - అది తెలియదటయ్యా - వసంతమున. ద్వితీయం తే ... = నీకు రెండవ ప్రశ్న యిత్తును - సుసమృద్ధానాం ... = మంచి సంపన్నములైన గ్రామములకు ఏది రక్షణ ఒసగును? రథ్యా = రస్తా... కాదు కాదు - భవతు ... కానీ సంశయాన పడితిని. కానీ - మరలను చారుత్తుని అడిగెదను - తథైవ ఉదాహరతి - చేటుని మాటలను ఉన్నవి ఉన్నట్లుగా చెప్పును - సుసమృద్ధానాం ...

విదూ—(చేట ముపగమ్య) అరే దాస్యాఃపుత్ర, సేనా. [అరే దాసీప పుత్తా, సేణా.]

చేటః—అరే, ద్వే అ ప్యేకస్మి న్కృత్వా శీఘ్రం భణ. [అలే, దువే వి ఏక్కశ్శిం కదుఅ శిగ్ఘం భణాహి].

విదూ—సేనావసన్తే. [సేణావసన్తే].

చేటః—నను పరివర్త్య భణ. [ణం పలివత్తిఅ భణాహి].

విదూ—(కాయేన పరివృత్య) సేనా వసన్తే. [సేణా వసన్తె].

చేటః—అరే మూర్ఖ వటుక, పదే పరివర్తయ. [అలే ముక్ఖ బడుకా, పదాఇం పలివత్తావేహి].

విదూ—(పాదౌ పరివర్త్య) సేనా వసన్తె. [సేణా వసన్తె].

చేటః—అరే.మూర్ఖ, అక్షరపదే పరివర్తయ. [అలే ముక్ఖ. అక్ఖలపదాఇం పలివత్తావేహి].

విదూ—(విచిన్త్య) వసన్తసేనా. [వసన్తసేణా].

చేటః—ఏషా సాగతా. [ఏశా శా ఆఅదా].

విదూ—త ద్యావ చ్చారుదత్తస్య నివేదయామి. [ఉపసృత్య] భో చారుదత్త ధనిక స్తె ఆగతః. [తా జావ చారుదత్తస్స ణివేదేమి. భో చారుదత్త, ధణిఓ దే ఆఅదో].

---

ఇత్యాదిని, ఓరి లంజాకొడుకా, సేనరా. ద్వే అపి ఏకస్మిన్ కృత్వా = రెంటి నొక్కటచేసి. శీఘ్రం భణ = త్వరగాపలుకు. సేనా వసన్తే..., పరివర్త్య - మళ్లించి = కాయేన పరివృత్య - దేహములో - దేహమును - త్రిప్పి, పదే - అడుగులను ..., మూర్ఖ వటుక - తెలివిలేనివాఁడా, వడుగా - (కాలి అడుగులను కాదు) - త్రిప్పి చెప్పరా. విచిన్త్య - ఆలోచించి - వసన్తకు - విభక్తి తొలఁగించి తెలివిగా అనుట - వసన్తసేనా - ఏషా సా ఆగతా = ఇదిగో ఆమె వచ్చినది. ధనికో తే ఆగతః - నీ ధనికుఁడు వచ్చినాఁడు - నాకెవఁడు ధనికుఁడు - మాకుల

చారు—కుతో ఽస్మత్కులే ధనికః.

విదూ—యది కులే నాస్తి, తద్ద్వారే ఽస్తి. ఏషా వసన్తసేనాగతా. [జఇ కులే ణత్థి, తా దువారే అత్థి. ఏసా వసన్తసేణా ఆఅదా].

చారు—వయస్య, కిం మాం ప్రతారయసి.

విదూ—యది మే వచనే న ప్రత్యయసే, తదియం కుమ్భీలకం పృచ్ఛ. అరే దాస్యాఃపుత్ర కుమ్భీలక ఉపసర్ప. [జఇ మే వఅణే ణ పత్తిఆఅసి, తా ఏదం కుమ్భీలఅం పుచ్ఛ. అరే దాసీఏ పుత్తా కుమ్భీలఅ. ఉవసప్ప].

చేటః—(ఉపసృత్య) ఆర్య, వన్దే. [అజ్జ వన్దామి].

చారు—భద్ర, స్వాగతమ్. కథయ సత్యం ప్రాప్తా వసన్తసేనా ?

చేటః—ఏషా సాగతా వసన్తసేనా. [ఏశా శా ఆఅదా వశన్తశేణా].

చారు—(సహర్షమ్) భద్ర, న కదాచిత్ప్రియవచనం నిష్ఫలీకృతం మయా. తద్గృహ్యతాం పారితోషికమ్.

[ఇత్యుత్తరీయం ప్రయచ్ఛతి.

ములో ధనికుఁడు లేఁడే - యది కులే ... = కులములో లేకపోయిన, ఆవాకిట ఉన్నది. ఇదిగో వసంతసేన వచ్చినది. వయస్య, కిం ... = మిత్రమా, ఏమి నన్ను మోసగింతువా ? యది మే వచనం ... = నామాటను నమ్మవేని, అప్పటికి ఈకుంభీలకుని అడుగుము. ఏషా సా ఆగతా ... = ఇదిగో ఆమె వచ్చియున్నది, వసంతసేన. - ఓరి మంచివాఁడా, నేను ఎప్పుడును ప్రియవచనమును - నా కొవ రైనను చెప్పినదానిని, నిష్ఫలము చేయలేదు. కావున గ్రహింపుము ఈ యినామును - అని యుత్తరీయము నొసంగును.

చేటః—( గృహీత్వా ప్రణమ్య సపరితోషమ్ ) యావ దార్యాయా నివేదయామి. [ జావ అజ్జఆప ణివేదేమి ].

( ఇతి నిష్క్రా )న్తః.

విదూ—భోః అపి జానాసి, కిం నిమిత్త మీదృశే దుర్దిన ఆగ తేతి. [ భో, అవి జాణాసి కింణిమిత్తం ఈదిసే దుద్దిణే ఆఅదే త్తి ].

చారు—వయస్య, న సమ్య గవధారయామి.

విదూ—మయా జ్ఞాతమ్, అల్పమూల్యా రత్నావలీ, బహుమూల్యం సువర్ణభాణ్డ మితి న పరితుష్టాపరం యాచితు మాగతా. [ మఏ జాణిదమ్. అప్పముల్లా రఅణావలీ, బహుముల్లం సువణ్ణభణ్డాఅం త్తి ణ పరితుట్ఠా అవరం మగ్గిదుం ఆఅదా ].

చారు—( స్వగతమ్ ) పరితుష్టా యాస్యతి.

( తతః ప్రవిశ త్యుజ్జ్వలాభిసారికావేషేన వసన్తసేనా ;
సోత్కణ్ఠా. ఛత్రధారిణీ, విటశ్చ )

విటః—( వసన్తసేనా ముద్దిశ్య )

సపరితోషమ్ = సంతోషముతో.

భోః అపి జానాసి .. = ఓయి ఎఱుఁగుదువా, ఎందులకు ఇట్టి వాన దినాన వచ్చినదో. న సమ్యక్ అవధారయామి = నేను సరిగా నిశ్చయింపలేను ఎఱుఁగను. మయా జ్ఞాతమ్ = నాచే ఎఱుంగఁబడినది - అల్పమూల్యా ... = రవంత వెలయే - కలది - సువర్ణ భాండము చాల వెలగలది. అని, తృప్తిచెందనిదై మఱి దేనినైనను ఇమ్మని అడుగుటకు వచ్చినది. పరితుష్టా యాస్యతి = చక్కఁగా తృప్తి చెందినదై పోఁగలదు. - చారుదత్తునికి వసంతసేన గుట్టు తెలియును. మైత్రేయునికిం జెప్పఁడు.

ఉజ్జ్వల - అభిసారికా - చీరెలయు నగలయు కాంతితో మెఱయు చున్నది - అట్టివేసముతో, ఉత్కంఠకలదై వచ్చినది. గొడుగుపట్టునాకరు - వాన

శ్లో. అపద్మా శ్రీ రేషా ప్రహరణ మనఙ్గస్య లలితం
కులస్త్రీణాం శోకో మదనవరవృక్షస్య కుసుమమ్
సలీలం గచ్ఛన్తీ రతిసమయలజ్జాప్రణయినీ
రతిక్షేత్రే రఙ్గే ప్రియపథికసార్థై రనుగతా. ౧౨

---

కావున - వసంతసేన గొడుగును తా చేతఁగొనదు - తనకు నౌకరు పట్టవలయును, తోడుగా ఒక విటుఁడును - ఇంట కనుపెట్టుకొనియుండు మగస్నేహితుఁడు - విటుఁడు - వాఁడును తోడగుటకే వచ్చినాఁడు. చేటియు కలదు.

ఉజ్జ్వలాభిసారికా వేషేణ -

విచిత్రోజ్జ్వల వేషా తు చలన్నూపురనిస్వనా
ప్రమోదస్మేరవదనా స్యా ద్వేశ్యాభిసరే ద్యది. సా. ద.

వసంతసేన తాను వసంతశోభ, అతిసంపన్నురాలు ఎంతయు హార్దానురాగముతో అభిసరించుచున్నది. ఇఁక ఎట్లుండదు! ఇతరలు అభిసరణమున అట్లుండరు.

సంలీనా స్వేషు గాత్రేషు మూకీకృతవిభూషణా
అవగుణ్ఠనసంవీతా కులజాభిసరే ద్యది.

శ్లో. ౧౨. ఏషా = ఈమె, అపద్మా - పద్మములేని ( - పుట్టుటకును, చేతవిలాసధారణకును - ) శ్రీః = లక్ష్మి - (అందాలకును సౌభాగ్యమునకును దేవతయైనట్టిది,) , ( - అందు ఆమెయే - ఆమెకు సాటి - ) అనఙ్గస్య = మన్మథునికి, లలితం = ఎంతయు సుకుమారమైన, ప్రహరణం = ఆయుధము ... = ఎంతటియెట్టివానినైనను సుకుమారముగానే ఓడించుటకు సాధనము - కులస్త్రీణాం = కులాంగనలకు. ఎంతటి స్వాధీనపతికలైనవారికిని, మఱి యితరనాయికల మాట చెప్ప వలయునా - శోకము - శోకమునకు కారణము - తమ భర్తల వలపును, దాననే ధనాదికమును దీని పాలయి పోవునేమో అని భయమును దాన శోకమును: మదన - వరవృక్షస్య = మదనుఁడను మేలి వృక్షమునకు, కుసుమమ్ = పూవు, పూఁత-లలిత ప్రహరణ ప్రయోగ ఫలము ఇదియే - ఆ కామవృక్షమునకు పూఁతంబోనిది - సలీలం గచ్ఛన్తీ - సయ్యాటగా నడచుచున్నదై, రతి సమయ లజ్జా - ఆసమ

వసన్తసేనే, పశ్య పశ్య,

శ్లో. గర్జన్తి శైలశిఖరేషు విలమ్బిబిమ్బా
మేఘా వియుక్తవనితాహృదయానుకారాః
యేషాం రవేణ సహసోత్పతితై ర్మయూరైః
ఖం వీజ్యతే మణిమయై రివ తాలవృన్తైః. ౧౩

---

యాన తోఁచు సిగ్గే - ఈమె. నడకయందమున ఆసిగ్గుతో కూడిన సౌభాగ్యము ఉన్నది - ఆసమయంపు సిగ్గే - ఈమెయాకారమున నున్నది. రతిక్షేత్రే = సురత భూమియందు, ప్రణయినీ = నేస్తకత్తియు, రఙ్గే - నాట్యస్థానమున = ప్రియులైన తెరువరులు గుంపులతో, అనుగతా = కూడుకొన్నది. వెంబడింపఁబడునది.

భాగ్యాలకు, అందాలకు, సాక్షాత్తు లక్ష్మి; మన్మథుఁడు ఈమెను ప్రయోగించి గెలువలేనివాఁడు ఎందును లేనే లేఁడు. ఇల్లాలు తన భర్త ఎప్పుడు ఎట్లో దీని వెంటఁబడి పోవునో అని దుఃఖించుచుండును. మదనుఁడు అను మేలిచెట్టున్నదే - దాని పూవు - సంయోగశృంగారము రూపుదాల్చిన పూవు - ఈమె. హొయలు మీఁటిన యీమె నడక - రతికాలపులజ్జ - నడకలో ఒక సిగ్గు దాఁగియున్నది. అది యల్ల యది తాల్చిన రూపమే. రతిక్షేత్రమందు - నేస్తురాలు - ఏ చిన్న చేష్టయందును అడుగకయే కనుపెట్టినట్టి ఈజనము సాయముండును - నాట్య రంగమందు - దారిన పోవువాఁడు ఆటు చూచినను - అక్కడ నిలిచి పోవలసినదే - అట్లు ఆగుంపులు వెంటఁబడుదురు. అంతయు పలురకముల రూపకాలంకారము. తనవిటుఁడు చెప్పినయిదియంతయు వట్టి ఆచారపుమాటలే కాని. వసంతసేనం గూర్చిన తత్వము వాఁడెఱుఁగఁడు, భోగము జాతిలో తప్ప బుట్టినదానిసిగుట్టు వాఁడెఱుఁగఁడు.

శ్లో. ౧౩. మేఘాః = మేఘములు, వియుక్త...కారా - వియోగినుల హృదయములం బోలి నల్లనై, శైలశిఖరేషు - కొండకొమ్ములయందు, వ్రేలుచు - కొంత జాగుసేయుచు - బింబాకారముగలవై, ఉఱుముచున్నవి. యేషాం రవేణ ... = (లేని = ) వాని మ్రోఁతచేత, (సంతోషము పొంగి) తటాలున మింటి కెగిరిన నెమిళ్ల చేత, మణి ... = రతనాలు తాపిన విసనకఱ్ఱలతోనుం బోలె, ఖం వీజ్యతే = ఆకసము వీవఁబడుచున్నది.

అపి చ,

శ్లో. పఙ్కక్లిన్నముఖాః పిబన్తి సలిలం
ధారాహతా దర్దురాః,
కణ్ఠం ముఞ్చతి బర్హిణః సమదనో,
నీపః ప్రదీపాయతే,
సన్న్యాసః కులదూషణై రివ జనై
ర్మేఘై ర్వృత శ్చన్ద్రమా
విద్యు న్నీచకులోద్గ తేవ యువతి
ర్నైకత్ర సంతిష్ఠతే. ౧౮

నల్లమేఘాలు మండలాలు మండలాలుగా గుండ్ర - గుండ్రముగా కొండశిఖరాలమీఁద, దాఁటిరాక, కొంతసేపు ఆఁగి వ్రేలాడి ఊఁగుచున్నవి. ఆశబ్దమునకు ఎంతో సంతోషముతో నెమిళ్లు పురులు విప్పుకొని వడివడిగా ఎగురుచున్నవి. అందుండు కన్నులు తాపినరత్నాలవలె ఉన్నవి, కావున, అట్లెగురుటచేత వానిచే, రతనాలవిసనకఱ్ఱలతో ఆకసము వీవఁబడుచున్నట్లు ఉన్నది. అదెల్ల చుట్టురా ఎత్తున అగపడుచున్నది.

శ్లో. ౧౮. దర్దురాః = కప్పలు, పఙ్కక్లిన్నముఖాః = బురదతో తడిసిన మూతులుగలవై, ధారాహతాః = వానధారలతో కొట్టఁబడినవై, సలిలంపిబన్తి = నీరు త్రాఁగుచున్నవి. బర్హిణః = నెమిలి, సమదనః = కామ (వికార)మురేఁగి, కణ్ఠంముఞ్చతి = గొంతువిప్పి (బిగ్గరగా) పెద్దకూత కూయుచున్నది. పెంటినితన్నుం జేరఁ బిలుచుచున్నది. నీపః = ఎఱ్ఱపూలకడిమి - వాన గాలికి తటాలున ఒక్కట చెట్టునిండ మొగ్గ తొడుగును గాన - పెద్ద దీప మగుచున్నది - దీపమోయన ప్రకాశించుచున్నది.

మరు న్నవామ్బుః ప్రవిధూత సిక్తా
కదమ్బయష్టిః స్ఫుటకోర కేవ - ఉ. రా. చ., మాలతి.
నీపం దృష్ట్వా హరితకపిశమ్ - మేఘ.

వసన్త—భావ, సుష్ఠు తే భణితమ్. ఏషా హి [భావ, సుట్ఠు దే భణిదమ్. ఏసా హి]

శ్లో. మూఢే నిరన్తరపయోధరయా మయైవ
కాన్తః సహాభిరమతే యది కిం తవాత్ర?

---

కులదూషణైః - (పుట్టిన మంచి) కులమును, (దూషణైః -) దూషించువారైన - దుఃశీలములచే చెడ్డపేరు - అపకీర్తి - కలదిగా చేయువారైన, జనైః - జనులచే, సన్న్యాసఇవ = సన్న్యాసముం బోలె, మేఘైః = మేఘాలచేత, చన్ద్రమాః = చందురుఁడు, వృతః = కప్పఁబడినాఁడు - సన్న్యాసపక్షమున - వరింపఁబడినది. పూనఁబడినది - ఆకాలాన అట్టి సన్న్యాసులు, అట్టిది లోకోక్తి, ఉపమానోక్తి, ఐపోవునట్లుగా వాడుకలో నుండెఁగాఁబోలు - విద్యుత్ = మెఱుము, నీచకుల ఉద్గతా యువతిః ఇవ = నీచకులమునం బుట్టిన జవ్వనివలె, చెడిపె ఐ పూటకు ఒక్కనిం గూడునట్లు, న ఏకత్ర సంతిష్ఠతే = ఒక్కచోట కుదురుగా ఉండుట లేదు. - ఇప్పుడు ఇక్కడ క్షణము తళుక్కన్న, ఇంతలో అక్కడ క్షణము తళుక్కనును.

భోగమువాడవారికి లోకానుభవము పాండిత్యము ఉండునని కామశాస్త్రజ్ఞులు - కావున విటుఁడు దానను ఇట్లు వర్ణించుచున్నాఁడు, బర్హిణము సమదనము ఐనదఁట - దాన గొంతెత్తి పెద్దకూఁత కూయుచున్నదఁట, నీపము వెలుగు కాగడా - దివ్వటి - యైనది, అట్టివారు సన్న్యాసము వరించునట్లు మేఘాలు చంద్రుని కమ్మివేసినవి - ఈవిటుఁడు తానును ఒకనాఁడు అట్లు సన్న్యాసముం గొనునేమో. అట్టి యువతులు భోగమువారికన్నను నిజముగా చెడిపెలు - వీనికి వారు సులువుగా ఉపమానమైనారు.

భావ = భావ (= పండితుఁడా), సుష్ఠు ... = నీవు చెప్పిన దెంతయు సరిగా ఉన్నది. ఏషా హి = ఈ రాత్రి (శ్లోకములో తరువాత ఉన్నది.) యన్నదో -

శ్లో. ౧౫ మూఢే = మూఢురాలా, - అపాటి తెలివి కూడ లేదాయెనే నీకు! - నిరన్తరపయోధరయా = ఎడము - సందు - లేని మేఘములు - పాలిండ్లు అని శబ్దధ్వని - గలదానవైన - మయా ఏవసహ = నాతోడనే (వక్త్రి నిశ) కాన్తః = కాంతుఁడు, (చారుదత్తుఁడు) అభిరమతే యది = సంతోషముతో ఆటగా

మాం గర్జితై రపి ముహు ర్వినివారయన్తీ
మార్గం రుణద్ధి కుపి తేవ నిశా సపత్నీ. ౧౫

విటః—భవతు, ఏవం తావత్. ఉపాలభ్యతాం తావ దియమ్.

వసన్త—భావ కి మనయా స్త్రీస్వభావదుర్విదగ్ధ యోపా లబ్ధయా? పశ్యతు భావః

గడపునేని - కామక్రీడలం దేలునేని అని ధ్వని, అత్ర = ఈవిషయమున, తవ కిం = నీ కేమే? - నీది ఏమి పోయినది? - ఇతి - అని - అట్లనినటులుగా, ముహుః = మాటి మాటికి, మాం = నన్ను, గర్జితైః = ఉరుములచే, నివార యన్తీ = వలదు వలదు, అనుచు, కుపితా = కోపము చెందిన, సపత్నీ ఇవ = సవతి యుం బోలె, మార్గం రుణద్ధి = దారి అడ్డుచున్నది.

మబ్బులు సందులేక కమ్మినవి, చారుదత్తుఁడు ఆమేఘాలకు సంతోషించు చుంబోలె నున్నాఁడు (ఉండును అని యనుకొనుట.) దాన సందులేని పాలిండ్ల కాంతతో (తనతోనే) వేడుకగా ప్రొద్దుపుచ్చుచున్నట్లున్నాఁడు అని మాటలలో ధ్వని. కాఁబట్టి ఆరాత్రి (వేళ) మేఘాలయురుములతో నన్ను పోవలదు పోవలదు అనుచున్నట్లున్నది. దారి చీకటితో నిండిపోయియున్నది - తనకు అటు నడువను దారి తెలియక పోయినట్లున్నది. అది ఆరాత్రి సవతివలె తాఁ గోపించి నన్ను పోనీక నాకు దారి అడ్డునట్లున్నది. అనుట - నేను నడువలేకున్నాను చీకటిలో.

భవతు ... = కానీ, ఇట్లుకానీ (నీవు). ఉపాలభ్యతాం ... = దీనిని (నోటికివచ్చినట్లు) నిందింపుము - భావ ... = భావ, దానిని ఉపాలంభించి ఏమి ప్రయోజనము? స్త్రీ స్వభావ దుర్విదగ్ధయా - తన అఁడుతనము చేత తా నెఱుఁ గదు, ఒకరు చెప్పిన వినదు - తెలివిమాలినది, తెలివిగలయట్లు తలఁచు పొగరు పోఁతు - కిం = దానితో నేమి - భావ చూచుచుగాక - ఎవరు ఏమి చెప్పినను చేసి నను నేను మానను, మరలను.

శ్లో. మేఘా వర్షన్తు గర్జన్తు ముఞ్చన్త్వశని మేవ వా
గణయన్తి న శీతోష్ణం రమణాభిముఖాః స్త్రియః. ౧౬

విటః—వసన్తసేనే, పశ్య పశ్య అయ మపరః

శ్లో. పవనచపలవేగః స్థూలధారాశరౌఘః
స్తనితపటహనాదః స్పష్టవిద్యుత్పతాకః
హరతి కరసమూహం ఖే శశాఙ్కస్య మేఘో
నృప ఇవ పురమధ్యే మన్దవీర్యస్య శత్రోః. ౧౭

శ్లో. ౧౬. మేఘాః వర్షన్తు గర్జన్తు ... = మేఘములు వాన కురియనీ, ఉఱుము ఉఱుమనీ, అశనిం ఏవ వా = పిడుగునే, ముఞ్చన్తు = (నామీఁదికి పిడుగునే) విసరనీ. రమణాభిముఖాః స్త్రియః = కాంతునికి అభిముఖులు ఐన - కాంతునికడకు బయలుదేఱిన అనుట - స్త్రీలు, శీత ఉష్ణం = చలిని వేడిని - వానను ఎండను - న గణయన్తి = లెక్కింపరు - లక్ష్యపెట్టరు.

వాన ఉఱుము, అంటియ కాదు, పిడుగు - మేఘముయొక్క వీనిని దేనిని కాంతుంగూర్చి వెడలినవారు సరకుసేయరు. దేనికిని వెనుదీయరు.

అయం అపరః = ఇది మఱియొకటి

శ్లో. ౧౭. మేఘః = (ఈ) మేఘము, పవన చపల వేగః = గాలిచే దుడుకైన వేగము - త్వరయు బలమును గలదై, స్థూలధారా ... ఘః = (కురియు) లావు ధార లనుబాణాల మొత్తముగలదై, స్తనిత ... నాదః = ఉరుమే భేరీభాంకారముగాఁ గలదై, స్పష్ట ... = కః = (ఎట్ట ఎదుట) స్పష్టముగా తోఁచు! మెఱుపను జెండా ఎత్తించుకొని, ఖే = మింట, పురమధ్యే = నట్టనడియూరిలోనే, మన్దవీర్యస్య శత్రోః = పలుచబాఱిన పరాక్రమము గల శత్రువుయొక్క, (కరసమూహం = కప్పపు మొత్తమును) నృప ఇవ = (శత్రు అధి) రాజుంబోలె, శశాఙ్కస్య = చందురునియొక్క, కరసమూహం హరతి = కిరణాల మొత్తమును - కాంతిని - పోఁగొట్టుచున్నది.

ఈవాన నడుమ, మింట రవంత తెఱపి కలిగి దాన చంద్రుఁడు తోఁపగా (ఈదినము శుక్లనవమియో దశమియో కానోపును - దొంగతనపుమఱుదినము -

వసన్త—ఏవం న్విదమ్. త త్కథ మేషో ఽపరః. [ఎవ్వం ణేదమ్. తా కథం ఏసో అవరో]

శ్లో. ఏతై రేవ యదా గజేన్ద్రమలినై
రాధ్మాతలమ్బోదరై
ర్గర్జద్భిః సతడి ద్బలాకశబలై
ర్మేఘైః సశల్యం మనః
త త్కిం ప్రోషితభర్తృవధ్యపటహో
హాహా హతాశో బకః

---

కావునమంచి వెన్నెలదినము) అంతలో మఱియొక మేఘము వానిని కమ్మి, ఆ వెన్నెల లేకుండ చేసినది. అది యెటువలె నున్నదనఁగా – కప్పము బాకీపడిన వీర్యహీన శత్రువును (అధి)రాజు వానియూరి నట్టనడుమనే, దుడుకుగా పైకొని పటు బాణములం గొట్టి భేరిభాంకారముతో జెండా యెత్తించుకొని ఒక్కుమ్మడి కప్పము నెల్ల ఒడుచుకొన్నట్లు, ఈ మేఘము గాలిచే యొడుపు గలవేగముతో లావుధారలవాన కురియుచు ఉఱుముచు, మెఱుచుచు మింట చంద్రుని కిరణజాలమును పాఁగొట్టినది – లేకుండ, చీకటికమ్మునట్లు చేసినది.

చూ. ఋతుసంహార –

సశీక రామ్భోధర మత్త కుఞ్జర స్తడిత్పతాకో ఽశనిశబ్దమర్దలః
సమాగతో రాజవ దుద్ధతద్యుతి ర్ఘనాగమః కామిజనప్రియః ప్రియే.

ఏవం ను ఇదమ్ = ఇట్లే ఉన్నది ఇది, నీవు చెప్పినది సరియే, తత్ కథం ఏష అపరః = మఱి యెట్లు ఈమఱియొకటి, (పాడు కొక్కెర కూయుచున్నదే, చూడు.)

శ్లో ౧౫. యదా = ఎప్పుడు, ఏతైః ఏవ మేఘైః = ఈ మేఘాలచేతనే, గజేన్ద్ర మలినైః = మత్తగజమువలె నల్లనై, ఆధ్మాతలమ్బోదరైః = (నీటితో) నిండ పూరింపఁబడి ప్రేలు బొజ్జలుగలవై, గర్జద్భిః = ఉఱుముచున్నవై, సతటిత్ ... శబలైః = మెఱుముతో కూడుకొనియుం (డాసిన) బెగ్గురులతోను, కూడుకొనియు వానారంగులవి ఐనవానిచేత, మనః = (నా) మనస్సు, సశల్యం = బాణపుములికి గుచ్చుకొన్నదై ఉన్నది. హాహా = అయ్యయ్యో, తత్ కిం = మఱియిప్పుడు, ఏమి,

ప్రావృట్ ప్రావృ డితి బ్రవీతి శరధీః
క్షారం క్షతే ప్రక్షిపన్. ౧౭

విటః — వసన్తసేనే, ఏవ మేతత్. ఇద మపరం పశ్య

శ్లో. బలాకాపాణ్డురోష్ణీషం విద్యుదుత్క్షిప్తచామరమ్
మత్తవారణసారూప్యం కర్తుకామ మి వామ్బరమ్. ౧౯

---

మాతాశః బకః = పాడు నిభాఙ్గ్యపు - కొంగ, శరధీః = పైకొకటి లోపలికి ఒకటిగా చూపు (మోసపు) బుద్ధి గలదై, క్షతే = గాయమున, క్షారం = కార మును, ప్రక్షిపన్ = దట్టముగా చల్లుచున్నదై, ఉన్న బాధను ఎంతయు వృద్ధి చేయు చున్నదై అనుట, ప్రోషితభర్తృణా ... మాః = కాంతుల నెడబాసినవారికి చావుకు కొట్టుభేరివలె, ప్రావృట్ - ఇతి = అని పలుకుచున్నది.

మొదలనే ఉఱుముల మెఱుముల పెను కడుపుల మేఘాలకే నా (విరహిణి) గుండె గాయపడి (కలత పెట్టుచు) ఉన్నది. మఱి అందులో కారము ద్రుక్కినట్టు ఈ బకాలు భయంకరముగా 'ప్రావృట్'ని కూయఁదొడంగినవే -!

ప్రావృట్ - 'బలేవాన, బలేవాన' ( = 'ప్రకృష్ట వృష్టి' అని) ఉప మోత్ప్రేక్షలు.

అవును - ఇట్లే యున్నది - మఱి యిది యిం కొకటి చూడు.

శ్లో. ౧౯. అమ్బరమ్ = మిన్ను, బలాకా - పాణ్డ రోష్ణీషం = కొంగల (గుంపును)ను తెల్లని తలపాగా కలిగి, విద్యుత్ ఉత్క్షిప్త చామరమ్ = మెఱుము అని పైకి ఇడ్డ చామరములును గలిగి, మత్తవారణ ... = మదపు టేనుఁగు సమరూపతను, పోలికను, కర్తుకామం ఇవ = చేయఁ (పొందఁ) గోరినదియుం బోలె నున్నది.

నల్లమేఘాలమిన్ను పెద్ద ఏనుఁగువలె నున్నది. బెగ్గురులు గుండ్రముగ చుట్టురా తిరుగుట దానికి చుట్టిన తలపాగావలె నున్నది. మెఱుము (మెఱయు టయు అడంగుటయు) వీఁచుచో ఎత్తఁబడుచును దింపఁబడుచును ఉన్నట్టి, చామ రమువలె నున్నది. ఏనుఁగునకును ఉష్ణీషము పెట్టి చామరములను వ్రేలవేయుదురు - అవి గాలికి పైకి క్రిందికి కదలుట వానితో దానిని వీఁచున టున్నది. ఉత్ప్రేక్ష.

వసన్త—భావ, పశ్య పశ్య, [ భావ, పేక్ఖ పేక్ఖ, ]

శ్లో. ఏతై రార్ద్రతమాలపత్రమలినై
రాపీతసూర్యం నభో,
వల్మీకాః శరతాడితా ఇవ గజాః
సీదన్తి ధారాహతాః,
విద్యు త్కాఞ్చనదీపి కేవ రచితా
ప్రాసాదసంచారిణీ
జ్యోత్స్నా దుర్బలభర్తృ కేవ వనితా
ప్రోత్సార్య మేఘై ర్హృతా. ౨౦

---

శ్లో. ౨౦. ఆర్ద్ర తమాలపత్త్ర మలినైః = తడిసిన చీకటిచెట్లఆకులవలె నల్లనైన, ఏతైః మేఘైః = ఈ మేఘాలచేత, నభః ఆపీతసూర్యం = ఆకాశము త్రాఁగివేయఁబడిన - లేకుండఁజేయఁబడిన - సూర్యుఁడుకలది ఐనది, వల్మీకాః = పుట్టలు పెద్ద పెద్దవి అయ్యును పట్టి బోలు మట్టి దిబ్బలే కదా; కావున), ధారాహతాః = ధారలచే ( - పదువానసీటి చాళ్ళచే) కొట్టఁబడినవై, శరతాడితాః గజాః ఇవ = బాణములచే కొట్టఁబడిన ఏనుఁగులవలె, సీదన్తి = క్రుంగిపోవుచున్నవి. విద్యుత్ = మెఱుము, ప్రాసాద సఞ్చారిణీ = మేడలపై, (ఇపుడు దీనిపై, ఇంతలో దానిపై అన్నట్లు) తిరుగాడు, కాఞ్చన దీపికా ఇవ = బంగరు దీపమువలె, రచితా = ఏర్పఱుపఁబడినది. జ్యోత్స్నా = వెన్నెల, దుర్బల భర్తృకా = బలహీనుఁడైన మగఁడుగల, వనితా ఇవ = స్త్రీవలె, మేఘైః మొయిళ్ళచేత, ప్రోత్సార్య = (వానిం) దఱుమగొట్టి, హృతా = అపహరింపఁబడినది.

ఈనల్లని మేఘాలు మింట సూర్యుని, త్రాఁగివేసినట్లు, లేకుండఁజేసినవి. లావు ధారలతో, బాణాలతో ఏనుంగులం బోలె పుట్టలను అడగార్చినవి. అందలిదే మెఱుపుతీఁగ మిద్దెమీఁదినుండి మిద్దెమీఁదికి బంగారుదీపము వలె తిరుగుచున్నది. మొయిళ్లు చంద్రుని మాపి వెన్నెల లేకుండఁ జేసినవి.

విటః — వసన్తసేనే, పశ్య పశ్య,

శ్లో. ఏతే హి విద్యుద్గుణబద్ధకక్ష్యా
గజా ఇవాన్యోన్యమభిద్రవన్తః
శక్రాజ్ఞయా వారిధరాః సధారా
గాం రూప్యరజ్జ్వేవ సముద్ధరన్తి. ౨౧

అపి చ పశ్య,

శ్లో. మహావాతాధ్మాతై ర్మహిషకులనీలై ర్జలధరై
శ్చలై ర్విద్యుత్పక్షై ర్జలధిభి రివాన్తః ప్రచలితైః

ఉత్ప్రేక్షలు.

శ్లో. ౨౧. ఏతే వారిధరాః = ఇవిగో ఈ మొయిళ్లు, విద్యుత్ గుణ ... క్ష్యాః = మెఱుము అను ప్రగ్గముతో - బంగరుదానింబోని దానితో - కట్టఁబడిన నడుము త్రాఁడులు - మోకులుగలవై, అన్యోన్యాం అభిద్రవన్తః = ఒండొంటిపైకి పరువెత్తుచున్నవైన, గజా ఇవ = ఏనుఁగులవలె, సధారాః = ధారలతో కూడుకొన్నవై, శక్రాజ్ఞయా = ఇంద్రుని యుత్తరువుచేత, గాం = భూమిని, రూప్యరజ్జ్వా = వెండి చేరుతో, సముద్ధరన్తి ఇవ = పైకి ఎత్తుచుంబోలె ఉన్నవి.

ఇంద్రుఁడు త్రిజగతికి పతి. కావున భూమికిని, దానిని చేరుపున చూచి మన్నింపనో దండింపనో, వెండి త్రాటిం గట్టి పైకి చేదించుకొనుచున్నట్లున్నది. బంగరు మొలమోకులు గలిగి ఒండొంటి తట్టు పరువెత్తు ఏనుఁగులంబోలె ఈమేఘాలు మెఱపుత్రాళ్లుగలిగి యొండొంటిం గూడుచు ఈధారలు నేలపై గురియుట.

ఉపమోత్ప్రేక్షలు.

శ్లో. ౨౨. మహా వాత ఆధ్మాతైః = పెనుగాలితో బూరటిల్లినవై, మహిషకులనీలైః = ఎనుములగుంపువలె నల్లనై, విద్యుత్ పక్షైః = మెఱుములు అను ఱెక్కలతో, చలైః = పరువులెత్తుచున్న, జలధరైః మేఘముల చేత, అన్తః = (మింటి) నడుమ, విద్యుత్ పక్షైః = వైద్యుతమను వెలుతురే ఱెక్కలుగాగలిగి, ప్రచలితైః = వెల్లివిరిసి పాఱు, జలధిభి రివ = సముద్రములచేతనుం బోలె - అట్టి

ఇయం గన్ధోద్ధామా నవహరితశష్పాఙ్కురవతీ
ధరా ధారాపాతై ర్మణిమయశరై ర్భిద్యత ఇవ. ౨౨

వసన్త—భావ ఏషో ఉ పరః. [ భావ, ఏసో అవరో ].

---

(పొంగిన) నలుసముద్రములంబోలియున్నవానిచేత - అనుట, గన్ధోద్ధామా = పైకి లేచిన - ఉచ్ఛ్వసించిన మంటివాసన యను గర్వము గలదియుంబోలె నున్నదియు, నవహరిత ... తీ = క్రొత్త పచ్చపచ్చిక మొలకలు (అంతట దండిగా) గలదై, ధరా = ధర = భూమి, ధారాపాతైః = పెనుపోఁతగా పడుచున్న (వర్ష) ధారల-కొసలవిసరుల చేత, మణిమయశరైః = వజ్రాలబాణాలతో, భిద్యత ఇవ = చీల్పఁబడుచున్నదియుం బోలె ఉన్నది.

పెనుగాలి రేఁగి కొట్టుచున్నది. దానిచే మేఘములు బూరటిల్లినవైనవి - దాన అవి ఎనుములగుంపువలె నున్నవి. అంతలో తళుక్కుమనుచు అంతలో మాయమగుచు నున్నవి. మెఱుములు, అవి యాడించు టెక్కెలవలె నున్నవి. వానితో మొయిళ్లు పఱచుచున్నవి. (దాన) అవి నడుమ వైద్యుతమను వెలుతురు టెక్కెలుగా గలిగి వెల్లువంబాఱు నలుసముద్రములవలె ఉన్నవి - అట్టివానిచేత తూట్లు పడునంత విసరుగా కురియు తెఱపిలేని వానధారలచేత మణి - తెల్లని వజ్రము - చే నిర్మితములైన బాణములచేతంబోలె, ధర - 'ధరతి విశ్వ మితి' - పైనను లోనను అన్నింటిని మోయునదైన భూమి, భిద్యత ఇవ = పగుల్పఁబడుచుంబోలె ఉన్నది - ఏలన - (మంచి మంటి) వాసన - మదమువలె - పైకి పొంగినది, క్రొత్త పచ్చ గఱిక మొలకలు లేచినవి - కావున ఇంకను ఏమేమో లోపల దాఁచుకొనియున్నది - వానిని వెడలింతుముగాక అని.

ఉపమోత్ప్రేక్షలు.

ఏష అపరో మేఘః సము త్పతతి - వాన తెఱపి లేక కురియుచున్నను అంతలో పెద్దదియు అంతలో చిన్నదియు అగుచుండును - ఏలన క్రొత్త మేఘము కాఱుకొనుచు లేచుచును కురిసి పలుచ నగుచును, మఱల నొకటి లేచుచును అది కురిసి పలుచనగుచును ఉండును. అట్లు నడుమ లేచిన మఱియొక కాఱుమేఘమును చూపి చెప్పుట.

శ్లో. ఏహ్యేహీతి శిఖణ్డినాం పటుతరం కేకాభి రాక్రన్దితః
ప్రోడ్డీయేవ బలాకయా సరభసం సోత్కణ్ఠ మాలిఙ్గితః,
హంసై రుజ్ఝితపఙ్కజై రతితరాం సోద్వేగ ముద్వీక్షితః
కుర్వ న్నఞ్జనమేచకా ఇవ దిశో మేఘః సముత్తిష్ఠతి. ౨౩

విటః — ఏవ మేతత్. తథా హి పశ్య

శ్లో. నిష్పన్దీకృతపద్మషణ్డనయనం నష్టక్షపావాసరం
విద్యుద్భిః క్షణనష్టదృష్టతిమిరం ప్రచ్ఛాదితాశాముఖం

---

శ్లో. ౨౩. ఇదిగో మఱియొకటి - ఏహి ఏహి ఇతి = రా రమ్ము అని, శిఖణ్డినాం = నెమిళ్ళయొక్క, కేకాభిః = కేకల చేత - 'కేక' అని నెమిలికూఁత యను కరణమును, పటుతరం - గట్టిగా, బిగ్గరగా, ఆక్రన్దితః - అఱచి పిలువఁబడినదై, సరభసం = తొందరతో, ప్రోడ్డీయ = ఎగిరి (పోయి), సోత్కణ్ఠం = ఎంతయు ఆసతో ఆలిఙ్గిత ఇవ = కౌఁగిలించుకొనఁ బడినది వోలె ఉన్నదై, ఉజ్ఝిత పఙ్కజైః = విడువఁబడిన తామరలు గల, తామరలను విడిచి వచ్చినవైన, హంసైః = అంచలచేత, సోద్వేగం = భయముతోను రోఁతతోను, అతితరాం ఉద్వీక్షితః = ఎంతయు తల నిగిడ్చి చూడఁబడుచున్నదై, దిశః = దిక్కులను, అఞ్జనమేచకాః = కాటుకవలె నల్లనివిగా, కుర్వన్ ఇవ = చేయుచుం బోలె నున్నదియు నై, (ఏష అపరః) మేఘః = ఇదిగో ఇంకొక మేఘము, సముత్తిష్ఠతి = లేచుచున్నది.

మరల నొక పెద్ద క్రొత్త మేఘము లేచుచున్నది. దాన లోకమంతయు కాటుకపూఁత చేతనుం బోలె నల్లనైనది. నెమ్మిల పెద్ద కేకలు దానిని రారమ్మని పిలిచినట్లున్నది. బలాకలు ఎగిరిపోయి ఆసాసతో దానిని కౌఁగిలించుకొన్నవి. అంచలు తామరలను దూరముగా పోయి మిక్కిలి భయముతో దానినే మోమెత్తి చూచుచున్నవి.

శ్లో. ౨౪. నీవు చెప్పినది సరిగానే ఉన్నది. - చూడు. - జగత్ = జగము, స్ఫీత అమ్భోధర ధామ = విశాలమైన మేఘమే తనకు ఇల్లుగాఁ గలిగి, నైక జలద చ్ఛత్రాపిధానం = పెక్కు మేఘము లనుగొడుగులే, మూతగా - మేలుకట్టుగాఁ గలిగి, పయోధారా గృహాన్తగతం = వాన నీటిధారలు అను

నిశ్చేష్టం స్వపితీవ సంప్రతి పయోధారాగృహాన్తర్గతం
స్ఫీతామ్భోధరధామ్ని నైకజలదచ్ఛత్రాపిధానం జగత్. ౨౮

వసన్త—భావ, ఏవం న్విదమ్. తత్పశ్య పశ్య [ భావ, ఏవ్వాణేదమ్. తా పేక్ఖ పేక్ఖ ].

శ్లో. గతా నాశం తారా ఉపకృత మసాధా వివ జనే,
వియుక్తాః కాన్తేన స్త్రియ ఇవ న రాజన్తి కకుభః,

---

యంత్రధారాగృహములోపల (స్నానమునకుతగినట్లు కురియుధారలు), నిశ్చేష్టం = ఏమియు చేష్టలు లేక అనఁగా కదలక మెదలక, సంప్రతి = ఇప్పుడు, స్వపితి ఇవ = నిద్రించుచుంబోలె నున్నది, నిష్పన్ది ... నయనం = (అనిద్రలో) కదలక ఆడక యున్నట్టి తామరతంపర యను కన్నులు గలిగియున్నది, నష్టక్షపా వాసరం = (ఇది) రాత్రియో పగలో భేదము తెలియకున్నది, విద్యుద్భిః = మెఱుములచేత, క్షణదృష్ట ... తిమిరం = నిముసమున - అంతలో - అగపడి, నిముసముననే - అంతలోనే - అగపడక పోయిన చీకట్లు కలిగి యున్నది, ప్రచ్ఛాదితాశాముఖం = (ఆశాముఖం =) దిక్కుల మొదళ్ళు - అడుగుభాగములు - అను, మొగమును కప్పుకొనియున్నది.

లోకము, ఎట్లు మూసినది అట్లే యుండునట్లు తామర తంపరయను కన్నులు గలదై, రాత్రియో పగలో తెలియక, మెఱుములకు అంతలో పోయి అంతలో కమ్ముకొను చీకట్లు గలదై, మొగ మగపడనీక కప్పుకొని మేఘాలనుబంగాళాలో, మేఘాలచాందినిక్రింద, వర్షధారల యంత్రధారాగృహమునందు కదలక మెదలక ఒక్కటే నిద్రగా నిద్రపోవుచున్నదో అన్నట్లున్నది.

అవును అట్లే యున్నది. మఱి చూడు చూడు.

శ్లో. ౨౯. అసాధౌ జనే = అసత్పురుషునందు, ఉపకృతం ఇవ = ఉపకారము - మేలు - వలె, తారాః = నక్షత్రాలు, నాశంగతాః = నాశనము - అగపడమి - పొందినవి, కకుభః = దిక్కులు, కాన్తేన వియుక్తాః స్త్రియః ఇవ = ప్రియుని వియోగము పొందిన స్త్రీలవలె, న రాజన్తి = ప్రకాశింప కున్నవి,

ప్రకామాన్తస్తప్తం త్రిదశపతి శస్త్రస్య శిఖినా
ద్రవీభూతం మన్యే పతతి జలరూపేణ గగనమ్. ౨౫

అపి చ, పశ్య,

శ్లో. ఉన్నమతి నమతి వర్షతి
గర్జతి మేఘః కరోతి తిమిరౌఘమ్
ప్రథమశ్రీ రివ పురుషః
కరోతి రూపా ణ్యనేకాని. ౨౬

---

గగనమ్ = మిన్ను, త్రిదశపతిశస్త్రస్య శిఖినా = ఇంద్రుని యాయుధమైన పిడుగు యొక్క యగ్నిచేత, ప్రకామ అంతః తప్తం = (మూసలోనుం బోలె)లోపల ఎంతయు గాఁగినదై, ద్రవీభూతం = కరగినదై, జలరూపేణ పతతి = నీటిరూపాన పడుచున్నది, (ఇతి = అని), మన్యే = తలంతును.

నక్షత్రాలుపోయినవి - దిక్కులు నల్లపడి ప్రకాశింపకున్నవి. ఇంద్రుని పిడుగువేడికి, మూసలో కరగినట్లు, మిన్నుకరఁగి నీటిరూపాన ప్రవహించు చున్న ట్లున్నది.

ఈదుర్దినవర్ణనలో ప్రాయికముగా ఉత్ప్రేక్షలు -

మన్యే శఙ్కే ధ్రువం ప్రాయో నూన మి త్యేవమాదిభిః
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివ శబ్దోఽపి తాదృశః. దండి. II - 234.

పెక్కు శ్లోకములు సుభాషిత రత్నభాండాగారమున ఉదాహృతములు. అట్లగు టయు లోకాన మెప్పే.

శ్లో. ౨౬. ప్రథమశ్రీః పురుష ఇవ = (గర్భదరిద్రుఁడగు) పురుషుఁడు తనకు తటాలున తొలుమారు మితిమీఱిన సంపద కలిగినదైన, వాఁడెట్లో అట్లు; మేఘః = మొయిలు, అనేకాని రూపాణి = పెక్కు రూపములు పొందుచున్నది - పెక్కు వేషాలు వేయుచున్నది - పెక్కు చేష్టలు చేయుచున్నది - పైకి లేచు చున్నది - పురుషుఁడును క్రొవ్వున పైకి నిగుడును - పైకే చూచును, (అంతలో) వంగును (కురియుటకు), పురుషుఁడును క్రిందికి చూచును (ఎదుటివానిమీఁద చూపునిలుపక); వర్షతి = కురియును - పురుషుఁడు దండిగా ఇచ్చును, గర్జతి = ఉఱుమును - పురుషుఁడు బడాయి మాటలు ప్రేలును, తిమిరౌఘమ్ కరోతి = చీకటి మొత్తమును కలిగించును - పురుషుఁడును మోహాంధకారమును -

విటః—ఏవ మేతమ్,

శ్లో. విద్యుద్భి ర్జ్వల తీవ సంవిహస తీ
వోచ్చై ర్బలాకాశతై
ర్మాహేన్ద్రేణ వివల్గ తీవ ధనుషా
ధారాశరోద్గారిణా
విస్పష్టాశని నిస్స్వనేన రస తీ
వాఘూర్ణ తీ వానిలై
ర్నీలైః సాన్ద్ర మి వాహిభి ర్జలధరై
ర్ధూపాయ తీ వామ్బరమ్. ౨౭

కన్నుగానమిం - బొందును, అనేకాని రూపాణి కరోతి = మేఘము లెక్కలేని రూపములను - ఏనుగులవియు కొండలవియు పెద్ద మేడలవియునగు ఆకృతులం - బొందును, పురుషుఁడును నిలుకడలేని స్వభావము గలవాఁడై, పెక్కు విధాల వేసాల తోఁచును.

మేఘము దారిద్ర్యమునుండి తటాలున మితిలేని సంపద పొందినవాఁడు ఎట్లెట్లు నడచుకొనునో అట్లట్లు తాను నిలుకడలేక నడుచుకొనుచున్న ట్లున్నది.

అవును. అట్లే...

శ్లో. ౨౭. అమ్బరం = మిన్ను, విద్యుద్భిః = మెఱుములచేత, జ్వలిత ఇవ = మండుచుంబోలె ఉన్నది, బలాకాశతైః = (మేఘాలపై మూఁగిన) లెక్కలేని బెగ్గురులచేత, ఉచ్చైః సం ... = బొబ్బనవ్వు నవ్వుచున్న ట్లున్నది, ధారా - శరోద్గారిణా = ధార లనుబాణాలను గ్రక్కుచున్న, మాహేన్ద్రేణ ధనుషా = మహేంద్రునిదైన వింటితో, బొమ్మఖోరడుతో, వివల్గతి ఇవ = (పైకి) దుముకుచుం బోలె నున్నది, విస్పష్ట అశని. నిస్స్వనేన = మిక్కిలి బిగ్గరయైన పిడుగుల మ్రోఁత చేత, రసతి ఇవ = మొరయుచుంబోలె ఉన్నది, అనిలైః = గాలులచేత, ఆఘూ ర్ణతి ఇవ=సుడియుచుంబోలె ఉన్నది, నీలైః అహిభిః ఇవ=నల్లని పాములతోనుం బోలె, సాన్ద్రం = దట్టముగా, జలధరైః = మేఘములచే, ధూమాయతి ఇవ = పొగయుచుంబోలె, పొగచే కమ్మఁబడినదియుంబోలె, ఉన్నది.

వసన్త—

శ్లో. జలధర, నిర్లజ్జ స్త్వం
యన్మాం దయితస్య వేశ్మ గచ్ఛన్తీమ్
స్తనితేన భీషయిత్వా
ధారాహస్తైః పరామృశసి. ౨౭

భోః శక్ర,

శ్లో. కిం తే హ్యహం పూర్వరతిప్రసక్తా,
యత్త్వం నద స్యమ్బుదసింహనాదైః ?

---

మెఱుపుమంటలు, బలాకలబొబ్బనవ్వులు, ఇంద్రధనుర్ధారాబాణోద్ధారములు, పిడుగు ప్రోఁతలు, గాలులసుళ్ళు, జలధరాహుల పొగలు _ వీనితో నిండియున్నది ఆకసము.

శ్లో. ౨౭. జలధర = మేఘుఁడా, త్వం = నీవు, నిర్లజ్జః = వట్టి సిగ్గిడివి, యత్ = ఏల (అట్లనుచున్నావ)న, దయితస్య వేశ్మ గచ్ఛన్తీం = ప్రియుని యింటికి పోవుచున్న దానిని, స్తనితేన భీషయిత్వా = ఉఱుముతో బెదరించి, ధారాహస్తైః = ధారలను చేతులతో, పరామృశసి = తాఁకుచు తడవుచు ఉన్నావు.

మేఘుఁడా, సిగ్గులేదాయె నీకు. నేను నాప్రియునింటికి పోవుచుండఁగా నన్ను ఉఱిమి బెదరింతువు, నీచేతులం దాఁకెదవు! తడవెదవు!

భో శక్ర _ ఓ ఇంద్రుఁడా,

నీవు కదా మేఘములను విప్పి తోలి యిట్లు వాన కురియించువాఁడవు, కావున నిన్ను అడిగెదను.

శ్లో. ౨౮. అహం హి = నేను కదా, తే = నీకు, పూర్వరతి ప్రసక్తా కిం = ముందు (నీతోడి) రతిలో ఆసక్తురాలనై ఉంటినా? మనకు ఎన్నడైనను రతి సంబంధము ఉండెనా? యత్ = ఏల (అడిగెదన)న, త్వం = నీవు, అమ్బుదసింహనాదైః = మేఘముల (ఉఱుము లను) సింహనాదములతో. నదసి = అఱచెదవు?

న యుక్త మేత త్ప్రియకాఙ్క్షితాయా
మార్గం నిరోద్ధుం మమ వర్షపాతైః. ౨౯

అపి చ,

శ్లో. యద్వ దహల్యా హేతో ర్మృషా
య దసి శక్ర గౌత మో ఽస్మీతి
తద్వ న్మ మాపి దుఃఖం
నిరపేక్ష నివార్యతాం జలదః. ౩౦

---

నీవు నన్నేమో బెదరించి నామీఁద నేమో - అఱచుచున్నావే అదేమిటయ్యా? ప్రియకాఙ్క్షితాయాః = ప్రియునిచే ఎదురునూడబడుచున్న దానవైన, కాదా - ప్రియునిమీఁద ఆసగొన్నదాననైన - మమ = నాయొక్క, మార్గం = దారిని, నిరోద్ధుం = అడ్డుటకు, న యుక్తం = తగవు గాదు.

అయ్యా, అడిగెదను, నేను వసంతసేనను మునుపు ఎన్నఁడైన నీమీఁద మనసుపడియుంటినా? నీతోడి రతిసంబంధము కలిగియుంటినా? నీదాననా నేను? మఱి నీకేల ఈయఱపులు బెదరింపులు? నేను నాప్రియుం గూడఁ గోరి పోవుచున్నాను. అతఁడు నాకై కనుపెట్టుకొని యున్నాఁడు. ఇట్లు జల్లులతో నాదారి యడ్డుట నీకు తగవుగాదు, తరవా కాదు.

వసంతసేన మంచి శీలవతియే. ఐనను భోగముది ఐనందున ఎబ్బెటికము లేక ఇట్లు ఎన్నఁడయినను మునుపు నిన్ను కూడియుంటినా పరపురుషునితోనుం బోలె అనుచున్నది. శీలవతి కులాంగన ఇట్లనదు. రసాభాసకారణ మగును. దేవతయగుటచే మర్షణీయము కాఁబోలు.

శ్లో. ౩౦. శక్ర = శక్రుఁడా, ఇంద్రా, యద్వత్ = ఎటువలె, అహల్యా హేతోః = అహల్యకోసము, గౌతమః అస్మి ఇతి మృషా = నేను, గౌతముఁడనే అని అసత్యమును, వదసి = చెప్పెదువో - ఎన్నఁడో చెప్పినను ఇప్పుడు చెప్పిన ట్లున్నది అది నాకు - తద్వత్ = అటువలెనే, మమ అపి దుఃఖం = నాకు సయితము (వియోగ) దుఃఖము, నిరపేక్ష = ఓయి (ఇతరుల దుఃఖమును) సరకుసేయనివాఁడ, జలదః = (ఈ) మొయిలు, నివార్యతాం = మాన్పఁబడును గాక.

అపి చ,

శ్లో. గర్జ వా వర్ష వా శక్ర
ముఞ్చ వా శతశో ఽశనిమ్,
న శక్యా హి స్త్రియో రోద్ధుం
ప్రస్థితా దయితం ప్రతి. ౩౧

శ్లో. యది గర్జతి వారిధరో
గర్జతు, త న్నామ నిష్ఠురాః పురుషాః
అయి విద్యు త్ప్రమదానాం
త్వ మపి చ దుఃఖం న జానాసి. ౩౨

---

అపుడు నీవు ఎంత దుఃఖము కలుగఁగా, మగఁడు గౌతముఁడు ఇంట లేనపుడు, నేను గౌతముఁడనే వచ్చితినే, తియ్యవే తలుపు అని లోపల దూఱిన వాఁడవు కావా? నా దుఃఖమును అట్టిదేకదా. మఱి యీ మెయిలుచే నన్నేల అడ్డుదువు? నీవానిని అవతలికి పిలుచుకో – నన్ను పోనిమ్ము.

శ్లో. ౩౧. శక్ర = ఇంద్రుఁడా, గర్జ వా = ఉఱుముము, వర్ష వా = (కాదేని) కురియుము, ముఞ్చ వా శతశః అశనిమ్ = కాదేని పిడుగులను నూఱుతూర్లు విసరు, దయితంప్రతి ప్రస్థితాః = ప్రియుంగూర్చి బయలువెడలిన, స్త్రియః = స్త్రీలు, రోద్ధుం న శక్యాః = అడ్డగింప నలవిపడరు.

ప్రియుంగూర్చి యిల్లు వెడలిన స్త్రీలు దేనను ఆఁపరారు, అపుటకైన నీప్రయత్నములు వృథా. నీవు ఉఱుమవోయి. కురియవోయి, పిడుగులు విసరవోయి, దేనను నన్ను ఆఁపలేవు పో.

శ్లో. ౩౨. యది గర్జతి = ఉఱుము నేని, వారిధరః గర్జతు = మేఘము ఉఱుమనీ, తత్ నామ = కావుననే, అదే, పురుషాః = మగవారు, నిష్ఠురాః = క్రూరులు – కఠినులు – దయారహితులు, అంతే, అయి విద్యుత్ = ఓసీ మెఱుపా, త్వం అపి చ = నీవు సయితము, ప్రమదానాం = జవరాండ్ర, దుఃఖం = దుఃఖమును, న జానాసి = ఎఱుఁగవన్నావే!

విటః—భవతి, అల మల ముపాలమ్భేన. ఉపకారిణీ త వేయమ్.

శ్లో. ఐరావతోరసి చ లేవ సువర్ణరజ్జుః
శైలస్య మూర్ధ్ని నిహి తేవ సితా పతాకా
ఆఖణ్డలస్య భవనోదరదీపి కేయ
మాఖ్యాతి తే ప్రియతమస్య హి సంనివేశమ్. 33

వసన్త—భావ, ఏవం త దే వైతద్గేహమ్. [భావ ఎవ్వం తం జ్జేవ ఏదం గేహమ్].

---

మొయిలు మగవాఁడు, కఠినుఁడు, ఉఱిమిన ఉఱుమనీ, అమ్మా మెఱుమా, నీవు ఆఁడుదానవే, నీకైనను నాయాడుదాని దుఃఖము తెలియదటే.

భవతి = అమ్మా, అలం అలం = కూడదు కూడదు – ఉపాలమ్భేన = దూఱుట – ఉపకారిణీ = సాయము చేయునదే, తవ ఇయం = నీవు ఇది. (ఎట్లన.)

శ్లో. 33. హి = ఏలన, ఇయం = ఇది, యీ మెఱుము, ఐరావత ఉరసి – ఇంద్రుని తెల్లయేనుఁగు – ఐరావతము – దానికడుపు – ఱొమ్ము – మీఁద, చలా = కదలాడు, సువర్ణరజ్జుః ఇవ = బంగరు పగ్గమువలె ఉన్నది, శైలస్య మూర్ధ్ని = కొండతల(కొమ్ము)మీఁద, నిహితా = ఉంపఁబడిన, సితా పతాకా ఇవ = తెల్ల జెండా వోలె ఉన్నది, ఆఖణ్డలస్య = ఇంద్రుని యొక్క, భవన ఉదర దీపికా ఇవ = ఇంటిలోపలి దీపమువలె ఉన్నది, ఇట్లెల్ల ఎత్తున తళతళలాడుచు అగపడుచున్నదై, తే = నీవు, ప్రియతమస్య సన్నివేశమ్ = నీ యత్యంత దయితుని యింటిని, ఆఖ్యాతి = తెలుపుచున్నది.

మెఱుముతోడి మేఘము తెల్లఏనుఁగువలెను మెఱుము వాని కక్ష్యాబంధమువలెను ఉన్నది. మేఘము కొండవలె ఉన్నది. మెఱుము దాని కొమ్మున కట్టిన జెండావలె ఉన్నది. మేఘము ఇంద్రుని (సిమెంటుపూఁత) బంగాళావలె ఉన్నది. మెఱుము అందులోని దీపమువలె ఉన్నది. అట్లు ఆవెలుఁగులచే నీవు ప్రియతముని యింటిని ఈవానచీకటిలో ఇదిగో ఇక్కడ అని చూపుచున్నది.

ఏవం = ఇట్లే, తత్ ఏవ ... = అదియే అతని యిల్లు.

విటః—సకలకలాభిజ్ఞాయా న కించి దిహా త వోపదేష్టవ్య మస్తి. త థాపి స్నేహః ప్రలాపయతి. అత్ర ప్రవిశ్య కోపో ఒత్యన్తం న కర్తవ్యః.

శ్లో. యది కుప్యసి నాస్తి రతిః ;
    కోపేన వి నాథవా కుతః కామః ?
కుప్య చ కోపయ చ త్వం
    ప్రసీద చ త్వం ప్రసాదయ చ కాన్తమ్. ౩౮

సకలకలాభిజ్ఞాయాః = ఎల్లకళలు ఎఱింగినదానవైన నీకు, న కిఞ్చిత్ ఉపదేష్టవ్యం = ఇంచుకయును నేర్పవలసినది లేదు, తథాపి స్నేహః ప్రలాపయతి = ఐనను (నీకైననా) (స్నేహః) స్నేహము, (ప్రలాపయతి) పలికించుచున్నది, స్నేహపుఁబెంపుచే ఈమాటలు చెప్పుట, సలహా జెప్పుట, మానలేకున్నాను – చెప్పకున్న తరువాత పశ్చాత్తాపముపాలు అగుదునేమో. కావున చెప్పుదును. కోపః అత్యన్తం న కర్తవ్యః = ఎక్కువగా కోపపడకూడదు.

శ్లో. ౩౮. యది కుప్యసి = కోపపడుదువేని, న అస్తి రతిః = ప్రీతి – అనురాగము – కేళి – ఆట – ఉండదు, అథవా = అట్లు కాక మఱి, కోపేన వినా = కోపము లేక, కుతః కామః = కామము – అనురాగము – రతి – యెక్కడిది ? కోపముతో కూడుకొన్నదైననే – పొలయలుక కల దైననే, కామము – రతి – రాణించును – 'పొలయలుక నాఁటి నిదురయు' అని, యది యమూల్యమని సుమతి శతకకవియు చెప్పినాఁడు – 'సోఽఙ్గీకృతో భగవతా మకరధ్వజేన' అని కాంత కాలి తాపు తిన్న కాంతుని మదనుఁడు మెచ్చుకొనునట – అమరుకము, కుప్య చ = కోపపడియు, కోపయ చ త్వం = నీవు (కాంతునికి) కోపము కలిగింపుము, కోపపడు – దానిం దీర్పఁ కాంతుఁడు బతిమాలినను, పాదాలలో వ్రాలినను, తేరకుండుము, అంతట కాంతునికి కోపమువచ్చును, అంతట – ప్రసీద త్వం = నీవు ప్రసన్నురాలవు – అలుక తీఱినదానవు కమ్ము – ప్రసాదయ కాన్తమ్ = కాంతునిం దేర్పుఁము.

కోపపడుము. కాని ఎక్కువగా పడకు. ఒక్కటి కోపమే ఐన రతము – కూటమి లో సంతోషము ఉండదు. మఱి కోపమే – పొలయలుకే – లేకున్నను

భవతు. ఏవం తావత్. భో భోః, నివేద్యతా మార్యచారుదత్తాయ

శ్లో. ఏషా ఫుల్లకదమ్బనీపసురభౌ కాలే ఘనోద్భాసితే
కాన్తస్యాలయ మాగతా సమదనా హృష్టా జలార్ద్రాలకా
విద్యుద్వారిదగర్జితైః సచకితా త్వద్దర్శనాకాఙ్క్షిణీ
పాదౌ నూపురలగ్నకర్దమధరౌ ప్రక్షాలయన్తీ స్థితా. ౩౫

---

సంతోషము రసవంతముగా నుండదు. కోపపడు - వాఁడు తేర్చినను తేలక యుండుము - వానికిని కోపమువచ్చునటుల. నీవు తేలుము - వానినిం దేర్పుము - అంతట ఇంత యని వెలపెట్టరానంత సురతసుఖము అనుభవింపుము.

ఈ యుపదేశమెల్ల - ఇది కన్నెఱికమగుటచేత చేయఁబడినది.

భవతు = మఱి కానీ - పో - అనుట. ఉండు నేను తెలిపెదను. నివేద్యతాం ... = చారుదత్తయ్యకు చెప్పుఁడు, ఎఱింగింపుడు.

శ్లో. ౩౫. ఏషా = ఇదిగో, ఫుల్ల కదమ్బ నీప సురభౌ కాలే = పూచిన ఎఱ్ఱనియు తెల్లనియు కడుముల పరిమళముగల కాలమున - ఈతొలకరి సంధ్యా వేళలో - ఘనోద్భాసితే = మేఘాలచే మిక్కిలియు ఒప్పుచున్న సమయమున, సమదనా = కామప్రేరితయై - మనసు కామముతో - ఉత్కంఠతో నిండఁగాఁ - తాళ లేక - హృష్టా = హరుసముగొన్నదై, జలార్ద్ర-అలకా = (వాన) నీటితో తడిసిన ముంగురులు గలదై - ముంగురులు తడిసి వానబొట్లు రాలుచుండఁగా, కాన్తస్య ఆలయం = కాంతుని (= మనశ్చోరుని) యింటికి, ఆగతా = (తానై) వచ్చినది. విద్యుత్ వారిద గర్జితైః = మెఱుములచేతను ఉఱుములచేతను, సచకితా = భయముగొల్పఁబడినది. త్వత్ దర్శన ఆకాఙ్క్షిణీ = నినుచూడను ఎంతేని కోరికవహించి యున్నది. నూపురలగ్న ... = అందెలలో తగులుకొన్న (దారి) బురదగల, పాదౌ = పాదములను. ప్రక్షాళయన్తీ = కడుగుకొనుచు, స్థితా = (వాకిట) నిలంబడి యున్నది.

మెయిళ్లతో ప్రకాశించుచు ఎఱుపు తెలుపు కడుముల పూతపరిమళము వెదఁజల్లుచున్న యీకాలమున, మనసున రతి రేఁగి, ముంగురులు తడియుచున్నను లక్ష్యపెట్టక, వల్లభునియింటికి అభిసరించినది. ఆమెను మెఱుములు ఉఱుములు

చారు—(ఆకర్ణ్య) వయస్య, జ్ఞాయతాం కి మేత దితి.

విదూ—యు ద్భవా నాజ్ఞాపయతి. (వసన్తసేనా ముప గమ్య, సాదరమ్) స్వస్తి భవత్యై. [జం భవం ఆణవేది. సోత్థి భోదీఏ].

వసన్త—ఆర్య వన్దే. స్వాగత మార్యస్య (విటం ప్రతి) భావ ఏషా ఛత్రధారికా భావ స్యైవ భవతు. [అజ్జ, వన్దామి. సాఅదం అజ్జస్స. భావ, ఏసా ఛత్తధారిఆ భావస్స జ్జేవ భోదు].

విటః—(స్వగతమ్) అనే నోపాయేన నిపుణం ప్రేషితో ఽస్మి. (ప్రకాశమ్) ఏవం భవతు. భవతి వసన్తసేనే

శ్లో. సాటోపకూటకపటానృతజన్మభూమేః,
శాఠ్యాత్మకస్య రతికేలికృతాలయస్య,

---

జడిపించుచున్నవి. నిన్ను చూడను ఎంతేని వాఁచిపోయియున్నది. కాలి యందె లలో బురద – తడి వీథిలో నడిచినందున – అంటుకొని యున్నది. దానిని కడుగు కొనుచున్నది. వాకిట కనుపెట్టుకొని యున్నది. ఇట్లు అత్యుద్దీపనకాలమున వచ్చి ఉన్నది.

కిం ఏతత్ ఇతి జ్ఞాయతాం = ఏమిటియో ఇది కనుగొనవయ్యా.
నిపుణం ప్రేషితః అస్మి = నేర్పుగామీఱ, నేను పంపివేయఁబడితిని.

శ్లో. ౩౬. సాటోప కూట కపట అనృత జన్మభూమేః = గర్వముతో కూడుకొన్న (కూట = ) మాయలు, (కపట = ) నిజమును, కలరూపును. దాఁచు టలు, కల్లలు – ఇట్టి వీనికి పుట్టినిల్లయినది, శాఠ్యఆత్మకస్య = మోసము – లేనిది యున్నట్లు నటించుటయే – ప్రాణముగా సారముగా గలదియు, రతికేళి...స్య = రతి – అనురాగములతోడి – యాటలే స్త్రీ పురుషులకలయిక యందలి యాటలే యిల్లుగాఁ గలదియు, సురతోత్సవ సజ్జ్రిహాస్య = సురతమునందలి కోరికలు

వేశ్యాపణస్య సురతోత్సవసంగ్రహస్య,
దాక్షిణ్యపణ్యసుఖనిష్క్రయసిద్ధి రస్తు. 36

(ఇతి నిష్క్రాన్తో విటః.

వసన్త—ఆర్యమైత్రేయ, కుత్ర యుష్మాకం ద్యూతకరః.
[అజ్జ మిత్తేఅ, కహిం తుమ్హాణం జూదిఅరో].

తీఱు నుత్సాహామే (బేరపు) లాభముగా గలదియు, ఐన వేశ్యా ఆపణస్య = భోగముది యను నంగడిలో, దాక్షిణ్య పణ్య సుఖనిష్క్రయసిద్ధిః = దాక్షిణ్యము - మొగమాటము - నేర్పు - అను సరకునకు సులువుగా సుఖము అను వెల చెల్లించుట కల్గుట, అస్తు = అగునుగాక.

వేశ్య - భోగముది - వెలయాలు అనునది అంగడి. దానికి స్త్రీ పుంస యోగక్రీడయే సరకులు పఱచుకొనియుండు కొట్టు. అక్కడనే గర్జముతోడి మాయలు కైతవములు కల్లలు పుట్టుట. దానికి మోసము - మనమున నొకటిగాను బయటికి నొకటిగాను ఉండుటయే ప్రాణము, సారము. లాభము ఏమనఁగా సురతోత్సవము. సరకు( = పణ్యము) దాక్షిణ్యము - మోమోటము, నేర్పు - వామ్యము మాని - ప్రత్యాలింగన ప్రతిచుంబనములు - ఎదురొత్తులు - మొదలగునవి ఒసంగుట - మొదలగునది.(ఆసరకు ఇచ్చి దానికి సుఖము - సౌఖ్యము - సౌగపు - అను వెలను సులువుగానీవు పొందుదువుగాక. లుకాసు లేకుండును గాక. ఇదెల్లనుంగూడ ఇది వసంతసేనకు కన్నెతికమనుటను సూచించును.

విటుఁడు భోగమువారియింటి పండితుఁడు, అనుభవశాలి, మర్మజ్ఞుఁడు - కావున చెప్పవలసిన సలహా - ఈ వేళలో ఈ వానలో అట్లు ఉద్దీపితవై వచ్చితివి. పొరపాటు లేక సుఖసిద్ధి - నూటికి నూఱు కలుగునుగాక అని చక్కని సలహా చెప్పి పోవుచున్నాఁడు. ఇతి నిష్క్రాన్తః - అని యుండవలయును. తానే చెప్పినాఁడుకదా, ప్రేషితోఽస్మి అని. ఐనను నిజముగా అతనికి వసంతసేన కులాంగనతా మార్గ్యములు తెలియవు. ఆమెకు ఈ యుపదేశమంతగా చెల్లదు.

యుష్మాకం ద్యూతకరః - మీ జూదరి. దాని యిల్లడ బంగారునగను జూదాన ఒడ్డి ఓడితిని అని సందేశము ధీరముగా పంపినాఁడుగాన దానినే అతనికి

విదూ—(స్వగతమ్) ఆశ్చర్యం భోః, ద్యూతకర ఇతి భణ న్త్యాలంకృతః ప్రియవయస్యః. (ప్రకాశమ్) భవతి ఏష ఖలు శుష్కవృక్షవాటికాయామ్. [హీ హీ భో జూదిఅరో త్తి భణన్తీఏ అలంకిదో పిఅవఅస్సో. భోది, ఏసో క్ఖు సుక్ఖరుక్ఖవాడిఆఏ].

వసన్త—ఆర్య, కా యుష్మాకం శుష్కవృక్షవాటి కోచ్యతే? [అజ్జ, కా తుహ్మాణం సుక్ఖ రుక్ఖవవాడిఆ వుచ్చది].

విదూ—భవతి, యత్ర న ఖాద్యతే న పీయతే. [భోది, జహిం ణ ఖాయీఅది ణ పీఈఅది].

(వసన్తసేనా స్మితం కరోతి)

విదూ—తస్మాత్ప్రవిశతు భవతీ. [తా పవిసదు భోదీ].

వసన్త—(జనాన్తికమ్) అత్ర ప్రవిశ్య కిం మయా భణితవ్యమ్ [ఏత్థ, పవిసిఅ కిం మఏ భణిదవ్వమ్].

చేటీ—ద్యూతికర, అపి సుఖస్తే ప్రదోష ఇతి. [జూదిఅర అవి సుహో దే పదోసో త్తి].

వసన్త—అపి పారయిష్యామి. [అవి పారఇస్సమ్].

---

చమత్కరించు పేరుగా నిపుణముగానే వ్యవహరించుచున్నది, దాన అతనిని సంతోష పెట్టుదును అని. మైత్రేయుఁడు దానిని వసంతసేన చారుదత్తునికి పెట్టిన అలంకారము అనుచున్నాఁడు.

అపి సుఖః తే ప్రదోషః - ఈసునిమాపు నీవు సుఖముగా హాయిగా నున్నదా?

అపి పారయిష్యామి = నేను (అంతవు - అట్లనుటవు) చాలుదునా, సమర్థను అగుదునా? తటాలున కలసికొన్న ప్రియునితో అత్యుత్కంఠితి తాను అధీరతమాని అట్లు ధీరముగా, ఇంచుక హేళన గర్భముగా పలుకఁగలనా?

చేటీ—అవసర ఏవ పారయిష్యతి. [అవసరో జ్జేవ పారఇస్సది].

విదూ—ప్రవిశతు భవతీ. [పవిసదు భోదీ].

వసన్త—(ప్రవిశ్యోపసృత్య చ, పుష్పైస్తాడయన్తీ) అయి ద్యూతకర, అపి సుఖస్తే ప్రదోషః. [అఇ జూదిఅర, అవి సుహో దే పదోసో].

చారు—(అవలోక్య) అయే, వసన్తసేనా ప్రాప్తా. (సహర్ష ముత్థాయ) అయి ప్రియే,

శ్లో. సదా ప్రదోషో మమ యాతి జాగ్రతః
సదా చ మే నిశ్వసతో గతా నిశా
త్వయా సమేతస్య విశాలలోచనే
మమాద్య శోకాన్తకరః ప్రదోషకః. 32

---

అవసర ఏవ పారయిష్యతి = సమయమే సామర్థ్యముం గూర్చును, పుష్పైః తాడయన్తీ - పూవులతో కొట్టుచు. అందులకై చేత పూవులు పట్టుకొనియే యున్నది. చేత పూలు విలాసమును పెంచును. లక్ష్మీ కేల్దమ్మి ప్రసిద్ధముగదా.

అయే ... = ఓహో వచ్చినది వసంతసేన. అయి - అని కోమలామంత్రణము - ఓ ప్రేయసీ.

శ్లో. 32. సదా = ఎల్లప్పుడును. ప్రదోషః = మునిమాపు, మమ జాగ్రతః యాతి = నాకు (నిద్రలేని) మెలఁకువతోడనే కడచును, సదా చ = ఎల్లప్పుడునే, మే = నాకు, నిశా = రాత్రి, నిశ్వసతః = నిట్టూర్చుచునే, గతా = కడచుచుండెను, విశాలలోచనే = నన్ను చూడఁగా ఇంత విప్పారినవే నీకన్నులు - ఓ వెడందకన్నుల (కోమలీ), అద్య = ఇప్పుడు, త్వయా సమేతస్య మమ = నీతో కూడగా నాకు - నీవు నన్నుం గూడఁగా, ప్రదోషకః = (ఆ జాగరణాది బహుదోషములతో కూడినదే (ఈ) మునిమాపు, శోకాన్తకరః = (నా) శోకములన్నియు తీర్చినదాయెను.

త త్స్వాగతం భవత్యై. ఇద మాసనమ్, అ త్రోపవిశ్యతామ్.

విదూ—ఇద మాసనమ్, ఉపవిశతు భవతీ. [ఇదం ఆసణమ్, ఉవవిసదు భోదీ].

(వసన్తసేనాసీనా. తతః సర్వ ఉపవిశన్తి.

చారు—వయస్య పశ్య పశ్య,

శ్లో. వర్షోదక ముద్గిర తా
శ్రవణాన్తవిలమ్బినా కదమ్బేన
ఏకః స్తనో ఽభిషిక్తో
నృపసుత ఇవ యౌవరాజ్యస్థః. 3౮

---

నేను మునిమాపును ఎప్పుడును జాగరముతోనే మేలుకొనియే పుత్తును. రాత్రి నిట్టూర్పులతోనే పుత్తును దాని దోషాలనే ఎంచుకొందును, దీని బీకు తనమునకునిట్టూర్చుచుందును మఱి యిప్పుడు నీతో కూడితిని. నీవు నన్నుం గలసికొంటివి. ఓ వెడందకన్నులకలికీ, ఇపుడు ఈమునిమాపు అన్ని శోకములం దోలి నన్ను సుఖమున - సంతోషమున - ముంచుచున్నది. (మఱి రాత్రియో ?).

శ్లో. 3౮. వర్షోదకం ఉద్గిరతా = వాననీరు క్రక్కుచున్నదైన, శ్రవణాన్తవిలమ్బినా = చెవికొనలో వ్రేలుచున్న, పూఁగమ్మయైన, కదమ్బేన = కడిమి పూవుచేత. ఏకః స్తనః = (దానికి సరిగా క్రిందనున్న) ఒక్క చన్ను, యౌవరాజ్యస్థః = యౌవరాజ్యమందు(అభిషేకింపఁబడుచు)న్న, నృపసుత ఇవ = రాజు కొమరుంబలె, అభిషిక్తః = అభిషేకింపఁబడుచున్నది.

నాయున(పెద్ద)రాజు ప్రక్కన నిలంబడి (సంతసపు - పొంగుతో) చూచుచుండఁగా పెద్దకొడుకు యౌవరాజ్యమున అభిషేకింపఁబడును. అట్లున్నది - (రెండవ చన్నును పొంగి చూచుచుండఁగా) అయొక్క చన్ను - ఎడమదే యగును, విలాసవతులు పూఁగమ్మను ఎడమచెవినే తాల్తురు, ప్రాయికముగా - కదంబము విప్పారి వంగి వంచిన కలశివలెనున్నది - అందుండి కారు వాననీరు దానఁ గుమ్మరించు అభిషేకోదకమువోలె నున్నది.

త ద్వయస్య, క్లిన్నే వాససీ వసన్తసేనాయాః. అన్యే ప్రధానవాససీ సముపనీయేతా మితి.

విదూ—య ద్భవా నాజ్ఞాపయతి. [జం భవం ఆణవేది].

చేటీ—ఆర్యమైత్రేయ, తిష్ఠ త్వమ్. అహ మే వార్యాం శుశ్రూషయిష్యామి. [అజ్జమిత్తేఅ, చిట్ఠ తుమమ్. అహం జ్జేవ అజ్జఅం సుస్సూసఇస్సమ్]. (తథా కరోతి.

విదూ—(అపవారితకేన) భో వయస్య, పృచ్ఛామి తావ త్తత్రభవతీం కి మపి. [భో వఅస్స. పుచ్ఛామి దావ తత్థభోదిం కిం పి].

చారు—ఏవం క్రియతామ్.

విదూ—(ప్రకాశమ్) అథ కింనిమిత్తం పున రీదృశే ప్రనష్ట చన్ద్రాలోకే దుర్దినాన్ధకార ఆగతా భవతీ. [అధ కింణిమిత్తం ఉణ ఈదిసే పణట్ట చన్దాలోప దుద్దిణ అన్ధఆరే ఆఅదా భోదీ].

చేటీ—ఆర్యే, ఋజుకో బ్రాహ్మణః. [అజ్జఏ, ఉజుఓ బమ్హణో].

---

తత్ = కావున, వసంతసేన యొందు పులు తడిసిపోయినవి, ప్రధానవాససీ = రెండు మేలి చీరెలు, పృచ్ఛామి కిం అపి = ఏమైనను అడిగెదను - పలుకరించి కలుపుగోలుగా నుండుట నాణెము మర్యాదయగుం గావున.

అథ ... పునః - మఱి - ఇట్లు - అని ప్రశ్నను నాజూకుగా తొడంగుట. ప్రణష్టచన్ద్రాలోకే = వెన్నెల లేకపోయిన, దుదిన నాన్ధకారే = మబ్బుకమ్మిన కటికి చీకటిలో - వానలోను చీకటిలోను, ఆగతా భవతీ = అమ్మగారు వచ్చినారే - అమ్మ వచ్చినదే! ఋజుకః బ్రాహ్మణః = వంకర - లోఁతు - లేనివాఁడు (ఈ) బ్రాహ్మణుఁడు - కల్లకపటము ఎఱుఁగనివాఁడు, అనాగరకుఁడు అనుట. అట్లనక-

వసన్త—నను నిపుణ ఇతి భణ. [ణం ణిఉణే త్తి భణాహి].

చేటీ—ఏషా ఖ ల్వార్యా ఏవం ప్రష్టు మాగతా - 'కియ త్తస్యా రత్నావల్యా మూల్యమ్' ఇతి. (ఏసాక్ఖు అజ్జఆ ఏవ్వం పుచ్ఛిదుం ఆ అదా - 'కేత్తి అంతా ఏర అణావలీ ఏ ముల్లం' త్తి)

విదూ—(జనాన్తికమ్) భోః, భణితం మయా, యథాల్ప మూల్యా రత్నావలీ, బహుమూల్యం సువర్ణభాణ్డమ్. న పరితుష్టా. అపరం యాచితు మాగతా. [భో, భణిదం మఏ, జధా అప్ప ముల్లా రఅణావళీ, బహుముల్లం సువణ్ణభణ్డఅమ్. ణ పరితుట్టా. అవరం మగ్గిదుం ఆఅదా].

చేటీ—సా ఖ ల్వార్యయా ఆత్మీ యేతి భణిత్వా ద్యూతే హారితా. స చ సభికో రాజవార్తాహారీ న జ్ఞాయతే కుత్ర గత ఇతి. [సా క్ఖు అజ్జఆఏ అత్తణకేరకేత్తి భణిఅ జూదే హారిదా. సో అ సహిఓ రాఅవాత్థహారీ ణ జాణీఅది కహిం గదో త్తి].

నను నిపుణ ఇతి భణ = ఓయి, నిపుణుడు, చెప్పనిదానిం గూడ ఊహించి యెరుఁగు నేర్పు కలవాఁడె, అనుము, కియత్ తస్యాః రత్నావళ్యాః మూల్యం = ఎంత ఆ రతనాలహారపు వెల?

అపరం మార్గయితుం = మఱి యింకను దేనినైనను అడిగి తీసికొనుటకు. సా ఖలు ఆర్యయా ... = అది అక్కచేత తన సొంతము అని చెప్పి జూదాన ఒడ్డి ఓడఁబడినది కదా - స చ సభికః ... = ఆజూదపు నాయకుఁడు ..., ఇత్యాది యంతయు మునుపు చారుదత్తుఁడు సువర్ణభాండమును పోఁగొట్టినందులకు మైత్రేయునిచే చెప్పిపంపిన సమాధానపు మాటలే, ఇపుడు వసంతసేన చేటిచే రత్నావళిం గూర్చి చెప్పించుచున్నది. - తానును దానిని ఒడ్డి జూదమాడి పోఁగొట్టుకొన్నట్లు, మరల ధనమిచ్చి దానినే తీసికొందమన్న ఆజూదపు నాయకుఁడు రాజునకు వార్తాహారి - సమాచారము కొనిపోవు ఉద్యోగమువాఁడు, ఒకచోట నుండువాఁడును

విదూ—భవతి, మన్త్రితమేవ మన్త్ర్యతే. [భోది, మన్తిదం జ్జేవ మన్తీఅది]

చేటీ—యావత్సో ఽన్విష్యతే తావదిదమేవ గృహాణ సువర్ణభాణ్డమ్. [జావ సో అణ్ణేసీఅది తావ ఏవం జ్జేవ గేణ్హ సువణ్ణభణ్డ అమ్]. (ఇతి దర్శయతి.

(విదూషకో విచారయతి)

చేటీ—అతిమాత్ర మార్యో నిధ్యాయతి. తత్కిం దృష్టపూర్వం తే. [అదిమేత్తం అజ్జో ణిజ్ఝాఅది. తా కిం దిట్టపురువ్వం దే].

విదూ—భవతి, శిల్పకుశలతయా వబధ్నాతి దృష్టిమ్. [భోది, సిప్పకుసలదాఏ ఓబన్ధేది దిట్టిమ్]

చేటీ—ఆర్య, వఞ్చితో ఽసి దృష్ట్యా. తదే వేదం సువర్ణభాణ్డమ్. [అజ్జ, వఞ్చిదోసి దిట్టీఏ. తం జ్జేవ ఏదం సువణ్ణభణ్డ అమ్].

---

సులువుగా దొరకువాఁడును కాఁడు - ఎక్కడికి పోయినాఁడో - అమాశే అను చున్నాఁడు, మైత్రేయుఁడు - భవతి మన్త్రితం ఏవ మన్త్ర్యతే = అమ్మా (మా) చెప్పినదానినే నీవును చెప్పుచున్నావే.

అతిమాత్రం ఆర్యో నిధ్యాయతి - అయ్య ఎంతయును పరికించి చూచుచున్నాఁడు! తత్ కిం దృష్టపూర్వం తే = మఱి యేమి ఇది మును పు (ఎప్పుడైనను) చూడఁబడినదా? శిల్పకుశలతయా - (కంసాలి) పని నేర్పుగలదగుటచేత, ... చూపును పట్టుకొనుచున్నది - తన మీఁదనే నిలుపునట్లు చేయుచున్నది - అందముగా నుండి ఆకర్షించుచున్నది. వఞ్చితః అసి ... = చూపుచే మోసపోయి

విదూ—(సహర్షమ్) భో వయస్య, త దే వేదం సువర్ణ భాణ్డమ్, య దస్మాకమ్ గృహే చోరై రపహృతమ్. [భో వఅస్స, తం జ్జేవ ఏదం సువణ్ణ భణ్డ అమ్, జం అమ్హాణం గేహే చోరేహిం అవ హిదమ్).

చారు—వయస్య,

శ్లో. యో ఽస్మాభి శ్చిన్తితో వ్యాజః
కర్తుం న్యాసప్రతిక్రియామ్
స ఏవ ప్రస్తుతో ఽస్మాకం
కిం తు సత్యం విడమ్బనా. ౩౮

విదూ—భో వయస్య, సత్యం శపే బ్రాహ్మణ్యేన. [భో వఅస్స, సచ్చం సబామి బమ్హణేణ].

---

తివి. అదియే ఈసువర్ణభాండము, యత్ అస్మాకం గేహే చోరైః అపహృతమ్ = ఏది మనయింటిలో దొంగలచే దొంగిలింపఁబడినదో - గాని నే మరల వీరిచేత చూడఁ గలిగినందులకు 'హాస్యము.'

శ్లో. ౩౮. న్యాస ప్రతిక్రియాం కర్తుం = ఇల్లడకు ప్రతికారము - మారు సేఁత గా - దానికి ఈడుగా ఇచ్చుటకు, యః వ్యాజః = ఏసాకు, అస్మాభిః చిన్తితః = మనచే ఆలోచింపఁబడినదో, స ఏవ = అదియే, అస్మాకం = మనకు, ప్రస్తుతః = తొడంగఁబడినది, చేయఁబడినది - కింతు = మఱి, సత్యం = నిజమా, విడమ్బనా = మోసమా ?

ఇల్లడను ఇచ్చి తీర్చుటకు మనము ఆలోచించి (ప్రయోగించి)న సాకునే మనకును ప్రయోగించుచున్నారు - నిజమో, ఇది మోసమో - తెలియకున్నది.

బ్రాహ్మణ్యేన - బ్రాహ్మణ భావముమీఁద, శపే = ఒట్టుపెట్టెదను - ఇది 'సత్యము' అని. అది యసత్య మగునేని నాకు బ్రాహ్మణ్యము పోవుగాక - అని ఒట్టుపెట్టుటీరు.

చారు—ప్రియం నః ప్రియమ్.

విదూ—(జనాన్తికమ్) భోః పృచ్ఛామి నను కుత ఇదం సమాసాదిత మితి. [భో, పుచ్ఛామి ణం కుదో ఏదం సమాసాదిదం త్తి].

చారు—కో దోషః?

విదూ—(చేట్యాః కర్ణే) ఏవ మివ. [ఎవ్వం విఅ].

చేటీ—(విదూషకస్య కర్ణే) ఏవమివ. [ఎవ్వం విఅ].

చారు—కి మిదం కథ్యతే? కిం వయం బాహ్యాః?

విదూ—(చారుదత్తస్య కర్ణే) ఏవ మివ. [ఎవ్వం విఅ].

చారు—భద్రే, సత్యం త దేవేదం సువర్ణభాణ్డమ్.

చేటీ—ఆర్య, అథకిమ్. [అజ్జ, అధం ఇం].

చారు—భద్రే, న కదాచి త్ప్రియనివేదనం నిష్ఫలీకృతం మయా. త ద్గృహ్యతాం పారితోషిక మిద మఙ్గులీయకమ్. (ఇత్యనఙ్గులీయకం హస్త మవలోక్య లజ్జాం నాటయతి).

వసన్త—(ఆత్మగతమ్) అత ఏవ కామ్యసే. [అదో జ్జేవ కామీఅసి].

---

కర్ణే - చెవిలో - రహస్యముగా చెప్పుచున్నందున - కిం వయం బాహ్యాః = నేనేమి బయటి - పరాయి - వాఁడనా, వినఁగూడదా? సత్యం తత్ ఏవ ... = నిజముగా అదియేనా ఈ సువర్ణ భాండము, అథ కిం = అవును, ఇదం అఙ్గులీయకం = ఈ యుంగరము, పారితోషికం = ఇనాము.

అతః ఏవ కామ్యసే = అందువలననే కామింపఁబడుచున్నావు - నేను నిన్ను కామించుచున్నాను, 'చారుదత్తుఁడవు' అని - అందమైన (దత్తము - ఈవి -

చారు—(జనాన్తికమ్) భోః, కష్టమ్!

శ్లో. ధనై ర్వియుక్తస్య నరస్య లోకే
కిం జీవితే నాదిత ఏవ తావత్
యస్య ప్రతీకారనిరర్థకత్వా
త్కోపప్రసాదా విఫలీభవన్తి. ౪౦

అపి చ,

శ్లో. పక్షవికల శ్చ పక్షీ శుష్క శ్చ తరుః సర శ్చ జలహీనమ్
సర్ప శ్చోద్ధృతదంష్ట్ర స్తుల్యం లోకే దరిద్రశ్చ. ౪౧

అపి చ,

---

ఇనాము) కలవాఁడవు, దాన దారిద్ర్యము నైనను విలుచుకొన్నవాఁడవు - అని. వసంతసేన ఇట్లు తన యనురాగనిబంధనను చెప్పుచున్నది, ధనమునకు వలచుదానఁగాను, త్యాగశీలమునకు వలచుదానను - అని.

శ్లో. ౪౦. ధనైః వియుక్తస్య నరస్య = ధనముచే విడువఁబడిన - ధనము లేని - జనునికి, లోకే = లోకాన, ఆదిత ఏవ తావత్ = అసలు మొదటనే, తొలుతనే, కిం జీవితేన = బ్రదుకు ఎందులకు? యస్య = ఏలన, అతనియొక్క కోపప్రసాదాః = కోపములును అనుగ్రహములును, ప్రతీకార నిరర్థకత్వాత్ = ప్రతీకారము - బదులు - చేయులేక నిష్ప్రయోజనములగుటవలన, విఫలీభవన్తి = నిష్ఫలము లగును.

ఇట్లు పేదవడితినే, సంతోష సూచకముగా ఇనాం ఈయులేక పోయితినే, ఇఁక నెందులకు అసలు నేను బ్రదుకుట?

శ్లో. ౪౧. పక్షవికలః పక్షీ చ = ఱెక్కలు విఱిగిన పక్షియు, శుష్కః తరుః చ = ఎండిపోయిన చెట్టు, జలహీనమ్ సరః చ = నీరు లేని చెఱువును, ఉద్ధృతదంష్ట్రః = కోఱలు పెఱికివేయఁబడిన, సర్పః చ = పామును, దరిద్రః చ = పేదయు, లోకే = లోకాన, తుల్యం = సమానము.

ఇది లోకాన ఉపయోగహీనమైనవాని జాబితా - అందలివాఁడు దరిద్రుఁడు.

శ్లో. శూన్యై ర్గృహైః ఖలు సమాః పురుషా దరిద్రాః
కూపై శ్చ తోయరహితై స్తరుభి శ్చ శీర్ణైః
య ద్దృష్టపూర్వజనసంగమవిస్మృతానా
మేవం భవన్తి విఫలాః పరితోషకాలాః. ౪౨

విదూ—భోః, అలమతిమాత్రం సంతాపితేన. (ప్రకాశమ్ సపరిహాసమ్) భవతి, సమర్ప్యతాం మమ స్నానశాటికా [భో అలం అదిమేత్తం సంతప్పిదేణ. భోది, సమప్పీఅదు మమ కేరిఆ ణ్హాణసాడిఆ].

శ్లో. ౪౨. దరిద్రాః పురుషాః = పేదపడిన జనులు, శూన్యైః గృహైః = పాడువడిన యిండ్లతోను, తోయరహితైః = నీళ్ళులేని, కూపైః చ = బావులతోను, శీర్ణైః = ఎండిచీలిన, తరుభిః చ = చెట్లతోను, సమాః ఖలు = సమానులు గదా. యత్ = ఏలన, దృష్టపూర్వ జన సంగమ విస్మృతానాం = మునుపు మాచి (దానసేవరల(జూడ(గోరిన) జనుల సంగమమున, ఇప్పటి పేదదశను మఱచి (పూర్వపు సంపన్నదశను తలంపునకు తెచ్చుకొను) వారికి, పరితోషకాలాః = ఎంతయో సంతోషము అనుభవింపవలయు (ఈసమాగమ) కాలము, ఏవం విఫలాః భవన్తి = ఇట్లు విఫలములు - ప్రయోజనహీనములు - అగును.

చేటికి పరితోషమున పారితోషికాంగుళీయకము ఈయలేకపోయితిని కదా - అట్టే - వసంతసేనయు నా మునుపటి సంపన్నదశను ఎఱింగినదే, ఇపుడు నన్నుం గలసికొన్నది - దానికి ఎంత సంతోషమునకు, నాకు ఎంత సంతోషమునకు ఇది కాలము! మఱి ఇది - యీసమాగమము - విఫలమే కదా అగును. నా సంపద నాకు స్మరణకు వచ్చి ఏమి ప్రయోజనము? (దానికి వచ్చియు నేమి?), నిష్ప్రయోజనమే కదా అగును. ఇది యెంత పరితోషకాలము! దానికి ఎంత అవకాశము లేకయున్నది! (నాసంపద నాకు వట్టిజ్ఞాపకమాత్రము.) అని యిట్లు 40, 41, 42, జనాంతికము - చారుదత్తు, దుఃఖపుఁదలపోఁత వయస్యుతో.

స్నానశాటికా - స్నానము చేయునపుడు నేను కట్టుకొను (పాఁత) గుడ్డ పాఁత, సువర్ణభాండమును అందు మూటకట్టియుంటిని. అది ఆ పేలిక నాది, దానిని నాకు ఇచ్చివేయుము - ఇది మైత్రేయుఁడు చేయు పరిహాసము, వసంతసేనను - అది నీవద్ద నేనుంచిన న్యాసము - అని.

వసన్త—ఆర్య, చారుదత్త, యుక్తం నేద మనయా రత్నావల్యా ఇమం జనం తులయితుమ్. [అజ్జ చారుదత్త, జుత్తం ణేదం ఇమాఏ రఅణావలీఏ ఇమం జణం తులఇదుమ్].

చారు—(సవిలక్షస్మితమ్) వసన్తసేనే పశ్య పశ్య,

శ్లో. కః శ్రద్ధాస్యతి భూతార్థం?
సర్వో మాం తులయిష్యతి.
శఙ్కనీయా హి లోకే௨స్మి
న్నిష్ప్రతాపా దరిద్రతా. 43

విదూ—చేటి, కిం భవత్యా ఇహైవ సుప్తవ్యమ్? [హాఞ్జే, కిం భోదీఏ ఇధజ్జేవ సువిదవ్వమ్?]

---

ఆర్యచారుదత్త - అని పేరుతో సంబోధించు చున్నది, వసంతసేన - చారుదత్తన్య - ఇమాం జనం తులయితుం = ఈజనమును - నన్ను అనుట - నన్ను చులకన చేయుట కాని పరీక్షించుట కాని తగదు. నేను ధనపరను ఆభరణాసక్తను కాను - అనుట. సవిలక్ష ... = విలక్ష - మర్మణము తాఁకనాడినం గలుగు సిగ్గుతోడి నవ్వుతో.

శ్లో. 43. కః = ఎవఁడు, భూతార్థం = నిజమును - నిజముగా జరిగిన దానిని, శ్రద్ధాస్యతి = నమ్మఁగలఁడు? సర్వః = ఎల్లరు, మాం = నన్ను తులయిష్యతి = చులకనచేసి సందేహింతురు - గుమానుపడుదురు. నిష్ప్రతాపా = పౌరుషహీనమైన, దరిద్రతా = దారిద్ర్యము, అస్మిన్ లోకే = ఈలోకాన, శఙ్కనీయా హి = సందేహపడఁదగినది కదా - చూ. III. 24.

దొంగలు పడినారు అని కల్పించి, దరిద్రుఁ డగుట, తానే అనువర్ణభాండమును హరింపఁగోరినాఁడు - అని అందురు లోకులు. పేదతికమును ఇతరులు లక్ష్యపెట్టఁగల ప్రతాపము - బలము - పౌరుషము - లేదు, లోకమున.

కిం ... ఇహైవ స్వప్తవ్యమ్ - మీరు ఇక్కడనే నిద్రింపవలయునా, నిద్రింతురా ఏమి - ఇది వట్టి వెక్కలియైనవాఁడు అడుగఁదగిన ప్రశ్న - కావున నే

చేటీ—(విహస్య) ఆర్యమైత్రేయ, అతిమాత్ర మిదానీం ఋజు మాత్మానం దర్శయసి [అజ్జ మిత్తేఅ, అదిమేత్తం దాణిం ఉజుఅం అత్తాణఅం దంసేసి].

విదూ—భో వయస్య, ఏష ఖ ల్వపసారయ న్నివ సుఖోప విష్టం జనం పున రపి విస్తారివారిధారాభిః ప్రవృష్టః పర్జన్యః. [భో వఅస్స, ఏసో క్ఖు ఓసారఅన్తో విఅ సుహోవవిట్టం జణం పుణో వి విత్థారివారిధారాహిం పవిట్టో పజ్జణ్ణో].

చారు—సమ్య గాహ భవాన్

శ్లో. అమూ ర్హి భిత్త్వా జలదాన్తరాణి
పఙ్కాన్తరా ణీవ మృణాలసూచ్యః
పతన్తి చన్ద్రవ్యసనా ద్విముక్తా
దివో ఽశ్రుధారా ఇవ వారిధారాః. ౪౪

---

చేటి అనుచున్నది - 'అతిమాత్రం ఋజుం - మిక్కిలియు బోళా మానిసివి - ఉత్తాన హృదయుఁడు - కల్ల కపటము ఎఱుఁగనివాఁడు - భోగము వారు వారు, వారు వచ్చుట నిద్రించుటకే - కాఁగా - వారు రాత్రి యగుచున్నను - వాన చీకట్లుగా ఉన్నను - ఇంకను సెలవు గొనక ఉన్నారే - అన్నట్లు - ఇది మోటు గాని మాట. అది భోగముది; జాణ, కావున - ఈబాపనయ్య ఏమియు లోక వృత్తమే ఎఱుఁగని వాఁడుగా ఉన్నాఁడే అని మొగానసే - ఋజువుఁడు - అని యనుచున్నది. అపసారయన్ ఇవ = తొలఁగిపొమ్మనుచుం బోలె - పొందు లోప లికి అని తఱిమినట్లు, విస్తారవారిధారాభిః = మిక్కిలియైన వర్షధారలతో - ప్రవృష్టః పర్జన్యః = కురిసినది మేఘము - 'పర్జన్యః' - ధ్వనదంబుదము - ఉఱుము మేఘము. పుల్లింగముచే - ధారలను కఱ్ఱలతో - (బెదరించి) తఱిమినట్లు. తఱిమినాఁడు అనుట.

శ్లో. ౪౪. అమూః = ఇవిగో, వారిధారాః = వాననీటిధారలు (= చాళ్లు), పఙ్కాన్తరాణి = బురదనడిమి - చోట్లను, మృణాళసూచ్యః ఇవ = తామర మొసుల వలె, జలద అన్తరాణి = మేఘముల నడిమిప్రదేశమును, భిత్త్వా = పగుల్చి

అపి చ,

శ్లో. ధారాభి రార్యజనచిత్తసునిర్మలాభిః,
చణ్డాభి రర్జునశరప్రతికర్కశాభిః,
మేఘాః స్రవన్తి బలదేవపటప్రకాశాః
శక్రస్య మౌక్తికనిధాన మి వోద్గిరన్తః. ౧౫

ప్రియే, పశ్య పశ్య,

---

కొని, చన్ద్రవ్యసనాత్ = చంద్రుని (తనకాంతుని) ఆపదవలన, విముక్తాః = విడువ (= రాల్ప)(బడిన, దివః = మింటి (మిన్నను నాయికయొక్క), అశ్రుధారా ఇవ = కన్నీటిచాళ్లవలె, పతన్తి = పడుచున్నవి.

నల్లని మేఘాలు కమ్మిన మింటినుండి వానధారలు పడుట యెట్లున్నది అనఁగా, బురదను చీల్చుకొని తామరతూటమోసులు వెలువడుటవలె నున్నది. చంద్రుఁడను కాంతుని చావునకు మిన్నమ్మ రాల్చు కన్నీటి ధారవలె ఉన్నవి.

శ్లో. ౧౫. బలదేవ పటప్రకాశాః = నీలాంబరుని వస్త్రపుఁ గాంతివంటి కాంతిగలవై, మేఘాః = మొయిళ్లు, ఆర్యజనచిత్త ... = సాధువుల మనస్సువలె, అతి నిర్మలములై, చణ్డాభిః = మిక్కిలివేగముగలవై, అర్జునశర ... = అర్జునుని బాణముల వలె కఱకును గట్టియు ఐన, ధారాభిః = ధారల (చాళ్ల) చేత, శక్రస్య = ఇంద్రునియొక్క, మౌక్తికనిధానం ఇవ = ముత్యాల కొటారుం బోలె, ఉద్గిరన్తః = క్రక్కుచున్నవై, స్రవన్తి = కురియుచున్నవి.

మేఘాలు - నీలాంబరాలవలె నున్నవి. వాని వానధారలు నిర్మలములుగా తెల్లగా ఉన్నవి - చాల వడియు కఱకును కలిగియున్నవి, ఇంద్రుని ముత్యాల కొటార్లు క్రుమ్మరింపఁబడుచున్నవా అన్నట్లు ఉన్నవి.

ప్రియే - ప్రేయసీ - చారుదత్తయ్య వసంతసేనను ఇట్లు - ప్రియురాలా - అని సంబోధించినాఁడు - బుజుక మైత్రేయుఁడు గాని - జాణ చేటి గాని - వారి శృంగారపుమాటలకును చేఁతలకును అడ్డము గారు.

శ్లో. ఏతైః పిష్టతమాలవర్ణకనిభై రాలిప్త మమ్భోధరైః
సంసక్తై రుపవీజితం సురభిభిః శీతైః ప్రదోషానిలైః
ఏ షామ్భోదసమాగమప్రణయినీం స్వచ్ఛన్ద మభ్యాగతా
రక్తా కాన్త మి వామ్బరం ప్రియతమా విద్యు త్సమాలిఙ్గతి.

శ్లో. ౪౮. పిష్టతమాల వర్ణకనిభైః = నూరిన చీకటిచెట్ల పూలముద్ద మైపూతం బోని, ఏతైః = అమ్భోధరైః = ఈ మేఘాలచేత, లిప్తం = పూయఁబడి నదియు - నల్లగా నున్నగా మెఱుఁగాఱుచున్నదియు, శీతైః - చల్లనివియు, సుర భిభిః = సువాసన గుబాళించుచున్నవియునై, సంసక్తైః = వీడక, తెఱపి లేక అంటుకొన్నట్లు వీఁచుచున్న, ప్రదోషానిలైః = మునిమాపుగాలులచే (అప్యాయ ముగా) వీవఁబడినదియు అగు, అమ్బరం = మింటి (నాయకు)ని, పుంలింగము అవి వక్షితము; ఏషా = ఇదిగో, అమ్భోదసమాగమ ప్రణయినీ = మేఘపురాకచే, ఎంతయు (ప్రణయ = ) అనురాగముగలదై, స్వచ్ఛన్దం = తనంతట - తనయిచ్ఛ మెయి - ఆగతా = వచ్చినదై, స్వయంగ్రాహముగా అనుట, రక్తా = అనురాగము గల, ప్రియతమా = ప్రేయసి, కాన్తం ఇవ = కాంతునిం బోలె, సమాలిఙ్గతి = బిగ్గ కౌగిలించు కొనుచున్నది.

మైపూతతో నిగనిగలాడుచు (అత్తరువుల) సువాసన గమ్మనుచుండు కాంతుని వానచలిమిరిలో అనురాగవతియైన కాంత తానై పైకొని కౌఁగిలించు కొన్నట్లు, అట్టి మింటిని మెఱపుతీఁగ బోఁడి తానై పైకొని కౌఁగిలించు కొన్నది.

అట్లు పలుకుటచే తానును ఆచల్లనివేళలో వెచ్చని వసంతసేన స్వయంగ్రా హపుఁ గౌఁగిలి కోరినట్లు నాజూకుగా రసికుఁడై సూచించినాఁడు. వసంతసేనయు ఉద్దీప్త అయ్యేయున్నది. తానును అట్టి స్వయంగ్రాహాలింగన సౌఖ్యమునకు ఉవ్విళులూఱుటను సూచించినాఁడు - వసంతసేన ప్రౌఢ, ఇంగిత మెఱింగినది - కావున ఆమెకు ఇముడక శృంగారభావము వెలువడినది. దానిని వెలివఱుచుచు చారుదత్తుని కౌఁగిలించుకొన్నది. అప్పుడు చారుదత్తునికి ఎట్లుండును! ఆతాఁకుకు సుకమునకు సొగయుచు ప్రత్యాలింగనముచేసి - కౌఁగిలింతలోనే పలుకు చున్నాఁడు.

(వసన్తసేనా శృఙ్గారభావం నాటయన్తీ చారుదత్త మాలిఙ్గతి)

చారు—(స్పర్శం నాటయ న్ప్రత్యాలిఙ్గతి)

శ్లో. భో మేఘ గమ్భీరతరం నద త్వం
తవ ప్రసాదా త్స్మరపీడితం మే
సంస్పర్శరోమాఞ్చితజాతరాగం
కదమ్బపుష్పత్వ ముపైతి గాత్రమ్. ४౭

విదూ—దాస్యాఃపుత్ర దుర్దిన, అనార్య ఇదానీ మసి త్వమ్, య దత్ర భవతీం విద్యుతా భీషయసి. [దాసీఏపుత్త దుద్దిణ, అణజ్జో దాణిం సి తుమమ్, జం అత్తభోదిం విజ్జుఆఏ భీసావేసి].

---

శ్లో. ४౭. భోమేఘ = ఓయి మొయిలయ్యా, త్వం = నీవు, గమ్భీరతరం = ఇంకను లోఁతు మ్రోఁతగా - బిగ్గఱగా, నద = ఉఱుము. తవ ప్రసాదాత్ = నీయనుగ్రహమువలన, మే = నాయొక్క, స్మరపీడితం గాత్రం = మరునిచే నలుపఁబడి (వసంతసేన) దేహము, సంస్పర్శ రోమాఞ్చిత జాతరాగం = తాఁకుడునను పులకరించి, అనురాగము పొడమినదై, కదమ్బపుష్పత్వం = (ఎట్టి) కడిమి పూఁత యగుటను, ఉపైతి = పొందుచున్నది.

ఓయి, నాకాంత నన్నుంగూడినది - గర్జ అయోగ వియోగములయందు బాధకమైనది, సంయోగమున సుఖవర్ధక మగును. మునుపటికంటెను గట్టిగా ఉఱుము - నీయనుగ్రహమువలన వసంతసేన స్మరోద్దీపితయై నన్నుం గూడవచ్చి, ఇదె తానై నన్ను కౌఁగిలించుకొన్నది. దాని ధీరతచే కౌఁగిలి మఱియు బిగియును-పోయిగోల్పును. నాదేహము (గ్రీష్మమునను కడిమివోలె) మరునిచే ఎంతయు నలిగినది. ఈ కౌఁగిలి తాఁకుడువలన, నీ నీటిమీఁదిగాలికి కడిమిపువ్వు ఎట్లు ఒక్కుమ్మడి పొడమి అకరువులుపొడిచి ఎట్టనగునో అట్లు పులకలుపొడిచి, కూటమి కోరిక పొడమినదైనది. నీగర్జ నాకెంతయు ఉపకారకము.

దాస్యాఃపుత్ర - అని అలుక్సమాసము - లంజాకొడుకా - అని తిట్టు దాని యర్థము. దుర్దిన = దుర్దినిగా, అనార్యః = చెడ్డవాఁడవు - ఖలుఁడవు - యత్ - ఏలన - అత్రభవతీం = ఈ వసంతసేనమ్మను ... = మెఱుముచే బెదరింతువు!

చారు—వయస్య, నార్హ స్యుపాలబ్ధుమ్.

శ్లో. వర్షశత మస్తు దుర్దిన
మవిరతధారం, శతహ్రదా స్ఫురతు
అస్మద్విధదుర్లభయా
యదహం ప్రియయా పరిష్వక్తః. ౪౮

అపి చ, వయస్య,

శ్లో. ధన్యాని తేషాం ఖలు జీవితాని
యే కామినీనాం గృహమాగతానామ్,
ఆర్ద్రాణి మేఘోదకశీతలాని
గాత్రాణి గాత్రేషు పరిష్వజన్తి. ౪౯

---

నార్హసి ఉపాలబ్ధుమ్ = (ఇప్పుడు) తిట్టంగూడదు నీవు.

శ్లో. ౪౮. వర్షశతం = నూఱేండ్లు, అవిరతధారం = మానని - తెంపులేని - జల్లులుగలదిగా, దుర్దినం అస్తు = ఇట్లు మేఘములు కమ్మిన దినముగానే అగుఁగాక, శతహ్రదా = మెఱుమును, స్ఫురతు = మెఱయనీ, యత్ = ఏలన, అహం = నేను, అస్మత్ విధ దుర్లభయా = నాబోంట్లకు దొరకఁబోని, ప్రియయా = ప్రేయసిచేత, పరిష్వక్తః = కౌఁగిలించుకొనఁబడితిని.

తిట్టకోయి - నూఱేండ్లు ఇట్లు తెఱపిలేక దుర్దినమే అగునుగాక. మెఱుము - (నూఱు ధమధమలు గలది) మెఱయనీ. నాకు హాయియే - (ఇఁక భయము లేదు.) ప్రియ నన్ను కౌఁగిలించుకొని యున్నది.

శ్లో. ౪౯. (ఓయి,) యే = ఎవరు, గృహమాగతానాం = ఇంటికి వచ్చిన కాంతల, ఆర్ద్రాణి = తడిసినవియు, మేఘోదక శీతలాని = మబ్బునీటిచే - వానచే, చల్లనైనవియునగు, గాత్రాణి = అవయవములను, గాత్రేషు = తమ గాత్రములయందు, పరిష్వజన్తే = (కౌఁగిలించుకొందురో =) హత్తుకొందురో - తేషాం జీవితాని ధన్యాని ఖలు = వారి బ్రదుకు ఎంతో పుణ్యవంతము గదా.

ప్రియే వసన్తసేనే,

శ్లో. స్తమ్భేషు ప్రచలితవేదిసంచయాన్తం
శీర్ణత్వాత్కథమపి ధార్యతే వితానమ్,
ఏషా చ స్ఫుటితసుధాద్రవానులేపా
త్సంక్లిన్నా సలిలభరేణ చిత్రభిత్తిః. ౫౦

(ఊర్ధ్వ మవలోక్య) అయే ఇన్ద్రధనుః, ప్రియే పశ్య పశ్య,

---

మిత్రమా, వా రెంత ధన్యులయ్యా, (ఇపుడు నేనును) - తమ యింటికి చేర వచ్చిన ప్రియుల తడిసి చల్లనైన యవయవములను తమ యవయవములందు - దేన దేన దాని దాని - హత్తుకొనఁగందురో - ఏమి నేఁడు నాభాగ్యము! - అనుట.

ప్రియా వసంతసేనా,

శ్లో. ౫౦. ప్రచలిత వేది సఞ్చయాన్తం = కదలిపోయిన దిమ్మె (= వేది) యిటికలప్రోవుల నడిమిభాగముగల, వితానం = మేలుకట్టు, శీర్ణత్వాత్ చివికిన దగుటవలన, స్తమ్భేషు = కంబములయందు, కథం అపి = ఎట్టకేలకు, ధార్యతే = నిలిచియున్నది. అది నిజముగా పడిపోఁదగును. మఱి యెట్లో అందదుకులుగా నిలిచియున్నది - ఇక్కడనున్న, మన తలపై పడినను పడును. ఏషా, చిత్రభిత్తిః చ = ఈచిత్తరువుల గోడయు, స్ఫుటిత సుధాద్రవ అనులేపాత్ = పొక్కి చెమ్మగిల్లిన సున్నపు నీటిపూఁతవలన, సలిలభరేణ = (ఊరిన) లేక, కాఱిన నీటి మొత్తముతో, సంక్లిన్నా = ఎంతయు తడిసియున్నది.

చారుదత్తుఁడు మితిలేని సంపద కలిగియుండినాఁడు. వానిది పెద్ద బంగాళా - అందు అన్ని అమరికలును ఉండెడివి. ఇపుడు అన్నియు పాతవడినవి, చివికినవి, ఉప్పరిసినవి, పూఁత పొక్కి రాలుచున్నది. తోఁటలో దాని స్తంభాలు, చాందిని దిమ్మెలు కదలి నడుమ తెఱచికొన్నవి. వానికి తగిల్చిన చాందిని, గోడమీఁద చిత్తరువులు - అన్నియు ఉన్న పూర్వసంపన్నదశయు ఇప్పటి దరిద్రదశయు - దేనిని కాపాడుకొనలేని, చక్కదిద్దుకొనలేని యవస్థలో నుండుటయు సూచితము - ఇంత సేపును వారు చిత్తరుగోడల పుష్పవృక్షవాటికలో ఉన్నారు. మంచిదే - అది ఇపుడు చివికి చినిగి ఎట్లో నిలిచియున్నది. దాని చాందినికిందనే ఉన్నారు.

శ్లో. విద్యుజ్జిహ్వే నేదం మహేన్ద్రచాపోచ్ఛ్రితాయతభుజేన
జలధరవివృద్ధ హనునా విజృమ్భిత మి వాన్తరిక్షేణ. ౫౧

త దేహి, అభ్యన్తర మేవ ప్రవిశావః. (ఇ త్యుత్థాయ పరిక్రామతి)

శ్లో. తాలీషు తారం విటపేషు మన్ద్రం
శిలాసు రుక్షం సలిలేషు చణ్డం
సంగీతవీణా ఇవ తాడ్యమానా
స్తాలానుసారేణ పతన్తి ధారాః. ౫౨

---

ఐన్ద్రధనుః - ఓహో, ఇదిగో బొమ్మఖోరడు. అది రాత్రులందును అగపడునని వరాహమిహిరు బృహత్సంహిత.

చూ. జలమధ్యే ఽనావృష్టిః భువి సస్యవధ స్తరౌ స్థితే వ్యాధిః
వల్మీకే శస్త్రభయం నిశి సచివవధాయ ధను రైన్ద్రమ్.

'నిశి' అని కలదు, సచివయనుట రాజునకుం జెల్లి పాలకరాజుచావు సూచితమా?

శ్లో. ౫౧. ఇదం = ఇదిగో. విద్యుత్ జిహ్వేన = మెఱుము అను నాలుక కలదియు, మహేన్ద్రచాప ... భుజేన = ఇంద్రధనువను పైకి నిగిడ్చిన పొడుగు పాటి బాహువు గలదియు, జలధర వివృద్ధ హనునా = మేఘమను పెరిఁగిన గడ్డముగలదియునై, అన్తరిక్షేణ = మిన్ను, విజృమ్భితం ఇవ = ఆవులించినట్లు ఉన్నది. ఉత్ప్రేక్ష.

సంస్కృతపు భావేప్రయోగమునకు 'కర్తరి'గా తెలుఁగుమర్యాదగా టీక. రూపకముల గుంపు - పరంపర. ఆవులింతలోను, నాలుక బయటికి తోఁచును, చేయెత్తి విఱుచుకొనుట కలుగును, గడ్డమును పెరుఁగును - నోరు విశాలముగా తెఱచుటచేత. అనఁగా మరల పెద్ద జల్లు కొట్టునట్లున్నది. కావున లోపలికి ప్రవేశింతము( = అభ్యన్తరంఏవ ప్రవిశావః).

శ్లో. ౫౨. తాలానుసారేణ = తాలమును - పాటలో కాలక్రియామానము - (కొలతగా పడును తాళము -)ను అనుసరించి, తాడ్యమానాః = మీటఁ బడుచున్న - కొట్టఁబడుచున్న, సంగీతవీణాః ఇవ = పాటలు వాయింపఁబడుచున్న

[ఇతి నిష్క్రాన్తాః సర్వే]

## దుర్దినో నామ
## పఞ్చమోఽఙ్కః

---

వీణలవలె, ధారాః = వానధారలు, తాలీషు = తాడులందు = వాని యాకులం బడుటచే = 'తారము' గట్టి మ్రోఁత కలిగియు, విటపేషు = చెట్లకొమ్మలయందు – మన్ద్రం = బొంగుమ్రోఁతగాను, శిలాసు = ఱాలపై, రూక్షం = కఠినముగాను, సలిలేషు = నీళ్ళయందు, చణ్డమ్ = విసరుమ్రోఁతతోను – పతన్తి = పడుచున్నవి.

పెద్దవాన చుట్టు లోకమంతట పడుచున్నది. దేనం బడునో దానికి తగిన మ్రోఁత, పాటవాయించు వీణయొక్క పలు తెఱంగుల మ్రోతవలె, కలిగియున్నది. వీణవాదనమందును రాగము చక్కఁగా చెవికి ఇంపగుటకు తారత్వము మంద్రత్వము తీవ్రత్వము తుములత్వమును కలిగింపఁబడును. చారుదత్తునియింటిపట్టునసే ఇన్ని విధాలమ్రోఁత వినఁదగును!

ఇవ – అని ఉపమ.

తొలియంకమున ఒక యభిసరణము చేసినది, వసంతసేన. అది తన యింటను ఒకపాటి రహస్యముగా నుంచినది. విటప్రధాన చేటికలకు చెప్పలేదు. ఇరువురు చేటికలను ఒక చేటుని వెంటఁ గొని బయలుదేఱినది. అప్పటికి చారుదత్తుని యౌవనము ఉదాసీనమో అనుదాసీనమో ఎఱుఁగదు. నాఁడు కామదేవయాత్రలో చూపులు కలసి తనకు అభిలాష అంకురించినదే, చూతము కానీ అని బయలుదేఱినది. దారిలో మంచి తోడు లేనందున చాల ఇబ్బందులు పడినది.

ఇపుడు ఈయంకమునందలిదియు ఒక యభిసరణమే. తాను నాఁటి ప్రదోషమున రాఁగలనని చారుదత్తునికి ముందు సందేశము పంపి, అంతట బయలుదేఱినది. మనసున ఎంతయు నమ్మకము ధైర్యము కలిగియున్నది. చేత సువర్ణభాండమును రత్నావళియు, ఒక్కొక్కటియు తన వృత్తాంతముగలది యున్నది. ఉఱుములు మెఱుములు గాలులు వానలు చీకటులు. వానిని లెక్కసేయలేదు. కూడ విటుఁడు నిపుణుఁడు, తోడు. తాను ఎప్పుడెప్పుడు చారుదత్తుం గాంచి, ఏకసక్కెములతో స్వయంగ్రాహాలింగనము గావింతునా అనునంత ఉత్కంఠతోడి సంబరము కలిగి యున్నది.

చారుదత్తుఁడు ఉదయాన రత్నావళిని వసంతసేన కిచ్చి రమ్మని మైత్రేయుం బంపినాఁడు. కాని మైత్రేయుఁడు అట్లు ఇచ్చినాఁడుకాని, తాను అప్పుడే మరల లేదు. ప్రతిసందేశము గ్రహించినాఁడు. మఱి తన వాడుకబడి అందందు తిరిగి, పావురము గూటికిం బోలె, ప్రదోషమునకు (తన సంధ్యాదిక మంతయు ముగించుకొని) తనకై కనుపెట్టికొనియున్న చారుదత్తుం జేరఁబోయినాఁడు. చారుదత్తుఁడు విరాళిచే సంతప్తుఁడగుచున్నాఁడు. దానిని ఎవరితోను వావిచ్చి చెప్పఁడు. మైత్రేయునితో సయితమును. మైత్రేయుఁడు భోగముదాని పొత్తు వల దనియు అనును. మైత్రేయుఁడు అయభిసరణ ప్రతిసందేశమును ఇప్పుడు చారుదత్తునికిం జెప్పినాఁడు. ఇంతలో చేటునిచే తెలుపుకొన్నది, వసంతసేనయు.

వసంతసేన అత్యుజ్జ్వలముగా అలంకరించుకొన్నది. తన విటుని కూడ రమ్మన్నది. వసంతసేనసంపదకు అంతసుకు తగినవాఁడు వాఁడు, తన వెంట ఉత్సాహము గొల్పుచు 'వేశోపచారకుశలో వాగ్మీ మధురోఽథ' అనుటకుం దగినట్లు ఆ యకాలాకస్మిక వైశాఖ సాయంవర్షమును మధురముగా వర్ణించుచు వచ్చుచున్నాఁడు. వసంతసేనయు తనకు నిశ దారి యడ్డు సపత్నియయ్యెననియు, కొంగ 'బలే వాన' 'బలే వాన' అని తన్ను బెదరించుచున్న దనియు, మేఘుఁడు వెన్నెలను చంద్రునుండి ఒడిచి తనతో లాగుగొనిపోయె ననియు, దిక్కులు వియోగినులం బోలె రాజిల్లకున్నవనియు, మేఘుఁడు తన్ను ఉఱిమి బెదరించి, ధారలచేతులతో తడవుచున్నాఁడనియు, ఇంద్రుఁడు మునుపు తాను అహల్యకై పడినపాట్లు మఱచి, వానతో తన్ను అడ్డఁజాచుట తగవు గాదనియు, మఱి యెవరు గాని ఇఁక తన్ను ఎట్లును ఆఁపలే రనియు – ఆగాలివానదారిలో తన యుత్కంఠకు తగినట్లు పొంగిన భావములం బల్కుచు, చారుదత్తువాకిలి చేరి, విటచేటాకుల తన యింటికి పంపివేసి, చేటితో లోపలఁ జొచ్చినది. ఎక్కడ ఉన్నాఁడో చారుదత్తుఁడు అక్కడికి పోయి, ఎట్లో ధైర్యము పూని పూలు చల్లి, ఓయి జూదరి నీకు ఈమునిమాపు హాయిగా నున్నదా అని కుశలప్రశ్న అడిగినది. 'ఇప్పుడు, నీవు నన్ను కూడఁగా' అని యన్నాఁడు చారుదత్తుఁడు. అంతట తడి యుడుపులు మార్చుకొని సువర్ణభాండ రత్నావళుల గుట్టులం జెప్పుకొని వసంతసేనా చారుదత్తులు ఎకరారు పడిరి. ఇంతలో మరల క్రొత్త మచ్చులేవఁగా, మెఱపుతీఁగ కాంతుం బోలె అంబరముం గౌఁగిలింపఁగా, వసంతసేన ఇఁక తాళ లేక చారుదత్తుని స్వయంగ్రాహాలింగనము చేసికొన్నది. అంతట జల్లు పెద్దదికాఁగా చారుదత్తుఁడు తానును కౌఁగిలిబిగించి, ఆయాలింగనముతోనే ఆకాంతను లోఁగటికి కొంపోయినాఁడు.

అంతట లోపల ఏమేమి ప్రవర్తిల్లినదో తెలియదు, ఊహింపఁదగును. పష్ఠాంకారంభవాక్యములవలన ఊహింపఁదగును. వసంతసేన సురతశ్రాంతయై అక్కడనే తెల్లవాఱువఱకు నిద్రించినది. ఒకవేళ ఆమె ఆరాత్రియే తన యింటికి మరలునేమో యని చారుదత్తుఁడు వర్ధమానకుని రాత్రియే బండి పూన్చి సిద్ధముగా పెట్టుమన్నాఁడు. మఱి యట్లు పోలేదు. వసంతసేన తాను ఇంటిలోఁగటం జొచ్చినందులకు సంతసించి, లోపల పరిజనుల నందఱిం గలసికొని, పనుపడి, కూరిమితో ఎల్లర మనస్సులం జూఱఁగొన్నది, అంతలోనే, ఒండొరుల యెడఁ బాటున ఒండొరులకు దుఃఖముకలుగునంత; ధూతమ్మతో తాను దాసియే యనుచు అక్క చెల్లెలి చెలిమి కలిపినది. తాను చారుదత్తున్యాగుణనిర్జితదాసిగా నడుచుకొన్నది. సత్సురతోత్సవ మయినది కాఁబోలు. రతపరిశ్రాంతయై తెల్లవాఱినను నిద్ర మేలుకొనలేదు. చారుదత్తుఁడు వసంతసేనను లేపక ఆమెకు చెప్పక, మైత్రేయుని వర్ధమానకునికి చెప్పమని, తానే చేటికిని చెప్పి వసంతసేనను జీర్ణపుష్ప కరండమునకు రమ్మనుమని, పిలుచుకొని రమ్మని, ఏర్పాటుచేసి తా నచటికి పోయినాఁడు. వసంతసేనకును అట్లు పోవలయునని ఎంతయు ఆసకలిగియున్నది. ఇంతలో అబ్బాయి రోహసేనుఁడు రదనికవద్ద తనకు బంగారు ఆటబండి కావలయును, మట్టిబండి - మృచ్ఛకటి - అక్కఱలేదని మకురుతనము చేయం జూచి, ఆయింటి పేదఱికము తన మనస్సునకు కళుక్కుమనఁగా, వానిని బుజ్జగించి తన సువర్ణభాండమును వాని మట్టిబండిలో నింపి వానిని దానితో బంగారుబండి చేయించుకొమ్మని సముదాయించి పంపి, ఇంతలో వర్ధమానకుఁడు బండి తేఁగా వానిని తాళుమని తాను కాంతుదర్శనమునకుం దగినట్లు సొగసుచేసికొని ముస్తాబగుదునని బోయినది.

దుర్దినము అను

ఐదవ యంకము

ముగిసినది



# షష్ఠాఙ్కః



(తతః ప్రవిశతి చేటీ)

చేటీ—కథ మద్యాప్యార్యా న విబుధ్యతే, భవతు. ప్రవిశ్య ప్రతిబోధయిష్యామి. [కధం అజ్జవి అజ్జఆ ణ వివుజ్ఝది, భోదు. పవిసిఅ పడిబోధయిస్సమ్]. (ఇతి నాట్యేన పరిక్రామతి.

(తతః ప్రవిశ త్యాచ్ఛాదితశరీరా ప్రసుప్తా వసన్తసేనా)

చేటీ—(నిరూప్య) ఉత్తిష్ఠ తూత్తిష్ఠ త్వార్యా. ప్రభాతం సంవృత్తమ్. [ఉత్థేదు ఉత్థేదు అజ్జఆ. పభాదా సంవుత్తమ్].

---

తతః ప్రవిశతి చేటీ - అంతట చేటి ప్రవేశించుచున్నది. ఈ యంకమున పుష్పకరండకోద్యానమునకు చారుదత్తుని కడకు వసంతసేనం గొనిపోవలయు ఎడ్లబండిలో చెఱసాలనుండి కట్టు తెంపుకొని పరారియైన గోపాలదారకుఁడు తా నెవరికి అగపడక తప్పించుకొనుటకై ఎక్కుటయు, వసంతసేన ఇందు ఎక్కవలసినది, పొరపాటున శకారుని ఎడ్లబండిలో ఎక్కుటయు - ప్రస్తావించుటకు కడఁగఁబడుచున్నది. ఈ చేటి చారుదత్తుని యింటిది. వసంతసేన రతిశ్రమ ప్రసుప్త తెల్లవాఱినను ఇంకను నిద్రలేవనందున ఆమెను లేపుచున్నది. అంతట వసంతసేన ప్రవేశించుచున్నది - అనఁగా రంగమున ప్రేక్షకులకు అగపడుచున్నది. ఆచ్ఛాదితశరీరా = (నిద్రలక్షణముగా - ) కప్పుకొనఁబడిన - దేహముగలదై - ప్రసుప్తా - గాఢముగా నిద్రించుచున్నట్టిది. అట్టిది ప్రవేశించుట యనఁగా నాటకమున అట్లు రంగాన అగపడుట, అని అర్థము. రంగాన నిద్రం జూపకూడ దన్నను - ఇది అంతలో మేల్కొంచునది మర్షణీయము మా...శయన.....వర్జితః... అఙ్కః - ' సా. ద. 283. ప్రభాతం సంవృత్తమ్ = తెల్లవాఱుట ఐనది - తెల్లవాఱినది - అనుట.

వసన్తసేనా—(ప్రతిబుధ్య) కథం రాత్రి రేవ ప్రభాతం సంవృత్తమ్. [కధం రత్తి జ్జేవ పభాదం సంవుత్తమ్].

చేటీ—అస్మాక మేత త్ప్రభాతమ్. ఆర్యాయాః పునా రాత్రి రేవ. [అమ్హాణం ఏసో పభాదో. అజ్జఆఏ ఉణ రత్తి జ్జేవ].

వసన్త—చేటి, కుతః పున ర్యుష్మాకం ద్యూతకరః? [హఞ్జే, కహిం ఉణ తుమ్హాణం జూదిఅరో].

చేటీ—ఆర్యే, వర్ధమానకం సమాదిశ్య పుష్పకరణ్డకం జీర్ణోద్యానం గత ఆర్యచారుదత్తః. [అజ్జఏ, వడ్ఢమాణఅం సమాది సిఅ పుష్పకరణ్డఅం జిణ్ణుజ్జాణంగదో అజ్జచారుదత్తో].

---

కథం ఏమి! ఆశ్చర్యమును దెలుపును. రాత్రిః ఏవ ప్రభాతం సంవృత్తమ్ - రాత్రియే తెల్లవాఱిపోయినది. నాకు తెల్లవాఱకయే రాత్రికి తెల్లవాఱినదే, ఇంతలో అనుట. తనకు అది యింకను రాత్రిగానే ఒక్క నిముసముగానే తోఁచుచున్నది - కామక్రీడచేతను రవంత నిద్రచేతను అదంతయు ఒక్క నిముసమువలె - ఇంచుక రాత్రియే యనునట్లున్నది - కాని అంతలో తెల్లవాఱిపోయినది. ఇది భవభూతి ఉ. రా. చ. లో చెప్పిన - 'అవిదితగతయామా రాత్రి రేవ వ్యరంసీత్' వంటిమాట. కుత్ర పునః ... = మఱి మీ జూదరి యేడీ? చారుదత్తునికి పేరు చెప్పక జూదరి యనుట సుకుమారప్రణయ నిర్దేశము. చేటితో పేరు చెప్పి యడుగుట నాజూకు చమత్కారకారియు కాదు. చమత్కారహీనపు మాట ప్రగల్భ ఆమె పలుకదు.

వర్ధమానకం సమాదిశ్య = నౌకరునకు వర్ధమానుఁడను పేరివానికి ఉత్తరువు చేసి, పుష్పకరండకము - పూలకరాటము - ఎక్కువగా పూలచెట్లు ఉండి అవి దండిగా పూచుటచే తోఁటయే పూలబరణి యనఁదగిన ట్లుండుటచే ఆ 'సంజ్ఞ' పొందినది. మఱి యిపుడు అది జీర్ణోద్యానము - పెక్కేండ్లపాతది, ముదిరి ముసలిదై పోయినది. పూత - కాపు ఉడిగి ఎండఁబాఱు చెట్లు గలదైనందున 'జీర్ణోద్యానము' అనియు పేరుపడినది. తాను వసంతసేన ఒక వేళ రాత్రియే యింటికి మరలునేమో అని, అందులకై రాత్రియే బండిపూన్చి సిద్ధము గానుంచుమని

వసన్త—కిం సమాదిశ్య. [కింసమాదిసిఅ].

చేటీ—యోజయ రాత్రౌ ప్రవహణమ్. వసన్తసేనా గచ్ఛత్వితి. [జోఏహి రాత్తీఏ పవహణమ్, వసన్తసేనా గచ్ఛదు త్తి].

వసన్త—చేటి, కుత్ర మయా గన్తవ్యమ్. [హఞ్జే, కహిం మఏ గన్తవ్వమ్].

చేటీ—ఆర్యే, యత్ర చారుదత్తః. [అజ్జఏ, జహిం చారుదత్తో].

వసన్త—(చేటీం పరిష్వజ్య) చేటి, సుష్ఠు న నిధ్యాతో రాత్రౌ. తదద్య ప్రత్యక్షం ప్రేక్షిష్యే. చేటి, కిం ప్రవిష్టాహ మిహాభ్యన్తర చతుశ్శాలమ్? [హఞ్జే, సుట్ఠు ణ ణిజ్ఝాఇదో రాత్తీఏ. తా అజ్జ పచ్చక్ఖం పేక్ఖిస్సమ్. హఞ్జే, కిం పవిట్ఠా అహం ఇహ అబ్భన్తర చదుస్సాలఅమ్].

---

వర్ధమానకునికి ఉత్తరువు చేసినాఁడు. మఱి వసంతసేన అట్లు మరలిపోలేదు. అక్కడనే రతశ్రాంతయై, తెల్లవాఱినను మెలఁకువ రానంత గాఢముగా నిద్రపోయినది. తాను లేపలేదు. తానేమో జీర్ణోద్యానమునకు పోవుచు, నిద్రలేచిన తర్వాత వసంతసేనను ఆబండిలో అక్కడికి పిలుచుకొని రమ్మని అతనికి చెప్పియు, ఈ యేర్పాటునెల్ల చేటికిం జెప్పియు పోయినాఁడు. కావున, కిం సమాదిశ్య – ఏమని యుత్తరువు చేసి అని వసంతయడుగుచున్నది.

యోజయ రాత్రౌ ప్రవహణమ్ = రాత్రి బండి పూన్పుము – కట్టుము – వసంతసేన పోవును గాక – అని. కుత్ర = ఎక్కడికి? యత్ర చారుదత్తః – ఎక్కడ చారుదత్తయ్య ఉన్నాఁడో అక్కడికి – అప్రాత పూలబరణి తోఁటకు. చారుదత్తుని కడకు – అనుమాట తనకు ఎంతో ఆప్యాయముగా ఆమెత గా ఉన్నది. అది పలికిన చేటిని దాన ఆలింగనము చేసికొని బహుమానించుచున్నది. చెప్పుచును ఉన్నది. సుష్ఠు న నిధ్యాతః రాత్రౌ = రాత్రియందు నేను లెస్సగా చూడలేకే అయ్యాను, నాసామిని. తదద్య ... = కావున ఇప్పుడు ప్రత్యక్షముగా చూడఁగలను. తొలుమాఱు దగ్గఱ ముఖాముఖిగా నిలఁబడినపుడు.

చేటీ—న కేవల మభ్యన్తర చతుఃశాలమ్. సర్వజన స్యాపి హృదయం ప్రవిష్టా. [ణ కేవలం అబ్భన్తరచదుస్సాలఅమ్. సవ్వ జణస్స వి హిఅఅం పవిట్ఠా].

వసన్త—అపి సంతప్యతే చారుదత్తస్య పరిజనః [అవి సంతప్పది చారుదత్తస్స పరిఅణో].

చేటీ—సంతప్స్యతి. [సంతప్పిస్సది].

వసన్త—కదా? [కదా?]

"కుతూహలవా౯ అపి నిసర్గశాలీనః స్త్రీజనః, పశ్య,
కాత్స్న్యేన నిర్వర్ణయితుం చ రూప
మిచ్ఛన్తి తత్పూర్వ సమాగతానామ్
న చ ప్రియే ష్వాయతలోచనానాం
సమగ్రపాతీని విలోకనాని." మాళ. IV. - 8.

కాంతలు కాంతుపై తొలిచూపున చూపు ధీరముగా ఆనింపఁజాలరు - కావునను, మఱియు, రాత్రి దీపపు వెలుతురునను వానచీకట్లలోను నేను సరిగా చూడనైతిని. ఇపుడు తనివితీఱ చూతునే. హఞ్జే, ప్రవిష్టా అహం ఇహ అభ్యన్తర చతుఃశాలమ్ = ఏమే, నేను ఇక్కడ లోపలి భవంతిలోపలికి ప్రవేశించితినటే - రాత్రి ఆయన వెంట నడచితిని ఎట్టెట్లు ఏమేమి ప్రవేశించితినో పరికింపనైతినే...

లోపలి భవంతిలోపలికే కాదు, (ఇక్కడ మా) యెల్లర హృదయము లోనికిం గూడ - నీవు ఈలోపలియింట చొచ్చి - ఇంటిదానింబోలె నగుట మాత్రమే కాదు - మాకెల్లరకు నీమీఁద నే హృదయము - ప్రీతి, తలఁపు. మాహృదయములలోను పదము గొంటివి.

అపి సంతప్యతే ... = చారుదత్తయ్య పరిజనము (నాకై) (ఇదేమి ఈపె ఒకతె వచ్చినదే ధూతమ్మ సవతిగా అని యీసెత్తి - అనుట) సంతాపముపడు చున్నదా? కాదు కాదు, సంతోషము పడుచున్నది - నీసమాగమముచేత, (ఇప్పుడు.) (ఇఁకను నీవు బయలుదేఱి పోవుదువేని నీవియోగమునకు - అన్న మాట -) సంతప్యతే = సంతాప - దుఃఖ - పడఁగలదు. అదియే ఆమె యడు

చేటీ—యదార్యా గమిష్యతి. [జదో అజ్జఆ గమిస్సది].

వసన్త—తదా మయా ప్రథమం సంతప్తవ్యమ్ (సానునయమ్) చేటి గృహాణేమాం రత్నావలీమ్. మమ భగిన్యా ఆర్యాధూతాయై గత్వా సమర్పయ. వక్తవ్యం చ - అహం శ్రీచారుదత్తస్య గుణనిర్జితా దాసీ, తదా యుష్మాక మపి. త దేషా త వైవ కణ్ఠాభరణం భవతు రత్నావలీ. [తదో మఏ పఢమం సంతప్పిదవ్వమ్. హఞ్జే గేణ్హ ఏదం రఅణావలీమ్. మమ బహిణీఆఏ అజ్జాధూదాఏ గదుఅ సమప్పేహి. భణిదవ్వం చ - 'అహం సిరిచారుదత్తస్స గుణణిజ్జిదా దాసీ, తదా తుహ్మాణం పి. తా ఏసా తవ జ్జేవ కణ్ఠాహరణం హోదు రఅణావలీ].

చేటీ—ఆర్యే, కుపిష్యతి చారుదత్త ఆర్యాయై తావత్ [అజ్జఏ, కుపిస్సది చారుదత్తో అజ్జాఏ దావ].

వసన్త—గచ్ఛ, న కుపిష్యతి. [గచ్ఛ. ణ కుపిస్సది].

---

గుటయు, చేటిపలుకుటయు - 'కదా?' 'యదా ఆర్యా గమిష్యతి' - అని. తదా మయా ప్రథమం ... = అప్పుడు, మిమ్ముంబాసి పోయినప్పుడు, నేనే (మీకంటె) ముందు సంతాపము చెందుదును. ఈ సంతాప ప్రస్తావమున కలుగఁబోవు శకార సమాగమ సంతాపాదులు సూచింపఁబడుచున్నవి కాఁబోలు - ఇపుడు వసంతసేనా చేట్యాదులకు దాని పొగయేని లేకున్నను - దైవము నోట పలికించినట్లుగా - చూపఱకు ఏమేని తోఁచుచుండఁదగును. రంగాన వక్తకును శ్రోతకును తోఁపక చూపఱకు తోఁచు ఇట్టి భాషితము ఒక తెఱఁగు 'Dramatic Irony' అందురు. మమ భగిన్యాః ఆర్యా ధూతాయాః - నాయక్కకు ధూతమ్మకు - వక్తవ్యం చ = ఇట్లు చెప్పవలసినది - అహం ... = నేను శ్రీ చారుదత్తునికి (ఆయన) గుణములచే డక్కఁగొనఁబడిన - సొంతము ఐ పోయిన - దాసిని - అప్పటికి - ( = కాఁబట్టి - ) అనుట - నీకును. కావున, ఏషా తవ ఏవ ... = ఈరత్నావళి నీకే కంఠాభరణము అగునుగాక - నీవే మెడలో ధరింతువుగాక.

చేటీ—(గృహీత్వా) య దాజ్ఞాపయతి. (ఇతి నిష్క్రమ్య పునః ప్రవిశతి) ఆర్యే భణ త్యార్యాధూతా - 'ఆర్యపుత్రేణ యుష్మాకం ప్రసాదీకృతా. న యుక్తం మ మైతాం గ్రహీతుమ్. ఆర్యపుత్ర ఏవ మ మాభరణవిశేష ఇతి జానాతు భవతీ,' [జం ఆణవేది. అజ్జఆ, భణాది అజ్జాధూదా - 'అజ్జఉత్తేణ తుమ్హాణం పసాదీకిదా ణ జుత్తం మమ ఏదం గేణ్హిదుమ్. అజ్జఉత్తో జ్జేవ మమ ఆహారణవిసేసో త్తి జాణాదు భోదీ.?]

(తతః ప్రవిశతి దారకం గృహీత్వా రదనికా)

రదనికా—ఏహి వత్స, శకటికయా క్రీడయావః. [ఏహి వచ్ఛ. సఅడిఆఏ కీలమ్హ].

దారకః—(సకరుణమ్) రదనికే, కిం మ మైతయా మృత్తికాశకటికయా. తా మేవ సౌవర్ణశకటికాం దేహి. [రదణిఏ, కిం మమ ఏదాఏ మట్టిఆ సఅడిఆఏ. తం జ్జేవ సోవణ్ణసఅడిఅం దేహి].

రద—(సనిర్వేదం నిశ్వస్య) జాత, కుతో ఽస్మాకం సువర్ణవ్యవహారః? తాతస్య పున రపి ఋద్ధ్యా సువర్ణశకటికయా క్రీడిష్యసి.

---

ఆర్యపుత్రేణ యుష్మాకం ... = ఆర్యపుత్రుని చేత నీకు దయసేయఁబడినది. దీనిని నేను తీసికొనుట తగదు. ఆర్యపుత్రఏవ ... = నాకు ఇట్టి బంగారులు రతనాలు సొమ్ములు అక్కఱలేదు - ఆర్యపుత్రుఁడే నాకు మేలియాభరణము - ఈవిషయము అమ్మ (వసంత) ఎఱుంగును గాక.

శకటికయా క్రీడావః = బుచ్చిబండితో ఆఁడుకొందము, కిం మమ ... = ఎందులకే నాకు ఈమట్టిబండి? దానినే అబంగరుబండినే ఇమ్ము. సువర్ణవ్యవహారః = బంగారు వాడుక, ప్రచారము - తాతస్య = నాయనకు, పునః అపి, ఋద్ధ్యా = మరలను బుద్ధి - సంపద - కలిగిన అప్పుడు - బంగరుబండి (చేయించుకొందువులే. అప్పుడు దాని)తో ఆఁడుకొందువులే. అంతట అబ్బాయిని ఆడింపను వినోదపెట్టను అని వసంతకడకు తెచ్చినది.

త ద్యావ ద్వినోదయా మ్యేనమ్. ఆర్యాయా వసన్తసేనాయాః సమీాప ముపసర్ప్సామి. (ఉపసృత్య) ఆర్యే. ప్రణమామి. [జాద, కుదో అమ్హాణం సువణ్ణవవహారో. తాదస్స పుణో వి రిద్ధీఏ సువణ్ణసఅడిఆఏ కీలిస్ససి. తదా జావ విణోదేమి ణమ్. అజ్జఆ వసన్తసేణాఏ సమీాపం ఉవసప్పిస్సమ్. అజ్జఏ, పణమామి].

వసన్త—రదనికే, స్వాగతం తే. కస్య పున రయం దారకః. అనలంకృతశరీరో ౽పి చన్ద్రముఖ ఆనన్దయతి మమ హృదయమ్. [రదణిఏ, సాఅదం దే. కస్సఉణ అఅం దారఓ. అణలంకిదసరీరోవి చందముహో ఆణన్దేది మమ హిఅఅమ్].

రద—ఏష ఖ ల్వార్య చారుదత్తస్య పుత్రో రోహసేనో నామ. [ఏసో క్ఖు అజ్జచారుదత్తస్స పుత్తో రోహసేణో ణామ].

వసన్త—(బాహూ ప్రసార్య) ఏహి మే పుత్రక, ఆలిఙ్గ. (ఇత్యఙ్కే ఉపవేశ్య) అనుకృత మనేన పితృరూపమ్. [ఏహి మే పుత్తఅ, ఆలిఙ్గ. అణుకిదం అణేణ పిదుణో రూవమ్].

రద—న కేవలం రూపమ్ శీల మ పీతి తర్కయామి. ఏ తే నార్యచారుదత్త ఆత్మానం వినోదయతి. [ణ కేవలం రూవమ్, సీలం పి త్తి తక్కేమి. ఏదిణా అజ్జచారుదత్తో అత్తాణఅం విణోదేది].

వసన్త—అథ కి న్నిమిత్త మేష రోదితి. [అధ కిం ణిమిత్తం ఏసో రోఅది].

అనలఙ్కృతశరీరః అపి = అలంకరింపఁబడని దేహముఁగలిగియు, ఒంటి మీాఁద ఏసొమ్మును లేకున్నను - చంద్రముఖుఁడు (నా మనసునకు) ఆనందము కలిగించుచున్నాఁడు. ఏష ఖలు ... = ఇతఁడు చారుదత్తయ్య కొడుకు గదా, రోహసేనుఁడు. ఆలిఙ్గ - కౌఁగిలించుకో - అనుకృతమ్ = పోలఁబడినది. శీలం అపి తర్కయామి = శీలముంగూడ అని ఊహింతును. ఏతేన ... = వీనితోనే ఆయన తాను ప్రొద్దుపుచ్చుచుండును కిన్నిమిత్తం ... = ఎందునిమిత్తమై - ఎందుకోసము.

రద—ఏ తేన ప్రతివేశికగృహపతిదారకస్య సువర్ణశకటికయా క్రీడితమ్. తేన చ సా నీతా. తతః పున స్తాం యాచతో మ యేయం మృత్తికాశకటికా కృత్వా దత్తా. తతో భణతి - 'రదని కే, కిం మ మైతయా మృత్తికాశకటికయా. తా మేవ సౌవర్ణశకటికాం దేహి' ఇతి. [ ఏదినా పడివేసిఅగహావఇదారఅ కేరిఆఏ సువణ్ణ సఅడిఆఏ కీలిదమ్. తేణ అ సా ణీదా. తదో ఉణ తం మగ్గన్తస్స మఏ ఇఅం మట్టిఆసఅడిఆ కదుఅ దిణ్ణా. తదో భణాది - 'రదణిఏ కిం మమ ఏదాఏ మట్టిఆసఅడిఆఏ. తం జ్జేవ సోవణ్ణసఅడిఅం దేహి' త్తి. ]

వసన్త—హా ధిక్, హా ధిక్. అయ మపి నామ పర సంపత్త్యా సంతప్యతే. భగవ న్కృతాన్త, పుష్కరపత్రపతిత జల బిన్దు సదృశైః క్రీడసి త్వం పురుషభాగధేయైః. (ఇతి సాస్రా) జాత, మా రుదిహి. సౌవర్ణశకటికయా క్రీడిష్యసి. [ హద్ధీ హద్ధీ. అఅం పి ణామ పరసంపత్తీఏ సంతప్పది. భఅవం కఅన్త, పొక్ఖరవత్త పడిద జలబిన్దుసరిసేహిం కీలసి తుమం పురిసభాఅధేఏహిం. జాద, మా రోద సువణ్ణ సఅడిఆఏ కీలిస్ససి ].

ప్రతివేశిగృహపతి ...=పొరుగింటి యింటియాయన యబ్బాయియొక్క ... తాం మార్గమాణస్య = దానిని అడుగుచున్నవానికి - అయం అపినామ = ఇతఁడు సయితమునా, పరసంపత్త్యా = పరులసంపదచే, సంతప్యతే = సంతాపపడుచు న్నాఁడు! 'అపినామ' - అటుకాకపోరాదా అను అసం దెలుపును. పుష్కర పత్ర ... తామరాకు ... వసంతసేనకు కంట నీరు తేతినది. బిడ్డ తనకు అంత సొంతముగా తోఁచినాఁడు - వానికై, కంట నీరు తానై తేలునంత. అబ్బాయి ఈమె ఎవరు అని రదనికను అడుగఁగా వసంత తానై కలుఁగఁజేసికొని జవాబు చెప్పుచున్నది - మీ నాయన దాసినిరా, ఆయనగుణములచే బందిగొనఁబడినదానను - అని. రదనికయు చెప్పుచున్నది - మీయమ్మరా, నాయనా - అని.

దార—రదనికే, కైషా? [రదణిఏ, కా ఏసా].

వసన్త—పితు స్తే గుణనిర్జితా దాసీ. [పిదుణో దే గుణణిజ్జిదా దాసీ].

రద—జాత, ఆర్యా తే జననీ భవతి. [జాద, అజ్జఆ దే జణణీ భోది].

దార—రదనికే, అలీకం త్వం భణసి, య ద్యస్మాక మార్య జననీ, త త్కిమర్థ మలఙ్కృతా? [రదణిఏ, అలిఅం తుమం భణాసి. జఇ అమ్హాణం అజ్జఆ జణణీ, తా కీస అలంకిదా].

వసన్త—జాత, ముగ్ధేన ముఖే నాతికరుణం మన్త్రయసి. (నాట్యే నాభరణా న్యవతార్య రుదతీ) ఏ షేదానీం తే జననీ సంవృత్తా. త ద్గృహా ణైత మలంకారమ్. సౌవర్ణ శకటికాం

అలీకం = అసత్యము, యది అస్మాకం ఆర్యా జననీ = నాకు అమ్మ అమ్మయగునేని, తత్ కిమర్థం అలఙ్కృతా = మఱి యీమె యేల అలంకరింపఁబడియున్నది? మాయమ్మకు సొమ్ములు లేవే - ధూతమ్మ, పాపము, ఎంతో సొమ్ములు గలది - ఇప్పుడు దారిద్ర్యముచే అన్నియు పోయినవికాఁబోలు. దరిద్రచారుదత్తునికి అనుగుణయగు పాతివ్రత్యముచే సొమ్ములే లేక యున్నది, "సొమ్ములు లేమి" అమ్మకు లక్షణముగా బిడ్డకు తోఁచునంతగా అవేవియు లేకయున్నది - అని దీన ఊహింపఁదగియున్నది.

జాత - బిడ్డా, నాయనా, ముగ్ధేన ముఖేన = ముద్దుగాఱు మొగముతో, అతికరుణం = ఎంతయు జాలిగా - జాలితోఁచునట్లుగా, మన్త్రయసే - పలుకుచున్నావురా. మాయమ్మయైన ఆమెకు నగలుండవే. అను బాలునిమాట ఆయింట కలిగియుండు ప్రకృతపు దైన్యమును చిత్తమునకు తేఁగా - దాన చాల జాలి తోఁచునట్లున్నది వసంతకు. అవతార్య - ఊడ్చి, తీసి, రుదతీ - వసంతసేనకు ఆఁగని యేడ్పు వచ్చినది. అట్లు ఏడ్చుచు (= రుదతీ), ఏషా ఇదానీం తే జననీ సంవృత్తా = ఇదిగో (ఇపుడు నేను) మీ యమ్మను ఐతిని. తత్ గృహాణ ... కావున, కైకొనుము ఈసొమ్మును - సౌవర్ణ ... = బంగరుబండి చేయించుకో - అ పేహి - పోపో -

కారయ, [జాద, ముద్దేణ ముహేణా అదికరుణం మన్తేసి. ఏసా దాణిం దే జణణీ సంవుత్తా. తా గేణ్హ ఏదం అలంకారఅమ్. సోవణ్ణసఅడిఅం ఘడావేహి].

దార—అపేహి, న గ్రహీష్యామి. రోదిషి త్వమ్. [అవేహి ణ గేణ్హిస్సమ్. రోదసి తుమమ్].

వసన్త—(అశ్రూణి ప్రమృజ్య) జాత, న రోదిష్యామి. గచ్ఛ, క్రీడ, (అలంకారై ర్మృచ్ఛకటికం పూరయిత్వా) జాత, కారయ సౌవర్ణశకటికామ్. [జాద ణ రోదిస్సమ్. గచ్ఛ. కీల. జాద, కారేహి సోవణ్ణసఅడిఅమ్].

(ఇతి దారక మాదాయ నిష్క్రాన్తా రదనికా.

(ప్రవిశ్య ప్రవహణాధిరూఢః)

చేటః—రదనికే, రదనికే, నివేదయార్యాయై వసన్తసేనాయై - 'అపవారితం పక్షద్వారకే సజ్జం ప్రవహణం తిష్ఠతి'. [లదణిఏ, లదణిఏ, ణివేదేహి అజ్జఆఏ వశన్తశేణాఏ - 'ఓహాలిఅం పక్ఖదుఆలఏ శజ్జం పవహణం చిట్ఠది'].

---

న గ్రహీష్యామి = నేను తీసికొనను - రోదిషి త్వం = ఏడ్పించుచున్నావు నీవు. తన యమ్మ విధియోగుడు దిగుడులకు ఏడువని గబ్బి వివేకవతి - అనుట. ప్రమృజ్య = తుడుచుకొని. జాత న రోదిష్యామి = బిడ్డా, నాయనా, నేను ఏడువనులే ... = పో, ఆడుకో, అలఙ్కారైః ... = సొమ్ములతో మట్టిబండిని నింపి, నాయనా, చేయించుకో బంగరుబండిని, ఇతి - అట్లనఁగానే బిడ్డను ఎత్తుకొని రదనిక పోయినది.

ప్రవహణాధిరూఢః - బండిపై ఎక్కిన (కూచున్నవాఁడు - చేటః - నౌకరు, వర్ధమానకుఁడు - అపవారితం = వెనుక మూఁత, ఎక్కుటకు సులువగునట్లు, తెఱవఁబడినదై - ఎక్కఁగానే మరల మూసికొనవచ్చును - గొప్పవారి గృహజనమునకు, రాణివాసమునకు తగినట్లుగా, గోషాగా మూసికొనఁదగినట్లు - అట్లు మూఁతను తాను ఎత్తియుంచుట వసంతకు సులువగుటకును, మర్యాదకును.

(ప్రవిశ్య)

రదనికా—ఆర్యే, ఏష వర్ధమానకో విజ్ఞాపయతి – 'పక్షద్వారే సజ్జం ప్రవహణమ్.' ఇతి. [అజ్జఏ, ఏసో వడ్ఢమాణఓ విణ్ణవేది – పక్ఖదుఆరఏ సజ్జం పవహణం' త్తి].

వసన్త—చేటి, తిష్ఠతు ముహూర్తకమ్. యావ దహమాత్మానం ప్రసాధయామి. [హఞ్జే, చిట్ఠదు ముహుత్తఅమ్. జావ అహం అత్తాణఅం పసాధేమి].

రద—(నిష్క్రమ్య) వర్ధమానక, తిష్ఠ ముహూర్తకమ్. యావ దార్యాత్మానం ప్రసాధయతి. [వడ్ఢమాణఆ, చిట్ఠ ముహుత్తఅమ్. జావ అజ్జఆ అత్తాణఅం పసాధేది].

చేటః—హీ హీ భోః, మ యాపి యానాస్తరణం విస్మృతమ్. త ద్యావ ద్గృహీ త్వాగచ్ఛామి. ఏతే నాసికారజ్జుకటుకా బలీవర్దాః. భవతు. ప్రవహణే నైవ గతాగతిం కరిష్యామి [హీ

---

సజ్జం = పూన్చి సిద్ధముగానుండునది. 'అపవారితం' – అని ఛాయపాఠముగు వేని – వెనుక తెర మూసియున్నట్టిది. ఈమెయొక్కవలసినది అని తెరతగిలింపఁబడినది – చారుదత్తుయ్య యొక్కనపుడు తెర యుండదు – వసంత యొక్కవలసినది గదా అని తెర తగిలించి తేఁబడినది – అనుట. పక్షద్వారే = దిడ్డివాకిట – ఇంటికి పక్షమున, ఒకప్రక్కన, ఉండువాకిలి; ఎదురుగానుండు సింహద్వారము గాదు, ప్రసాధయామి = అలంకరించుకొందును. తలరేఁగి మొగము మొదలైనది జిడ్డుకలిగియుండును, ఇప్పుడే నిద్రలేచినందున, ఆ వేసాన బయటికి అందును చారుదత్తుయ్యకడకు, పోవుట అనుచితము, నాణెము గాదు. మఱియు వసంతసేనను ప్రతిదినము ప్రభాతమున ప్రసాధనము వాడుకయు.

యానాస్తరణం = బండిలోని పఱుపో, రత్నకంబళియో తివాసియో – మఱచి పోఁబడినది – నాసికా రజ్జు కటుకాః = ముక్కుత్రాటిమంటకు కుదురుగా నిలువక

హీ భో, మప వి జాణత్థలకే విసుమలిదే. తా జావ గేణ్హిఅ ఆలఅచ్ఛామి. ఏదే ణాశ్శాలజ్జు కడుఅ బఇల్లా. భోదు. పవహాణేణ జ్జేవ గదాగదిం కలిశ్శమ్]. (ఇతి నిష్క్రా)న్త శ్చేటః.

వసన్త—చేటి, ఉపనయ మే ప్రసాధనమ్. ఆత్మానం ప్రసాధయిష్యామి. [హఞ్జె, ఉవణేహి మే పసాహణమ్. అత్తాణఅం పసాధఇస్సమ్]. (ఇతి ప్రసాధయన్తీ స్థితా.

(ప్రవిశ్య ప్రవహణాధిరూఢః)

స్థావరక శ్చేటః—ఆజ్ఞప్తో ఽస్మి రాజశ్యాలక సంస్థానేన, 'స్థావరక, ప్రవహణం గృహీత్వా పుష్పకరండకం జీర్ణోద్యానం త్వరిత మాగచ్ఛ' ఇతి. భవతు, త త్రైవ గచ్ఛామి. వహాతమ్ బలీవర్దాః, వహాతమ్. (పరిక్ర మ్యావలోక్య చ) కథం గ్రామ శకటై రుద్ధో మార్గః. కి మిదానీ మత్ర కరిష్యామి. (సాటోపమ్) అరే రే, అపసరత అపసరత. (ఆకర్ణ్య) కిం భణథ – 'ఏత త్కస్య

ఉన్నవి. భవతు=కానీలే ... బండితోడనే పోయి వచ్చెదను. ఇతి ప్రసాధయన్తీ, స్థితా = అని తన్ను అలంకరించుకొనుచు ఉన్నది. ఇంతలో సంస్థానక శకారుని, చేటుఁడు, స్థావరకుఁ డనువాఁడు ప్రవేశించుచున్నాఁడు - చెప్పుచున్నాఁడు తన సంగతిని.

ఆజ్ఞప్తః అస్మి - ఇత్యాది - ఉత్తరువు చేయఁబడితిని - ఇత్యాది. వహాతమ్ - చో చో డిర్ డిర్ - నడువుడు నడువుడు - ఇది బండియెడ్లం దోలు మాటలు- అవి నోరులేని వైనను వానితోను, గుఱ్ఱాలు కుక్కలు మొదలైన పెంపుడు మృగాలతోను మాటలాడుట మానుసులకు వాడుకయే. కథం! = ఏమి! ఎట్లు! గ్రామ శకటైః రుద్ధో మార్గః = ఊరిబండ్లచేత దారి అడ్డగింపఁబడినది, దారిలో ఊరి బండ్లు అడ్డముగా ఉన్నవే - అపసరత = తొలఁగుఁడు - కిం భణథ = ఏమి చెప్పుచున్నారు - ఇది మరల 'ఆకాశభాషితము' - రంగాన లేనివాని నడుగుటయు, వాఁడు ఏమోజవాబు చెప్పినట్లు తా విన్నట్లు - ఆమాటలం దాఁ బలికి ఇదియా నీవు చెప్పుట అనుటయు, చూపఱకు కథ తెలిసి సాగుటయు - రాజశ్యాలక -

ప్రవహణమ్' ఇతి. ఏత ద్రాజశ్యాలక సంస్థానస్య ప్రవహణ మితి. త చ్ఛీఘ్ర మపసరత. (అవలోక్య) కథమ్, ఏ షోపరః సభిక మివ మాం ప్రేక్ష్య సహ సైవ ద్యూతపలాయిత ఇవ ద్యూతకరో ఽపవా ర్యాత్మాన మన్యతో ఽపక్రాన్తః. త త్కః పున రేషః. అథవా కిం మ మైతేన. త్వరితం గమిష్యామి. అరే రే, గ్రామ్యాః, అపసరత అపసరత. కిం భణథ - 'ముహూర్తకం తిష్ఠ, చక్రపరివృత్తిం దేహి' ఇతి. అ రేరే రాజస్యాలకసంస్థాన స్యాహం శూర శ్చక్ర పరివృత్తిం దాస్యామి? అథవా ఏష ఏకాకీ తపస్వీ. త దేవం కరోమి. ఏత త్ప్రవహణ మార్యచారుదత్తస్య వృక్షవాటికాయాః పక్షద్వారే స్థాపయామి. (ఇతి ప్రవహణం సంస్థాప్య) ఏషో ఽ స్మ్యాగతః.

(ఇతి నిష్క్రాన్తః.)

[ఆణత్తమ్హి లాఅశాలఅశంఠాణేణ - 'ధావలఆ, పవహణం గేణ్హిఅ పుప్ఫకలణ్డఅం జిణ్ణుజ్జాణం తులిదం ఆఅచ్ఛేహి' త్తి. భోదు.

---

మహారాజుమఱఁది - కావున తొలఁగుడు వెంటనే. ఇంతలో మఱియొకఁ డెవఁడో ఎదురుపడి దాఁటిపోవుచున్నాఁడు - వానిం గూర్చి చెప్పుచున్నాఁడు. కథం = ఎట్లూ! ఏషః అపరః = వీఁడుగో మఱియొకఁడు, మాం = నన్ను, దృష్ట్వా = చూచి, సభికం ద్యూతకర ఇవ - జూదపు మేస్త్రిని చూచి జూదరి, జూదమునుండి పరారి యైనవాఁడు వోలె, తన దేహమును అగపడనీక (అపవార్య = ) కప్పుకొని - తా నెవరో సులువుగా తెలియనీక, అన్యతః అపక్రాన్తః - మఱియొక తట్టునకు తప్పించుకొని పోయినాఁడు. అథవా = ఐన నేమి? కిం మమ ఏతేన = నాకు వీనితో నేమి? (నేను త్వరగా పోవలయును, అది నాకు ఉత్తరువు - కావున), ముహూర్తకం తిష్ఠ = రవంతసేపు ఉండు. చక్రపరివృత్తిం దేహి = చక్రము వేయవయ్యా - బలవంతముగా దొర్లునట్లు చేయవయ్యా - అది దొర్లకున్నది - అందుచేత ఆఁగఁబడినది - అనియా? నేను అంతటి వాఁడను! అల్ల వానివాఁడను! శూరుఁడను! - (నీకు) చక్రము వేయుదునా, త్రిప్పుదునా? అథవా = అట్లు కాదు - పోనీలే పాపము - ఒంటరిగాఁడు. ఏతత్ ప్రవహణం - ఈబండిని, చారు దత్తయ్యతోఁట దిడ్డివాకిట నిలిపెదను, ఇదిగోనయ్యా వచ్చినవాఁడనే.

తహిం జ్జేవ గచ్ఛామి. వహాధ బఇల్లా, వహాధ. కధం గామశఅ లేహిం లుద్ధే మగ్గే. కిం దాణిం ఏత్థ కలఇశ్శమ్. అలే లే, ఓశలఘ ఓశలఘ. కిం భణాధ - 'ఏశే కశ్శకేలకే పవహణే' త్తి. ఏశే లాఅశాలఅ శంఠాణకేలకే పవహణే త్తి. తా శిగ్ఘం ఓశలఘ. కధమ్, ఏశే అవలే శహిఅం విఅ మం పేక్ఖిఅ శహశ జ్జేవ జూదపలాఇదే విఅ జూదిఅలే ఓహాలిఅ అత్తాణఅం అణ్ణదో అవక్కన్తే. తా కో ఉణ ఏశే. అధవా కిం మమ ఏదిణా. తులిదం గమిశ్శమ్. అలే లే గామలుఆ, ఓశలధ ఓశలధ. కిం భణాధ - 'ముహుత్తఅం చిట్ఠ. చక్కపలివట్టిం దేహి' త్తి. అలే లే, లాఅశాలఅశంఠాణకేలకే హగ్గే శూలే చక్కపలివట్టిం దఇశ్శమ్? అధవా ఏశే ఏఆఈ తవశ్శీ. తా ఏవ్వం కలేమి. ఏదం పవహణం అజ్జచాలుదత్తశ్శ రుక్ఖవాడిఆఏ పక్ఖదుఆలఏ థావేమి. ఏశే హ్మి ఆఅదే.]

చేటీ—ఆర్యే, నేమిశబ్ద ఇవ శ్రూయతే. తదాగతం ప్రవహణమ్. [అజ్జఏ, ణేమిసద్దో విఅ సుణీఅది. తా ఆఅదో పవహణో].

వసన్త—చేటి గచ్ఛ, త్వరయతి మే హృదయమ్. తదాదిశ పక్షద్వారమ్. [హఞ్జే, గచ్ఛ, తువరది మే హిఅఅమ్. తా ఆదేసిహి పక్ఖదుఆలఅమ్].

చేటీ—ఏత్వేత్వార్యా. [ఏదు ఏదు అజ్జఆ].

వసన్త—(పరిక్రమ్య) చేటి విశ్రామయ త్వమ్ [హఞ్జే, వీసమ తుమమ్].

నేమి శబ్ద ఇవ = బండికంటి కడకమ్మి ( = అంచు) సద్దు వలె (ఉన్నది), కావున (తివాసికోసము పోయెనే) వచ్చినది బండి. ఈస్థావరకునిబండిని వర్ధమానకునిబండి అని బ్రమసినది, పాపము. హఞ్జే విశ్రామయ త్వం = ఓసి(ఇంక)నీవు

చేటి—య దా ర్యాజ్ఞాపయతి. [ జం అజ్జఆ ఆణవేది ].

(ఇతి నిష్క్రాన్తా.)

వసన్త—(దక్షిణాక్షిస్పన్దనం సూచయిత్వా ప్రవహణ మధిరుహ్య) కిం న్విదం స్ఫురతి దక్షిణం లోచనమ్. అథవా చారుదత్త స్యైవ దర్శన మనిమిత్తం ప్రమార్జయిష్యతి. [ కిణ్ణేదం ఫురది దాహిణం లోఅణమ్. అథవా చారుదత్తస్స జ్జేవ దంసణం అణిమిత్తం పమజ్జఇస్సది ].

(ప్రవిశ్య)

స్థావరక శ్చేటః—అపసారితా మయా శకటాః, త ద్యావ ద్గచ్ఛామి. (ఇతి నాట్యే నాధిరుహ్య చాలయిత్వా, స్వగతమ్) భారవ త్ప్రవహణమ్. అథవా, చక్రపరివర్తనేన పరిశ్రాన్తస్య భారవత్ప్రవహణం ప్రతిభాసతే. భవతు. గమిష్యామి. యాతం గావౌ యాతం. [ ఓశాలిదా మఏ శఅడా. తా జావ గచ్ఛామి. భాలికే పవహణే. అథవా చక్కపలివట్టిఆఏ పలిశ్శన్తశ్శ భాలికే పవహణే పడిభాశేది. భోదు. గమిశ్శమ్. జాధ గోణా, జాధ.

పో-(అలపు తీర్చుకొని) వసంతసేనకు బండి ఎక్కుచుండఁగా కుడికన్ను అదరినది. స్త్రీకి కన్ను, బాహువు, తొడ మొదలైనవి, కుడివి, అదరుట అవశకునము. తలఁచుకొనుచున్నది - ఏమి యిది! కుడికన్ను అదరుచున్నది! అథవా = ఐననేమి? పోనీలే... చారుదత్తుని దర్శనమే (ఈ) యవశకునమును తుడిచివేయునులే, అని తేపవతోనే ఎక్కి కూరుచున్నది.

ఇంతలో - ప్రవిశ్య - ప్రవేశించి - స్థావరకుఁడు - మయా ... = నేను (అడ్డమున్న బండ్లను అవతలికి తొలఁగించితిని. కనుక ఇఁక పోయెదను - అని బండి యెక్కి (చాలయిత్వా = ) తోలి కదలించి - బరువుకలదిగా నున్నది బండి. కాదు కాదు - చక్రములు వేసి, త్రిప్పించి, అలసిన నాకు (అట్లు) బరువు కలదిగా తోఁచుచున్నది. వాఁడు ఆట నిలిపినపుడు, బండి వట్టిది, తేలికగా ఉండినది.

(నేపథ్యే)

అరే రే దౌవారికాః, అప్రమత్తాః స్వేషు స్వేషు గుల్మస్థానేషు భవత. ఏషో ఉద్య గోపాలదారకో గుప్తిం భఙ్క్త్వా గుప్తిపాలం వ్యాపాద్య బన్ధనం భిత్త్వా పరిభ్రష్టో ఉపక్రామతి. తం గృహ్ణీత గృహ్ణీత. [అరేరే దోవారిఆ, అప్పమత్తా సఏసు సఏసు గుమ్మట్ఠాణేషు హోధ. ఏసో అజ్జ గోవాలదారఓ గుత్తిఅం భఞ్జిఅ గుత్తివాలఅం వావాదిఅ బన్ధణం భేదిఅ పరిబ్భట్టో అవక్కమది. తా గేణ్హధ గేణ్హధ].

(ప్రవిశ్యాపటీక్షేపేణ సంభ్రాన్త ఏకచరణలగ్ననిగడో ఉవగుణ్ఠిత ఆర్యకః పరిక్రామతి)

---

ఇంతలో ఇప్పుడే వసంతసేన అందు ఎక్కినది - కావున అది బరువెక్కినది - అట్లు తోఁచినది - వాఁడు అప్పుడే ఆఁగి, బండిని పరిశీలించియుండఁ దగును. దైవికము. వాఁడు అట్లు చేయలేదు - తన యలయిక చే అట్లు భ్రమగొల్పుచున్నది - అని యనుకొని సాగిపోవుచున్నాఁడు.

గుల్మస్థానేషు - పోలీసు ఠాణాలయందు, ఊరి కావలిస్థలములయందు - గుప్తిం = ప్రాకారమును. చెఱసాల చుట్టు కాఁపుకోట యుండునే, దాని ప్రాకారమును, భఙ్క్త్వా = పగులఁగొట్టి, గుప్తిపాలకం = ఆ కావలినాయకుని (వ్యాపాద్య =) చంపి, బన్ధనం = సంకెలను, భిత్త్వా = తెగఁగొట్టుకొని - తెంచుకొని, పరిభ్రష్టః = తప్పించుకొని బయటికి వచ్చినాఁడు, అపక్రామతి = పరారియగుచున్నాఁడు. తం గృహ్ణీత ... = వానిం బట్టుకొనుఁడు, పట్టుకొనుఁడు. నగర్యాం - పట్టణమున, మహాన్ సంభ్రమః = మిక్కిలియు తత్తరపాటు కలిగినది.

ప్రవిశ్య అపటీక్షేపేణ సంభ్రాన్తః - రంగాన అనూచితముగా తెర పట్టకయే, తత్తరపాటుతో వడిగా ప్రవేశించి - ఏకచరణ లగ్ననిగడః = ఒక పాదమునకు మాత్రము సంకెల తగులుకొనియుండఁగా, అవగుణ్ఠితః = ముసుకువైచుకొని - పరిక్రామతి - రంగాన నడుచును. సాధారణముగా ముఖ్యపాత్ర ప్రవేశమునకు

చేటః—(స్వగతమ్) మహా న్నగర్యాం సంభ్రమ ఉత్పన్నః. తత్త్వరితం త్వరితం గమిష్యామి. [మహన్తే ణఅలీఏ శంభమే ఉప్పణ్ణే. తా తులిదం తులిదం గమిశ్శమ్. (ఇతి నిష్క్రాన్తః.

ఆర్యకః—

శ్లో. హిత్వాహం నరపతి బన్ధనాపదేశ
వ్యాపత్తి వ్యసన మహార్ణవం మహాన్తమ్
పాదాగ్రస్థిత నిగడైక పాశకర్షీ
ప్రభ్రష్టో గజ ఇవ బన్ధనా ద్భ్రమామి. ౧

భోః, అహం ఖలు సిద్ధాదేశజనిత పరిత్రాసేన రాజ్ఞా పాలకేన ఘోషా దానీయ విశసనే గూఢాగారే బన్ధనేన బద్ధః. తస్మా చ్చ

---

సూచనయు తెర పట్టుటయు ఉండును. సంభ్రాంత ప్రవేశమునకు అవి ఉండవు. అ + పటీక్షేపేణ - అని కాని, పట + అక్షేపేణ అని కాని ఈరంగసూచన నాటకములం దుండును.

శ్లో. ౧. అహం = నేను, మహాన్తం = పెద్దదియైన, నరపతిబన్ధన - అపదేశ - వ్యాపత్తి వ్యసన మహార్ణవం = రాజుకట్టివైచుట - చెఱంబెట్టుట - అనుగొప్ప ఆపద ( = చావే అనుదాని) వలనిదుఃఖమను పెనుగడలిని, హిత్వా = తొలఁగఁ ద్రోసికొని, పాదాగ్ర స్థిత నిగడ ఏకపాశ కర్షీ = అడుగుకొసన ఉన్న సంకెల యొక్క ఒక్కత్రాటిని - ఉచ్చును - లాగుకొనుచున్నవాఁడనై, బన్ధనాత్ = కట్టునుండి - ప్రభ్రష్టః = తప్పించుకొని, బన్ధనాత్, ప్రభ్రష్టః = కట్టునుండి తప్పించుకొన్న (అట్టిదే ఐన) గజఇవ = ఏనుఁగువలె, భ్రమామి తిరుగుచున్నాను.

బంధన మని పేరే కాని నిజముగా చావే ఐన దుఃఖ సముద్రమును, పెద్దదానిని, తొలఁగ ద్రోసికొని ఒకపాదము కొనన ఉన్న సంకెలయొక్క ఉచ్చును (నేలన) లాగుకొనుచు, కట్టునుండి తప్పించుకొన్న యేనుఁగువలె తిరుగుచున్నాను.

భోః - అయ్యో! కట్టా! అహం ఖలు - నేను ఉండి, సిద్ధా ... = సిద్ధునియుపదేశమున కలిగిన మహాభయముగల పాలకరాజుచేత (నా) గొల్లపల్లియనుండి (పట్టి) తెచ్చి, విశసనే = చంపుటకయ్యే, రహస్యపు కొట్టున, సంకెలం గట్టఁబడితిని.

ప్రియసుహృ చ్ఛార్విలకప్రసాదేన బన్ధనా త్పరిభ్రష్టో ௨స్మి.
(అశ్రూణి విసృజ్య)

శ్లో. భాగ్యాని మే యది తదా మమ కో ௨పరాధో
యద్వన్యనాగ ఇవ సంయమితో ௨స్మి తేన
దైవీ చ సిద్ధి రపి లఙ్ఘయితుం న శక్యా
గమ్యో నృపో బలవతా సహ కో విరోధః. ౨

---

తస్మాత్ ... = అందుండి (చెఱనుండి) నా నెచ్చెలియైన శర్విలకుని యనుగ్రహముచేత, తప్పించుకొంటిని. ఈమాటలను కన్నీటితో డగ్గుత్తికతో పలుకుచున్నాఁడు. ఈ త్త పుణ్యానికి, కాదు పాపానికే, వాఁడు ఏ నేరమును చేయకున్నను - ఎవఁడో ఏమో జోస్యము చెప్పినాఁ డని దానిని నమ్మి, వానిని బలాత్కరించి తెచ్చి, ఖైదునం బెట్టి చంపివేయను పూనుకొన్నాఁడే - అని వానికి అంగని దుఃఖము.

శ్లో. ౨. మే యది భాగ్యాని = నాకు (అట్టి) అదృష్టమే ఐన, తదా - అప్పటికి - దాన - నాయపరాధము - తప్పు ఏమున్నది ? యత్ - ఏలన - ఏల యడిగెద వనఁగా - తేన = వానిచేత - కాదా - దానిచేత, వన్యనాగ ఇవ = అడవియేనుఁగు వలె, సంయమితః అస్మి = (సంకెలం) గట్టివేయఁబడితినే. దైవీ = దైవికమైన - పురుషుఁడు చేయని - కలిగింపని - సిద్ధిః అపి = సిద్ధి - ఒకానొక యొడఁగూడుట, లఙ్ఘయితుం = అతిక్రమింపను, న శక్యా చ = అలవిపడునదియుం గాదు, సరి. నృపః = రాజు(అన్ననో), గమ్యః = ఆశ్రయింపఁదగినవాఁడు, సేవ్యుఁడు. నేనుగా వానితో ఏవిరోధముం బెట్టుకొన్నవాఁడఁ గాను, బలవతా = బలవంతునితో, కః విరోధః = విరోధ మేమి, ఎందులకు ?

నేను వానికి ఏమియు చేయలేదు - ఇప్పుడును ఏమియు చేయ నెంచలేదు - నేను ప్రజలో చేరినవాఁడను - అతఁడు సేవ్యుఁడు, బలవంతుఁడు. అతనితో నాకేమియు లేదు. మఱి యెట్లో తప్పించుకొంటిని. ఎట్లు మరల వానికి వానివారికి దొరకక తప్పించుకొందును ? తత్ కావున, మన్దభాగ్యః - అదృష్టహీనుఁడను నామీఁద రాజున కేమో సందేహము కలిగినదే. కుత్ర గచ్ఛామి? కస్య అపి సాధోః -

త త్కుత్ర గచ్ఛామి మన్దభాగ్యః (విలోక్య) ఇదం క స్యాపి సాధో రనావృత పక్షద్వారం గేహమ్.

శ్లో. ఇదం గృహం భిన్న మదత్తదణ్డో
విశీర్ణసంధి శ్చ మహాకపాటః
ధ్రువం కుటుమ్బీ వ్యసనాభిభూతాం
దశాం ప్రపన్నో మమ తుల్యభాగ్యః. 3

త దత్ర తావ త్ప్రవిశ్య తిష్ఠామి.

---

ఎవనిదో సాధువుది, అపావృతపక్షద్వారం = దిడ్డివాకిలి తెఱచియుంపఁబడిన, గేహమ్ = ఇల్లు - నాకు సమయానికి ఇట్లు ఆశ్రయమిచ్చునదగుటయె దాని సాధువు దగుట, అట్లుకోరినవారి ఆశ్రయముకానీ అని తెఱచియుంచుట ఇంటివాని సాధుత్వము. - అనిభావము.

శ్లో. 3. ఇదం గృహం = ఈ యిల్లు, భిన్నం = పగిలి - పాతదగుటచే క్రక్కదలి - పోయినది; మహాకపాటః = పెద్ద తలుపు, అదత్తదణ్డః = గడియ - అర్గళము - (వే. వేం.) వేయక యున్నది - విశీర్ణ ... = దానియదుకు (చెక్క)లు చీలిపోయియున్నవి. (కావున) ధ్రువం = నిజము. కుటుమ్బీ = (దీని వాఁడు) కుటుంబి - కుటుంబముగలవాఁడు, వ్యసనాభిభూతాం = దుఃఖములు పైకొన్న, దశాం = దశను-స్థితిని, ప్రపన్నః = పొందినవాఁడు, మమ తుల్యభాగ్యః = నాతో సమానముగల అదృష్టముఁగలఁవాఁడు.

పగిలి గులగులన ఉన్న యీయిల్లు, ఈ పెద్ద తలుపు - చెక్కల యదుకులు చెదరి చీలి యున్నవి. ఎవనిదో కుటుంబిది. వాఁడును నావలె వ్యసనాభిభూతుఁడు, అదృష్టహీనుఁడు - ఇదెల్ల ఇంటిని తలుపును గడియను తక్కిన తీఱును చూడఁగా ఇట్లు ఊహింపఁదగియున్నది.

తత్ అత్ర తావత్ ప్రవిశ్య ... = కావున ఇఁదు ప్రవేశించి ఉండెదను గాక. ఇంతలో ఎడ్లను తోలు మాటలు వినవచ్చినవి. అయే - ఓహో - (ఈ) బండి ఇటే వచ్చుచున్నది.

( నేపథ్యే )

యాతం గావో యాతమ్. [ జాధ గోణా, జాధ ]

ఆర్య—( ఆకర్ణ్య ) అయే ప్రవహణ మిత ఏ వాభివర్తతే

శ్లో. భవే ద్గోష్ఠీయానం న చ విషయశీలై రధిగతం
వధూసంయానం వా తదభిగమనోపస్థితమిదమ్
బహి ర్నేతవ్యం వా ప్రవరజనయోగ్యం విధివశా
ద్వివిక్తత్వా చ్ఛూన్యం మమ ఖలు భవే ద్దైవవిహితమ్. ౪

---

శ్లో. ౪ బండి నిశ్శబ్దముగా వచ్చు చున్నది. పెద్దగిగాను అగపడు చున్నది - కావున ఈయూహాలు - గోష్ఠీయానం = నలువురు పదుగురు గుంపుగా ఎక్కిన బండి యగునా, విషమశీలైః = ఒకరి శీలమువంటిది మఱియొకరిది కాని వారిచే ఎక్కఁబడినది, వివిధ శీలములు గలిగి ఒండొకళ్ళతో వాదులు జగడాలు ఆడుకొనువారు కానివారు ఎక్కిన గోష్ఠియానమగునా ? వారి నడుమ నాకు ప్రవేశముండునా - సమశీలురు కావున ఉండునేమో. వా - కాదా. ఇదం = ఇది = వధూసంయానం = (ఏదైన నొక స్త్రీకోసమైన బండియా, తదభిగమన ఉపస్థితమ్ = ఆమె తన చోటికి పోవుటకై, వచ్చినట్టిది అగునా ? ప్రవరజన యోగ్యం = శ్రేష్ఠజనమునకు తగినది, విధివశాత్ = (దుర్) విధిపైకొనుటచే, దాని వాఁడు దిగిపోయినందున, బహిః నేతవ్యం వా = (ఊరి) బయటికి కొనిపోవలసినది యగునా ? గోష్ఠీయానమా, వధూసంయానమా, ప్రవరజనయానమా ? బండి పెద్దది - నిశ్శబ్దముగా నడచుచున్నది - ఈ యింటివైపు వచ్చుచున్నది. ఇ దెవరిది యెట్టిది యగును ? వివిక్తత్వాత్ = ఏకాంతముగా - కూడ ఎవరును లేక - ఉండుటవలన, శూన్యం = ఎవరు ఎక్కనిది, మమ = నాకు, దైవ విహితం భవేత్ ఖలు - దైవము సమకూర్చినది అగును గదా.

ఈ పెద్దబంగాళాలో తోటదిడ్డివాకిట చొచ్చితిని. ఆసమయమునకే ఎవ్వరు లేనిది ఏకాంతముగా ఉండునట్టిది, పెద్ద బండి ఇటు వచ్చుచున్నది. ఇది నాకు విధియే పంపినది యగునా ?

(తతః ప్రవహణేన సహ ప్రవిశ్య)

వర్ధమానక శ్చేటః—ఆశ్చర్యమ్. ఆనీతం మయా యానా స్తరణమ్. రదనికే, నివేద యార్యాయై వసన్తసేనాయై - 'అవస్థితం సజ్జం ప్రవహణ మధిరుహ్య పుష్పకరణ్డకం జీర్ణోద్యానం గచ్ఛ త్వార్యా'. [హీమాణహే ఆణీదే మప జాణత్థలకే. లదణిఏ, ణివేదేహి అజ్జఆఏ వశన్తశేణాఏ - 'అవత్థిదే శజ్జే పవహణే అహిలుహిఅ పుప్ఫకలణ్డఅం జిణ్ణుజ్జాణం గచ్ఛదు అజ్జఆ']।

ఆర్యా—(ఆకర్ణ్య) గణికా ప్రవహణ మిదమ్. బహిర్యానం చ భవతు. అధిరోహామి. (ఇతి స్వైర ముపసర్పతి.

చేటః—(శ్రుత్వా) కథం నూపురశబ్దః. త దాగతా ఖ ల్వార్యా. ఆర్యే, ఇమౌ నాసికారజ్జు కటుకౌ బలీవర్దౌ. త త్పృష్ఠత ఏ వారోహ త్వార్యా. [కధం ణేఉలశద్దే. తా ఆఅదా క్ఖు అజ్జఆ. అజ్జఏ, ఇమే ణశ్శకడుఆ బఇల్లా. తా పిట్ఠదో జ్జేవ ఆలుహాదు అజ్జఆ]।

---

బండివాఁడు రదనికతో వసంతసేనకుం జెప్పుమన్నాఁడు. రదనికయు లేదు - ఆర్యయు లేదు. మఱి ఆర్యకుఁ డున్నాఁడు - వాఁడు ఎక్కి కూచున్నాఁడు - వాఁడు వికల్పించుకొన్న మాఁడు తెలుంగులలో ఈమాటలం బట్టి యిది వధూసం యానముగా ఏర్పడుచున్నది. మఱి అట్టివా రెవ్వరును అగపడలేదు - తాను ఎక్కినాఁడు - అట్టిదగుటచే ఒకవేళ తనకు నిరపాయముగా ఉండుననియు అనుకొన్నాఁడేమో. వర్ధమానకుఁడు వెనుక తట్టుగా బండిలోనికి ఎవరు ఎక్కినదియు తాను చూడలేదు - ముక్కుత్రాటి మంటకు ఎద్దులు వానిని కదలనీయ లేకు. ఆర్యకుఁడు ఎక్కుట - అప్పుడైన ఆ తెగిన సంకెల ప్రోత, వసంతసేన యందెలమోత యని తలంచి, బండి బరువెక్కుటచే వసంతసేన ఎక్కియైన దని నిశ్చయించుకొని యెడ్లను కదలించినాఁడు. బండి రాజమార్గాన పుష్పకరండక జీర్ణోద్యానమునకు

(ఆర్యక స్తథా కరోతి)

చేటః__పాదోత్ఖాలచాలితానాం నూపురాణాం విశ్రాన్తః శబ్దః. భారాక్రాన్తం చ ప్రవహణమ్. తథా తర్కయామి సాంప్రత మార్యయారూఢయా భవితవ్యమ్. త ద్గచ్ఛామి. యాతం గావౌ, యాతమ్. [పాదుప్ఖాలచాలిదాణం ణేఉలాణం విశన్తోశద్దో. భలక్కన్తే అ పవహణే. తధా తక్కేమి శంపదం అజ్జఆఏ ఆలూఢాఏ హోదవ్వం. త గచ్ఛామి. జాధ గోణా, జాధ].

(ఇతి పరిక్రామతి.

(ప్రవిశ్య)

వీరకః__అరే రే, అరే జయ, జయమాన, చన్దనక, మఙ్గల, పుష్పభద్రప్రముఖాః, [అరే రే, అరే జఅ, జఅమాణ, చన్దణఅ, మఙ్గల, పుల్లభద్దప్పముహా],

శ్లో. కిం స్థ విశ్రబ్ధాః యః స గోపాలదారకో బద్ధః
భిత్త్వా సమం వ్రజతి నరపతిహృదయం చ బన్ధనం చాపి, ౫

[కిం అచ్ఛధ వీసద్ధా జో సో గోపాలదారఓ బద్ధో
భేత్తూణ సమం వచ్చఇ ణరవఇహిఅఅం అ బన్ధణం చావి].

---

చారుదత్తయ్యొకడకు పోవుచున్నది. ఇట్లు ప్రవహణ విపర్యాసమును కవి చాల నేర్పుమీఱఁ గూర్చినాఁడు, ఆబండి వసంతసేనతో సంస్థానక శకారుకడకును, ఈబండి ఆర్యకునితో ఆర్యచారుదత్తునికడకును చేరఁగలవు.

వీరకః - వీఁడు రాజసేనాపతి; జయుఁడు, జయమానుఁడు, చందనకుఁడు - మొదలైనవారు - సైనికులు,

శ్లో. ౫. కిం విశ్రబ్ధాః స్థ? = ఏమి సంభ్రమము లేక హాయిగా నమ్మకముగా, జంకు కొంకు లేక యున్నారే. యః సః గోపాలదారకః బద్ధః = ఏ యా గోపాల బాలుఁడు - గొల్లపిల్లగాఁడు, బద్ధః = (కట్టి) చెఱనుంపఁబడెనో, (సః = అతఁడు), సమం = ఒక్కటే, నరపతిహృదయం = రాజుమనసును, బన్ధనం చ అపి = చెఱను - సంకెలను, భిత్త్వా = పగులఁగొట్టుకొని, వ్రజతి = పోవుచున్నాఁడు.

అరే, పురస్తా త్ప్రతోలీద్వారే తిష్ఠ త్వమ్, త్వ మపి పశ్చిమే, త్వ మపి దక్షిణే, త్వ మ ప్యుత్తరే. యో౽ ప్యేష ప్రాకారఖణ్డః, ఏన మధిరుహ్యా చన్దనేన సమం గ త్వావలోకయామి, ఏహి చన్దనక, ఏహి. ఇత స్తావత్. [అలే, పురత్థిమే పదోలీదుఆరే చిట్ఠ తుమమ్, తుమం పి పచ్ఛిమే, తుమం పి దక్ఖిణే, తుమ పి ఉత్తరే, జో విఏ సో పాఆరఖణ్డో, ఏదం అహిరుహిఅ చన్దణేణ సమం గదుఅ అవలోఏమి. ఏహి చన్దణఅ, ఏహి, ఇదో దావ].

(ప్రవిశ్య సంభ్రాన్తః)

చన్దనకః—అరే రే వీరక, విశల్య, భీమాఙ్గద, దణ్డశూర ప్రముఖాః, [అరే రే వీరఅ, విసల్ల, భమజ్గఅ, దణ్డకాలఅ, దణ్డ సూరప్పముహా,]

శ్లో. ఆగచ్ఛత విశ్వస్తా స్త్వరితం యతధ్వం లఘు కురుత
లక్ష్మీ ర్యేన వ రాజ్ఞః ప్రభవతి గోత్రాన్తరం గన్తుమ్. ౬

---

అల వానివలన ఏదియో యూపద అని కదా వానిం దెచ్చి బంధించుట. మఱి యట్టివాఁడు బంధనముం ద్రెంచుకొని పోయినాఁడు - దాన రాజుహృదయము చాల వ్యథపాలైనది.

అరే - పురస్తాత్ = తూర్పున, ప్రతోళీద్వారే = వీథిమొగాళమున నిలు, ఏష ప్రాకార ఖణ్డః = ఇదిగో ఈప్రాకారభాగము - (తునుక) - దానిని చందనకునితో కూడ నెక్కి చూచెదను, అది చాల ఎత్తైనదగుటచే - అక్కడినుండి ఊరంతయు అగపడును.

శ్లో. ౬. విశ్వస్తాః = సంభ్రమము ఉడిగి - నెమ్మదితో - ఆగచ్ఛత = రండు, త్వరితం = వడిగా, యతధ్వం = ప్రయత్నింపుఁడు లఘు = వడిగా, కురుత = చేయుఁడు - ఏమనఁగా - యేన = దేన, రాజ్ఞః లక్ష్మీః = రాజులక్ష్మి, రాజ్యము, గోత్రాన్తరం = మఱిమొకవంశమునకు, క్షత్రియము మాని గొల్లదానికి, గన్తుమ్ = పోవను, న ప్రభవతి = సమర్థము కాకపోవునో - దానిని అనుట.

[ ఆఅచ్ఛధ పీసద్ధా తురిఅం జత్తేహ లలు కరేజ్జాహ
లచ్ఛీ జేణ ణ రణ్ణో పహావఇ గోత్తన్తరం గన్తుమ్ ].

అపి చ [ అవి అ ]

శ్లో. ఉద్యానేషు సభాసు చ మార్గే నగర్యా మాపణే ఘోషే
తం త మన్వేషయత త్వరితం శఙ్కా వా జాయతే యత్ర. ౭

[ ఉజ్జాణేసు సహాసు అ మగ్గె ణఅరీఅ ఆవణే ఘోసే
తం తం జోహహ తురిఅం సఙ్కా వా జాఅఏ జత్థ ].

శ్లో. రేరే వీరక కిం కిం దర్శయసి భణసి తావ ద్విశ్రబ్ధమ్
భిత్త్వా చ బన్ధనకం కః స గోపాలదారకం హరతి. ౮

[ రేరే వీరఅ కింకిం దరిసేసి భణాహి దావ వీసద్ధమ్
భేత్తూణ అ బన్ధణఅం కో సో గోవాలదారఅం హరఇ ]

శ్లో. ౭. నగర్యాం = నగరములో - ఉజ్జయినిలో, ఉద్యానేషు = తోఁటలలోను, సభాసు = జనులుగుమిగూడుచోటులను, అనఁగా సభలందును, మార్గే = దారులయందు, ఆపణే = అంగళ్ళయందు, ఘోషే = గొల్లపల్లెయందు, యత్ర వా = ఎక్కడెక్కడ, శఙ్కా జాయతే = సందేహము గుమాను కలుగునో, తత్ర = అక్కడ నంతయుఁ, తంతం = వానిని వానిని - తగినవానిని ఒక్కొక్కని, యోజయత = (వెదకుపనిలో) కూర్పుఁడు - పూన్పుఁడు.

శ్లో. ౮. రే రే వీరక = ఓరోరి వీరక. తావత్ విస్రబ్ధమ్ = అంత నెమ్మదిగా - సంభ్రమము గొనక, కిం కిం దర్శయసి = ఏమేమి చూపుదువో; భణసి పల్కెదవో - బన్ధనకం భిత్త్వా = చెఱసంకెలలను పగులఁగొట్టి, కః సః = ఎవఁడు వాఁడు, గోపాలకదారకం హరతి = గోపాలదారకుని కొనిపోవుచున్నాఁడు?

శ్లో. కస్యాష్టమో దినకరః కస్య చతుర్థశ్చ వర్తతే చన్ద్రః
షష్ఠశ్చ భార్గవగ్రహో భూమిసుతః పఞ్చమః కస్య? ౯

శ్లో. భణ కస్య జన్మషష్ఠో జీవో నవమ స్తథైవ సూరసుతః
జీవతి చన్దనకే కః స గోపాలదారకం హరతి, ౧౦

[క స్సట్ఠమో దిణఅరో కస్స చఉత్థో అ వట్టఏ చన్దో
ఛట్ఠో అ భగ్గవగహో భూమిసుఓ పఞ్చమో కస్స

భణ కస్స జన్మఛటో జీవో ణవమో తహేఅ సురసుఓ
జీఅన్తే చన్దణఏ కో సో గోవాలదారఅం హరఇ]

వీర—భట చన్దనక, [భడ చన్దణఅ]

శ్లో. అపహరతి కో౽పి త్వరితం చన్దనక శపే తవ హృదయేన
యథార్ధోదితదినకరే గోపాలదారకః ఘుటితః. ౧౧

---

శ్లో. ౯. వానికి నిజముగా గ్రహచారము చాలలేదు _ కస్య = ఎవనికి, అష్టమోదినకరః = సూర్యుఁడు _ జాతకగ్రహచక్రమునను _ గోచారమునను అష్టమమునను, చన్ద్రః = చందురుఁడు, చతుర్థః శ్చ = నాలుగవవాఁడుగాను ఉన్నాఁడు? భార్గవగ్రహః = శుక్రుఁడు, షష్ఠః చ = ఆఱవవాఁడును, కస్య భూమిసుతః పఞ్చమః = ఎవనికి భూమిసుతుఁడు అంగారకుఁడు ఐదవవాఁడు?

శ్లో. ౧౦. భణ = చెప్పుము, కస్య = ఎవనికి, జీవః = శుక్రుఁడు, జన్మషష్ఠః = జన్మలగ్నమునను ఆఱింట నున్నాఁడు? తథా ఏవ = అట్లే, నవమే = తొమ్మిదింట, సూరసుతః = శని _ జీవతి చన్దనకే = చందనకుఁడు బ్రదికియుండఁగా, కః సః గోపాలదారకం హరతి = ఎవఁడువాఁడు, గోపాలదారకుని హరించువాఁడు?

శ్లో. ౧౧. యథా = ఎట్లు, ఏకారణాన, అర్ధోదితదినకరే కాలే = సూర్యుఁడు అరపొడిచిన సమయమందు _ అరుణోదయమందే అనుట, గోపాలదారకః ఖుటితః = గోపాలదారకుఁడు, బంధము తెగఁగొట్టఁబడినవాఁ డైనాఁడో, చన్దనక _ చందనకుఁడా, దానిచేత, నీహృదయముమీఁద ఒట్టు పెట్టి చెప్పెదను _ కో౽పి = ఎవఁడో, త్వరితం = వడివడిగా, హరతికొనిపోవు చున్నాఁడు.

[ అవహారఇ కో వి తురిఅం చన్దణఅ సవామి తుజ్ఝ హిఅఏణ
జఇ అద్ధుఇదిణఅరే గోవాలఅదారఓ ఖుడిదో ].

చేటః—యాతం గావో యాతమ్. [ జాధ గోణా, జాధ ].

చన్ద—(దృష్ట్వా) అరే రే పశ్య పశ్య, [ అరే రే, పేక్ఖ పేక్ఖ ].

శ్లో. అపవారితం ప్రవహణం వ్రజతి మధ్యేన రాజమార్గస్య
ఏత త్తావ ద్విచారయ కస్య కుత్ర ప్రోషితం ప్రవహణ మితి.

[ ఓహారిఓ పవహణో వచ్చఇ మజ్ఝేణ రాఅమగ్గస్స
ఏవం దావ విఆరహ కస్స కహిం పవసిఓ పవహణో త్తి ].

వీర—(అవలోక్య) అరే ప్రవహణవాహక, మా తావ దేత త్ప్రవహణం వాహయ. క స్యైత త్ప్రవహణమ్. కో వా ఇ హారూఢః. కుత్ర వా వ్రజతి. [ అరే పవహణవాహఆ, మా దావ ఏవం పవహణం వాహేహి. కస్స కేరకం ఏదం పవహణమ్. కో వా ఇధ ఆరూఢో, కహిం వా వజ్జఇ ].

చేటః—ఏత త్ఖలు వా ప్రవహణ మార్యచారుదత్తస్య. ఇహార్యా వసన్తసే నారూఢా. పుష్పకరణ్డకం జీర్ణోద్యానం క్రీడితుం

---

శ్లో. ౧౨. ప్రవహణం = బండి, అపవారితం = ఆచ్ఛాదింపఁబడినదై, రాజమార్గస్యమధ్యేన = రాచబాటనట్టనడుమ, వ్రజతి = పోవుచున్నది. ఏతత్ తావత్ విచారయ - ఇది యంతయు దీనినంతయు విచారింపుము - ప్రవహణం = బండి, కస్య = ఎవరిది, కుత్ర ప్రోషితం = ఎక్కడికి పోవుచున్నది.

ప్రవహణవాహక = బండి (తోలు) వాఁడా, మా తావత్ - బండి తోలకుము - నిలుపుము - (చెప్పుము) కస్య ... = ఎవనిది, కోవా ... = ఎవరు అందు ఎక్కి ఉన్నారు? ఎక్కడికి పోవుచున్నది?

చారుదత్తస్య నీయతే. [ఏశే క్ఖు పవహణే అజ్జచాలుదత్తాహ కేలకే. ఇధ అజ్జఆ వశన్తశేణా ఆలూఢా పుప్ఫకరణ్డఅం జిణ్ణుజ్జాణం కీలిదుం చాలుదత్తశ్శ ణీఅది].

వీర—(చన్దన ముపసృత్య) ఏష ప్రవహణవాహకో భణతి—'ఆర్యచారుదత్తస్య ప్రవహణం వసన్తసేనారూఢా. పుష్పకరణ్డకం జీర్ణోద్యానం నీయతే' ఇతి. [ఏసో పవహణవాహఓ భణాది—అజ్జచాలుదత్తస్స పవహణం వశన్తశేణా ఆలూఢా. పుప్ఫకరణ్డఅం జిణ్ణుజ్జాణం ణీఅది' త్తి.

చన్ద—త ద్గచ్ఛతు. [తా గచ్ఛదు].

వీర—అనవలోకిత ఏవ. [అణవలోఇదో జ్జేవ].

చన్ద—అథ కిమ్. [అధ ఇం].

వీర—కస్య ప్రత్యయేన. [కస్స పచ్చవేణ].

చన్ద—ఆర్యచారుదత్తస్య. [అజ్జచారుదత్తస్స].

వీర—క ఆర్యచారుదత్తః, కా వా వసన్తసేనా, యే నానవలోకితం ప్రజతి. [కో అజ్జచారుదత్తో, కా వా వసన్తసేణా, జేణ అణవలోఇదం వజ్జఇ].

చన్ద—అరే ఆర్యచారుదత్తం న జానాసి, న వా వసన్తసేనాం. య దార్యచారుదత్తం వసన్తసేనాం వా న జానాసి, తదా గగనే జ్యోత్స్నాసహితం చన్ద్రమపి త్వం న జానాసి. [అరే అజ్జ

క్రీడితుం చారుదత్తస్య నీయతే = ఆడుకొనుటకు, చారుదత్తునికడకు కొనిపోఁబడుచున్నది. కస్య ప్రత్యయేన = ఎవరినమ్మకముచేత? తదా గగనే జ్యోత్స్నా ... = అప్పుడు - అప్పటికి - అట్లైన, మింట వెన్నెలతో కూడిన చంద్రునిసయితము నీ వెఱుఁగవు!

చారుదత్తం ణ జాణాసి, ణ వా వసన్తసేణిఅమ్. జఇ అజ్జచారుదత్తం వసన్తసేణిఅం వా ణ జాణాసి, తా గఅణే జోణ్హాసహిదం చన్దం పి తుమం ణ జాణాసి].

శ్లో. కస్తం గుణారవిన్దం శీలమృగాఙ్కం జనో న జానాతి
ఆపన్న దుఃఖమోక్షం చతుఃసాగరసారం రత్నమ్. ౧౩

ద్వావేవ పూజనీయా విహ నగర్యాం తిలకభూతౌ చ
ఆర్యా వసన్తసేనా ధర్మనిధి శ్చారుదత్త శ్చ. ౧౪

[కో తం గుణారవిన్దం శీలమిఅఙ్కం జణో ణ జాణాది
ఆవణ్ణదుక్ఖమోక్ఖం చఉసాఅరసారఅం రఅణమ్.
దో జ్జేవ పూఅణీఆ ఇవ ణఅరీఏ తిలఅభూదా అ
అజ్జా వసన్తసేణా ధమ్మణిహీ చారుదత్తో అ].

వీర—అరే చన్దనక, [అరే చన్దణఅ].

---

శ్లో. ౧౩. కః జనః = ఏజనుఁడు, తం గుణారవిన్దం = గుణములచే తామరసమైనవానిని, పూలలో తామర ఎట్లుప్రకృష్టమో, పురుషులలో చారుదత్తుఁడు, సత్యశౌచశీలౌదార్యాదులచే, అట్టి ఉత్తముఁడు; వానిని; శీలమృగాఙ్కం = చంద్రునివలె, శీలముచే ఎల్లరకు అభినందనీయుఁడైనవానిని, ఆపన్నదుఃఖమోక్షం = ఆపదచెందిన వారియొక్క దుఃఖమునకు అవసానము - తీఱుట ఐనవానిని, చతుఃసాగర సారం = నలుసముద్రముల సారమైన - కౌస్తుభమువంటి - రత్నమైన వానిని, న జానాతి = ఎఱుఁగఁడు?

అట్లు అన్నిట ప్రసిద్ధుని ఎఱుంగనివా రుందురా?

శ్లో. ౧౪. ఇహ నగర్యాం = ఈపట్టణమున, ద్వౌ ఏవ = ఇరువురే, ఆర్యా వసంతసేనా = వసంతసేనమ్మయు, ధర్మనిధిః = ధర్మమునకు కొటారు ఐన, చారుదత్తః చ = చారుదత్తుఁడును, పూజనీయౌ = పూజింపఁదగినవారు, తిలకభూతౌ = మొగానబొట్టువలె మొదలనే శోభకలిగించువారు - శ్రేష్ఠులైనవారు.

శ్లో. జానామి చారుదత్తం, వసన్తసేనాం చ సుష్ఠు జానామి,
ప్రాప్తే చ రాజకార్యే పితరమ ప్యహం న జానామి. ౧౫
[ జాణామి చారుదత్తం వసన్తసేణం అ సుట్ఠు జాణామి
పత్తే అ రాఅకజ్జే పిదరం పి అహం ణ జాణామి ].

ఆర్య—(స్వగతమ్) అయం మే పూర్వవైరీ, అయం మే పూర్వబన్ధు. యతః,

శ్లో. ఏకకార్యనియోగే ఽపి నానయో స్తుల్యశీలతా
వివాహే చ చితాయాం చ యథా హుతభుజో ర్ద్వయోః.

చన్ద—త్వం తన్త్రిలః సేనాపతీ, రాజ్ఞః ప్రత్యయితః. ఏతౌ ధారితౌ మయా బలీవర్దౌ. అవలోకయ. [ తుమం తన్త్రిలో సేణావఈ, రణ్ణో పచ్చఇదో. ఏదే ధారిదా మఏ బఇల్లా అవలోఏహి ].

---

శ్లో. ౧౫. చారుదత్తం = చారుదత్తుని, జానామి = ఎఱుఁగుదును; వసన్తసేనాంచ = వసంతసేనంగూడ, సుష్ఠు = చక్కఁగా, జానామి = ఎఱుంగుదును. చ = తు = మఱి, రాజకార్యే ప్రాప్తే = రాజుపనివచ్చినప్పుడు, అహం = నేను, పితరం అపి = నాయనను సైతము, న జానామి = ఎఱుంగను _ ఎఱింగినట్లుండను: చేయవలసిన సోదాలు దండనలు అన్నియు చేయుదును _ అనుట.

అయం మే పూర్వవైరీ _ వీఁడు (వీరకుఁడు) నాకు తొల్లింటి శత్రువు. వీఁడు (చందనకుఁడు) నాకు తొల్లింటి బంధువు. యతః = ఏలన.

శ్లో. ౧౬. వివాహే చ = పెండ్లియందును, చితాయాం చ = సొదయందును, ద్వయోః హుతభుజోః = రెండు నిప్పులకు, యథా = ఎట్లో _ (అట్లే), ఏకకార్య నియోగే అపి = ఒక్కపనిలో _ రాజుసైనికులుగానైన _ నౌకరి (పనుపు) యందు, అనయోః = ఈయిరువురికి సమానమైన శీలముకలిగియుండుట కలుగదు.

రెండు నిప్పులకును పని కాల్చుటే _ ఐన ఒకటి వధూవరులంగూర్చిన శుభములు కూర్చును. మఱియొకటి వధూవరులను, స్త్రీలయు పురుషులయు శవములను _ ప్రాణహీనదేహములను _ కాల్చును. ఒకటి శుభము _ ఒకటి యశుభము.

వీర—త్వ మపి రాజ్ఞః ప్రత్యయితో బలపతిః. తస్మా త్త్వ మే వావలోకయ. [తుమం పి రణ్ణో పచ్చఇదో బలవఈ. తా తుమం జ్జేవ అవలోఏహి].

చన్దన—మ యావలోకితం త్వ యావలోకితం భవతి. [మఏ అవలోఇదం తుఏ అవలోఇదం భోది].

వీర—య త్త్వయా వలోకితం త ద్రాజ్ఞా పాలకే నావలోకితమ్. [జం తుఏ అవలోఇదం తం రణ్ణా పాలఏణ అవలోఇదమ్].

చన్దన—అరే, ఉన్నామయ ధురమ్. [అరే ఉణ్ణామేహి ధురమ్].

(చేట స్తథా కరోతి)

ఆర్యకః—(స్వగతమ్) అపి రక్షిణో మా మవలోకయన్తి అశస్త్ర శ్చాస్మి మన్దభాగ్యః. అథవా,

అగ్ని ఒక్క తీరుగా తీక్ష్ణమైనదే, మఱి అది అందు అట్లు, ఇందు ఇట్లు. సోదాలు మొదలైన వానికి శత్రువుల నెదుర్కొని పైఁబడవలసి వచ్చినప్పుడు – వీరకుఁడు వీరకుఁడు, దుఃశీలుఁడు, చందనకుఁడు చందనమే, చల్లనివాఁడును. అది మంచి వాసనయును గలదైనట్లు మంచియును కలవాఁడు – తన్త్రిలః = రాజ్యతంత్ర (= చింతా) పరుఁడవు, సేనాపతిః రాజ్ఞః = రాజునకు సేనాపతివి, ప్రత్యయితః – అప్తుఁడవు, నమ్మకమును చూఱఁగొన్నవాఁడవు, త్వం అపి... నీవును అప్తుఁడవే రాజునకు, నమ్మకము చూఱఁగొన్నవాఁడవే, సేనాపతివియును. ఏతా ధారితా= ఇవిగో పట్టుకొని ఆపఁబడినవి. చూడు (= అవలోకయ). మయావలోకితం త్వయా అవలోకితం భవతి – నాచేత చూడఁబడినది నీచేతను చూడఁబడిన దగును – అనఁగా నేను చూచిన నీవు చూచినట్లే. అది రాజుచే పాలకునిచేత చూడఁబడిన దగును. ఉన్నమయ ధురం = కాఁడి ఎత్తరా. అశస్త్రః చ = ఆయుధము – కత్తి కటారి వంటివి – లేనివాఁడను. అథవా = ఐన నేమిలే. నాబాహువే నాకు ఆయుధ మగుగాక.

శ్లో. భీమ స్యానుకరిష్యామి బాహుః శస్త్రం భవిష్యతి.
వరం వ్యాయచ్ఛతో మృత్యు ర్న గృహీతస్య బన్ధనే. ౧౭

అథవా సాహసస్య తావ దనవసరః.

(చన్దనకో నాట్యేన ప్రవహణ మారు హ్యావలోకయతి)

ఆర్య—శరణాగతో ఽస్మి.

చన్ద—(సంస్కృత మాశ్రిత్య) అభయం శరణాగతస్య.

ఆర్య—

శ్లో. త్యజతి కిల తం జయశ్రీ
ర్జహాతి చ మిత్రాణి బన్ధువర్గ శ్చ

---

శ్లో. ౧౭. భీమస్య = భీముని, అను ... = అనుకరింపఁగలను - పోలఁగలను. అనుకరించుటకు కర్మ షష్ఠిలో - భీమస్య - ఉండును, బాహుః = బాహువే, శస్త్రం భవిష్యతి = ఆయుధము కాఁగలదు. వ్యాయచ్ఛతః = పరులను ఆక్రమించువానికి, మృత్యుః వరం = చావు - అనఁగా దానఁ గలుగునది - మేలు. బన్ధనే గృహీతస్య = చెఱసాలలో సంకెళ్ళం బట్టుకొనఁబడినవానియొక్క, మృత్యుః = చావు, చంపఁబడి చచ్చుట - న (వరమ్) = మేలుకాదు.

ఆత్మరక్షకై స్వతంత్రముగా బాహువుతో నైనను పోరుచు మడియుట మేలు- చెఱం గట్టువడి పరాధీనముగా చచ్చుట మేలు గాదు.

అథవా = అట్లుగాదు - సాహసస్యతావత్ = పౌరుషమునకు అన్ననో, అనవసరః = ఇది సమయము గాదు.

శరణాగతః అస్మి = (నిన్ను) శరణు జొచ్చినవాఁడ నైతిని - నన్ను రక్షించు - శరణాగతస్య = శరణుజొచ్చినవానికి, అభయం = రక్షణమే, భయ మక్కఱలేదు - నేను కాపాడెదను.

శ్లో. ౧౮. యః ఖలు = ఎవఁడుగన, శరణాగతం త్యజతి = శరణు జొచ్చినవానిని (కాపాడ దివురక) విడిచిపెట్టునో, తం = వానిని, జయశ్రీః = జయలక్ష్మి, త్యజతి కిల = విడిచిపెట్టును గదా. మిత్రాణి చ = మిత్రులును,

భవతి చ స దోపహాస్యో
యః ఖలు శరణాగతం త్యజతి. ౧౮

చన్ద—కథ మార్యకో గోపాలదారకః శ్యేనవిత్రాసిత ఇవ పత్రరథః శకునికస్య హస్తే నిపతితః. (విచిన్త్య) ఏషో ఽనపరాధః, శరణాగత, ఆర్యచారుదత్తస్య ప్రవహణ మారూఢః, ప్రాణప్రదస్య మమ ఆర్య శర్విలకస్య మిత్రమ్. అన్యతో రాజనియోగః. త త్కి-

జహాతి = విడిచిపెట్టుదురు: బన్ధువర్గః చ = బంధువుల గుంపును - ఎల్ల బంధువులును, (జహాతి - అని యేకవచనము చేసికొని అన్వయించుకొనవలయును) విడిచిపుచ్చును. సదా = ఎల్లప్పుడు, (ఎల్లరకు), ఉపహాస్యః = హేళనము చేయఁదగిన - వాఁడు, భవతి = అగును.

శరణాగతుని వదలఁగూడదు. వదలినట్లైన, దాన ఎన్నియో సెబ్బరలు నష్టములు కలుగును - వానికి ఒకనాఁడును ఎందును జయము చేకుఱదు. వాఁడు నమ్మకముల గోలుపోవును - వానిని మిత్రులు విడిపెట్టుదురు, సమయాన సాయపడక; బంధువులును. ఎప్పుడును ఎల్లరును పరిహాసము చేయుచుందురు.

కథం - ఎట్లూ! ఆర్యకః గోపాలదారకః! = ఆర్యకుఁడు గోపాలదారకుఁడు! నీవా బాబూ! - అనుట. శ్యేనవిత్రాసితః = డేగకు బెదరి పఱచి, పత్రరథః = పక్షి, శాకునికస్య = (పక్షి) వేఁటగాని (బండని), హస్తే నిపతితః = చేతం బడినది, ఆచావుం దప్పించుకొనఁ బోయి అంతకన్నను ఘోరపుఁ జావునం బడితివే! ఏషః = ఇతఁడు, అనపరాధః = ఏతప్పును ఎఱుఁగఁడు - చేసినవాఁడు కాఁడు. ఆర్యచారు ... = చారుదత్తయ్య బండి యెక్కియున్నాఁడు - అదియు వీనిని నేను గావను మఱి యొక కారణమే - చారుదత్తుని ఒకవిధముగా ఆశ్రయించినవాఁడగును - కావునను రక్ష్యుఁడు. మే ప్రాణప్రదస్య = నాప్రాణములం గాచిన, ఆర్య శర్విలకస్య = శర్విలకయ్యకు నేస్తగాఁడు. కావున ఇట్లు ఇన్ని కారణములున్నవి, నాకు వీనిం గావ. మఱి రాజనియోగః = రాజు నాజ్ఞ, అన్యతః = వేఱు తీఱుగా - వీనిని పట్టియీవలసినదిగా - చంపవలసినదిగా నున్నది. తత్ కిం ఇదానీం ... = కావున ఇప్పుడు ఏమి చేయుట (యుక్తము =) సరియగును. అథవా -

మిదానీ మత్ర యుక్త మనుష్ఠాతుమ్? అధవా య ద్భవతి తద్భవతు, ప్రథమ మే వాభయం దత్తమ్.

శ్లో. భీ తాభయ ప్రదానం
దదతః పరోపకారరసికస్య
యది భవతి భవతు నాశ
స్తథాపి ఖలు లోకే గుణ ఏవ. ౧౯

(సభయ మవతీర్య) దృష్ట ఆర్యః - (ఇ త్యర్థోక్తే) న, ఆర్యా వసన్తసేనా, త దేషా భణతి - 'యుక్తం నేదమ్, సదృశం నేదమ్, య దహ మార్యచారుదత్త మభిసర్తుం గచ్ఛన్తీ రాజమార్గే పరిభూతా'.

---

ఎందులకు ఈ ఆలోచన? యద్భవతి తద్భవతు = ఏమి అగునో అది కానిమ్ము - ప్రథమం ఏవ = తొలుతనే, అభయం దత్తమ్ = అభయము ఈఁబడినది - కాపాడెదను, భయమక్కఱలేదు అని యంటినిగదా, మఱిమాట తిరుగఁదగునా?

శ్లో. ౧౯. భీత అభయ ప్రదానం దదతః = భయముగొన్నవానికి (అభయము = ) రక్షణ నొసంగువానికి, (అట్లు) పరోపకారరసికస్య = పరునికి ఉపకారముచేయుటయొక్క చవి యెఱిఁగిన ఉత్సాహవంతునికి, యది నాశః భవతి = నాశనము కలుగునేని, భవతు = కలుగును గాక. తథా అపి = అట్లయినను, లోకే = లోకాన, గుణ ఏవ ఖలు = గుణమే - మేలే - కదా?

సభయం అవతీర్య = భయముతో (బండినుండి) దిగి - తనకు ఈవీరకునివలన ఇప్పుడును రాజువలన తరువాతను ఏమగునో - ఎట్లు తప్పించుకొనుటో అని భయము. చెప్పుచున్నాఁడు - దృష్టః = ఆర్యుని చూచితిని - అని అర్థోక్తే = సగము మాటలో - ఆహా, కాదు, ఆర్యుఁడు కాదు - పొరపాటు. ఆర్యా = అమ్మ - వసన్తసేనా = వసంతసేన. తత్ ఏషా భణతి = మఱి ఈమె చెప్పుచున్నది - యుక్తం ను ఇదమ్ = కూడునా ఇది? సదృశం ను = తగునా ఇది? తరహానా? యత్ = ఏదనఁగా, అహం = నేను, ఆర్యచారుదత్తం అభిసారయితుం గచ్ఛన్తీ = చారుదత్తయ్యను మరులుకొని కలసికొనం బోవుచుండఁగా, రాచబాటలో - నడివీధిలో, పరిభూతా = అవమానింపఁబడితినే - బండి ఆపి లోపలికి ఎక్కి, ఇట్లు చూడఁబడితినే - అది అవమానింపఁబడుట గదా?

[కధం అజ్జఏ గోవాలదారఏ సేణవిత్తాసిదో విఅ పత్తరహో సాఉణిఅస్స హత్థే ణివడిదో. ఏసో అణవరాధో సరణాఅదో అజ్జ చారుదత్తస్స పవహణం ఆరూఢో, పాణప్పదస్స మే అజ్జసవ్విలఅస్స మిత్తమ్. అణ్ణాదో రాఅణిఓఏ. తా కిం దాణిం ఏత్థ జుత్తం అణు చిట్ఠిదుమ్. అధవా జం భోదు తం భోది తం పడమం జ్జేవ అభఅం దిణ్ణమ్.

భీదాభఅప్పదాణం దత్తస్స పరోవఆరరసిఅస్స
జఇ హోఇ హోఉ ణాసో తహ వి హు లోఏ గుణో జ్జేవ.

దిట్ఠో అజ్జో - (ఇత్యర్థోక్తే)ణ, అజ్జఆ, వసన్తసేణా, తదో ఏసా భణాది - 'జుత్తం ణేదమ్, సరిసం ణేదం, జం అహం అజ్జచారు దత్తం అహిసారిదుం గచ్ఛన్తీ రాఅమగ్గే పరిభూదా'].

వీర—చన్దనక, అత్ర మే సంశయః సముత్పన్నః. [చన్దణఅ, ఏత్థ మహ సంసఓ సముప్పణ్ణో].

చన్ద—కథం తే సంశయః? [కధం దే సంసఓ].

వీర—

శ్లో. సంభ్రమఘుర్ఘరకణ్ఠ
స్త్వమపి జాతో౽సి యత్త్వయా భణితమ్

---

...సంశయః ఉత్పన్నః = ఇందు, ఈవిషయమున, నాకు సందియము కలిగినది.

శ్లో. ౨౦. త్వం అపి = నీవు - రాజు బలపతివి - సయితము, సంభ్రమ ఘర్ఘుర కణ్ఠః = తొట్రుపాటుతో ఘుర్ ఘుర్ అను గొంతుకలవాఁడవు, జాతః అసి = అయితివి - త్వయా = నీచేత, భణితమ్ = చెప్పఁబడినది, దృష్టో మయా ఖలు ఆర్యః = చూడఁ బడినాఁడు నాచేత ఆర్యుఁడు - అని, పునః అపి = మరలను - దానిని సవరించుకొనునట్లుగా - ఆర్యా వసన్తసేనా ఇతి = ఆర్యను - స్త్రీలింగముగా మార్చి - ఆర్యా - అమ్మ, వసంతసేన - అని.

దృష్టో మయా ఖ ల్వార్యః
పున ర ప్యార్యావసన్తసే నేతి. ౨౦

అత్ర మే ఽప్రత్యయః.

[సంభమఘుగ్ఘరకణ్ఠో
తుమం పి జాదో సి తుఏ భణిదమ్
దిట్ఠో మఏ క్ఖు అజ్జో
పుణో వి అజ్జా వసన్తసేణే త్తి.

ఏత్థ మే అప్పచ్చఓ].

చన్ద—అరే, కో ఽప్రత్యయ స్తవ. వయం దాక్షిణాత్యా అవ్యక్తభాషిణః. ఖష-ఖత్తి-కడ కడట్ఠోబిల-కర్ణాట-కర్ణ-ప్రావరణ-ద్రవిడ-చోల-చీన-బర్బర-ఖేర-ఖాన-ముఖ-మధుఘాత ప్రభృతీనాం మ్లేచ్ఛజాతీనా మనేక దేశభాషాభిజ్ఞా యథేష్టం మన్త్రయామః, దృష్టో దృష్టా వా, ఆర్య ఆర్యా వా.

[అరే, కో అప్పచ్చఓ తుహ. వఅం దక్ఖిణత్తా అవత్త భాసిణో. ఖస, ఖత్తి, ఖడో, ఖడట్ఠోవిసల, కణ్ణాట, కణ్ణ, ప్పావణఅ,

అట్లు నీతడబాటు గొంతులో గరగర తొలుత ఆర్య అనుట తరువాత ఆర్యా అని సవరించుకొనుట, ఈయంతటివల్లను, అత్ర మే అప్రత్యయః = ఇందు నాకు అపనమ్మికగా నున్నది.

అరే - ఓరి, కః అత్ర అప్రత్యయః తవ = ఏమిటిరా ఇందు అపనమ్మిక నీకు ? వయం దాక్షిణాత్యాః = మేము దక్షిణాదివారము - అవ్యక్తభాషిణః - చక్కఁగా స్ఫుటముకాని మాటలవారము. ఖష - ఖత్తి - కడ - కడట్ట - ఓబిల - కర్ణాట - కర్ణ - ప్రావరణ - ద్రవిడ - చోళ - చీన - బర్బర - ఖేర - ఖాన - ముఖ - మధుఘాత - ప్రభృతీనాం = ఈ చెప్పిన పేర్లు మొదలుగాఁగల - మ్లేచ్ఛజాతీనాం అనేక దేశభాషాభిజ్ఞాః - మ్లేచ్ఛజాతుల అనేక దేశభాషలను చక్కఁగా ఎఱింగిన

దవిడ, చోల, చీణ, బర్బర, ఖేర, ఖాన, ముఖ, మధుఘావ పహుదాణం మిలిచ్ఛజాదీణం అణేఅదేసహాసాభిణ్ణో జహేట్ఠం మన్తఆమ, దిట్ఠో దిట్ఠా వా, అజ్జో అజ్జా వా].

వీరః—న స్వహమపి ప్రలోకయామి, రాజాజ్ఞైషా, అహం రాజ్ఞః ప్రత్యయితః. [ణం అహం పి పలోఏమి. రాఅఅణ్ణా ఏసా, అహం రణ్ణో పచ్చఇదో].

చన్దన—తత్కి మహ మప్రత్యయితః సంవృత్తః? [తా కిం అహం అప్పచ్చఇదో సంవుత్తో?]

వీర—నను స్వామినియోగః. [ణం సామిణిఓఓ].

చన్దన—(స్వగతమ్) ఆర్యగోపాలదారక ఆర్యచారుదత్తస్య ప్రవహణ మధిరుహ్యాపక్రామ తీతి యది కథ్యతే, త దార్యచారుదత్తో రాజ్ఞా శాస్యతే. తత్కోఽత్రోపాయః. (విచిన్త్య) కర్ణాట

---

వారము - (కావున) యథేష్టం = ఇచ్ఛవచ్చినట్లు - ఎట్లు కోరిన అట్లు - మాటలాడుదుము. దృష్టః అని కాని, దృష్టా అని కాని, ఆర్య అని కాని ఆర్యా అని కాని, అని. నను - ఓరి, అహం అపి విలోకయామి = నేను కూడ పరికించెదను. రాజాజ్ఞా ఏషా = రాజును త్తరువు కదా ఇది. - నేను రాజునకు నమ్మికయైన వాఁడను తత్ = అట్లైని, కిం అహం ... = నేను నమ్మకమైనవాఁడను కాక పోయితినా? నను స్వామి నియోగః - దొరయుత్తరువు గదా.

స్వగతమ్ - తన (మనసు)లో తలపోసికొనుచున్నాఁడు - ఆర్యగోపాలదారకః ... = గోపాలదారకయ్యా, చారుదత్తుని బండిలో ఎక్కి తప్పించుకొని పరారియగుచున్నాఁడు అని, చెప్పఁబడునేని - వీఁడు ఎక్కి చూచి అట్లు చెప్పనేని, అప్పుడు, చారుదత్తయ్య రాజుచే దండింపఁబడఁగలఁడు. తత్ కః అత్ర ఉపాయః - ఇతనికి అభయమిచ్చితిని, అతఁడు నాకు పూజ్యుఁడు, ఆశ్రయమైన వాఁడు - ఇరువురిని నేను తప్పింపవలసినవాఁడనే. తత్ ... ఉపాయః ? = మఱి యందులకు ఉపాయము ఏమగును ?కణాటక కలహ ప్రయోగం కరోమి = కర్ణా

కలహప్రయోగం కరోమి. (ప్రకాశమ్) అరే వీరక, మయా చన్దనకేన ప్రలోకితం పున రపి త్వం ప్రలోకయసి. క స్త్వమ్.

[అజ్జగోవాలదారఓ అజ్జచారుదత్తస్స పవహణం అహిరుహిఅ అవక్కమ దిత్తి జఇ కహిజ్జది, తదో అజ్జచారుదత్తో రణ్ణా సాసిజ్జఇ. తా కో ఏత్థ ఉవాఓ. కణ్ణాటకలహప్పఓఅం కరేమి. అరే వీరఅ, మఏ చన్దణకేణ పలోఇదం పుణో వి తుమం పలోఏసి. కో తుమమ్].

వీర—అరే, త్వ మపి కః. [అరే, తుమం పి కో].

చన్ద—పూజ్యమానో మాన్యమాన స్త్వ మాత్మనో జాతిం న స్మరసి. [పూయిజ్జన్తో మాణిజ్జన్తో తుమం అప్పణో జాదిం ణ సుమరేసి].

వీర—(సక్రోధమ్) అరే, కా మమ జాతిః. [అరే, కా మహ జాదీ].

చన్ద—కో భణతు. [కో భణఉ].

వీర—భణత. [భణఉ].

---

టకుల జగడమును ప్రయోగించెదను. కార్యసాధనకై కావలయునని గిల్లి, జగడము పెట్టుకొనుట కర్ణాటకలహము. అట్లు ఆర్యకరక్షణకై జగడమాడి తన్ని తఱిమెదను, వీరకుని – అనుకొనుట. అట్లు నాకార్యము సాధింతును.

అరే వీరక ... ఓరి వీరక, నేను చందనకుఁడను చూచిన తరువాత మరల నీవు చూతువా ? కః త్వమ్ = (అట్లుచూచుటకు) నీ వెవఁడవురా ? అరే, త్వం అపి కః – ఓరి, నీవు సయితము ఎవఁడవురా ? పూజ్యమానః మాన్యమానః – (సేనాపతివి చేయఁబడి) పూజింపఁబడుచు మన్నింపఁబడుచు నుండి, జాతిం న స్మరసి = (నీ) జాతిని మఱతువటరా ? అరే కా మమ జాతిః – ఏమిరా నా జాతి ? కోభణతు = ఎవరు చెప్పవలయునురా ? ... చెప్పు. అథవా...ఊహు నేను చెప్పను.

చన్ద—అథవా న భణామి. [అహవా ణ భణామి].

శ్లో. జానన్నపి ఖలు జాతిం
తవ చ న భణామి శీలవిభవేన
తిష్ఠతు మమైవ మనసి
కిం చ కపిత్థేన భగ్నేన. ౨౧

[జాణన్తో వి హు జాదిం
తుజ్ఝ అ ణ భణామి సీలవిహవేణ
చిట్ఠఉ మహావ్విఅ మణే
కిం చ కఇత్థేణ భగ్గేణ].

వీర—నను భణతు భణతు. [ణం భణఉ, భణఉ].

(చన్దనకః సంజ్ఞాం దదాతి)

వీర—అరే, కిం న్విదమ్. [అరే కిం ణేదమ్].

---

శ్లో. ౨౧. తవ జాతిం జానన్ అపి = నీ జాతిని ఎఱింగినవాఁడనయ్యు, శీలవిభవేన = (నీ) శీలముగొప్పదగుటచే, న భణామి = చెప్పను. నీవు సేనానాయకుఁడవుగా నున్నావు, మంచివాఁడవును, కావున నీజాతి ఏదైన నేమి, నేను చెప్పను. మమ = నాయొక్క, మనసి ఏవ = మనస్సునందే, తిష్ఠతు = ఉండనీ, కించ కపిత్థేన భగ్నేన = వెలగకాయను పగులఁగొట్టిన ఏమగును, ఏమిప్రయోజనము? పైన చూచుటకు తెల్లగా నున్నగా వాసనయుం గొట్టుచు ఉండు వెలగను పగులగొట్టిన ఏమగును = లోపల నల్లగా గిజురు, దానినిండ విత్తులును వికారముగా ఉండును. ఎందులకు దానిని పగులఁగొట్టుట? గిజురును తెలుగున 'వేసము' అనియు నందురు.

చూ. తీయని పండ్లకుఁ గదియంగఁ బడి కయ్యంబు సేసి,
యేసరేఁగి వేసంబులు గాసంబులు గొని. భాగ. 8 స్కం.

చందనకుఁడు 'సంజ్ఞాం దదాతి' - సన్న చేయుచున్నాఁడు - చేతితోతల వెంట్రుకలు గొరుగుట నభినయించుచున్నాఁడు - వాఁడు మంగలి అని. అరే కిం ను ఇదమ్ - ఓరి ఏమిటిరా నీ సన్న?

చన్ద—

శ్లో. శీర్ణశిలాతలహస్తః పురుషాణాం కూర్చగ్రన్థిసంస్థాపనః
కర్తరీవ్యాపృతహస్త స్త్వ మపి సేనాపతి ర్జాతః. ౨౨

[ శిణ్ణ సిలాఅలహత్థో పురిసాణం కుచ్చగణ్ఠిసంఠవణో
కత్తరివావుదహత్థో తుమం పి సేణావఇ జాదో ].

వీర—అరే చన్దనక, త్వ మపి మాన్యమాన, ఆత్మనో జాతిం న స్మరసి. [అరే చన్దణఆ, తుమం పి మాణిజ్జన్తో అప్పణో కేరికం జాదిం ణ సుమరేసి ].

చన్ద—అరే, చన్దనకస్య చన్ద్రవిశుద్ధస్య జాతిః. [అరే, కా మహ చన్దణఅస్స చన్దవిశుద్ధస్స జాదీ].

వీర—కో భణతు. [కో భణఉ].

చన్ద—భణతు భణతు. [భణఉ భణఉ].

---

శ్లో. ౨౨. శీర్ణ శిలాతల హస్తః = తునిగిన రాతిని - రాతితునుకను - కత్తిని మాటిమాటికి తీయుటకైనదానిని - చేతఁ గొన్నవాఁడవు, పురుషాణాం = మగవారికి, కూర్చ గ్రన్థి సంస్థాపనః = గడ్డపు గుచ్ఛమును (ప్రక్కల కత్తితో ఒదిగించి) చక్కదిద్దువాఁడవు. కర్తరీ వ్యాపృత హస్తః = కత్తెరతో - ముక్కులోని వెంట్రుకలు బొమలవి మీసాలవి కత్తిరించి చక్కదిద్దుటకు కత్తెరతో - పని పడుచేయి గలవాఁడవు, (అట్టి) త్వం అపి = నీవు సయితము, సేనాపతిః జాతః = సేనాపతివి ఐతివి.

మంగలివిరా నీవు - చేతి సానరాతి తునుకపై కత్తి తీడి గడ్డము గొఱుగువాఁడవు, చేత కత్తెరం గొనియు పనిచేయువాఁడవు - ముక్కు వెంట్రుకలు చేతి గోళ్ళు మొదలగునవి కత్తిరించువాఁడవు - రాజుసేనాపతివి ఐతివి!

అరేచన్దనక ... = ఓరి చందనక, నీవును బలపతివై మాన్యుఁడవై నీజాతిని మఱచితివిరా - అరే కామమ ... = ఓరి నాకు, చంద్రునివలె విశుద్ధుఁడనే, ఏమిరా నాజాతి?

(వీరకో నాట్యేన సంజ్ఞాం దదాతి)

చన్ద—అరే, కిం న్విదమ్. [అరే, కిం ణేదమ్].

వీర—అరే శృణు శృణు, [అరే సుణాహి సుణాహి],

శ్లో. జాతి స్తవ విశుద్ధా మాతా భేరీ పి తాపి తే పటహః
దుర్ముఖ కరటకభ్రాతా త్వ మపి సేనాపతి ర్జాతః. ౨౩

[జాదీ తుజ్ఝ విసుద్ధా మాదా బేరి పితా వి దే పడహో
దుమ్ముహ కరడఅభాదా తుమం పి సేణావఈ జాదో].

చన్ద—(సక్రోధమ్) అహం చన్దనక శ్చర్మకారః, త త్ప్రలోకయ ప్రవహణమ్. [అహం చన్దణఓ చమ్మారఓ, తా పలోఏహి పవహణమ్].

వీర—అరే ప్రవహణవాహక, పరివర్తయ ప్రవహణమ్. ప్రలోకయిష్యామి. [అరే పవహణవాహఆ పదివత్తావేహి పవహణమ్. పలోఇస్సమ్].

వీరకుఁడు అభినయముచే సన్న చేయుచున్నాఁడు - ఏమిటిరా ఆయభినయము? వినరా.

శ్లో. ౨౩. తవ జాతిః విశుద్ధా = నీజాతి యెంతయు శుద్ధమైనదిరా! హేళనము - మాతా = తల్లి, భేరీ = భేరి, దుందుభి; పితా అపి = నాయనయు, తే = నీకు, పటహః = తప్పెట. దుముఃఖ = తప్పుడు కూఁతలు కూయువాఁడా, కరటకభ్రాతా = కరటకమునకు - అదియు ఒక చర్మవాద్యము - అన్నవు. త్వం అపి = నీవును, సేనాపతిః జాతః = బలపతివి ఐతివి.

అహం చన్దనకః చర్మకారః - నేను చందనకుఁడను మాదిగవాఁడను! తత్ ప్రలోకయ ప్రవహణమ్ = కావున బండినిపరికింపు! - అని బెదరింపు మాటయే, పరికింపరా, నిన్ను ఏమిచేయుదునో చూతువు. - అనుట, పరివర్తయ = త్రిప్పరా (బండిని).

(చేట స్తథా కరోతి; వీరకః ప్రవహణ మారోఢు మిచ్ఛతి. చన్దనకః సహసా కేశేషు గృహీత్వా పాతయతి, పాదేన తాడయతి చ.)

వీర—(సక్రోధ ముత్థాయ) అరే, అహం త్వయా విశ్వస్తో రాజాజ్ఞప్తిం కుర్వ న్సహసా కేశేషు గృహీత్వా పాదేన తాడితః. త చ్ఛృణు రే, అధికరణమధ్యే యది తే చతురఙ్గం న కల్పయామి, తదా న భవామి వీరకః. [అరే, అహం తుప వీసత్థో రాఅణ్ణత్తిం కరేన్తో సహసా కేసేసు గేణ్హిఅ పాదేన తాడిదో. తా సుణు రే, అహిఅరణ మజ్ఝే జఇ దే చఉరఙ్గం ణ కప్పావేమి, తదో ణ హోమి వీరఓ].

చన్ద—అరే, రాజకుల మధికరణం వా వ్రజ. కిం త్వయా శునక సదృశేన. [అరే, రాఅఉలం అహిఅరణం వా వచ్చ. కిం తుప సుణఅసరిసేణ].

వీర—తథా. (ఇతి నిష్క్రాన్తః.

ఆరోఢుం ఇచ్ఛతి - ఎక్కఁగోరుచు, అనఁగా ఎక్కఁబోవును. కాలు ఎత్తి పెట్టును. ఇంతలో - సహసా కేశేషు గృహీత్వా = తటాలున బలాత్కారముగా జుట్టునం బట్టుకొని క్రిందికి ద్రొబ్బును. కాలితో తన్నును. సక్రోధం ఉత్థాయ - కోపముతో లేచి. అరే, అహం త్వయా విశ్వస్తః ... = నేను నమ్మకమైనవాఁడను, రాజునాజ్ఞ జరుపుచో, నీచే జుట్టుపట్టుకొని లాగి కాలితో తన్నఁబడితిని. కావున వినరా ఓరి, కచ్చేరినడుమ నీబలిసిన దేహమును కోయింపనేని నేను వీరకుఁడను కానురా!

అరే రాజకులం అధికరణం వా ... = రాజునింటికి పో, కచ్చేరికి పో - ఎక్కడికైనను పోరా. కిం త్వయా ... = నీతో నేమిరా, కుక్కతో సమానునితో.

చన్ద—(దిశో ఽవలోక్య) గచ్ఛ రే ప్రవహణవాహక, గచ్ఛ. యది కో ఽపి పృచ్ఛతి తదా భణ – 'చన్దనకవీరకాభ్యా మవలోకితం ప్రవహణం ప్రజతి.' ఆర్యే వసన్తసేనే, ఇదం చాభిజ్ఞానం తే దదామి. (ఇతి ఖడ్గం ప్రయచ్ఛతి).

ఆర్య—(ఖడ్గం గృహీత్వా సహర్ష మాత్మగతమ్)

శ్లో. అయే శస్త్రం మయా ప్రాప్తం స్పన్దతే దక్షిణో భుజః,
అనుకూలం చ సకలం హన్త సంరక్షితో హ్యాహమ్. ౨౮

చన్ద—ఆర్యే, [అజ్జఏ],

---

దిశః అవలోక్య – దిక్కులు – ఎవ్వరు లేకుండుటను – చూచి గచ్ఛ రే ప్రవహణవాహక ... = పోరా ఓరి బండివాఁడా. ఎవరైనను అడిగిన ట్లైన, అప్పుడు చెప్పుము – చందనకుని చేతను వీరకుని చేతను – ఇరువురి చేతను – పరికింపఁబడినదై బండి పోవుచున్నది. – అంతటివారు చూచియైనది గాన, మరెవ్వరును చూడనక్కఱలేదు – అని. అమ్మా వసంతసేనా – ఆర్యకుని తాను వసంతసేనగా వ్యవహరించినాఁడు గదా – బండివానికిని అదియే నమ్మకము. ఆయారోపణము పోనీయక అట్లే సంబోధించుచున్నాఁడు ఆర్యకుని. ఆర్యకుఁడును తెలివిగలవాఁడు – ఆయారోపణమును పాటించుచున్నాఁడు. అభిజ్ఞానం = గుర్తు – తనికీచేయఁబడినదని రాజపురుషుల – సేనాపతుల గుర్తు – ఆమాటయే విన్నాఁడుగాని బండివాఁడు, అదేమిటో, దానిం జూడలేదు, అక్కడ మఱెవ్వరును లేరు – ఆర్యకుఁడు మునుపు అనుకొన్నాఁడు – తనకు చేత ఒక ఆయుధమైనను లేదాయెనే అని. అశస్త్రశ్చ అస్మి మన్దభాగ్యః – అని. గుట్టు ఎఱిఁగి సాయపడు బంధువు చందనకుఁడు తన కత్తినే వానికి ఇచ్చినాఁడు – దానిమీఁద రాజ్యచిహ్నము – బలపతిది ఐనది ఏదేని యుండునేమో.

శ్లో. ౨౮. అయే = అహో – సంతోషముం దెలుపును. శస్త్రం మయా ప్రాప్తం = కత్తి నాచే పొందఁబడినది – నాచేతికి వచ్చినది. స్పన్దతే దక్షిణః = భుజః = కుడిబాహువు అదరుచున్నది. సకలం చ = అన్ని (సందర్భములును) అనుకూలం చ = అనుకూలముగా ఉన్నవి. హన్త – బళి. అహం సంరక్షితః హి = నేను కాపాడఁబడినవాఁడనే – ఇఁక నాకు భర్వా లేదు పో!

శ్లో. అత్ర మయా విజ్ఞప్తా ప్రత్యాయితా చన్దన మపి స్మరసి
న భణా మ్యేష లుబ్ధః స్నేహస్య రసేవ బ్రూమః. ౨౫

[ఏత్థ మఏ విణ్ణవిదా పచ్చాఇదా చన్దణం పి సుమరేసి
ణ భణామి ఏస లుద్ధో ణేహస్స రసేణ బోల్లామో].

ఆర్య—

శ్లో. చన్దన శ్చన్ద్రశీలాఢ్యో దైవా దద్య సుహృ న్మమ
చన్దనం భోః స్మరిష్యామి సిద్ధాదేశ స్తథా యది. ౨౬

---

నేను కోరకయే కత్తి ఇది నాచేతికి వచ్చినది - ఇప్పుడే నాకుడిభుజము అదరుచున్నది. అన్ని సందర్భములును అనుకూలముగా ఉన్నవి. రాజపురుషులు సోదాచూచియు నన్ను తప్పించి కాపాడినారు. అనఁగా మాచందనకుఁడే. కావున దైవముచే నే నిఁక కాపాడఁబడినట్లే.

శ్లో. ౨౫. ఆర్య - అని - వసంతసేనయపదేశమున నే చందనకుఁడు ఆర్యకు నికి చెప్పుచున్నాఁడు. - అత్ర = ఇక్కడ, మయావిజ్ఞాపితా - నాచే విన్నపము చేసికొనఁబడితిని, నేను విన్నవించుకొంటిని అనుట; ప్రత్యాయితా = నమ్మకము కలిగింపఁబడితివి - నీవిషయమై నమ్మకము కలిగించితిని - (కావున) చన్దనం అపి = (ఈ) చందనకుని సయితము, స్మరసి = జ్ఞప్తి ఉంచుకొనుము, ఏషః = ఇదినో నేను, లుబ్ధః = (ఏదేనిలాభమునకు) ఆసగొన్నవాఁడనై, న భణామి = చెప్పుటకాదు. స్నేహస్యరసేన = మైత్రియందలి - నీకైన కూరిమియందలి తీపుచే - చవిచే రుచిచే, బ్రూమః = చెప్పుచున్నాను.

నేను విన్నవించుకొంటిని, నమ్మకముగొలిపితిని - ఈచందనుని మఱవఁబోకు, నీవు రాజవయినపుడు, నాకు కలుగఁగల - నీవు ఈఁగల ధనాదిలాభమునకు ఆసపడి కాదు, నేను ఇందు ఇట్లు పనివడుట, కేవలము స్నేహమాధుర్యముచేత నే - స్నేహము వలని ప్రీతిచేత నే, నీయందలి స్నేహమువలని యవ్యాజప్రీతితో చెప్పుచున్నాను.

శ్లో. ౨౬. చన్ద్రశీలాఢ్యః చన్దనః = చంద్రుని శీలమువంటి యత్యంతాహ్లాదక శీలము గలవాఁడు, నాకు ఎంతయు చల్లనివాఁడు, దైవాత్ = (నా) భాగ్య వశమున, అద్య = (ఈ) సమయాన, మమ సుహృత్ = నాకు మిత్రమైనాఁడు,

చన్ద—

శ్లో. అభయం తవ దదాతు హరో
విష్ణు ర్బ్రహ్మా రవిశ్చ చన్ద్రశ్చ
హత్వా శత్రుపక్షం
శుమ్భ నిశుమ్భౌ యథా దేవీ. ౨౭

[అభఅం తుహ దేఉ హరో
విణ్హూ బమ్హా రవీ అ చన్దో అ
హత్తూణ సత్తువక్ఖం
సుమ్భ ణిసుమ్భే జదా దేవీ].

(చేటః ప్రవహణేన నిష్క్రాన్తః)

చన్ద—(నేపథ్యాభిముఖ మవలోక్య) అరే, నిష్క్రామతో మమ ప్రియవయస్యః శర్విలకః. పృష్ఠత ఏవానులగ్నో గతః భవతు.

---

భో: - ఓయి బాబూ, యది సిద్ధాదేశః తథా = సిద్ధాదేశము అట్లే అగునేని - ఫలించునేని, నేను రాజ నగుదునేని, చన్దనం స్మరిష్యామి = చందనుని స్మరింపఁగలను - తలఁపునకు తెచ్చుకొనఁగలను తప్పను.

నాకు భాగ్యవశమున ఇప్పుడు, ఈయెడరున, చందనుఁడు, చంద్రునిం బోలిన చల్లనివాఁడు, నాకు మిత్రము ఐనాఁడు. అట్టిదైన సిద్ధాదేశమే నెఱవేఱునేని, తప్పక చందనుని తలఁచుకొనెదను.

శ్లో. ౨౭. దేవీ = గౌరి, దుర్గ, శుమ్భ నిశుమ్భౌ హత్వా యథా = శుంభుని నిశుంభుని చంపి యెట్లో - తథా = అట్లును, తవ = నీకు, నీశత్రుపక్షమును చంపి. హరః, విష్ణుః, బ్రహ్మ, రవిః చ చన్ద్రః చ - ఈ దేవతలందఱు, అభయం దదాతు = అభయము - రక్షణ - ఒసంగుదురు గాక.

అరే - ఓరి - ఇఁక నీతో నేమిరా - అని తిరస్కారము - వీరకుం దలఁచుకొని. నిష్క్రామతః = నేను ఇంటినుండి బయటికి వచ్చునప్పుడే, మమ పృష్ఠతః = నావెనువెంటనే, అనులగ్నః = తగులుకొన్నట్లు వచ్చినాఁడు, ప్రియమిత్రము.

ప్రధానదణ్డధారకో వీరకో రాజప్రత్యయకరో విరోధితః. తదహమపి పుత్రభ్రాతృపరివృత ఏవ మే వానుగచ్ఛామి. [అరే, ణికన్తమన్తస్స మే పిఅవఅస్సో సవ్విలఓ, పిట్ఠదో జ్జేవ అణులగ్గో గదో భోదు. పధాణదణ్డధారఓ వీరఓ రాఅపచ్చఅఆరో విరోహిదో. తా జావ అహం పి పుత్తభాదుపడివుదో ఏదం జ్జేవ అణుగచ్ఛామి].

[ఇతి నిష్క్రాన్తాః సర్వే]

ఇతి ప్రవహణవిపర్యయో నామ

షష్ఠో ఽఙ్కః

శర్విలకుఁడు. మఱి, క్వాపి యాతః = ఎక్కడికో పోయినాఁడు. (వాఁడే అట్లే పోయి ఆర్యకుని కారాగారమునుండి తప్పించినాఁడు - పై ప్రయత్నములలో నుండును), ఎక్కడికి పోయినాఁడో. సరి, అది యుండనీ. ప్రధాన దణ్డధారకః = ప్రధానసేనాపతి. వీరకుఁడు - వీరకుఁడు సేనాపతి అని ముందే నిర్దిష్టుఁడు. (ఈ చందనకుఁడును.) మఱి వాఁడు ప్రధానతరుఁడు - దండ మనఁగా సేన. సేనాపతిని సాధారణముగా దండధరుఁడు అనకున్నను - దండించు నియోగి కాఁదగినను, ఆ పూర్వపు 'సేనాపతి' అన్నమాటం బట్టి ఇక్కడ ఇట్లు చెప్పట. రాజ ప్రత్యయ కారః - రాజునకు నమ్మకము కలిగించువాఁడు - ఇతని మాటలందు రాజునకు చాల నమ్మకము. మఱి యట్టివాఁడు - విరోధితః = శత్రువుగా చేసికొనం బడినాఁడు. కావున నేనును (= అహ మపి యావత్), పుత్రభ్రాతృ పరివృతః = కొడుకులను తోఁబుట్టువులను కూర్చుకొని, ఏతం = వీనినే శర్విలకునే, కాదా ఆర్యకునే, అనుగచ్ఛామి = అనుసరింతును.

ఇందు 'మృచ్ఛకటి'లో రోహసేనునికై వసంతసేన నగలు నింపి పంపువఱకు నుండు కథాభాగము చాల గంభీరార్థముగలది. శాకుంతలప్రాంకమున ఆనుషంగికముగా శకుంతలాదుష్యంత గాంధర్వము (III) జరిగిన రాత్రి మొదలు ఇష్టి ముగిసి దుష్యంతుఁడు శకుంతలను వీడ్కొనువఱకు వారు ఎట్లు కాలముపుచ్చిరో ఆసంభోగ శృంగారచరితము సూచింపఁబడినది, అట్లే యిందును ఆయొక్క రాత్రియేయైనను, వసంతసేన మును పు 'మన్దభాగినీ ఖల్వహం త వాభ్యన్తరస్య' అని తలఁపోసికొని గుటకలుమ్రింగినట్టిది రాత్రి చారుదత్తయ్యకౌఁగిటిలో లోపల ప్రవేశపెట్టఁబడినది.

(అతఁడును ఆవధ్యమార్గములో (X - 13)

'శశివిమలమయూఖ శుభ్రదన్తి
సురుచిరవిద్రుమ సన్నిభాధరోష్ఠి
తవ వదనభవామృతం నిపీయ
కథమవశో హ్యాయశోవిషం పిబామి?' అని

దుష్యంతుఁడు VI 20 లో

'పీతం మయా సదయమేవ రతోత్సవేషు బిమ్బాధరం - (చూ. బ. వ.)

(కొన్నాళ్లు - అనుట)

అని యన్నట్లె తలపోసికొని తనయు వసంతసేనయు ఆరాత్రి వృత్తమునే సూచించినాఁడు. మఱి అది యిటలేదు. అది యిక్కడి యంతటికిని వ్యాఖ్యాం బోలె యగును.]

అట్లు చతుఃశాలాభ్యంతరము చొచ్చి అక్కడ చేటులు మొదలగు ఎల్లవారితోను ఎట్లెట్లు గడపినదో సూచింపఁబడినవి. ఇపుడు అట్లు ప్రదోషమున వచ్చిన మఱి రాత్రి భోజనాదికమో? ఇపుడు తొలిపనిగా ధూతమ్మకు రత్నావళిని, ఆమె యేమియు అనదులే అనియు, చారుదత్తయ్యయు ఏమియు అనఁడులే అనియు, ఆమెకు ఇచ్చిరమ్మని పంపినది. ఆమెయు ప్రతిస్నేహసమ్మానముగా అది వసంతకే ఉండనిమ్మని తాను తీసికొనలేదు గాక. దీనిచే రాణింబోని వసంతసేన తాను గుణనిర్జితదాసి యనుచునే ఎట్టి చెల్లెలియక్కలస్నేహము నెఱపినదో, చనువు పొందినదో ఊహకు అందుచున్నది. ఇది తప్ప వారికి మఱి సమాగమము లేదు, నాటకసంహారమునం దప్ప. దశమాంకమున చారుదత్తునితోడ.

'సమాశ్వసితు అర్యః, తత్ర గత్వా జీవయతు ఆర్యామ్. అన్యథా అనర్థః సంభావ్యతే' అనియు,

ధూతా వసంతసేనలు.

'(వసన్తసేనాం దృష్ట్వా) దిష్ట్యా కుశలినీ భగినీ!
వసన్తసే - అధునా కుశలినీ సంవృత్తాస్మి

అని యొండొరులం బరామర్శించుకొనుటయు సూచించు చనువు ఈరాత్రి సమాగమమున కుదిరినదే.

రాత్రియగుటచే, పెందలకడ నిద్రపోవు ఒక్క రోహసేనుం గలసికొనలేదు. వానిం జూచుకొనుచు వానితో ఎక్కడనో ఉన్న రదనికనుంగూడ కలసికొన

లేదేమో. అది యిపుడు తటినీ నమస్కరించి స్వాగతము పొందుచున్నది. ఈయుప చారప్రకారమును గుర్తింపదగినదే, సువర్ణశకటిక ప్రస్తావముచే ఆయింటిదారిద్ర్యము నకు బాలుఁడును దానిం దలంపించుటకు, వసంతసేనకు ఎంతయో జాలి తోఁచినది. మఱి వాఁడు తన యమ్మకు గుఱుతే నగలులేమి అని బుచ్చినోట ముద్దుగా పలికి నందులకు, వసంతసేనకు దుఃఖము పొరలినది, అట్లు ఒక్క రాత్రి సమాగమమున నే అన్నివిధాల ఆయింటి స్వజనమువోలె ఐపోయినది. ఆయింటియిల్లాలివలె ఐపోయి నది. అభినయము గాదు, హార్దము. 'స్నేహాశ్చ నిమిత్తసవ్యపేక్షు ఇతి విప్రతిషిద్ధ మేతత్. తథాహి - వ్యతిషజతి పదార్థా నాన్తరః కోపి హేతుః' అను భవభూతి యుపన్యసించిన స్నేహమీమాంస స్మరణకు రాకమానదు.

అంతట వర్ధమానకుఁడు బండి తెచ్చి వసంతసేనకు తెలిపినాఁడు. వసంతసేన తాను సొగసుచేసికొని వచ్చువఱకు తాళుమని యన్నది. వాఁడు బండిలో తివాసి మఱచివచ్చినవాఁడు, దానిని వేగ కొనివచ్చెదనని పోయినాఁడు. వసంతసేన సొగసు చేసికొనుట ముగియునప్పటికి శకారునిబండి, పుష్పకరండకమునకు పోవునదే ఏదో అడ్డముతగిలినందున ఆచారుదత్తయ్య దిడ్డివాకిటనే నిలిచినది. ఆబండిరాక మ్రోత విని వసంతసేన వచ్చి తెలియక పొరపాటున అది తనకోసమైన వర్ధమానకు బండియే యని తలఁచి ఎక్కి కూర్చుండి తలుపుమూసికొన్నది. అడ్డము తొలఁగఁ గానే బండివాఁడు వచ్చి దానిని కదలించి తోలుకొనిపోయినాఁడు. ఇంతలో ఆగొల్ల ఆర్యకుఁడు కారాగారమునుండి తప్పించుకొని నక్కినక్కి వచ్చుచున్న వాఁడు వాకిలి తెఱచియున్న చారుదత్తయ్య బంగళాలో చొచ్చి తల దాఁచుకొని ఆదిడ్డివాకటికడకే వచ్చినాఁడు. ఆసమయమునకే చారుదత్తునిబండిని, వసంతసేన కైనదానిని, వర్ధమానకుఁడు మరల తోలుకొని వచ్చినవాఁడు, అక్కడ నిలిపి ఎద్దుల పరాకున ఉండఁగా అం దెక్కినాఁడు ఆర్యకుఁడు. సరి వసంతసేన యెక్కియైన దని వర్ధమానకుఁడు బండి కదలించి తోలుకొని పోఁగడంగినాఁడు. ఇట్లు రెండు బండ్లును పొరపాటున నెక్కిన మానుసులతో పుష్పకరండమునకు సాగి పోఁజొచ్చినవి. ఇతి - ముగిసినది ఆఱవయంకము, ప్రవహణ విపర్యయ - (అనునది), బండ్ల మాఱుపాటు - ఒకరిది మఱి యొకరిది అగుట.

బండ్ల మాఱుపాటు అను

ఆఱవ యంకము

ముగిసినది

# సప్తమోఽఙ్కః



(తతః ప్రవిశతి చారుదత్తో విదూషకశ్చ)

విదూ—భోః, పశ్య పశ్య, పుష్పకరణ్డక జీర్ణోద్యానస్య సశ్రీకతామ్. [భో, పేక్ఖ పేక్ఖ, పుప్ఫకరణ్డఅ జిణ్ణుజ్జాణస్స సస్సిరీఅదామ్].

చారు—వయస్య, ఏవ మేతత్. తథా హి,

శ్లో. వణిజ ఇవ భాన్తి తరవః పణ్యా నీవ స్థితాని కుసుమాని
శుల్క మివ సాధయన్తో మధుకరపురుషాః ప్రవిచరన్తి. ౧

---

తతః ప్రవిశతి చారుదత్తః ... = అంతట చారుదత్తుఁడును విదూషకుఁడును ప్రవేశించుచున్నారు.

పుష్పకరణ్డక జీర్ణోద్యానస్య - పూలబరణి అని చెప్పఁదగినట్లు అన్ని పూలచెట్లు కలిగి వాని పూఁతచే ఎంతయు సొబగారునదే ఐనను, తోఁట చాల ముసలిది - చాలకాలపుఁ జెట్లుకలది యై - జీర్ణ (= ముసలి) తోఁట అనియు పేరుపడినది. సశ్రీకతాం = అందముకలిగియుండుటను - అందమును - అనుటయే. ఏవం ఏతత్ - అట్లే ఇది - నీవు చెప్పినట్లు కాంతి అందము కలదిగానే ఉన్నది.

శ్లో, ౧. తరవః = చెట్లు, వణిజ ఇవ = సెట్లవలె, భాన్తి = ఒప్పారుచున్నవి. కుసుమాని = పూలు, పణ్యాని ఇవ = (అంగళ్ళ) సరకులవలె, స్థితాని = ఉన్నవి. శుల్కం = సుంకమును - అంగడివారు సరకారునకు కట్టవలసినది - సాధయన్త ఇవ = వసూలుచేయుచున్నవారుం బోలె, మధుకరపురుషాః = తుమ్మెదలు అను నౌకరులు, ప్రవిచరన్తి = తిరుగుచున్నారు. తుమ్మెదలన్నియు ఒక్క వేషమున నుండును - శుల్కమువసూలుచేయు ఉద్యోగస్తులు సర్కారువారు ఇచ్చు ఒక్కటే విధమైన ఉడుపులు ధరింతురు కదా "Uniform" 'డ్యూటి'లో ఉండగా, అట్లున్నవి ఆ తుమ్మెదలు (వే. వేం.).

విదూ—భోః, ఇద మసంస్కారరమణీయం శిలాతల? ముప విశతు భవాన్. [భో, ఇమం అసక్కారరమణీఅం సిలాఅలం ఉవ విసదు భవమ్].

చారు—(ఉపవిశ్య) వయస్య, చిరయతి వర్ధమానకః.

విదూ—భణితో మయా వర్ధమానకః—'వసన్తసేనాం గృహీత్వా లఘు లఘ్వాగచ్ఛ' ఇతి. [భణిదో మఏ వడ్ఢమాణఅ—'వసన్తసేణిఅం గేణ్హిఅ లహుం లహుం ఆఅచ్ఛ' త్తి].

చారు—తత్కిం చిరయతి?

శ్లో. కిం యాత్యస్య పురః శనైః ప్రవహణం
తస్యాన్తరం మార్గతే?
భగ్నే౽క్షే పరివర్తనం ప్రకురుతే?
ఛిన్నో౽థవా ప్రగ్రహః?

మధుకరమనఁగా—మధువుం గూర్చునది—పూలచెట్లసెట్లు ఈఁగల సుంకము—ఆమకరంద బిందువులె. ప్రవిచరన్తి—ప్ర+వి—నిముసము ఆఁగక గడప గడప ఎక్కి దిగుచున్నవి. చారుదత్తుఁడు బ్రాహ్మణుఁడయ్యు గొప్ప వర్తకుఁడుగా నున్నందున ఈవణిజకులు సాధక వృత్తము ఈదినము అపాతముగా ఉపస్థితమైనది కాఁబోలు. ఇదం అసంస్కార రమణీయం శిలాతలం = ఈరాతిపలక ఏమియు (అందముకలిగించి) దానిని చెడనీకయుంచు పని చేయకున్నను, (తనంతట నే) అందముగా ఉన్నది. ఉపవిశతు భవాన్ = నీవు కూర్చుండుము—చిరయతి = జాగు—ఆలస్యము—చేయుచున్నాఁడే...లఘుఆగచ్ఛ ... = త్వరగా రారా—అని చెప్పితిని. తత్ కిం చిరయతి—మఱి యేల జాగుసేయుచున్నాఁడు?

శ్లో. అ. అస్య పురః = వానికి ముందు, (ఏదైనను ఒక) ప్రవహణం = బండి, శనైః = మెల్లగా, యాస్యతి కిం = పోవుచున్నదా? తస్య అన్తరం=దానికి సందు—ప్రక్కన పోవు అవకాశము, మార్గతే = వెదుకుచున్నాఁడా? అక్షే భగ్నే = ఇరుసువిరుగఁగా, పరివర్తనం = మార్పు—క్రొత్తయిరుసు వేయుటో

కర్మాన్తో జ్ఝిత దారువారితగతి
ర్మార్గాన్తరం యాచతే?
స్వైరం ప్రేరితగోయుగః కి మథవా
స్వచ్ఛన్ద మాగచ్ఛతి? ౨

(ప్రవిశ్య గుప్తార్యక ప్రవహణస్థః)

చేటః—యాతం గావో, యాతమ్. [జాధ గోణా, జాధ].

---

మఱి యెట్లో - ప్రకురుతే = చేయుచున్నాఁడా? అథవా = అట్లునుం గాకున్న, ప్రగ్రహాః ఛిన్నాః వా = పగ్గము తెగినదా? కర్మాన్త = (కొయ్య - దూలమో మఱి యేదో దాని) పని నడుమ, (ముగియనందున) ఉజ్ఝిత దారువారితగతిః = (అవతలికి దారి కడ్డము లేకుండునట్లు కొనిపోక అక్కడనే) విడువఁబడిన కొయ్యచే గమనము అడ్డగింపఁబడఁగా, మార్గాన్తరం = వేఱు మార్గము, యాచతే = కోరుచున్నాఁడా? అథవా = అట్లునుం గాదేని, స్వైరం ప్రేరిత గోయుగః = మెల్లఁగా వాని యిచ్ఛమెయి - తఱుమక - తోలఁబడిన యెడ్లజతకలవాఁడై, స్వచ్ఛన్దం ఆగచ్ఛతి కిం = తనయిచ్ఛమెయి చాల మెల్లగా వచ్చుచున్నాఁడా?

ఏమి యగును ఈయాలస్యమునకు కారణము? తనకు ముందు రస్తామీఁద మఱియొక బండి మెల్లఁగా తనకు అడ్డముగా పోవుచున్నందున దానిని తప్పించుకొని ముందునకు రాలేక పోయినాఁడా? దారిలో ఇరుసు విఱిగి దానిని మార్పించుకొననో కాయించుకొననో వలసివచ్చినదా? పగ్గము తెగినదా? దారిలో అడ్డముగా సగముపనితో విడిచిపోయిన దూలమో మఱేదైనను బరువుకొయ్యలో అడ్డముతగిలినవా? లేక ఎడ్లను మెల్లఁగా తోలుచు తన యిచ్ఛమెయి, నేను 'లఘు లఘు' అన్నానే - ఆమాటలను సరకుసేయక వచ్చుచున్నాఁడా?

గుప్త ఆర్యక ప్రవహణస్థః - రహస్యముగా (చందనునిచే కాపాడఁబడిన ఆర్యకుఁడు (తన) బండిలోనున్నవాఁడుగా, చేటుఁడు వర్ధమానకుఁడు ప్రవేశించుచున్నాఁడు. వానికి ఇప్పటికిని తన బండిలో వసంతసేన లేదనియు ఆర్యకుఁడు ఉన్నాఁడనియు తెలియదు. వసంతసేనయే యున్నదని తలంచియున్నాఁడు. మైత్రేయ చారుదత్తులకు ఏసందేహము లేదుగదా - వారును వసంతసేనయే కొనిరాఁబడినది అని యనుకొనుచున్నారు.

ఆర్యక—(స్వగతమ్)

శ్లో. నరపతిపురుషాణాం దర్శనా ద్భీతభీతః
సనిగడ చరణత్వా త్సావ శేషాపసారః
అవిదిత మధిరూఢో యామి సాధో స్తు యానే
పరభృత ఇవ నీడే రక్షితో వాయసీభిః. 3

అహో, నగరా త్సుదూర మపక్రాన్తో ఽస్మి. త త్కి మస్మా త్ప్రవహణా దవతీర్య వృక్షవాటికా గహనం ప్రవిశామి. ఉ తాహో

శ్లో. 3. నరపతి పురుషాణాం = రాజపురుషుల - రాజునౌకరులయిన పోలీసువారికి, దర్శనాత్ = అగపాటువలని - కంటఁబడుదునో అని - భీతభీతః = ఎంతయు భయపడినవాఁడనై, స + నిగడచరణత్వాత్ = సంకెలతో కూడుకొన్న పాదము గలవాఁడ నగుటవలన, సావశేష అపసారః = (ఖైదునుండి) తప్పించు కొనుట సగము మిగిలియున్నవాఁడనై, ఖైదు గుర్తు సంకెల తీఱపోక నా కాలిలో సగము మిగిలియే యున్నవాఁడనై, తు = మఱి, సాధోః = పరార్థపరాయణుఁ డైన ఆసాధువు - చారుదత్తునియొక్క, యానే = బండిలో, అవిదితం = రహస్య ముగా, ఎవరికి తెలియకుండ, నీడే = గూటిలో, రక్షితః = కాపాడఁబడిన, పర భృత ఇవ = కోయిలగండువలె, యామి = పోవుచున్నాను.

అక్కడ వీరకచందనకులచేత పడి తప్పించుకొన్నవాఁడనైనను, మరల దారిలో ఏపోలీసువాఁడు చూచి ఏమిసేయునో అని దిగులుకలిగియే యున్నది. ఒక కాలిలో సంకెల ఊడక ఆట్లేయున్నందున, వీఁడెవరో తప్పించుకొని పరారియైన వాఁడురా అని పట్టువడు గుర్తు అంటుకొనియే యున్నది. చూచిన వారికి దొరకిపోవుదును. పాపము - ఈ సాధువుబండి దైవికముగా దొరకినందున ఎవరికి తెలియకుండ అందు ఎక్కి కూర్చుంటిని. కావలచే తమ గూటిలో కాపాడఁబడు చున్న గండుకోయిలలాగు ఉన్నాను.

ఆహో - ఫర్వాలేదు - నగరాత్ సుదూరం అపక్రాన్తః అస్మి = నగరము నకు చాలదూరము దాఁటి వచ్చితిని. తత్ = కావున, అస్మాత్ ప్రవహణాత్ ... = ఈబండెనుండి దిగి తోఁటజీబుతోనికి దూఱుదునా? ఉ తాహో = లేక, ప్రవహణ

ప్రవహణస్వామినం పశ్యామి. అథవా కృతం వృక్షవాటికా గహనేన అభ్యుపపన్న వత్సలః ఖలు తత్రభవా నార్యచారుదత్తః శ్రూయతే. తత్ప్రత్యక్షీకృత్య గచ్ఛామి.

శ్లో. స తావ దస్మా ద్వ్యసనార్ణవోత్థితం
నిరీక్ష్య సాధుః సముపైతి నిర్వృతిమ్
శరీర మేత ద్గత మీదృశీం దశాం
ధృతం మయా తస్య మహాత్మనో గుణైః. ౮

---

స్వామినం పశ్యామి = బండిసొంతగానిని చూతును? దైవికముగానైనను వాని బండి దొరకుటచే. (వాని పేరు గొప్పచే కాపాడఁబడుట) వాని సాయము దొరకుటయే కదా ఐనది. కావున ఆ కృతజ్ఞతతో ఆయనం జూతునా? అథవా = ఎందులకు ఆలోచన - కృతంవృక్ష... నేన = తోఁటజీబు వలదు. అభ్యుపపన్నవత్సలః = తనరక్షణంగోరి యాశ్రయించిన వారియెడ ఎంతయు వాత్సల్యము - తల్లికి బిడ్డయందుగల దయప్రీతులవంటిదయప్రీతులు గలవాఁడు గదా - ఆపూజ్యుఁడు (= తత్రభవాన్), చారుదత్తయ్య - తత్ = కావున, ప్రత్యక్షీకృత్య = ఎదురుగ నగపడి, చూచిదర్శనము చేసికొని మఱి - గచ్ఛామి = పోయెదను.

శ్లో. ౮. అస్మాత్ వ్యసనాత్ = (నిష్కారణముగా చెఱుపఁబడిన) యీ దుఃఖమునుండి, నవఉత్థితం = క్రొత్తగా తప్పించుకొని లేచినవానిని - నన్ను, ససాధుః తావత్ నిరీక్ష్య = ఆయన గన చూచి - ఆసజ్జనము గన చూచి, నివృతిం = ఎంతయో సంతోషమును - ఊఱటను, సముపైతి = పొందఁగలఁడు. ఈదృశీం దశాం = ఇట్టి దశను, గతం = పొందిన, ఏతత్ శరీరం = ఈ దేహము, తస్య మహాత్మనః గుణైః = ఆదొడ్డవాని (సద్) గుణములచేత, మయా ధృతం = (నాకు) బ్రదికినది.

'గణికప్రవహణం బహిర్యానం' భోగముదానిది బండి, బయటికి పోవునది - అని అక్కడి మాటలం బట్టి ఊహించి యెక్కితిని. మఱి చందనకుని విచారణలో అది చారుదత్తునిదనియు వసంతసేనను ఎక్కించుకొనవలసినదనియు, ఆస్థానమున నేను ఉన్నవాఁడనైతిననియు అక్కడ తెలియవచ్చినది. (వసంతసేన పేరును), ఆయనపేరును విని, వారి గొప్పను తలంచుకొని, నన్ను కాపాడినాఁడు చంద

చేటః—ఇదం త దుద్యానమ్. యావ దుపసర్పామి. (ఉప సృత్య) ఆర్యమైత్రేయ. [ఇమం తం ఉజ్జాణమ్. జావ ఉవసప్పామి. అజ్జ మిత్తేఅ].

విదూ—భోః, ప్రియం తే నివేదయామి. వర్ధమానకో మన్త్రయతి. ఆగతయా వసన్తసేనయా భవితవ్యమ్. [భో, పిఅం దే ణివేదేమి. వడ్ఢమాణఓ మన్తేది. ఆగదాఏ వసన్తసేణాఏ హోదవ్వమ్].

చారు—ప్రియం, నః ప్రియమ్.

విదూ—దాస్యాఃపుత్ర, కిం చిరాయితో ఽసి? [దాసీఏ పుత్తా, కిం చిరఇదో సి].

చేటః—ఆర్య మైత్రేయ, మా కుప్య, యానాస్తరణం విస్మృత మితి కృత్వా గతాగతిం కుర్వం శ్చిరాయితో ఽస్మి. [అజ్జ మిత్తేఅ, మా కుప్ప, జాణత్థలకే విసుమలిదే త్తి కదుఅ గదాగదిం కలేన్తే చిలఇదో మ్హి].

---

వడుఁడు, ఆ పేరు చెప్పిరయే వీరకుని త్రోసి కాలితో తన్ని తఱిమినాఁడు. అట్లుకాక అట పట్టుకొనబడియేయున్న, ఇఁక నేమున్నది, ఇప్పటికి చంపివేయఁబడియుందును గదా. చారుదత్తుని పేరు నిజముగా నున్న బ్రదికించినది,

ఇదం తత్ ఉద్యానం - ఇది ఆతోఁట, (పుష్పకరండకము అనఁబడునది.)

వర్ధమానకః మన్త్రయతే = వర్ధమానకుఁడు మాటాడుచున్నాఁడు - కావున వసంతసేన వచ్చియుండవలయును_అదే నీకు ప్రియము ఎఱింగించుచున్నాను. ప్రియం నః... సంతోషము, నాకు సంతోషము, దాస్యాఃపుత్ర = లంజాకొడుకా - తిట్టు - ఐనను చనవుగలనౌకరు వర్ధమానకుఁడు పడి సమాధానము చెప్పకొనఁ గలఁడు - అది సామాన్యమైన తిట్టే.

యానాస్తరణం విస్మృతం ఇతి ... = బండిలోవాని మఱవఁబడినదని దాని కొఱకయిన రాకపోకలచే ఇంచుక ఆలస్యమైనది, పరివర్తయ - త్రిప్పరా -

చారు—వర్ధమానక, పరివర్తయ ప్రవహణమ్. సఖే మైత్రేయ, అవతారయ వసన్తసేనామ్.

విదూ—కిం నిగడేన బద్ధా వస్యాః పాదౌ, యేన స్వయం నావతరతి? (ఉత్థాయ ప్రవహణ ముద్ఘాట్య) భోః, న వసన్తసేనా, వసన్తసేనః ఖ ల్వేషః. [కిం ణిఅడేణ బద్ధా సే గోడ్డా, జేణ సఅం ణ ఓదరేది. భో, ణ వసన్తసేణా, వసన్తసేణో క్ఖు ఏసో].

చారు—వయస్య, అలం పరిహాసేన, న కాల మపేక్షతే స్నేహః. అథవా స్వయ మే వావతారయామి. (ఇ త్యుత్తిష్ఠతి.

ఆర్య—(దృష్ట్వా) అయే, అయ మేవ ప్రవహణస్వామీ: న కేవలం శ్రుతిరమణీయః దృష్టిరమణీయో ఽపి. హన్త, రక్షితో ఽస్మి.

చారు—(ప్రవహణ మధిరుహ్య దృష్ట్వా చ) అయే తత్కో ఽయమ్!

---

అవతారయ ... = వసంతసేనను దింపు. కిం నిగడేన ... = ఏమి సంకెలతో కట్టఁబడియున్నదా ఆమె పాదాలు. దాన సొంతముగా దిగఁజాలదా? (దింపు మనెద వేల?) అనుచు లేచి బండితెఱచి - వెనుక మూఁత యున్నది - దానిని తొలఁగించి, ఓయి, కాదు వసంతసేన - మఱెవఁడో వసంతసేనుఁడు గదా వీఁడు. అలం పరిహాసేన = మాను ఎగతాళి. న కాలం అపేక్షతే స్నేహః - అనురాగము కాలమును - విలంబమును - కోరదయ్యా - ఓర్వఁడు - అనుట. అథవా- నీవు వలదులే - స్వయం ఏవ ... = నేనే సొంతముగా దింపెదను.

ఆర్యకుఁడు చారుదత్తుం జూచి - అయే = అహో - సంతోషము, న కేవలం శ్రుతిరమణీయః = (గుణములచే) వినికికి మాత్రము రమణీయుఁడు (=ప్రియుఁడు) కాఁడు - దృష్టి ... = చూపునకును రమణీయుఁడు, ఎంత అందగాఁడయ్యా! - అని అనుకొనుట. అయే - ఆశ్చర్యముగా నున్నది - తత్ కః అయమ్ = మతి యితఁ డెవరు?

శ్లో. కరికరసమబాహుః, సింహపీనోన్నతాంసః,
పృథుతరసమవక్షా, స్తామ్రలోలాయతాక్షః.
కథ మిద మసమానం ప్రాప్త ఏవం విధో యో
వహతి నిగడ మేకం పాదలగ్నం మహాత్మా. ౫

---

శ్లో. ౫, ఆర్యకుఁడు గొల్లవాఁడైనను రాజు కావలసినవాఁడు _ ఆ లక్షణా లన్నియు ఉన్నవి _ ఊరక చూచినమాత్రమున చారుదత్తుఁడు వర్ణించుచున్నాఁడు _ పరికింపఁదగును. కరికరసమబాహుః _ భుజములు _ ఏనుఁగుతొండమువలె _ పీవరమాంసలమసృణముగా _ ఆజానువులుగా _ ఉన్నవి (అనుట). అట్టివి కలిగియున్నాఁడు. సింహ పీన ఉన్నత అంసః = మూపులు _ సింహమునకుం బోలె _ కండ గలిగి ఎత్తుగా ఉన్నవి _ అట్టి మూపులు గలిగియున్నాఁడు. పృథుతర సమ వక్షాః = ఉరము _ విశాలముగా (ఎగుడుదిగుడులేక) ఏకరీతిగా ఉద్దామముగా ఉన్నది. తామ్ర లోల ఆయతాక్షః = ఎఱ్ఱగా, కన్నులలో ఎఱుపు _ మహాపురుషలక్షణములలో చేరినది _ ఉ. రా. చ. లవకుశులకన్నులలో జనక రాములు _ ఎఱ్ఱనను _ ఎఱ్ఱచారలను పరికించినారు _ 'నేత్రే పునర్వ్యద్యపి రక్తనీలే _' అని _ భయము గలదు గదా దాన) తరళముగాను విశాలముగాను ఉన్నవి కన్నులు _ అట్టికన్నులు కలిగియున్నాఁడు _ (ఎవఁడగును వీఁడు?) యః = (ఎవఁడో _ అనఁగా వీఁడు, ఏవం విధః = ఇట్టి మహాపురుషలక్షణములు గలిగినవాఁడయ్యు, మహాత్మా = మహాత్ముఁడు _ మహాప్రభావముగలవాఁడు, ఇదం = ఇదిగో ఈ, అసమానం = తగని _ ఈమాహాత్మ్యమునకు అనురూపముగాని, పాదలగ్నం = పాదమునం దగుల్కొనియున్న, ఏకం నిగడం = ఒకసంకెల, వహతి = మోచుచున్నాఁడు. అట్టి ఇతఁడు, కథం ప్రాప్తః = ఎట్లు దొరకినాఁడు, ఇందులోనికి ఎట్లు వచ్చినాఁడు!

ఎవ రితఁడు! కథం ప్రాప్తః = ఎట్లు ఇందులోనికి వచ్చినాఁడు! బాహువులు _ మూపులు _ వక్షస్సు _ అన్నియు గొప్ప సమ్రాట్టు లక్షణములు కలవిగా ఉన్నవి. మఱి ఏలొకో _ కన్నులలో సాధారణముగా మగవానికిం దగనిది, లౌల్యము ఉన్నది _ అది స్త్రీకి సహజమును, పురుషునికి భయకార్యమును. అట్టి వీనికి ఇంచుకయు తగనట్లు ఒంటి కాలికి సంకెల తగులుకొని యున్నది!

తతః కో భవాన్.

ఆర్య—శరణాగతో గోపాలప్రకృతి రార్యకో ఽస్మి.

చారు—కిం ఘోషా దానీయ యో ఽసౌ రాజ్ఞా పాలకేన బద్ధః?

ఆర్య—అథ కిమ్.

చారు—

శ్లో. విధి నై వోపనీత స్త్వం చక్షుర్విషయ మాగతః
అపి ప్రాణా నహం జహ్యాం, న తు త్వాం శరణాగతమ్. ౬

(ఆర్యకో హర్షం నాటయతి)

చారు—వర్ధమానక, చరణా న్నిగడ మపనయ

తతః కః భవాన్ - కావున అడిగెదను - ఎవరు నీవు? శరణాగతః - (నేను) శరణాగతుఁడను - అది నన్నుం గూర్చిన తొలుతనే నీతో చెప్పవలసినమాట - గొల్లపుట్టువను. పుట్టువుం జెప్పుట వినయమునను-ఎదుటివానియందలి గౌరవమునను. ఆర్యకుఁడను. కిం ఘోషాత్ ఆనీయ ... = ఏమి, గొల్లపల్లెనుండి తెచ్చిపాలక రాజు చేత చెఱం బెట్టఁబడినాఁడే అల్లవాఁడు - వాఁడవా నీవు?

శ్లో. ౬. త్వం = నీవు, విధినా ఏవ = విధిచేతనే, ఉపనీతః = నాకడకు కొనిరాఁబడి, చక్షుర్విషయం = కంటికి అగపడువాఁడ వగుటను, ఆగతః = పొందితివి. అపి ప్రాణాన్ = (నా) ప్రాణములైనను, తెనుఁగున ఏకవ., సంస్కృతమున బహువ. జహ్యాం = విడుతును, తు = కాని, శరణాగతం త్వాం న (జహ్యాం) = శరణాగతుని నిన్ను విడువను.

చరణాత్ నిగడం అపనయ - పాదమునుండి సంకెలను ఊడఁదీసివేయుము. ఆర్య అపనీతాని నిగడాని - సంకెళ్ళు తీసివేయఁబడినవి. దాననే మఱి వేఱువి - సంకెలలే - ఈఁబడినవి, తగిలింపఁబడినవి - అంతకంటెను -

చేటః—యదార్య ఆజ్ఞాపయతి. (తథా కృత్వా) ఆర్య! అపనీతాని నిగడాని. [జం అజ్జో ఆణవేది. అజ్జ అవణీదాఇం ణిగళాఇం].

ఆర్య—స్నేహమయాన్యన్యాని దృఢతరాణి దత్తాని.

విదూ—సంగచ్ఛస్వ నిగడాని. ఏషో౽పి ముక్తః. సాంప్రతం వయం వ్రజిష్యామః. [సంగచ్ఛేహి ణిఅడాఇం, ఏసో వి ముక్కో. సంపదం అహ్మే వచ్చిస్సామో?]

చారు—ధిక్ శాన్తమ్.

ఆర్య—సఖే చారుదత్త, అహమపి ప్రణయేనేదం ప్రవహణమారూఢః. తత్క్షన్తవ్యమ్.

దృఢతరాణి = గట్టియైనవి - (ఏలయన, ఇవి) స్నేహమయాని - స్నేహపువి. ఆమాటంగొని మైత్రేయుఁడు చారుదత్తునికిం జెప్పుచున్నాఁడు'- సంగచ్ఛస్వ నిగడాని = తగిలించుకో సంకెలలను. స్నేహపుసంకెలలు - పరస్పరమైనవి స్నేహితులకు - వాఁడు తగిలించుకొన్నాఁడు నిన్నుంగూర్చి - నీవును తగిలించుకో - వాని తోడి స్నేహమునకైనవి. ఇనుపసంకెలలు పగచే చేతితో తగిలింపఁబడునవి - పగులఁగొట్టవచ్చునవి స్నేహపు సంకెలలో మనసున మనసుతో తగిలింపఁబడునవి - సులువుగా తివిచివైవరానివి.

మఱియు రాజనిగ్రహపాత్రుని సంకెలలు నీవు ఊడ్చితివి. కావున నీవు రాజనిగ్రహమునకు పాల్పడితివి - ఈసంగతి రాజునకుం దెలిసిన అతఁడు నీవు ఊడ్చిన వాని సంకెలలను నీకు తగిలించును. కాదా - మనకు తగిలించును. అది మైత్రేయుని యభిప్రాయము - సాంప్రతం వయం వ్రజిష్యామః = ఇప్పటికి మనము పోవుదము - అని మైత్రేయుని భావము.

'వ్రజ' ధాతువు సకలగత్యర్థములుగలది. అది చారుదత్తునికి 'ఇప్పుడు మనము పొందుదుము' - సంకెళ్ళను - అని శేషముగా - అర్థముకాఁగా - అది అశ్లీలమని - ధిక్ - ఛీ - ఇసీ ఏమి మాట అది అనుట. శాన్తమ్' - అడంగును గాక అయశ్లీలము, అని యనుచున్నాఁడు. అహం అపి = నేనును - నేను అన్ననో, ప్రణయేన = నమ్మకముచేత - విస్రంభముచేత - ఇందైన మన కంతగా అపాయము

చారు—అలంకృతో ఽస్మి స్వయంగ్రాహప్రణయేన భవతా.

ఆర్య—అభ్యనుజ్ఞాతో భవతా గన్తుమిచ్ఛామి.

చారు—గమ్యతామ్.

ఆర్య—భవతు, అవతరామి.

చారు—సఖే, నావతరితవ్యమ్. ప్రత్యగ్రాపనీతసంయమనస్య భవతో ఽలఘుసంచారా గతిః. సులభపురుషసంచారే ఽస్మిన్ప్రదేశే ప్రవహణం విశ్వాసముత్పాదయతి. తత్ప్రవహణేనైవ గమ్యతామ్.

ఆర్య—యథాహ భవాన్.

చారు—

శ్లో. క్షేమేణ వ్రజ బాన్ధవాన్,

ఆర్య— ననుమయా లబ్ధో భవాన్బాన్ధవః

ఉండదని - తత్ కు న్తవ్యం = 'అది' యన్నింపవలసినది - 'కావున' మన్నింపవలసినది, స్వయంగ్రాహ ప్రణయేన = నీవై కొన్న యానమ్మకము చేతను స్నేహము చేతను. అలంకృతః అస్మి = అలంకరింపఁబడితిని - నీకు కలిగిన యెడరున, నీవు కావాఁడవు, నేను నీవాఁడను - అని నీవు తోఁపఁజేయుట చేత - అభ్యనుజ్ఞాతః = నీచే సెలవుగొన్నవాఁడనై, పోఁగోరెదను. ప్రత్యగ్ర అపనీత సంయమనస్య = క్రొత్తగా-ఇప్పుడే - తొలఁగింపఁబడిన కట్లు - సంకెలలు - గల నీకు, అలఘుసఞ్చారా = వడిగా, సులువుగా నడవలేని - అడుగులు పెట్టఁజాలని - నడక యగును. 'సంచారా' అని పా. ఎంతయు అడ్డము కలిగినట్లు తడబాటు కలిగిన దగును. సులభ పురుష సఞ్చారే అస్మిన్ ప్రదేశే = సులవుగా - ధారాళముగా జనుల సంచారము గల ఈచోట - జనులు లేని చోట పోవుబండి సందేహము కలిగించును, అట్లుగాక - బండి మంచి నమ్మకమునకు కారణ మగును - ఎవరికి తొంగి చూచుట సోదాచూచుట మొదలైనవి చేయవలయునని తోఁపదు, కావున బండిమీఁదనే పోవుదువుగాక. యథాఽహ భవాన్ = నీవు చెప్పినది సరిగానే ఉన్నది. అట్లే చేసెదను.

శ్లో. ౭. క్షేమేణ = క్షేమముతో - నిరపాయముగా - బాన్ధవాన్ వ్రజ = నీబంధువులం (- తో) జేరుము. వారేల? భవాన్ = నీవు, బాంధవః = బాంధవుఁడవు, మయా లబ్ధః నను - నాచేత పొందఁబడితివి గదా. భవతా = నీచేత,

చారు—

స్మర్తవ్యో ఽస్మి కథాన్తరేషు భవతా,

ఆర్య— స్వాత్మాపి విస్మర్యతే?

చారు—

త్వాం రక్షన్తు పథి ప్రయాన్త మమరాః,

ఆర్య— సంరక్షితో ఽహం త్వయా,

చారు—

స్వైర్భాగ్యైః పరిరక్షితో ఽసి,

ఆర్య— నను హే తత్రాపి హేతు ర్భవాన్. ౮

చారు—యదుద్యతే పాలకే మహతీ రక్షా న వర్తతే, తచ్ఛీఘ్ర మపక్రామతు భవాన్.

కథాన్తరేషు = (ఆయా) ప్రస్తావములయందు, స్మర్తవ్యః అస్మి = స్మరింపఁదగినవాఁడను అగుచున్నాను - అందందు అప్పుడపుడు నన్ను స్మరింతువుగాక. అది నాకు చెప్పవలయునా? స్వాత్మా అపి విస్మర్యతే - నాశరీరము సయితము - నేనే సయితము - మఱవఁబడునా, మఱవఁబడుదునా? పథి ప్రయాన్తం = దారిం బోవుచున్న, త్వాం = నిన్ను, అమరాః = దేవతలు, రక్షన్తు = కాపాడుదురుగాక. దేవత లేమి? నిజము చెప్పుచున్నాను - అహం = నేను, త్వయా = నీచేత, సంరక్షితః = చక్కఁగా కాపాడఁబడితిని - కాకున్న ఎప్పుడో పట్టువడి ప్రాణము కోలుపోయియుందునే. నేను కాదు నిన్ను కాపాడినది. నేను ఏమి చేసితిని నిన్నుం గావ? నీ భాగ్యములచే అదృష్టములచే - దైవములచే - నీవు కాపాడఁబడితివి - మఱి పురుషునిచేత కాదు. అది నిజమే అనుకొనుము - అయినను - అందును - దైవము కావించిన రక్షణమందును, నీవే హేతువవు - నీయింట దూఱితిని, నీబండియెక్కితిని, నీచందనకుచేత పడితిని, నీవసంతసేననైతిని, నిన్నుంగంటిని - సర్వమును అట్లు దైవచేష్టలే ఐనను, అందు ప్రకాశించినది, కార్యకరమైనది - నీవే - నీపేరే.

ఉద్యతే పాలకే=పాలకుఁడు పూనుకొనిన, మహతీ రక్షా=మిక్కుటమయిన కాపు - పోనీని కైదు. యత్ నవర్తతే = లేన కలుగకుండునో - తత్ - దాన శీఘ్రం అపక్రామతుభవాన్ = నీవు త్వరగా తప్పించుకొ(ని నీచోటును నీవారిని చేరగ)ందువో. నీకై పాలకుఁడు మరల పూనుకొనులోపల తప్పించుకొని నీవారిం

ఆర్య—ఏవం పున ర్దర్శనాయ. (ఇతి నిష్క్రాన్తః.)

చారు—

శ్లో. కృత్వైవం మనుజపతే ర్మహ ద్వ్యలీకం
స్థాతుం హి క్షణ మపి న ప్రశస్త మస్మిన్
మైత్రేయ, క్షిప నిగడం పురాణకూపే
పశ్యేయుః క్షితిపతయో హి చారదృష్ట్యా. ౮

(వామాక్షి స్పన్దనం సూచయిత్వా) సఖే మైత్రేయ వసన్తసేనా దర్శనోత్సుకో ఽయం జనః. పశ్య,

జేరుము. ఏవం = అలాగే. పునర్దర్శనాయ - మరల అగపడుటకు - పెద్దవారి వలన సెలవుగొనుక్రమము ఇది - నేను పోయెదను అనక, పోయివచ్చెదను అనుటయు, వచ్చెదను అని మాత్రమే చెప్పుటయు - సెలవుగొందును అనుటయు - మర్యాదతోడి ఆమంత్రణము పలు తెఱంగులు.

శ్లో. ౮. ఏవం = ఇట్లు, మనుజపతేః = రాజునకు, మహత్ వ్యలీకం = గొప్పయప్రియమును - చేసి, అస్మిన్ = ఈయెడ - పుష్పకరండకమున, క్షణం అపి స్థాతుం = నిముసమైనను ఉండుటకు, న ప్రశస్తం హి = శ్లాఘ్యము కానే కాదు. మైత్రేయుఁడా - నిగడం - సంకెలను, పురాణకూపే = పాత - పాడు - బావిలో, క్షిప = పడవేయుము. హి = ఏలన, క్షితిపతయః = రాజులు, చారదృష్ట్యా = వేఁగుచూపున, పశ్యేయుః = చూతురు, కనిపట్టుదురు. వామాక్షిస్పన్దనం = ఎడమకన్ను అదరుటను. అయం జనః = ఈజనము - నేను అనుట. ... = దర్శనఉత్సుకః = చూడను ఉవ్విళులూరుచున్నాఁడు - ఉన్నాను.

ఇట్లు రాజునకు ఇంత అప్రియము చేసి ఇఁకను ఇట ఉండఁదగదు - పోవుదము పద, ఇంటికి. ఆసంకెల ఎక్కడను అగపడఁగూడదు. రాజులకు వేఁగు చూపులు - దానిని ఆపాతబావిలో - సాధారణముగా ఎవరును కనిపట్టనేరని చోట - పాఱవేయుము.

శ్లో. అపశ్యతో ఽద్య తాం కాన్తాం
వామం స్ఫురతి లోచనమ్,
అకారణపరిత్రస్తం
హృదయం వ్యథతే మమ.

త దేహి. గచ్ఛావః (పరిక్రమ్య) కథ మభిముఖ మనాభ్యుదయికం శ్రమణక దర్శనమ్. (విచార్య) ప్రవిశ త్వయ మనేన పథా. వయ మ ప్యనే నైవ పథా గచ్ఛామః.

(ఇతి నిష్క్రాన్తాః)

ఇ త్యార్యకాపహరణం నామ

సప్తమో ఽఙ్కః

---

శ్లో. ౯. తాం కాన్తాం = ఆరమణిని, అపశ్యతః = చూడనివాడను, అద్య= ఇప్పుడు, వామం లోచనం స్ఫురతి = ఎడమకన్ను అదరుచున్నది. మమ హృదయం= నా డెందమును, అకారణపరిత్రస్తం = నిష్కారణముగా భయముఁగొన్నదై, వ్యథతే = బాధపడుచున్నది.

నిష్కారణ - అకాండ - హృత్త్రాసవ్యథ - కలుగుచున్నది. ఎడమ కన్నును అదరుచున్నది - రెండును గొప్ప అవశకునములు - ఆమెకైన చూడం గోరికతో ఈ రెండు అవశకునములును - మిళితమైనవే - తత్ ఏహి = మఱి రమ్ము - పోవుదము - అందులకై - పరిక్రమ్య = రెండు అడుగులు నడచి - ఇంతలో - కథం = ఎట్లు! అభిముఖం శ్రమణకదర్శనమ్ = ఎట్టయెదుట (ఈ) శ్రమణకుఁడు అగపడుట - అదియు అవశకునమే - అనాభ్యుదయికం = అభ్యుదయముం గూర్పనిది - మిక్కిలి కీడుంగూర్చునది - అనుట. రవంత తడసి - విచార్య = ఆలోచించుకొని - ప్రవిశతు అయం ... = ప్రవేశించిపోనీ వాఁడు ఈదారినే - ఇఁక - గచ్ఛామః = పోవుదము.

పాపము, చారుదత్తునికి ఇన్ని అవశకునములు! ఏమగునో?

ఈ యంకమున చారుదత్తుఁడు వసంతసేనతోడి విస్రంభవిహారములకు ఆసపడి, మిత్రు మైత్రేయుంగూడి జీర్ణపుష్పకరండకోద్యానమునకుంబోయి ప్రతీక్షించుచుండి,

తన యేర్పాటు మేరకు ఆమెను ఎక్కించుకొన్న తన బండి ఇంకను ఏలరాలేదో అని యనుకొను చున్నాఁడు. ఇంతలో వర్ధమానకుఁడు బండితోలుకొని తోఁటకు వచ్చి చేరినాఁడు. అంత వసంతసేనను దించుకొన బండి తలుపు తీయఁగా, ఆచోట తానెన్నఁడు చూడని క్రొత్త పురుషుఁడు, మహాపురుషలక్షణ లక్షితుఁడు అగపడి, తాను గోపాలదారకుఁడను, అల్లయాయార్యకుఁడ నని శరణుజొచ్చినాఁడు. చిత్తము ఆశ్చర్యసంతోషములతో నిండి పోయినది. తాను ప్రాణములనైన విడుతును అతని రక్షించుటకు అని నిశ్చయించుకొని, అతనికాల మిగిలియున్న సంకెలను ఊడ్చి తోఁట ప్రాంత బావిలోపారవేయించి, తన బండిలో పోవుటయే సులువు, క్షేమ కరము అని అతనిని అందే స్వజనముం జేరఁబంపెను,

అతనితోఁ గాని మతెవరితోఁ గాని ఒక్క మాటయేని మాటాడ తోఁప లేదు. అది యింతంతయనరాని రాజాపథ్యము. ఏవేఁగు చూచునో యన్న శంక. ఇఁక అక్కడ నిముసమేని యుండరాదు – అని ఇంటికి తరలెను.

మనసున వసంతసేనం జూడ నత్యంతోత్కంఠ. కన్నదరినది శ్రమణకుఁ డెదురైనాఁడు, మనసు ఏదో చెప్పరాని వెత పడుచుచున్నది. అవశకునములు! విసవిస ఇంటికి పోవుచున్నాఁడు.

ఇతి – సప్తమాఙ్కః

ఆర్యకుని అపహరణము అను

ఏడవ యంకము

ముగిసినది



# అష్టమోఽఙ్కః

(తతః ప్రవిశ త్యార్ద్రచీవరహస్తో భిక్షుః)

భిక్షుః—అజ్ఞాః, కురుత ధర్మసంచయమ్. [అజ్ఞా, కరేధ ధమ్మసంచఅమ్].

---

ఆర్ద్ర చీవర హస్తః = తడి సన్యాసిగుడ్డను, కావిని, చేతగలవాఁడై భిక్షుకః - శాక్యసన్న్యాసి - ప్రవేశించును. - వీఁడు పూర్వాంకాంతమున చారుదత్తునికి అగపడినవాఁడే. వాఁడైనను ఎవఁడు -? ఆర్యచారుదత్తుని కడ సంవాహకుఁడుగా నుండి, తరువాత ఆశయహీనుఁడై, జూదరియై, అందులో ఓడి దెబ్బలు తిని, కడపట వసంతసేనచే సభికునికి వానిబాకీ కట్టి విడిపింపఁబడి, తరువాత బ్రదుకుపై రోఁతగలిగి శ్రమణకుఁడైనవాఁడు. చారుదత్తుఁడు వానిని ఏలాఁగో గుర్తుపట్టలేదు - వేసము మాఱినందునను, తనవద్ద మానుకొనిపోయి చాలకాలమైనందునను, ఇపుడును దూరాన శ్రమణకుఁడు అని కాషాయాదికవేషముచే దూరాన నుండి చూచి ఫలానా అని యెఱుంగనక్కఱ లేనందునను చాలినంత దగ్గఱకు రానందునను - ఆనవాలుపట్టక విడువఁబడినవాఁడు.

మఱియు శకారుఁడు సంస్థానకుఁడును కుసుమకరండక జీర్ణోద్యానమునకే పోయియున్నాఁడు, అక్కడికి తన చేటుని స్థావరకుని తన బండి కట్టుకొని రమ్మన్నాఁడు - తాను మరల ఇంటికి మరలుటకు. చారుదత్తుఁడును ఆయుదయము - వేఁగుజాముననే కాఁబోలు, తనయింట పడుకలో పరుండి నిద్రించుచున్న వసంతసేనను విడిచి, తానును పుష్పకరండక జీర్ణోద్యానమునకే పోయి, వర్ధమానకుని తెల్లవాఱఁగానే వసంతసేనను తన బండిలో ఎక్కించుకొని పుష్పకరండక జీర్ణోద్యానమునకే తన కడకు తీసికొనిరమ్మని ఏర్పాటుచేసి పోయినాఁడు. కావున ఆపుష్పకరండకజీర్ణోద్యానము చాల పెద్దదై - ఒక్కవంక చారుదత్తునికి విహారమునకు వాడుకపడినదయ్యు, ఒకవంక రాష్ట్రియసంస్థానకునకు కొంత సొంతే మను

శ్లో. సంయచ్ఛత నిజోదరం
నిత్యం జాగృత ధ్యానపటహేన
విషమా ఇన్ద్రియచౌరా
హరన్తి చిరసంచితం ధర్మమ్. ౧

[ శంజమ్మధ ణిఅపోటం
ణిచ్చం జగ్గేధ ఝాణపడహేణ
విశమా ఇన్దిఅచోలా
హలన్తి చిలశంచిదం ధమ్మమ్ ].

కొనునంత వాడుకపడియు, ఉన్నది శాంబోలు. అట్లు రాష్ట్రియునికి కలదని భిక్షుకని మాటలవలన తెలియును. ఊరి గొప్పవారు విహారమునకు వచ్చునది శాంబోలు – అది.

'గృహీత కషాయోదకం ఏతచ్చీవరకమ్. యావ దేతత్ రాష్ట్రియశ్యాలకస్య ఉద్యానే ప్రవిశ్య పుష్కరిణ్యాం ప్రక్షాల్య లఘు లఘు అపక్రమిష్యామి –' అని. VIII – 3.

శ్రమణకులు తమలో తాము బౌద్ధమతసూక్తులు పఠించు చుందురు – విను శ్రోతృజనమునకు ధర్మబోధయు అగుచుండు నని.

అజ్ఞాః = ఓరిమిలుక లేని వారలారా, ధర్మ మెఱుంగని వారలారా; కురుత ధర్మ సఞ్చయమ్ = ధర్మముంగూర్చుట – కూడఁబెట్టుట చేయుఁడు.

శ్లో. ౧. నిజోదరం = మీకడుపును, నిత్యం = ఎల్లప్పుడును, సంయచ్ఛత = నిగ్రహింపుఁడు. తిండిమీఁద ఆసకలవారుగా ఔదరికులుగా ఉండకుఁడు. నిత్యం = ఎల్లప్పుడును. ధ్యానపటహేన = ధ్యానము నెడు తప్పెటతో – అవిద్య యను నిద్రను పోఁగొట్టుదానితో, జాగృత = జాగ్రత్త కలవారుగా ఉండుడు విషమాః = భయంకరులైన, ఇన్ద్రియ చౌరాః = ఇంద్రియములను దొంగలు, చిరసఞ్చితం ధర్మం = చిరకాలము కూడఁబెట్టఁబడిన – నిధివోలె నున్న, ధర్మమును, హరన్తి = దొంగిలింతురు.

కేవలము ఔదరికులుగా నుండక కడుపును – ఆహారమును అనుట, నిగ్రహింపుఁడు, జిహ్వాలౌల్యము మానుఁడు. ధ్యానమును నిత్యమును అభ్యసింపుడు –

అపి చ, అనిత్యతయా ప్రేక్ష్య కేవలం తావ ద్ధర్మాణాం శరణ మస్మి, [అవి అ, అణిచ్చదాఏ పేక్ఖిఅ ణవలం దావ ధమ్మాణాం శలణ ష్మి].

శ్లో. పఞ్చజనా యేన మారితా
అవిద్యాం మారయిత్వా గ్రామోరక్షితః
అబలః క్వ చణ్డాలో మారితో
ఉవశ్యమ పి సనరః స్వర్గం గాహతే. 1

దానితో తప్పటతోనుం బోలె నిద్రం బోని అవిద్యను తోలుఁడు. ఇంద్రియములు భయంకరులగు దొంగలు-(మీరు) కూడబెట్టుకొన్న ధర్మమునెల్ల దొంగిలించుకొని పోవుదురు.

అనిత్యతయా ప్రేక్ష్య = ఏదియు (లోకాన) నశ్వరమని నిశ్చయించుకొని, (ప్రేక్ష్య - తెలివిపొంది). కేవలం ధర్మాణాం = ధర్మములకు మాత్రమే, శరణం = ఇల్లు, అస్మి = ఐతిని, ధర్మోపదేశము విరోధాభాసాలంకార మార్గమునం జేసిన చక్కఁగా మనసునకెక్కును, అనుష్ఠానమునకు పురికొల్పును అని ప్రాయికముగా అట్లుచేయుట కలదు. అట్లే యిందు.

శ్లో. 1. యేన = ఎవనిచేత, పంచజనాః = ఐదుగురు మానుసులు, మారితాః = చపఁబడిరో, అట్లే, స్త్రియం = స్త్రీని - ఒక ఆఁడుదానిని, మారయిత్వా = చంపి, గ్రామః = ఊరు, రక్షితః = కాపాడఁబడినదో, క్వ = ఎక్కడ, అబలఁ = బలహీనుఁడైన, చణ్డాలః = మాదిగవాఁడు, మారితః = చంపఁబడినాఁడో, సనరః = ఆజనుఁడు, అవశ్యం అపి = తప్పకుండ, స్వర్గం = (సుఖముల స్థానమైన) స్వర్గమును, గాహతే = పొందును.

అయిదుగురు మానుసులను చంపి, ఒక స్త్రీని చంపి, గ్రామమును కాపాడి, బనహీనుఁడగు ఒక మాదిగవానిం జంపి తప్పక స్వర్గమున ప్రవేశించును. ఏమిటి యీ యుపన్యాసము! అందతినిచంపి, ఒక స్త్రీనిం గూడఁ జంపినవానికి స్వర్గము దొరకునట! ఎంతయు విరుద్ధముగా తోఁచుచుండలేదా. మఱి పరిహారము ఎట్లనఁగా - పంచజనులు అయిదు ఇంద్రియములు జయింపఁబడినవి, తమ

[పచ్ఛజ్జణ జేణ మాలిదా
 ఇత్థిఅ మాలిఅ గామలక్ఖి దే
అబల క చణ్డాల మాలిదే
 అవసం వి శే ణల శగ్గ గాహది].

శ్లో. శిరో ముణ్డితం తుణ్డం ముణ్డితం
 చిత్తం న ముణ్డితం కిమర్థం ముణ్డితమ్
యస్య పునశ్చ చిత్తం ముణ్డితం
 సాధు సుష్ఠు శిర స్తస్య ము ణ్డితమ్. 3

[శిల ముణ్డిద తుణ్డ ముణ్డిదే
 చిత్త ణ ముణ్డిద కీశ ముణ్డిదే
జాహ ఉణ అ చిత్త ముణ్డిదే
 శాహు శుట్ఠు శిల తాహ ముణ్డిదే].

---

పనులనుండి మాన్పఁబడినవి - నిగ్రహించి జయింపఁబడినవి అనుట. స్త్రీని - అవిద్య యనుదానిని, విద్యచే నాశనము చేసి, (గ్రామః = ) దేహము కాపాడఁబడినది, అధర్మములం జొరనీక ధర్మమునం బ్రతిష్ఠింపఁబడినది. చణ్డాలః మాదిగవాఁడు, అనఁగా అహంకారము, అవిద్యయు, దాని కార్యమును అను దాని (= అహంకారపు) సహాయులులేక తొలఁగిపోవుటఁ జేసి, తుట్టమర అడంపఁబడినది. ఇఁకను అట్టివాఁడు స్వర్గమున - నిత్యసుఖమున - ఓలలాడును. సర్వసంతాపము నివర్తిల్లఁగా, పరనిర్వాణమును పడయును.

శ్లో. 3. శిరః = తల, ముణ్డితం = నున్నగా గొఱుగఁబడినది; తుణ్డం = మొగము(ను), ముణ్డితం = నున్నగా గొఱుగఁబడినది. చిత్తం = మనసు, న ముణ్డితం = గొఱుగఁబడలేదు. (ఇఁకను) కిమర్థం ముణ్డితం = ఎందులకు ఈగొఱిగింపులు? నిజముగా ఏమి గొఱుగుకొనినట్లు? పునః = మఱి, యస్య = ఎవనికి, చిత్తం = మనసు, ముణ్డితం = గొఱుగుకొనఁబడినదో, తస్య = వానికి, శిరః = తల, సాధు సుష్ఠు ముణ్డితమ్ = చక్కఁగా నున్నగా గొఱుగఁబడినదగును.

మనస్సును సంస్కరించుకొననివానికి, ఈబయటి సంస్కారములు ఎందులకును కొఱగావు.

గృహీతకషాయోదక మేత చ్చీవరమ్, యావ దేత ద్రాష్ట్రియ శ్యాలకే స్యోద్యానే ప్రవిశ్య పుష్కరిణ్యాం ప్రక్షాల్య లఘు ల ఘ్వపక్రమిష్యామి. [గిహిద కశాఓదప ఏశే చీవలే, జావ ఏవం లట్టిఅశాలకాహ కేలకే ఉజ్జాణే పవిశిఅ పోక్ఖవిణిప పక్ఖాలిఅ లహుం లహుం అవక్కమిశ్శమ్]. (పరిక్రమ్య తథా కరోతి.

( నేపథ్యే )

శకారః—తిష్ఠ రే దుష్టశ్రమణక, తిష్ఠ. [చిట్ఠ లే దుట్ట శమణకా, చిట్ఠ]

భిక్షుః—(దృష్ట్వా సభయమ్) ఆశ్చర్యమ్, ఏష స రాజ శ్యాలసంస్థానక ఆగతః. ఏకేన భిక్షు ణాపరాధే కృతే ఽన్య మపి యత్ర యత్ర భిక్షుం పశ్యతి, తత్ర తత్ర గా మివ నాసికాం వి ద్ధ్వాపవాహయతి. త త్కు త్రాశరణః శరణం గమిష్యామి? అథవా భట్టారక ఏవ బుద్ధో మే శరణమ్. [హీ అవిదమాణహే ఏశే శే లాఅశాలశం ఠాణే ఆఅదే. ఎక్కేన భిక్ఖుణా అవలాహే

---

ఏతత్ చీవరం=ఈనాగుడ్డ కావిరంగునీరు పట్టింపఁబడినది. ఏతత్ యావత్= మఱిదీనిని, రాష్ట్రియశ్యాలకస్య = రాష్ట్రియుఁడైన శకారసంస్థానకుని తోఁటలో ప్రవేశించి, తామరలకోనేట, ప్రక్షాల్య = ఉదికి, గుంజి, లఘు లఘు అపక్రమామి = వడివడిగా తొలఁగి పోయెదను.

హీ అవిదమాణహే = అయ్యో, ఎట్లు! ఏషః = వీఁడుగో, స రాజశ్యాలః సంస్థానకః - ఆరాజుమఱఁది సంస్థానకుఁడు వచ్చినాఁడు. ఏకేన భిక్షుణా - ఎవని చేతనో ఒక సన్యాసిచేత, అపరాధే కృతే = తప్పు చేయఁబడగా, ... = ఇతరుని సయితము, ఎక్కడెక్కడ, సన్యాసిం గనునో, అందందు వాని నెద్దు ఎద్దునుం బోలె ముక్కు కట్టి - పొడిచి - ఆవతలికి తఱుముచున్నాఁడు. మఱి అశరణుఁడను, ఎవని శరణు జొత్తును? అథవా - అట్లు అనుకొన నేల? భట్టారక ఏవ బుద్ధః ... = స్వామి బుద్ధదేవుఁడే నాకు రక్షకుఁడు.

కిదే అణ్ణం పి జహిం జహిం భిక్షుం పేక్ఖది తహిం తహిం గోణం విఅ ణాసం విన్ధిఅ ఓవాహేది, తా కహిం అశలణే శలణం గమిశ్శమ్. అధవా భట్టాలకే జ్జేవ బుద్ధే మే శలణే].

(ప్రవిశ్య సఖడ్గేన విటేన సహ)

శకా—తిష్ఠ రే దుష్టశ్రమణక, తిష్ఠ. ఆపానకమధ్యప్రవిష్టస్యేవ రక్తమూలకస్య శీర్షం తే భఙ్క్ష్యామి. [చిట్ఠ లే దుట్టశమణకా, చిట్ఠ. ఆవాణఅమజ్ఝపవిట్టశ్శ విఅ లత్తమూలఅశ్శ శీదం దే మోడఇశ్శమ్]. (ఇతి తాడయతి.

విటః—కాణేలీమాతః, న యుక్తం నిర్వేదధృతకషాయం భిక్షుం తాడయితుమ్. తత్కిమనేన. ఇదం తావత్సుఖోపగమ్యముద్యానం పశ్యతు భవాన్.

శ్లో. అశరణశరణప్రమోదభూతై
ర్వనతరుభిః క్రియమాణచారుకర్మ

శకారుఁడు ప్రవేశించును, వానితో వానికి సదాసహాయుఁడు విటుఁడును, చేత కత్తి గొన్నవాఁడు ప్రవేశించును.

ఆపానక మధ్య ప్రవిష్టస్య - త్రాఁగుబోతుల గోష్ఠి నడుమ చొచ్చిన, రక్త మూలకస్య ఇవ = ఎఱ్ఱ ముల్లంగియొక్కరీతిం బోలె, తల పగులఁ గొట్టెదను. ముల్లంగికి ఆకులుగల పైభాగముం గోసివేసి, త్రాఁగుడులో ఊరుఁగాయలాగు కొలుకుకొందురు. కావున వానికి ఈకావిగుడ్డలవారిని గూర్చి ఆయుపమానము తోఁచినది.

కాణేలీమాతః - శకారసంభోధన - విటునిచే ముద్దుగా గౌరవముగా చేయఁబడునది. న యుక్తం = తగదయ్యా, నిర్వేద ధృతకాషాయం = అన్నింటి మీఁద (నిర్వేదము) విసుకు గొని సన్న్యాసియైనవానిని కొట్టుట. తత్ ... = కావున వానితో నేమి? వదలిపెట్టు - వానిని పోనీ. ఇదం ... = భవాన్ = దీనిని, పోయికై సులువుగా చేరఁదగిన తోఁటను చూడవయ్యా, నీవు.

శ్లో. ౪. అశరణ శరణ ప్రమోద భూతైః = ఇల్లు లేనివారికి ఆశ్రయ సంతోషము అయినవి కలిగించునవి - అనుట, ఐన, వనతరుభిః = తోఁటచెట్ల

హృదయ మివ దురాత్మనా మగుప్తం
నవ మివ రాజ్య మనిర్జితోపభోగ్యమ్. ౮

భిక్షుః—స్వాగతమ్, ప్రసీద తూపాసకః. [శాఅదమ్. పశీదదు ఉవాశకే].

శకా—భావ, పశ్య పశ్య, ఆక్రోశతి మామ్. [భావే, పేక్ఖ పేక్ఖ, ఆక్కోశది మమ్].

---

చేత, క్రియమాణ చారుకర్మా=కావింపఁబడుచున్న మంచి పని గలది, పరోపకారి. (పశ్యతు - అని శేషము - చూతువుగాక.) సన్న్యాసిని కొట్టఁబూనెదవు నీవు, వానికి ఈచెట్లు నిలువ నీడ నొసఁగి కాపాడును. తోఁట అందము అనునది వీనిం బట్టినది కదా. దురాత్మనాం = దుష్టస్వభావము గలవారియొక్క, హృదయం ఇవ = మనసువలె, అగుప్తం = దాఁపఁబడనిది. వారిహృదయపు సెబ్బర దాఁగదు, వెలికి ప్రకటమగుచునే ఉండును, అందు ఏదియు చొచ్చుచుండును, (అగుప్తం) కావలి కాఁపు లేనిది, అందఱికి ఉమ్మడియైనది గదటయ్యా యీతోఁట అన్నట్లు, అనిర్జిత ఉపభోగ్యం = చక్కఁగా వశీకరింపఁబడని సుఖానుభవములుగల నవంరాజ్యం ఇవ - క్రొత్తరాజ్యమువలె. అట్లట్లున్న ఈతోఁటను - అన్నియు తోటకు విశేషణములు,

ఈతోఁట అందఱికి ఉమ్మడి, అందును ఇట్టి దిక్కులేని సన్న్యాసులకు ఆశ్రయమైనది. దీనిని చూడవయ్యా - నీకు వాని జోలి యెందులకు? అశరణులకు శరణప్రమోదము కలిగించు చెట్లచే, చేయఁబడు (పరోపకారమను) అందమైన పనిగలది. దీనికి కాఁపు ఉన్నదా? అందఱు ప్రవేశింపఁదగినది, (కావున ఈసన్న్యాసి వచ్చినాఁడు) దురాత్ములహృదయములో అడ్డములేక ఏదేది చొరదు? (కావున ఈసన్న్యాసి చొచ్చినాఁడు). క్రొత్తగా చేతికి వచ్చిన రాజ్యము వంటిది. ఇంకను అందలి ఉపభోగ్యము లెల్ల ఆక్రొత్తవానికి వశము కాలేదు. అవి అందఱికి ఉపభోగ్యములే - (కావున ఈసన్న్యాసి చొచ్చినాఁడు. అట్లు ఉద్యానముం గూర్చిన మాటలచేతనే వానిని సన్న్యాసి జోలికి పోనీకుండుటకు ప్రయత్నించుచున్నాఁడు.

విటః—కిం బ్రవీతి.

శకా—ఉపాసక ఇతి మాం భణతి కి మహం నాపితః. [ఉవాశకే త్తి మం భణాది. కిం హగ్గే ణావిదే].

విటః—బుద్ధోపాసక ఇతి భవన్తం స్తౌతి.

శకా—స్తును శ్రమణక, స్తును. [థుణు శమణకా థుణు].

భిక్షుః—త్వం ధన్యః, త్వం పుణ్యః. [తుమం ధణ్ణే, తుమం పుణ్ణే].

శకా—భావ, ధన్యః పుణ్య ఇతి మాం భణతి కి మహం చార్వాకః కోష్టకః కుమ్భకారో వా. [భావే, ధణ్ణే పుణ్ణే త్తి మం భణాది. కిం హగ్గే శలావకే, కోష్టకే, కోమ్భకలే వా].

విటః—కాణేలీమాతః, నను 'ధన్య స్త్వమ్, పుణ్య స్త్వమ్' ఇతి భవన్తం స్తౌతి.

---

ఉపాసకః - బౌద్ధసన్న్యాసి అందఱిని బుద్ధభక్తులుగా ఉపాసకులుగా సంబోధించుచు నిర్దేశించుచు ఉండును. అది ఊరక 'అయ్యా' అన్నపాటియే.

ప్రసీదతు - కోపపడకుము - మన్నింపు - ఈమాటలకు అర్థము తెలియక - 'ఆక్రోశతి - తిట్టుచున్నాఁడు' నన్ను, అని విటునితో చెప్పుచున్నాఁడు. 'ఉపాసక - అనుచున్నాఁడు - నేనేమి 'నాపితః' - మంగలినా? ఉపాసక - ఉప + ఆసక - దగ్గఱ కూర్చుండువాఁడు - గొఱుగునపుడు చాల దగ్గఱగా కూర్చుండునుగదా మంగలి.

కాదయ్యా - నిన్ను స్తోత్రము చేయుచున్నాఁడు - బుద్ధోపాసక - బుద్ధుని ఉపాసించువాఁడా - కొలుచువాఁడా - అని. త్వం ధన్యః, పుణ్యః - ఇవియు స్తుతికే - నీవు ధన్యుఁడవు, పుణ్యః - ధార్మికుఁడవు - పుణ్య కార్యములు చేయువాఁడవు అని. మఱి శకారుఁడు - వానికి అపార్థము చేసికొనును. నేనేమి చార్వాకుఁడనా, కోష్టకమనా, కుంభకారుఁడనా - ధన్యః - లోకాన ధనమే ప్రధానము - దానికలిమియే - సుఖభోగదము - మోక్షము - అని నాస్తిక

శకా—భావ, త త్కిమర్థ మేష ఇ హాగతః? [భావే, తా కిశే ఏ శే ఇధ ఆగదే].

భిక్షుః—ఇదం చీవరం ప్రక్షాలయితుమ్. [ఇదం చీవలం పక్ఖాలిదుమ్].

శకా—అరే దుష్ట శ్రవణక, ఏత న్మమ భగినీపతినా సర్వోద్యానానాం ప్రవరం పుష్పకరణ్డోద్యానం దత్తమ్, యత్ర తావ చ్ఛునకాః శృగాలాః పానీయం పిబన్తి. అహ మపి ప్రవరపురుషో మనుష్యకో న స్నామి. తత్ర త్వం పుష్కరిణ్యాం పురాణ కులిత్థ యూషసవర్ణా న్యుగ్రగన్ధీని చీవరాణి ప్రక్షాలయసి. త త్త్వా మేక ప్రహారికం కరోమి.

[అలే దుట్టశమణకా ఏశే మమ బహిణీవదిణా శువ్వుజ్జాణాణం పబలే పుష్ఫకలణ్డుజ్జాణే దిణ్ణే, జహిం దావ శుణహకా శిఆలా పాణిఅం పిఅన్తి. హగ్గె వి పబలపులిశే మణుశ్శకే ణ ణ్హాఆమి. తహిం తుమం పుక్ఖలిణీఏ పులాణకులుత్థజూశశవణ్ణాఇం ఉశ్శగన్ధిఆఇం చీవలాఇం పక్ఖాలేశి. తా తుమం ఏక్కపహాలిఅం కలేమి].

చార్వాకమతము, 'అనిత్యాని శరీరాణి, ఋణం కృత్వా ఘృతం పిబ' - ఈ దేహములు నశ్వరములు, ఉన్న రెండు దినాలు అనుభవింపుడు - అని చార్వాక మతము - 'అప్పో సప్పో చేసి పప్పో ధప్పళమె కొద్దాముగా!' - అన్నట్లు. 'పుష్కర' మనఁగా పశువుల నీటితొట్టి అని యొకయర్థము, వాని సంపన్నమైనయింట అవి ఉన్నవి కాఁబోలు. తటాలున ఆయర్థము తోఁచినది, వానికి, పసరాలకు నీటి తొట్టిని కుమ్మరివాఁడు చేయును గాన - ఆయర్థమును తోఁచినది. యత్ర = ఎక్కడ - అనఁగా - ఇక్కడ - శునకాః - కుక్కలు, శృగాలాః = నక్కలు పానీయం పిబన్తి = నీరుత్రాగును. అహం అపి - నేను సయితము, ప్రవరపుషః - పురుష శ్రేష్ఠుఁడను - న స్నామి = స్నానముచేయను. పురాణ కులిత్థ యూష సవర్ణాని - పాతవి, ఉలవల కట్టు - రంగువి - ఉగ్రగన్ధీని = కారు - కారపు - గాటువాసన కొట్టునవి - నీగుడ్డలు గుంజెదవా? తత్ = కావున - ఏకప్రహారికం = ఒక్కదెబ్బ గానిం జేసెదను - ఒక్కపెట్టుకే చచ్చినవానింగా.

విటః—కాణేలీమాతః, తథా తర్కయామి యథానేనాచిర ప్రవ్రజితేన భవితవ్యమ్.

శకా—కథం భావో జానాతి? [కధం భావే జాణాది?]

విటః—కిమత్ర జ్ఞేయమ్. పశ్య,

శ్లో. అద్యాప్యస్య తథైవ కేశవిరహా
ద్గౌరీ లలాటచ్ఛవిః,
కాలస్యాల్పతయా చ చీవరకృతః
స్కన్ధే న జాతః కిణః,
నాభ్యస్తా చ కషాయవస్త్రరచనా
దూరం నిగూఢాన్తరం,
వస్త్రాన్తం చ పటోచ్ఛ్రయా త్ప్రశిథిలం
స్కన్ధే న సంతిష్ఠతే. ౫

తథా తర్కయామి = అట్లు ఊహింతును. ఎట్లనఁగా - అచిరప్రవ్రజితేన = క్రొత్తగా సన్న్యసియైనవాఁడు కానోపును - భావ ఎట్లు ఎఱుంగును? ఎట్లు అట్లని తలంచును?

కిం అత్ర జ్ఞేయమ్ = ఇందు ఎఱుంగవలసిన దేమున్నది?

శ్లో ౫. అద్యాపి = ఇప్పటికిని, కేశ విరహాత్ = వెంట్రుకలులేమి, మొుల కెత్తమి వలన, లలాటచ్ఛవిః = నుదుటి రంగు, తథా ఏవ = అట్లే, గౌరీ = తెల్లదిగా, (ఉన్నది.) కాలస్య అల్పతయా = కాలము కొద్దియే యగుటచేత, స్కన్ధే = మూఁపున, చీవరకృతః = (కావి) గుడ్డచేకలిగినట్టిది, కిణః = కాయ, న జాతః = కాయ ( = కలుగ) లేదు, కిణః - గుర్తు అనుట మేలేమో, కాయ అనుటకన్నను. గుడ్డకు కాయ కాయదు - పీడని వస్త్రధారణమున ఆచోట రవంత రంగు భేదము - తెలుపు - అగపడఁదగును - కషాయవస్త్రరచనా = కావిగుడ్డం జేయుట, గుడ్డను కావిలోఁతడుపుట, న అభ్యస్తా చ = ఇంక వాడుక పడలేదు - పడియున్న గుడ్డను అ ట్లెక్కువ గుంజవలసినట్లు కవురు ఉండదు - 'గృహీతకషాయోదకమ్' - అని అన్నాఁడు - క్రొత్తగా తడుపఁబడినది - అన్నట్లు. చ - మఱియు, వస్త్రాన్తం =

భిక్షుః—ఉపాసక, ఏవమ్. అచిరప్రవ్రజితో ఽహమ్.
[ఉవాశకే, ఏవ్వమ్. అచిలప్పవ్వజిదే హగ్గె].

శకా—తత్కిమర్థం త్వం జాతమాత్ర ఏవ న ప్రవ్రజితః.
[తా కీశం తుమం జాతమేత్తక జ్జేవ ణ పవ్వజిదే].

(ఇతి తాడయతి.

భిక్షుః—నమో బుద్ధాయ. [ణమో బుద్ధశ్శ].

విటః—కి మనేన తాడితేన తపస్వినా, ముచ్యతామ్.
గచ్ఛతు.

శకా—అరే, తిష్ఠ తావత్, యావత్సంప్రధారయామి.
[అలే, చిట్ఠ దావ, జావ శంపధాలేమి].

వస్త్ర అన్తం = వలువకొస, కొంగు, పట ఉచ్ఛ్రియాత్ = దాని (= వలువ) పొడుగువలన దూరం = మిక్కిలి, నిగూఢా న్తరం = దాచఁబడిన - కుఱుచ చేయఁబడిన - నడిమిభాగముగలదయి, ప్రశిథిలం = సళ్ళువాతీనదై, జాఱిపోవునదై స్కన్ధే = బుజాన, న సంతిష్ఠతే = స్థిరముగా నిలుచుటలేదు.

తలతెల్లగానే ఉన్నది, బుజానకాని కావిగుడ్డ పీడకతాల్చిన గుర్తులేదు - కావితదుపుకొన నేర్వలేదు. ఇంకను ఆకావిని ధరించు నేర్పుచాలకున్నది, ఇతనికి, అది బుజాన జాఱి జాఱి పోవుచున్నది.

వీఁడు సంవాహకుడైన, వీఁడు సన్న్యసించి ఎన్నాళ్ళైనది - 2-8 అంకాలకు ఎంతయెడము? II. చైత్ర బ. సప్తమి or షష్ఠి-VIII వైశాఖ శు. ద్వాదశి-కావున 12 + 8 = 20 (?) దినాలు, ఇందు వపన ఆశ్రమస్వీకారములు ఎన్నఁడో?

జాతమాత్ర ఏవ = పుట్టఁగానే ... = ఏల సన్యాసివి కాలేదు? మాటి మాటికి చీటికి మాటికి కొట్టుచునే ఉన్నాఁడు, పొగరుచేతను మూర్ఖతచేతను. కిం అనేన తాడితేన = వానిని ఎందుకు కొట్టుట? విడిచిపెట్టు - పోవును - పోనీ. అరే తిష్ఠ తావత్ = ఓరి ఉండరా అందాక - యావత్ సంప్రధారయామి = నేను

విటః—కేన సార్ధమ్?

శకా—ఆత్మనో హృదయేన. [అత్తణో హడక్కేణ].

విటః—హన్త, న గతః.

శకా—పుత్రక హృదయ, భట్టారకపుత్రక, ఏష శ్రమణకో ఽపి నామ కిం గచ్ఛతు, కిం తిష్ఠతు. (స్వగతమ్) నాపిగచ్ఛతు, నాపితిష్ఠతు. (ప్రకాశమ్) భావ, సంప్రధారితం మయా హృదయేన సహ. ఏత న్మమ హృదయం భణతి. (పుత్తకా హడక్కా, భట్టకే పుత్తకే, ఏశే శమణకే అవి ణామ కిం గచ్ఛదు, కిం చిష్టదు. ణావి గచ్ఛదు, ణావి చిష్టదు, భావే, శంపధాలిదం మప హడక్కేణ శహ, ఏశే మహ హడక్కే భణాది].

విటః—కిం బ్రవీతి?

శకా—మాపి గచ్ఛతు, మాపి తిష్ఠతు, మా పృచ్ఛ్వసితు, మాపి నిశ్వసితు. ఇహైవ ఝటితి పతిత్వా మ్రియతామ్. [మా వి గచ్ఛదు, మా వి చిష్టదు. మా వి ఉశ్శశదు, మా వి ణీశశదు ఇధ జ్జేవ ఝత్తి పడిఅ మలేదు].

భిక్షుః—నమో బుద్ధాయ శరణాగతో ఽస్మి. [ణమో బుద్ధశ్శ. శలణాగద హ్మి].

---

పర్యాలోచించువలెను. కేన సార్ధమ్ = ఎవరితో? - నాతోడనేకదా నీకు ఆలోచన. నేనేమో చెప్పివేసితిని కదా, పోనీయవయ్యా అని. కాదు - ఆత్మనః హృదయేన = నామనస్సుతోడనే. హన్త న గతః = అయ్యో, వీడు పోలేదు - పోనియ్యనందున. శకారుడు తన మనస్సునే సంబోధించి ఆలోచించుచున్నాడు... పుత్రక హృదయమా, సామి పుత్రక, ఈశ్రమణకుడు పోవచ్చునా, ఉండవలయునా? న అపి గచ్ఛతు ... = పోగూడదు, ఉండను గూడదు. కిం బ్రవీతి = ఏమిచెప్పుచున్నది - నీహృదయము ... = న అపి ఉచ్ఛ్వసితు, న అపి నిశ్వసితు - ఊపిరి లోనికి కొనగూడదు, వెలికి పుచ్చగూడదు - ఊపిరి యెటును ఆడింపక ఉండ

విటః—గచ్ఛతు.

శకా—నను సమయేన. [ణం శమఏ౹].

విటః—కీదృశః సమయః.

శకా—తథా కర్దమం ప్రక్షిపతు, యథా పానీయం పఙ్కావిలం న భవతి. అథవా పానీయం పుఞ్జీకృత్య కర్దమే క్షిపతు. [తధా కద్దమం ఖేలదు, జధా పాణిఅం పఙ్కాఇలం ణ హోది. అధవా పాణిఅం పుఞ్జీకదుఅ కద్దమే ఖేలదు].

విటః—అహో మూర్ఖతా

శ్లో. విపర్యస్తమనశ్చేష్టైః శిలాశకలవర్ష్మభిః
మాంసవృక్షై రియం మూర్ఖై ర్భారాక్రాన్తా వసుంధరా. ౬

---

వఅసినది. ఇహా ఏవ ... = ఇక్కడనే చట్టన పడి చచ్చునుగాక. నను సమయేన = ఓయి ప్రతిజ్ఞతో - కీదృశః సమయః = ఎట్టిది, ఏమని ప్రతిజ్ఞ? తథా కర్దమం ప్రక్షిపతు ... = బురదను అట్లు తీసిపాఱవేయనీ, ఎట్లు దాన నీరు బురదతో మలినము గాదో. అట్లుకాదేని, నీటిని అంత సమృద్ధము చేసి, బురదను పాఱవేయనీ - తెలియకుండునట్లు చేయనీ, అహో మూర్ఖతా = ఎంత తెలివిమాలినతనము - ! ఆశ్చర్యము! నీటిలో ఉన్నబురద నంతయు తీసిపాఱవేయనీ - లేకున్న నీటిని అంత ఎక్కువచేయనీ, ఎట్లు అది - బురదపోయినట్లు, తేటగానగునో - నీటినుండి బురదను గానీ, బురదనుండి నీటిని గాని తీయతరమా! ఏమిమూర్ఖత.

శ్లో. ౬. ఇయం వసుంధరా = ఈభూమి (వసు - బంగారు రతనాలు కలది యను పేరుగలదైనను) విపర్యస్త మనః చేష్టైః = తలక్రిందులై, లోకవిపరీతమైన మనసును పనులును గలిగి, శిలాశకలవర్ష్మభిః = (మానిసిరూపాన చెక్కిన) రాతి తునకల దేహములు గలిగి, మాంసవృక్షైః = మాంసపు - మాంసమయు - వృక్షములయిన, మూర్ఖైః = (ఇట్టి) తెలివిమాలిన వారిచేత, భారాక్రాన్తా = ఎంతయు (మోయలేని) బరువుతో ఆక్రమింపఁబడి యున్నది, క్రుంగుచున్నది!

(భిక్షు ర్నాట్యే నాక్రోశతి)

శకా.—కిం భణతి. [కిం భణాది].

విటః—స్తౌతి భవన్తమ్

శకా.—స్తును, స్తును, పున రపి స్తును. [థుణు, థుణు, పుణో వి థుణు].

(తథా కృత్వా నిష్క్రాన్తో భిక్షుః)

విటః—కాణేలీమాతః పశ్యోద్యానస్య శోభామ్,

శ్లో. అమీ హి వృక్షాః ఫలపుష్పశోభితాః
కఠోరనిష్పన్దలతోపవేష్టితాః
నృపాజ్ఞయా రక్షిజనేన పాలితా
నరా సదారా ఇవ యాన్తి నిర్వృతిమ్. 2

మనసును చేష్టయు ఈమూర్ఖునకు ఇంత లోకవిరుద్ధము గా నున్నవి - మానిసి కాఁడు, రాతి చెక్కడపు దేహముగలవాఁడు, మాంసపు చెట్టు - జడుఁడు, నిష్ఠురుఁడు, జ్ఞానశూన్యుఁడు, వట్టి మోయరాని బరువు భూమికి.

నాట్యేన ఆక్రోశతి - తిట్టుటను గొణిగియు మూలిగియు అభినయించును - నోటఁబలికిన మరల కొట్టును తన్నును అని భయపడి. దానిని గూర్చియు మరల అడుగుచున్నాఁడు - ఏమి అనుచున్నాఁడు - అని. స్తౌతి ... = స్తోత్రము చేయు చున్నాఁడు - నిన్ను. స్తుతించు, మరల మరల స్తుతించు. అట్లే తిట్టుటనే అభినయించుచు నిష్క్రమించినాఁడు ఎట్లో, తప్పించుకొని పోయినాఁడు.

ఉద్యానస్య శోభాం పశ్య - తోట యందమును - రామణీయకమును చూడు.

శ్లో. 2. అమీ వృక్షాః హి = ఈ చెట్లు గన, ఫలపుష్పశోభితాః = పండ్లతోను పూలతోను ప్రకాశించుచున్నవై కఠోర నిష్పన్ద లతా ఉపవేష్టితాః = ముదిరినవియు, కదలాడక (అంటుకొనియే ఉండునవియు) నైన తీవలచే చుట్టఁబడినవై - అల్లుకొనఁబడినవై, నృపాజ్ఞయా = రాజును త్తరువుచేత, రక్షిజనేన = కావలివాండ్రచేత, పాలితాః = కాపాడఁబడిన, సదారాః నరాః ఇవ = (తమ) భార్యల (కౌఁగిళ్ళం) గూడిన పురుషులవలె - మానుసులవలె, నిర్వృతిం యాన్తి = సుఖమును పొందుచున్నవి.

శకా—సుష్ఠు భావో భణతి. [శుట్ఠు భావే భణాది].

శ్లో. బహుకుసుమవిచిత్రితా చ భూమిః
కుసుమభరేణ వినామితాశ్చ వృక్షాః
ద్రుమశిఖరలతావలమ్బమానాః
పనసఫలానీవ వానరా లలన్తి. ౮

[బహుకుసుమవిచిత్తిదా అ భూమీ
కుశుమభలేణ ణిణామిదా అ రుక్ఖా
దుమశిహలలదాఅలమ్బమాణా
పణశఫలావిఅ వాణలా లలన్తి].

లోకాన జనులు రాజరక్షితులై మనఃశాంతియు భద్రమును గలవారై, తమ భార్యల కౌఁగిళ్ళలో సుఖింతురు గదా. రాజ్యాన శాంతి భద్రము రక్షణ లేకున్న కుటుంబులకు సుఖము లేదు గదా. అట్లు రక్షణములోనున్న కాంతులవలె నున్నవి – ఈ చెట్లును తీవలును.

సుష్ఠు భావః భణతి – భావుఁడు చక్కఁగా చెప్పుచున్నాఁడు – నీవు చెప్పినది ఎంతయు ఒప్పియున్నది.

శ్లో. ౮. భూమిః చ = భూమియు, బహు కుసుమ విచిత్రితా – పలు (వన్నెల) పూలచేత, పలువన్నెలుగలిగి, ఉన్నది. వృక్షాః చ = చెట్లును, కుసుమభరేణ వినామితాః = పూలమొత్తపు బరువుతో వంగి యున్నవి. ద్రుమ శిఖర లతావలమ్బమానాః = చెట్ల తలమీఁది తీఁగల పట్టుకొని వ్రేలాడుచు, వానరాః = కోఁతులు, పనసఫలాని ఇవ = పనసపండ్లవలె, లలన్తి = ఒప్పారుచున్నవి.

భూమి రాలిన పెక్కుపూల పలురంగులచేత, (రంగులముగ్గులతోనుం బోలె) విచిత్రముగా నేత్రచిత్తాకర్షకముగా ఉన్నది. చెట్లు నిండారిన పూల మొత్తముచే బరువుతో వంగిపోయి యున్నవి. చెట్లతలపై తీఁగల్లుకొనియున్నవి, కోఁతులు వానిం బట్టుకొని వ్రేలాడుచున్నవి. (అవి పెద్దవియై తీఁగలలో చెట్లలో వ్రేలాడుచున్నందున) పనసపండ్లవలె ఉన్నవి. పనసలు చెట్టునంగాచునవి, తీఁగలంగాచునవి కావు. అయినను ఇది శకారభాషితము – విరుద్ధములుగలవి కాఁదగును.

విటః—కాణేలీమాతః, ఇదం శిలాతల మధ్యాస్యతామ్.

శకా—ఏషో ఽ స్మ్యాసితః (ఇతి విటేన స హోపవిశతి) భావ, అద్యాపి తాం వసన్తసేనాం స్మరామి. దుర్జనవచన మివ హృదయా న్నాపసరతి, [ఏశే మ్హి ఆశిదే. భావే అజ్జ వి తం వశన్త శేణిఅం శుమ రామి. దుజ్జణవఅణం విఅ హడక్కాదో ణ ఓశలది].

విటః—(స్వగతమ్) తథా నిరస్తో ఽపి స్మరతి తామ్. అథవా

శ్లో. స్త్రీభి ర్విమానితానాం కాపురుషాణాం వివర్ధతే మదనః
సత్పురుషస్య స ఏవ తు భవతి మృదు, ర్నైవ వా భవతి. ౯

---

ఇదం శిలాతలం; అధ్యాస్యతామ్ - ఇదిగో రాతిపలక (రాతిపకమీఁద) కూర్చుండుము ... = భావ, ఇప్పుడును, ఆ వసంతసేననే స్మరింతునయ్యా. దుష్టునిమాటవలె - ఒకసారి విని మనసునం జొచ్చినది యెట్లో అట్లు - హృదయాత్ ... = చిత్తమునుండి తొలఁగిపోలేదు - మఱపునకు రాలేదయ్యా. తథా నిరస్తః అపి - అట్లు తిరస్కరింపఁబడిన వాఁడయ్యు - 'అపేహి, అనార్యం మన్యే' యని; గుణః ఖలు అనురాగస్య కారణమ్ - న బలాత్కారః' - ఇట్లిల్ల చీ - పోవయ్యా అని అనఁబడిన వాఁడయ్యు, అట్లే నగ ధనముతోడి బండి మరలఁ గొట్టఁబడినవాఁడయ్యు, తాంస్మరతి = ఆమెను తలఁచుచున్నాఁడు. అథవా - అది యట్లే అగును లే.

శ్లో. ౯. స్త్రీభిః = స్త్రీలచే, విమానితానాం = అవమానింపఁబడిన. కాపురుషాణాం = నీచులగు - నీచస్వభావముగల - పురుషులకు, మదనః = కాముఁడు - కామము అనుట, వివర్ధతే = వృద్ధిపొందును - ఎక్కువ వయగును. సత్పురుషస్య తు = సజ్జనునికి, అన్ననో, స ఏవ = అతఁడే - అదియే, మృదుః = మెత్తనివాఁడుగా తగ్గిపోయినవాఁడు మెత్తపడినదిగా, కాని న ఏవ వా = (అసలు) లేనివాఁడే - లేక పోయినదే కాని, భవతి = అగును.

నీచునికి, తన రాగమును స్త్రీ తిరస్కరించినట్లైన, అది మఱింత గాఢమగును. గర్దభి కాలితన్నిన గర్దభమునకు కామము రేగును, ఉత్కటమగు నఁట. సజ్జనునికి తగ్గిపోవును, కాదా లేకయే పోవును,

శకా—భావ, కాపి వేలా స్థావరకచేటస్య భణితస్య 'ప్రవహణం గృహీత్వా లఘు లఘ్వాగచ్ఛ' ఇతి. అద్యాపి నాగచ్ఛతీతి చిర మస్మి బుభుక్షితః. మధ్యాహ్నే న శక్యతే పాదాభ్యాం గన్తుమ్. తత్పశ్య పశ్య.

శ్లో. నభోమధ్యగతః సూర్యో దుఃప్రేక్ష్యః కుపితవానరసదృశః
భూమి ర్దృఢసంతప్తా హతపుత్రశ తేవ గాన్ధారీ. ౧౦

[ భావే, కావి వేలా థావలకచేడశ్శ భణిదశ్శ 'పవహణం గేణ్హిఅ లహుం లహుం ఆఅచ్ఛ' త్తి. అజ్జవి ణ ఆఅచ్ఛది త్తి చిలమ్హిబుభుక్ఖిదే. మజ్ఝణ్హే ణ శక్కీఅది పాదేహిం గన్తుమ్ తా పేక్ఖ పేక్ఖ,

ణహామజ్ఝగదే శూలే దుప్పేక్ఖే కువిదవాణలశలిచ్ఛే
భూమీ దఢశంతత్తా దహాపుత్తశదే వ్వ గన్ధాలీ ].

---

కా అపి వేళా = ఎంతసేపో కాలము, లఘు లఘు - త్వరగా త్వరగా అని నేను రెట్టించి చెప్పితిని. అద్య అపి ... = ఇప్పటి కింకను రాకున్నాఁడు. ఇతి అన్నమాట. చిరం అస్మి బుభుక్షితః = చాలసేపటినుండి ఆఁకలిగొని యున్నాను, మధ్యాహ్నే ... = మధ్యాహ్నమందు - ఇప్పుడు మధ్యాహ్నము ఐనది యనుట. అట్టి యిప్పుడు - న శక్యతే ... = శక్యము గాదు పాదాలతో (= నడిచి) పోవుటకు, తత్ పశ్య ... = కావున చూడు చూడు.

శ్లో. ౧౦. నభోమధ్యగతః సూర్యః = మింటినడిమికి చేరినాఁడు సూర్యుఁడు: దుష్ప్రేక్షః - చూడరాక - మిఱుమిట్లుగొల్పి త్రోయుచు - ఉన్నాఁడు. కుపిత వానర సదృశః - కోపించిన కోఁతివలె ఉన్నాఁడు - కోపాన కోతి పండ్లన్నియు అగపడునట్లు నోరు తెఱచి యుంటిమి భయపెట్టును - చూచు కన్నులను - జనులు - తొలఁగునట్లు చేయును. భూమిః = నేల, హతపుత్రశతా గాన్ధారీ ఇవ = నూర్గురుకొడుకులును చంపఁబడి పోయిన గాంధారివలె - నూర్గురు పుత్త్రుల యొక్క మ్మడి నాశమున అమ్మకు ఎంత "సంతాపము" దుఃఖము కలుగును !- (అంత ఓర్వరాని) వేఁడి కలిగియున్నది.

విటః — ఏవ మేతత్

శ్లో. ఛాయాసు ప్రతిముక్తశష్పకబలం
నిద్రాయతే గోకులం,
తృష్ణార్తైశ్చ నిపీయతే వనమృగై
రుష్ణం పయః సారసమ్,
సంతాపా దతిశఙ్కితై ర్న నగరీ
మార్గో నరైః సేవ్యతే
తప్తాం భూమి మపాస్య చ ప్రవహణం
మన్యే క్వచి త్సంస్థితమ్. ౧౧

---

ఇపుడు ఈయెండలో నేలమీఁద అడుగుపెట్టనే శక్యముగాదు. ఏవ మేతత్ - ఇట్లే ఇది - నీవు చెప్పినది సరియే, ఇది వేసంగి.

శ్లో. ౧౧. గోకులం = గోవుల - ఆవులయు ఎడ్లయు గుంపు - మంద, ఛాయాసు = నీడలలో - (చెట్లక్రింద), ప్రతిముక్త శష్ప కబలం = జాఱవిడువఁబడిన - కాదా - మరల (నెమరువేయుటకై) నోటికి తెచ్చుకొనఁబడిన లేత పచ్చిక కడులు గలదిగా - అనఁగా అట్లు తెచ్చుకొని నెమరువేయుచు - అనుట, నిద్రాయతే - తూఁగాడుచున్నవి. తృష్ణార్తైః = దప్పిచే పీడింపఁబడినవైన, వనమృగైః చ = తోఁటలోని జింకలచేతను, సారసం = జలాశయములోనున్న, ఉష్ణం పయః = వేఁడినీరు, నిపీయతే = త్రాఁగఁబడుచున్నది. సన్తాపాత్ = వేడివలన, అతిశఙ్కితైః = ఎంతయు భయపడిన, నరైః = జనులచేత, నగరీమార్గః = నగరములోనికి పోవు దారి, న సేవ్యతే = ఆశ్రయింపఁబడుట లేదు, (పట్టఁ = త్రొక్కఁ = బడుట లేదు - ఊరికి పోవు వీథిలో ఎవరు నడచుటలేదు. (కావున) మన్యే = తలంతును - ఏమని యనఁగా - తప్తాం భూమిం అపాస్య = కాలిపోయిన నేలను తొలఁగి (నీడలో రవంత సేపు) ప్రవహణం చ = (నా) బండియు, క్వచిత్ సంస్థితమ్ = ఎక్కడనో నిలిచినది.

గోవులు మృగములు సయితమును నీడను ఆశ్రయించి తాపము తీర్చుకొనుచున్నవి. మనుష్యప్రాణి బయట వీథిలో అగపడుటలేదు. కావున బండి ఎక్కడనైనను ఒక చెట్టునీడను ఆశ్రయించి నిలఁబడియుండునని తలంచెదను.

శకా—భావ [ భావే ]

శ్లో. శిరసి మమ నిలీనో భావ సూర్యస్య పాదః
శకుని ఖగ విహఙ్గా వృక్షశాఖాసు లీనాః
నరపురుషమనుష్యా ఉష్ణదీర్ఘం శ్వసన్తో
గృహశరణనిషణ్ణా ఆతపం నిర్వహన్తి. ౧౨

[ శిలశి మమ ణిలీణే భావ శుజ్జశ్శ పాదే
శఉణి ఖగ విహఙ్గా లుక్ఖశాహాశు లీణా
ణలపులిశమణుశ్శా ఉణ్హాదీహం శశన్తా
ఘలశలణ ణిశణ్ణా ఆదవం ణివ్వహన్తి ].

భావ, అద్యాపి స చేటో నాగచ్ఛతి. ఆత్మనో వినోదననిమిత్తం కి మపి గాస్యామి. (ఇతి గాయతి) భావ, భావ, శ్రుతం త్వయా

---

శ్లో. ౧౨. భావ = భావా, మమ శిరసి = నాతల మీఁద, సూర్యస్య పాదః = సూర్యుని కిరణ (పాద)ము(లు) నిలీనః = చక్కగా దూఱి దాఁగుకొన్నది, శకుని ఖగ విహఙ్గాః = పక్షులు - ఇది శకారసులభభాషిత పునరుక్తులు, వృక్షశాఖాసు = చెట్లకొమ్మలయందు, లీనాః = లయించినవి - దూఱి దాఁగినవి. నరపురుషమనుష్యాః = మానుసులు - మరల అట్టిదే శకారపునరుక్తి - ఉష్ణదీర్ఘం = తాపమునకు కడు దీర్ఘముగా, శ్వసన్తః = నిట్టూర్చుచున్నవారై; గృహ శరణ నిషణ్ణాః - (గృహ-శరణ - మరులపునరుక్తి) ఇండ్లలో కూరుచున్నవారై, ఆతపం = ఎండను, నిర్వహన్తి = పుచ్చుచున్నారు, గడపుచున్నారు.

తోఁటలో తలమఱుఁగు లేనందున సూర్యుఁడు మాడు మాడ్చుచున్నాఁడు - ఎండ అంటుకొని పోయినది. చెట్లుకొమ్మలలో కిరణాలు దూఱి దాఁగినవి - ఆకులు రవంత తల వ్రేలవేసి యున్నవి - నీవు నేను మఱియందఱును పెద్ద వేఁడి నిట్టూర్పులు పుచ్చుచున్నాము. జనులు ఇండ్లలోపల కూర్చుండి ఎండవేళను ఎట్లో దాఁటుచున్నారు.

ఆత్మనః వినోదననిమిత్తం కిం అపి గాస్యామి - నాకై వినోదమునకై ఏమైన పాడుదును. అని పాడుచున్నాఁడు - ఏమిపాటయో కవి పాటను తా రచింపఁడయ్యె. న్యాయ్యముగా రచించియుండఁదగును - ఇట్లు ఏదియో పాడును అని అని

యస్మయా గీతమ్. [ భావే, అజ్జ వి శే చేడే ణా ఆఅచ్చది. అత్తణో విణోదణణిమిత్తం కింపి గాఇశ్శమ్. భావే భావే, శుదం తుఏ జం మఏ గాఇదమ్ ].

విటః—కి ముచ్యతే. గన్ధర్వో భవాన్.

శకా—కథం గన్ధర్వో న భవిష్యామి. [ కథం గన్ధవ్వే ణ భవిశ్శమ్ ]

శ్లో. హిఙ్గూజ్జ్వలా జీరకభద్రముస్తా
వచాయా గ్రన్థిః సగుడా చ శుణ్ఠీ
ఏషా మయా సేవితా గన్ధయుక్తిః
కథం నాహం మధురస్వర ఇతి. ౧౩

---

దీర్ఘముగా వదలరాదు. ఐనను మాటలు చేర్పని వట్టి రాగాలాపన యగునేమో? అట్లే యుండును, మాటలపాట యేని కవి రచింపవలయును. శకారసదృశముగా. ఈకాలపు తెలుఁగునాటకాలలో నారదుఁడును కబీరును తాన్సేనును పాడుదురు అని చెప్పి - పాట వ్రాయకుందురే అట్లున్నది. కవి హృదయము ఆలాపనమాత్రము కానోపును - గొంతు బాగు తెలియుటకు.

భావ ... = భావ నాపాట? చెప్పవలెనా = ఏమి చెప్పాదును? గంధర్వుఁడవు - దేవగాయకుఁడవు - నీవు. విటుఁడు వానికి వినోదము గూర్పవలసిన వాఁడు - కావున అనుసరించి పలుకుచున్నను - సమయము వచ్చినపుడు అక్కఱ గలిగినపుడు గట్టిగా మందలింపను నేచుగాను. అనుసరణయు సమయాన హేళన గర్భముగా నుండును. అట్లే యిపు డిది - గంధర్వుఁ డనుట. కథం గన్ధర్వః న భవిష్యామి_నేను ... ఎట్లు కాకపోవుదును. వాఁడుమూర్ఖు, నిజమనుకొనును.

శ్లో. ౧౩. నాగొంతు నాతిండిచే ఎంత చికిలీయగుననుకొన్నావు! ఏషా గన్ధయుక్తిః = ఈవాసనద్రవ్యాల యోగము - మందు కూర్పు, మయా సేవితా = నాచే త్రాఁగఁబడినది. అందు ఏమేమి ఉన్న దనఁగా, హింగు ఉజ్జ్వలా = ఇంగువ వాసన బాగుగా గొట్టుచున్న - అనఁగా దానితో కూడిన, జీరక భద్రముస్తా = జీలకఱయు నాగముస్తెయును, వచాయాగ్రన్థిః = వసయొక్క గణుపు, సగుడా = బెల్లముతోకూడిన, శుణ్ఠీ = సొంటియు. (కావున) అహం = నేను, కథం ఇతి న మధురస్వరః = ఎట్లని, ఇంపైన గొంతుపలుకువాఁడఁ గాకపోవుదును?

[ హిఙ్గుజ్జలే జీలకభద్ధముత్తే
వచాహూ గణ్ఠీ శగుడా అ శుణ్ఠీ
ఏశే మఏ శేవిద గన్ధజుత్తీ
కథం ణ హాగ్గే మధులశ్శలే త్తి ].

భావ, పున రపి తావ ద్గాస్యామి. (తథా కరోతి) భావ, భావ శ్రుతం త్వయా య న్మయా గీతమ్. [భావే, పుణోవిదావ గాఇశ్శమ్. భావే భావే, శుదం తుఏ జం మఏ గాఇదమ్].

విటః—కి ముచ్యతే, గన్ధర్వో భవాన్.

శకా—కథం గన్ధర్వో న భవామి. [కధం గన్ధవ్వే ణ భవామి].

శ్లో. హిఙ్గూజ్జ్వలం దత్తమరీచచూర్ణం
వ్యాఘారితం తైలఘృతేన మిశ్రమ్
భుక్తం మయా పారభృతీయమాంసం
కథం నాహం మధురస్వర ఇతి. ౧౪

[ హిఙ్గుజ్జలే దిణ్ణమరీచచుణ్ణే
వగ్ఘాలిదే తేల్లఘుఏణమిశ్శే
భుత్తే మఏ పాలహుదీఅమంశే
కథం ణ హాగ్గే మధులశ్శలే త్తి ].

ఇంగువతోడి జీలకఱ్ఱయు నాగముస్తెయు వస, బెల్లముతోడి సొంటి-ఇవన్నియు గొంతుమీఁద పనిచేయునవి - కఫహారములే - స్వర శోధక వర్ధకములే - శకారునికి వీనిం గూర్చిన వినుకలి యుండును. కావున ఇంట వాడుటయు.

శ్లో. ౧౪. మయా పారభృతీయ మాంసం భుక్తం = నాచేత కోకిలల మాంసము తినఁబడినది - అదెట్టిదనఁగా - హిఙ్గూజ్జ్వలం = ఇంగువ(వాసన) పైకి ప్రకాశించుచున్నదియు, దత్తమరీచ చూర్ణం = మిరియపుం బొడుము వేసినదియు, వ్యాఘారితం = నేయి పోయఁబడినది. తైలఘృతేన మిశ్రం - మరల ఆమాటయే, శకారభాషిత పునరుక్తి.

భావ, అద్యాపి చేటో నాగచ్ఛతి. [భావే అజ్జ వి చేడే ణాఅచ్ఛది].

విటః—స్వస్థో భవతు భవాన్ సంప్రత్యే వాగమిష్యతి.

(తతః ప్రవిశతి ప్రవహణాధిరూఢా వసన్తసేనా చేటశ్చ)

చేటః—భీతః ఖల్వహమ్. మాధ్యాహ్నికః సూర్యః. మేదానీం కుపితో రాజశ్యాలసంస్థానకో భవిష్యతి. తత్త్వరితం వహామి, యాతం గావౌ, యాతమ్. [భీదే క్ఖు హగ్గె. మజ్ఝణ్హికే శుజ్జే. మా దాణిం కువిదే లాఅశాలశంఠాణే హువిశ్శది. తా తులిదం వహామి. జాధ గోణా జాధ].

వసన్త—హా ధిక్, హా ధిక్, న ఖలు వర్ధమానకస్యాయం స్వరసంయోగః. కిం న్విదమ్? కిం ను ఖల్వార్యచారుదత్తేన వాహన

---

కథం ఇతి న అహం మధురస్వరః = ఎట్లని నేను తియ్యని యింపైన గొంతువాఁడఁగాక పోవుదును? వట్టి కోయిల మాంసము తిన్ననే కోయిలగొంతు రాదా? మఱి నేను అందు గొంతున శ్లేష్మహారముగా స్వరశక్తివర్ధకముగా ఇంగువ, మిరియపుంబొడుము, నేతితాలింపును పెట్టించితిని. కోయిలకు తియ్యని పంచమస్వరము కాని దాని మాంసము అది కలిగించునా? అది యీ మూర్ఖుని యూహ కాఁబోలు,

స్వస్థః - భవతు - నెమ్మదిగా నుండువుగాక ... = ఇప్పుడే రాఁగలఁడు. అంతట బండిలో వసంతసేనయు, తోలుచు చేటుఁడును ప్రవేశింతురు - భీతః ఖలు అహం = నేను భయపడితినికదా. మాధ్యాహ్నికః సూర్యః = మధ్యాహ్నపు సూర్యుఁడు - అయినాఁడు - మింటినడిమికి వచ్చినాఁడు. న ఇదానీం కుపితో ... = ఇపుడు రాజశ్యాల సంస్థానకుఁడు కుపితుఁడు కాఁడా? తత్ త్వరితం వహామి = కావున త్వరగా తోలెదను. చో చో - డిర్ డిర్ - ఎద్దులూ!

హాధిక్ - అయ్యో ఇసీ. న ఖలు ... = స్వరసంయోగః - ఈగొంతు పలుకు సవ్వడి వర్ధమానకునిది కాదే. కిం ను ఇదమ్ = ఇదేమిటి? కిం ను ఖలు ఆర్య

పరిశ్రమం పరిహారతా న్యో మనుష్యో உన్య త్ప్రవహణం ప్రేషితం భవిష్యతి. స్ఫురతి దక్షిణం లోచనమ్. వేపతే మే హృదయమ్. శూన్యా దిశః. సర్వ మేవ విసంష్ఠులం పశ్యామి. [హద్దీ హద్దీ. ణ క్ఖు వడ్ఢమాణఅస్స అఅం సరసంజోఓ. కిం ణేదమ్. కిం ణు క్ఖు అజ్జ చారుదత్తేణ వాహణపడిస్సమం పరిహరన్తేణ అణ్ణో మణుస్సో అణ్ణం పవహణం పేసిదం భవిస్సది. ఫురది దాహిణం లోఅణమ్. వేవది మే హిఅఅమ్. సుణ్ణాఓ దిసాఓ. సవ్వం జ్జేవ విసంఠులం పేక్ఖామి].

శకా—(నేమిఘోష మాకర్ణ్య) భావ భావ, ఆగతం ప్రవహణమ్. [భావే, భావే, ఆగదే పవహణే].

విటః—కథం జానాసి?

శకా—కిం న పశ్యతి భావః. వృద్ధశూకర ఇవ ఘురఘురాయమాణం లక్ష్యతే. [కిం ణ పేక్ఖది భావే. బుడ్ఢశూఅలే విఅ ఘులఘులాఅమాణే లక్ఖీఅదీ].

విటః—(దృష్ట్వా) సాధు లక్షితమ్. అయ మాగతః.

శకా—పుత్రక స్థావరక చేట, ఆగతో உసి. [పుత్తకా థావలకా చేడా, ఆగదే శి].

---

చారుదత్తేన ... = చారుదత్తుని చేత ఎడ్లకు – ఒకసారి నడచివచ్చినవి మరల నడచిన చాల అలసిపోవును అని దానిని (పరిహారతా=) మాన్పువాఁడై వేఱు మానిసియు వేఱు బండియు పంపఁబడి యుండునా? స్ఫురతి ... = (నా) కుడి కన్ను అదరుచున్నది – అవశకునము. మే హృదయం వేపతే – నాగుండె అదరుచున్నది. శూన్యా దిశః–దిక్కులు శూన్యములు (గా ఐనవి.) సర్వం ఏవ విసంష్ఠులం పశ్యామి – అంతయు ఎగుడుదిగుడుగా – విపరీతముగా – నాకు తోఁచుచున్నది.

నేమిఘోషం = చక్రాల యంచుల చుట్టు కమ్మి – పట్టాతోడిది – దాని మ్రోఁత – కథం జానాసి = ఎట్లు ఎఱుంగుదువు? వృద్ధ సూకర ఇవ ఘురఘురాయమాణః = ముసలి పంది వలె ఘురఘురయనుచు వినఁబడుచుండలేదా?

చేటః—అథ కిమ్. [అధ ఇం].

శకా—ప్రవహణ మప్యాగతమ్. [పవహణే వి ఆగదే].

చేటః—అథ కిమ్. [అధ ఇం].

శకా—గావావై ప్యాగతా. [గోణా వి ఆగదే].

చేటః—అథ కిమ్. [అధ ఇం].

శకా—త్వ మప్యాగతః. [తుమం పి ఆగదే].

చేటః—(సహాసమ్) భట్టారక, అహ మప్యాగతః. [భట్టకే, అహం పి ఆగదే].

శకా—త ప్ప్రివేశయ ప్రవహణమ్. [తా పవేశేహి పవహణమ్].

చేటః—కతరేణ మార్గేణ? [కదలేణ మగ్గేణ].

శకా—ఏతే నైవ ప్రాకారఖణ్డేన, [ఏదేణ జ్జేవ పగాల ఖణ్డేణ].

చేటః—భట్టారక, వృషభా మ్రియేతే. ప్రవహణ మపి భజ్యతే. అహ మపి చేటో మ్రియే. [భట్టకే, గోణా మలేన్తి. పవహణే విభజ్జేది. హగ్గె వి చేడే మలామి].

---

(శబ్దము వినఁబడుటను శకారుఁడు అగపడుటగా చెప్పును,)–పుత్రక–మొదలైనవి బండి తెచ్చినందులకై చేటునికి సంతోషపు సంబోధనలు. ప్రవేశయ ప్రవహణం ... = బండిని లోపలికి రానీ. కతరేణ మార్గేణ = ఏదారి గుండా? ఏతే నైవ ప్రాకారఖణ్డేన = ఈ ప్రాకారపు తునుకమీఁదుగా, అట్లు ప్రాకారపు తునుక, ఎత్తుగా నుండునదే–దాని మీఁదుగా వచ్చిన–వృషభౌ మ్రియేతే ... = ఎద్దు చచ్చును, బండియును విఱిగిపోవును, నేను చేటుఁడను చత్తును.

శకా—అరే రాజశ్యాలకో ఽహమ్. వృషభౌ మృతౌ, అపరౌ క్రేష్యామి, ప్రవహణం భగ్నమ్ అపరం కారయిష్యామి, త్వం మృతః అన్యః ప్రవహణవాహకో భవిష్యతి. [ అలే, లాఅశాలకే హగ్గె గోణా మలే అవలే కీణిశ్శమ్. పవహణే భగ్గే అవలం ఘాఢఇశ్శమ్. తుమం మలే, అణే పవహణవాహకే హువిశ్శది ].

చేటః—సర్వం ఉపపన్నం భవిష్యతి, అహ మాత్మీయో న భవిష్యామి. [ శవ్వం ఉవవణ్ణం హువిశ్శది. హగే అత్తణకేలకే ణ హువిశ్శమ్ ].

శకా—అరే, సర్వ మపి నశ్యతు. ప్రాకారఖణ్డేన ప్రవేశయ ప్రవహణమ్. [ అలే, శవ్వం పి ణశ్శదు. పాగాల ఖణ్డేణ పవేశేహి పవహణమ్ ].

చేటః—విభజ్య రే ప్రవహణ, సమం స్వామినా విభజ్య; అన్య త్ప్రవహణం భవతు. భట్టారకం గత్వా నివేదయామి. (ప్రవిశ్య) కథం న భగ్నమ్. భట్టారక, ఏత దుపస్థితం ప్రవహణమ్. [ విభజ్జ లే పవహణ, శమం శామిణా విభజ్జ. అణ్ణే పవహణే భోదు. భట్టకే గదుఅ ణివేదేమి. కథం ణ భగ్గె. భట్టకే, ఏశే ఉవత్థిదే పవహణే ].

---

అరే రాజశ్యాలకః అహమ్ ... = ఓరి నేను రాజుగారి మఱఁదినిరా (ఏమను కొన్నావో!) అన్ని చచ్చిన, అన్నియు కొత్తవి కొందును - నీకు బదులు మఱొక చేటుని పెట్టుకొందును. సర్వం ఉపపన్నం భవిష్యతి - (నీకు) అన్నియు దొరకును. (కాని) 'నేను నావాఁడను నాకు లేకపోవుదును.' వే. వేం.

అరే సర్వం అపి నశ్యతు - అంతయు నాశనమై పోనీ - ప్రాకారపు తునుక మీఁదుగానే బండిని ప్రవేశపెట్టుము. విభజ్యస్వ రే ప్రవహణ - విఱుగరా ఓరి బండీ! స్వామితో - ఒడయనితో - కూడ విఱుగరా, అన్యత్ ప్రవహణం భవతు - (ఇది విఱిగిపోయిన) మఱియొక బండి అగునుగాక. భట్టారకం గత్వా నివేదయామి = దొరవద్దకు పోయి నివేదించెదను. ప్రవిశ్య - (అట్లే) ప్రవేశించి, కథం! న భగ్నమ్ = ఏమీ! ఎట్టూ! విఱుగలేదే దొరా, ఇదిగో బండి దగ్గఱ వచ్చినది.

శకా—న ఛిన్నౌ వృషభౌ. న మృతా రజ్జవః. త్వమపి న మృతః. [ణ ఛిణ్ణా గోణా, ణ మలా లజ్జ. తుమం పి ణ మలే].

చేటః—అథ కిమ్. [అథ ఇం].

శకా—భావ, ఆగచ్ఛ. ప్రవహణం పశ్యావః. భావ, త్వమపి మమ గురుః, పరమగురుః ప్రేక్ష్యసే సాదరకో ఽభ్యన్తరక ఇతి పురస్కరణీయ ఇతి త్వం తావ త్ప్రవహణ మగ్రతో ఽధిరోహ. [భావ, ఆఅచ్ఛ, పవహణం పేక్ఖామో, భావే, తుమం పి మే గులు, పలమగులు. పేక్ఖీఅశి శాదలకే అబ్భన్తలకేత్తి పులక్కలణ్ణీవత్తి తుమం దావ పవహణం అగ్గదో అహిలుహ].

విటః—ఏవం భవతు. [ఇ త్యారోహతి].

శకా—అథవా తిష్ఠ త్వమ్. తవ పితృసంబన్ధి ప్రవహణమ్, యేన త్వ మగ్రతో ఽధిరోహసి? అహం ప్రవహణస్వామీ, అగ్రతః ప్రవహణ మధిరోహామి. [అధవా చిష్ట తుహ. తుహ బప్పకేలకే పవహణే, జేణ తుమం అగ్గదో అహిలుహశి. హగ్గే పవహణశామీ, అగ్గదో పవహణం అహిలుహామి].

న ఛిన్నౌ వృషభౌ న మృతా రజ్జవః - ఎడ్లు చావలేదు త్రాళ్లు తెగలేదు! శకారుని విపర్యస్త భాషితము - ఎడ్లు తెగలేదా, త్రాళ్లుచావలేదా - అనుట.

భావ ఆగచ్ఛ ...=భావ-రా, బండిని చూతము. ...=నీవు నాకు గురువవు, పరమగురువవు; అభ్యన్తరకః = (రాజునకు) అంతరంగికుఁడైనవాఁడు, పురస్కరణీయః = గౌరవింపఁదగినవాఁడు - ఇతి అని - నాగొప్పతనమును ఎంచి, సాదరకః = ఎంతయు ఆదరముకలవాఁడవై, ప్రేక్షసే = చూతువు. (కావున), త్వం తావత్ = నీవే, ప్రవహణం=బండిని, అగ్రతః అధిరోహ=ముందుగా ఎక్కు. ఏవం భవతు-ఇటే కానీ - అని ఎక్కను, అథవా - వలదులే - ఇంతలో దానిని - వాఁడు ముందు ఎక్కుటను - ఓర్వలేక అనుచున్నాఁడు. తిష్ఠ = ఉండులే, త్వం = నీవు. తవ పితృసమ్బన్ధి ప్రవహణమ్ - నీ యబ్బదిగన బండి! యేన = దేన = దాన, త్వం

విటః—భవా నేవం బ్రవీతి.

శకా—యద్యప్యహ మేవం భణామి, తథాపి త వైష ఆచారః 'అధిరోహ భట్టారక' ఇతి భణితుమ్. [జఇ వి హగ్గే ఎవ్వం భణామి, తధా వి తుహ ఏశే ఆగలే 'అహిలుహ భశ్టకే' త్తి భణిదుమ్].

విటః—ఆరోహతు భవాౝ.

శకా—ఏష సాంప్రత మధిరోహామి. పుత్రక స్థావరక చేట, పరివర్తయ ప్రవహణమ్. [ఏశే శంపదం అహిలుహామి. పుత్తకా థావలకా చేడా, పలివత్తావేహి పవహణమ్].

చేటః—(పరావృత్య) అధిరోహతు భట్టారకః.

శకా—(అధిరు హ్యావలోక్య చ శఙ్కాం నాటయిత్వా త్వరిత మవతీర్య విటం కణ్ఠే ఽవలమ్బ్య) భావ భావ, మృతో ఽసి, మృతో ఽసి; ప్రవహణాధిరూఢా రాక్షసీ చోరో వా ప్రతివసతి.

అగ్రతః ... = అహం ప్రవహణ స్వామీ ... = నేను బండి సొంతగాఁడను ... నేను ముందు బండి ఎక్కఁదను. యద్యపి అహం ఏవ భణామి – నేనే ముందు ఎక్కు – అని చెప్పినను గూడ, తథాపి = అట్లైనను, తవ ఏవ ఆచారః – నీకే ఆచారము – అనఁగా నన్నే ఎక్కుమనవలసినది, అట్లు ఉపచారము గౌరవము చూపవలసినది – 'అధిరోహ భట్టారక – ఎక్కువయ్యా, దొర –' అని చెప్పుటకు = అట్లు చెప్పి గౌఁరవింపవలసినది, సరి. ఆరోహతు భవాౝ = ఎక్కుదువుగాక – నీవు, సాంప్రతం = ఇప్పుడు – పరివర్తయ = త్రిప్పు.

శఙ్కాం = భయమును – నాటయిత్వా = అభినయించి – అని వేసగానికి ఎచ్చరిక. విటం కణ్ఠే అవలమ్బ్య = విటుని మెడం బట్టుకొని, భావ ... = మృతః అసి ... = భావ భావ చచ్చితివి – చచ్చితివి – బండిలో ఎవఁడో రాక్షసియో దొంగయో ఉన్నాఁడు. రాక్షసియైన మనమిరువురమును దొంగిలింపఁబడినవార మే – దొంగయైన ఇరువురము తినివేయఁబడినవార మే! – శకారుని విపర్యస్త భాషితము –

తద్యది రాక్షసీ, త దోభావపి ముషితౌ. అథ చౌరః త దోభావపి ఖాదితౌ. [ భావే భావే, మలేశి, మలేశి; పవహణాధిలూఢా లక్ఖశీ చోలేవా పడివశది. తా జఇ లక్ఖశీ, తదో ఉభే వి మూశే. అథ చోలే తదో ఉభే వి ఖజ్జే ].

విటః—న భేతవ్యమ్. కుతో ఽత్ర వృషభయానే రాక్షస్యాః సంచారః. మా నామ తే మధ్యాహ్నార్క తాపచ్ఛిన్నదృష్టేః స్థావరకస్య సకఞ్చుకాం ఛాయాం దృష్ట్వా భ్రాన్తి రుత్పన్నా.

శకారః—పుత్రక స్థావరక చేట, జీవసి. [ పుత్తకా థావలకా చేడా, జీవేశి ].

చేటః—అథ కిమ్. [ అథ ఇం ].

శకారః—భావ, ప్రవహణాధిరూఢా స్త్రీ ప్రతివసతి. త దవలోకయ. [ భావే, పవహణాధిలూఢా ఇత్థిఆ పడివశది. తా అవలోఏహి ].

విటః—కథం స్త్రీ

శ్లో. అవనతశిరసః ప్రయామ శీఘ్రం
పథివృషభా ఇవ వర్ష తాడితాక్షాః

---

ముషితఖాదితములను ఇటు అటు చెప్పుట - దీనికి దానిని, దానికి దీనిని - చెప్పుట. న భేతవ్యం = భయపడవలదు. ఎడ్ల బండిలో రాక్షసికి ఎక్కడి సంచారము? మధ్యాహ్న అర్క తాప చ్ఛిన్నదృష్టేః = మట్ట మధ్యాహ్నపు సూర్యుని వేడికి తెగిపోయిన, చీకట్లుకమ్మిన, చూపుగల నీకు (కంచుక =) ఒంటిపై కప్పుతోడి చేటుని నీడను చూచి భ్రాంతి కలిగినది. జీవసి = బ్రదికియున్నావటరా? ... = స్త్రీ బండిలోనికి ఎక్కి ఉన్నది. తత్ అవలోకయ = కావున చూడుము. కథం స్త్రీ = ఎట్టా ఆఁడుదియా!

శ్లో. ౧౫. వర్ష తాడిత అక్షాః = వానచే కొట్టఁబడిన కన్నులుగల, వృషభా ఇవ = ఎడ్లవలె, పథి = దారిలో, శీఘ్రం = వడిగా, అవనత శిరసః = వంచుకొన్న తలగలవాఁడనై, ప్రయామ = పోయెదను. బహువచనమునకు ఉత్తమ

మమ హి సదసి గౌరవప్రియస్య
కులజనదర్శనకాతరం హి చక్షుః. ౧౫

వసన్త—(సవిస్మయ మాత్మగతమ్) కథం మమ నయనయో రాయాసకర ఏవ రాజశ్యాలః. త త్సంశయి తాస్మి మన్దభాగ్యా. ఏత దిదానీం మమ మన్దభాగిన్యా ఊషరక్షేత్రపతిత ఇవ బీజముష్టి ర్నిష్ఫల మి హాగమనం సంవృత్తమ్. త త్కి మత్ర కరిష్యామి. [కథం మమ ణఅణాణం ఆఆసఅరో జ్జేవ రాఅసాలఓ. తా సంస ఇదమ్హి మన్దభాఆ ఏసో దాణిం మమ మన్దభాఇణీఏ ఊసరక్ఖేత్తపడిదో విఅ బీఅముట్టీ ణిప్ఫలో ఇధ ఆగమణో సంవుత్తో. తా కిం ఏత్థ కరఇస్సమ్].

శకా—కాతరః ఖ ల్వేష వృద్ధచేటః ప్రవహణం నావలోకయతి. భావ, ఆలోకయ ప్రవహణమ్. [కాదలే క్ఖు ఏశే బుడ్ఢచేడే, పవహణం ణావలోఏది. భావే, ఆలోఏహి పవహణమ్].

పురుషులో వివక్షచే ఏకవచనము అర్థము, మమ హి = నాకన్ననో, సదసి = సభలో - నలుగురినడుమ, గౌరవప్రియస్య = గౌరవమందు ప్రీతిగలవానికి, చక్షుః = కన్ను, కుల జన దర్శన కాతరం హి = కులస్త్రీని - పరభార్యను - చూచుటకు భయపడునది కదా.

స్త్రీ అనెదవు - ఏకులాంగనయో, ఎవని భార్యయో, ఆమెం జూచుట అగౌరవముం గలిగించును. నాకా పరువుమీఁద ప్రీతి. కావున వాన చినుకులు కండ్లపై బడిన యెడ్లవలె, తలవంచుకొని వడివడిగా నాదారిం బోయెదను.

కథం ! = ఎట్లూ ! మమ నయనయోః ... = నా కన్నులకు పీడకలిగించువాఁడే! అరాజశ్యాలుఁడే! దిగులు కొన్నదాననైతిని, మంద భాగ్యురాలను. అదృష్టహీనురాలనైన నేను ఇక్కడికి వచ్చుట చవుటిపాలాన పడిన విత్తనాల పిడికిలివలె, నిష్ఫలమై పోయినది - [చారుదత్తుం గలసికొందును, క్రీడింతును అని కొండంత ఆసతో వచ్చితిని. అదంతయు - చవుటి నేలం బడ్డ గింజవలె ఐపోయినది. (అత్ర =) ఈసందర్భమున నేను ఏమి చేయుదును ?

కాతరః ఖలు ... = ఈముసలిచేటుఁడు పిఱికి. బండిని చూడఁడు. భావ, చూడవయ్యా బండిని. తప్పేమి ? అట్లే కానీ - (చూచెదను - అనుట.) కథమ్ =

విటః—కో దోషః భవతు. ఏవం తావత్.

శకా—కథమ్ శృగాలా ఉడ్డీయన్తే, వాయసా వ్రజన్తి. త ద్యావ ద్భావా ఽక్షిభ్యాం భక్ష్యతే దన్తైః ప్రేక్ష్యతే. తావ దహం పలాయిష్యే. [కధమ్, శిఆలా ఉడ్డేన్తి వాఆశా వచ్చేన్తి, తా జావ భావే అక్ఖిహిం భక్ఖీఅది, దన్తేహిం పేక్ఖీఅది, తావ హగ్గె పలాఇశ్శమ్].

విటః—(వసన్తసేనాం దృష్ట్వా. సవిషాద మాత్మగతమ్) కథ మయే, మృగీ వ్యాఘ్ర మనుసరతి. భోః కష్టమ్.

శ్లో. శరచ్చన్ద్రప్రతీకాశం పులినాన్తరశాయినమ్
హంసీ హంసం పరిత్యజ్య వాయసం సముపస్థితా.    ౧౬

(జనాన్తికమ్) వసన్తసేనే, న యుక్త మిదమ్, నాపి సదృశ మిదమ్.

ఎట్లూ! నక్కలు ఎగిరిపోవుచున్నవి, కాకులు చూచుచున్నవి - ఇవి శకారుని విపరీతపుమాటలు - ఎగురుటకు చూచుటయు, చూచుటకు ఎగురుటయు! తత్ యావత్ = మఱి భావ, కన్నులతో తినును, పండ్లతో చూచును, ఈలోపల నేను పరారియగుదును. విటుఁడు బండిలో వసంతసేనం జూచి, దుఃఖముతో - తనలో అనుకొనుచున్నాఁడు - కథం = ఎట్లబ్బా! లేడి పులివెంటఁ బడినది! అయ్యో! కష్టా.

శ్లో. ౧౬. శరత్ చన్ద్రప్రతీకాశం = శరత్కాలపు (పున్నమ) చంద్రునికి సాటియైనదియు - అట్లు ప్రకాశించునది అనుట, పులినాన్తరశాయినమ్ = ఇసుక దిబ్బపైన పరున్నదియు నగు, హంసం = (రాజ) హంసను, పరిత్యజ్య = విడిచి, హంసీ = హంసి, వాయసం సముపస్థితా = కాకిని చేరవచ్చినది.

చారుదత్తుని, సకలగుణసంపన్నుని సాటి లేని అందగానిని వదలి వసంతసేన ఈ శకారిగానిని చేరవచ్చినదే - అనుట. రాకాచంద్రునిం బోలిన సైకతాసీన హంసను మాని హంసి (మాల)కాకిని చేరవచ్చిన ట్లున్నది.

జనాన్తికమ్ - రంగాన ఇతరులకు వినఁబడకుండ, వారి చెంతనే ఉన్న చోటనే మూఁడు వ్రేళ్ళు ఎత్తి పట్టిన పతాకచేతిని అడ్డముంచుకొని, ఒకరు ఒకరితో మాట

శ్లో. పూర్వం మానా దవజ్ఞాయ ద్రవ్యార్థే జననీ వశాత్

వసన్త—న. [ ]. (ఇతి శిర శ్చాలయతి.

విటః—

అశౌణ్డీర్యస్వభావేన వేశభావేన మన్యతే. ౧౭

లాడుట జనాంతిక మనఁబడును. ఉన్నచోటు తలఁగి అట్లే మాటలాడిన అది అప వారిత మనఁబడును. ఇక్కడ శకారచేటులకు వినఁబడకుండ విటవసంతసేనలు మాటలాడుకొనుట. వసంతసేన ఇది యుక్తము ( = న్యాయ్యము ) గాదు - సదృశము ( = అనురూపము )గాదు, - అట్టి అనురాగవంతుని - గుణవంతుని అందగానిని తటాలున విడిచి ఈసర్వథా నీచుని, డబ్బున కాసపడి ఇట్లు చేరవచ్చుట ఎంతయు తగదు - అనుట.

శ్లో. ౧౭. పూర్వం = మునుపు, మానాత్ = పరువువలన, అవజ్ఞాయ = తిరస్కరించి,"గుణః ఖలు అనురాగస్య కారణమ్=" అని నీతులు పలికి, ద్రవ్యార్థే = ధనముకొఱకు, జననీవశాత్ = అమ్మకు వశమై అమ్మకారణాన, దానికి సవంతసేన 'న'=కాదు_అని. తల దానిం దెలుపుటకు (ప్రక్కకు) ఆడించును_తలను ప్రక్కకు అడ్డముగా ఆడించుట అనంగీకారమునకును ముందునకు పైకి కిందికి ఆడించుట అంగీ కారమునకును లోకాన సూచనలు. 'న' అని మెల్లఁగా ఒక యక్షరము పలుకుట కంటెను, ఎక్కువ పలుకుట తన పరువుకు తగదు అని_చిత్తము రోఁత పరువు ద్వేష ములతో నిండి పోయినది. వాగారంభము నోర్వదు. అశౌణ్డీర్య స్వభావేన = పరువు మానిన - మాలిన - స్వభావముచేత, వేశభావేన = బోగముదానవుగా - బోగము తనముతో - తలంపఁబడుచున్నదే. (భావేప్రయోగము.) కాదా - కర్మ ణిగా - గౌరవింపఁబడుచున్నాఁడే - వీఁడు - ఈబండిసొంతగాఁడు. అందు ఎక్కి వచ్చితివే. మునుపు ఒక తూఁటి వాఁడు బండియు ధనమును పంపఁగా, అమ్మ వానిని అంగీకరింపుమని చేటిచే మాట పంపఁగా నిరాకరించి, ఇట్లు మఱొకమారు చెప్పిన తాను ప్రాణాలు విడుతునని అమ్మకు చెప్పిపంపినది - అదంతయు భావ, తా శకారుని వాఁడు, ఎఱింగియుండును. 'యది మాం జీవన్తీం ఇచ్ఛసి, తదా ఏవం న పున రహం మాత్రా ఆజ్ఞాపయితవ్యా.' తాను సొంతముగానే తొలియంకమున 'సమ ముపచర' - ఇత్యాది I - 31. పలికినవాఁడు.

న నూక్త మేవ మయా భవతీం ప్రతి - 'సమ ముపచర భద్రే సుప్రియం చాప్రియం చ'.

వసన్త—ప్రవహణవిపర్యాసే నాగతా. శరణాగ తాస్మి. [పవహణవిపజ్జాసేణ ఆగదా. సరణాగదమ్హి].

విటః—న భేతవ్యం, న భేతవ్యమ్. భవతు. ఏనం వఞ్చయామి. (శకార ముపగమ్య) కాణేలీమాతః, సత్యం రాక్షస్యే వాత్ర ప్రతివసతి.

శకా—భావ భావ, యది రాక్షసీ ప్రతివసతి త త్కథం న త్వాం ముష్ణాతి, అథ చౌరః, తదా కిం త్వం న భక్షితః. [భావే భావే, జఇ లక్ఖశీ పడివశది, తా కీశణ తుమం మూశేది. అధ చోలే, తా కిం తుమం ణ భక్ఖిదే].

విటః—కి మనేన నిరూపితేన. యది పున రుద్యానపర మ్పరయా పద్భ్యా మేవ నగరీ ముజ్జయినీం ప్రవిశావః, తదా కో దోషః స్యాత్ ?

---

ప్రవహణ విపర్యయేణ - బండ్ల వ్యత్యాసము - పొరబాటు - ఒకదానికి మఱొకటియైన మాఱుపాటుచేత - శరణాగతా అస్మి - (నిన్ను) శరణుజొచ్చుచున్నాను - కాపాడవలసినది.

న భేతవ్యం - భయపడవలదు, దిగులుపడవలదు - భవతు = కానీ, ఏనం వఞ్చయామి - వీనిని మోసగించెదను. సత్యం రాక్షసీ ఏవ ... = నిజముగా (ఇందు) రాక్షసియే యున్నది. తత్ కథం న త్వాం ముష్ణాతి, అథచౌరః తదా కిం త్వం నభక్షితః = మఱి ఎట్లు - ఏల - నిన్ను దోఁచలేదు, ... = నీవేల తినఁబడలేదు - శకారుని ఒకమాటకు వేఱొకమాటయైన విపరీత భాషితము. కిం అనేన నిరూపితేన - దానిని పరీక్షించి రుజువుచేయుటచేత ఏమి ప్రయోజనము ? పునః - మఱి, యది ఉద్యానపరంపరయా ... = తోఁటల వరుసలోనే - చల్లఁగా కాలు కాలక తలకాలక - పద్భ్యాం - పాదములతోనే - నడచియే - ఉజ్జయినినగరము జొత్తు

శకా—ఏవం కృతే కిం భవతి. [ఏవ్వం కిదే కిం భోది].

విటః—ఏవం కృతే వ్యాయామః సేవితో, ధుర్యాణాం చ పరిశ్రమః పరిహృతో భవతి.

శకా—ఏవం భవతు. స్థావరక చేట, నయ ప్రవహణమ్. అథవా తిష్ఠ తిష్ఠ. దేవతానాం బ్రాహ్మణానాం చాగ్రత శ్చరణేన గచ్ఛామి. నహి నహి. ప్రవహణ మధిరుహ్య గచ్ఛామి, యేన దూరతో మాం ప్రేక్ష్య భణిష్యన్తి - 'ఏష రాష్ట్రియ శ్యాలో భట్టారకో గచ్ఛతి.' [ఏవం భోదు. థావలఆ చేడా, ణేహ పవహణమ్. అథవా చిట్ఠ చిట్ఠ దేవదాణం చ అగ్గదో చలణేణ గచ్ఛామి. ణహి ణహి, పవహణం అహిలుహిఅ గచ్ఛామి. జేణ దూలదో మం పేక్ఖిఅ భణిశ్శన్తి - 'ఏశే శే లట్ఠిఅశాలే భట్టాలకే గచ్ఛది'].

---

మేని, అప్పటికి - దాన - ఏమి తప్పకలుగును? నడిచిపోదము రా. ఏవం కృతే ... = అట్లు చేసిన ఏమగును? - ఎందులకు అది ఉపాయ మగును - అనుట. ఏవం కృతే వ్యాయామః ... = ఇట్లు చేసిన వ్యాయామః - కసరతు, కాళ్ళకు దేహానికి బలముకలిగించు అభ్యాసము - నడచుట ఒంటికి మంచి కసరత్తు - సేవితః - చేయఁబడినది; అగును - తరువాత స్నానభోజనాలకు బాగుగా అనుకూలముగా నుండును; ధుర్యాణాం ... = ఎడ్లకు అలపు తప్పించుట యగును, ఎంతో ఎండలో వచ్చినవి. బరువులేక సులువుగా మెల్లఁగా పోగలవు. కష్టము ఉండదు. ఏవం భవతు - అట్లే అగుగాక - కానిమ్ము, శ్యాలకుఁడు సాటిలేని మూర్ఖుఁడును, అతిచపలచిత్తుఁడును_ఒక మాటమీఁద నిలుచువాఁడు కాఁడు. దేవతానాం బ్రాహ్మణానాం చ ... = దేవతలయు బ్రాహ్మణులయు నెదుర కాలినడకతో పోవుదునా? నహినహి - ఊహూ - వలదు వలదు, ప్రవహణం ... = బండి యెక్కియే పోవుదును. యేన - అనఁగా దాన, దూరతో .. = దూరమునుండియే నన్ను చూచి చెప్పకొందురు - 'వీఁడుగో రాష్ట్రియుఁడు శ్యాలుఁడు దార పోవుచున్నాఁడు - అని,

విటః—(స్వగతమ్) దుష్కరం విష మౌషధీకర్తుమ్. భవతు. ఏవం తావత్. (ప్రకాశమ్) కాణేలీమాతః, ఏషా వసన్తసేనా భవన్త మభిసారయితు మాగతా.

వసన్త—శాన్తం పాపమ్. శాన్తం పాపమ్. [సన్తం పావమ్, సన్తం పావమ్].

శకా—(సహర్షమ్) భావ భావ, మాం ప్రవరపురుషం మనుష్యం వాసుదేవకమ్. [భావే భావే, మం పవలపులిశం మణుశ్శం వాశుదేవకమ్].

విటః—అథ కిమ్.

శకా—తేన హ్యపూర్వా శ్రీః సమాసాదితా. తస్మిన్కాలే మయా రోషితా, సాంప్రతం పాదయోః పతిత్వా ప్రసాదయామి. [తేణ హి అపువ్వా శిలీ శమాశాదిదా. తశ్శిం కాలే మఏ లోశావిదా. శంపదం పాదేశుం పడిఅ పశాదేమి].

విటః—సాధ్వభిహితమ్.

స్వగతమ్ - తనలో అనుకొన్నాఁడు - దుష్కరం విషం ఔషధీకతుఁమ్ - విషమును, (చంపుదానిని) మందుగా - రోగము మాన్పి కాపాడుదానింగా చేయుట, దుష్కరం = అలవిపడదు. భవన్తం అభిసారయితుం - నిన్నుం గూడుటకు వచ్చినది. కాపాడెద నన్నవాఁడు ఈమాట విని యుపాయమని చెప్పినాఁడో భావుఁడు.

శాన్తమ్ పాపం - నేను అభిసరించెద నన్నమాట వినుటవలని పాపము శమించును గాక. మాం ప్రవరపురుషం = నన్ను ఈశ్రేష్ఠపురుషునా? తక్కినమాటలు - మనుష్యం ఇత్యాది శకారునిపునరుక్తులు. తేన హి అపూర్వాశ్రీః ... = అట్లేని. ఎప్పుడు లేని - క్రొత్త - సిరి - సమాసాదితా = పొందఁబడినది. బళి - అనుట. తస్మిన్కాలే ... = ఆసమయమున - మనము వెంట తఱిమితిమే - I. అప్పుడు - మయా రోషితా = నాచేత కోపపడునట్లు చేయఁబడినది. (అందువలన) సాంప్రతం ... = ఇప్పుడు పాదాలలో పడి అలుకతీర్చి ప్రసన్నురాలిం జేసెదను. సాధు

శకా — ఏష పాదయోః పతామి. (ఇతి వసన్తసేనా ముపసృత్య) మాతః, అమ్బికే, శృణు మమ విజ్ఞప్తిమ్. [ఏశే పాదేశుం పడేమి. అత్తికే, అమ్బికే. శుణు మమ విణ్ణత్తిమ్].

శ్లో. ఏష పతామి చరణయో ర్విశాలనేత్రే,
హస్తాఞ్జలిం దశనఖే తవ శుద్ధదన్తి
య త్తవ మ యాపకృతం మదనాతురేణ
త త్క్షామితాసి వరగాత్రి త వాస్మి దాసః. ౧౮

[ఏశే పడామి చలణేశు విశాలణేత్తే
హత్థఞ్జలిం దశణహే తవ శుద్ధదన్తి
జం తం మఏ అవకిదం మదణాతులేణ
తం ఖమ్మిదాశి వలగత్తి తవ మ్హి దాశే].

---

అభిహితమ్ = చక్కఁగా చెప్పితివి. ఏష పాదయోః పతామి - ఇదిగో పాదములలో పడుచున్నాను. అత్తికే - అమ్బికే ... = అమ్మ తల్లి ... = ఇట్లు తనకు భోగ్యగా తలంపఁబడినదాని సంబోధనము - మూర్ఖత - తెలివిలేమి, ఉపసృత్య = తఱిసి.

శ్లో. ౧౮. విశాలనేత్రే = ఓ వెడందకన్నులదానా, ఏషః = ఇదిగో, చరణయోః = పాదాలలో, పతామి = పడెదనే, శుద్ధదన్తి = తెల్లని - తళతళని - దంతములుగలదానా, తవ = నీవు - దశనఖే - (పాదాల) పదిగోళ్ళయందును - హస్తాఞ్జలిం = చేతులు - (పదిగోళ్ళు గలవానిని) మోడ్చుటను, కరోమి - అని శేషము - చేసెదనే. వరగాత్రి - అందమైన - శ్రేష్ఠ - అంగములుగలదానా, మదనాతురేణ మయా = మదనబాధపడుచుండిన నాచేత, తవ = నీకు, యత్ అపకృతం=ఏ అపకారము ...=ఏషా గర్భదాసీ - అనియు, యథా న పరిభ్రశ్యతే తథా కురు - అనియు - ఇట్టిది అపకార ప్రకారము I. అని యిట్లెల్ల - ఏయపకారము చేయఁబడినదో, తత్ క్షామితా అసి = అది మన్నించునట్లు చేయఁబడితివి. దానినెల్ల మన్నింపవే అని అడుగుచున్నాను, తవ దాసః అస్మి = నీకు దాసుఁడను అగుచున్నాను.

నీపాదాలలో పడి మ్రొక్కెదనే - నా తప్పులు మన్నింపవే - నీదాసుఁడను.

వసన్త—(సక్రోధమ్) అపేహి. అనార్యం మన్త్రయసి. [అవేహి. అణజ్జం మన్తేసి]. (ఇతి పాదేన తాడయతి.

శకా—(సక్రోధమ్)

శ్లో. యచ్చుమ్బిత మమ్బికా మాతృకాభిగతం
న దేవానా మపి య త్ప్రమాణమ్
తత్పాతితం పాదతలేన ముణ్డం
వనే శృగాలేన యథా మృతాఙ్గమ్. ౧౯

[జే చుమ్బిదే అమ్బిక మాదుకేహింగదే
ణ దేవాణం వి జే పణామమ్
శే పాడిదే పాదతలేణ ముణ్డే
వణే శిఆలేణ జధా ముదఙ్గే]

---

అపేహి = పొమ్ము అవలికి, అనార్యం = మర్యాదకాని తప్పుడు మాటలు పలుకుచున్నావు. అని కోపముతో పలికి - పాదేన తాడయతి - కాలితో తన్నుచున్నది. సక్రోధమ్ - దానికి శకారునికి కోపము వచ్చినది - కోపముతో చెప్పుచున్నాఁడు.

శ్లో. ౧౯. అమ్బికా మాతృకాభిః - బహువచనము శకారభాషితపు మామూలు తప్పు: పునరుక్తియు, (నా) తల్లిచేత, యత్ = ఏది, చుమ్బితమ్ = ముద్దుగొనఁబడినదో, దేవానాం అపి = దేవతలకు సయితము. యత్ ప్రణామమ్ న గతం = ఏది (వంగి) నమస్కరించుటను పొందలేదో, తత్ ముణ్డం = ఆ (నా) తలకాయ, వనే = అడవిలో, శృగాలేన = నక్కచేత, మృతాఙ్గమ్ యథా = పీనుఁగు - పీనుఁగు నవయవము - వలె, పాతితం = పడఁగొట్టఁబడినది.

నాతల మాయమ్మ ముద్దుగొన్నది, 'దేవుళ్ళ' కైనను మ్రొక్కనిది. అది (నీపాదాలలో వ్రాలి) నీచే - కాలితో - పడఁగొట్టఁబడినది - అడవిలో నక్కచే పీనుఁగు వోలె.

అరే స్థావరక చేట, కుత్ర త్వయైషా సమాసాదితా. [అలే థావలఆ చేడా, కహిం తుప ఏశా శమాశాదిదా].

చేటః—భట్టక, గ్రామశకటైః రుద్ధో రాజమార్గః. తదా చారుదత్తస్య వృక్షవాటికాయాం ప్రవహణం స్థాపయిత్వా తత్రావ తీర్య యావ చ్చక్రపరివృత్తిం కరోమి, తావ దేషా ప్రవహణ విపర్యాసే నేహారూఢేతి తర్కయామి. [భట్టకే, గామశఅలేహిం లుద్ధే లాఅమగ్గే. తదో చాలుదత్తశ్శ లుక్షవాడిఆఏ పవహణం థావిఅ తహిం ఓదలిఅ జావ చక్కపలివట్టిఅం కలేమి, తావ ఏశా పవహణవిపజ్జాశేణ ఇహ ఆలూఢే త్తి తక్కేమి].

శకా—కథమ్. ప్రవహణ విపర్యాసే నాగతా! న మామభిసారయితుమ్. త దవత రావతర, మదీయా త్ప్రవహణాత్. త్వం తం దరిద్రసార్థవాహపుత్రక మభిసారయసి. మదీయౌ గావౌ వాహయసి! త దవత రావతర గర్భదాసి, అవత రావతర.

---

కుత్ర ఏషా త్వయా సమాసాదితా - ఎక్కడ దొరకినదిరా ఈమె నీకు? రాజ మార్గః - సర్కారు బాట, - ఊరిబండ్లచే అడ్డగింపఁబడి (యుండి) నది. తదా చారుదత్తస్య ... = అప్పుడు చారుదత్తుని తోఁటలో - తోఁటకడ అనుట - బండి నిలిపి, అక్కడ దిగి, చక్రాలుత్రిప్పుట - అవతలకు జరుగునట్లు - చేయఁ బోఁగా, అప్పుడు ఈమె, బండిమాఱుపాటు వలన, ఇహ ఆరూఢా ఇతి తర్కయామి = ఇందు ఎక్కినది అని ఊహించుచున్నాను. కథం! = ఎట్టూ! బండి మాఱుపాటుచే వచ్చినదా! నన్ను వలచి కూడుటకు కాదు. తత్ అవతర ... = కావున అవతర ... = దిగు దిగు నాదైన బండినుండి. త్వం తం దరిద్ర సార్థవాహపుత్రకం అభిసారయసి = నీవు ఆ దరిద్రుని కోమటివానికొడుకును వలపుగొని చేరఁబోవుదువు, మదీయౌ గావౌ వాహయసి = నాదైన యెడ్లను (నిన్ను) మోయింతువు (వానికడకు) - ఇవి కట్టిన బండిలో పోయెదవు! వాని మొగానికి ఎడ్లు కూడనా! తత్ అవతర ... = కావున దిగు దిగు, పుట్టుదాసీ, (భోగముదానా, ఇంత పొగరా, నీకు!)

[కధమ్ పవహణవిపజ్జాశేణ ఆగదా. ణమం అహిశాలిదుమ్. తా ఓదల ఓదల మమ కేలకాదో పవహణాదో. తుమం తం దలిద్దశత్థవాహాపుత్తకం అహిశాలేశి. మమ కేలకాఇం గోణాఇం వాహేశి. తా ఓదల ఓదల గబ్భదాశి, ఓదల ఓదల.]

వసన్త—త మార్యచారుదత్త మభిసారయ సీతి యత్సత్యమ్, అలంకృతా స్మ్యమునా వచనేన. సాంప్రతం య ద్భవతి తద్భవతు. [తం అజ్జచారుదత్తం అహిసారేసి త్తి జం సచ్చమ్, అలంకిదమ్హి ఇమిణా వఅణేణ. సంపదం జం భోది తం భోదు].

శకా—

శ్లో. ఏతాభ్యాం తే దశనఖోత్పలమణ్డలాభ్యాం
హస్తాభ్యాం చాటుశతతాడనలమ్పటాభ్యామ్
కర్షామి తే వరతనుం నిజయానకా
త్కేశేషు వాలిదయితా మివ యథా జటాయుః. ౨౦

---

తం అర్యచారుదత్తం ... = యత్సత్యం ... - అలఙ్కృతా అస్మి అమునా వచనేన - 'ఆ చారుదత్తయ్యను వలచి వానిం జేరఁబోవుచున్నావు' అని - ఆమాటలచే - నిజముగా అలంకరింపఁబడితిని. చారుదత్తుని అభిసరింతును అన్నమాట మాత్రమును, విశేషముగా ఈఖలునినోట సయితము వెలువడినది - అదెట్టి భూషణము నాకు! సాంప్రతం - ఇప్పుడు - ఇఁకను, యద్భవతి త ద్భవతు - ఏమగునో అదికానిమ్ము - ఇఁక నా కేమైనను గానిమ్ము. నాకు ఇఁక ప్రాణముపోయినను పోనీ, నాకు భయము లేదు, నష్టములేదు లాభమే.

శ్లో. ౨౦. ఏతాభ్యాం=ఇదిగో ఈ, దశనఖం - పదిగోళ్ళ నల్లగలువల బింబములు - కాదా మొత్తము - గల, హస్తాభ్యాం = చేతులతో, చాటు శత తాడన లమ్పటాభ్యాం = నూఱు ప్రియోక్తులు (తాడన - శకారభాషితమున = ) పలుకుట అను కొట్టుయందు ఎంతయు ఆసగొన్నవైన - తగులము గొన్నవైన, హస్తాభ్యాం = చేతులతో, తే = త్వాం (-శకారుని విభక్తి పొరపాటు) నిన్ను, వరతనుం = మంచి (అందమైన) దేహము గలదానిని, నిజ యానకాత్ = నాబండి

[ ఏదేహిం దే దశణహుప్పలమణ్డలేహిం
హత్థేహిం చాడుశదతాడణలమ్పడేహిం
కట్టామి దే వలతణుం ణిఅజాణకాదో
కేశేశు వాలిదఇఅం వి జహా జడాఊ ].

విటః—

శ్లో. అగ్రాహ్యా మూర్ధజే ష్వేతాః స్త్రియో గుణసమన్వితాః
న లతాః పల్లవచ్ఛేద మర్హ న్త్యుపవనోద్భవాః. ౨౧

త దుత్తిష్ఠ త్వమ్. అహ మేనా మవతారయామి. వసన్తసేనే, అవతీర్యతామ్.

నుండి, జటాయుః = జటాయువు - (హనూమాన్ = హా - హనుమంతుఁడు - కోఁతికి కోఁతి సరిగానుండి మేలు పాఠము అగునేమో; శకారుని పురావృత్తవిరోధ భాషితమునకు ఏదైనను సరే) వాలిదయితాం ఇవ యథా = వాలి ప్రియభార్యం బోలె (శకారపునరుక్తియు), కేశేషు = వెంఁడ్రుకలలో - కొప్పునం - (బట్టుకొని) కర్షామి = లాఁగెదను.

ఇందలి శకారభాషితసులభములగు భాషతప్పులను ఎన్నుకొనఁదగును.

నాచేతులతో నీవెంఁడ్రుకలం బట్టుకొని, మాటలం గొట్టుచుం బోలె తిట్లు తిట్టుచు, బండినుండి నిన్ను - క్రిందికి లాగి పాఱవైతును.

శ్లో. ౨౧. ఏతాః స్త్రియః = (ఇట్టి =) ఈ స్త్రీలు - గుణసమన్వితాః = ('వరతనుం' అన్నావే - అట్లు) అందము మొదలగు గుణములతో కూడుకొన్న - సుకుమారమైనవారు - మూర్ధ-జేషు = వెంఁడ్రుకలలో, అగ్రాహ్యాః = పట్టుకొనఁదగినవారు కారు. ఉపవన-ఉద్భవాః = తోఁటలో పుట్టినవైన - మనము ఎంతయో దయతో ప్రీతితో పెంచునవైన, లతాః = తీఁవలు, పల్లవ-ఉచ్ఛేదం = చివుళ్లుగిల్లుటను, న అర్హన్తి = (చేయఁ) తగవు.

కోపము వచ్చినను వారి గుణముం బట్టి అట్లు క్రూరముగా లాఁగి పెతికి బాధింపఁదగరు. తోఁటలో పెంచిన తీఁవల చివుళ్ళను గిల్లుదురా ?

(వసన్తసేనావతీ రైక్యాన్తే స్థితా)

శకా—(స్వగతమ్) యః స మమ వచనావమానేన తదా రోషాగ్నిః సంధుక్షితః, అద్యైతస్యాః పాదప్రహారేణానేన ప్రజ్వలితః. తత్సాంప్రతం మారయామ్యేనామ్. భవతు. ఏవం తావత్ (ప్రకాశమ్) భావ, భావ, [ జే శే మమ వఅణావమాణేణ తదా లోశగ్గి శంధుక్కిదే, అజ్జ ఏదాఏ పాదప్పహాలేణ అణేణ పజ్జలిదే. తం శంపదం మలేమి ణమ్. భోదు. ఎవ్వం దావ, భావే, భావే ],

శ్లో. యదీచ్ఛసి లమ్బదశావిశాలం
ప్రావారకం సూత్రశతైర్యుక్తమ్
మాంసం చ ఖాదితుం తథాతుష్టిం కర్తుం
చుహూచుహూ చుక్కుచుహూ ఇతి. ౨౨

---

తత్ ఉత్తిష్ఠ త్వం = కావున నీవు లే. అహం – ఏనాం ... = నేను ఈమెను దింపెదను. వసంతసేన దిగి ఎడముగా ఏకాంతమున నిలంబడినది.

తదా – అప్పుడు, యత్ తత్ మమ రోషాగ్నిః = ఏ యా నా కోపపునిప్పు – యత్ తత్ – అను లింగవ్యత్యాసము శకారభాషితమగుటచేత, సంధుక్షితః = రగుల్పఁబడినదో, తత్ = (సః అనుట) అది, అద్య = ఇప్పుడు, ఏతస్యాః, అనేన పాదప్రహారేణ = ఈ కాలి తన్నుచేత, ప్రజ్వలితః = పెను జ్వాలగా మండఁజేయఁబడినది. తత్ సాంప్రతం ... = కావున ఇప్పుడు ఈ పెను చంపివేసెదను. కానీ. ఏవం తావత్ = ఇట్లుగా – (అందులకు పన్నకము మనసులో నుదుచుకొనుచు అనుకొనుమాటలు – కానీ, ఇట్లుగా – ఇత్యాది, స్వగతము.) అంతట – ప్రకాశముగా. – భావ, భావ.

శ్లో. ౨౨. లమ్బదశావిశాలం = వ్రేలాడు కొనలు గలిగి వెడల్పును పొడవును ఐనదియు, సూత్రశతైః యుక్తమ్ = లెక్కలేని నూలు చుంగుల్కలదియు – ఐన, ప్రావారకం = కప్పడము, ఉత్తరీయమును, తథా చ = అట్లే మఱియు, మాంసం ఖాదితుం = మాంసము తినుటకును, చుహూ చుహూ చుక్క–

[యదిచ్ఛశే లమ్బదశావిశాలం
పావాలఅం శుత్తశదేహిం జుత్తమ్
మంశం చ ఖాదుం తహ తుట్టికాదుం
చుహూచుహూ చుక్కు చుహూచుహూత్తి ].

విటః—తతః కిమ్?

శకా—మమ ప్రియం కురు. [మమ పిఅం కలేహి ].

విటః—బాఢం కరోమి, వర్జయిత్వా త్వకార్యమ్.

శకా—భావ, అకార్యస్య గన్ధో ఽపి నాస్తి, రాక్షసీ కాపి నాస్తి. [భావే, అకజ్జాహ గన్ధె వి ణత్థి, లక్ఖశీ కావి ణత్థి].

విటః—ఉచ్యతాం తర్హి.

శకా—మారయ వసన్తసేనామ్. [మాలేహి వశన్తశేణి అమ్ ].

విటః—(కర్ణౌ పిధాయ)

---

చుహూ చుహూ ఇతి - ఇట్లు జుఱ్ఱుచు పీల్చుచు లొట్టవేయుచు, తుష్టిం కర్తుం = తృప్తి చేసికొనుటకును - ముక్కు మునుగ దినుటకును, యది ఇచ్ఛసి = కోరుదువేని.

తతః కిం = దాననేమి? అట్లు కోరుటవలననేమి? మమ ప్రియం కురు - నాకు ఇష్టమైనదానిం జేయుము. బాఢం = అలాగే - కరోమి = చేసెదను; వర్జయిత్వా అకార్యం = కూడనిపని తప్ప - కూడని పనిని మాత్రము చేయను - కూడినదైన, సరే, చేసెదను.

రాక్షసీ కా అపి నాస్తి = రాక్షసి ఎవరును లేరు - నీవు అకార్యము అని శంకించుటకు - ఏదేని రాక్షసిం గూర్చిన దైనంగదా అకార్యమనుటకు. మారయ వసన్తసేనామ్ = చంపవయ్యా, వసంతసేనను. కర్ణౌ పిధాయ = (ఆమాటనే వినం గూడనట్లు) చెవులు మూసికొని - ఎంత అకార్యము! - అన్నట్లు.

శ్లో. బాలాం స్త్రియం చ నగరస్య విభూషణం చ
వేశ్యా మవేశసదృశప్రణయోపచారామ్
ఏనా మనాగస మహం యది ఘాతయామి
కే నోడుపేన పరలోకనదీం తరిష్యే. ౨౩

శకా—అహం తే ఉడుపం దాస్యామి. అన్య చ్చ వివిక్తే ఉద్యాన ఇహ మారయన్తం క స్త్వాం ప్రేక్షిష్యతే. [అహం తే భేడకం దఇశ్శమ్. అణ్ణం చ వివిత్తే ఉజ్జాణే ఇధ మాలన్తం కో తుమం పేక్ఖిశ్శది].

శ్లో. ౨౩. బాలాం = చిన్నదానిని, ఇంకను ఎన్నాళ్ళో బ్రదికి ఏమేమో సుఖాలు అనుభవింపవలసిన దానిని - అనుట, స్త్రియం చ = ఆఁడుదియైనదానిని - ఆఁడుదానిం జంపఁగూడదు కదా అనుట, నగరస్య విభూషణం చ = (ఈయుజ్జయిని) నగరమునకే ఆభరణమువంటిది - అందముచేతను గుణములచేతను - ఐనదానిని, అవేశ సదృశ ప్రణయోపచారాం = భోగమువీథికిని యింటికిని తగని స్నేహము - అనురాగము - చూపు మర్యాద - గౌరవ - ఆచరణలు గల్గినదైన, వేశ్యాం = భోగముదానిని, ఏనాం = ఈపెను, అనాగసం = ఏతప్పును ఎఱుఁగనిదానిని, ఘాతయామి యది = చంపుదునేని, కేన ఉడుపేన = ఏపడవతో, పరలోకనదీం = పరలోకమునకు చేర్పవలయు నదిని, తరిష్యే = దాఁటఁగలను?

దాఁటనే లేనయ్యా - ఇది బాలవధ, స్త్రీవధ, ఊరికంతటికి సెబ్బరచేసి దుఃఖముకలిగించుట. నేనా విటుఁడను, వేశ్యలు ఆశ్రయమైనవాఁడను - నాకును ఒక తీఱుగా ఆశ్రయమైనదానింజంపుట, ఆశ్రయద్రోహము, కృతఘ్నత, 'శరణం గతాస్మి' అన్నది - కావున అట్టి ప్రణయినింజంపుట, నిరపరాధం జంపుట - ఇం దొక టొకటియు పరలోకమునకు రానీక క్రిందఁబడఁద్రోయునదే. మఱి ఇన్ని! చెప్పవలయునా?

ఏపడవయ్యా? పడవను నే నిచ్చెదను. ఆనదిం దాఁటునట్టి పడవ యెట్టిదో యెఱుంగలేక, ఎడ్లబండిగల తాను, ఒక పడవను ఈలేనా అన్నట్లు - ఇచ్చెదను అనుచున్నాఁడు - మూర్ఖతాప్రఖ్యాపనము. అన్యత్ చ - మఱియొకటియు, అనఁగా ఒక అనుకూలము గలదు. వివిక్తే ఉద్యానే ఇహ = మఱి ప్రాణి లేని -

విటః—

శ్లో. పశ్యన్తి మాం దశదిశో వనదేవతాశ్చ
చన్ద్రశ్చ దీప్తకిరణశ్చ దివాకరో ఽయమ్
ధర్మానిలౌ చ గగనం చ తథాన్తరాత్మా
భూమి స్తథా సుకృతదుష్కృతసాక్షిభూతా. ౨౮

శకా—తేన హి పటాన్తాపవారితాం కృత్వా మారయ.
[ తేణ హి పడన్తోవవాలిదం కదుఅ మాలేహి ].

విటః—మూర్ఖ, అపధ్వస్తో ఽసి.

---

నిర్జనమైన - తోఁటలో ఇక్కడ - మారయ త్వం కః త్వాం ద్రక్ష్యతి = చంపుచుండఁగా నిన్ను ఎవఁడు చూడఁగలఁడు? ఎంత రహస్యము! పరలోకమునకు అడ్డమగునట్లు సాక్ష్యము ఎవరు? ధారాళముగా నిరాఘాటముగా చేయవచ్చును.

ఆదేమిమాటయ్యా, మన పనికి మాటకు లోకాన ఎందఱు సాక్షులున్నారనుకొన్నావు!

శ్లో. ౨౮. మాం = నన్ను, దశ దిశః = పది దిక్కులును, వనదేవతాః చ = (ఈ) వనమును అధిష్ఠించినవారు - వనదేవతలును, చన్ద్రః చ = చందురుఁడును, దీప్తకిరణః = (మధ్యాహ్నమగుటచే ఎంతయు) ప్రకాశించు కిరణములుగలవాఁడు, అయం దివాకరః చ = ఈ సూర్యుఁడును, ధర్మ అనిలౌ చ = ధర్మదేవతయు, గాలియు, గగనం చ = ఆకాశమును, తథా = అట్లే - మఱియు అనుట - అన్తరాత్మ - (నా) అంతరాత్మయు, తథా = అట్లే - మఱియు, సుకృత దుష్కృత సాక్షీ భూతా - సుకృతము - పుణ్యముగాని, దుష్కృతము - పాపముగానీ, తన మీఁదనో తన యెదుటనో తప్ప మఱెక్కడను జరుగుటకు లేదు గావున, వానికి తప్పక సాక్షియైన భూమియు, - పశ్యన్తి = చూతురు - చూచుచున్నారు. వీరి కందఱికి దేవతాభూతులకు కన్నులేదు అనుకొన్నావా? ఇందఱును చూతురు.

తేన హి = అట్లేని, పటాన్త అపవారితాం కృత్వా = గుడ్డతో ముఱుఁగుపఱుపఁబడినదానింగాఁ జేసి, మూర్ఖ = తెలివిమాలినవాఁడా, అపధ్వస్తః అసి =

శకా—అధర్మభీరు రేష వృద్ధకోలః. భవతు. స్థావరకం చేట మనునయామి. పుత్రక, స్థావరక చేట, సువర్ణకటకాని దాస్యామి. [అధమ్మభీలూ ఏశే బుడ్ఢకోలే. భోదు. థావలఅం చేడం అణుణేమి. పుత్తకా థావలకా చేడా, శోవణ్ణఖణ్డుఆఇం దఇశ్శమ్].

చేటః—అహ మపి పరిధాస్యామి. [అహం పి పహిలిశ్శమ్].

శకా—సౌవర్ణం తే పీఠకం కారయిష్యామి. [శోవణ్ణం దే పీఢకే కాలఇశ్శమ్].

చేటః—అహ ముప్యపవేక్ష్యామి. [అహం పి ఉవవిశిశ్శమ్].

శకా—సర్వం త ఉచ్ఛిష్టం దాస్యామి. [శవ్వం దే ఉచ్ఛిట్టఅం దఇశ్శమ్].

చేటః—అహ మపి ఖాదిష్యామి. [అహం పి ఖాయిశ్శమ్].

ఛీ! ఛీ! అతినీచుఁడ వైతివి! దేవతలకు గుడ్డ మఱుఁగటయ్యా. ఏష వృద్ధకోలః = ఈముది నక్క, అధర్మభీరుః = అధర్మమునకు భయపడుచున్నాఁడు - వట్టి పిఱికి, భవతు = కానీ, స్థావరకం చేటం అనునయామి = అనుకూలపఱుచుకొందును - ఒప్పింతును, ... చేట, సువర్ణకటకాని దాస్యామి = బంగారు మురుగులు ఇత్తును, ప్రాకృతమున శోవణ్ణ ఖండు ఆ ఇం = అనియున్నది - ఖండువా తెలుఁగు కండువాకు ప్రకృతి యగునా? అపక్షాన బంగారు (జరిపనిచేసిన) అంగవస్త్రము - అగును, చేటుని జవాబు - అహం అపి పరిధాస్యామి = నేనును ధరింతును - అనునది కండువా - సరిగవస్త్రము - అనుటకు సరిపడుచున్నది.

తే సౌవర్ణం పీఠకం = నీకు బంగారు పీట, ఉపవేక్ష్యామి = కూరుచుండఁగలను - కూర్చుండెదను, సర్వం తే ఉచ్ఛిష్టం = ఎంగిలిగా నేను తిన మిగిలినది - చేటుఁడు - ఎంగిలి యానాదులవలె ఎంగిలియు, వీని యింట దిను వాడుకపడియున్నాఁడేమో - అందు మేలి మాంసపుఁదాలింపుల శేష ముండును కాఁబోలు,

శకా—సర్వచేటానాం మహత్తరకం కారయిష్యామి. [శవ్వచేడాణం మహత్తలకం కాలఇశ్శమ్],

చేటః—భట్టక, భవిష్యామి. [భట్టకే హువిశ్శమ్].

శకా—త న్మన్యస్వ మమ వచనమ్. [తా మణ్ణేహి మమ వఅణమ్].

చేటః—భట్టక, సర్వం కరోమి వర్జయిత్వా ఉకార్యమ్. [భట్టకే, శవ్వం కలేమి వజ్జిఅ అకజ్జమ్].

శకా—అకార్యస్య గన్ధో ఉపి నాస్తి. [అకజ్జాహ గన్ధె వి ణత్థి].

చేటః—భణతు భట్టకః. [భణాదు భట్టకే].

శకా—ఏనాం వసన్తసేనాం మారయ. [ఏణం వసన్తశేణిఅం మాలేహి].

చేటః—ప్రసీదతు భట్టకః. ఇయం మ యానార్యే ణార్యా ప్రవహణపరివర్తనే నాసీతా. [పశీదదు భట్టకే. ఇఅం మఏ అణజ్జేణ అజ్జా పవహణపలివత్తణేణ ఆణీదా].

శకా—అరే చేట, త వాపి న ప్రభవామి. [అలే చేడా, త వావి ణ పహవామి].

---

చేటానాం మహత్తరకం = చేటులకు అధ్యక్షుని - చేటులమేస్త్రిని, కారయిష్యామి - చేయించెదను - బావతో రాజుతో చెప్పి - సిఫారసు చేసి, మన్యస్వ మమ వచనమ్ = నామాటను ఆదరించు, వర్జయిత్వా అకార్యం = కూడని పనిని మాని, ...పని తప్ప, గన్ధః అపి = వాసన సయితము.

మయా అనార్యేణ = పాపుఁడనైన నాచేత - ఆమెం దెచ్చుట పాపిష్ఠమైన పని. అది కావించితిని - అజ్ఞానముచేత - పొరపాటుచేత, ప్రవహణపరివర్తనేన = బండిమార్పుచేత, తవ అపి న ప్రభవామి = నీమీఁద సయితము నాకు ప్రాభవము -

చేటః—ప్రభవతి భట్టకః శరీరస్య, న చారిత్రస్య. తత్ప్రసీదతు ప్రసీదతు భట్టకః, బిభేమి ఖల్వాహమ్. [పహావది భట్టకే శలీలాహ, ణ చాలిత్తాహ. తా పశీదదు పశీదదు భట్టకే. భాఆమి క్షు అహమ్].

శకా—త్వం మమ చేటో భూత్వా కస్మాద్బిభేషి? [తుమం, మమ చేడే భవిఅ కశ్శ భాఆశి?]

చేటః—భట్టక, పరలోకాత్. [భట్టకే, పలలోఅశ్శ].

శకా—కః స పరలోకః? [కేశే పలలోఏ?]

చేటః—భట్టక, సుకృతదుష్కృతస్య పరిణామః. [భట్టకే, శుకిదదుక్కిదశ్శ పలిణామే].

శకా—కీదృశః సుకృతస్య పరిణామః? [కేలిశే శుకిదశ్శ పలిణామే?]

చేటః—యాదృశో భట్టకో బహుసువర్ణమణ్డితః. [జాదిశే భట్టకే, బహుసువణ్ణమణ్డిదే].

---

శక్తి లేదటరా. కలదు నా దేహమునకు - దేహముమీఁద - అనుట, న చారిత్రస్య = నడువడిమీఁద కాదు, మన్నించు దొరా (= భట్టక), బిభేమి ఖలు అహమ్ = నేను భయపడుదునుగదా, త్వం మమ చేటో భూత్వా = నీవు నాకు చేటుఁడవు - నౌకరవు - ఐ, ఎవరివలన - దేనివలన - భయపడెదవు?

పరలోకాత్ = పరలోకమువలన - చచ్చిన తర్వాత పోఁగల చోటువలన. (పరలోకము) సుకృతదుష్కృతస్య పరిణామః = పుణ్యపాపములయొక్క ఫలానుభవము - కీదృశః సుకృతస్య పరిణామః? = పుణ్యముయొక్క ఫలము ఎట్టిది? యాదృశః భట్టకః = ఎట్టివాఁడో దొర - అది - అనుట - అనఁగా బహుసువర్ణములచే - పలు బంగారునగలచే అలంకరింపఁబడినాఁడో, దొర, అది, అనుట. అది సుకృతమునకు ఫలము.

శకా—దుష్కృతస్య కీదృశః? [దుక్కిదశ్శ కేలిశే?]

చేటః—యాదృశో ఽహం పరపిణ్డభక్షకో భూతః. తదకార్యం నకరిష్యామి. [జాదిశే హగ్గే పలపిణ్డభక్ఖకే భూదే. తా అకజ్జం ణ కలఇశ్శమ్],

శకా—అరే, న మారయిష్యసి? [అలే, ణమాలిశ్శశి?],
(ఇతి బహువిధం తాడయతి.

చేటః—తాడయతు భట్టకః, మారయతు భట్టకః, అకార్యం న కరిష్యామి. [పిట్టయదు భట్టకే, మాలేదు భట్టకే, అకజ్జం ణ కలఇశ్శమ్].

శ్లో. యే నాస్మి గర్భదాసో వినిర్మితో భాగధేయదోషైః
అధికం చ న క్రీణిష్యామి తే నాకార్యం పరిహరామి. ౨౫

---

దుష్కృతస్య కీదృశః = పాపమునకు ఎట్టిది ?

యాదృశః అహం పరపిణ్డ భక్షకో భూతః = నేనెట్టివాఁడనో - పరులచేతి (పిండి=) యన్నపు ముద్దను తినువాఁడనైతినో, తత్ అకార్యం న కరోమి = కావున కూడని పనిని చేయను.

అరే న మారయిష్యసి - ఓరి చంపవా? తాడయతు ... మారయతు = కొట్టనీ, చంపనీ, అకార్యమును చేయును.

శ్లో. ౨౫. యేన = ఏకారణముచేత, భాగధేయదోషైః = అదృష్టపు దోషములవలన - దురదృష్టములచేత, గర్భదాసః = పుట్టకనుండి నౌకరుగా, వినిర్మితః = సృష్టింపఁబడితినో, అధికం చ = (ఇఁక) ఎక్కువను, న క్రీణిష్యామి = కొనఁబోనో, తేన అకార్యం పరిహరామి = దాన కూడని పనిని మానుచున్నాను.

దురదృష్టవశమున ఇప్పటికే గర్భదాసుఁడనుగా ఉన్నాను, ఇంకను ఇంత కెక్కువగా కొనను - భాగధేయ దోషాలను. కావున నేను పాపమును - కూడని పనిని, మానుదును.

[ జేణ మ్హి గబ్భదాశే వినిమ్మిదే భాఅధేఅదో శేహిం
అహిఅం చ ణ కీణిశ్శం తేణ అకజ్జం పలిహలామి ].

వసన్త—భావ, శరణాగ తాస్మి. [ భావ, శరణాగదమ్హి ].

విటః—కాణేలీమాతః మర్షయ, మర్షయ. సాధు స్థావరక,
సాధు,

శ్లో. అ ప్యేష నామ పరిభూతదశో దరిద్రః
ప్రేష్యః పరత్ర ఫలమిచ్ఛతి నాస్య భర్తా
తస్మా దమీ కథ మి వాద్య నయాన్తి నాశం
యే వర్ధయ న్త్యసదృశం సదృశం త్యజన్తి ౨౬

అపి చ

వసంతసేన మరలం గూడ విటుని శరణు జొచ్చుచున్నది. వాఁడు ఏమి సేయునో, ఏమి సేయ శక్తుఁడో!

మర్షయ – మన్నించు, పాపము చేటుని, బళి స్థావరక బళి.

శ్లో. ౨౬. ఏషః అపి నామ = ఇతఁడు ఐనను – ఇంత నీచుఁడు సయితము, పరిభూతదశః = ఎల్లరచేత అవమానింపఁబడు దశగలవాఁడు – చేటుఁడైనవాఁడు, దరిద్రుఁడు, నౌకరు – పరత్ర = ఆముష్మికమున, ఫలం=(మంచి) ఫలము (కావలయు నని), ఇచ్ఛతి = కోరుచున్నాఁడు, అస్య భర్తా = వీని స్వామి, న(ఇచ్ఛతి) = కోరఁడాయెను, తస్మాత్ = అందువలన, యే = ఎవరు, అపసదృశం = తగని దానిని – పాపమునే, వర్ధయన్తి = వృద్ధిపఱుతురో, సదృశం = తగినదానిని, పుణ్యమును, త్యజన్తి = మానుదురో, అట్టి, అమీ = వీరు, శకారుని బోంట్లు, అద్య = ఇపుడు, కథం ఇవ నాశం న యాన్తి = ఎటువలె నాశనముఁ బొందరు?

ప్రకృత రాజపదము గాను అన్వయింతురు – యే = ఎవరు, అసదృశం = అయోగ్యుని – శకారుఁబోఁటివానిని, వర్ధయన్తి = పోషింతురో, సదృశం = యోగ్యుని, త్యజన్తి = విడిచిపెట్టుదురో, అమీ = అట్టివీరు, కథం ఇవ = ఎటువలె,

శ్లో. రన్ధ్రానుసారీ విషమః కృతాన్తో
యదస్య దాస్యం తవ చేశ్వరత్వమ్
శ్రియం త్వదీయాం యదయం న భుఙ్క్తే
యదేతదాజ్ఞాం న భవాన్ కరోతి. ౨౭

శకా—(స్వగతమ్) అధర్మభీరుకో వృద్ధశృగాలః. పరలోకభీరురేష గర్భదాసః. అహం రాష్ట్రియశ్యాలః కస్మాద్బిభేమి

---

అద్య = ఇప్పుడు - సద్యః అనుట, నాశం న యాన్తి = నాశనముపొందరు? ఈ రాష్ట్రియుంబోలె అసదృశుఁడు అకృత్యముచేయువాఁడు తన పాపముచేత తన పోషకుని - నాశయతి = నాశము చేయును. కావున ఇట్టివానికి సంపద నొసఁగుట రాజునకే నాశకారణము.

చేటుఁడైనను పరలోకఫలమునకు జడియును గాని రాష్ట్రియుఁడు వెఱవఁడు గదా. మఱి అకృత్యమును - హత్యను, స్త్రీహత్యను, చేయుచునుండును, చేయును. జంకఁడుగదా. మఱి యిట్టివారికి లోకాన నాశము లేదుగదా.

శ్లో. ౨౭. కృతాన్తః = విధి, విషమః = భయంకరుఁడు, రన్ధ్రానుసారీ = (మానిసికి కలుగు) తప్పునో దూఱునో వెదకి అనుసరించును, యత్ = ఏలన, ఏల యిట్లు చెప్పుట యనఁగా - అస్య = వీనికి, దాస్యం = నౌకరుగా ఉండుటయు, తవ చ = నీకును - నీకో, ఈశ్వరత్వమ్ = (వానికి) దొరగా నుండుటయు, (అందులకే వివరము), యత్ = ఏలన, త్వదీయాం శ్రియం = నీసంపదను, అయం న భుఙ్క్తే = వీఁడు అనుభవించుట లేదు, యత్ = ఏలన, ఏతదాజ్ఞాం = వీని యుత్తరువును, భవాన్ = నీవు, న కరోతి = చేయుట లేదు.

విధి చాల భయంకరుఁడు, నమ్ముటకు లేదు, రంధ్రమును కనుపెట్టుచునే యుండును - మానిసికి కలుగఁదగిన తప్పు, దూఱో - వానికి తటాలున చొచ్చుటకు సందు. మానిసి జాగ్రత్తపూన శక్తుఁడు కాఁడు. అందుచేత లోకాన ఇట్టి యొగుడు దిగుడులు - చేటుఁడు గుణము తెలివి గలవాఁడు, నీవు వట్టి మూర్ఖువు. మఱి వీనికి దాస్యము వ్రాసినాఁడు, నీకు ఈశ్వరత్వము వ్రాసినాఁడు, నీసంపదను వీఁడు అనుభవించుట లేదు, వీని యాజ్ఞను నీవు చేయుట లేదు.

వరపురుషమనుష్యః. (ప్రకాశమ్) అరే గర్భదాస చేట, గచ్ఛ త్వమ్. అపవారకే ప్రవిశ్య విశ్రాన్త ఏకాన్తే తిష్ఠ. [అధమ్మభీలువ బుడ్ఢఖోఢే. పలలోఅభీలూ ఏశే గబ్భదాశే. హగ్గె లట్ఠిఅశాలే కశ్శ భాఆమి వలపులిశ మణుశ్శే. అలే గబ్భదాశే చేడే, గచ్ఛ తుమమ్. ఓవలకే పవిశిఅ వీశన్తే ఏఅన్తే చిష్ట].

చేటః—యద్భట్టక ఆజ్ఞాపయతి. (వసన్తసేనా ముపసృత్య) ఆర్యే, ఏతావా న్మే విభవః. [జం భట్టకే ఆణవేది. అజ్జఏ, ఏత్తికే మే విహవే]. (ఇతి నిష్క్రాన్తః.

శకా—(పరికరం బధ్నన్) తిష్ఠ వసన్తసేనే, మారయిష్యామి. [చిష్ఠ వశన్తశేణిఏ చిష్ఠ, మాలఇశ్శమ్].

---

వృద్ధ శృగాలః ... = ఈ ముదినక్క (విటుఁడు), అధర్మమునకు జడియుచున్నాఁడు, గర్భదాసః ... = ఈ పుట్టు దాసుఁడు చేటుఁడు పరలోకమునకు జడియుచున్నాఁడు, అహం రాష్ట్రియః - నేను రాష్ట్రియుఁడను, రాజ్యపువాఁడను, రాజుబంధువను. కస్మాత్ ... = ఎవనివలన దేనివలన వెఱతును? కావున ఈ మారణకార్యమును నేన చేసెదను. అపవారకే ప్రవిశ్య ... = మఱుఁగు పెట్టినచోట - గదిలో చొచ్చి అలుపు తీర్చుకొనుచు ఏకాంతమున - ఒంటరిగా, నిన్ను ఎవరు ఏమియు అనక చేయక ఉండుచోట ఉండు.

వసంతసేనాం ఉపసృత్య - వసంతసేనను సమీపించి - ఆర్యే - అమ్మా, ఏతావాన్ మే విభవః = ఇంతే నా శక్తి, నీకు ఇంతకన్నను నేను ఏమియు సాయము చేయలేను-వీఁడు ఒకరికి ఎవరికిని అఱపని మొండి మూర్ఖుఁడు. ఎట్లబ్బా! వీని బారింబడితివే - అన్నట్లు తన యసహాయతం జెప్పి నిష్క్రమించినాఁడు.

పరికరం బధ్నన్ - నడికట్టు - దట్టి - బిగించి కట్టుచు - మారణపుఁబనికి సన్నద్ధుఁ డగుచు.

వసంతసేన ఏకాంతమున ఇదెల్ల కనుచు వినుచు, వాఁడు చంపఁ గోరుటయు, అందులకు విటు నడిగి తిరస్కృతుఁ డగుటయు, చేటు నడిగియు తిరస్కృతుఁ

విటః—ఆః, మమాగ్రతో వ్యాపాదయిష్యసి?

(ఇతి గళే గృహ్ణాతి.

శకా—(భూమౌ పతతి) భావే భట్టకం మారయతి.
[భావే, భట్టకం మాలేది].

(ఇతి మోహం నాటయతి. చేతనాం లబ్ధ్వా

శ్లో. సర్వకాలం మయా పుష్టో మాంసేన చ ఘృతేన చ
అద్య కార్యే సముత్పన్నే జాతో మే వైరికః కథమ్? ౨౮

[శవ్వకాలం మఏ పుశ్టే మంశేణ అ ఘిఏణ అ
అజ్జ కిజ్జే శముప్పణ్ణే జాదే మే వైలిఏ కధమ్?]

---

డగుటయు, అంతట తానె అందులకు కాసె బిగించుకొనుటయు చూచుచున్నది — పాపము! అసహాయ, స్త్రీ. అప్పుడు ఆమెమనసున ఎట్టి దిగులు ఉండును! ఎవరు వర్ణింపఁగలరు!

విటుఁడు చేటునివలె ఊరక పోలేదు. వసంతసేన తన్ను రెండు తూర్లు శరణుజొచ్చినది. ఆమెను చంపఁగూడమికి తనకు వేయికారణము లున్నవి. ఆ మూర్ఖు తానెంత చెప్పినను వినలేదు. మఱి నడుము బిగించి కట్టుకొన్నాఁడు.

ఆః - ఆ, మమ అగ్రతః ... = నాయెదుర చంపుదువా? ఇతి గళే గృహ్ణాతి - అని మెడ (గొంతు) పట్టుకొనును. శకారుఁడు, నేలపైఁబడి, భావో భట్టకం మారయతి = భావుఁడు భట్టకుని - దొరను - చంపుచున్నాఁడు - మోహం = మూర్ఛ - నాటయతి - ఇది వేసగానికి నటనోపదేశము, చేతనాం లబ్ధ్వా = మూర్ఛనుండి - తేఱి తెలివిపొంది. ఇ దెల్ల ఆత్మగతము.

శ్లో. ౨౮. సర్వకాలం = ఎల్లప్పుడును - నిమిషమైనను ఎడతెగక, మాంసేన చ ఘృతేన చ = ఎఱచితోను నేతితోను, మయా పుష్టః = నాచేత పోషింపఁబడి, అద్య కార్యం సముత్పన్నే = ఇపుడు పని పొసఁగఁగా, మే వైరికః జాతః కథమ్ = నాకు శత్రువవైతివే అ దెట్లు?

(విచిన్త్య) భవతు. లబ్ధో మ యోపాయః. దత్తా వృద్ధశృగాలేన శిరశ్చాలనసంజ్ఞా. త దేతం ప్రేష్య వసన్తసేనాం మారయిష్యామి. ఏవం తావత్. (ప్రకాశమ్) భావ, య త్త్వం మయా భణితః. త త్కథ మహ మేవం బృహత్తరైః మల్లకప్రమాణైః కులై ర్జాతో ఽకార్యం కరోమి. ఏవ మేత దఙ్గీకారయితుం మయా భణితమ్. [భోదు, లద్ధే మఏ ఉవాఏ. దిణ్ణా బుడ్ఢఖోడేణ శిలశ్చాలణశణ్ణా. తా ఏదం పేశిఅ వశన్తశేణిఅం మాలఇశ్శమ్. ఎవ్వం దావ. భావే, జం తుమం మఏ భణిదే, తం కధం హగ్గే ఎవ్వం వడ్ఢకేహిం మల్లకప్పమాణేహిం కులేహిం జాదే అకజ్జం కలేమి? ఎవ్వం ఏదం అఙ్గీకలావేదుం మఏ భణిదమ్].

విటః—

శ్లో. కిం కులే నోపదిష్టేన శీల మే వాత్ర కారణమ్
భవన్తి సుతరాం స్ఫీతాః సుక్షేత్రే కణ్టకిద్రుమాః. ౨౯

---

న్యాయ్యమా ధర్మ్యమా అని శకారుని నిష్ఠురోక్తి. భవతు - కానీ, లబ్ధః మయా ఉపాయః = నాకు ఉపాయము దొరకినది. ఈముది నక్క - విటుఁడు - శిరశ్చాలనసంజ్ఞా - తలయాడించుసన్న చేసినాఁడు. వసంతసేనకు - ఏమీ ఫర్వా లేదులే అన్నట్లు. తత్ ఏతం ప్రేష్య ... = వీనిని పంపివేసి (నాయుక్తిచేత) (తరువాత) వసంతసేనం జంపెదను. ఏవం తావత్ - ఇట్లు అగుంగాక. యత్ త్వం మయా భణితః - నీవు నాచేత ఏమి చెప్పఁబడితివో అది, అహం మల్లకప్రమాణైః బృహత్తరైః కులైః జాతః - నేను మూఁకుళ్ళంత - టెంకాయచిప్ప అంత - గొప్ప కులాన పుట్టినవాఁడను - గొప్పకు ఉపమానముగా చిప్పను మూఁకుడుం జెప్పుట శకారుని మూర్ఖత - మహాసముద్రవిశాలమైన - అని వాని భావము. కులైః అని పంచమికో సప్తమికో తృతీయయో - శకారభాషయగుట చేత, ఏవం అకార్యం కరోమి_ఇట్లు కూడనిపని చేయుదును! ఏత దఙ్గీకారయితుమ్= ఈపెను అంగీకరింపఁజేయుటకు, ఏతాం - కు. ఏతత్ - అన్నాఁడు.

శ్లో. ౨౯. కులేన ఉపదిష్టేన కిం = కులమును చెప్పు (కొను)టచే ఏమి (ప్రయోజనము)? అత్ర = ఇందు, ఈవిషయమున అకార్యమును మాను నెడ, శీలం

శకా—భావ, ఏషా త వాగ్రతో లజ్జతే, న మాం మఙ్గీకరోతి. త ద్గచ్ఛ. స్థావరకచేటో మయా తాడితో గతో ఽపి. ఏష ప్రపలాయ్య గచ్ఛతి. తస్మా త్తం గృహీ త్వాగచ్ఛతు భావః. [భావే, ఏశా తవ అగ్గదో లజ్జాఅది, ణ మం అఙ్గీకరేది. తా గచ్ఛ థావలఅచేడే మఏ పిట్టిదే గదేవి. ఏశే పలాఇఅ గచ్ఛది. తా తం గేణ్హిఅ ఆఅచ్ఛదు భావే].

విటః—(స్వగతమ్)

శ్లో. అస్మత్సమక్షం హి వసన్తసేనా
శౌణ్డీర్యభావా న్న భజేత మూర్ఖమ్

ఏవ కారణమ్ = నడువడియే కారణము - ప్రయోజకము. సుక్షేత్రే = మంచిపొలాన, కణ్టకిద్రుమాః = ముండ్ల చెట్లు, సుతరాం స్ఫీతాః = మిక్కిలియు బలిసినవి, భవన్తి = అగుచున్నవి - ఉంటున్నవి.

కులము గాదు, సుకార్యకార్య ప్రమాణాప్రమాణములకు కారణము, మఱేమనఁగా, శీలమే అందుల కారణము. మంచి సారవంతపు పొలములో పడ్డ ముండ్ల చెట్లు (తుమ్మ - జెముడు) మఱింత లావుగా ఎదుగవా?

ఏషా తవ అగ్రతః లజ్జతే - ఈమె నీయెదురుగా సిగ్గుపడుచున్నది. (అందుచేత)నన్ను ఒప్పుకొనకున్నది. తత్ గచ్ఛ - కావున(నీవు)పొమ్ము, విటుని పంపను సాకు చెప్పుచున్నాఁడు - స్థావరకః చేటః ... = చేటుఁడు స్థావరకుఁడు, నాచే కొట్టఁబడినాఁడు, ఇక్కడినుండి పోవనుం బోయినాఁడు. ఏష ప్రపలాయ్యగచ్ఛతి - వాఁ డెక్కడి కైనను పరారియగునేమో. కావున (నీవు పోయి)వానిం గొనిరమ్ము - అట్లు పాఱిపోనీకు. విటుఁడు స్వగతముగా శకారునిమాట అంగీకార్యమే అని యనుకొనుచున్నాఁడు.

శ్లో. 30. హి - ఏకారణాన, అస్మత్ సమక్షం = నాయెదుట, వసన్తసేనా, శౌణ్డీర్యభావాత్ = పరువునభిప్రాయము (= తలంపు) వలన, మూర్ఖం న భజేత =

తస్మాత్కరోమ్యేష వివిక్తమస్యా
వివిక్తవిశ్రమ్భరసో హి కామః. 30

(ప్రకాశమ్) ఏవం భవతు. గచ్ఛామి,

వసన్త—(పటాన్తే గృహీత్వా) నను భణామి శరణాగతాస్మి. [ణం భణామి శరణాగద మ్హి].

విటః—వసన్తసేనే, న భేతవ్యం న భేతవ్యం. కాణేలీమాతః, వసన్తసేనా తవ హస్తే న్యాసః.

శకా—ఏవమ్. మమ హస్త ఏషా న్యాసేన తిష్ఠతు. [ఎవ్వమ్. మమ హత్థే ఏశా ణాశేణ చిట్ఠదు].

విటః—సత్యమ్.

---

మూర్ఖుని పొందదో, తస్మాత్ = అందువలన, ఏషః = ఇదిగో నేను, అస్యాః = ఈమెకు, వివిక్తం కరోమి = విజనము చేసెదను - ఎవరు లేక, శకారునితో మాత్రమే ఉండు ఏకాంతమును కలిగించెదను. కామః = కామము, వివిక్తవిశ్రమ్భరసః హి = విజనమునందలి - ఎవరు చూడరు వినరు, అంతయును రహస్యము - అను నమ్మకము (= విశ్రమ్భః), సారముగా రుచిగా గలది.

ఎట్లును వసంతసేన బోగముది, అమ్మమాట విని యుండవచ్చును, తానును చాపలము వహించియుండవచ్చును, ధనమునకు. బండ్లమార్పు అనుట ఉత్తమాటయే కావచ్చును. అందును నేను తొలుతనే - ఇది సదృశమా యుక్తమా అని అనియును ఉన్నాను. సిగ్గు కావచ్చును. కనుక నేను పోయెదను అని పోవఁగా - పాపము వసంతసేన మరల వాని ఉత్తరీయముకొన పట్టుకొని - నను భణామి ... = ఓయి, అయ్యా, చెప్పుచున్నానుగదా - శరణాగతురాలను అని. ఇది మూఁడవతూఁటి గట్టిగా గుడ్డను లాఁగి చెప్పుట. వసన్తసేనా తవహస్తే న్యాసః ... = నీచేత ఇల్లడమయ్యా - కాపాడి, ఎప్పటివలె, అప్పగింపవలయును - అన్న మాట. న్యాసం అన్నమాటను రెట్టించి చెప్పించి, సత్యమనిపించి పోయినాఁడు. 'న్యాస'కు ప్రాకృతమైన ణాశవు 'నాశము' అనియును అగును. ఐనను శకారునికి అంత తెలివియా? ఇందుల చూపఱకు ఏమేని అట్టిది తోఁపవచ్చును - 'Dramatic Irony' అనఁదగినది. వానికి అప్పగించుచున్నాఁడు, నాశనమునకే! అని మరల అంతలో -

శకా—సత్యమ్. [శచ్చమ్].

విటః—(కించి ద్గత్వా) అథవా మయి గతే నృశంసో హన్యా దేనామ్. త దపవారిత శరీరః పశ్యామి తావ దస్య చికీర్షితమ్.

(ఇ త్యేకాన్తే స్థితః.

శకా—భవతు. మారయిష్యామి. అథవా కపటకాపటిక ఏష బ్రాహ్మణో వృద్ధశృగాలః కదాచి దపవారిత శరీరో గత్వా శృగాలో భూత్వా కపటం కరోతి. త దేతస్య వఞ్చనానిమిత్త మేవం తావ త్కరిష్యామి. (కుసుమావచయం కుర్వ న్నాత్మాన మణ్డయతి) బాలే బాలే, వసన్తసేనే, ఏహి. [భోదు. మాల ఇశ్శమ్. అథవా కవడకావడికే ఏశే బమ్హణే బుడ్ఢఖోడే కదావి ఓవాలిదశలీలే గడిఅ శిఆలే భవిఅ హాలుభులిం కలేది. తా ఏత దశ్శ వఞ్చణాణిమిత్తం ఎవ్వం దావ కలఇశ్శమ్. వాశూ వాశూ, వశన్తశేణిఏ, ఏహి.

విటః—అయే, కామీ సంవృత్తః. హన్త నిర్వృతో ఽస్మి, గచ్ఛామి. (ఇతి నిష్క్రాన్తః.

కిఞ్చి ద్గత్వా - రవంత పోయి, అథవా మయి గతే ... = అట్లు గాదు, నేను పోఁగానే, (నృశంసః =) క్రూరుఁ డీతఁడు ఈమె నొకవేళ చంపునేమో. తత్ = కావున, అపవారిత శరీరః - దాఁపఁబడిన శరీరముగలవాఁడనై, ఇంత టంతట దాఁగియుండి, పరికించెదను. అథవా = అట్లుగాక ఒకవేళ, కపటకాపటికః - 'కపట' అనునది శకారుని పునరుక్తివంటి చేర్పు. 'కాపటిక' అనియే మాట - కపటశీలః = మోసపు స్వభావము గలవాఁడు - కుసుమాపచయం కుర్వన్ - ఆత్మానం...పూవులు కోయుచు వానితో తన్ను అలంకరించుకొనును. వాసు వాసు - పిల్లా, బాలా, ఇది యనురాగంపు సంబోధన. ఈచేష్టలం జూచి, తన్ను మోసపుచ్చంజేసినవి అని యనుకొనక, పర్వా లేదు, కామియైనాఁడు - ఇఁక వసంత సేనకు ఏమియు చేయఁడు, హన్త - సంతోషము! నివృతః అస్మి = ఊరట

శకా___

శ్లో. సువర్ణకం దదామి ప్రియం వదామి
పతామి శీర్షేణ సవేష్టనేన
తథాపి మాం నేచ్ఛసి శుద్ధదన్తి
కిం సేవకం కష్టమయా మనుష్యాః. 30

[శువణ్ణఅం దేమి పిఅం వదేమి
పడేమి శీశేణ శవేశ్టణేణ
తధా వి మం ణేచ్ఛశి శుద్ధదన్తి
కిం శేవఅం కశ్టమఆ మణుశ్శా].

---

చెందినవాఁడను - దిగులుతీఱినవాఁడను ఐతిని. పోయెదను - అని నిష్క్రమించును. చేటుఁడు ముందే పోయినాఁడు - వీఁడు ఇప్పుడు - ఇఁక నట నెవఁడును (సాక్షి) లేఁడు - శకారకృత్యములకు.

శ్లో. 30. సువర్ణకం దదామి = బంగారు - నగలు - ఇచ్చెదను, ప్రియం వదామి = ప్రియము - ఇంపుగా - మాటలాడుదును, సవేష్టనేన - పాగాతోడి, శీర్షేణ = తలతో, పతామి = (పాదాలలో) పడెదను. తథా అపి = ఐనను. శుద్ధదన్తి = తెల్లని దంతాలదానా, మాం న ఇచ్ఛసి = నన్ను ఇచ్ఛగొనవు! కిం = ఏమి, తే = నీకు, వయం = నేను (ఏకవచనార్థము), కాష్ఠమయా మనుష్యాః = కొయ్యతో చేసిన మానిసినా ?

కిం తే వయం - తే వయం అను దాని ప్రాకృతము 'శే వయః' - అనుదానికి 'సేవకం' అనియు ఛాయ యగును. ఆ పక్షాన, దాసభూతుని, మాం న ఇచ్ఛసి - అని అన్వయము. కాష్ఠమయా మనుష్యాః - అని రెండుమాటలు ఒక శాకవాక్యము... మానిసి - అనఁగా నేను అని అధ్యాహార్యము, కొయ్యతో చేయఁబడితినా ?

నేను మానిసికాదటే, కొయ్యబొమ్మనా ? బంగారము పెట్టెదను, ప్రియము పలికెదను, పాదములం బడెదను అన్నను, తెల్లనిపండ్లదానా, నీ అందమునకై కదటే నేను వాఁచిపోవుచుండునది, ఒల్లనందువేమే !

వసన్త—కో ఽత్ర సందేహః ? [కో ఏత్థ సందేహో ?]

(అవనతముఖీ 'ఖలచరిత' ఇత్యాది శ్లోకద్వయం పఠతి)

శ్లో. ఖలచరిత నికృష్ట జాతదోష
కథ మిహ మాం పరిలోభసే ధనేన ?
సుచరితచరితం విశుద్ధదేహం
న హి కమలం మధుపాః పరిత్యజన్తి. 32

శ్లో. యత్నేన సేవితవ్యః పురుషః కులశీలవా న్దరిద్రో ఽపి
శోభా హి పణస్త్రీణాం సదృశజనసమాశ్రయః కామః. 33

---

కః అత్ర సన్దేహః = ఇందు - నీవు కోయ్యవగుటలో - సందేహ మేమి ?

శ్లో. 32. ఖలచరిత -క్రూరపు, దుష్టమైన నడవడికలవాఁడా, నికృష్ట = అధముఁడా, జాతదోషః = (ఎల్ల) దోషములుగలవాఁడవు, ఇహ = ఇట, మాం = నన్ను, ధనేన కథం పరిలోభసే = డబ్బుతో ఎట్లు ఆసగొల్పుదువు ? సుచరిత చరితం = సుజనుని చరితమువంటి చరితము - సాధువులకు సత్కార్యములకు ఉపయోగపడుటయే అది - కలదియు, విశుద్ధదేహం = నిర్మలమైన దేహముగలవియు నగు, కమలం = పద్మమును, మధుపాః = (మరందమాను) తుమ్మెదలు, నపరిత్యజన్తి హి = విడిచిపెట్టవు గదా.

ఆడుదానిని నన్ను చంపుఁడు, నేను చంపుదును - అని పూని అనుచునే యున్నావు, ఇందాకటినుంచి, క్రూరాత్మ, నీచుఁడ, ఇట్లు నీదోషాలు ప్రకటముగా ఎఱుంగఁబడుచునే యున్నవి. అట్టి నీవు నన్ను ధనముతో ఆసగొల్పి బెల్లింపఁ జూచెదవు. తుమ్మెద కమలమును వీడునా ? ఏమి దాని అందము చందము సౌరభము, మరందపు మధురిమ ! అట్టి చారుదత్తుని నేను వీడుదునా ? - అనుట.

శ్లో. 33. కుల శీలవాన్ పురుషః = కులము (గొప్ప యింటి పుట్టుక) గుణము గల పురుషుఁడు, దరిద్రః అపి = దరిద్రుఁ డైనను, యత్నేన = పూనికతో, సేవితవ్యః = సేవింపఁదగినవాడు, - పొందఁదగినవాఁడు, వానికి సేవలు సేయుఁదగును - పణస్త్రీణాం = వెలయాండ్రకు, ఊరక వెలపెట్టిన మాత్రమున సేవించుట కాదు గుణము; సదృశజనసమాశ్రయః = తగినజనమును - రూపశీలములుగలవానిని ఆశ్ర

అపి చ, సహకారపాదపం సేవిత్వా న పలాశపాదప మఙ్గీకరిష్యామి.
[ అవి అ, సహఆరపాదవం సేవిఅ ణ పలాసపాదవం అఙ్గీకరిస్సమ్ ].

శకా—దాస్యాఃపుత్రి, దరిద్రచారుదత్తకః సహకారపాదపః కృతః, అహం పునః పలాశో భణితః. కింశుకో ఽపి న కృతః. ఏవం త్వం మహ్యాం గాలీం దద త్య ద్యాపి త మేవ చారుదత్తకం స్మరసి. [ దాశీయేధీయే, దలిద్దచాలుదత్తకే శహఆలపాదవే కడే, హగ్గే ఉణ పలాశే భణిదే, కింశుకే వి ణ కడే, ఏవ్వం తుమం మే గాలిం దేన్తీ అజ్జ వి తం జ్జేవ చాలుదత్తకం శుమలేశి ].

వసన్త—హృదయగత ఏవ, కిమితి న స్మర్యతే. [ హిఅఅగదో జ్జేవ ; కిం త్తి ణ సుమరీఅది ? ]

---

యించిన, కామః = కామము, శోభా హి = కీర్తి కలిగించునది, అలంకారమగునది కదా. దాని వలననే - చారుదత్తుని, గుణశీలమహత్తరుని దారిద్ర్యము ప్రస్తావింపఁబడినపు డెల్ల వసంతసేన 'అత ఏవ కామ్యసే - అత ఏవ కామ్యతే' అని యనుచునే యుండినది, పూర్వతరాంక ప్రస్తావములలో.

అపి చ - మఱియు - అంతియ కాదు అనుట - సహకారపాదపం సేవిత్వా - తీయమామిడిచెట్టును అనుభవించి, మోదుగుచెట్టును నేను అంగీకరింపను.

దాస్యాఃపుత్రి = లంజెకూతురా, (అ) దరిద్రుఁడు చారుదత్తిగాఁడు చారుదత్తక - అని 'క' నిందందెలుపును. - తీయమామిడి చేయఁబడినాఁడు, మఱి నేను మోదుగు అనఁబడితిని - కింశుక మనియైనను అనఁబడనైతిని. 'పలాశః' అని రెండును పర్యాయములు - అమరము. వేఱుగా వానిం దలఁచుట శకారుని మూర్ఖభాషితము.

ఏవం త్వం మహ్యాం గాలీం దదతీ - ఇట్లు నీవు నాకు నిందనే ఒసంగుచు, అద్య అపి = ఇప్పుడును, తం చారుదత్తకం = ఆ చారుదత్తిగానినే స్మరసి = తలఁచుకొనుచున్నావు. హృదయ గత ఏవ .. నాహృదయముననే ఉండువాఁడు - హృదయముగదా తలంపులకు చోటు - ఇఁక తలంపఁబడుచున్నాఁడు - అని వేఱుగా చెప్పవలయునా ? తలంపఁబడక యెట్లుండును ?

శకా—అద్యాపి తే హృదయగతం త్వాం చ సమ మేవ మోటయామి. తద్దరిద్రసార్థవాహక మనుష్యకాముకిని, తిష్ఠ, తిష్ఠ. [అజ్జ వి దే హిఅఅగదం తుమం చ శమం ఏవ మోడేమి. తా దలిద్దశత్థవాహఅ మణుశ్శకాముకిణి, చిశ్ట చిశ్ట].

వసన్త—భణ భణ, పున రపి భణ. శ్లాఘనీయా న్యేతా న్యక్షరాణి. [భణ భణ పుణో వి భణ సలాహణిఆఇం ఏదాఇం అక్ఖరాఇం].

శకా—పరిత్రాయతాం దాస్యాఃపుత్రో దరిద్రచారుదత్తక స్త్వామ్. [పలిత్తాఅదు దాశీఏపుత్తే దలిద్దచాలుదత్తకే తుమమ్].

వసన్త—పరిత్రాయతే యది మాం ప్రేక్షతే. [పరిత్తాఅది జది మం పేక్ఖది].

అద్యాపి = ఇప్పుడే, తే హృదయగతం త్వాం చ సమం ఏవ...నీహృదయ గతుని నిన్నుం గూడ ఒక్కుమ్మడి, మోటయామి = చంపెదను. నిన్ను చంపెదను, నీతో నీహృదయను చచ్చును, హృదయముతో వాఁడును, అక్కడ కాఁపు రించువాఁడు, చచ్చును - నిన్ను చంపి, నిన్ను వాఁడు చంపినాఁడని వ్యాజ్యము వేసి వానిం జంపింతును - అని సూచనకలదా? ఐనను శకారుని మాట లలో, వట్టిమూర్ఖ భాషితములలో, వాచ్యార్థము తప్ప మఱేదియు వెదుకఁ జనదు, చూపఱకు dramatic irony ఉండునేమో, త ద్దరిద్ర సార్థవాహక మనుష్య కాముకిని - ఆదరిద్రపుఁగోమటి మానిసి కాముకురాలా - ఇట్లు పలుకుటలో దీనిని ఒక తిట్టంతగా తలంచుచున్నాఁడు శకారుఁడు. వసంతసేనయో దానిని తన పాతివ్రత్యముం బ్రతిష్ఠించు జెండాగా, ఈమారకసమయమున తనకు నివృత్తి కూర్చు మంత్రముగా తలంచుచున్నది. కావుననే - భణ భణ ... = చెప్పుము చెప్పుము, దానినే అని అనుచున్నది. పరిత్రాయతాం ... = ఆలంజా కొడుకు, దరిద్రచారుదత్తిగాఁడు కాపాడునుగాక (నిన్ను). పరిత్రాయతే, యది మాం ప్రేక్షతే - (తప్పక) కాపాడును, నన్ను చూచునేని.

శకా—

శ్లో. కిం స శక్రో వాలిపుత్రో మహేన్ద్రో
రమ్భాపుత్రః కాలనేమిః సుబన్ధుః
రుద్రో రాజా ద్రోణపుత్రో జటాయు
శ్చాణక్యో వా దున్ధుమారః త్రిశఙ్కుః. 38

[కిం శే శక్కే వాలిపుత్తే మహిన్దే
లమ్భాపుత్తే కాలణేమీ శుబన్ధూ
లుద్దే లాఆ దోణపుత్తే జడాఊ
చాణక్కే వా ధున్ధుమాలే తిశఙ్కూ.]

అథవా, ఏతే౽పి త్వాం న రక్షన్తి [అథవా, ఏదే వి దే ణ లక్ఖన్తి]

శ్లో. చాణక్యేన యథా సీతా మారితా భారతే యుగే
ఏవం త్వాం మోటయిష్యామి జటాయు రివ ద్రౌపదీమ్. 39

[చాణక్కేణ జధా శీదా మాలిదా భాలదే జుఏ
ఎవ్వం మే మోడయిశ్శామి జడాఊ విఅ దోవ్వదీమ్]

(ఇతి తాడయితు ముద్యతః.

---

శ్లో. 38. కిం సః - వాఁడేమి, శక్రుఁడా, వాలిపుత్రుఁడైన మహేంద్రుఁడా, రంభకొడుకు కాలనేమియా, సుబంధుఁడా, రుద్రరాజా, ద్రోణునికొడుకు జటాయువా, చాణక్యుఁడా, దుంధుమారుఁడా, త్రిశంకువా - దండాన్వయముగా వ్రాయఁబడినది. అథవా ... = అట్లుగాదు - వారే కాదు, ఏతే అపి - వీరు కూడ, త్వాం న రక్షన్తి = నిన్ను కాపాడలేరు.

శ్లో. 39. భారతే యుగే = భారతయుగమందు, చాణక్యేన = చాణక్యుని చేత, సీతా యథా మారితా = సీత యెట్లు చంపఁబడినదో, జటాయుః = జటాయువు, ద్రౌపదీం యథా = ద్రౌపదిం బోలె, త్వాం = నిన్ను, ఏవం మోటయిష్యామి - ఇట్లు చంపెదను.

వసన్త—హా మాతః, కుత్రాసి, హా ఆర్యచారుదత్త, ఏష జనో ఽసంపూర్ణమనోరథ ఏవ విపద్యతే. త దూర్ధ్వ మాక్రన్ద యిష్యామి. అథవా వసన్తసే నోర్ధ్వ మాక్రన్ద తీతి లజ్జనీయం ఖ ల్వేతత్. నను ఆర్యచారుదత్తాయ. [హా అత్తే, కహిం సి, హా అజ్జచారుదత్త, ఏసో జణో అసంపుణ్ణమణోరధో జ్జేవ వివజ్జది. తా ఉద్ధం అక్కన్దఇస్సమ్. అధవా వసన్తసేణా ఉద్ధం అక్కన్దతి త్తి లజ్జ ణీఅం క్ఖు ఏదమ్. ణమో అజ్జచారుదత్తస్స].

పురాణములలోను ఇతిహాసములలోను బృహత్కథలోను ప్రసిద్ధములైన గొప్ప గొప్ప పురుషులయు స్త్రీలయు పేరులను చెప్పి ఉగ్గడించి, వారికి సాటి వాఁడా యేమి ఆ చారుదత్తిగాఁడు అని అతిక్రోధహేళనము పలికినట్లు పలుకు చున్నాఁడు - అన్నియు అసంబద్ధపు పేరులు, అసంబద్ధపుకూర్పులు, చేర్పులు - శకారునికిం దగినవి.

మహేంద్రుని వాలిపుత్రుఁ డనుట, కాలనేమిని రంభాపుత్రుఁ డనుట, కవియైనవానిని కవియని యెఱుఁగకయే - సుబంధుం జెప్పుట - రుద్రుని రా జనుట, జటాయువును ద్రోణపుత్రుఁ డనుట, ధుంధుమారః - అని పరుషాక్షరములతో పెద్ద ధ్వనిగా తోఁచునది - ఒకానొక రాజో, పురుగో(ఇంద్రగోపము అనం బడునది). భారతయుగమని కృత త్రేతా ద్వాపర కలులం బోలినదానింగా, ఒక ప్రాచీనపురా ణాలకాలపుఁ బేరుగా పలుకుట - అన్నియు శకారుని తప్పుడు మాటలు - వట్టి ప్రేఁత ప్రధానముగా పలుకంబడినవి. భారతము పురాణము, కాదా 'వర్ష'ము - భూభాగదేశవిశేషపుఁ బేరు.

ఈ రౌద్రోపన్యాస మెల్ల చారుదత్తుని డిందుపఱుపను, తన్ను ఉత్కర్షించు కొనను - నిజమూర్ఖత్వము.

ఇతి తాడయితుం ఉద్యతః - అని కొట్టఁ బూనినాఁడు. హామాతః ... = అయ్యో అమ్మా, ఎక్కడ ఉన్నావు -(వీనిం జూడు, న న్నేమి చేయుచున్నాఁడో అన్నట్లు) అయ్యయ్యో చారుదత్తయ్యా! ఏష జనః = ఈజనము - నేను అనుట, అసమ్పూర్ణ మనోరథః ఏవ = కోరిక తీఱనిదయ్యే, చచ్చిపోవుచున్నదే! తత్ = కావున, ఊర్ధ్వం ఆక్రన్దిష్యామి = బిగ్గరగా అఱచెదను, ఏడ్చెదను - నిన్నరాత్రి

శకా—అద్యాపి గర్భదాసీ తస్యైవ పాపస్య నామ గృహ్ణాతి. (ఇతి కణ్ఠే పీడయన్) స్మర గర్భదాసి స్మర. [అజ్జ వి గబ్భదాశీ తశ్శజ్జేవ పావస్స ణామం గేణ్హాది. శుమల గబ్భదాశి శుమల],

వసన్త—నమ ఆర్యచారుదత్తాయ. [ణమో అజ్జచారుదత్తస్స].

శకా—మ్రియతాం గర్భదాసి, మ్రియతాం. [మల గబ్భదాశి. మల]. (నాట్యేన కణ్ఠే నిపీడయన్ మారయతి.

(వసన్తసేనా మూర్ఛితా నిశ్చేష్టా పతతి)

శకారః—(సహర్షమ్)

---

యెట్లెట్లు ఎంతెంత సుఖముగా చారుదత్తుకవుంగిళ్ళలో గడపితిని. ఈదినము ఇపుడు ఆతోఁటలో, వానిం గన్నారఁజూచుచు అనుభవించుచుందును - అందులకు అని అన్ని అలంకారములు చేసికొని బండి యెక్కితినే - నాకు ఒకటియు తీఱలేదే - ఇట్లు వీనివాత పడితినే - అయ్యయ్యో, అయ్యో - అని.

అథవా = అట్లు కాదు, కూడదు ... = వసంతసేన బిగ్గర అఱచుచున్నది, కుయి వెట్టుచున్నది - అనుట - సిగ్గుపడఁదగినది గదా. నమస్కారము చారుదత్తయ్యకు.

అద్య అపి గర్భదాసి ... = ఇప్పుడు సయితము, ఓసి పుట్టు లంజా, ఆపాపుని పేరు ఎత్తుచున్నావు! తలఁచుకోవే లంజ తలఁచుకోవే - అని - కణ్ఠే పీడయన్ = మెడ - గొంతు - పిసుకుచు - తలఁచుకోవే లంజా...ఆకడపటి ఉత్క్రాంతినిమిషమునను పతివ్రతగా పతినామస్మరణ చేయుచున్నది - నమస్కరించుచున్నది. మ్రియస్వ ... = చావవే చంపుచున్నాఁడు. వసన్తసేన మూర్ఛితయై చేష్టదక్కి (నేలం) బడును.

శకారుఁడు - సహర్షమ్ - సంతోషముతో - అట్టి అందాల చందాల స్త్రీని అట్లు చేతితో నులిమి చంపి సంతోషించుచున్నాఁడే!

శ్లో. ఏతాం దోషకరణ్డికా మవినయ స్యావాసభూతాం ఖలాం
రక్తాం తస్య కిలాగతస్య రమణే కాలాగతా మాగతామ్
కి మేష సముదాహరామి నిజకం బాహ్వోః శూరత్వం
నిఃశ్వా సాపి మ్రియతే ఒమ్బా సుమృతా సీతా భారతే. ౩౬

[ఏదం దోశకలణ్డిఅం అవిణఅ శ్శావాసభూదం ఖలం
లత్తం తశ్శ కిలాగదశ్శ ణమణే కాలాగదం ఖాఅదమ్
కిం ఏశే శముదాహలామి ణిఅఅం చాహుణా శూలత్తణం
ణీశాశే వి మలేఇ అంబ శుమలా శీదా జధా భాలదే].

---

'దూరాధ్వా చ వధో యుద్ధం ... శాపోత్సర్గా
మృత్యూ రతం తథా ... ఏభి వర్జితః -'
సా. ద. VI 282 ...

ఇట్లు అంకాన రంగాన వధ మృత్యువులు చూపఁగూడదని, మఱి రంగాన చూడనే అశక్యమైన యాడుదాని గొంతుపిసికి చంపుట చూపఁబడినది. ఇది గొప్ప వ్యతిక్రమమే. చూపఱ ఓర్వలేనిది; వెగటుపడునది, భయపడునది; అభినయమును అసాధ్యము కావుననే మానుట.

శ్లో. ౩౬. ఏతాం = ఈమెను, దోషకరణ్డికాం = దోసముల పెట్టెను - పెట్టెయైనదానిని - అట్లే యితరమును - అవినయస్య = అడకువ లేమికి పొగరుకు, ఆవాసభూమిం - కాపురపు చోటును, ఇల్లు - ఐనదానిని - ఖలాం = చెడ్డనడువడి కలదానిని, కూళను, తస్య అగతస్య రమణే కిల రక్తామ్ = ఆ గతిలేనివాని - దిక్కుమాలినవాని (తోడి) రతియందు ఆసక్తురాలిని, కాలాగతామ్ = కాలము (= చావు) వచ్చిన దానిని - చావుమూడిన దానిని, అగతాం = (తానై నా బారికి) వచ్చిన దానిని! అహా చంపఁగంటిని కదా - అని సంతోషపు పొంగు - తల పోఁత. ఏషః - ఈ (నేను), నిజకం బాహ్వోః శూరత్వం = నాదైన బాహువుల పరాక్రమమును, కిం సముదాహరామి = ఏమి చెప్పుదును! అది అనిర్వచనీయము - వర్ణింప నలవిపడనిది. అమ్బా - ఈతల్లి - వసంతసేన, నిఃశ్వాసా అపి = శ్వాస ఆఁగి యున్నది గన. మ్రియతే - చచ్చినది, సుమృతా = బాగుగా చచ్చినది - ఇవి శకారభాషితపుఁ బునరుక్తులు. సీతా యథా భారతే = భారతమున సీతవలె,

శ్లో. ఇచ్ఛన్తం మాం నేచ్ఛతీతి గణికా
రోషేణ మయా మారితా
శూన్యే పుష్పకరణ్డక ఇతి సహసా
పాశే నోత్త్రాసితా
సేవావఞ్చితో భ్రాతా మమ పితా
మా తేవ సా ద్రౌపదీ
యో౽సౌ పశ్యతి నేదృశం వ్యవసితం
పుత్రస్య శూరత్వమ్. 38

---

భారతమున సీత లేదు, సీత చావను లేదు - అంతయు శకార భాషితపు తెలుఁగు. తా నొక్కఁడే అయినను, అంతయు స్వగతప్రాయమైనను, అంతయు వికత్థనమే - నిజ గర్వోక్తియే.

దుష్ట, అవినీత, ఖల, దరిద్రరక్త, కాలముతీఱినది, తానై వచ్చి చేతికిం జిక్కినది - ఏమి నాయదృష్టము! - అని యనుకొనుట. నాభుజశౌర్యమును ఏమని ఎంతని చెప్పుదును. (నాచే అవలీలగా) చచ్చినది యీమె!

శ్లో. 38. ఇచ్ఛన్తం మాం = వలచిన నన్ను, న ఇచ్ఛతి ఇతి = (తాను) ఇష్ట పడలేదు అని, కోపముచే భోగముది నాచే చంపఁబడినది. దీనితో 'ఉత్త్రాసితా'ను చేర్పవలయును. ఇది శకారునితప్పు - శూన్యే పుష్పకరణ్డకే ఇతి - ప్రథమకు సప్తమి శకారుని భాషతప్పు - ఎవరు లేనిది, పుష్పకరండము అని - ఇట సాక్షు లెవరును లేరు గదా అని, సహసా - తటాలున - బిరబిరన, ఎవరైనను వత్తురో అని - బలాత్కారముగా - ఇంచుక నవ్వుచునుం గాఁబోలు, పాశేన = బాహువులనే పినుకటకు - నులుముటకు - తగినట్లు - గొంతు చుట్టుం జొనిపి, త్రాటివలె చేసి దానితో - ఆ పాశముతో - ఉత్త్రాసితా = ఇక్కడ 'మారితా' అని ఉండవలయును. 'మారితా' 'ఉత్త్రాసితా' - ఒకదాని కొకటి చోటు మాఱినది, శకారభాషితమున. యః అసౌ - ఏ యితఁడు, మమ భ్రాతా = నా అన్న, పితా = నాయన, ద్రౌప దీవ సా మాతా = ద్రౌపదింబోని నాయమ్మ - పుత్రస్య = పుత్రుఁడనైన నాయొక్క, వ్యవసితం = పూనఁబడిన, ఈదృశం శూరత్వం = ఇట్టి పరాక్రమశాలిత, న పశ్యతి = చూడలేదో, ఆజన మంతయు - అన్న అబ్బ అమ్మ -

[ఇచ్ఛన్తం మమ ణేచ్ఛతి త్తి గణిఆ
    లోశేణ మే మాలిదా
శుణ్ణే పుప్ఫకలణ్డకే త్తి
    శహశా పాశేణ ఉత్తాశిదా
శేవావఞ్చిద భాదుకే మమ పిదా
    మాదేవ శా దోప్పదీ
జేశే పేక్ఖది ణేదిశం వవశిదం
    పుత్తాహ శూలత్తణమ్ ],

భవతు. సాంప్రతం వృద్ధశృగాల ఆగమిష్యతీతి. తతో ఉపసృత్య తిష్ఠామి. [భోదు. సంపదం బుడ్ఢఖోడే ఆగమిశ్శది త్తి. తా ఓశాలిఅ చిట్ఠామి ]. (తథా కరోతి.

సేవావఞ్చితః = నాసేవచే మోసపుచ్చఁబడిరి - సేవ పొందరైరి - చూడరైరి - సేవ వారి కంటఁ బడక వారిని మోసపుచ్చినది. అనుట. ఈనా శూరత్వముం జూడ వా రెవరును ఎదుట లేరైరి - ఉన్న ఎంతయో సంతోషించియుందురు!

అట్టి స్త్రీఘాతం గావించి తరువాత సైతము పశ్చాత్తాప పడక ఇట్లు తలఁచుకొని తలఁచుకొని, తానే తన్ను పొగడుకొని పొగడుకొని సంతోషించుచున్నాఁడు - ఎట్టి కాపురుషుఁడో!

ఇందలి వ్యాకరణదోషములు, ద్రౌపదియనుట మొదలగు పురాణదోషములు శకారభాషవి. 'లోషేణ మారితా' అనియు. 'పాశేన ఉత్త్రాసితా' అనియుం, ఒకదానిది మఱియొకదానితో కూర్చుట - శకారభాష.

భవతు - కానీ. సాంప్రతం వృద్ధశృగాలః ... = ఇది ఇపుడు విటునికి వాఁడేపెట్టుచుకొన్న నిర్దేశపు పేరు - ముదినక్క. వానిని చేటుం బట్టుకొని రమ్మని పంపెను గదా - వాఁడు రాగలఁడు - ఇది పాత్రప్రవేశసూచనయు, తతః - కావున, అపసృత్యతిష్ఠామి = అవలికి తొలఁగిపోయి యుండెదను.

(ప్రవిశ్య చేటేన సహ)

విటః—అనునీతో మయా స్థావరక శ్చేటః. త ద్యావ త్కాణేలీ మాతరం పశ్యామి. (పరిక్ర మ్యావలోక్య చ) అయే. మార్గ ఏవ పాదపో నిపతితః. అనేన చ పతతా స్త్రీ వ్యాపాదితా. భోః పాప. కి మిద మకార్య మనుష్ఠితం త్వయా. త వాపి పాపినః పతనాత్ స్త్రీవధదర్శనే నాతీవ పతితా వయమ్. అనిమిత్త మేతత్, యత్సత్యం వసన్తసేనాం ప్రతి శఙ్కితం మే మనః. సర్వథా దేవతా స్వస్తి కరిష్యన్తి (శకార ముపసృత్య) కాణేలీమాతః, ఏవం మ యానునీతః స్థావరక శ్చేటః.

శకా—భావ, స్వాగతం తే, పుత్రక స్థావరక చేట, త వాపి స్వాగతమ్. [భావే, ఆఅదం దే. పుత్తకా థావలకా చేడా, త వాపి శాఅదమ్].

చేటః—అథ కిమ్. [అథ ఇం].

విటః—మదీయం న్యాస ముపనయ.

శకా—కీదిశే ణాశే? [కీదృశో న్యాసః?]

అయే - ఓహో - ఆశ్చర్యము. మార్గే ఏవ = దారిలోనే, పాదపః నిపతితః = చెట్టు పడియున్నది. అనేన చ పతతా ... = పడుచున్నదాని చేత, అది పడుటచేత, స్త్రీ వ్యాపాదితా - ఎవరో ఆఁడుది చంపఁబడినది. అదర్శనము గొప్ప యపశకునము తనకు - ఒళ్ళు తెలియనంత కోపదుఃఖములు కలిగినవి - చెప్పుచున్నాఁడు, చెట్టును అచేతనమునైనను సంబోధించి - భోః పాప ... = ఓరి పాపిష్ఠుఁడా, ఈయకార్యమును, స్త్రీవధమును, చేసితివిగదరా. పాపి వైన నీ పాటువలన కలిగిన స్త్రీవధను - చచ్చిన(ఈ)స్త్రీని చూచి, పాతితా వయం - నేను సర్వథా చెడితినే. - నాశనమై పోయితినే - ఇది అపశకునము. యత్ సత్యం= నిజముగా, వసంతసేనం గూర్చి నామనసు భయపడుచున్నది. సర్వథా ... = అన్నివిధాల దేవతలు శుభము కూర్తురుగాక. మదీయం న్యాసం ఉపనయ - నాదైన యిల్లడను తెమ్ము - చూపుము - అనుట. కీదృశః న్యాసః = ఎట్టిది యిల్లడ?

విటః—వసన్తసేనా

శకా—గతా [గడా]

విటః—క్వ?

శకా—భావ స్యైవ పృష్ఠతః. [భావశ్య జ్జేవ పిష్టదో].

విటః—(సవితర్కమ్) న గతా ఖలు సా తయా దిశా.

శకా—త్వం కతమయా దిశా గతః. [తుమం కదమాఏ దిశాఏ గడే].

విటః—పూర్వయా దిశా

శకా—సాపి దక్షిణయా గతా. [శావి దక్ఖిణాఏ గడా].

విటః—అహం దక్షిణయా

శకా—సా ప్యుత్తరయా. [శా వి ఉత్తలాఏ].

విటః—అత్యాకులం కథయసి. న శుద్ధ్యతి మే ఉన్తరాత్మా. త త్కథయ సత్యమ్.

శకా—శపే భావస్య శీర్ష మాత్మీయాభ్యాం పాదాభ్యామ్.

వసంతసేన - నీవెనుకనే పోయినదే. (సవితర్కమ్) తనలో విమర్శించుకొని - ఆదిక్కున పోలేదే. త్వం కతమయా దిశా ... = నీవు ఏదిక్కునం బోయితివి? పూర్వయా దిశా = తూర్పుదిక్కున. ఆమె దక్షిణదిక్కునం బోయినది. నేను దక్షిణముగా. ఆమె ఉత్తరముగా.

అత్యాకులం కథయసి = ఎంతయు ఆకులపాటు కలుగునట్లుగా పలికెదవు. న శుద్ధ్యతి మే అన్తరాత్మా - నాయంతరాత్మ శుద్ధముగా, నిర్మలముగా ప్రసన్నముగా లేదు. తత్ కథయ సత్యం - కావున నిజము చెప్పు, శపామి - ఒట్టు పెట్టెదను - భావస్య శీర్షం ఆత్మీయాభ్యాం పాదాభ్యాం - ఇది శకారుని

తతః సంస్థాపయ హృదయమ్ ఏషా మయా మారితా. [శవామి భావశ్శ శీశం అత్తణకేలకేహిం పాదేహిం. తా శంఠావేహి హిఅఅమ్. ఏశా మఏ మాలిదా].

విటః—(సవిషాదమ్) సత్యం త్వయా వ్యాపాదితా?

శకా—యది మమ వచనేన ప్రత్యయసే, తత్పశ్య ప్రథమం రాష్ట్రియశ్యాలసంస్థానస్య శూరత్వమ్. [జఇ మమ వఅణే నపత్తిఆఅశి తా పేక్ఖ పడమం లష్టిఅశాలశంఠాణాహ శూలత్తణమ్].

(ఇతి దర్శయతి.

విటః—హా, హతో౽స్మి మన్దభాగ్యః. [ఇతి మూర్ఛితః పతతి].

శకా—హీహీ, ఉపరతో భావః. [హీహీ, ఉవలదే భావే].

---

భాష - మనము సరిగా ఎట్లో అన్వయించుకొనవలయును - భావుని తలమీఁదను, నాపాదాలమీఁదను - ఒట్టు. తతః సంస్థాపయ హృదయం - కావున నీ మనసును కుదురుపఱచుకో - ఆకులముగా నున్నది అన్నావే - సందేహములు ఏమియు లేవు ఏషా మయా మారితా = ఈమె - నాచేత చంపఁబడినది. సవిషాదం - విషాదముతో - భావునికి ఎంతో దుఃఖము కలిగినది - తన్ను మూఁడు తూర్లు శరణు జొచ్చినది - వాఁడు నడుము కట్టుకొన్నప్పుడు తాను వాని మెడను గొంతును పట్టుకొని క్రిందత్రోసినాఁడు - ఇంకను ఏమియో చేయఁగలఁడు. తరువాత వాఁడు పలికిన మాటలకు మోసపోయి వసంతసేన అతనికడ తన న్యాసము అని చెప్పి వాఁడు కొంత కాముకుఁ డగుటం గూడ చాటునుండి పొంచి చూచి ఇఁక ఫర్వాలేదని యెంచి కదా తాను పోయినాఁడు.

ప్రథమం...శూరత్వం = తొలి శూరత్వమును - తొలి శౌర్యకార్యమును - వసంతసేనవధను. హా! హతః అస్మి మన్దభాగ్యః - అయ్యో! చెడితినే భాగ్యహీనుఁడను! - అని దుఃఖాన మూర్ఛిల్లి పడును. హీహీ - సంభ్రమముం దెలుపును అన్నారు - నవ్వుచును ఉన్నాఁడా - చచ్చినాఁడు భావ - అ విచారితం

చేటః—సమాశ్వసితు సమాశ్వసితు భావః. అవిచారితం ప్రవహణ మానయ తైవ మయా ప్రథమం మారితా. [ శమశ్శశదు శమశ్శశదు భావే. అవిచాలిఅం పవహాణం ఆణన్తేణ జ్జేవ మఏ పఢమం మాలిదా ].

విటః—( సమాశ్వాస్య సకరుణమ్ ] హా, వసన్తసేనే.

శ్లో. దాక్షిణ్యోదక వాహినీ విగలితా, యాతా స్వదేశం రతి,
హా హాలంకృతభూషణే సువదనే క్రీడారసోద్భాసిని
హా సౌజన్యదీ ప్రహాసపులినే హా మాదృశా మాశ్రయే
హా హా నశ్యతి మన్మథస్య విపణిః సౌభాగ్యపణ్యాకరః 3౮

ప్రవహాణం ఆనయతా ... = విచారింపక, బండిలో ఎవరు ఎక్కినారు - ఏమి బరువు - అని పరీక్షింపక, తాను దారిలో ఊరిబండ్ల చక్రాలు తిప్పి దారికి తొలఁగించిన అలసటవు, వట్టి బండియే బరువుగా తోఁచినది అని తోలుకొనివచ్చి నాఁడు. అట్లు గాక అక్కడనే తాను పరికించియుండిన త్లైన ఇదేదియు జరిగియుం డదు. అట్లు పరికింపక బండిని తోలుకొనివచ్చినందున నాచేత ముందే ఆమె చంపఁ బడినది, నేను కదా వీనికి వసంతసేన దొరకునట్లు చేసితిని - సకరుణమ్ - దుఃఖ ముతో జాలిగా.

శ్లో. 3౮. భా ... = అయ్యో వసంతసేనా - దాక్షిణ్య ఉదక వాహినీ = దయ - మర్యాద - అను నీటికి (ప్రవహించు) నదియైనట్టిది, విగళితా = వినష్టమై పోయినది - అగపడక పోయినది. - రతిః = రతీదేవి, భూలోకమున అవతరించినట్టిది. (వసంత అట్టిది అనుట - ఇక ఈలోకాన రతిలేదు) స్వదేశం = తన చోటికి, స్వర్గ మునకు, యాతా = పోయినది. హాహా = అయ్యయ్యో, అలంకృతభూషణే, ఆభరణ మునకు ఆభరణమైనదానా, సువదనే = చక్కని - చంద్రుం బోలిన - మోముగలదానా, (దానికి ఉపమానము లేదు - సాటి లేనిది - కావున - సు (= మంచి) మొగముగల దానా - అనుట, క్రీడారసఉద్భాసిని = (శృంగారపు) ఆటలయందలి ప్రీతిచే మిక్కిలియు ప్రకాశించుదానా, హా = అయ్యో! సౌజన్యనది = మంచితనమునకు నదియైనదానా, ప్రహాసపులినే = (ఆనదిలో) పెద్దనవ్వే - పులినముగా గలదానా,

(సాస్రమ్) కష్టం భోః, కష్టమ్,

శ్లో. కిం ను నామ భవేత్కార్య మిదం యేన త్వయా కృతమ్
అపాపా పాపకల్పేన నాగరశ్రీ ర్నిపాతితా. ३८

(స్వగతమ్) అయే, కదాచి దయం పాప ఇద మకార్యం మయి సంక్రామయేత్. భవతు, ఇతో గచ్ఛామి. (ఇతి పరిక్రామతి.

---

హా-మాదృశాం = నాబోంట్లకు, (రసికులకు) ఆశ్రయమయినదానా, హా హా! సౌభాగ్యపణ్య ఆకరః = అందాలు అను సరకుల నిధియైన, మన్మథస్య విపణిః - కామునిదుకాణము, నశ్యతి = ఇఁక లేకపోయినది - నశించినది.

దయ యెప్పుడు ఎండకప్రవహించునది - నీగడప యెక్కి 'దేహి'యని 'నహి' యని యనిపించుకొనువాఁడు - ఒకనాఁడును లేదుగదమ్మ; అట్టిది పోయినది. ఇఁకను ఈదేశానసే రతి - శృంగారప్రీతి - ఆట - లేదు - తన దేశము, స్వగణము చేరి పోయినది. ఏ నగ గాని, నీవు పెట్టుకొందువేని, దానిచేత నీవు కాదు రాణించుట, మఱి నీచేత అది కదా రాణించును; నవ్వుల తెల్లనియిసుకదిబ్బలుగల, మంచితనమను నదివి, నాబోఁటి విటులు, రసికులు ఎందఱు నిన్ను ఆశ్రయించుచుండిరి, ఇఁక వారికి చోటేది; అందమైన రూపము, అందమైన పలుకు, అందమైనభావము మొదలగు అందాలకు నిధియైన మన్మథుని దుకాణమువే - మఱి లేకపోతివే - ఇఁక నెట్లు ఈలోకాన!

శ్లో. ३८. యేన త్వయాకృతమ్ = ఏ నీచేత చేయఁబడినదో, ఇదం కార్యం = ఈపని, కిం ను నామ భవేత్ = అది యెట్టిది అగును? ఎంత చేయఁగూడని పని! దానిని ఎటులకలె ఎందులకు చేసితివి? అపాపా = ఏపాపము ఎఱుఁగనిది, పుణ్యశీల, నగరశ్రీః - ఈయుజ్జయినికి లక్ష్మి, పాపకల్పేన = మూర్తిఁగొన్న పాపమైన నీచేత, నిపాతితా = నాశనము చేయఁబడినది.

అయే - ఓహో - కదాచిత్ = ఒకవేళ. అయం పాపః = ఈపాపుఁడు - పాపాత్ముఁడు, ఇదం అకార్యం = ఈ పాపమును. మయి సంక్రమేత్ = నామీఁద పెట్టినను పెట్టును. కానీ - నేను ఇక్కడినుండి పోయెదను. అని రంగాన నాలు

(శకార ఉపగమ్య ధారయతి)

విటః—పాప, మామా స్ప్రాక్షీః. అలం త్వయా. గచ్ఛామ్యహమ్.

శకా—అరే, వసన్తసేనాం స్వయ మేవ మారయిత్వా మాం దూషయిత్వా కుత్ర పలాయసే. సాంప్రత మీదృశో ఽహ మనాథః ప్రాప్తః. [అలే, వశన్తశేణిఅం శఅం జ్జేవ మాలిఅ మం దూశిఅ కహిం పలాఅశి, శంపదం ఈదిశే హగ్గే అణాధే పావిదే].

విటః—అపధ్వస్తో ఽసి.

శకా—

శ్లో. అర్థం శతం దదామి సువర్ణకం తే
కార్షాపణం దదామి సవోడిణం తే
ఏష దోషస్థానం పరాక్రమో మే
సామాన్యకో భవతు మనుష్యకాణామ్. ౪౦

---

గడుగులు నడచును, శకారుఁడు చేరఁబోయి పట్టుకొనును. పాప ... = పాపాత్ముఁడా, తాఁకకు తాఁకకు - ఇఁక నాకు నీతో పనిలేదు - చాలు నీతో - నేను పోయెదను.

అరే ... = ఓరి, వసంతసేనను నీవే చంపి, నన్ను తిట్టి నామీఁద పెట్టి, ఎక్కడికి పరువెత్తెదవు? సాంప్రతం ... = ఇప్పుడు నేను ఇట్టి దిక్కుమాలినవాఁడను దొరకితినా?

అపధ్వస్తః అసి = ఛీ! ఛీ! నాశనమైపోయితివి పో.

శ్లో. ౪౦. తే = నీకు, శతం సువర్ణకం అర్థం = నూఱు బంగారు నాణెములు డబ్బు ఇచ్చెదను. సబోడికం - కాసులతో కూడ, కార్షాపణం = ఆపేరి బంగారునాణెమును, తే దదామి = నీకు ఇచ్చెదను. ఏషః - ఇదిగో, దోషస్థానం పరాక్రమః = దోషమునకు నెలవైన, నా పరాక్రమము - పరాక్రమకార్యము-

[ అత్థం శదం దేమి శువణ్ణఅం దే
కహావణం దేమి శవోడిఅం దే
ఏశే దుశట్టాణ పలక్కమే మే
శామాణ్ణఏ భోదు మణుశ్శఆణమ్ ].

విటః—ధిక్, తవైవాస్తు

చేటః—శాన్తం పాపమ్. [ శాన్తం పావమ్ ].

(శకారో హసతి)

విటః—

శ్లో. అప్రీతి ర్భవతు విముచ్యతాం హి హాసో
ధి క్ప్రీతిం పరిభవకారికా మనార్యామ్
మాభూ చ్చ త్వయి మమ సంగతం కదాచి
దాచ్ఛిన్నం ధను రివ నిర్గుణం త్యజామి. ౪౧

---

వసంతసేనం జంపుట, మనుష్యకాణాం = మనుష్యులకందఱికి - నీకు నాకు చేటునికి ఇంకను ఇతరులకును, సామాన్యకః భవతు = ఉమ్మడియైనది కానీ - మన యందఱి మీఁదను పెట్టుకొందము.

ధిక్ - ఛీ ఛీ, తవ ఏవ అస్తు = నీకు మాత్రము అగునుగాక. శకారుఁడు నవ్వుచున్నాఁడు.

శ్లో. ౪౧. అప్రీతిః భవతు - పశ్చాత్తాపమువలని అప్రీతి - చిత్తఖేదము - కలుగునుగాక - (నీకు అనుట), హాసః హి=నవ్వుగన - మాను, పరిభవకారికాం - అవమానము కలిగించునదైన, అనార్యాం ప్రీతిం ధిక్ - నింద్యమైన ఈప్రీతి, ధిక్ - ఛీ ఛీ - త్వయి మమ సఙ్గతం = నీతో నాసంగాతము, కదా అపి మాభూత్ చ = (ఇఁక) ఎప్పటికిని కాకుండును గాక. ఆచ్ఛిన్నం ధనుః ఇవ = విఱుగఁగొట్టఁబడిన వింటివలె, కావునసె, నిర్గుణం = ఏగుణమును లేక, అల్లెత్రాఁడులేనిదానిం బోలెనున్న, (నిన్ను), త్యజామి = విడిచిపెట్టెదను.

శకా—భావ, ప్రసీద ప్రసీద, ఏహి. నలిన్యాం ప్రవిశ్య క్రీడావః. [ భావే, పశీద పశీద. ఏహి. ణలిణీఏ పవిశిఅ కీలేమ్హ ].

విటః—

శ్లో. అపతిత మపి తావ త్సేవమానం భవన్తం
పతిత మివ జనో ఽయం మన్యతే మా మనార్యమ్
కథం మహ మనుయాయాం త్వాం హతస్త్రీక మేనం
పున రపి నగరస్త్రీశజ్కి-తార్ధాక్షిదృష్టమ్. ౪౨

(సకరుణమ్) వసన్తసేనే,

---

చేసినపనికి ఏడువవలసియుండఁగా, నవ్వేద వేమయ్యా. చీచీ-ఏమి నవ్వు అది! అవమానము కదా పడవలయును-ఎంత నింద్యమైనది! ఇఁక నీతో నా కెప్పటికి సంగాతము అక్కఱలేదు. విఱిగిన వింటిని, అల్లె ( = గుణము) లేనిదానిం బోలె, గుణహీనుని నిన్ను వదలి నే పోయెదను.

భావ - మన్నించు. రా - తామరకొలనిలో ఈఁదులాడుదము.

శ్లో. ౪౨. అపతితం అపి = (పాపముచే) పడనివాని నైనను, భవన్తం సేవమానం తావత్ = నిన్నుం గూడినవాని నన్ననో, మాం = నన్ను, అయం జనః = ఈలోకము, అనార్యం పతితం ఇవ మన్యతే = చెడ్డవానింగా, పాపములుచేసి పడినవానింగా, శీలభ్రష్టునిగా, తలఁచునఁట. మఱి యిపుడన్ననో - అహం = నేను, హతస్త్రీకం ఏనం త్వాం = స్త్రీహత్యగావించిన యీనిన్ను, నగరస్త్రీ ... = ఊరియాఁడువారిచేత భయముతో, అర్ధాక్షముగా-సగమగునట్లుగా కన్నులు సంకోచించుకొని చూడఁబడువానిని, పున రపి = మరల ఇంకను, కథం అనుయాయాం = ఎట్లు కూడి వెంటవత్తునయ్యా.

నీవు ఇట్టి పాపము చేయనినాఁడే, నిన్నుంగూడినందులకు నన్ను, గౌరవహీనునిగా, పాపము చేసిన నీచునిగా లోకము పాతికచూపు చూచుచుండెనే. మఱి యిప్పుడు ఇంత ఘోరమహాత్యాపాపము గావించితివే, నిన్ను ఊరియాండ్రు ఎంతయు (భయ జుగుప్సా) సంకోచదృష్టులం జూతురే-అట్టి నీవెంట నేను ఇంకను వత్తునటయ్యా.

శ్లో. అన్యస్యా మపి జాతౌ మా వేశ్యా భూ స్త్వం హి సున్దరి
చారిత్ర్యగుణసంపన్నే జాయేథా విమలే కులే. ४३

శకా—మదీయే పుష్పకరణ్డకజీర్ణోద్యానే వసన్తసేనాం మారయిత్వా కుత్ర పలాయసే. ఏహి. మమ ఆవుత్త స్యాగ్రతో వ్యవహారం దేహి. [మమకేలకే పుష్ఫకలణ్డకజిణ్ణుజ్జాణే వశన్తశేణిఅం మాలిఅ కహిం పలాఅశి. ఏహి. మమ ఆవుత్తశ్శ అగ్గదో వవహాలం దేహి]. (ఇతి ధారయతి.

విటః—ఆః, తిష్ఠ జాల్మ, [ఇతి ఖడ్గ మాకర్షతి].

శకా—(సభయ మపసృత్య) కిం రే, భీతో ఽసి, త ద్గచ్ఛ. [కిం లే, భీదే శి, తా గచ్ఛ].

---

అమ్మా, వసంతసేనా.

శ్లో. ४३. సున్దరి - నీ యీయందముతో నాకన్నుల యెదుట నున్నట్లే ఉన్నావే, ఓ చక్కనిచుక్కా, అన్యస్యాం జాతౌ అపి = వేఱొండు జన్మాన ఐనను, త్వాం మా వేశ్యా భూః = నీవు భోగముదానవు కాకుమా. చారిత్రగుణసంపన్నే = ఏమి నీనడువడి! ఏమి నీగుణాలు! అట్టివానితో నిండినదానా, పాతివ్రత్యపు మేలిమితో కూడుకొన్నదానా, (వానింబట్టియే, అవియే ఆఫలము నీకిచ్చినట్లుగా), విమలే కులే = దోసములేని (బ్రాహ్మణ) కులమున పుట్టుదువుగాక.

నీవు భోగముదానవు కాఁదగినదానవు ఎంతమాత్రము గావు - సరి, పోయినావు, నీనడవడికిని మంచిగుణాలకును, నీపాతివ్రత్యమునకు, ఈతూఁతి మంచి దొడ్డకులమున పుట్టువు గాంతువుగాక.

మమ అవుత్తస్య అగ్రతః = నాబావ (= రాజు) ఎదుట వ్యవహారం దేహి - వ్యాజ్యమున సమాధానము ఇమ్ము - చెప్పుము - నేను వ్యాజ్యము వేసెదను నీమీఁద, సమాధానము చెప్పుము, అనుట. ఇతి ధారయతి = అని పట్టుకొనును.

ఆః తిష్ఠ జాల్మ - ఆ - కోపోక్తి - వివేకహీనుఁడా, నీచుఁడా, నిలు. అని కత్తి దూయును. శకారుఁడు వట్టి పిఱికి, పంద - సభయం = భయముతో, అపసృత్య - ఎడముగా పోయి - తొలఁగి; ఇట్లు తాను భయపడి వానిని అను

విటః—(స్వగతమ్) న యుక్త మవస్థాతుమ్. భవతు. యత్రార్య శర్విలక చన్దనక ప్రభృతయః సన్తి, తత్ర గచ్ఛామి.

(ఇతి నిష్క్రాన్తః.

శకా—నిధనం గచ్ఛ, అరే స్థావరక పుత్రక, కీదృశం మయా కృతమ్. [ణిధణం గచ్ఛ. అలే ధావలకా పుత్తకా, కీలిశే మప కడే].

చేటః—భట్టక, మహా దకార్యం కృతమ్. [భట్టకే, మహాన్తే అకజ్జే కడే].

శకా—అరే చేట, కిం భణ స్యకార్యం కృత మితి. భవతు ఏవం తావత్. (నానాభరణా న్యవతార్య) గృహా ణేమ మలంకారమ్. మయా తావ ద్దత్తమ్. యావత్యాం వేలాయా మలం కరోమి తావతీం వేలాం మమ. అన్యాం తవ. [అలే చేడే, కిం

చున్నాఁడు - భీతః అసి - భయపడితివి! పిఱికి టక్కరిమాఱి. న యుక్తం అవస్థాతుం = ఇక్కడ ఇఁక నుండఁదగదు. కానీ, యత్ర ఆర్య శర్విలక చన్దనక ప్రభృతయః = ఎక్కడ శర్విలకయ్య చందనకుఁడు, మొనలైనవారు - గోపాలకదారకుని పక్షమువారు - వీని బావకుంగానివారు, ఉన్నారో, అక్కడికి పోయి వారిం గూడెదను.

నిష్క్రమించును - నిష్క్రమించువానిం జూచి వానివెనుకనే - నిధనం గచ్ఛ - చావు (పో.) కీదృశం మయా కృతం - ఎట్లున్నదిరా, నేను చేసినది - నాపని? మహత్ అకార్యం = మిక్కిలియు కూడని పని, పెనుబాపము. నానాభరణాని అవతార్య - అన్నినగలను (మేనినుండి) దింపి - దింపి అనఁగా, తీసి. పుచ్చుకోరా యీ అలంకారమును. మయా తావత్ దత్తం - నాచే (నీకు) ఈఁబడినది. యావతీం వేళాం ... = ఎంత సేపు, అలఙ్కరోమి = అలంకరించుకొందునో - పెట్టుకొందునో, తావతీం వేలాం మమ = అంతసేపు, (మమ =) నాను; అన్యాం (వేలాం ఇతి శేషః) తక్కినకాలము, తవ = నీది, అనఁగా ఇవి క్రమాం నీకు ఈయును - నేను పెట్టుకొన్నంతసేపు నావి, తీసిపెట్టునప్పుడు నీవి.

భణాశి అకజ్జే కడేత్తి. భోదు. ఎవ్వం దావ. గేణ్హ ఏదం అలంకారమ్. మప తావ దిణ్ణే. జేత్తికే వేలే అలంకలేమి తేత్తికం వేలం మమ. అణ్ణం తవ ].

చేటః—భట్టక ఏవైతే శోభన్తే ; కిం మమైతైః ? [ భట్టకే జ్జేవ ఏదే శోహన్తి. కిం మమ ఏదేహిం ].

శకా—తద్గచ్ఛ, ఏతౌ వృషభౌ గృహీత్వా మదీయాయాం ప్రాసాదబాలాగ్రప్రతోలికాయాం తిష్ఠ. యావదహ మాగచ్ఛామి. [ తా గచ్ఛ. ఏదాఇం గోణాఇం గేణ్హిఅ మమ కేలకాఏ పాశాద బాలగ్గపదోలికాఏ చిశ్ట. జావ హగ్గే ఆఅచ్ఛామి ].

చేటః—యద్భట్టక ఆజ్ఞాపయతి. [ జం భట్టకే ఆణవేది ].

(ఇతి నిష్క్రాన్తః)

శకా—ఆత్మపరిత్రాణే భావో గతో౽దర్శనమ్. చేటమపి ప్రాసాదబాలాగ్ర ప్రతోలికాయాం నిగడపూరితం కృత్వా స్థాప

భట్టకే ఏవ = దొరయందే - దొరయొంటిమీఁదనే, ఏతే శోభన్తే = ఇవి రాణించును. కిం మమ ఏతే = నాకెందులకు ఇవి ?

తత్ గచ్ఛ = మఱి యిఁక నీవు పో మదీయాయాం = నాదైన, ప్రాసాద బాలాగ్ర ప్రతోలికాయాం - మేడమీఁది క్రొత్త కొసవసారాలో, కాదా చాల క్రొత్త - లేక ఏనుఁగుగున్న బొమ్మగల ముందు (ప్రతోలికాయాం) దారి చెంత కొట్టులో - కొట్టనులే మేలు - దాని ప్రాతకిటికీగుండ వాఁడు తరువాత క్రిందికి దూఁకును. బంగాళా ముందు వాకిటిపై డాబాపై (బాల =) క్రొత్త కొస వసారాలో అందఱు నడయాడు చేపట్టు ప్రక్కన (- అగపడుచును మరలతిప్పించు కొనలేకయు నుండునట్లు) తిష్ఠ = ఉండుము. యావత్ అహం ఆగచ్ఛామి = నేను వచ్చునంతవఱకు, ఇంతలో నేనును వచ్చెదను. ఆత్మపరిత్రాణే = తన్ను కాపాడు కొనుటయందు - ఆప్రయత్నమందు, భావః గతః అదర్శనం = భావ అగపడక పోయినాఁడు. చేటునిం గూడ నామేడమీఁది బాలాగ్రప్రతోలికయందు -

యిష్యామి. ఏవం మన్త్రో రక్షితో భవతి. త ద్గచ్ఛామి. అథవా పశ్యామి తావ దేనామ్, కి మేషా మృతా, అథవా పున రపి మారయిష్యామి. కథం సుమృతా. భవతు. ఏతేన ప్రావారకేణ ప్రచ్ఛాదయా మ్యేనామ్. అథవా నామాఙ్కిత ఏషః. త త్కోఽపి ఆర్యపురుషః ప్రత్యభిజ్ఞాస్యతి. భవతు ఏతేన వాతాలీపుఞ్జితేన శుష్కపర్ణపుటేన ప్రచ్ఛాదయామి. భవతు ఏవం తావత్. సాంప్రత మధికరణం గత్వా వ్యవహారం లేఖయామి, య దార్థస్య కారణా త్సార్థవాహకచారుదత్తకేన మదీయం పుష్పకరణ్డకం జీర్ణోద్యానం ప్రవేశ్య వసన్తసేనా వ్యాపాది తేతి.

---

లేక మిద్దెమీఁద (బాల = క్రొత్త - లేక - ఏనుఁగుగున్న (బొమ్మ) పెట్టియుండు ముందు కొట్టున - ప్రతోలిక - తిరుగాడు దారి, నిగడపూరితం కృత్వా = సంకెళ్ళతో నిండినవానింజేసి, స్థాపయిష్యామి = కదలనీకుండ ఉంచెదను. ఏవం మన్త్రః రక్షితః భవతి = ఈవిధముగా (మన్త్రః =) రహస్యము పొక్కకుండ కాపాడఁబడినది, దాపఁబడినది - అగును. తత్ గచ్ఛామి = కావున ఇఁక పోయెదను. అథవా - అట్లు గాదు. ఈమెను గన (మరలనొకమాఱు) చూతును - ఈపె చచ్చినదా? అథవా=లేక, పున రపి మారయిష్యామి=మరల చంపుదునా? అవలోక్య= చూచి, పరికించి, కథం = ఎట్టూ! సుమృతా = తమాం చచ్చినది. ఏతేన ప్రావారకేణ ... = ఈయుత్తరీయముతో కప్పెదను ఈపెను. అథవా = వలదులే - నామాఙ్కితః ఏషః = పేరు గుర్తు పెట్టఁబడియున్నది. తత్ కః అపి ఆర్య పురుషః = ఎవఁడైనను, (ఆర్యపురుషః =) పూజ్యుఁడైన మానిసి - అక్షరాలు వచ్చినవాఁడు, గుర్తుపట్టఁగలఁడు - భవతు = కానీ. వాతాలీపుఞ్జితేన = గాలులు, దట్టముచేసిన, ప్రోవుగూర్చిన, ఎండుటాకుదొప్పలచేత కప్పెదను. ఆకులు ఎండఁబాఱిన పైన దొప్పలవలె నగును. సాంప్రతం అధికరణం గత్వా = ఇప్పుడు కచ్చేరికి పోయి ఫిర్యాదు వ్రాయించెదను. యథా = ఏమని యనఁగా - అర్థస్యకారణాత్ = డబ్బుకారణమువలన - డబ్బు - నగల - కోసము, వర్తకుఁడైన చారుదత్తిగానిచేత నాదైన పుష్పకరండకము అను ముసలి - ప్రాత - తోఁటలోనికి కొంపోయి, వసంతసేన చంపఁబడినది - అని.

శ్లో. చారుదత్తవినాశాయ కరోమి కపటం నవమ్
నగర్యాం విశుద్ధాయాం పశుఘాత మివ దారుణమ్. ౪౪

భవతు. గచ్ఛామి. (ఇతి నిష్క్రమ్య దృష్ట్వా సభయమ్) అవిద మాదికే. యేన యేన గచ్ఛామి మార్గేణ, తేనైవేష దుష్ట శ్రమణకో గృహీతకషాయోదకం చీవరం గృహీత్వాగచ్ఛతి. ఏష మయా నాసాం ఛిత్త్వా వాహితః కృతవైరః కదాపి మాం ప్రేక్ష్య తేన మారితేతి ప్రకాశయిష్యతి, తత్కథం గచ్ఛామి. (అవలోక్య) భవతు ఏత మర్ధపతితం ప్రాకారఖణ్డ ముల్లఙ్ఘ్య గచ్ఛామి.

---

శ్లో. ౪౪. చారుదత్త వినాశాయ = చారుదత్తుని అడుగంట నాశము చేయుటకు, నవం కపటం = క్రొత్తమాయను - మోసమును, విశుద్ధాయాం నగర్యాం = నిర్మలమైన ఇట్టి హత్యప్రస్తావములు మునుపు లేని - నగరమునందు, దారుణం = ఎంతయు క్రూరమైన, పశుఘాతం ఇవ = నలుగాలి దానిని - గొఱ్ఱెను - జంపుటంబోని దానిని, కరోమి = చేసెదను.

ఘాతలు మొదలైనవి, యెన్నండును లేని నగరమందు క్రూరమగు పశుఘాత వలె, చారుదత్తుని నాశము చేయుటకు ఒక క్రొత్తవిధమగు మాయను, జిత్తును, చేసెదను.

అవిదమాదికే - భయముతోడి యాశ్చర్యమును దెలుపును. శ్రమణకుఁడు ఎదురుపడుటను చూచి అవశకునమును ఎంచుకొని పలుకుట - అబ్బో! యేన గచ్ఛామి మార్గేణ = ఏదారిని నేఁబోవుదునో, తేన ఏవ ... = దాననే ఈ చెడ్డ బౌద్ధ సన్న్యాసి కషాయపురంగునీరు పట్టింపఁబడిన - చాయవేయఁబడిన (తన) గుడ్డను చేతంగొని వచ్చుచున్నాఁడు. ఏష మయా ... = వీఁడు నాచేత ముక్కుకోయఁబడి తఱుమఁగొట్టఁబడినాఁడు, (కావున) పగవాఁడుగా చేయఁబడినాఁడు, కదా అపి - ఎప్పుడైనను ఒకవేళ, మాం ప్రేక్ష్య = నన్ను చూచి, ఏ తేన మారితా ... = వీనిచే చంపఁబడినది అని ప్రకటింపఁగలఁడు. తత్ ... = కావున మఱి యెటు పోవుదును? కానీలే - ఈ సగమువిఱిగి పడిన ప్రహరితునుకను ఎగిరి దాఁటి పోయెదను,

శ్లో. ఏషో ఽస్మి త్వరిత్వరితో లఙ్కానగర్యాం గగనే గచ్ఛన్
భూమ్యాం పాతాలే హనూమచ్ఛిఖర ఇవ మహేన్ద్రః. ౨౫

(ఇతి నిష్క్రాన్తః.

[అత్తపలిత్తాణే భావే గదే అదంశణమ్. చేడం వి పాశాద బాలగ్గపవోలికాఏ ణిగలపూలిదం కదుఅ ధావఇశ్శమ్. ఎవ్వం మన్తె లిక్ఖిదే భోది. తా గచ్ఛామి. అధవా పేక్ఖామి దావ ఏదమ్. కిం ఏశా మలా ఆదు పుణో వి మాలఇశ్శమ్. కధం శుమలా. భోదు. ఏదిణా పావాలఏణ పచ్ఛాదేమి ణమ్. అధవా ణామక్ఖిదే ఏశే. తా కే వి అజ్జపులిశే పచ్చహిజాణేది. భోదు. ఏదిణా వాదాలీపుఞ్జిదేణ శుక్ఖపణ్ణపుడేణ పచ్ఛాదేమి. భోదు. ఎవ్వం దావ. సంపదం అధిఅలణం గచ్ఛిఅ వవహాలం లిహావేమి, జహా అత్థశ్శ కాలణాదో శత్థవాహచాలుదత్తకేణ మమకేలకం పుప్ఫకలణ్డకం జిణ్ణుజ్జాణం పవేశిఅ వశన్తశేణిఆ వావాదిదే త్తి

చాలుదత్తవిణాశాయ కలేమి కవడం ణవమ్
ణఅలీఏ విశుద్ధాఏ పశుఘాదం వ్వ దాలుణమ్.

భోదు. గచ్ఛామి. అవిదమాదికే. జేణ జేణ గచ్ఛామి మగ్గేణ, తేణ జ్జేవ ఏశే దుట్ఠశమణకే గహిదకశాఓదకం చీవలం గేణ్హిఅ

---

శ్లో. ౨౫, ఏషః = ఇదిగో నేను, త్వరిత త్వరితః = ఎంతయుం వడిగలవాఁడనై, లఙ్కానగర్యాం = లంకానగరమందు. గగనే = మింట, భూమ్యాం = మంట, పాతాళే = పాతాళాన, మహేన్ద్రః = మహేంద్రుఁడు, హనూమచ్ఛిఖరే ఇవ = హనుమంతుని శిఖరమందుం బోలె - హనుమంతుఁడు మహేంద్ర (పర్వత) శిఖరమందుంబోలె అనుటకు శకారుని విపరీతభాషితము - నేలను నింగిని పాతాళానం బోవుచుండుఁగా - ఎందును తగులకయుం అన్నిటికిం దగులునట్లును - అనుట - ఒకే పరుగున పోయెదను అనుట. గచ్ఛన్ అస్మి = పోవుచున్నాను.

ఆఅచ్ఛది. ఏశే మప ణశిం చ్ఛిదియ వాహిందే కిదవేలే కదావి మం పేక్ఖిఅ ఏదేణ మాలిదే త్తి పఆశఇశ్శది. తా కధం గచ్ఛామి. భోదు. ఏదం అద్ధపడిదం పాఆలఖణ్డం ఉల్లఙ్ఘిఅ గచ్ఛామి.

ఏశేమ్హి తులిదతులిదే లఙ్కాణఅలిఏ గఅణే గచ్ఛన్తే
భూమీఏ పాఅలే హంసూమశిహలే విఅ మహేన్దే].

(ఇతి నిష్క్రాన్తః)

(ప్రవిశ్యాపటీక్షేపేణ)

సంవాహకో భిక్షుః—ప్రక్షాలిత మేతన్మయా చీవరఖణ్డమ్. కిం ను ఖలు శాఖాయాం శుష్కం కరిష్యామి. ఇహ వానరా విలుమ్పన్తి. కిం ను ఖలు భూమ్యామ్. ధూళిదోషో భవతి. త

---

అపటీక్షేపేణ – తెర వేయకయే – తెరపట్టకయే – సంభ్రాంతుఁడుగా వడివడిగా – ప్రవిశ్య = ప్రవేశించి – అ + పటీక్షేపేణ అని యేని, పట + ఆక్షేపేణ – అనియేని – రంగవ్యవహారము, నాటకాలలో. దానికి సరియైనయర్థము చర్చించి నిర్ణయింపఁ దగును.

సంవాహకః భిక్షుః – రెండవయంకమున జూదరిగా ఓడి, మాథురు ఎదిరి చేతను సభికునిచేతను కొట్టఁబడి, తప్పించుకొని వసంతసేనయింట జొచ్చి, ఆమె దాక్షిణ్యముచే తప్పించుకొని, తాను మునుపు చారుదత్తునికి సంవాహకుఁడుగా ఉంటిననియు, దిక్కుమాలినవాఁడననియు, లోకాన విసివితిననియు, నిర్వేదముం జెంది, ఆమెతోను చెప్పి, శ్రమణకాశ్రమముం జొచ్చినవాఁడు. ఈయంకారంభమున ఒక తూఁటి శకారునికిచిక్కి దెబ్బలు తిని, ఎట్లో విటునిదయచే అంతటనైనను తప్పించుకొని పోయినవాఁడు ఇతఁడే యగును. అప్పుడు అనియుండెను, క్రొత్తగా కావిపట్టించిన తన సన్యాసియుడుపును అచటి కోనేటిలో గుంజుకొనుటకు వచ్చితిని అని. వీఁడు వాఁడ కానోపును. తన యిప్పటి భాషితమును అప్పటిదానితో కలుపుచున్నాఁడు. ప్రక్షాళితం ఇత్యాదిగా. శుష్కంకరిష్యామి = ఎండ వేసికొందునా? ఇక్కడ కోఁతులు చింపును, కాదా కొనిపోవును, నాకు లేకుండఁ జేయును.

త్కుత్ర ప్రసార్య శుష్కం కరిష్యామి. (దృష్ట్వా) భవతు. ఇహ వాతాలీపుఞ్జితే శుష్కపత్రసంచయే ప్రసారయిష్యామి. (తథా కృత్వా) నమో బుద్ధాయ. (ఇత్యుపవిశతి) భవతు ధర్మాక్షరా ణ్యుదాహరామి. ('పఞ్చజనా యేన మారితా' ఇత్యాది పూర్వోక్తం పఠతి.) అథ వాలం మ మైతేన స్వర్గేణ. యావ త్తస్యా వసన్తసేనాయా బుద్ధోపాసికాయాః ప్రత్యుపకారం న కరోమి, యయా దశానాం సువర్ణకానాం కృతేన ద్యూతకారాభ్యాం నిష్క్రీతః, తతః ప్రభృతి తయా క్రీత మి వాత్మాన మవగచ్ఛామి (దృష్ట్వా) కిం ను ఖలు పర్ణోదరే సముచ్ఛ్వసితి. అథవా

---

నేలమీఁద? (వలదు) అక్కడ దుమ్ముదోషము కలుగును. తత్ కుత్ర ప్రసార్య ... = మఱి యెక్కడ పఱచి ఎండినది చేసికొందును? కానీ. ఇహ వాతాలీ పుఞ్జితే ... = ఇక్కడ గాలిచే దట్టముగా ప్రోవుగా త్రోయఁబడిన ఎండుటాకులప్రోవుపై పఱచెదను. (అట్లు పఱచి) నమో బుద్ధాయ = నమస్కారము బుద్ధదేవునికి. ధర్మాక్షరాణి ఉదాహరామి – ధర్మసంబంధమైన మంచియక్షరములు – అనఁగా సూక్తులు – ఉదాహరామి = నోటఁఉచ్చరింతును – అది భిక్షువు ఎప్పుడును చేయవలయునని. పాదుని యనుష్ఠానము. అథవా అలం మమ ఏతేన స్వర్గేణ – ఎందులకు నాకు అది (= అథవా), నాకు ఈస్వర్గము – సుఖము – అక్కఱ లేదు. తృతీయతో 'అలం'కు నిషేధము అర్థము, '... = అవశ్య మపి స నరః స్వర్గం గాహతే. VIII – 2.' యావత్ – ఎంతవఱకు అనఁగా – తస్యాః బుద్ధోపాసికాయాః వసన్తసేనాయాః ... = బౌద్ధసన్న్యాసిని – అనగా శ్రమణకుఁడు – అందఱిని – వారు బౌద్ధులైనను కాకున్నను – బుద్ధోపాసక, బుద్ధోపాసిక అని సంబోధించును, నిర్దేశించును, వ్యవహరించును – అందు ఏమియు తాత్పర్యము లేదు – వట్టి ఆచారమాత్రము – మాటవరుస – ప్రత్యుపకారం నకరోమి – ప్రత్యుపకారము చేయకుందునో – నా చిత్తమంతయు దానిమీఁదనే యున్నది. యయా = ఏమెచేత – అనఁగా ఆమెచేత, ... = పదిదీనారముల కోసము జూదమువలన నేను, నాబాకీ కట్టి, విడిపింపఁబడితినో (= నిష్క్రీతః), తతః ప్రభృతి = అప్పుడు మొదలుకొని, నేను నన్ను, నాశరీరము ఆమెచే కొనఁబడినట్లు, నేను ఆమెకు పరాధీనుఁడ నైపోయినట్లు, అనుకొందును. కిం ను ఖలు పర్ణోదరే ... = ఏమిటి ఆకులలోపల ఊపిరియాడునట్లున్నది!

శ్లో. వాతాతపేన తప్తాని చీవరతోయేన స్తిమితాని పత్రాణి
ఏతాని విస్తీర్ణపత్రాణి మస్త్యే పత్రాణీవ స్ఫురన్తి. ౪౬

[పక్ఖాలిదే ఏశే మఏ చీవలఖణ్డే. కిం ణు క్ఖు శాహాఏ శుక్ఖావఇశ్శమ్. ఇధ వాణలా విలుమ్పన్తి కిం ణు క్ఖు భూమీఏ ధూలీదోశే హోది. తా కహిం పశాలిఅ శుక్ఖావఇశ్శమ్. భోదు. ఇధ వాదాలీపుఞ్జిదే శుక్ఖపత్తసంచఏ పశాలఇశ్శమ్. ణమో బుద్ధశ్శ. భోదు. ధమ్మక్ఖలాఇం ఉదాహలామి. (పఞ్చజణ జ్జేణ మాలిదా' (౮-౨) ఇత్యాది పూర్వోక్తం పఠతి) అధవా అలం మమ ఏదేణ శగ్గేణ జావ తాఏ వశన్తశేణిఆఏ బుద్ధోవాశిఆఏ పచ్చువకాలం ణ కలేమి, జాఏ దశాణం శువణ్ణకాణం కిదే జూదిక లేహిం ణిక్కీదే తదోపహుది తాఏ కీదం విఅ అత్తాణఅం అవగచ్ఛామి. కింణు క్ఖు పణ్ణోదలే శముశ్శశది. అధవా

వాదాదవేణ తత్తా చీవలతోఏణ చిమ్మిదా పత్తా
ఏదే విథిణ్ణపత్తా మణ్ణే పత్తావిఅ ఫులన్తి].

శ్లో: ౪౬. వాతాతపేన = గాలిచేతను ఎండచేతను, తప్తాని = కాఁగినవి, వేఁడియెక్కినవి - తమాం ఎండిపోయినవి, చీవరతోయేన = నా కాషాయవస్త్రపు నీటిచే, తిమితాని = తడిసినవై, విస్తీర్ణం ప్రాప్తాని = వెడల్పుపొందినవి - ఎండినదొప్పంబోని ముడుతలు విప్పారినవై, పత్రాణి = ఆకులు, స్ఫురన్తి ఇవ = కదలుచున్నట్లున్నవి అని తలంతును - ఎండకు ఎండి ముడుచుకొనిపోయినవి క్రొత్త నీటితడుపున ఇంచుక వికసించి విప్పారును అనుట.

విస్తీర్ణపత్రాః = విప్పఁబడిన ఱెక్కలుగల పత్తులవలె - అనియు నగుఁ దగును. పత్త్రిము అనఁగా 'అశాది' చేత ప్రత్త్రి - పక్షి. అని.

(వసన్తసేనా సంజ్ఞాం లబ్ధ్వా హస్తం దర్శయతి)

భిక్షుః—హా హా, శుద్ధాలంకారభూషితః స్త్రీహస్తో నిష్క్రామతి. కథమ్. ద్వితీయో ఽపి హస్తః. (బహువిధం నిర్వర్ణ్య) ప్రత్యభిజానామీ వైతం హస్తమ్. అథవా, కిం విచారేణ. సత్యం, స ఏవ హస్తో యేన మే ఽభయం దత్తమ్. భవతు. పశ్యామి. (నాట్యేనోద్ఘాట్య దృష్ట్వా ప్రత్యభిజ్ఞాయచ) సైవ బుద్ధోపాసికా. [హా హా, శుద్ధాలంకాలభూశిదే ఇత్థిఆ హత్థే ణిక్కమది. కథమ్. దుదియే వి హత్థే. పచ్చభిఆణామివిఅ ఏదం హత్థమ్. అథవా, కిం విచాలేణ, శచ్చం శే జ్జేవ హత్థే జేణ మే అభఅం దిణ్ణమ్. భోదు. పేక్ఖిశ్శమ్. శా జ్జేవ బుద్ధోవాశిఆ].

---

వసన్తసేనా సంజ్ఞాం లబ్ధ్వా = వసంతసేన తెలివి పొంది - మూర్ఛ - కాఁబోలు ఆమెకు శకారుని గొంతుపిసికిడివలనఁ గలిగినది. ప్రాణము తమాం పోలేదు. అది యిప్పటికి దైవయోగమున తేలుచున్నది.

శుద్ధాలఙ్కారభూషితః - మేలి - అసలు బంగారు రతనాలుగల - నగలతో అలంకరింపఁబడియున్నది, అనుట సనిపడదు.

శకారునిఫిర్యాదు, నగలన్నియు ఒలిచి తీసికొని చంపెననిగదా. దానికి రుజువుగా అవి IXలో మైత్రేయుని సంకనుండి పడి చారుదత్తు మెడకు కట్టఁబడును. శుద్ధాలఙ్కారభూషితః - నిరలంకార భూషితముగా - సొమ్ములేకయే (శుద్ధ = ) వట్టిమేని కాంతియే భూషణముగా గలిగి ఉన్నది. ఒకవేళ 'శుద్ధో' ఽనలఙ్కారభూషితః అనియుండునా?

వసంతసేన తనయొంటి మీఁదినగలను 'మృచ్ఛకటి'లో పెట్టి రోహసేనునికి ఇచ్చినది. 'మీయుష్మనైతిని' అన్నది. మఱి నగందాఁకనా? మఱి చారుదత్తుం జూడఁ బోవుటకు 'ప్రసాధయామి' అన్నదే - అది వట్టికడుగుటలు పూయుటలు తొడుగుటలం బోనివే అగును. కాకున్న అలఙ్కారమునకు 'శుద్ధ' అనువిశేషణమేమి? పువ్వులంబోనివి, 'శుద్ధము'లగునా?

(వసన్తసేనా పానీయ మాకాఙ్క్షతి)

భిక్షుః—కథమ్. ఉదకం యాచతే. దూరే చ దీర్ఘికా. కిమిదానీ మత్ర కరిష్యామి. భవతు. ఏత చ్చీవర మస్యా ఉపరి గాలయిష్యామి. [కధమ్. ఉదఅం మగ్గది. దూలే చ దిగ్ఘిఆ. కిం దాణిం ఏత్థ కలఇశ్శమ్. భోదు. ఏదం చీవలం శే ఉవలి గాలఇశ్శమ్]. (తథా కరోతి.

(వసన్తసేనా సంజ్ఞాం లబ్ధ్వోత్తిష్ఠతి భిక్షుః పటాన్తేన వీజయతి)

వసన్త—ఆర్య, క స్త్వమ్. [అజ్జ, కో తుమమ్].

---

రక్తాశోకరుచా విశేషితగుణో బిమ్బాధరాలక్తకః
ప్రత్యాఖ్యాత విశేషకం కురవకం శ్యామావదాతారుణం
ఆక్రాన్తా తిలకక్రియాపితిలకై ర్లగ్నద్విరేఫాఞ్జనైః
సావజ్ఞేన ముఖప్రసాధనవిధౌ శ్రీర్మాధవీయోషితామ్. మాళవిక.

ఇది ముఖ ప్రసాధనమఁట - కాళిదాసు చెప్పినది. చెవికమ్మలు ముక్కుపుడకలు మొదలగు ప్రస్తావములేదు.

ఈచేతిని నేను అనవాలుపట్టుచున్నట్లు అగుచున్నాను - నాకు అడియాలము - గుఱుతు అగుచున్నటు లున్నది. అథవా - అట్లేల, సందియ మేల? కిం విచారేణ = ఆలోచన యెందులకు? సత్యం స ఏవ ... = నిజముగా అదే. నాకు అభయమిచ్చిన చేయియే. అట్లు గుఱుతుకు వచ్చునట్టి యసాధారణలోకోత్తర సౌందర్యముగలది. అనుట, ఉద్ఘాట్య - అకులు తొలఁగించి, దేహము బయటపడునట్లు చేసి, సా ఏవ = ఆమెయే - ఆబుద్ధోపాసికయే - ఆజనమే అనుట - అంతకన్నను బుద్ధోపాసికకు ఎక్కువ యర్థములేదు.

పానీయం ఆకాఙ్క్షతి = త్రాఁగుటకు నీరు కోరుచున్నది - అందులకైన సన్న చేయుచున్నది, గాలయిష్యామి = పిండెదను - పిండి నీరు కాఱునట్లు చేసెదను. తెలివిపొంది లేచుచున్నది. భిక్షువు గుడ్డ చెఱఁగులో - కొంగులో - వీచుచున్నాఁడు.

భిక్షుః—కిం మాం న స్మరతి బుద్ధోపాసికా దశసువర్ణ నిష్క్రీతమ్. [కిం మం ణ శుమలేది బుద్ధోవాశిఆ దశశువణ్ణ ణిక్కీదమ్].

వసన్త—స్మరామి. న పున ర్యథార్యో భణతి. వర మహ ముపర తైవ. [సుమరామి. ణ ఉణ జధాఅజ్జో భణాది. వరం అహం ఉవరదా జ్జేవ].

భిక్షుః—బుద్ధోపాసికే, కిం న్విదమ్. [బుద్ధోపాశిఏ, కిం ణ్ణేదమ్].

వసన్త—(సనిర్వేదమ్) య త్సదృశం వేశభావస్య, [జం సరిసం వేసభావస్స]

భిక్షుః—ఉత్తిష్ఠ తూత్తిష్ఠతు. బుద్ధోపాసికైతాం పాదప సమీపజాతాం లతా మవలమ్బ్య. [ఉట్ఠేదు ఉట్ఠేదు బుద్ధోవాశిఆ ఏదం పాదవసమీవజాదం లదం ఓలమ్బిఅ]

(ఇతి లతాం నామయతి.

(వసన్తసేనా గృహీ త్వోత్తిష్ఠతి)

భిక్షుః—ఏతస్మి న్విహారే మమ ధర్మభగినీ తిష్ఠతి. తత్ర సమాశ్వస్తమనా భూ త్వోపాసికా గేహం గమిష్యతి. త చ్ఛనైః

---

ఆర్య ... = అయ్యా, నీవు ఎవరు? కిం మాం న స్మరతి ... = ఏమి, నన్ను మఱచినదా - పది దీనారములచే విడిపించి కావఁబడినవానిని. వరం అహం ఉపరతా ఏవ = నేను చచ్చియుండిననే మేలు అయ్యేడిని, కిం ను ఇదం = ఇదేమిటి అమ్మా? యత్ సదృశం ... = బోగముతనమునకు ఏది తగునో అది, ఇది - అనుట. ఉత్తిష్ఠతు ... = లేచును గాక ... = చెట్టుప్రక్కన మొలచియున్న యీ తీఁగ౦బట్టుకొని - అని లతాం నామయతి - తీఁగను వంచుచున్నాఁడు. వసంతసేన పట్టుకొని లేచుచున్నది.

ఏతస్మిన్ విహారే - ఈ బౌద్ధాలయములో - బౌద్ధసన్న్యాసులుండు మఠమున, మమ ధర్మభగినీ - నాకు, పూనినసన్న్యాసధర్మముం బట్టిన అక్క, = ఒక బౌద్ధసన్న్యాసిని, పరివ్రాజిక ఉన్నది, తత్ర ... = అక్కడ మనసునకు ఊఱట కలుగు

శనై ర్గచ్ఛతు బుద్ధోపాసికా. (ఇతి పరిక్రామతి. దృష్ట్వా) అప సరత ఆర్యాః. అపసరత. ఏషా తరుణీ స్త్రీ. ఏష భిక్షు రితి శుద్ధో మ మైష ధర్మః

శ్లో. హస్తసంయతో ముఖసంయత
ఇన్ద్రియసంయతః న ఖలు మనుష్యః
కిం కరోతి రాజకులం తస్య
పరలోకో హస్తే నిశ్చలః. ४२

---

వలయు ఉండి, ఇంటికి పోఁగలదు. తత్ - శనైః ... = కావున మెల్లఁగా మెల్లఁగా పోవునుగాక - ఆర్యాః అపసరత - అయ్యలారా, తొలఁగుఁడు(దారి అనుట.) ఏషాతరుణీస్త్రీ. ఏష భిక్షుః - ఈమె జవరాలు, స్త్రీ, ఇతఁడు భిక్షువు - సన్యాసి - ఇతి - అని, శుద్ధః మమ ఏష ధర్మః - నాధర్మము పరిశుద్ధమైనది - ఒరసిచూచినం గదా బంగారు తెలియనగును. నాభిక్షుధర్మము ఒరగంట బంగారువలె పరీక్షకు నిలిచి శుద్ధమైనది; ఈ స్త్రీ సన్నికర్షమున.

శ్లో. ४३. మనుష్యః సః ఖలు = మనుష్యుఁడైన వాఁడు అన్నను హస్త సంయతః - చేతులం గట్టఁబడినవాఁడు, అనఁగా హస్తము ఇతర కర్మేంద్రియముల కును ఉపలక్షణము - కర్మేంద్రియములను నిగ్రహించుకొన్నవాఁడును, ముఖ సంయతః - నోటంగట్టఁబడినవాఁడు. దేని నన్ను దానిని పలుకని కట్టుబాటు గల వాఁడు - ఒకరి భూషణ లేదు దూషణయు లేదు - ధర్మసూక్తులు చెప్పుకొనుట తప్ప, ఇంద్రియసంయతః - బాహ్యేంద్రియములనే కాక మానసాదులైన అంత రింద్రియములను జయించినవాఁడు - (వానికి) కిం కరోతి రాజకులం - రాజు ధర్మా ధర్మములు విచారించు కచ్చేరి, ఏమి సేయును? తస్య = వానికి, పరలోకః = పరలోకము - నిర్వాణస్థానము, హస్తే = (అది) చేత, నిశ్చలః = సందియము లేక - స్థిరముగా (ఉండును).

చేతులు వాక్కు సకలేంద్రియములు - అన్నియు జయించినవానికి ఈలోకానఁ గాని ఆలోకానఁ గాని భయము లేదు. నిర్వాణము స్థిరసిద్ధము.

[ ఏతశ్శిం విహాలే మమ ధమ్మబహిణిఆ చిట్ఠది. తహిం శమ శ్శశిదమణా భవిఅ ఉవాశిఆ గేహం గమిశ్శది. తా శేణం శేణం గచ్ఛదు బుద్ధోవాశిఆ. ఓశలధు అజ్జా, ఓశలధు, ఏశా తలుణీ ఇత్థిఆ, ఏశో భిక్ఖు త్తి శుద్ధో మమ ఏశే ధమ్మే.

హత్థశంజదో ముహశంజదో
ఇన్దియశంజదో శే క్ఖు మాణుశో
కిం కలేది లాఅఉలే తశ్శ
పలలోఅ హత్థే ణిచ్చలే ].

(ఇతి నిష్క్రాన్తః)

ఇతి వసన్తసేనామోటనో నామ

అష్టమో ఽఙ్కః

---

ఈయంకమున పుష్పకరండకమున ప్రొద్దుపుచ్చను శకారుఁడు విటునితో వచ్చును. అందగపడిన ఒక బౌద్ధశ్రమణకుని, చీవరమును కోనేట గుంజుకొనుటకు వచ్చినవానిని హింసయాటల తాను రవంత సేపు వృథాగా సతాయించి పంపును. అంత తామిరువురును ఒక శిలాతలమునం గూరుచుందురు. శకారుఁడు తిరస్కృతుఁడైనను, వసంతసేనం దలుముకొని, ఆమెమీఁదియాస తన మనసును వీడలే దనును. ప్రొద్దు మింటినడిమికి వచ్చినను, మిడియెండ కాయుచున్నను, ఇంకను బండి తోలుకొని రాలేదే చేటుఁడు అని యనుకొనును. కాలక్షేపమునకు గొంతెత్తి పాడి విటునికి వినుచు చుండును,

ఇంతలో చేరవచ్చుచున్న బండివాఁడు, మధ్యాహ్న మైనదే, దొర యేమనునో కదా అని యనుకొనును. అందు కూరుచుండియున్న వసంతసేన ఆగొంతు వర్ధమానకునిదిగా లేదే, నాకు కన్ను గుండె అవశకునముగా అదరుచున్నవి అని యనుకొనును. బండి తోఁటలోనికి వచ్చినది. శకారుఁడు ఎక్కఁబోయి, అందు స్త్రీని కాంచి రాక్షసి యనుకొని భయపడి, విటుం జూడుమనును. వాఁడు అందున్న వసంతసేనం గాంచి, ఓహో శకారు నభిసరించివచ్చినది, చీచీ - అని యనుకొనును. కాదని, బండ్లమాఱుపాటు జరిగిన దని, ఆమె తన్ను కాపాడు మని విటుని బతి

మాలుకొనును. వాఁడును శకారునికి బండిమాన్పి వానిని ఇంటికి నడిపింపఁ బ్రయత్నించును. అది కదురదు. అంతట వసంతసేన నిన్ను అభిసరించి బండిలో వచ్చి యున్నదని శకారునితో అనును, శకారుఁడు కడుసంతసించి మునుపటి తన కాని మాటలకు అనునయము పలుకుచు ఆపెపాదాలలో తల వాల్చును, ఆపె కోపాన ఎగసి తలం దన్నును; అందుల కెంతయు కోపించి, చారుదత్తుదిడ్డివాకిట నిలిపిన తన బండిలో వానిది అని బ్రమసి వాని నభిసరింపవచ్చినదని యెఱింగి బండినుండి దింపి వేసి దానిని చంప నిశ్చయించుకొనును. ఆపె విటుని మరలను శరణుఁజొచ్చినది. శకారుఁడు విటునితో దానిం జంపుము, ఎంతేని ఇనాము ఇత్తును అనును. వాఁడు ఆయసత్కార్యమును తాను చేయఁజాల ననును. అంత అట్లే చేటుని అడుగును. వాఁడును అట్లే అనును. వానిని అంతట నామాట వినవా అని చావఁగొట్టును. చంపినను తాను అసత్కార్యమును చేయ ననును. వసంతసేన మరలను విటుని శరణుజొచ్చును. అంతట శకారుఁడు తానె కాసెబిగించుకొని ఆపెను చంపం గడంగును. ఏమీ, నాయెదురుగా చంపుదువా అని విటుఁడు వానిని గొంతుపట్టి లాఁగి త్రోయును. ఎట్లో లేచి, వారిరువుర నక్కడ లేకుండఁ జేయు నుపాయ మాలోచించి, చేటుని చాటునకు మరుగుచోటికి - పొమ్మని, విటుని అతనియెదుట ఆపె సిగ్గుపడుచున్నది, కావున అవలికి పోయి చేటుని వెదకిపట్టుకొని రమ్మని పంపును. విటుఁడు, అట్లును ఉండునేమో బోగముఁదానిదారు లెవరెఱుంగుదురు అనుకొని, తాను పోఁగడంగి ఒకింత దూరాన నిలిచి పొంచిచూచి, అతఁడు కామి యైనట్లు గ్రహించి, పర్వాలేదని వెడలిపోయెను. అంతట శకారుఁడు వంతసేనం గొట్టి, చారుదత్తుని పేరే మంత్రముగా జపించుచున్న దానిని తన చేతులతోనే గొంతు పిసికి చంపినాఁడు ఆపీనుఁగును అక్కడనే తోఁట - యెండుపంటాకులరాశి - లో దాఁచినాఁడు. పట్టరానిసంతోషముతో నున్నాఁడు. అంతట చేటుం గొని విటుఁడు వచ్చినాఁడు. వానివలన వాని చైదము విని, వసంతసేనం దలఁచుకొని ఎంతయు నేడిచి, ఇఁక నీపొందు నాకు వలదని శకారుని దిగనాడి తాను పితూరి దారులం జేరుదు నని పోయెను. చేటుని బండితోలుకొని ఇల్లు చేరి అందు మిద్దెమీఁది ముందటికొట్టులో నుండు నేను వత్తు నని పంపివేసెను. విటుఁ డేమో ఇటు తన్నుం దాఁచుకొని కాపాడుకొనుటకు పోయినాఁడు, చేటుని నేఁ బోయి సంకెలలం గట్టిగా కట్టియుంతును. ఇఁక దీనికి సాక్షి యెవరు? నేను, దరిద్ర చారుదత్తుఁడు సొమ్ములు తీసికొని వసంతసేనం జంపినాఁ డని కచ్చేరిలో ఫిర్యాదు వేసెద నని ఎంతయు వడిగా, శ్రమణకుఁ డెదురగుటను పాటింపక, ఇల్లు చేరెను.

ఆ శ్రమణకుఁడు తాను గుడ్డను గుంజుకొని వచ్చి, దానిని ఎండవేయను, తెలియక వసంతసేన పీనుఁగుం గప్పిన ఎండుటాకులరాశిపై పఱచును. ఇంతలో అందు మూర్ఛ తొలఁగి ప్రాణము మరలుచున్న వసంతసేన పైకి చాపిన చేయిం జూచి. కప్పు తివిచి గుర్తుపట్టి తన గుడ్డనీళ్లు పైన పిండి తేర్చి, మెల్లఁగా లేపుకొని, సమీపమున తన తోడి సన్న్యాసినులున్న మఠమునకు ఉపచరించి ప్రకృతిం బొందింప చేర్చును.

వసంతసేనం జంపుట అను

ఎనిమిదవ యంకము

ముగిసినది



# నవమోఽఙ్కః

(తతః ప్రవిశతి శోధనకః)

శోధనకః—ఆజ్ఞప్తో ఽ స్మ్యధికరణభోజకైః - 'అరే శోధనక, వ్యవహారమణ్డపం గత్వాసనాని సజ్జీకురు' ఇతి. త ద్యావ దధికరణమణ్డపం సజ్జితుం గచ్ఛామి. (పరిక్ర మ్యావలోక్య చ) ఏషో ఽధికరణమణ్డపః, ఏష ప్రవిశామి (ప్రవిశ్య సంమార్జ్య

---

అంతట శోధనకుఁడు ప్రవేశించుచున్నాఁడు. శోధనకుఁడు అన్వర్థ నాముఁడు - కార్యములను - వ్యవహారములను - విచారించు అధికరణమండపమును చిమ్మి, ఆసనములు తుడిచి, ధర్మాధికారులు వచ్చికూర్చుండి తమపని చేసికొనుటకు అన్నియును తుడిచి సిద్ధముగా నుంచి, వారు పిలిచిన పలుకుచు చెప్పినది చేయుచు, ఉండువాఁడు నౌకరు. శోధనకుఁడు - అని పేరు - సంజ్ఞ.

ఈయంకమున శకారుఁడు అధికరణమున వసంతసేనవధ నేరమును చారు దత్తునిపై మోపుటయు, అది ఋజువగుటయు, చారుదత్తునికి రాజుచే మరణదండన విధింపఁబడుటయు - కథావస్తువు.

అధికరణభోజకైః - ధర్మవిచారణాధికారులచే - ఇది ధర్మము ఇది కాదు అని వ్యాజ్యములలో విచారించి నిర్ణయించువారిచేత - అధికరణమనఁగా వ్యవహార పరీక్ష. దానిని భుజించువారు, పాలించువారు అధికరణభోజకులు, 'జడ్జస్'. ఆసనాని సజ్జీకురు = ఆసనములను సిద్ధపఱుపుము, సజ్జయితుం = సిద్ధపఱుచుటకు, ఏషః... = మణ్డపః, ఏష ప్రవిశామి - ఇట్లు చెప్పుట రంగాన, మంచి తెరలు, ఇది మండపము ఇది ద్వారము - అని తెలియునట్లు, లేనందున. ఇంచుక పరిక్రమించి, వట్టి ఎదుట చోటును మండపము అనుటయు, ద్వార మని తెలియఁగలయట్లు ఏమియు లేనందున, ప్రవేశించెదను అనుమాటచే ద్వారమున్నట్లును చొచ్చినట్లును తలంపవలయు నని. మండపము గాని ద్వారము గాని యెట్టెదుట ప్రేక్షకులకు అగపడుచున్న,

సనమాధాయ) వివిక్తః కారితో మ యాధికరణమణ్డపః, విరచితాని మ యాసనాని. త ద్యావ దధికరణికానాం పున ర్నివేదయామి. (పరిక్ర మ్యావలోక్య చ) కథమ్, ఏష రాష్ట్రియశ్యాలో దుష్ట దుర్జనమనుష్య ఇత ఏ వాగచ్ఛతి. తద్దృష్టిపథం పరిహృత్య గమి ష్యామి.

[ఆణత్తమ్హి అధిఅరణభోఇఏహిం - 'అరే సోహణఆ, వవహార మణ్డవం గదుఅ ఆసణాఇం సజ్జీకరేహి' త్తి. తా జావ అధిఅరణ మణ్డవం సజ్జిదుం గచ్ఛామి. ఏదం అధిఅరణమణ్డవమ్. ఏస పవి సామి. వివిత్తం కారిదం మఏ అధిఅరణమణ్డవమ్. విరఇదా మఏ ఆసణా, తా జావ అధిఅరణిఆణం ఉణ ణివేదేమి. కధమ్, ఏసో రట్టిఅస్సాలో దుట్టదుజ్జణమణుస్సో ఇదో ఎవ్వ ఆఅచ్ఛది. తా దిట్టిపధం పరిహారిఅ గమిస్సమ్. (ఇ త్యేకాన్తే స్థితః.

(తతః ప్రవిశ త్యుజ్జ్వలవేషధారీ శకారః)

శకారః—

---

ఈమాటలు చెప్ప నేల? వివిక్తః = నిర్జనము - విరచితాని ... = ఆసనములను ఏర్పఱిచితిని. కథం! = ఎట్టూ! - ఆశ్చర్యార్థకము - ప్రకారార్థకము గాదు - దుష్టదుర్జన మనుష్యః - వాఁడు నగరమున - పాలకరాజ్యమున - అట్లు ప్రసిద్ధుఁడై ఉన్నాఁడు - వీనిలోనే పాలకుఁ డిట్టివానికి చోరవ చనువు ఇచ్చినవాఁ డని ప్రసిద్ధుఁడై యుండుట పరికింపఁదగును. పాలకరాజ్య - అధార్మికస్థితిం దెలుపుటకే శకారుఁడు - వాఁడు మా బావతో తంటా చెప్పెదు నని కంఠరవము తోడనే చెప్పును. తద్దృష్టిపథం పరిహృత్య - వానికి అగపడకుండ - అగపడిన వాఁ డేమేని అనఁగూడనిది అనును, వానికి. ఏకాన్తే - వానికి అగపడని మఱుఁ గైన రహస్యపుఁజోట. ఉజ్జ్వలవేషధారీ - కన్నులకు మిఱుమిట్లు గొలుపు వేషము - బంగారును వెండియు నగలుగా మేన, సరిగయుడుపులునుం గాఁబోలు.

శ్లో. స్నాతో౽హం సలిలజలైః పానీయై
రుద్యాన ఉపవనకానసే నిషణ్ణః
నారీభిః సహ యువతిభిః
స్త్రీభి ర్గన్ధర్వైః సువిహితై రఙ్గకైః. ౧

[ణ్హాదే హం శలిలజలేహిం పాణీఏహిం
ఉజ్జాణే ఉవవణకాణణే ణిశణ్ణే
ణాలీహిం శహ జువదీహిం ఇత్థిఆహిం
గన్ధవ్వేహిం శువిహిదఏహిం అఙ్గకేహిం]

శ్లో. క్షణేన గ్రన్థిః క్షణజూటికా మే
క్షణేన బాలా క్షణకున్తలా వా
క్షణేన ముక్తాః క్షణ మూర్ధ్వచూడా
శ్చిత్రో విచిత్రో౽హం రాజశ్యాలః. ౨

శ్లో. ౧. అహం = నేను, సలిలజలైః పానీయైః = నీళ్ళతో, స్నాతః = స్నానము చేసినవాఁడనై, ఉద్యానే ఉపవనకానసే = మాయింటి తోఁటలో, నారీభిః యువతీభిః స్త్రీభిః సహ = జవరాండ్రతో కూడ, నిషణ్ణః సన్ = కూరు చున్నవాఁడనై, సువిహితైః అఙ్గైః = అవయవములను చక్కఁగా అలంకరించుకొన్న వాఁడనై, చక్కఁగా అలంకరించుకొనఁబడిన అంగములతో, గన్ధర్వః ఇవ = గంధ ర్వునివలె (ఉన్నాను.)

నేను నీళ్ళతో స్నానము చేసి, అంగములను చక్కఁగా అలంకరించుకొన్న వాఁడనై, తోఁటలో జవరాండ్రం గూడి కూర్చున్నవాఁడనై గంధర్వునివలె ఉన్నాను. ఉంటిని — ఇటు కదలివచ్చు వఱకు — అనుట.

ఇందలి పునరుక్తులు అన్నియు శకార భాషా స్వభావ సులభములు.

శ్లో. ౨. మే = నాకు, క్షణేన గ్రన్థిః — ఒకక్షణము ముడి, క్షణ జూటకః వా — ఒకక్షణము జడ, క్షణేన వాలాః = క్షణము వెండ్రుకలు, ముక్తాః = ఊరక విడిచిపెట్టఁబడినవి, క్షణం ఊర్ధ్వః చూడః = ఒకక్షణము పైకిఎత్తికట్టఁబడిన

[ఖణేణ గణ్ఠీ ఖణజూలకే మే
ఖణేణ బాలా ఖణకున్తలే వా
ఖణేణ ముక్కే ఖణ ఉద్ధచూడే
చిత్తే విచిత్తే హగే లాఅశాలే].

అపి చ, విషగ్రన్థిగర్భప్రతిష్ఠే నేవ కీటకే నాన్తరం మార్గమాణేన ప్రాప్తం మయా మహ దన్తరమ్. తత్క స్యేదం కృపణచేష్టితం పాతయిష్యామి. (స్మృత్వా) ఆం, స్మృతం మయా. దరిద్రచారుదత్త స్యేదం కృపణచేష్టితం పాతయిష్యామి. అన్యచ్చ, దరిద్రః ఖలు సః. తస్య సర్వం సంభావ్యతే. భవతు. అధికరణమణ్డపం

---

జుట్టు - తలవెండ్రుకలను ఇట్లు బహుభంగుల పెట్టుకొన్నవాఁడు - రాజశ్యాలః అహం = రాజుమఱఁదిని నేను, చిత్రః విచిత్రః - ఆశ్చర్య చేష్టితుఁడనుగా ఉన్నాను. ఆసాయంకాలము రాత్రియు పట్టరాని సంతోషమున ఇదే తలపోఁత.

వసంతసేనం జంపి, దానికి సాధ్యము లేకుండ తప్పించుకొని వచ్చి యిల్లుచేరి నాఁడు - కసి తీర్చుకొన్నాఁడు, చారుదత్తుని పగతీర్చుకొన మార్గము నిశ్చ యించుకొన్నాఁడు - శకారునికి వట్టి ఒళ్లు తెలియని త్రుళ్లు కలిగి యున్నది - దాని వాగారంభము ఈశ్లోకాలు.

విషగ్రన్థిమధ్యప్రవిష్టేన = విషపు - వసనాభి (?) - గణుపునం జొచ్చిన, పురువువలె (వెలువడు - అంతరం = ) దారి, అవకాశము వెదకుచున్న నాకు - వసంతసేనపై కసి తీర్చుకొనుటకు, మహత్ అన్తరం = పెద యవకాశము, సందు, దొరకినది, దానినేమో చేతులార సొంతముగా మెడ నులిమివేసితిని. తత్ కస్య ఇదం ... = మఱి ఎవనికి - ఎవనిమీఁద ఈపాడుపనిని పెట్టుదును? ఆం - జ్ఞప్తి తెచ్చుకొనుటం దెలుపును. ఆ - అన్నట్లు - అవును - అన్నట్లు. స్మృతం మయా = నాకు జ్ఞప్తికివచ్చినది, దరిద్రచారుదత్తస్య - దరిద్రుఁడైన చారుదత్తునికి - చారుదత్తునిమీఁద. అన్యచ్చ - మఱి యొకటియు. దరిద్రః ఖలు సః = వాఁడు బీద వాఁడు గదా - తస్య సర్వం సంభావ్యతే - వానికి - వానియెడ - అన్నియు - సరి, ఉండవచ్చును, కాఁబోలు - అని యెంచఁదగి, నమ్మఁదగియుండును. 'Every

గ త్యాగ్రతో వ్యవహారం లేఖయిష్యామి, యథా చారుదత్తేన వసన్తసేనా మోటయిత్వా మారితా. త ద్యావ దధికరణమణ్డప మేవ గచ్ఛామి. (పరిక్ర మ్యావలోక్య చ) ఏష సో ఽధికరణ మణ్డపః. అత్ర ప్రవిశామి. కథమ్, ఆసనాని దత్తాని తిష్ఠన్తి. యావ దాగచ్ఛ న్త్యధికరణభోజకాః, తావ దేతస్మి న్దూర్వాచత్వరే ముహూర్త ముపవిశ్య ప్రతిపాలయిష్యామి.

[అవిల, విశగణ్ఠిగబ్భపవిశ్టేణ విఅ కీడపణ అన్తలం మగ్గమాణేణ పావిదం మఏ మహ దన్తలమ్. తా కశ్శ ఏదం కివిణచేశ్టిఅం పాడఇశ్శమ్. ఆం, శుమలిదం మఏ, దలిద్దచాలుదత్తశ్శ ఇదం కివిణచేశ్టిఅం పాడఇశ్శమ్. అణ్ణాం చ దలిద్దే క్ఖు శే. తశ్శ శవ్వాం శంభావీఅది. భోదు. అధిఅలణమణ్డవం గదుఅ అగ్గదో వవహాలం లిహావఇశ్శమ్, జధా చాలుదత్తకేణ వశన్తశేణిఆ మోడిఅ మాలిదా. తా జావ అధిఅలణమణ్డవం జ్జేవ గచ్ఛామి. ఏదం తం అధిఅలణమణ్డవమ్. ఏత్థ పవిశామి. కథమ్, ఆశణాఇం దిణ్ణాఇం చిశ్టన్తి. జావ ఆఅశ్శన్తి అధిఅలణభోఇఆ, దావ ఏదశ్శిం దువ్వాచత్తలే ముహుత్తఅం ఉవవిశిఅ పడివాలఇశ్శమ్]. (తథా స్థితః.

---

thing will be believed in him.' (వే. వెం.) అగ్రతః = అన్నిటికంటెను ముందుగా, ఈదినానికి ఇదియేతొలిది యగునట్లుగా, వ్యాజ్యము వ్రాయించెదను - యథా = ఏమని యనఁగా. - చారుదత్తేన వసన్తసేనా ... = చారుదత్తునిచేత ... = నలిపి - గొంతు - పిసికి అనుట - చంపఁబడినది. తత్ యావత్ ... = కనుక వ్యవహార మండపమునకే పోయెదను.

కథం=ఎట్లూ! ఆసనాని ...=ఆసనములు వేయఁబడియున్నవి.-కనుక ఇఁకను ఆలస్య ముండదు. ఇంతలో ప్రాడ్వివాకులు - వ్యవహారము విచారించు ధర్మాధికారులు - దూర్వాచత్వరే - పచ్చిగడ్డి (మొలచియున్న) ముంగిట, ముహూర్తం ... = రవంతసేపు కూర్చుండి వేఁచియుందును, ఆపచ్చికముంగిలి మండపమునకు ముందు వ్యవహారపుఁ బనులమీఁద వచ్చువారు కూర్చుండుటకు ఉద్దేశిం

శోధ — (అన్యతః పరిక్రమ్య, పురో దృష్ట్వా) ఏతే ఽధికరణికా ఆగచ్ఛన్తి. తద్యావ దుపసర్పామి. [ఏదే అధిఅరణిఆ ఆఅచ్ఛన్తి. తా జావ ఉవసప్పామి]. (ఇ త్యుపసర్పతి)

(తతః ప్రవిశతి శ్రేష్ఠికాయస్థాదిపరివృతో ఽధికరణికః)

అధికరణికః — భో భోః శ్రేష్ఠికాయస్థౌ.

శ్రేష్ఠికాయస్థౌ — ఆజ్ఞాపయ త్వార్యః. [ఆణవేదు అజ్జో].

---

పంబడిన దేమో. అధికరణికః - ధర్మము విచారించి నిర్ణయించు అధికారి - Magistrate - అని యందురే, వీరితో ప్రాయికముగా రాజును ఉండవలయును - వీరు రాజునకు సహాయులే. ఏదేని కారణముచేత రాజు ఖుద్దున ఉండలేనప్పుడు, అధికరణికుండు - ప్రాడ్వివాకుండే - తీర్మానించును - ధర్మగతికి దాన ఆలస్యమును వాయిదా పడుటయు ఉండదు. ఇపు డిక్కడ రాజు యజ్ఞాన వ్యాపృతుండై యజ్ఞవాటమున ఉన్నాండు - రాలేక పోయినాండు. కావున అధికరణికుండే, చూ - కాకం - VI. E.

"వేత్రవతి, చిరప్రబోధా న్నసంభావితం అస్మాభి ర్ధర్మాసన మధ్యాసితుమ్ - య త్పునరిత్యవేక్షితం పౌరకార్యం. ఆర్యేణ, త త్పత్రమారోప్య దీయతా. మితి."

అధికరణికుండు వ్యవహారముం జూచువాండు - శ్రేష్ఠి డబ్బు దండన మొదలయినవానిని వ్యవహారవశమునం గలుగువానిని పరీక్షించుట లెక్కించుట మొదలగునవి చేయు సహాయుండు, గుమాస్తా. కాయస్థుండు, వ్యవహారమును వ్రాయువాండు - అతండును ఒక గుమాస్తా.

సప్రాడ్వివాకః సామాత్యః సబ్రాహ్మణ పురోహితః
ససభ్యః ప్రేక్షకో రాజా, స్వర్గే తిష్ఠతి ధర్మతః
... ... ... ... ...
లోకరక్షానార్థం కతిపయై ర్వణిగ్భి ర ప్యధిష్ఠితం
సదః కర్తవ్యమ్.
కుల శీల వయో వృత్త విత్తవద్భి రమత్సరైః

అధి—అహో, వ్యవహారపరాధీనతయా దుష్కరం ఖలు పరచిత్తగ్రహణ మధికరణికైః

శ్లో. ఛన్నం కార్య ముపక్షిపన్తి పురుషా
న్యాయేన దూరీకృతం

---

వణిగ్భిః స్యాత్ కతిపయైః కులభూతై రధిష్ఠితమ్.
అపశ్యతా కార్యవశాద్ వ్యవహారాన్ నృపేణ తు
సభ్యైః సహ నియోక్తవ్యో బ్రాహ్మణః సర్వధర్మవిత్.

వ్యవహారలక్షణము - మితాక్షర.

ప్రతిజ్ఞోత్తర సంశయ హేతుపరామర్శ ప్రమాణ నిర్ణయ ప్రయోజనాత్మకో వ్యవహారః

"వ్యవహార దర్శనమ్ = వ్యవహార పదమ్ = Judicial investigation. అధికరణమున కార్య - కజ్జా - విచారణ. వ్యవహారపాదః - any one of the four stages of a legal proceeding. These are four—

(1) పూర్వపక్ష - The Plaint, (2) ఉత్తరపక్ష = The Defence, (3) క్రియాపాద - Adducing evidence, oral or written. - (4) నిర్ణయపాద - That part which Concerns the verdict or decision. వ్యవహారస్థితి Judicial procedure." — Apte.

అహో వ్యవహార పరాధీనతయా ... = పిర్యాది చెప్పినదానిని, ప్రతివాది ముద్దాయి, చెప్పినదానిని, ఆవ్యవహారమున ప్రకటప్రకసక్తమైనదానిని మాత్రము అనుసరించి నిజము తేల్చి ధర్మనిర్ణయము చేయవలసినందున, తనకు బయటి యితర విధములచే తెలిసినదానిని ఉపయోగింపఁగూడనందున ధర్మనిర్ణయము ఎంతయు క్లేశావహ మని తలపోసికొనుట. పిర్యాది = వాది - మనసున నిజముగా నేమున్నదో, ముద్దాయి - ప్రతివాది - మనసున నిజముగా ఏమున్నదో, అందు దూఱి కనుఁగొనుట శక్యముగాని పని.

శ్లో. 3. పురుషాః = జనులు, వ్యవహారమున సంబంధపడిన ఫిర్యాది ముద్దాయీలు - వాదిప్రతివాదులు - న్యాయేన = ప్రత్యక్షాది ప్రమాణములకు, దూరీకృతం = (అందక) ఎడసిపోయినట్టియు, ఛన్నం = నిజము దాపఁబడినట్టియు,

స్వాన్దోషా న్కథయన్తి నాధికరణే
రాగాభిభూతాః స్వయమ్
తైః పక్షాపరపక్షవర్ధితబలై
ర్దోషై ర్నృపః స్పృశ్యతే
సంక్షేపా దపవాద ఏవ సులభో
ద్రష్టు ర్గుణో దూరతః. 3

అపిచ,

---

కార్యం = వ్యవహారమును - కజ్జాను, ఉపక్షిప న్తి = తొడంగుదురు. అధికరణే = వ్యవహారవిచారణస్థానమున, రాగాభిభూతాః = కజ్జాలో సాధింపవలయును, జయింపవలయు ననుకోరికచే ఎంతయు పైకొనఁబడినవారై, స్వయం = సొంతముగా, స్వాన్ = తమ తప్పును, పొరఁబాట్లను, న కథయ న్తి = చెప్పరు. పక్ష అపరపక్ష వర్ధిత బలైః ఒకళ్లొకళ్ళమీఁద పెంపొందించిన దోషములుగల, తైః = వారిచేత, నృపః = రాజు, స్పృశ్యతే = అంటఁబడును. ఏలన దండ్యుని దండింపనియు, అదండ్యుని దండించినట్టియు దోషము - పాపము - రాజునకు చెందు నని మన్వాదుల శాస్త్రము. (కావున) సజ్క్షేపాత్ = టూకీగా చెప్పుటవలన - విస్తరము మానినట్లయిన, ద్రష్టుః = విచారించువానికి - ప్రాడ్వివాకునికి, అపవాదః ఏవ = దూఱే, సులభః = సులువుగా కలుగును; గుణః = ప్రశంస, దూరతః - చేరరాదు - తొలఁగి పోవును.

వాది తనతట్టుకు బలముగూర్చు వానిని మాత్రమే చెప్పును. ఇతరమును అడంచును. ప్రతివాదియు అట్లే. తమ తమ పద్దు సాధించుకొనుటకై, తమలో నున్న తప్పులను బయటికి రానీరు. ఆ తప్పులు, ప్రాడ్వివాకుఁడు కనుగొనలేకున్న, వానిని అంటును. వాఁడు నిజముగా దండ్యుని కనిపట్టలేక దండింపక పోయినను, అదండ్యుని కనిపట్టలేక దండించినను, ఆ దోషము పాపము వానిని అంటును - మొత్తమునకు, టూకీగా చెప్పవలయునేని వానికి లోకాన దూఱే సులువుగా కలుగును, మెప్పు ఎప్పుడో ఎక్కడనో!

శ్లో. ఛన్నం దోష ముదాహరన్తి కుపితా
న్యాయేన దూరీకృతాః
స్వా న్దోషా న్కథయన్తి నాధికరణే
సన్తో ఽపి నష్టా ధ్రువమ్
యే పక్షాపరపక్షదోషసహితాః
పాపాని సంకుర్వతే
సంక్షేపా దపవాద ఏవ సులభో
ద్రష్టు ర్గుణో దూరతః. ౪

యతః, అధికరణికః ఖలు

---

శ్లో. ౪. అధికరణే = ధర్మవిచారణ కచ్చేరిలో, సన్తః = సజ్జనులు, సాధువులు, సాక్షులుగా వచ్చినవారు (?) యే = ఎవరు, అనగవారు, పక్షపరపక్ష కుపితాః = (ఎదిరిమీఁద) కోపము చెందినవారై, న్యాయేన దూరీకృతాః = ఆర్జవమునకు ఎడసినవారై, (కౌటిల్యము పూని) ఛన్నం = (ఎదిరిచేత) దాఁపఁబడిన, దోషం = తప్పును, ఉదాహరన్తి = చెప్పుదురు, (కాని) స్వాన్ దోషాన్ = తమ (పక్షపు) దోషాలను, న కథయన్తి = చెప్పరు. దోషసహితాః = తమవారియు ఎదిరియు దోషములతో కూడుకొన్నవారై - పాపాని సంకుర్వతే = (అమార్గాన) దోషములు చేయుదురు, కూడఁబెట్టుకొందురు. (తే = వారు), సన్తః అపి = సాధువులుఐనను, నష్టాః = చెడినవారే - పాడైపోయినవారే - ధ్రువం = నిజము, సందియములేదు. సంక్షేపాత్ అపవాద ఏవ ... పూర్వశ్లోకమునం బోలెనే,

వాదిప్రతివాదులం గూర్చిన మాటయే వారి వారి సాక్షులంగూర్చియు చెప్పఁదగును. వారు ఎంత సజ్జను లయినను, తాము ఏతట్టునకై వత్తురో దానికి బలము గూర్ప, ఎదిరికి లేని దోషమును చెప్పి ఉన్న మంచిని అడంపవలసినవా రగుదురు. వారి సాక్ష్యమును అధికరణికునికి ఉపకరింపదు. వానికి అపవాదమే సిద్ధించును, గుణము ఎక్కడికో పోవును.

యతః - ఏలయన, అధికరణికః ఖలు - ప్రాడ్వివాకుఁడు గన.

శ్లో. శాస్త్రజ్ఞః కపటానుసారకుశలో
వక్తా న చ క్రోధన
స్తుల్యో మిత్రపరస్వకేషు చరితం
దృష్ట్వైవ దత్తోత్తరః
క్లీబాన్పాలయితా శఠాన్వ్యథయితా
ధర్మ్యో న లోభాన్వితో
ద్వార్భావే పరతత్త్వబద్ధహృదయో
రాజ్ఞశ్చ కోపాపహః. ౫

---

శ్లో. ౫. శాస్త్రజ్ఞః - (ధర్మ - ఆది) శాస్త్రముల నెఱిఁగినవాఁడు - ఇతరశాస్త్రజ్ఞానమును ఆవశ్యకమే; కపట అనుసార కుశలః - వ్యవహారమునకు వచ్చిన వాది ప్రతివాదులయుం, ఉభయసాక్షులయుం, ఇంకను ఇతరులయుం, మోసమును అనుసరించి (దాని గుట్టును కనుగొనుటయందు) నేర్పరి; వక్తా = (పొందికగా, నేర్పుగా) మాటలాడువాఁడును; (కాఁదగును) న చ క్రోధనః - కోప స్వభావముగలవాఁడు ఎంతమాత్రము కాఁగూడదు; మిత్ర పర స్వకేషు = మిత్రులయుం, ఇతరులయుం - శత్రువులయుం, ఉదాసీనులయుం, - తన సొంతమైనవారియు నెడ, తుల్యః = సముఁడు - పక్షపాత ద్వేషములు గాని మొండి తాటస్థ్యము గాని లేకుండువాఁడు, చరితం దృష్ట్వా ఏవ = నడవడిని - వ్యాపారమును, తనకు అప్పుడు ఎదుటఁ జరిగినదానిని, దృష్ట్వా ఏవ = చూచియే, దత్తోత్తరః = జవాబు చెప్పువాఁడును; క్లీబాన్ = అసమర్థులను - నిజమునైనను చెప్ప వెఱచు నశక్తులను, పాలయితా = కాపాడువాఁడును, శఠాన్ = ఎదుట ఒకరీతిగా మఱుఁగున నొకరీతిగా నుండు వంచకులను, వ్యథయితా = బాధ పెట్టువాఁడును - కార్యమును మాన్పఁ బ్రయత్నించువాఁడును, ధర్మ్యః = (తాను) ధర్మము వీడనివాఁడును, న లోభాన్వితః = సొంతమునకు ఏమేని కావలయునన్న ఆస లేనివాఁడును, భావే = భావే = భావముల విషయమున - ఎప్పుడు ఎవరియెడ దేనికి ఏభావము వహింపవలయునో, దానికి - తన మనసులోన ప్రవేశించుటకు - తెఱచిపెట్టిన - ద్వాః ద్వారమైన వాఁడును, కఠినుఁడు కాని వాఁడును చుఱుకైవాఁడును, పర తత్త్వ బద్ధ హృదయః - (ఇన్ని మేలుములును

శ్రేష్ఠి—ఆర్యస్యాపి నామ గుణే దోష ఇత్యుచ్యతే. యద్యేవమ్, తదా చన్ద్రాలోకే ఉప్యన్ధకార ఇత్యుచ్యతే. [ అజ్జస్స వి ణామ గుణే దోసో త్తి వుచ్చది. జఇ ఎవ్వమ్, తా చాన్దాలోఏ పిఅన్ధఆరో త్తి వుచ్చది ].

---

తనకు కలుగుటకు) చిత్తమును పరతత్త్వమందు చింతాధ్యానములచే కట్టియుంచిన వాఁడును, ఏకాగ్రముగా నిలిపిన వాఁడును - అవన్నియు ఒక యెత్తు, ఇవి యొక యెత్తు అనుటగా - రాజ్ఞశ్చ = రాజునకును, కోపాపహః = (నచ్చఁజెప్పి) కోపము తొలఁగించువాఁడును. (కాఁదగును.)

ప్రాడ్వివాకుఁడు, తగవరి - ఇన్ని గుణములు కలిగిఉండవలయును, ఇవన్నియు నాయందుఁ గలవా? నేను ఎట్లు వ్యవహారనిర్ణయము చేయుదునో కదా. వినయముచేతను, ధర్మలోపము కలిగింతునో అను భయముచేతను ఈతల పోత అనఁగా ధర్మనిర్ణయమున లెస్సగానే మనసు ఉంచియున్నాఁడు - అట్లు ఉంచువాఁడే - అనుట.

ఐనను ఇతఁడేమి క్రొత్తవాఁడా? చిరకాలముగా తగవరిగా నుండువాఁడే కదా, ఇపుడు ఈ 3, 4, 5 శ్లోకాల తలపోఁత ఇతనికి ఏల? పనిలో చొరవలసినది - అందు ఏదేని సందర్భము కలిగిన అప్పుడు తదనుగుణముగా ఏదేని తల పోతకు చోరఁదగును, లేక ప్రతిదినము తన యాసనమునకు రాఁగానే ఏతత్కార్య గౌరవముం బట్టి ఈతలపోత ఒకమాఱు చిత్తమున లేచుచునే యుండునా? లేపు కొనుచునే ఉండఁదగునేమో.

ఆర్యస్య అపినామ గుణే దోషః ఇతి ఉచ్యతే? = ఏమి, ఆర్యునియు - ఆర్యుని యొక్కయు గుణమున దోషమని, చెప్పఁబడునా? 'If even your merits are decreed as drawbacks' వే. వేం. దోషమే లేదు, అంతయు గుణమే అను శ్లాఘ. వీరు అతని నౌకరులు - వీరి ఇచ్చకపుమాటయు కాఁదగును. ఆయనకు సర్వగుణశాలి యను ప్రసిద్ధియు ఉండఁదగును. యది ఏవమ్ ... = అట్లేని, ఆర్యుని గుణానను దోషము చెప్పిన అప్పుడు వెన్నెలలోను చీకటి అని చెప్పఁబడును.

అధి—భద్ర, శోధనక, అధికరణమణ్డపస్య మార్గమాదేశయ.

శోధ—ఏ త్వేతు అధికరణభోజక, ఏతు. [ఏదు ఏదు అధిఅరణభోఇఓ, ఏదు]

(ఇతి పరిక్రామన్తి)

శోధ—అయ మధికరణమణ్డపః. త త్ప్రవిశ న్త్వధికరణ భోజకాః. [ఏదం అధిఅరణమణ్డవమ్. తా పవిసన్తు అధిఅరణ భోఇఆ].

(సర్వే చ ప్రవిశన్తి)

అధి—భద్ర శోధనక, బహిర్నిష్క్రమ్య జ్ఞాయతామ్ — 'కః కః కార్యార్థీ' ఇతి.

శోధ—య దార్య ఆజ్ఞాపయతి (ఇతి నిష్క్రమ్య) ఆర్యాః, అధికరణికా భణన్తి — 'కః క ఇహ కార్యార్థీ' ఇతి. [జం అజ్జో ఆణవేది. అజ్జా అధిఅరణిఆ భణన్తి — 'కో కో ఇధ కజ్జత్థీ' త్తి].

శకా—(సహర్షమ్) ఉపస్థితా అధికరణికాః. (సాటోపం పరిక్రమ్య) అహంవరపురుషో మనుష్యో వాసుదేవో రాష్ట్రియశ్యాలో రాజశ్యాలః కార్యార్థీ. [ఉవత్థిఏ అధిఅలణిఏ. హగ్గే వలపులిశే మణుశ్శే వాశుదేవే లష్టిఅశాలే లాఅశాలే కజ్జత్థీ].

---

బహి నిష్క్రమ్య జ్ఞాయతాం - బయటికి పోయి కనుగొనుము - ఎవరెవరు కార్యము - వ్యవహారము - కోరినవారు, వ్యాజ్యెము వేయను, వచ్చియున్నారు అని. సహర్షమ్ = సంతోషముతో - ఉపస్థితాః = వచ్చినారు. అహం ... = కార్యార్థీ = నేను వ్యవహారము గోరి వచ్చియున్నాఁడను. తన కార్యమును ముందు విచారింపవలయును, తనకు అనుకూలముగాను - అని సూచించుటకు తన గొప్పను మామూలు పునరుక్తులతో చెప్పుచున్నాఁడు - అందు ముఖ్యమైన మాట-

శోధ—( ససంభ్రమమ్ ) హన్త, ప్రథమ మేవ రాష్ట్రియ శ్యాలః కార్యార్థీ. భవతు. ఆర్య, ముహూర్తం తిష్ఠ. తావ దధి కరణికానాం నివేదయామి, (ఉపగమ్య) ఆర్యాః, ఏష ఖలు రాష్ట్రియశ్యాలః కార్యార్థీ వ్యవహార ముపస్థితః. [ హీమాదికే, పఢమం జ్జేవ రట్ఠిఅసాలో కజ్జత్థీ. భోదు. అజ్జ, ముహుత్తం చిట్ఠ. దావ అధిఅరణిఆణం ణివేదేమి. అజ్జా, ఏసో క్ఖు రట్ఠిఅసాలో కజ్జత్థీ వవహారం ఉవత్థిదో ].

అధి—కథమ్, ప్రథమ మేవ రాష్ట్రియశ్యాలః కార్యార్థీ. యథాసూర్యోదయ ఉపరాగో మహాపురుషనిపాత మేవ కథయతి. శోధనక, వ్యాకులే నాద్య వ్యవహారేణ భవితవ్యమ్. భద్ర, నిష్క్రమ్యోచ్యతామ్ — 'గ చ్ఛాద్య, న దృశ్యతే తవ వ్యవహారః' ఇతి.

శోధ—య దార్య ఆజ్ఞాపయతి. (నిష్క్రమ్య శకార ముప గమ్య ) ఆర్య, అధికరణికా భణన్తి — 'అద్య గచ్ఛ న దృశ్యతే తవ వ్యవహారః' [ జం అజ్జో ఆణవేది త్తి. అజ్జ, అధిఅరణిఆ భణన్తి - 'అజ్జ, గచ్ఛ, ణ దీశది తవ వవహాలో' ].

'రాజశ్యాలః' అనుట - రాజుమఱఁదిని. వ్యవహారం ఉపస్థితః - వ్యవహారము (ప్రాప్తః = ) పొందినాఁడు - వ్యవహారమునకై అర్జీ వేయుటకై - పిర్యాదు చేయుటకై - వచ్చినాఁడు.

కథమ్ = ఎట్టూ! తొలుతనే, ఈదినము ఎత్తుకొనఁగానే, రాజుమఱఁది దావాదారు - వాది! పిర్యాది! ఈదినము ఏదియో ఆపద - సెబ్బర రానున్నది - అన్నట్లు - ఉన్నది - యథా = ఎట్లు -ఎటువలె - సూర్యోదయే, ఉపరాగః = సూర్యుని యుదయమునసే (కలుగు) గ్రహణము, మహాపురుష నాశనమును చెప్పునో- అట్లు - అనుట. గచ్ఛ అద్య = పొమ్ము ఇప్పుడు, న దృశ్యతే ... = నీవ్యవహారము ఇపుడు విచారింపఁబడదు - అని.

శకా—(సక్రోధమ్) ఆః, కిం న దృశ్యతే మమ వ్యవహారః. యది న దృశ్యతే, తదావుత్తం రాజానం పాలకం భగినీపతిం విజ్ఞాప్య భగినీం మాతరం చ విజ్ఞాప్యైత మధికరణికం దూరీకృత్యా త్రాన్య మధికరణికం స్థాపయిష్యామి. [ఆః, కిం ణ దీశది మమ వవహాలే. జఇ ణ దీశది, తదో ఆవుత్తం లాఆణం పాలఅం బహిణీ వదిం విణ్ణవిఅ బహిణిం అత్తికం చ విణ్ణవిఅ ఏదం అధిఅరణిఅం దూలే ఫేలిఅ ఏత్థ అణ్ణం అధిఅలణిఅం ఠావఇశ్శమ్].

(ఇతి గన్తు మిచ్ఛతి.

శోధ—ఆర్య రాష్ట్రియశ్యాల, ముహూర్తం తిష్ఠ. తావ దధికరణికానాం నివేదయామి. (అధికరణిక ముపగమ్య) ఏష రాష్ట్రియశ్యాలః కుపితో భణతి. [అజ్జ రట్ఠిఅశాలఅ, ముహుత్తఅం చిట్ఠ. దావ అధిఅరణిఆణం ణివేదేమి. ఏసో రట్ఠిఅశాలో కువిదో భణాది].

(ఇతి తదుక్తం భణతి.

అధి—సర్వ మస్య మూర్ఖస్య సంభావ్యతే. భద్ర ఉచ్యతామ్ — 'ఆగచ్ఛ; దృశ్యతే తవ వ్యవహారః'

---

కిం న దృశ్యతే ... = ఏమి, విచారింపఁబడదా? రాజు పాలఁకుడునా బావ, ఆయనకును. నా అక్కకును విన్నపించి, ఈ అధికరణికుని తొలఁగించి, ఇక్కడ మఱొక అధికరణికుని ఏర్పఱింపింతును. అని – గన్తుం ఇచ్ఛతి = పోఁబోవును. ఆర్య రాష్ట్రియశ్యాల ... = అయ్యా రాష్ట్రియా, శ్యాలా, ముహూర్తం తిష్ఠ = రవంతసేపు ఉండు, అధికరణికులకు ఎఱింగించెదను, వీఁడుగో ... = కుపితుఁడై – భణతి = చెప్పుచున్నాఁడు. అని అతఁడు చెప్పిన దానిం జెప్పను. సర్వం అస్య మూర్ఖస్య సంభావ్యతే – అంతయు – ఈ చెప్పిన దంతయు, ఈమూర్ఖునికి – ఇతనియెడ – అనుకొనఁదగినదే – వాఁడు ఇంతయు చేయఁగలవాఁడే. దృశ్యతే తవ వ్యవహారః – నీవ్యాజ్యము, పిర్యాదు విచారింపఁ

శోధ—(శకార ముపగమ్య) ఆర్య, అధికరణికా భణన్తి - 'ఆగచ్ఛ దృశ్యతే తవ వ్యవహారః' త త్ప్రవిశ త్వార్యః. [అజ్జ అధిఅరణిఆ భణన్తి — 'ఆఅచ్ఛ, దీసది తవ వవహారో. తా పవిసదు అజ్జో].

శకా—ప్రథమం భణన్తి న దృశ్యతే, సాంప్రతం దృశ్యత ఇతి. త న్నామ భీతభీతా అధికరణభోజకాః. య ద్యభణిష్యామి త త్త త్ప్రత్యాయయిష్యామి. భవతు. ప్రవిశామి. (ప్రవి శ్యోప సృత్య) సుసుఖ మస్మాకమ్, యుష్మాక మపి సుఖం దదామి న దదామి చ. [పఢమం భణన్తి న దీశది. సంపదం దీశది త్తి. తా ణామ భీదభీదా అధిఅలణభోఇఆ. జే త్తిఅం హగ్గే భణిశ్శం తే త్తిఅం పత్తిఆవఇశ్శమ్. భోదు. పవిశామి. శుశుహం అమ్హాణం పి శుహం దేమి ణ దేమి చ].

అధి—(స్వగతమ్) అహో, స్థిరసంస్కారతా వ్యవహారార్థినః (ప్రకాశమ్) ఉపవిశ్యతామ్.

---

బదులు - తత్ ప్రవిశతు ఆర్యః - కావున ప్రవేశించును గాక (మండపములో) ఆర్యుఁడు. ... భీతభీతాః-కావున, అధికరణికులు ఎంతయు, భయపడినా రన్నమాట (= త న్నామ), యత్ యత్ అహం భణిష్యామి = ఏమేమి నేను చెప్పుదునో, తత్ తత్ ప్రత్యాయయిష్యామి = దాని నెల్ల రుజువు పఱతును - నమ్మఁజేయుదును. సుసుఖం అస్మాకం = మా కెంతయు సుఖము - నేను రాజుమఱఁది నగుటచేత, యుష్మాకం అపి సుఖం దదామి న దదామి చ - మీకును సుఖ మొసంగుదును, ఒసంగకయుం బోవుదును. - అనఁగా వ్యవహారమును నాతట్టుగా తీర్మానించిన, మీకు సుఖ మొసంగుదును - ప్రతికూలముగా తీర్మానించిన సుఖము ఒసంగను - ఇబ్బందులు కలిగింతును - అనుట. అహో - వ్యవహారార్థినః స్థిరసంస్కారతా - వ్యవహారముం గోరినవానియొక్క - ఈపిర్యాదియొక్క - స్థిరమైన సంస్కారపుఁ గలిమి ! వ్యవహారాన జయమో అపజయమో అని సందియము లేకుండ - తనకు జయమే అను స్థిరసంకల్పము కలిగియుండుట ! అధికరణికుఁడు గౌరవముగా

శకా—ఆం, ఆత్మీయైషా భూమిః. తద్యత్ర మహ్యం రోచతే తత్రోపవిశామి. (శ్రేష్ఠినం ప్రతి) ఏష ఉపవిశామి (శోధనకం ప్రతి) నన్వత్రోపవిశామి. (ఇత్యధికరణిక మస్తకే హస్తం దత్వా) ఏష ఉపవిశామి. [ఆం, అత్తణకేలకా శే భూమీ. తా జహిం మే రోఅది తహిం ఉవవిశామి. ఏశ ఉవవిశామి. ణం ఏత్థ ఉవవిశామి. ఏశ ఉవవిశామి]. (ఇతి భూమావుపవిశతి.

అధి—భవా న్కార్యార్థీ

శకా—అధ కిమ్? [అధ ఇమ్)

అధి—తత్కార్యం కథయ.

శకా—కర్ణే కార్యం కథయిష్యామి. ఏవం బృహతి మల్ల ర్కప్రమాణస్య కులే ఽహం జాతః,

శ్లో. రాజశ్వశురో మమ పితా రాజా తాతస్య భవతి జామాతా
రాజశ్యాలో ఽహం మమాపి భగినీపతీ రాజా. ౬

---

'కూర్చుండుము' అనఁగా - 'ఆం' = అవును, ఆత్మీయా ఏష భూమిః = ఈ నేల నాది. కావున నాకు ఎక్కడ ఇష్టమో అక్కడ కూర్చుండెదను. శ్రేష్ఠినం ప్రతి = శ్రేష్ఠింగూర్చి - శ్రేష్ఠితో - ఏష ఉపవిశామి - ఇదిగో కూర్చుండుచున్నాను. శోధనకునితో - నను అత్ర ఉపవిశామి - ఓయి ఇక్కడ కూర్చుండెదను. అధికరణికుని తలమీఁద చేయి యుంచి, (మఱి) ఇదిగో కూరుచుంటున్నాను, అని నేలమీఁదనే కూరుచుండును - సరణము మూఖ ... = అవలేప - ఉద్గార చేష్టితములు.

తత్ కార్యం కథయ - ఇక వ్యవహారమును - పిర్యాదును - చెప్పుము - కర్ణే కార్యం కథయిష్యామి - చెవిలో ... = చెప్పెదను. నేను రాజవల్లభుఁడను, దొరను, అందఱివలె వాదము ప్రతివాదము మొదలగు క్రమమును పాటింపను, ఏవం బృహతి ... = ఇట్లు పెద్దప్రమిద - మూకుడు కొలతగల పెద్ద కులమని చెప్పుటకు ప్రమిదయు మూకుడును మూర్ఖుని కొలతలు.

[కణ్ణే కజ్జం కధయిఝ్శమ్. ఎవ్వం వడ్ఢకే మల్లక్కప్పమాణాహకుడే హగ్గే జాదే.

లాఅశశులే మమ పిదా లాఆ తాదశ్శ హోఇ జామాదా
లాఅశిలా లే హగ్గ మ మావి బహిణీవదీ లాఆ ].

అధ—సర్వం జ్ఞాయతే

శ్లో. కిం కులే నోపదిష్టేన శీల మే వాత్ర కారణమ్
భవన్తి నితరాం స్ఫీతాః సుక్షేత్రే కణ్టకిద్రుమాః. 2

త దుచ్యతాం కార్యమ్.

శకా—ఏవం భణామి అపరాద్ధ స్యాపి న చ మే కి మపి కరిష్యతి, తత స్తేన భగినీపతినా పరితుష్టేన మే క్రీడితుం రక్షితుం

---

శ్లో. ౧. రాజశ్వశురః మమ పితా = రాజుమామ నాకు నాయన, రాజా = రాజు, తాతస్య - (నాయనకు, జామాతా భవతి = అల్లుఁ డగును. అహం = నేను, రాజశ్యాలః - రాజు బావమఱఁదిని. మమ అపి = నాకన్నను, రాజా = రాజు, భగినీపతిః = బావ.

సర్వం జ్ఞాయతే - అన్నియు ఎఱుంగఁబడుచున్నది, అన్నియు - అంతయు - ఎఱుంగుదును అనుట.

శ్లో. ౨. కులేన ఉపదిష్టేన కిం = కులమును చెప్పిన దాన నే మగును? శీలం ఏవ అత్ర కారణమ్ = నడవడియే వ్యవహారాదులబో, కారణమ్ = ప్రయోజకము - ఇత్యాది చూ. VII - 29.

తత్ ఉచ్యతాం కార్యం = కావున కార్యమును చెప్పుము. ఏవం - భణామి - ఆలాగే - చెప్పెదను. అపరాద్ధస్య అపి మే = తప్పుచేసినవానికైనను నాకు, నేను తప్పు చేసినను అనుట, న చ మే కిమపి కరిష్యతి = నాకు ఏమియు చేయఁడు - (రాజు అనుట) తతః - తరువాత - ఇదిగో చెప్పుచున్నాను. - తేన భగినీపతినా... = ఆబావచేత, నాయెడ మిక్కిలి సంతోషించినవానిచేత, మే = నాకు, క్రీడితుం, రక్షితుం ... = ఆడుకొనుటకు, కాపాడుటకు, (ఉద్యానము నే అనుట) సర్వో

సర్వోద్యానానాం ప్రవరం పుష్పకరణ్డక జీర్ణోద్యానం దత్తం. తత్ర చ ప్రేక్షితు మనుదివసం శుష్కం కారయితుం శోధయితుం పుష్టం కారయితుం లూనం కారయితుం గచ్ఛామి. దైవయోగేన పశ్యామి, న పశ్యామి వా స్త్రీశరీరం నిపతితమ్.

[ ఎవ్వం భణామి, అవలద్ధాహువి ణాఅమే కిం పి కలఇశ్శది, తదో తేణ బహిణీవదిణా పరితుట్ఠేణ మే కీలిదుం లక్ఖిదుం శవ్వుజ్జాణాణం పబలే పుప్ఫకలణ్డక జిణ్ణుజ్జాణే దిణ్ణే. తహిం చ పేక్ఖిదుం అణుదిఅహం శోశావేదుం, శోధావేదుం, పోత్థావేదుం, లుణావేదుం గచ్ఛామి. దేవ్వజోఏణ పేక్ఖామి, ణ పేక్ఖామి వా, ఇత్థి ఆశలీలం ణివడిదమ్ ].

అధి—అథ జ్ఞాయతే కా స్త్రీ విప న్నేతి ?

శకా—అహో అధికరణభోజకాః, కి మితి న జానామి తాం తాదృశీం నగరమణ్డనం కాఞ్చనశతభూషణాం కే నాపి కుపుత్రే

---

ద్యానప్రవరం = అన్నితోఁటలలో శ్రేష్ఠమైన పుష్పకరణ్డకజీర్ణోద్యానం = అ పేరుగలతోఁట ఈఁబడినది. తత్ర చ = అక్కడ నన్ననో, అనుదినం = ప్రతిదినమును, ప్రేక్షితుం, శోషయితుం ... = చూచుటకును, ఎండఁబెట్టుటకును ( = త్రవ్వకము పెట్టుటకు) శుభ్రము చేయుటకును (చిమ్మించి చల్లించి - అనుట), పెంపొంచుటకును - (నీరు పోసి, కత్తిరించి, ఎరువు పెట్టి), గచ్ఛామి = పోవుదును. దైవయోగేన = విధివిధానముచేత, నిపతితం ... = పడియున్న స్త్రీ శరీరమును చూచితిని - కాదా, చూడనైతిని.

అథ జ్ఞాయతే కా స్త్రీ విపన్నా ఇతి = ఎఱుఁగబడునా, నీ వెఱింగితివా - నీకు తెలియునా - ఏ స్త్రీ చనిపోయినదో. కిం ఇతి న జానామి - ఏల యెఱుఁగను? అట్టి ఆపెను, ఊరికి అలంకారము, నూఱు బంగారు తొడవులతో అలంకృతయై యున్నదానిని. కేన అపి కుపుత్రేణ ... = ఎవనిచేతనో చెడ్డవానిచేత, అర్థకా

ణార్థకల్యవర్తస్య కారణాచ్ఛూన్యం పుష్పకరణ్డక జీర్ణోద్యానం ప్రవేశ్య బహుపాశబలాత్కారేణ వసన్తసేనా మారితా. న మయా [హంహో అధిఅలణభోఇఆ, కిం త్తిం ణ జాణామి. తం తాదిశిం ణాఅలమణ్డణం కచ్చణశదభూశణిఅం కేణ వి కుపత్తేణ అత్థకల్లవత్తశ్శ కాలణాదో శుణ్ణం పుప్ఫకలణ్డక జిణ్ణుజ్జాణం పవేశిఅ బాహుపాశబలక్కాలేణ వశన్తశేణిఆ మాలిదా. ణ మఏ].

(ఇ త్యర్ధోక్తే ముఖ మావృణోతి.

అధి—అహో నగరరక్షిణాం ప్రమాదః. భోః శ్రేష్ఠికాయస్థౌ, న మ యేతి వ్యవహారపదం ప్రథమ మభిలిఖ్యతామ్.

కాయ—య దార్య ఆజ్ఞాపయతి. (తథా కృత్వా) ఆర్య, లిఖితమ్. [జం అజ్జో ఆణవేది. అజ్జ, లిహిదమ్].

---

కల్యవర్తస్య కారణాత్ ... ధనమును చలిదియన్నపుఁ గారణాన - చలిదియన్నము పాటిదై ఆసపడఁదగినది కాని ధనము కోసము, ఎవరు లేని ... = ఉద్యానమున ప్రవేశపెట్టి, త్రాళ్ళం బోని బాహువులతో (గొంతు) పిసికి వసంతసేన చంపఁబడినది. న మయా = నాచేత కాదు. మయా - అయ్యొ నాచేతనే - ణం మఏ అను ప్రాకృతమునకు 'న మయా' అనియుఁ రూపములు. అహో నగర రక్షిణాం ప్రమాదః- అహో ఆరెకుల అజాగ్రత్త, పరాకు! 'నను మయా' - నాచేతనే - అయ్యొ - అను పిర్యాదు అర్జీ మాటలు మొట్టమొదట వ్రాయఁబడును గాక. 'నాచేతనే' అను మాటలు వ్రాయుఁడు. 'నమయా' - 'నాచేత కాదు' అన్నను - 'ఎవరి చేతనో' - ఎఱుఁగుదువా? - అను ప్రశ్న లేకయే - 'నాచేత కాదు' - అని కలుగఁజేసికొని చెప్పిన మాట, లేని పోని సందియమునకు ఎడమిచ్చును. మఱి స్పష్టముగా 'నను మయా' నాచేతనే - అవధారణపూర్వకముగా చెప్పినమాటంగూర్చి ఏమి చెప్పఁదగును? 'ఛన్నం' అని అధికరణికుడు అన్నాఁడే, అట్లు కాక, ఇట్లు ప్రకటమైన స్పష్టవాక్కు.

శకా — (స్వగతమ్) ఆశ్చర్యమ్. త్వరాం కుర్వాణే నేవ పాయసపిణ్డారకే ణాద్య మయా త్మైవ నిర్నాశితః, భవతు. ఏవం తావత్ (ప్రకాశమ్) అహో అధికరణభోజకాః, నను భణామి, మయైవ దృష్టా. కిం కోలాహలం కురుత. [హీమాదికే, ఉత్తాలన్తేణ విఅ పాఅశపిణ్డాలకేణ అజ్జ మఏ అత్తా ఏవ్వ ణిణ్ణాశిదో. భోదు. ఏవ్వం దావ, అహో అధిఅలణభోఇఆ, ణం భణామి, మఏ జ్జేవ దిట్టా, కిం కోలాహలం కలేధ].

(ఇతి పాదేన లిఖితం ప్రోఞ్ఛతి.

అధి — కథం త్వయా జ్ఞాతం యథా ఖల్వర్థనిమిత్తం బాహుపాశేన వ్యాపాదితా?

---

హీమాదికే - అయ్యో! ఉత్త్వరాయమాణేవ = ఉడుకుటచే వడిగా పైకి పొంగుచున్న, పాయస పిణ్డారకేణ ఇవ = పాయసాన్నము చేతం బోలె. అద్య = ఇపుడు, మయా = నాచేత, ఆత్మా ఏవ = నేనే, నిర్నాశితః = బొత్తిగా - పూర్తిగా నాశనము చేయఁబడితిని. పాయసమున అన్నము ఉడికి పొంగి మరల క్రుంగి మెత్తనై పాలతో కలసిపోయి, తన స్వరూపముఁ గోలుపోవును - అందు ఇమిడి పోవును - అట్లు నేను నన్నే నాశనము చేసికొంటినే - నాచేతనే అని చెప్పి వేశితినే! భవతుకానీ. ఏవం భవతు = ఇట్లగుంగాక - దానిని దిద్దివేసెదను అనుట.

ఓహో ప్రాడ్వివాకులారా, నను భణామి = చెప్పుచున్నాను గదా - మయా ఏవ దృష్టా = నాచేతనే చూడఁబడినది. కిం కోలాహలం కురుత - ఏమి కలకలము - అలబలము - చేసెదరు? ఇతి పాదేన లిఖితం ప్రోఞ్ఛతి = అనుచు పాదముతో వ్రాఁతను తుడుచుచున్నాఁడు.

కథం త్వయా జ్ఞాతం = నీచేత ఎట్లు ఎఱుంగఁబడినది? నీ వెట్లు కనుగొంటివి - అనుట ... = అర్థనిమిత్తం = ధనము కోసము,- బాహుపాశేన - భుజాల '(పాశేన=') త్రాఁటితో మెడనులిమి - చంపఁబడినది అని నీ వెట్లెఱింగితివి? శవ దర్శనమాత్రమున చంపఁబడిన - చచ్చిన -

శకా — హంహో, నూనం పరిశూన్యయా మోఘస్థానయా గ్రీవాలికయా నిఃసువర్ణైరాభరణస్థానైస్తర్కయామి. [ హంహో ణూణం పరిశూణాఏ మోఘట్ఠాణాఏ గీవాలిఆఏ ణిశువణ్ణకేహిం ఆహాలణట్ఠాణేహిం తక్కేమి ].

శ్రేష్ఠికా — యుజ్యత ఇవ. [ జుజ్జది విఅ ].

శకా — (స్వగతమ్) దిష్ట్యా ప్రత్యుజ్జీవితో ఽస్మి. అవిద మాదికే. [ దిట్ఠిఆ పచ్చుజ్జీవిదమ్హి. అవిదమాదికే ].

శ్రేష్ఠికా — భోః, క మేష వ్యవహారో ఽవలమ్బతే. [ భో, కం ఏసో వవహారో అవలమ్బది ].

అధి — ఇహ హి ద్వివిధో వ్యవహారః.

శ్రేష్ఠికా — కీదృశః ? [ కేరిసో ? ]

అధి — వాక్యానుసారేణ, అర్థానుసారేణ చ, య స్తావ ద్వాక్యానుసారేణ, స ఖ ల్వర్థిప్రత్యర్థిభ్యః, య శ్చార్థానుసారేణ స చాధికరణికబుద్ధి నిష్పాద్యః.

తీఱు ఎట్లు తెలియఁగలదు ? నూనం = నిజముగా, శూఽశూనయా = వాచినదియు, మోఘస్థానయా = నలిపినందున అచట దుర్బలమగు అచటి తీఱు గలదియు నగు, గ్రీవాలికయా = మెడచేతను, నిఃసువర్ణైః = బంగారులు లేకపోయిన సొమ్ములుండవలయు చోట్లచేతను, తర్కయామి = ఊహింతును. యుజ్యత ఇవ = సరిపడునట్లు ఉన్నది. దిష్ట్యా ప్రత్యుజ్జీవితః అస్మి - సంతోషము ! - బ్రదికినానురా బాబూ, పోయిన ప్రాణము వచ్చినది నాకు.

భోః - బాబులారా, కం ఏషవ్యవహారః అవలమ్బతే = ఎవనిని ఈవ్యవహారము అవలంబించుచున్నది ? దీనికి సంబంధించినవారు ఎవరు ? ఇహ హి వ్యవహారః ద్వివిధః = ఏలన, ఇక్కడ - ఈవిషయమున కాదా కచ్చేరిలో వ్యవహారము ఇరుదెఱంగులు. కీదృశః = ఎట్టిది ? అవి యెట్టివి ? వాక్యానుసారేణ ... = వాక్యమును అనుసరించినదియు, వాక్యార్థము ననుసరించినదియు. యః తావత్ వాక్యానుసారేణ - వాక్యమును అనుసరించిన దేదో అది, అర్థిప్రత్యర్థిభ్యః - వాదిప్రతి

[శేషి కా—త ద్వసన్తసేనామాతర మవలమ్బతే వ్యవహారః. [తా వసన్తసేణామాదరం అవలమ్బది వవహారో].

అధి—ఏవ మిదమ్. భద్ర శోధనక, వసన్తసేనామాతర మను ద్వేజయ న్నాహ్వాయ.

శోధ—తథా. (ఇతి నిష్క్రమ్య గణికామాత్రా సహ ప్రవిశ్య) ఏ త్వే త్వార్యా. [తధా. ఏదు ఏదు అజ్జా].

వృద్ధా—గతా మే దారికా మిత్రగృహ మాత్మనో యౌవన మనుభవితుమ్. ఏష పున ర్దీర్ఘాయు ర్భణతి — 'ఆగచ్ఛ, అధి కరణిక ఆహ్వాయతి. త న్మోహపరవశ మి వాత్మాన మవగచ్ఛామి. హృదయం మే ప్రకమ్పతే. ఆర్య, ఆదిశ మహ్య మధికరణమణ్డ పస్య మార్గమ్. [గదా మే దారిఆ మిత్తఘరఅం అత్తణో జోవ్వణం అనుభవిదుమ్. ఏసో ఉణ దీహాఊ భణాది — 'ఆఅచ్ఛ, అధి అరణిఓ సద్దావేది'. తా మోహాపరవసం విఅ అత్తాణఅం అవ గచ్ఛామి. హిఅఅం మే థరథరేది. అజ్జ, ఆదేసేహి మే అధి అరణమణ్డవస్స మగ్గమ్].

---

వాదులకు. ఏది అర్థమును అనుసరించినదో - అది ప్రాడ్వివాకుఁడు బుద్ధితో ఊహించి తేల్చవలసినది. కావున ఇది యిపుడు మన పనియే, అర్థమును లోఁతునకు దిగి లెస్సగా ఆలోచించి సత్యాసత్యములు తేల్చవలసినది. కావున ఈవ్యవహారము వసంతసేనతల్లికి చెందును.

ఏవం ఇదమ్ = అట్లే ఇది - అవును అనుట. అనుద్వేజయన్ = ఏమియు కలవరపెట్టక - నీకూఁతును ఎవరో గొంతుపిసికి చంపినారు - అని తటాలున ఇట్లు చెప్పిన ఎంతేని కలవరము కలుగును. అట్లు కలుగని విధాన - ఏతు ఏతు ఆర్యా = వచ్చును గాక - రా, రా, అమ్మా - అనుట. గతా మే దారికా మిత్రగృహం = నాకూఁతురు - నేస్తగాని యింటికి పోయినది, ఆత్మనః యౌవనం అనుభవితుం = తన జవ్వన (సుఖమును) అనుభవించుటకు. ఏష పునః దీర్ఘాయుః - మతి యీ కచ్చేరిఅబ్బాయి చెప్పుచున్నాఁడు - రా, అధికరణికుఁడు పిలుచు

శోధ—ఏ త్వే త్వార్యా. [ఏదు ఏదు అజ్జా].

(ఉభౌ పరిక్రామతః)

శోధ—ఏషో ఽధికరణమణ్డపః. అత్ర ప్రవిశ త్వార్యా. [ఏదం అధిఅరణమణ్డవమ్. ఏత్థ పవిసదు అజ్జా].

(ఇత్యుభౌ ప్రవిశతః)

వృద్ధా—(ఉపసృత్య) సుఖం యుష్మాకం భవతు భావమిశ్రాణామ్. [సుహం తుమ్హాణం భోదు భావమిస్సాణమ్].

అధి—భద్రే స్వాగతమ్ ఆస్యతామ్.

వృద్ధా—తథా. [తధా]. (ఇత్యుపవిష్టా.

శకా—(సాక్షేపమ్) ఆగతాసి వృద్ధకుట్టని, ఆగతాసి, [ఆగదాసి బుడ్ఢకుట్టణి, ఆగదాశి].

అధి—అయే, త్వం కిల వసన్తసేనాయా మాతా?

వృద్ధా—అథ కిం? [అధ ఇం?]

అధి—అథేదానీం వసన్తసేనా క్వ గతా?

చున్నాఁడు అని. కావున మూర్ఛ యైకము వచ్చినట్లుగా ఉన్నది నాకు - అట్లు తోఁచుచున్నది - నా హృదయము దిగులుతో 'థరథర' అనుచున్నది! ఉపసృత్య = సమీపించి - వృద్ధ తెస్పగా లోకానుభవము లోకజ్ఞానము గలది - అధికరణికునికి అనవలసినమాట అనుచున్నది - పండితులవారికి మీకు సుఖము కలుగును గాక - 'సుఖమా' అను ప్రశ్న మర్యాద కాదు - 'సుఖము' అను ఆశీస్సే సాధువు. సాక్షేపమ్ = తిట్టుచు - నిందించుచు - ఆగతా అసి ... = వచ్చినావఁటే బోగము ముసలి - ముసలిదంటెనక త్తియా - ముసలితార్పుడుదానా - కూతునకు మగవానిం గూర్చుదానా - వచ్చినావా! అయే = అమ్మా, నీవు వసంతసేనకు అమ్మ వఁట. అవును - అథ ఇదానీం ... = ఇపుడు వసంతసేన ఎక్కడికి పోయినది? మిత్రు

వృద్ధా—మిత్రగృహమ్. [మిత్తఘరఅమ్].

అధి—కింనామధేయం తస్యా మిత్రమ్?

వృద్ధా—(స్వగతమ్) హా ధిక్! హా ధిక్! అతిలజ్జనీయం ఖల్విదమ్. (ప్రకాశమ్) జనస్య పృచ్ఛనీయో ఒయ మర్థః, న పునరధికరణికస్య. [హద్ధీ హద్ధీ, అదిలజ్జణీఅం క్ఖు ఏదమ్. జణాస్స పుచ్ఛణీఓ అఅం అత్థో, ణ ఉణ అధిఅరణిఅస్స].

అధి—అలం లజ్జయా. వ్యవహార స్త్వాం పృచ్ఛతి.

శ్రేష్ఠికా—వ్యవహారః పృచ్ఛతి. నాస్తి దోషః. కథయ. [వవహారో పుచ్ఛది. ణత్థి దోసో. కధేహి].

వృద్ధా—కథం వ్యవహారః య ద్యేవం, తదా శృణ్వా న్త్వార్యమిశ్రాః; స ఖలు సార్థవాహవినయదత్తస్య నప్తా, సాగరదత్తస్య తనయః, సుగృహీతనామధేయ ఆర్యచారుదత్తో నామ, శ్రేష్ఠిచత్వరే ప్రతివసతి. తత్ర మే దారికా యౌవనసుఖ మనుభవతి.

---

నింటికి. కింనామధేయం = ఏపేరివాఁడు? ఆమెమిత్రముపే రేమి? హా ధిక్ - హా ఇసీ ..., అతిలజ్జనీయం ఖలు ఇదం = ఎంతయు సిగ్గుపడవలసినది గదా ఇది. జనస్య పృచ్ఛనీయః అయం అర్థః ఈవిషయము ఎవఁడైనను మానిసి అడుగఁదగినదే, కాని అధికరణికునికి (ఇట్లు కచ్చేరిలో అడుగఁదగినది) కాదు.

అలంలజ్జయా = సిగ్గుపడకు - సిగ్గుమాను. వ్యవహారః త్వాం పృచ్ఛతి - వ్యవహారము-వ్యాజ్యము - నిన్ను అడుగుచున్నది. కథం! వ్యవహారః! - ఏమీ! వ్యవహారమా? యది ఏవం=అట్లేని, వినుండు ఆర్యమిశ్రులు..., ఆర్యుఁడు పూజ్యుఁడు, మిశ్ర-మఱియు పూజ్యవాచకము. కావున మొత్తమునకు మిక్కిలియుపూజ్యుఁడు - భోగము ముసలిది ఎంతయు గౌరవముతో అధికరణికులతో మాటలాడును. సార్థవాహవినయదత్తస్య నప్తా, సాగరదత్తస్య తనయః సుగృహీతనామధేయ ఆర్యచారుదత్తో నామ, శ్రేష్ఠిచత్వరే ప్రతివసతి ... = వినయదత్తుని మనుమఁడు ... కుమారుఁడు, పేరు ప్రసిద్ధిగలవాఁడు - తెల్లవాఱఁగానే మంచిపేరుగా పేర్కొన

[కధం వవహారో జఇ ఎవ్వమ్, తా సుణన్తు అజ్జమిస్సా. సోక్షు సత్థవాహావిణఅదత్తస్స ణత్తిఓ, సాఅరదత్తస్స తణఓ, సుగహిద ణామహేఓ అజ్జచారుదత్తో ణామ, సేట్ఠిచత్తరే పడివసది. తహిం మే దారిఆ జోవ్వణసుహం అణుభవది].

శకా—శ్రుత మార్యైః. లిఖ్యన్తా మేతా న్యక్షరాణి. చారుదత్తేన సహ మమ వివాదః. [శుదం అజ్జేహిం లిహీఅన్తు ఏదే అక్ఖలా, చాలుదత్తేణ శహ మమ వివాదే].

శ్రేష్ఠికా—చారుదత్తో మిత్ర మితి నాస్తి దోషః. [చారుదత్తో మిత్తో త్తి ణత్థి దోసో].

అధి—వ్యవహారో౽యం చారుదత్త మవలమ్బతే.

శ్రేష్ఠికా—ఏవ మివ. [ఎవ్వం విఅ].

---

వలసిన పుణ్యాత్ముడు - శ్రేష్ఠిచత్వరే - కోమట్లచౌకీలో - తత్ర - అతనియింట, మమ దారికా = నాకూఁతురు, యౌవనసుఖం అనుభవతి - ఇది బోగము ముసలిదాని నాజూకు మాటలు - 'యౌవనసుఖం' అని. ఈముసలి బోగముదానికి మునుపు వయసున 'యౌవనానుభవము' ఉండియుండునా ఆతాతనాయనలతో ? బాగుగా ఎఱిఁగినట్లు గౌరవమునుగలయట్లు, నోటినిండ పలుకుచున్నది. చారుదత్తేన సహ మమ వివాదః - నాకు వ్యాజ్యెము చారుదత్తునితో - ఇదంతయు వ్రాయఁబడును గాక. చారుదత్తం అవలమ్బతే - చారుదత్తుని అవలంబించియున్నదా ? ఏవం ఇవ = అటువలెనే ఉన్నది - ఇప్పటికి అట్లు తోఁచుచున్నది. ధనదత్త - ఇది శ్రేష్ఠికాయస్థులలో శ్రేష్ఠిపేరు కాఁబోలు. వసంతసేనా ఆర్య ... = వసంతసేన చారుదత్తయ్య ఇంటికి పోయినది - అని - లిఖ్యతాం ... = పాదః = వ్యాజ్యమున మొదటి భాగము. పైవిషయము చారుదత్తయ్య చెప్పవలసి యుండును.

అధి—ధనదత్త, వసన్తసే నార్యచారుదత్తస్య గృహం గ తేతి లిఖ్యతాం వ్యవహారస్య ప్రథమః పాదః. కథమ్. ఆర్యచారుదత్తో ఽప్యస్మాభి రాహ్వాయయితవ్యః. అథవా వ్యవహార స్త మాహ్వాయతి. భద్ర శోధనక, గచ్ఛ, ఆర్యచారుదత్తం స్వైర మసంభ్రాన్త మనుద్విగ్నం సాదర మాహ్వాయ. ప్రస్తావేన — 'అధికరణిక స్త్వాం ద్రష్టు మిచ్ఛతి' ఇతి.

శోధ—య దార్య ఆజ్ఞాపయతి. (ఇతి నిష్క్రాన్తః. చారుదత్తేన సహ ప్రవిశ్య చ) ఏ త్వే త్వార్యః. [జం అజ్జో ఆణవేది. ఏదు ఏదు అజ్జో].

చారు—(విచిన్త్య)

శ్లో. పరిజ్ఞాతస్య మే రాజ్ఞా శీలేన చ కులేన చ
యత్సత్య మిద మాహ్వాన మవస్థా మభిశఙ్కతే. ౮

---

కథమ్! = ఎట్లూ! ఆర్యచారుదత్తః అపి - చారుదత్తయ్యకూడ మనచే పిలిపింపఁబడవలసినవాఁడు - అంతగొప్పవానిం గూడ పిలిపించుటయా అని తలపోసికొనుట ఇది. అథవా = అట్లు కాదు - మనము ఏమి చేయఁగలము? వ్యవహారః తం ... = వ్యాజ్యము ఆయనం బిలుచుచున్నది. - ఇందు ఆయనకు సంబంధము ఉన్నట్టు లున్నది కావున. స్వైరం అసమ్భ్రాన్తం అనుద్విగ్నం సాదరం - ఎన్ని విశేషణములు - చారుదత్తయ్య ఊరిలో అందఱి మనసున స్థిరముగా అట్టి కీర్తిప్రతిష్ఠలు గౌరవము కలిగియున్నాఁడు, 'త్వాం ద్రష్టు మిచ్ఛతి' - రమ్మని పిలుచుటకు గౌరవంపు మాటలు వే. వేం.

శ్లో. ౮. శీలేన చ కులేన చ = నడువడిచేతను, (గొప్పయిల్లు అని) కులముచేతను, రాజ్ఞా = రాజుచేత, పరిజ్ఞాతస్య = చక్కఁగా ఎఱుంగఁబడినవాఁడనైన, మే = నాకు, యత్ సత్యం = నిజముగా, ఇదం ఆహ్వానం = ఈపిలుపు, అవస్థాం = దుర్గతిని, అనఁగా పేదఱికమును, అభిశఙ్కతే = సందేహించుచున్నది - (అంతే)

నన్ను రాజు బాగుగా ఎఱుఁగును, నాశీలమును ఎఱుఁగును, కులమును ఎఱుఁగును, మఱి నాకు కచ్చేరికి ఈపిలుపు! నిజముగా వాఁడు నాపేదఱికమును సందే

(సవితర్కం స్వగతమ్)

శ్లో. జ్ఞాతో హి కిం ను ఖలు బన్ధనవిప్రయుక్తో
మార్గాగతః ప్రవహణేన మ యాపనీతః
చారేక్షణస్య నృపతేః శ్రుతి మాగతో వా
యే నాహ మేవ మభియుక్త ఇవ ప్రయామి. 5

హించుచున్నాఁడు - అంతే, అనఁగా, దానిం బట్టి నామీఁద ఏమో గుమానుపడుచున్నాఁడనుట. ఈపిలుపు నాయవస్థను - పేదఱికమును - సందేహించు చున్నది. నా పేదఱికముఁబట్టి నాకీపిలుపు - అనుట.

శ్లో. 5. బన్ధనవిప్రముక్తః = నిబఃంధము - బందినుండి తప్పించుకొన్నవాఁడు, (ఆర్యకుఁడు అనుట). మార్గాగతః - దారివసమున వచ్చినవాఁడు, ప్రవహణేన = బండిచే, మయా అపనీతః - నాచే బయటికి పంపఁబడినాఁడు అని, జ్ఞాతః కిం - హి ను ఖలు = ఎఱుంగఁబడినాఁడా - వేఁగులవలనఁగాని, మీఁడమీఁదఁగాని మఱెక్కడఁగాని అగపడఁ దగినచోటనున్న తనచే సొంతముగాఁగాని, ఎఱుంగఁబడినాఁడా? ఎట్లని ఇది వాని చెవికి వచ్చియుండునా? కంటికి తోఁచియుండునా? చారేక్షణస్య = చారులే - వేఁగులే - కన్నులుగాగల, నృపతేః= రాజునకు, (ఎవరివలనఁ గాని) శ్రుతిం ఆగతః వా = చెవికివచ్చినదా. ఎందేని కంటితో చూచినాఁడా, ఎటులేని విన్నాఁడా? యేన - దేన = ఏల యిట్లనుట - అనఁగా - అహం = నేను, ఏవం = ఇట్లు, అభియుక్తః ఇవ = పగచే, పిర్యాదిచే ఎదిరింపఁబడినవానివలె - ముద్దాయివలె నామనసుకు తోఁచుచుండఁగా, ప్రయామి= (వీనివెంట) పోవుచున్నానే!

బంధనమునుండి తప్పించుకొని యీదారిని వచ్చిన యార్యకుని నాబండిలో ఎక్కించి దాఁటవేసితినని (చూచి) ఎఱింగినాఁడా రాజు? లేక వేఁగులవలన విన్నాఁడా? ఇట్లు నన్ను కచ్చేరికి పిలిపించినాఁడే - పేదవెంటఁ బోవువానివలె పోవుచున్నానే. నామనసులో అట్లు గిలిగా ఉన్నదే.

రాజును కచ్చేరిలో విచారించుచోట ఉండుట ప్రాయికము. ఈదినము ఏదియో కారణాన లేకున్నను, అధికరణికుఁడు పిలిపించినను రాజే అని, రాజుమాట మీఁదనే అని అనుకొనుట.

అథవా కిం విచారితేన, అధికరణమణ్డప మేవ గచ్ఛామి. భద్ర శోధనక, అధికరణస్య మార్గ మాదేశయ.

శోధ—ఏ త్వే త్వార్యః. [ఏదు ఏదు అజ్జో].

(ఇతి పరిక్రామతః.

చారు—(సశఙ్కమ్) త త్కి మపరమ్.

శ్లో. రుక్షస్వరం వాశతి వాయసో౽యు,
మమాత్యభృత్యా ముహు రాహ్వయన్తి,
సవ్యం చ నేత్రం స్ఫురతి ప్రసహ్య
మ మానిమిత్తాని హి ఖేదయన్తి. ౧౦

శోధ—ఏ త్వే త్వార్యః స్వైర మసంభ్రాన్తమ్. [ఏదు ఏదు అజ్జో సైరం అసంభన్తమ్].

చారు—(పరిక్రమ్యాగ్రతో౽వలోక్య చ)

---

అథవా = అట్లుగాదు. కిం విచారితేన = ఎందులకు ఇట్లు విచారించుట, తలపోయుట? అక్కడికే - గచ్ఛామి = పోయెదను.

శ్లో. ౧౦. అయం వాయసః = ఈ కాకి, రూక్షస్వరం = కటుకటునిగొంతు కలుగునట్లుగా, కోపముతోనుంబోలె, వాశతి = కూయుచున్నది. అమాత్యభృత్యాః- (నా) సహోయులును నౌకరులును, మాటికి - పిలిచెదరు - బయలువెడలినవానిని వెనుకఁబిలుచుట అపశకునము, సవ్యం నేత్రం = ఎడమ కన్ను, ప్రసహ్య = ఎక్కువగా - బలవంతముగా, మాన్పరాక, స్ఫురతి = అదరుచున్నది. మమ = నాకు, అనిమిత్తాని = (ఈ)యపశకునములు, ఖేదయన్తి హి = దుఃఖము కలిగించుచున్నవి కదా.

స్వైరం - నెమ్మదిగా - తొందరపడకుండ, అసంభ్రాన్తం = తొట్రుపడక,

శ్లో. శుష్కవృక్షస్థితో ధ్వాఙ్క్ష ఆదిత్యాభిముఖ స్తథా
మయి చోదయతే వామం చక్షు ర్ఘోర మసంశయమ్. ౧౧

(పున రన్యతో ౽వలోక్య), అయే, కథ మయం సర్పః

శ్లో. మయి వినిహితదృష్టి ర్భిన్ననీలాఞ్జనాభః
స్ఫురిత వితత జిహ్వః శుక్లదంష్ట్రాచతుష్కః
అభిపతతి సరోషో జిహ్మితాధ్మాతకుక్షి
ర్భుజగపతి రయం మే మార్గ మాక్రమ్య సుప్తః ౧౨

అపి చ ఇదమ్,

---

శ్లో. ౧౧. ధ్వాఙ్క్షః = కాకి, శుష్కవృక్షస్థితః - ఎండిపోయిన చెట్టు మీఁద (వాలి) యున్నది - ఆపాటికే అది యపశకునము; తథా = అట్లే - మఱియు అనుట - ఆదిత్య అభిముఖః సూర్యునికి ఎదురుగా తిరిగి (చూచుచు) ఉన్నది. వామం చక్షుః = ఎడమకన్ను, అసంశయం = సందేహము లేక - నిజముగా, ఘోరం = (ఏదియో) గొప్ప భయమును, మయి = నాయందు, నామనసున - అనుట, చోదయతి = రేఁపుచున్నది.

అన్యతః అవలోక్య = ఒండువైపు చూచి. అయే = అహో - కథం = ఏమి! అయం సర్పః = ఇదిగో పాము.

శ్లో. ౧౨. భిన్న నీలాఞ్జన ఆభః = పగలఁదీసిన నల్లకాటుక కాంతి కలదై - పగలఁదీసిన లోపలికాంతి మఱియు నల్లగానుండును, పైనకాంతి దుమ్ము వెలుతురు మొదలైన వానిచే మాసి యుండును - కావున - భిన్న అనుట, అయం భుజగ పతిః = ఈ పెనుఁబాము, మే మార్గం ఆక్రమ్య సుప్తః = నాదారికి అడ్డముగా దానిని ఆక్రమించుకొని, నిద్రించుచున్నట్టిది - ఇదె అలికిడికి మేల్కొని, సరోషః = కోపముగలదై, జిహ్మిత ఆధ్మాతకుక్షిః - బుసబుస (ఊపిరి విడిచినందులకు) వంకరయయ్యు, (ఊపిరి పీల్చినందుకు) నిండియు ఉన్న కడుపు కలదై - బుసబుస సన్నగిలుచు లావెక్కుచు నున్నదై, స్ఫురిత వితత జిహ్వః = ఆడుచు చాగుచు నుండు నాలుకలు గలదై, తెల్లని నాలుగుకోఱలు (కానఁబడుచు) గలదై, అభిపతతి - నాతట్టుకు పరువెత్తుచున్నది.

శ్లో. స్ఖలతి చరణం భూమౌ న్యస్తం న చార్ద్రతమా మహీ,
స్ఫురతి నయనం వామో బాహు ర్ముహు శ్చ వికమ్పతే,
శకుని రపర శ్చాయం తావ ద్విరౌతి హి నైకశః
కథయతి మహాఘోరం మృత్యుం న చాత్ర విచారణా.

శ్లో. ౧౩. చరణం = పాదము, భూమౌ న్యస్తం = నేలపై పెట్టఁబడినది - నడచుటకు, స్ఖలతి = జాఱుచున్నది. మహీ చ = మఱి నేల యన్ననో, న ఆర్ద్రతమా = ఎక్కువ తడిగా లేదు. వామః నయనః = ఎడమకన్ను, స్ఫురతి = అదరుచున్నది; బాహుః చ=భుజమును, ఎడమదియనుట - ముహుః = మాటికి, వికమ్పతే= వణఁకుచున్నది. అయం తావత్ =ఇదిగో ఇది, అపరః శకునిః చ = మఱియొక పక్షియు, నైకశః = పలుమాఱు, విరౌతి హి = కూయుచున్నది కదా. (ఇదెల్లను - ) మహాఘోరం = ఎంతయు భయంకరమైన, మృత్యుం = చావును, కథయతి = చెప్పుచున్నది - తెలుపుచున్నది - అత్ర విచారణా న చ = ఇందు విచారణ వలదు. సందియము లేదు.

బృహత్సంహితలోను వసంతరాజశకునమునను ఇట్టివన్నియు ముప్పు కూర్చునని చెప్పఁబడియున్నది.

దారుణనాద స్తరుకోటరోపగో వాయసో మహాభయదః
ఐన్ద్ర్యాది దిగవలోకీ సూర్యాభిముఖో రువన్ గృహే గృహిణః
రాజభయ చోర బన్ధన కలహాః స్యుః పశుభయం చేతి
ఛిన్నాగ్రే ఽఙ్గచ్ఛేదః కలహః శుష్కద్రుమస్థితే ధ్వాఙ్క్షే
వామ స్యాధఃస్ఫురణ మసకృత్ సఙ్గరే భఙ్గహేతుస్
తస్యై వోర్ధ్వం హరతి నితరాం మానసం దుఃఖజాలమ్.
... ... ... ... ... ...
దక్షిణ మఙ్గం పుంసః స్త్రియా శ్చ వామం శుభావహం స్ఫురితమ్

ఉత్త నేలలో జాఱుపాటును అవశకునమే, అమంగళసూచకము

స్వపాదయానస్ఖలనం నృపాణాం భఙ్గః క్వచి ద్యానపలాయనం చ
ద్వారాభిఘా తాధ్వగశస్త్రపాతాః ప్రస్థానభఙ్గం కథయన్తి యాతుః.

సర్వథా దేవతాః స్వస్తి కరిష్యన్తి.

శోధ—ఏ త్వే త్వార్యః ఇమ మధికరణమణ్డపం ప్రవిశ త్వార్యః. [ఏదు ఏదు అజ్జో. ఇమం అధిఅరణమణ్డవం పవిసదు అజ్జో].

చారు—(ప్రవిశ్య సమన్తా దవలోక్య) అహో, అధికరణ మణ్డపస్య పరా శ్రీః. ఇహ హి

శ్లో. చిన్తాసక్త నిమగ్న మన్త్రిసలిలం
దూతోర్మిశఙ్ఖాకులం
పర్యన్తస్థిత చారనక్రమకరం
నాగాశ్వహింస్రాశ్రయమ్
నానావాశక కఙ్కపక్షిరచితం
కాయస్థసర్పాస్పదం

---

సర్వథా దేవతాః స్వస్తి కరిష్యంతి = ఎల్ల తెఱంగుల దేవతలు మేలు చేయఁగలరు - ఈ తుదకొన పరంపర చూడఁగా ఇది దేవతలు అడ్డపడవలసిన సమయము కాని, మానుసులు ఏమియూ చేయఁజాలిన దని తోఁపదు.

అధికరణ మణ్డపస్య పరా శ్రీః = కచేరి మండపము - ఎంత అందముగా ఉన్నది.

శ్లో. ౧౪. చిన్తా సక్త నిమగ్న మన్త్రి సలిలం = ఆలోచనలో ఆసక్తి కలిగి మునిఁగిన - అనగా చింతలో మునిఁగిన అనుటయే - మంత్రులే నీరుగా గలదియూ, దూత ఊర్మి శఙ్ఖ ఆకులమ్ = దూతలే అలలును శంఖములును ఐ, వానితో కలఁగినదిగా నుండునదియూ, పర్యన్త స్థిత చార నక్ర మకరం = అంచులలో నున్న చారులలెడి మొసళ్ళు పెద్ద చేపలు గలదియూ, నాగాశ్వ ... = ఏనుఁగులు గుఱ్ఱాలు అను (హింస్ర = ) చంపుజంతువులకు (ఆశ్రయం = ) చోటైనదియూ, నానా వాశక ... = పలు తెఱంగుల కూయు - పలు తెఱంగుల గొంతులుగల జనులు (చూపఱ) అనెడు నారాయణపక్షులు దట్టముగా వాలియున్నట్టిదియూ, కాయస్థుఁ

నీతిక్షుణ్ణతటం చ రాజకరటం
హింస్రైః సముద్రాయతే. ౧౪

భవతు. (ప్రవిశ ఞ్ఛిరోఘాత మభినీయ సవితర్కమ్) అహాహా, ఇద మపరమ్,

శ్లో. సవ్యం మే స్పన్దతే చక్షు ర్వైరౌతి వాయస స్తథా
పన్థా సర్పేణ రుద్ధో ఽయం స్వస్తి చాస్మాసు దైవతః. ౧౫

తావ త్ప్రవిశామి. (ఇతి ప్రవిశతి.

---

డను సపక్షమునకు చోటయినదియు, నీతి క్షుణ్ణ తటం = నీతులు అను (నీతి=నది) నదులచే చీల్పఁబడిన - పాడిచేయఁబడిన గట్లుగలదియు, రాజకరణం = రాజే దేహామే ఐన, అధికరణ మండపము కచ్చేరి, హింస్రైః - చంపుట మొదలగు దండనలను క్రూరమృగములు గలదియు నై, సముద్రాయతే - సముద్రమువలె నున్నది.

మంత్రులే నీళ్ళు, దూతలే అలలును శంఖములును, చారులే మొసళ్ళు - (నక్రము మకరము - రెండురకములైన ఒక జాతి జలజంతువులె పర్యాయములవంటివి, సమయాన వేఱులును) ఏనుఁగులు గుఱ్ఱాలే చంపు నీటిజంతువులు, పలు గొంతులు - పలు భాషలు మాటలాడుచు మూఁగిన జనమే కంకపక్షులు - రాపులగులు - నారాయణపక్షులు - సముద్రతీరాన మెండుగా నుండునవి, కాయస్థుఁడు పాము, నీతులే గట్టుంజీల్చునదులు, రాజే దేహము, ఇవన్నియు కలిగియుండునది ఈమండపము ఒక సముద్రమే.

ఇట్లు రకాలవారితో నుండు దీని రామణీయకము సముద్రమో యన చారుదత్తుని, వ్యుత్పన్నమును నాగరకమునైన చిత్తముం దాఁకినది.

శిరోఘాతమ్ - గడపయో గుంజయో గోడయో తలకు తగిలినది - తలకొట్టుకొన్నట్లయినది - ప్రవేశమున శిరోఘాతమును గొప్పయవశకునము.

శ్లో. ౧౫. అన్ని యవశకునములను మరల తలఁచుకొనుచున్నాఁడు - మే = నాకు, సవ్యం చక్షుః స్పన్దతే, = ఎడమకన్ను అదరుచున్నది - తథా = అట్లే = మఱియు అనుట, వాయసః = కాకి, విరౌతి = కూయుచున్నది; అయం పన్థాః - ఇదిగో దారి, సర్పేణ రుద్ధః = పాముచే అడ్డఁబడినది. చ = కావున, అస్మాసు స్వస్తిదైవతః - నాయొడ మంగళము కేవలము దైవమువలననే.

అధి—అయ మసౌ చారుదత్తః. య ఏషః,

శ్లో. ఘోణోన్నతం ముఖ మపాఙ్గవిశాలనేత్రం
నైతద్ధి భాజన మకారణదూషణానామ్,
నాగేషు గోషు తురగేషు తథా నరేషు
న హ్యాకృతిః సుసదృశం విజహాతి వృత్తమ్. ౧౬

ఇన్ని యవశకునములు ఒక్కుమ్మడియు, మాటిమాటికిని అగుట సంభవమా ? సంభవమే. ఏల కాదు – ? ప్రశాంతముగానో, వసంతసేనం దలఁచుకొని సుఖపుఁగలలు కనుచునో యున్న వానికి ఈకొలుత కెక్కించుటకైన యధికరణికు పిలుపు ఇంతటిని సంభవ మనిపించును. అంతటిది కదా ఆకస్మికముగా ఆరానున్నయాపద, హత్యానిందకై కొట్టు !

అయం అసౌ చారుదత్తః – వీఁడుగో ఆ చారుదత్తుఁడు – అన్నివిధాల గొప్పవాఁడుగా ప్రసిద్ధుఁడై ఉండువాఁడు – అనుట.

శ్లో. ౧౬. ముఖం = మోము, ఘోణోన్నతం = ఎత్తైన ముక్కు గలదియు, అపాఙ్గవిశాలనేత్రమ్ – కడల విశాలములైన కన్నులుగలదియు; ఏతత్ హి=ఇది = ఇది ఒక నాఁడును, అకారణదూషణానాం = కారణములేని నిందలకు – తప్పులకు, నభాజనమ్ = పాత్రముగాదు. నాగేషు గోషు తురగేషు, తథా నరేషు = ఏనుఁగులందును, ఎడ్లయందును, గుఱ్ఱాలయందును, అట్లే మానుసులందును, ఆకృతిః = రూపము, సుసదృశం = ఎంతయు తనకు తగినట్టి, వృత్తమ్ – (మంచి) నడువడిని, న విజహాతి హి = విడువదు కదా.

కవి యీ నాయకునియందమున 'ముక్కును' ముందుకు తెచ్చినాఁడు. ఉన్నతమైన నాస, వెడందకన్నులు గల ఈ మొగము – అట్లు అంత అందమైనది. మంచి నడువడికి ఒకనాఁడును తొలఁగిపోదు.

సామాన్యముచే విశేషమును సమర్థించుటచే అర్థాంతరన్యాసము. 'నహ్యాకృతిః సుసదృశం విజహాతి వృత్తమ్' అను సామాన్యముచే చారుదత్తశీల మను విశేషము సమర్థింపఁబడినది,

చారు—భోః అధికృతేభ్యః స్వస్తి. హంహో నియుక్తాః, అపి కుశలం భవతామ్.

అధి—(ససంభ్రమమ్) స్వాగత మార్యస్య. భద్ర శోధనక, ఆర్య స్యాసన ముపనయ.

శోధ—(ఆసన ముపనీయ) ఇదం ఆసనమ్. అ త్రోపవిశ త్వార్యః. [ఏదం ఆసనమ్. ఏత్థ ఉవవిసదు అజ్జే]

(చారుదత్త ఉపవిశతి.

శకా—(సక్రోధమ్) ఆగతో ఉసి రే స్త్రీఘాతక, ఆగతో ఉసి. అహో న్యాయ్యో వ్యవహారః, అహో ధర్మ్యో వ్యవహారః, య దేతస్మై స్త్రీఘాతకా యాసనం దీయతే. (సగర్వమ్) భవతు, నను దీయతామ్. [ఆగదే శి లే ఇత్థిఆఘాదఅ, ఆగదే శి. అహో ణాఏ వవహాలే, అహో ధమ్మే వవహాలే, జం ఏదాహ ఇత్థిఆఘాద కాహ ఆశణే దీఅది. భోదు, ణం దీఅదు].

అధి—ఆర్యచారుదత్త. అస్తి భవతో ఉస్యా ఆర్యాయా దుహిత్రా సహ ప్రసక్తిః ప్రణయః ప్రీతి ర్వా?

అధికృతేభ్య? అధికరణికులకు స్వస్తి. నియుక్తాః = నియోగులారా = శ్రేష్ఠి కాయస్థులారా, అపి కుశలం ... మీకు క్షేమమా? ఇదం ఆసనం = ఇదిగో ఆసనము, అని ఆసనము పెట్టించుటకు ఎంతయు తొందరడును, అంత గౌరవము. సక్రోధమ్ = కోపముతో - ఆగతః అసి రే స్త్రీఘాతక - శకారుడు ఆర్య చారుదత్తుని నిస్సంకోచముగా 'ఓరి' అని నీచుంబోలె వ్యవహరించుచున్నాడు. దానికి అధికరణికులు వాని నేమియు అనుట లేదు. ఏతస్మై స్త్రీ ఘాతకాయ ఆసనం దీయతే - వీనికి, ఆడుదానిం జంపినవానికి, అభియుక్తునికి ఆసనము వేయించుచున్నాడు! కానీలే - వీని పని పట్టింతునులే - అనుట.

అస్యా ఆర్యాయాః దుహిత్రా = ఈయమ్మకొమార్తతో, ప్రసక్తిః = సంబంధము, ప్రణయః = స్నేహము, ప్రీతిః = ప్రేమ, అధికరణిక ప్రశ్న - ఇందుఁ సూక్ష్మభేదమునందు తాత్పర్యము లేదు - ఇంచుమించుగా పర్యాయములే కాఁదగును, ఎట్టిదో ఏపాటిదో ఒక సంబంధము కలదా అనుట.

చారు—కస్యాః ?

అధి—అస్యాః.   (ఇతి వసన్తసేనామాతరం దర్శయతి.

చారు—(ఉత్థాయ) ఆర్యే, అభివాదయే.

వృద్ధా—జాత, చిరం మే జీవ. (స్వగతమ్) అయం స చారుదత్తః! సునిక్షిప్తం ఖలు దారికాయా యౌవనమ్. [జాద, చిరం మే జీవ. అఅం సో చారుదత్తో. సుణిక్ఖిత్తం క్ఖు దారిఆఏ జోవ్వణమ్].

అధి—ఆర్య, గణికా తవ మిత్రమ్ ?

(చారుదత్తో లజ్జాం నాటయతి)

శకా—

శ్లో. లజ్జయా భీరుతయా వా
   చారిత్ర మలీకం నిగూహితుమ్

---

అయం స చారుదత్తః - ఈయన ఆచారుదత్తుఁడు. ధనముకోసము నేను మఱెవ్వనిం జెప్పినను వినక, ఇతనిమీఁద నే చిత్తము తగిల్చియుండె నే అమ్మాయి. అందులకు తగినవాఁడే అని యనుకొనుట. సునిక్షిప్తమ్ = చక్కఁగా ఉంపఁబడినది. - ఇల్లడ పెట్టినట్లు దాఁపఁబడినది, వృద్ధకును చారుదత్తునికి అన్యోన్యసముదాచారము గుర్తింపఁదగును - ఇతని అభివాదనము, ఆపె, జాత = బిడ్డ, అబ్బాయి అనుట ఆశీస్సు పలుకుటయు - ఇంకను చారుదత్తుఁడు అధికరణికునికి జవాబు పలుకలేదు - వృద్ధాచారుదత్తుల సముదాచారవినిమయమే కొంత రజావు చేయును.

మరల కచ్చేరిదే ప్రశ్న - గణికా తవ మిత్రమ్ = భోగముది నీ నేస్తురాలు! లజ్జాం నాటయతి - సిగ్గును అభినయించును - ఇది యావేసగానికి అభినయింపుమని ఉపదేశము - అది అసలు చారుదత్తునికి నిజము - హార్దము కాదు అనుట కాదు.

శ్లో. ౧౭. ఈయభినయము సిగ్గో, పిఱికితనమో కాని - లజ్జయా = సిగ్గుచేతనో, భీరుతయావా = పిఱికితనముచేతనో - చారిత్రం = నడువడిని (చెడ్డదానిని),

స్వయం మారయి త్వార్థకారణా
దిదానీం గూహతి న తద్ధి భట్టకః. ౧౭

[లజ్జాఏ భీలుదాఏ వా
చాలిత్తం అలీఏ ణిగూహిదుమ్
శఅం మాలిఅ అత్థకాలణా
దాణిం గూహది ణ తహిం భట్టకే].

శ్రేష్ఠికా—ఆర్యచారుదత్త, భణ. అలం లజ్జయా వ్యవహారః ఖల్వేషః. [అజ్జచారుదత్త, భణాహి. అలం లజ్జాఏ. వవహారో క్ఖు ఏసో].

చారు—(సలజ్జమ్) భోః, అధికృతాః. మయా కథ మీదృశం వక్తవ్యమ్, యథా గణికా మమ మిత్ర మితి. అథవా యౌవన మత్రాపరాధ్యతి. న చారిత్ర్యమ్.

---

నిగూహితుం = దాఁచుటకు - అలీకం = అసత్యాభినయము. భట్టకః = దొర - దరిద్రుని వెక్కిరించు మాట, అర్థకారణాత్ = డబ్బుకోసము, స్వయం మారయిత్వా = సొంతముగా చంపి, ఇదానీం గూహతి = ఇపుడు దాఁచుచున్నాఁడు. తత్ న హి - అది చెల్లదు.

ఆర్యచారుదత్త - చారుదత్తయ్యా, చెప్పు, సిగ్గు పడకు. ఇది వ్యవహారము గదా. మయా = నాచేత, కథం = ఎట్లు, ఈదృశం = ఇట్టిది, వక్తవ్యం = చెప్పఁదగినది అగును. నాబోఁటివాఁడు ఇట్టిదానిని ప్రకటముగా చెప్పఁదగునా, నిజమే ఐనను ? యథా - ఏమని యనఁగా - గణికా మమ మిత్రం ఇతి - భోగముది నాకు మిత్రము అని. అథవా = అట్లుగాదు - యౌవనం అత్ర అపరాధ్యతి - జవ్వనము ఈవిషయమున తప్పు చేయుచున్నది, న చారిత్రమ్ = నడువడి కాదు. భోగముదాని సంగాతము అంతగా శాస్త్రనిషిద్ధము, చారిత్రాపరాధము గాకున్నను, అతిమాత్రమైనది, పలువురితోడిది లంపటత దోషమే అగును - చారిత్రదోషమే అగును. మఱి యిపుడు ఇది అట్టిది కాదు. అది యించుకే - యౌవనాపరాధలేశమాత్రము - వత్సేశ దుష్యంతాదులకును భాసకాళిదాసాదులు భోగినులం జెప్పియున్నారు.

అధి—

శ్లో. వ్యవహారః సవిఘ్నో ఽయం త్యజ లజ్జాం హృది స్థితామ్
బ్రూహి సత్య మలం ధైర్యం ఛల మత్ర న గృహ్యతే. ౧౮

అలం లజ్జయా. వ్యవహార స్త్వాం పృచ్ఛతి.

చారు—అధికృత, కేన సహ మమ వ్యవహారః ?

శకా—(సాటోపమ్) అరే, మయా సహ వ్యవహారః ? [అలే, మఏ శహ వవహాలే].

చారు—త్వయా సహ మమ వ్యవహారః సుదుస్సహః.

---

శ్లో. ౧౮. అయం వ్యవహారః = ఈ వ్యాజ్యము, సవిఘ్నః = విఘ్నములతో కూడిన దగును - నీవు జవాబు చెప్పకున్న - హృది స్థితాం = మనసులో నున్న, లజ్జాం = సిగ్గును, త్యజ = విడువుము. సత్యం బ్రూహి = నిజము చెప్పుము. ధైర్యము, అలం = సమర్థము - ఇట్టి పట్టుల సాధకము - కార్యసాధకము - అత్ర = ఇందు, అనఁగా వ్యవహారమున, ఛలం = మోసము, ఏదేని యుక్తి, న గృహ్యతే = అంగీకరింపఁబడదు.

నీవు ప్రతివాదివి ముద్దాయి ఐయున్నావు, నీకు తెలియునో తెలియదో; నీ జవాబు తప్పక అవసరము. అది చెప్పకున్న వ్యవహారము సాఁగదు, కావున మనసు లోని సిగ్గును మాను, నిజము పలుకు - ధైర్యము కార్యసాధకము. మోసము అంగీకరింపఁబడదు.

కేన సహ మమ వ్యవహారః - ఎవరితో నాకు వ్యాజ్యము ? ఫిర్యాది ఎవరు ? శకారుఁడు బడాయితో చెప్పుచున్నాఁడు - ఓరి, నాతో రా...

త్వయా సహ = నీతో, మమ వ్యవహారః = నాకు వ్యాజ్యము. సుదుస్సహః = ఎంతయు ఓర్వరానిది అగును. నీతో నేమి ! నా కేమి ! వ్యవహార మేమి ! అట్టిది యెంతయు సుదుస్సహము.

శకా—అరే స్త్రీఘాతక, తాం తాదృశీం రత్నశతభూషణాం వసన్తసేనాం మారయిత్వా, సాంప్రతం కపటకాపటికో భూత్వా, నిగూహసి. [అలే ఇత్థిఆఘాదఆ, తం తాదిశిం లఅణశదభూశణిఅం వశన్తశేణిఅం మాలిఅ, శంపదం కవడకావడికే భవిఅ ణిగూహేశి].

చారు—అసంబద్ధః ఖల్వసి

అధి—ఆర్యచారుదత్త, అల మనేన. బ్రూహి సత్యమ్. అపి గణికా తవ మిత్రమ్?

చారు—ఏవ మేవ.

అధి—ఆర్య, వసన్తసేనా క్వ.

చారు—గృహం గతా.

శ్రేష్ఠికా—కథం గతా, కదా గతా, గచ్ఛన్తీ వా కేనానుగతా.

చారు—(స్వగతమ్) కిం ప్రచ్ఛన్నం గ తేతి బ్రవీమి.

---

అరే స్త్రీఘాతక ... = ఓరి ఆఁడుదానిం జంపినవాఁడా, ఆపెను, అట్టిదానిని - అందగత్తెను పడుచును - లెక్కలేని రతనాల యలంకారముల నలంకృతను, వసంతసేను మారయిత్వా = చంపి, ఇపుడు మిక్కిలి మోసము అవలంబించినవాఁడవై, దాఁచుచున్నావురా!

అసంబద్ధః - (ఒండొంటికి) అదుకని - సంబంధపడని - మాటలవాఁడవు - ఖలు అసి - కదా అగుచున్నావు.

అలం అనేన = వానితో నేమి? (పోనీ,) చెప్పు నిజము, బోగముది నీకు మిత్రమా? ఏవ మేవ = అలాగే - అవును అన్నమాట. వసన్తసేనా క్వ = వసంతసేన ఎక్కడ? ఇంటికి పోయినది. కథం గతా, కదా ... = ఎట్లు పోయినది? - బండిలోనా నడిచియా - అనుట. ఎప్పుడు. గచ్ఛన్తీ వా కేన అనుగతా - పోవుచున్నది ఎవరిచే వెంబడింపఁబడినది? ఎవరు తోఁడు? కిం ప్రచ్ఛన్నం గ తేతి బ్రవీమి? రహస్యముగా పోయినదని చెప్పుదునా? గృహంగతా = ఇంటికిపోయి

శ్రేష్ఠికా — ఆర్య, కథయ. [అజ్జ, కధేహి].

చారు — గృహం గతా. కి మన్య ద్బ్రవీమి?

శకా — మదీయం పుష్పకరణ్డక జీర్ణోద్యానం ప్రవేశ్యార్థ నిమిత్తం బాహుపాశబలాత్కారేణ మారితా. అయే సాంప్రతం వదసి గృహం గ తేతి. [మమ కేలకం పుష్ఫకలణ్డక జిణ్ణుజ్జాణం పవేశిఅ అత్థణిమిత్తం బాహుపాశబలక్కాలేణ మాలిదా. అవ శం పదం వదశి ఘులం గదే త్తి].

చారు — ఆః అసంబద్ధప్రలాపిన్

శ్లో. అభ్యుక్షితో ఽసి సలిలై ర్న బలాహకానాం
చాపాగ్రపక్షసదృశం భృశ మన్తరాలే

---

నది - మఱేమి చెప్పుదును? తనతో రాత్రి గడపినది, తాను తోఁటకుపోవుచు, రతశ్రాంతనిద్రితను లేపక, లేచినపుడు తన కడకు తోఁటకు బండిలో పిలుచుకొని రమ్మని చెప్పి పోయినాఁడు - మఱి యిపుడు చంపఁబడిన దని వ్యవహారము జరుగుచున్నది - కావున తన యేపాటి వెల్ల ఏమయినదో తనకు తెలియదు - ఆవివరము లేవియు అస్పష్టముగా వ్యవహారాన చెప్పఁగూడదు - ఎట్లు పోయి ఎట్లు వచ్చునో - మఱియు వసంతసేన తన కడకు రావలయును తన బండిలో ఆర్యకుఁడు తప్పించుకొన్న వాఁడు వచ్చి శరణార్థియైనాఁడు, దాని వివరములును తాను అప్పు డేమియును విచారింపలేదు. తన బండిలో ఆర్యకుఁడు ఎక్కినది వర్ధమానకుఁడు ఎఱుంగక వసంతసేనయే అనియనుకొన్నాఁడు. స్థావరకుఁడు చేటుఁడు తన బండిలో కలిగిన వసంతసేనవలని బరువును గుర్తింపక, తన యలసటవలని భ్రాంతి అట్లు బరువుగా తోఁచుట అని వాఁడును వసంతసేనం బరికింపఁడు. నిజముగా చారుదత్తునికి సర్వము గందరగోళముగా ఉన్నది. కావున - వ్యవహారమున ఈపాటి యిట్లు చెప్పుచున్నాఁడు - ఇంటికి పోయినది - ఇది తా నెఱిఁగినది - సత్యము - దోషము లేనిది యగునని.

అసమ్బద్ధప్రలాపిన్ - అసంబద్ధములం బ్రేలువాఁడా.

శ్లో. ౧౯. వలాహకానాం = మేఘములయొక్క, సలిలైః = నీళ్ళతో - వానతో, న అభ్యుక్షితః అసి = తడుపఁబడినవాఁడవు గావు. - ఇప్పుడు వాన

మి థ్యైత దానన మిదం భవత స్తథా హి
హేమ న్తపద్మ మివ నిష్ప్రభతా ముపైతి. ౧౯

అధి—(జనాన్తికమ్)

శ్లో. తులనం చాద్రిరాజస్య సముద్రస్య చ తారణమ్
గ్రహణం చానిల స్యేవ చారుదత్తస్య దూషణమ్. ౨౦

(ప్రకాశమ్) ఆర్యచారుదత్తః ఖ ల్వసౌ కథ మిద మకార్యం కరిష్యతి. ('ఘోణా' ఇత్యాది పఠతి)

---

కుటియలేదు - మతి, భవతః ఇదం ఆననం = నీయీ మొగము, అన్తరాళే = నడుమ - బొమలకును నొసటికిని నడుమ అనుట, భృశం=ఎంతయు, చాపాగ్రపక్షసదృశమ్= చాపమను పక్షియొక్క ఱెక్కలకొన, ఎంతయు నలుపైనది - దానికిసమానముగా నున్నది, ఏతత్ = ఇది, నీమాట, కట్టియబద్ధము, తథా హి = అట్లేకదా, (ఇదం ఆననం) హేమన్తపద్మం ఇవ = హేమంతపు (మంచుకు మాడిన) కమలమువలె, నిష్ప్రభతాం = కాంతిలేమిని, ఉపైతి = పొందుచున్నది.

నీ మొగమే నీవు చెప్పునది అసంబద్ధము - మిథ్య అని తెలుపుచున్నది. (నీవు ఎంత విఱ్ఱవీఁగుచున్నను) నొసట ఆచెమట కాఱుటేమి? (వాన కురిసినదా?) చాపము చాపిన ఱెక్కల కొనవలె (కాటుకంత) నలుపుగా, మంచుకు మాడిన తామరవలె నున్నదే మొగము, అదేమి!

శ్లో. ౨౦. చారుదత్తస్య దూషణమ్ = చారుదత్తునియందు దోషము - పాపము - చెప్పుట - ఋజువుచేయుట, అద్రిరాజస్య = పెనుగొండను, (అచలమును) తులనం ఇవ = కదల్చుట - ఊపుటవలె, సముద్రస్య తారణం ఇవ = సముద్రమును - పారాపారమును - అవలిగట్టులేనిదానిని, దాఁటుటవలె, అనిలస్య గ్రహణమ్ ఇవ = ('సదాగతి సమీరణ' అనఁబడు) గాలిని పట్టుకొనుట - నిలుపుటవలె.

అసాధ్యము అనుట - అని జనాంతికమ్ - అధికరణికుఁడు వానికచ్చేరి వారితో ననుట - ఇతరులు వినకుండునట్లు.

ఆర్యచారుదత్తః ఖలు అసౌ = అన్ని మేలిగుణములకును ఆవాసము, అందును విశేషముగా దాన దయా దాక్షిణ్యములకు నెలవు అని ప్రసిద్ధుఁడుగదా - అనుట, కథం ... = ఇట్టి కూడనిపనిని ఎట్లు చేయును? ఇది నమ్మఁదగనిదిగా ఉన్నది.

శకా—కిం పక్షపాతేన వ్యవహారో దృశ్యతే. [కిం పక్ఖ వాదేణ వవహారో దీశది].

అధి—

శ్లో. వేదార్థా న్ప్రాకృత స్త్వం వదసి న చ తే
జిహ్వా నిపతితా
మధ్యాహ్నే వీక్షసే ఽర్కం న తవ సహసా
దృష్టి ర్విచలితా
దీప్తాగ్నౌ పాణి మన్తః క్షిపసి స చ తే
దగ్ధో భవతి నో
చారిత్రా చ్చారుదత్తం చలయసి న తే
దేహం హరతి భూః. ౨౧

---

కిం పక్షపాతేన ... = ఏమి పక్షపాతముతో వ్యాజ్యము విచారింపఁబడునా?

అపేహి ... = తొలఁగు మూర్ఖుఁడా.

శ్లో. ౨౧. ప్రాకృతః – తక్కువవర్ణమువాఁడవు, వేదార్థాన్ = వేదములందలి విషయములను, వదసి = చెప్పుదువు. చ – మఱి, తే జిహ్వా = నీనాలుక, న నిపతితా = పడదాయె, మధ్యాహ్నే = మట్టమధ్యాహ్నమున, అర్కం, వీక్షసే = సూర్యుం జూతువు; తవ దృష్టిః = నీచూపు, సహసా = అప్పుడే, తటాలున, న విచలితా = పోలేదే! దీప్తాగ్నౌ = మండుచున్న నిప్పులో, అన్తః = (జ్వాలల) లోపలికి, పాణిం క్షిపసి = చేతిని వేయుచున్నావు, చ = మఱి, స = అది, తే = నీది, దగ్ధః నో భవతి = కాలిపోలేదే! చారిత్రాత్ = (ప్రసిద్ధినొందిన) నడువడినుండి, చారుదత్తం = చారుదత్తుని, చలయసి = ఊపుదువు – (మఱి) తే దేహం = నీదేహమును, భూః = భూమి, న హరతి = లోఁగొని పూడ్చుకొనకున్నదే.

చారుదత్తుని వ్యపదేశ మేమి, వాఁడు స్త్రీహత్య చేసినాఁ డనుట ఏమి! ఎంత విపరీతము! ఎంత పాపిష్ఠము! మహాపాపములు చేసినవారిని అప్పుడే అవి కొట్టి ఆడగాచుచునే, మఱి నిన్ను భూమి లోఁగొనకున్నదే – నీవు పూడిపోక యున్నావే.

ఆర్యచారుదత్తః కథ మకార్యం కరిష్యతి,

శ్లో. కృత్వా సముద్రముదకోచ్ఛ్రియమాత్ర శేషం
దత్తాని యేన హి ధనా న్యనపేక్షితాని
స శ్రేయసాం కథ మి వైకనిధి ర్మహాత్మా
పాపం కరిష్యతి ధనార్థ మవైరిజుష్టమ్. ౨౨

వృద్ధా—హాతాశ, య స్తదాసీం న్యాసీకృతం సువర్ణభాణ్డం రాత్రౌ చౌరై రపహృత మితి తస్య కారణా చ్చతుఃసముద్రసార

---

అపరవర్ణుఁడు వేదము పలికిన నాలుక వ్రయ్యును! మిడియెండ సూర్యుం జూచిన, కన్నులు గ్రుడ్డి ఐపోవును - అట్లట్లు సద్యః ఫల మొసంగునే - చారుదత్తునిమీఁద నిట్లు చెప్పుచున్నావే - ఇది వానింబోలినది - నీవు పూడిపోదువు !

శ్లో. ౨౨. యేన = ఎవనిచేత, సముద్రం = సముద్రమును, ఉదక ఉచ్ఛ్రియమాత్ర శేషం = నీటిపెక్కువమాత్రము మిగులునట్లుగా - ఒక రత్నమైనను మిగులకుండ, కృత్వా = చేసి, ధనాని = ధనములు, అనపేక్షితాని = కోరఁబడనివి సయితము - అడుగనివారికి సయితము, (దత్తానిహి) = దానము చేయఁబడెనో, సః - అట్టివాఁడు, శ్రేయసాం = పుణ్యకర్మలకు, ఏకనిధిః = ఒక్కటే పాఁతలు, మహాత్మా = గొప్ప మనస్సు ఆత్మ కలవాఁడు, ధనార్థం = డబ్బుకోసము, అవీర జుష్టమ్ = ఎవఁడేని పంద సేవింప - చేయవలసినట్టి, = పాపం = పాపమును - స్త్రీహత్యను, కథం ఇవ = ఎటువలె, కరిష్యతి = చేయఁగలఁడు ?

రత్నాకరము వట్టి నీరాకర మగునట్లుగా, ధనములు, కోరనివారిని సయితము పిలిచి పిలిచి దానము చేసినవాఁడు చారుదత్తుఁడు - ఉజ్జయినిలోని పుణ్యకార్యము లెల్ల - చెఱువులు త్రవ్వుట, దేవళములు ప్రతిష్ఠించుట - సత్రాలు ఏర్పరుచుట - మొదలగునవి, చేసినవాఁడు, గొప్పమనస్సు స్వభావము గలవాఁడు, ధనముకోసము, ఎవఁడేని పందకుఁ దగిన, స్త్రీవధంబోని పాపము చేయునా ? (ఎవరు నమ్ముదురు ?)

హాతాశ - నిర్భాగ్యుఁడా, ఎవఁడు అప్పుడు ఇల్లడపెట్టిన బంగారునగను దొంగలు ఎత్తుకొనిపోయినారని, దానికి బదులు, నాలుగుసముద్రములయందు సారము

భూతాం రత్నావలీం దదాతి, స ఇదానీ మర్థకల్యవర్తస్యకారణా దిద మకార్యం కరోతి! హా! జాతే, ఏహి మే పుత్రి). [హదాస, జో తదాణిం ణాసీకిదం సువణ్ణభణ్డాఅం రత్తిం చోరేహిం అవహిదం త్తి తస్స కారణాదో చదుస్సముద్దసారభూదం రఅణావలిం దేది, సో దాణిం అత్థకల్లవత్తస్స కారణాదో ఇమం అకజ్జం కరేది. హా! జాదే, ఏహి మే పుత్తి.]. (ఇతి రోదితి.

అధి—ఆర్యచారుదత్త, కి మసౌ పద్భ్యాం గతా ఉత ప్రవహణేన ?

చారు—నను మమ ప్రత్యక్షం న గతా. తన్న జానే కిం పద్భ్యాం గతా, ఉత ప్రవహణే నేతి.

(ప్రవిశ్య సామర్షః)

వీర—

శ్లో. పాదప్రహారపరిభవవిమాననా బద్ధగురుకవైరస్య
అనుశోచత ఇయం కథ మపి రాత్రిః ప్రభాతా మే. ౨౩

అని చెప్పదగిన, కొలతలేని వెలగల రత్నాల హారమును ఇచ్చినాఁడో, అట్టివాఁడు, ధనమును చలిదియన్నముకోసము ఈ, కూడని పనిం జేయునా ? అయ్యో (నా) బిడ్డా, రావే నాకూఁతురా !

ఆర్యచారుదత్త ... = చారుదత్తయ్య, ఆమె కాళ్ళతో నడిచిపోయినదా, లేక బండిలో పోయినదా ?

నను - అయ్యా, మమ ప్రత్యక్షం ... = నాకన్నుల యెదుట పోలేదు. కావున ఎఱుఁగను, పాదాలతో పోయినదో, లేక బండిలో పోయినదో.

ప్రవిశ్య సామర్షః - (అప్పుడు సమయానికి) ప్రవేశించి కోపముతో వీరకుఁడు - ఆర్యకుని పట్టుకొనవెదకుచున్న సకారుని ఊరికాఁపుదారివారికి నాయకుఁడు.

శ్లో. ౨౩. పాదప్రహార ... = కాలితాఁపుతో అవమానించుటకును, (పోరా వట్టి కుక్కవు నీవు అని) తూలనాడుటకును ఎంతయు పెద్ద పగ పూని, వానిని

[ పాదప్పహారపరిభవవిమాణణా బద్ధగురుఅవేరస్స
అణసోఅన్తస్స ఇఅం కధం పి రత్తీ పభాదా మే ]

తద్యావ దధికరణమణ్డప ముపసర్పామి. ( ప్రవేష్టకేన ) సుఖ మార్యమిశ్రాణామ్. [ తా జావ అధిఅరణమణ్డవం ఉపసప్పామి. సుహం అజ్జమిస్సాణమ్ ].

అధి—అయే, నగరరక్షాధికృతో వీరకః. వీరక, కి మాగ మనప్రయోజనమ్?

వీర—హీం, బన్ధనభేదనసంభ్రమ ఆర్యక మన్వేషయన్, అప వారితం ప్రవహణం వ్రజ తీతి విచారం కుర్వ న్నన్వేషయన్, 'అరే, త్వయా ప్యాలోకితమ్, మయా ప్యాలోకితవ్యమ్' ఇతి భణ న్నేవ చన్దనమహత్తరకేణ పాదేన తాడితో ఽస్మి. ఏత చ్ఛ్రుత్వార్య మిశ్రాః ప్రమాణమ్. [ హీం, బన్ధణభేఅణసంభమే అజ్జకం అణ్ణేసన్తో, ఓవాడిదం పవహణం వచ్చది త్తి వీఆరం కరన్తో అణ్ణేసన్తో, 'అరే,

---

తలఁచుకొని దుఃఖించుచున్న నాకు ఈరాత్రి ఎట్లో తెల్లవారినది. తత్ యావత్ అధికరణమణ్డపం ... = కావున అధికరణమండపమునకు గనపోయెదను. ప్రవిష్టకేన = ప్రవేశించుటతో - అనఁగా ప్రవేశించుటను అభినయించి, సుఖం ఆర్యమిశ్రాణాం = అయ్యగారలకు పెద్దలకు సుఖమా? అయే = ఓహూ, బన్ధన భేదన సంభ్రమే - కారాగారము పగులఁగొట్టుట వలని (యాయూరి) = తొట్రుపాటున - గందరగోళమున - ఆర్యకుని వెదకుచు, అపవారితం ప్రవహణం వ్రజతి - ఇతి ... = మూయఁబడి - లోపల ఎవరున్నది బయటికి తెలియనీక - బండి పోవుచున్న దని విచారించుచు వెదకుచున్నవాఁడు, ఓరి నీచేతను చూడఁబడినది నాచేతను (సోదా) చూడఁబడవలె నని చెప్పుచునే చందనకమహత్తరుని చేత కాలితో తన్నఁబడితిని. ఏతత్ శ్రుత్వా ఆర్యమిశ్రః ప్రమాణమ్ = దీనిని విని అయ్యగారు ఇందుకు ఏమి సేయఁదగునో నిర్ణయింతురు గాక.

తుప వి ఆలోఇదే, మప వి ఆలోఇదవ్వో' త్తి భణన్తో జ్జేవ చన్దణ మహత్తరఏణ పాదేణ తాడిదో మ్హి. ఏదం సుణిఅ అజ్జమిస్సా పమాణమ్ ].

అధి—భద్ర, జానీషే కస్య త త్ప్రవహణ మితి?

వీక—అ స్యార్యచారుదత్తస్య వసన్తసే నారూఢా పుష్ప కరణ్డక జీర్ణోద్యానం క్రీడితుం నీయత ఇతి ప్రవహణవాహకేన కథితమ్. [ఇమస్స అజ్జచారుదత్తస్స. వసన్తసేణా ఆరూఢా పుప్ఫ కరణ్డఅజిణ్ణుజ్జాణం కీలిదుం ణీఅది త్తి పవహణవాహఏణ కహిదమ్].

శకా—పున రపి శ్రుత మార్యైః. [పుణో వి శుదం అజ్జేహిం].

అధి—

శ్లో. ఏష భో నిర్మలజ్యోత్స్నో రాహుణా గ్రస్యతే శశీ
జలం కూలావపాతేన ప్రసన్నం కలుషాయతే. ౨౮

---

అస్య ఆర్య చారుదత్తస్య = ఈచారుదత్తయ్యది. వసంతసేన ఎక్కి ఉన్నది. పుష్పకరండక జీర్ణోద్యానమునకు; ఆమె ఆటలాడుటకు తీసికొని పోఁబడుచున్నది అని బండితోలువానిచేత చెప్పఁబడినది.

పునః అపి శ్రుతం ఆర్యైః - అయ్యగారలు మరలను విన్నారా?

చారుదత్తుఁడు తాను కంటితో చూడలేదనియు, కాలినడకతో పోయినదో బండిలో పోయినదో ఎఱుఁగననియు చెప్పినాఁడు. ఇపుడు వసంతసేన అతనిబండిలో ఎక్కి పుష్పకరండకోద్యానమునకు (కాముని) ఆటలాడుటకు పోవుచుండెనని. బండివానిమాట - తాము విన్నట్లు వీరకుఁడు చెప్పినాఁడు. అధికరణికునికి పెద్ద సందియము ఏర్పడినది. చారుదత్తయ్య అబద్ధము చెప్పుచున్నట్లు తోఁచినది. ఇది ఋజువనియే తోఁచుచున్నది - సర్కారు ఉద్యోగస్తువారు పట్టుకొని చూచి చెప్పిన మాట.

శ్లో. ౨౮. భోః - అయ్యా, ఏషః = వీఁడుగో, నిర్మలజ్యోత్స్నః = తేట తెల్లని వెన్నెలగలవాఁడు, శశీ = చంద్రుఁడు, రాహుణా గ్రస్యతే = రాహువుచే

వీరక, పశ్చాదిహ భవతో న్యాయం ద్రక్ష్యామః. య ఏషో ఽధికరణద్వారశ్వ స్తిష్ఠతి, త మేన మారుహ్య గత్వా పుష్పకరణ్డకోద్యానమ్, దృశ్యతా మస్తి తత్ర కాచి ద్విపన్నా స్త్రీ, న వేతి.

వీర — య దార్య ఆజ్ఞాపయతి. (ఇతి నిష్క్రాన్తః, ప్రవిశ్య చ) గతో ఽస్మి తత్ర, దృష్టం చ మయా స్త్రీకలేవరం శ్వాపదై ర్విలుప్యమానమ్. [జం అజ్జో ఆణవేది. గదో మ్హి తహిం. దిట్ఠం చ మఏ ఇత్థిఆ కలేవరం సావఏహిం విలుప్పన్తమ్].

శ్రేష్ఠికా — కథం త్వయా జ్ఞాతమ్ స్త్రీకలేవర మితి. [కథం తుఏ జాణిదం ఇత్థిఆకలేవరం త్తి].

---

త్రింగఁబడుచున్నాఁడు - జలం = (ఏటి) నీరు, ప్రసన్నం = తేటగా ఉన్నట్టిది, కూల అవపాతేన = గట్టు (విఱిగి) క్రింద (నీటిలో) పడుటచేత కలుషాయతే = కలఁగిపోయిన దగుచున్నది.

చారుదత్తయ్యె తెలివెన్నెలతోడి చంద్రుఁడు అని అనుకొనుచుండఁగా, రాహువుపట్టుచున్నట్లు. అతనిబండిలో ఎక్కి వసంతసేన పుష్పకరండకమునకు అతనితో (కామ) క్రీడలాడుటకై పోవుచుండినది అని ప్రబలసాక్ష్యము పలుకఁబడినది. బండిని పట్టుకొన్నవారు చూచినవారు విడిచినవారును, ఐన సకాఁడారు గుల్మాధికారులు చెప్పుచున్నారు. బండివాఁడును ఆమాటయే చెప్పినాఁడనియూ చెప్పుచున్నారు ఇఁక నేమి కావలయును రుజువు?

వీరక, పశ్చాత్ ఇహ ... = వీరక, తరువాత నీన్యాయమును విచారింతును. ఇదిగో కచ్చేరివాకిట గుఱ్ఱమున్నదే, దానిని ఎక్కి పుష్పకరండక - ఉద్యానమునకు పోయి, చూడు, అక్కడ ఎవతె ఐనను ఆఁడుది చచ్చియున్నదా లేదా అని. వీరకుఁడు అట్లే పోయి మరలివచ్చి చెప్పుచున్నాఁడు_గతః అస్మి తత్ర ...=అక్కడికి పోయితిని. నాకు స్త్రీకళేబరము, హింస్రములచేత - కుక్కలచేతను, నక్కలచేతను మఱియట్టి వానిచేత పీకి తినివేయఁబడుచున్నట్టిది అగపడినది - చూచితిని.

వీర — సావశేషైః కేశహస్తపాణిపాదై రుపలక్షితం మయా.
[ సావసేసేహిం కేసహత్థపాణిపాదేహిం ఉవలక్ఖిదం మఏ ].

అధి — అహో, ధి గ్వైషమ్యం లోకవ్యవహారస్య

శ్లో. యథా యథేవం నిపుణం విచార్యతే
తథా తథా సంకట మేవ దృశ్యతే
అహో సుసన్నా వ్యవహారనీతయో
మతి స్తు గౌః పఙ్కగతేవ సీదతి. ౨౫

---

సాక్ష్యము - చారుదత్తునకు ప్రతికూలముగా ఎంత బలము పొందుచున్నది! వీరకుఁడు అధికరణికుని మాటమీఁద పోయి వచ్చినవాఁడు - పోకయే మానక యే అబద్ధము చెప్పెననుట పొసఁగదు. నిజముగా ఆపీనుఁగు విటునికి అనర్థసనభయము కలిగించిన, చెట్టుపడఁగా దానిక్రిందఁబడి చచ్చిన, యాఁడుదానిది కాఁబోలును. సావశేషైః ... = మిగుళ్ళతోఁ గూడిన వెండ్రుకల ముత్తము - కేశహస్తమునఁగా కేశపాశము - వెండ్రుకల ముత్తము. ఉపలక్షితమ్ = గుర్తు పట్టఁబడినది.

శ్లో. ౨౫. ధిక్ - ఇసీ, లోకవ్యవహారస్య వైషమ్యం = లోకవృత్తము ఎంత పూర్వోత్తరవైషమ్యము - విరోధము కలిగి యున్నది - ఇదం - ఇది, చారుదత్తుని వృత్తము, యథా యథా = ఎట్టెట్లు, నిపుణం = నేర్పుతో, విచార్యతే = పరిశీలింపఁబడుచున్నదో, తథా తథా = అట్లట్లు, అంతంత, సంకటం ఏవ = చిక్కే. దృశ్యతే = అగపడుచున్నది, తోఁచుచున్నది. సాక్ష్యముమీఁద సాక్ష్యము అత్యంత ప్రతికూలముగా ఏర్పడుచున్నది, చారుదత్తయ్యమీఁదికి. అహో - ఆశ్చర్యము. వ్యవహారనీతయః = వ్యవహారమార్గములు, సుసన్నాః - ఎంతయు అడఁగారి పోయినవి, మతిః తు = బుద్ధియన్ననో, పఙ్కగతా = అడుసులో పడిన, గౌః = ఇవ = ఆవువలె, సీదతి = క్రుంగుచున్నది,

చారుదత్తయ్యయో అంతటి వ్యపదిష్టుఁడు - అట్టివానిమీఁద స్త్రీహత్యానేరము మోపఁబడినది. అది రుజువును అగుచున్నది కాని మనసుమాత్రము సమాధానపడక ఉన్నది. ఎక్కడనో పొరపాటు ఉండవలయును. అది కనిపట్టరాక యున్నది. వ్యవహారమార్గములు అడఁగారినవి. బుద్ధి, ప్రసారము లేక, ఊహ లేక అడుసులో పడ్డ ఆవువలె క్రుంగిపోవుచున్నది.

చారు—(స్వగతమ్)

శ్లో. యథైవ పుష్పం ప్రథమే వికాసే
సమేత్య పాతం మధుపాః పతన్తి
ఏవం మనుష్యస్య విపత్తికాలే
ఛిద్రే ష్వనర్థా బహులీభవన్తి. ౨౬

అధి—ఆర్యచారుదత్త. సత్య మభిధీయతామ్.

చారు—

శ్లో. దుష్టాత్మా పరగుణమత్సరీ మనుష్యో
రాగాన్ధః పర మిహ హన్తుకామబుద్ధిః

---

శ్లో, ౨౬. యథా ఏవ = ఎట్లుగా, పుష్పం = పూవును, ప్రథమే వికాసే= (అది) విరియఁ దొడఁగఁగానే - వాసన లేవఁదొడఁగఁగానే, మధుపాః = తుమ్మెదలు, సమేత్య = గుంపుగూడి, పాతుం = (మరందముం) ద్రావ. పతన్తి = వాలునో, ఏవం = అట్లే, మనుష్యస్య = మానవునికి, విపత్తికాలే = విపత్తు - ఆపద - నాశనము వచ్చినప్పుడు, ఛిద్రేషు = రంధ్రములందు, - తప్పులందు, అనర్థాః = కీడులు, బహులీభవన్తి = పెక్కుగా పేరును.

చారుదత్తుఁడు ఎంతయు తెలివిగలవాఁడే కదా. ఆ యపశకునములం జూచినాఁడు - ఇక్కడ ఈ నేరము మోపఁబడినాఁడు. దాని రుజువునకు తాను ఎట్లును ప్రతిఘటింపలేని సాక్ష్యము బలముగొనుచున్నది. ఇది కేవలము దైవచేష్ట యని తలంప నేరనివాఁడు కాఁడు. తన బండి, తన బండివాఁడు, వసంతసేన, పుష్పకరండము, స్త్రీశవము - ఇవి యెట్టి మూయరాని రంధ్రములు! అనర్థములు ఎట్లు పేరుకొనవు!

ఆర్యచారుదత్త - చారుదత్తయ్య, నిజము చెప్పు.

శ్లో. ౨౭. యః మనుష్యః=ఏమానిసి, దుష్టాత్మా=(తాను) దోషములుగల స్వభావముగలవాఁడు, పరగుణమత్సరీ=పరుల (రూపౌదార్యాది) గుణములందు మచ్చరీఁడు, చలముగలవాఁడు, రాగాన్ధః = (ఒక తెమిఁది) రాగముచేత మఱి కన్నులు కానివాఁడు, ఇహ = ఇట (ఆసందర్భమునసే), పరం = ఇతరుని - దానసే కానివానిని, హన్తుకామబుద్ధిః = చంపవలయునను కోరికతోడి బుద్ధిగలవాఁడు,

కిం యోఽయ ద్వదతి మృషైవ జాతిదోషా
త్త ద్గ్రాహ్యం భవతి న త ద్విచారణీయమ్. ౨౭

అపి చ,

శ్లో. యోఽహం లతాం కుసుమితా మపి పుష్పహేతో
రాకృష్య నైవ కుసుమాపచయం కరోమి
సోఽహం కథం భ్రమరపక్షరుచౌ సుదీర్ఘే
కేశే ప్రగృహ్య రుదతీం ప్రమదాం నిహన్మి? ౨౮

---

యత్ = దేనిని, మృషా ఏవ = అసత్యముగనే, జాతిదోషాత్ - తన పుట్టుక - కులము - దోషమువలన, వదతి = చెప్పునో, తత్ = అది, గ్రాహ్యం భవతి = గ్రహింపఁదగినది అగునా? (కాదువుచే - ప్రశ్న), తత్ = అది, విచారణీయమ్ = విచారింపఁదగినది కాదా?

ఇందు చారుదత్తుఁడు శకారునివ్యాజ్యము అసత్యోక్తము అనుటకు ఏయే సందర్భములు, ఎట్టెట్టివి చెప్పఁదగునో, వానిని ఎంతయు చక్కఁగా ఉపపన్నముగా ఉపన్యసించినాఁడు. అధికరణికుని చిత్తమున వానిని హత్తుటకుం జూచినాఁడు. (మఱి దానికి ఇంకను అతనికి సాక్ష్యము ఏమియు లేదు - తన చిత్తమును, ఎదిరి చిత్తమును, దైవమును తప్ప. మఱి యెట్లో!)

శ్లో, ౨౮. యః అహం = ఏ నేను, పుష్పితాం = పూచిన, లతాం అపి = తీవనైనను, పుష్పహేతోః = పూవుకొఱకు, ఆకృష్య = లాగి, కుసుమఅపచయం = పూలుగిల్లుటను, నైవకరోమి = చేయనేచేయనో, సః అహం = అట్టి నేను, భ్రమరపక్షరుచౌ=తుమ్మెదఱెక్కల (నిగనిగనినల్ల) కాంతి గలిగి, సుదీర్ఘే=ఎంతయు పొడువైన, కేశే = వెంట్రుకలందు, ప్రగృహ్య = (చేయిచొనిపి) పట్టుకొని, ప్రమదాం = (సంతోషముతో నిండియుండవలసినదానిని), స్త్రీని, రుదతీం = ఏడ్చుచున్నదానిని, కథం నిహన్మి = ఎట్లు చంపుదును?

చంపుటకు ఇందుపన్యస్తమైన సందర్భమును విశేషణమును ఒక్కటొక్కటియే అడ్డుచుండఁగా, వానినిగుర్తింపఁగలవాఁడను నేను ఎట్లు చంపుదును? నాకు అనుకూలమైనవాదమును, నాకట్టుకు కావలసినదానిని, ఎదిరివాదమును ప్రతిహతము చేయఁగల నాప్రతివాదమును, ఇంతకన్నను నేను చెప్పఁదగినవి ఏదియు లేదు,

శకా—హంహో! అధికరణభోజకాః, కిం యూయం పక్షపాతేన వ్యవహారం పశ్యత, యే నాద్యా ప్యేష హతాశ చారుదత్త ఆసనే ధార్యతే. [హంహో! అధిఅలణభోఇఆ, కిం తుమ్హే పక్ఖవాదేణ వవహాలం పేక్ఖధ, జ్జేణ అజ్జ వి ఏశే హదాశ చాలుదత్తే ఆశణే ధాలీఅది].

అధి—భద్ర శోధనక, ఏవం క్రియతామ్.

(శోధనక స్తథా కరోతి)

చారు—విచార్యతామ్. భో అధికృతాః, విచార్యతామ్. [ఇ త్యాసనా దవతీర్య భూమా వుపవిశతి.

శకా—(స్వగతమ్, సహర్షం నర్తిత్వా) హీ, అనేన మయా కృతం పాప మన్యస్యమస్తకే నిపతితమ్. త ద్యత్ర చారుదత్త ఉపవిశతి త త్రాహ ముపవిశామి. (తథా కృత్వా) చారు

---

కిం పక్షపాతేన వ్యవహారం పశ్యథ = పక్షపాతముతో వ్యాజ్యమును చూతురా, అరయుదురా? యేన - ఏల యడుగుచున్నా ననఁగా, అద్య అపి = ఇపుడు(ఇంక)ను, ఈనిర్భాగ్యుఁడు చారుదత్తుఁడు ఆసనముపం గూర్చుండ పెట్టఁబడియున్నాఁడు! నేరము జేసినవానిని, హత్య చేసినవానిని కచ్చేరిలో కూర్చుండనిత్తురా? శోధనకుఁడు నౌకరు పోయి అతనిని దింపుచున్నాఁడు. అతఁడును దిగి నేలం గూర్చుండుచునే - ఆలోచింపుఁడు ఆలోచింపుఁడు, అధికరణికులారా, అని ఎచ్చరించుచున్నాఁడు. తన్ను వానిమాటమీఁద అట్లు దింపుటచే, అధికరణికులు అటు వానితట్టుకు మొగ్గుట అతనికిం దోఁచినది.

సహర్షం నర్తిత్వా - సంతోషముతో నృత్యముచేసి ఒళ్ళు తెలియక అనుకొనుచున్నాఁడు. హి హీ - అనేన మయా కృతం ... = ఈనాచేత కావింపఁబడిన పాపమును, అన్యస్యమస్తకే నిపాతితమ్ = మఱియొకని - ఈచారుదత్తుని - తలపై పడవేయఁబడినది. తత్ = కావున, యత్ర ... = ఎక్కడ చారుదత్తుఁడు కూర్చుండునో అక్కడనే నేనును కూర్చుండెదను. (అట్లు చేసి) చారుదత్త,

దత్త పశ్య పశ్య మామ్. త ద్భణ భణ మయా మారి తేతి [హీ, అణేణ మఏ కడే పావే అణ్ణిశ్శ మత్థకే నివడిదే. తా జహిం చాలుదత్తాకే ఉవవిశది తహిం హగ్గే ఉవవిశామి. చాలుదత్తా పేక్ఖ పేక్ఖ మమ్. తా భణ భణ మఏ మాలిదే త్తి].

చారు—భో అధికృతాః ('దుష్టాత్మా –' ఇతి పూర్వోక్తం పఠతి. సనిశ్వాసం స్వగతమ్)

శ్లో. మైత్రేయ భోః, కి మిద మద్య మ మోపఘాతో,
హా బ్రాహ్మణి ద్విజకులే విమలే ప్రసూతా,
హా రోహసేన హి న పశ్యసి మే విపత్తిం,
మిథ్యైవ నన్దసి పరవ్యసనేన నిత్యమ్. ౨౯

---

చూడు, (ఇటు) చూడు, నన్ను; తత్ భణ - మఱి చెప్పు - మయా మారితా ఇతి - నాచేత చంపఁబడినది అని. ఈమాటలు దైవము శకారునిచేతనే చారుదత్తునికి అనుకూలసాక్ష్యము చెప్పించుచున్నట్లును, చారుదత్తునిం గూడ చెప్పుమనుచున్నట్లును - ఒక ధ్వని తోఁచునట్లుగా ఉన్నది - 'నాచేత చంపఁబడినది' అని. సనిశ్వాసం స్వగతమ్ - నిట్టూర్చి తనలో.

శ్లో. ౨౯. భోః మైత్రేయ, = ఓ మైత్రేయ, అద్య = ఇపుడు, కిం ఇదం = ఇదేమిటి? మమ = నాకు, ఉపఘాతః = చావు! హా! బ్రాహ్మణి - అయ్యో! ఇల్లాలా, విమలే ద్విజకులే ప్రసూతా = ఏపాపము ఎఱుఁగని పుణ్యమైన బ్రాహ్మణకులమున పుట్టితివి. రోహసేన - అయ్యో (బాబూ) రోహసేనా. మే విపత్తిం = నా (కు మూడిన) చావును, న హి పశ్యసి = చూడవు గదా, ఎఱుఁగవు గదా. నిత్యం = ఎప్పుడును, పరవ్యసనేన = ఇతరులదుఃఖముచేత, మిథ్యా ఏవ = అబద్ధముగానే, కారణములేకయే, నిజము కాకయే, ఊరకే, నన్దసి = సంతోషించెదవు. ఇతరుల దుఃఖముం జూచియుం సంతోషింతువు, నోరు ఎఱుఁగవు. దుఃఖ మన నెట్టిదో ఎఱుఁగనే ఎఱుఁగవు, ఏడువనే నేరవు మఱి యిపుడు నాకే విపత్తి - చావు - కలిగినదే - నీవు దాని నెఱుంగనే ఎఱుఁగవే!

తద్వార్తాన్వేషణాయ - ఆమె (వసంతసేన) వార్తను విచారించుటకు - పుష్పకరండమునకు బండివచ్చినది, కాని అందు వసంతసేన రాలేదు - ఆర్యకుఁడు

ప్రేషిత శ్చ మయా తద్వార్తాన్వేషణాయ మైత్రేయో వసన్తసేనా సకాశం శకటికానిమిత్తం చ తస్యా ప్రదత్తా న్యలంకరణాని ప్రత్యర్పయితుమ్. త త్కథం చిరయతే.

( తతః ప్రవిశతి గృహీతాభరణో విదూషకః )

విదూ — ప్రేషితో స్మ్యార్యచారుదత్తేన వసన్తసేనాసకాశమ్, త త్రాలంకరణాని గృహీత్వా, యథా — 'ఆర్య మైత్రేయ, వసన్తసేనయా వత్సో రోహసేన ఆత్మనో ఽలంకారే ణాలంకృత్య జననీసకాశం ప్రేషితః. అస్యా ఆభరణం దాతవ్యమ్, నపున ర్గ్రహీతవ్యమ్. త త్సమర్పయ' ఇతి. త ద్యావ ద్వసన్తసేనాసకాశ మేవ గచ్ఛామి. ( పరిక్ర మ్యావలోక్య చ ఆకాశే ) కథం భావ రేభిలః, భో భావరేభిల, కింనిమిత్తం త్వ ముద్విగ్న ఉద్విగ్న ఇవ లక్ష్యసే, ( ఆకర్ణ్య ) కిం భణసి — 'ప్రియవయస్య శ్చారుదత్తో ఽధికరణమణ్డప ఆహూతః' ఇతి. త న్న ఖ ల్వల్పేన కార్యేణ

---

ఉండినాఁడు, వానిం గలసికొనుట మాటాడుట, ఆబండిలో నే వానిం బంపుట జరిగినది. మఱి ఆబండిలో నామాటబడి వసంతసేన కదా వచ్చియుండవలసినది. మఱి రాలేదే - ఆసందర్భాన బండివానిని నే నేమియు అడుగలేదు వాఁడును ఏమియు చెప్పలేదు. కావున ఏమైనది, ఏమి జరిగినదియు తెలియలేదే. అని మైత్రేయుని పోయి విచారించి రమ్మనుచు, అట్లే ఆమె ఇచ్చిన నగలను బంగారుశకటికం జేయించుకొమ్మని ఒంటను పెట్టి, ఆమట్టిబండిలోను నింపెనే, వానిం గొనిపోయి వసంతసేనకు మరల ఇచ్చివేయుమనియు, పంపినాఁడు.

ఇది మైత్రేయప్రవేశమునకును సూచన. అతడు నగలం బట్టుకొని ప్రవేశించుచున్నాఁడు. అస్యాః ఆభరణం దాతవ్యం = ఆమెకు నగ(లు) ఇచ్చివేయవలసినది, మఱి మరల (ఆమెయిచ్చినను) తీసికొనఁగూడదు. కావున ఇచ్చివేయుము. అని. కావున వసంతసేనకడకే పోయెదను. అని పరిక్రమించి చూచి, రేభిలభావ (వైణిక సంగీతవిద్వాంసుఁడు) అగపడినట్లు - అతని ప్రవేశము లేకయే, ఆకాశభాషిత రూపాన తాను అడుగుటకు అతఁడు బదులిడుటను తానే విని అనువదించుటం జేసి

భవితవ్యమ్. (విచిన్త్య) తత్పశ్చా ద్వసన్తసేనాసకాశం గమిష్యామి. అధికరణమణ్డపం తావ ద్గమిష్యామి. (పరిక్రమ్యావలోక్య చ) అయ మధికరణమణ్డపః. త ద్యావ త్ప్రవిశామి. (ప్రవిశ్య) సుఖ మధికరణభోజకానామ్. కుత్ర మమ ప్రియవయస్యః.

[పేసిదో హ్మి అజ్జచారుదత్తేణ వసన్తసేణాసఆసమ్. తహిం అలంకరణాఇం గేణ్హిఅ, జధా 'అజ్జమిత్తేఅ, వసన్తసేణాఏ వచ్చో గోహసేణో అత్తణో అలంకారేణ అలంకరీఅ జణణీసఆసం పేసిదో ఇమస్స ఆహరణం దాదవ్వమ్, ణ ఉణ గేణ్హిదవ్వమ్. తా సమప్పేహి' త్తి. తా జావ వసన్తసేణాసఆసం జ్జేవ గచ్ఛామి. కధం భావరేభిలో. భో, భావరేభిల, కిం ణిమిత్తం తుమం ఉవ్విగ్గో విఅ లక్ఖీఅసి. కిం భణాసి — 'పిఅవఅస్సో చారుదత్తో అధిఅరణమణ్డవే సద్దాఇదో' త్తి. తా ణ హు అప్పేణ కజ్జేణ హోదవ్వమ్. తా పచ్ఛా వసన్తసేణాసఆసం గమిస్సమ్. అధిఅరణమణ్డవం దావ గమిస్సమ్. ఇదం అధిఅరణమణ్డవమ్. తా జావ పవిసామి. సుహం అధిఅరణభోఇఆణమ్. కహిం మమ పిఅవఅస్సో].

అధి—న న్వేష తిష్ఠతి.

విదూ—వయస్య, స్వస్తి తే. [వఅస్స, సొత్థి దే].

---

వసంతసేనకడకుం బోవుట మానుకొని అధికరణమునకే వచ్చుచున్నాఁడు. త్వం ఉద్విగ్న ఇవ దృశ్యసే - నీ వేకారణమున దిగులుపడినవానివలె అగపడుచున్నావు. అధికరణమణ్డపే శబ్దాపితః - కచ్చేరికి పిలువఁబడినాఁడనియా? తత్ న ఖలు అల్పేన కార్యేణ భవితవ్యమ్ - అది యేదియో చిన్నపనికిగా ఉండదు. పెద్దదానికిగానే ఉండవలయును. కావున తరువాత వసంతసేనకడకు పోయెదను. ముందు కచ్చేరికే పోయెదను. సుఖం అధికరణభోజకానాం - అధికరణికులను ఇట్లు అడుగుట అధికరణ సముదాచారమువలె ఉన్నది. వసంతసేనతల్లియు 'మీకు సుఖమగుగాక' అని యన్నది. ఆర్య చారుదత్తుఁడును 'స్వస్తి' అన్నాఁడు. మైత్రేయుఁడు - సందర్భము తెలియక ఆచారోక్తి పలికినాఁడు - స్వస్తి తే - అని, తాను

చారు—భవిష్యతి.

విదూ—అపి క్షేమం తే. [అవి క్ఖేమం దే].

చారు—ఏత దపి భవిష్యతి.

విదూ—భో వయస్య, కింనిమిత్త ముద్విగ్నఉద్విగ్న ఇవ లక్ష్యసే. కుతో వాహూతః. [భో వఅస్స, కిංణిమిత్తం ఉవ్విగ్గో ఉవ్విగ్గో విఅ లక్ఖీఅసి. కుదో వా సద్దాఇదో].

చారు—వయస్య,

శ్లో. మయా ఖలు నృశంసేన పరలోక మజానతా
స్త్రీ రతి ర్వా విశేషేణ శేష మేషో ఽభిధాస్యతి. ౩౦

విదూ—కిం కిమ్. [కిం కిమ్].

చారు—(కర్ణే) ఏవ మేవమ్.

---

వ్యాఖ్యామున ఇఱుకుకొని అది ప్రాణముమీఁదికి వచ్చియున్నందున - 'భవిష్యతి' కాఁగలదు - అని బదులు చెప్పి, దానిని గ్రహించుచున్నాఁడు. అట్లే అపి క్షేమం తే - నీకు క్షేమమా - అని యడిగినందులకును అట్లే. కిన్నిమిత్తం ... = ఎందు వలన దిగులుపడినవానివలె అగపడుచున్నావు? ఏల (ఇచటికి) పిలిపింపఁబడితివి?

శ్లో. ౩౦. నృశంసేన = క్రూరుఁడను, పరలోకం అజానతా = పరలోకమును - స్వర్గమును నరకమును, పుణ్యమునకు అది పాపమునకు ఇది అని, ఎఱుఁగక, మయా ఖలు = నాచేత కదా - 'ఖలు' ఖేదముం దెలుపును. స్త్రీ, - ఆఁడుది, విశేషతః = అందును విశేషించి, రతిఃవా = రతింబోనిది, ... = శేషం ఏషః అభిధాస్యతి - మిగిలినది వీఁడు చెప్పఁగలఁడు. 'చంపఁబడినది (= వ్యాపాదితా)' అని తాను నోట ఉచ్చరించుటకును ఒల్లఁడు. దానిని శకారునిచేత నే ఇందు చెప్పించును.

కిం కిమ్ - ఏమి ఏమి - ఇదేదియో క్రొత్తది అభూతకల్పనగా ఉన్నదే - అని రెట్టించుట.

విదూ—క ఏవం భణాతి. [కో ఎవ్వం భణాది].

చారు—(సంజ్ఞయా శకారం దర్శయతి) న న్వేష తపస్వీ హేతుభూతః కృతాన్తో మాం వ్యాహరతి.

విదూ—(జనాన్తికమ్) ఏవం కిమర్థం న భణ్యతే, గృహం గతేతి. [ఎవ్వం కీస ణ భణీఅది, దేహం గదే త్తి].

చారు—ఉచ్యమాన మ ప్యవస్థాదోషా న్న గృహ్యతే.

విదూ—భో భో ఆర్యాః, యేన తావ త్పురస్థాపన విహా రా రామ దేవాలయ తడాగ కూప యూపై రలంకృతా నగ ర్యుజ్జయినీ, సో ఽనీశో ఽర్థకల్యవర్తకారణా దీదృశ మకార్య మనుతిష్ఠ తీతి. అరేరే కులటాపుత్ర రాజశ్యాలసంస్థానక ఉచ్ఛృఙ్ఖలక కృతజనదోష

---

నను ఏష తపస్వీ హేతుభూతః - ఓయి, వీఁడు పాపము ఊరక హేతు మాత్ర భూతుఁడు. కృతాన్తః మాం వ్యాహరతి - దైవము నన్నుంగూర్చి చెప్పు చున్నాఁడు. సర్వము కృతాంత చేష్టితము!

ఉచ్యమానం అపి = చెప్పఁబడుచున్నదాని నైనను - నీవు చెప్పిన మాటను,- (ఇప్పటి) దశదోషముచేత, ఇప్పటి నాదశం బట్టి - దారిద్ర్యము చేతం గాఁబోలు, ఆమాట గ్రహింప(అంగీకరింప)ఁబడుట లేదు.

పురస్థాపన విహార ఆరామ దేవాలయ తడాక కూప యూపైః - ఊరిని (వీథులు మొదలైనవానిచే) స్థిరముసేయుట, కాదా (క్రొత్త) ఊరులు స్థాపించుట, బౌద్ధాలయములు తోఁటలు దేవళములు చెఱువులు బావులు యజ్ఞస్తంభములు - అను ఇన్నింటితో ఉజ్జయినీనగరము (ఎవనిచే) అలంకరింపఁబడినదో, సః అట్టివాఁడు, అనీశః = తనకు పైవాఁడులేనివాఁడు, అర్థకల్యవర్తకారణాత్ = ధనమును చల్లియన్నపుఁగారణమువలన - ఆపాటిదానికి ఆసపడి, ఇట్టి కూడనిపనిని చేయును అనియా! యజ్ఞస్తంభములు - అనఁగా యజ్ఞములు సేయుటో సేయించుటో - వానఁ గదా యజ్ఞపశువుం గట్టు కంబములు ఏర్పడును. కాణేలీసుత - లంజాకొడుకా, రాజుమఱఁదిగా సంస్థానకా కట్టులేనివాఁడా జనులు దూషించువాఁడా(తిట్టువాఁడా)

భణ్డా బహుసువర్ణమణ్డిత మర్కటక, భణ భణ మ మాగ్రతః, య ఇదానీం మమ ప్రియవయస్యాః కుసుమితాం మాధవీలతా మ ప్యాకృష్య కుసుమాపచయం న కరోతి కదాచి దాకృష్టతయా పల్లవ చ్ఛేదో భవ తీతి, స కథ మీదృశ మకార్య ముభయలోకవిరుద్ధం కరోతి. తిష్ఠ రే కుట్టనీపుత్త్ర, తిష్ఠ, యావ దేతేన తవ హృదయ కుటిలేన దణ్డకాష్ఠేన మస్తకం తే శతఖణ్డం కరోమి.

[భో భో అజ్జా, జేణ దావ పురట్థావణ విహారారామ దేఉల తడాగకూవ జూవేహిం అలంకిదా ణఅరీ ఉజ్జఇణీ, సో అణేసో అత్థ కల్లవత్తకారణాదో ఏరిసం అకజ్జం అణుచిట్ఠిదిత్తి. అరే రే కాణే లీసుదా నాఅశ్శాలసంతాణఆ ఉస్సుజ్జలఆ కిదజణదోస భణ్డాఆ బహు సువణ్ణామణ్డిద మక్కడఆ, భణ భణ మమ అగ్గదో, జో దాణిం మమ పిఅవఅస్సో కుసుమిదం మాధవీలదం పి ఆకిట్ఠిఅ కుసుమావచఅం ణ కరేది కదా వి ఆకిట్టిదావ పల్లవచ్ఛేదో భోది త్తి, సో కధం ఏరిసం అకజ్జం ఉహఅలోఅవిరుద్ధం కరేది. చిట్ఠ రే కుట్టణీపుత్తా. చిట్ఠ. జావ ఏదిణా తవ హిఅఅ కుడిలేణ దణ్డఅట్ఠేణ మత్థఅం దే సదఖణ్డం కరేమి].

---

బండ-హాస్యపుఁబూఁతులు కూయువాఁడా, బండ, నీచుఁడ, కోఁతి చెప్పరా చెప్పు. నాయెదుట. ఏనా ప్రియవయస్యుఁడు పూచిన బండిగురివెంపతీఁవను సయితము, లాఁగి, పూవులు గిల్లఁడో, అట్లు లాగినట్లైన ఒక వేళ దాని చివుళ్ళు తునిగిపోవునేమో అని, అట్టివాఁడు ఎట్లు ఇట్టియకార్యమును ఇహపరములకు రెంటికిని కానిదానిని - ఇక్కడ అపకీర్తిని అక్కడ రౌరవమును కలిగించుదానిని చేయును! ఉండురా, తొత్తుకొడుకా, ఉండు - ఈనాకట్టతో, నీహృదయమువలె వంకర - కఠినము. క్రూరము - ఐనదానితో నీతలను నూఱు వ్రక్కలు చేసెదను. వినుఁడు వినుఁడు అయ్యగారలారా, చారుదత్తునితో, నాకు తగవో, వ్యాజ్యెమో. మఱి యెందులకు ఈకాకికాళ్ల తలగాఁడు నాతలను నూఱు వ్రక్కలు చేయును? కూడదు కూడదు - ఓరి లంజాఁకొడుకా దుష్టుఁడా - అంతట మరల విదుషకుఁడు అపూర్వంపుఁ దవ

శకా—(సక్రోధమ్) శృణ్వన్తు శృణ్వన్త్వార్యమిశ్రాః. చారుదత్తేన సహ మమ వివాదో వ్యవహారో వా. తత్కిమర్థ మేష కాకపదశీర్షమస్తకో మమ శిరః శతఖణ్డం కరోతి. మా తావత్. రే దాస్యాఃపుత్ర దుష్టవటుక. [శుణన్తు శుణన్తు అజ్జ మిశ్శా. చాలుదత్తకేణ శహ మమ వివాదే వవహాలే వా. తాం కీశ ఏశే కాకపదశీశమశ్తకా మమ శీలే శదఖణ్డే కలేది. మాదావ. లే దాశీఏపుత్తా, దుట్టబడుకా].

(విదూషకో దణ్డకాష్ఠ ముద్యమ్య పూర్వోక్తం పఠతి. శకారః సక్రోధ ముత్థాయ తాడయతి. విదూషకః ప్రతీపం తాడయతి. అన్యోన్యం తాడయతః విదూషకస్య కక్షదేశా దాభరణాని పతన్తి)

శకా—(తాని గృహీత్వా, దృష్ట్వా ససాధ్వసమ్) పశ్యన్తు పశ్యన్త్వార్యాః. ఏతే ఖలు తస్యా స్తపస్విన్యా అలంకారాః. (చారుదత్త ముద్దిశ్య) అస్యార్థకల్యవర్తస్య కారణా దేషా మారితా వ్యాపాదితా చ. [పేక్ఖన్తు పేక్ఖన్తు అజ్జా ఏదే క్ఖు తాఏ తపశ్శిణీఏ కేలకా అలంకాలా ఇమశ్శ అత్థకల్లవత్తశ్శ కాలణాదో ఏశా మాలిదా వావాదిదా అ].

---

మాటలు పలుకును. కఱ్ఱనుఎత్తి కొట్టఁబూనును - శకారుఁడును బదులుగా కోపముతో లేచి వీనిం గొట్టును. విదూషకుఁడు అడ్డముగా, అది తనకు తగులకుండునట్లుగా, కొట్టును. ఒండొరులు కొట్టుకొందురు. విదూషకుని సంకనుండి నగలు పడును.

తాని గృహీత్వా దృష్ట్వా ససాధ్వసమ్ - వానిం జేకొని, చూచి, భయముతో - భయ మేల? ఇరువుర దొమ్మిజగడాన తన సంకనుండియే పడినవని అధికరణికులు తలంతురేమో - అని. ఏతే ఖలు తస్యాః తపస్విన్యాః ... = ఇవి తప్పక పాపము ఆ దీనురాలియొక్క - నగలు - ఈడబ్బుసద్దికూటి కారణమున ఈమె చంపఁబడినది! అధికారులు అందఱును మొగాలు ప్రేలవేసికొన్నారు. చారుదత్తుఁడు మైత్రేయునితో మాత్రము (జనాంతికముగా.)

(అధికృతాః సర్వే ఉధోముఖాః స్థితాః)

చారు—(జనాన్తికమ్)

శ్లో. అయ మేవం విధే కాలే దృష్టో భూషణవిస్తరః
అస్మాకం భాగ్యవైషమ్యా త్పతితః పాతయిష్యతి. 31

విదూ—భోః, కిమర్థం భూతార్థో న నివేద్యతే. [భో, కీస భూదత్థం ణ ణివేదీఅది]

చారు—వయస్య

శ్లో. దుర్బలం నృపతే శ్చక్షు, రైతత్ తత్త్వం నిరీక్షతే
కేవలం వదతో దైన్య మశ్లాఘ్యం మరణం భవేత్. 32

శ్లో. 31. అయం భూషణవిస్తరః — ఈనగల పెద్దమొత్తము, అస్మాకం భాగ్యవైషమ్యాత్ = నా దైవప్రాతికూల్యమువలన, ఏవంవిధే కాలే = ఈవిధమైన కాలములో, పతితః = పడినదై, దృష్టః — చూడఁబడినదై, పాతయిష్యతి = నాశనముచేయఁగలదు. అస్మాక — అనిశేషము — నన్ను. "నాభాగ్యవైషమ్యము చేత ఇట్టికాలములో ప్రత్యక్షముగా పడిన యీనగలపెంపు నన్ను కూల్చి వైచును." వే — వేం.

సమయమున వచ్చిన వీరకుని మాట, స్త్రీకళేబరదర్శనము, (ఇపుడు) ఈ నగలు అగపడుట — వ్యవహారమును తిరుగులేక నాకు ప్రతికూలము చేయు సాక్ష్యములు — నామాటను ఎవరిమాటను ఎక్కనీయనట్టివి!

భూతార్థః — నిజము, ననివేద్యతే = చెప్పఁబడదు? ఏల దాపరిక మనుట. ఉన్నమాట ఏల చెప్పివేయఁగూడదు? ఆర్యా ఏల ఉన్నమాట చెప్పఁగూడదు? (లేక — చెప్పవు!) అనఁగా ఈనగలు వసంతసేనవి. అవి పిల్లవానికి పెట్టి పంపఁగా నేను మరల దానికే ఇమ్మని ఈవిదూషకునిచేత ఇచ్చి పంపినట్టివి. అని. అందులకు చారుదత్తునియుత్తరము 'నమ్మరు' అని! వే. వేం.

శ్లో. 32. నృపతేః చక్షుః = రాజు కన్ను — ధర్మమును విచారించువాని యధికరణకులయు — అనుట — వారే రాజుస్థానాన. దుర్బలం=బలహీనమైనది. ఏతత్ = ఇది, తత్త్వం = నిజమును, ననిరీక్షతే = కనిపట్టదు, వదతః = చెప్పు

అధి—కష్టం భోః, కష్టమ్,

శ్లో. అఙ్గారకవిరుద్ధస్య ప్రక్షీణస్య బృహస్పతేః
గ్రహో ఽయ మపరః పార్శ్వే ధూమకేతు రి వోత్థితః. 33

శ్రేష్ఠి కా—( విలోక్య, వసన్తసేనామాతర ముద్దిశ్య ) అవహితా తావదార్యేదం సువర్ణభాణ్డ మవలోకయతు, త దే వేదం న వేతి. [ అవహిదా దావ అజ్జా ఏదం సువణ్ణభణ్డాలం అవలోఏదు, సో జ్జేవ ఏసో ణ వేత్తి ].

---

వానికి, దైన్యం - ఆ చెప్పికొను దీనత్వము - కార్పణ్యము, కేవలమ్ = మాత్రమే - మఱేమియు ప్రయోజనము లేదు. అశ్లాఘ్యం = అపకీర్తికరమైన, మరణం భవేత్ = చావు కలుగును,

రాజుకన్ను లోపలిగుట్టును కనిపట్టనేరదు. పైపై అగపడువానినే చూడఁగలదు. తత్త్వమును - నిజమును - చూడ(ఁజాల)దు. నీవు చెప్పినట్లు మనము ఏమేని చెప్పిన, ఆ చెప్పుకొన్న దైన్య మొకటే మనకు మిగులును. పాడుచావు (కానే) అగును - రానేవచ్చును.

శ్లో. 33. అయ్యో కటకటా!

బృహస్పతేః = గురువునకు, అఙ్గారక విరుద్ధస్య = శత్రుస్థానమందు అంగారకుఁడు ఉన్నవానికి, ప్రక్షీణస్య = బలము తఱిగి పోయినవానికి, అయం అపరః = ఇది మఱియొకటి, పార్శ్వే = ప్రక్కన, గ్రహః = రాహువు, ఉత్థితః = లేచినాఁడు - ధూమకేతుః ఇవ - తోఁకచుక్కవలె.

బృహస్పతికి అంగారకుఁడు శత్రుస్థానమున చేరినాఁడు - బలము ఎంతయు తగ్గిపోయియున్నది. మఱి ప్రక్కన రాహువును బలముతో విరుద్ధుఁడైనాఁడు. ప్రక్కనే - అనఁగా ప్రక్కయింట కాదు - తన యింటనే తనప్రక్కన - ఆభరణాల మూట చారుదత్తునింటినుండి కదా వచ్చినది మైత్రేయుని సంకలోనికి; ఇఁక నేమున్నది? ధూమకేతుదర్శనమే - సర్వనాశనమే. చారుదత్తుఁడు గురువుంబోనివాఁడు - వానికి శకారుఁడు అంగారకుంబోలె శత్రువైనాఁడు - దానికే కోలుకోలేకున్నాఁడు. మఱి యిపుడు ఈనగలుపట్టువడుట - రాహువు ప్రక్కనచేరుట. ఇఁక ధూమకేతుదెబ్బయే. తప్పని పరాజయము - దాన మరణము.

వర్ధా—(అవలోక్య) సదృశ మేతత్, న పున స్తత్. [సరిసో ఏసో, ణ ఉణ సో].

శకా—ఆం వృద్ధకుట్టని, అక్షిభ్యాం మన్త్రితం వాచా మూకితమ్. [ఆం బుడ్ఢకుట్టణి, అక్ఖిహిం మన్తిదం వాఅప మూకిదమ్].

వృద్ధా—హతాశ, అపేహి. [హదాస, అవేహి].

శ్రేష్ఠికా—అప్రమత్తం కథయ. త దే వైత న్న వేతి. [అప్పమత్తం కధేహి, సో జ్జేవ ఏసో ణ వేత్తి].

వృద్ధా—ఆర్య, శిల్పకుశలత యావబధ్నాతి దృష్టిమ్. న పునస్తత్. [అజ్జ, సిప్పికుసలదాప ఓబన్ధేది దిట్ఠిమ్. ణ ఉణ సో].

అధి—భద్రే, అపి జానా స్యేతా న్యాభరణాని.

వృద్ధా—నను భణామి, న ఖలు న ఖ ల్వభిజ్ఞాతః. అథవా క దాపి శిల్పినా ఘటితో భవేత్. [ణం భణామి, ణహు ణహు అణభిజాణిదో. అహ వా కదా వి సిప్పిణా గడిదో భవే].

అధి—పశ్య శ్రేష్ఠిన్,

శ్లో. వస్త్వన్తరాణి సదృశాని భవన్తి నూనం
రూపస్య భూషణగుణస్య చ కృత్రిమస్య

అవహితా - ఎచ్చరికగలదిగా, ఆర్య, చూచునుగాక, ఈనగలను. సదృశ ఏషః, న పునః సః - పోలికగలది ఇది, మఱి అది గాదు. హతాశ = నిర్భాగ్యుఁడా. అప్రమత్తం = పొరపాటు, పరాకు, లేకుండ, న ఖలు న ఖలు అనభిజ్ఞాతం - కాదు కాదు గుర్తుతెలియనిది. ఒక వేళ కంసాలిచేత (అట్టివిగానే వేఱు) చేయఁబడియుండవచ్చును. శ్రేష్ఠిన్ పశ్య - సెట్టీ చూడు.

శ్లో. 38. వస్త్వన్తరాణి = వేఱువస్తువులు, సదృశాని = పోలికగలవి, భవన్తి = ఉండును. నూనం = నిజము. కృత్రిమస్య - పనిచే తయ్యారుచేసిన, రూపస్య = ఆకారమునకును, భూషణ గుణస్య = నగయొక్క గుణమునకును,

దృష్ట్వా క్రియా మనుకరోతి హి శిల్పివర్గః
సాదృశ్య మేవ కృతహస్తతయా చ దృష్టమ్. 38

శ్రేష్ఠికా—ఆర్యచారుదత్తీయా న్యేతాని. [అజ్జచారుదత్తస్స కేరకాఇం ఏదాఇం].

చారు—న ఖలు న ఖలు.

శ్రేష్ఠికా—తదా కస్య? [తా కస్స?]

చారు—ఇహ అత్రభవత్యా దుహితుః.

శ్రేష్ఠికా—కథం ఏతాని తస్యా వియోగం గతాని? [కధం ఏదాఇం తాఏ విఓఅం గదాఇ?]

చారు—ఏవం, గతాని. అం, ఇదమ్.

---

క్రియాం = (ఐన) పనిని, దృష్ట్వా = చూచి, శిల్పివర్గః = కంసాలులు - నగలు చేయుశిల్ప మెఱింగినవారు - అనుకరోతి హి = అనుకరింతురు - వానివలెనే చేయుదురు. కృతహస్తతయా చ(వారి) చేతులు చక్కఁగా తీఱినవి - పని నేర్చినవి - అగుటవలన, సాదృశ్యం ఏవ = పోలికయే - దృష్టమ్ = చూడఁబడినది, కనిపట్టఁబడినది.

పోలికను చెప్పవచ్చునేకాని, అవే ఇవి అని చెప్పశక్యముగాదు.

ఆర్యచారుదత్తీయాని ఏతాని = చారుదత్తయ్యవా ఇవి? నఖలు నఖలు - కావుకావు. తదా కస్య - అప్పటికి ఎవరివి? ఇహ అత్ర భవత్యా దుహితుః = ఈయమ్మగారి కూఁతురివి.

కథం! = ఎట్లు! ఏతాని తస్యా వియోగం గతాని = ఇవి ఆమె వియోగము గాంచినవా? ఆమె (దేహమునుండి) తీసినవా? ఏవం = అట్లే. అవును. గతాని = (వియోగం) పొందినవే - ఆమె తీసివేసినవే. అం = అవును, ఇదం = ఇదే, చారుదత్తయ్య తనకు ప్రతికూలమైన మాటలను గట్టిగా చెప్పుచున్నాఁడు - ఏలన, అవి సత్యములు - అనుకూల ప్రతికూలములను అతఁడు పరికింపఁడు -

శ్రేష్ఠికా—ఆర్యచారుదత్త, అత్ర సత్యం వక్తవ్యమ్. పశ్య పశ్య.

శ్లో. సత్యేన సుఖం ఖలు లభ్యతే
సత్యాలాపే న భవతి పాతకమ్
సత్య మితి ద్వే అ ప్యక్షరే
మా సత్య మలీకేన గూహాయ. 3౫

[అజ్జచారుదత్త, ఎత్థం సచ్చం వత్తవ్వమ్. పేక్ఖ, పేక్ఖ.
సచ్చేణ సుహం క్ఖు లబ్భఇ
సచ్చాలావే ణ హోఇ పావమ్
సచ్చం త్తి దువే వి అక్ఖరా
మా సచ్చం అళిఏణ గూహేహి].

చారు—ఆభరణా న్యాభరణా నీతి న జానే. కిం త్వస్మ ద్గృహా దానీతా నీతి జానే.

---

మఱి, సత్యము నే. శ్రేష్ఠికాయస్థులకు ఇతఁడు కా వన్న బాగుగానుండునే అని, ఒత్తి మఱొకమాఱు అడుగుచున్నారు. ఆర్యచారుదత్త అత్ర సత్యం వక్తవ్యం, పశ్య పశ్య - అని. మఱియు సత్యముంగూర్చి ఉపన్యసించుచున్నారు - 'లెక్చర్' ఇచ్చుచున్నారు - శ్లోకముచేత.

శ్లో. 3౫. సత్యేన = సత్యముచేత - నిజముచేత, సుఖం = సుఖము, లభ్యతేఖలు = పొందఁబడునుగదా. సత్యాలాపే = సత్యముపలుకుటలో, పాతకం న భవతి = పాపము కలుగదు. సత్యం ఇతి ద్వే అపి - సత్యం అని రెండే ఐనను, (అక్షరే =) నాశనములేనివి - (అక్షరములు). (కావున) సత్యం = నిజమును, అళీకేన = అనృతముచేత, మాగూహాయ = దాఁపకుము.

ఆభరణాని ఆభరణాని ఇతి న జానే - ఆభరణములు ఆభరణములు అని నే నెఱుఁగను. (నేను వానింజూచినవాఁడను తాఁకినవాఁడను - ఎప్పుడును కాను,) మఱి మాయింటినుండి వచ్చినవి అవి యెఱుఁగుదును.

శకా—ఉద్యానం ప్రవేశ్య ప్రథమం మారయసి. కపట కాపటికతయా సాంప్రతం నిగూహసి. [ఉజ్జాణం పవేశిఅ పఢమం మాలేశి. కవడకావడిఆఏ శంపదం ణిగూహేశి].

అధి—ఆర్యచారుదత్త, సత్యమభిధీయతామ్.

శ్లో. ఇదానీం సుకుమారే ఽస్మి
న్నిఃశఙ్కం కర్కశాః కశాః
తవ గాత్రే పతిష్యన్తి
సహాస్మాకం మనోరథైః. 3౬

---

ఉద్యానం ప్రవేశ్య ... = తోఁటలోఁ ప్రవేశింపఁజేసి చంపుదువు, మిక్కిలి వంచకత చేత ఇపుడు దాఁచెదవు.

చారుదత్తయ్యా, నిజము చెప్పుము.

శ్లో 3౬. ఇదానీం = ఇప్పుడు, సుకుమారే = కోమలమైన, అస్మిన్ తవ గాత్రే = ఈ నీ దేహాన, నిఃశఙ్కం = కొంకులేక, కర్కశాః = కఱకులైన, కశాః = కొరడాలు, అస్మాకం మనోరథైః సహ = నిన్ను దోషికానీక కాపాడవలయును అనుకొన్న మా కోరికలతోడం గూడ, పతిష్యన్తి = పడఁగలవు - వ్యర్థము కాఁగలవు,

నీ మేను ఎంతయు సుకుమారము - నీ ప్రతిష్ఠంబట్టి నిన్ను కాపాడవలయును' నీకు నింద సోకనీకూడదు, అని మాకు ఎంతేని మనోరథము. వ్యాజ్యముతొలుత నుండి మేము ఆనమ్మకమును వీడక మాచేతనైనంత చూచుచున్నాము. చేయుచున్నాము. మఱి యీయాభరణములకు వ్యవహారమున నిర్ణాయకత్వము కలుగుచున్నది. వానికి నీసంబంధము రుజువైన, ఇఁక నేమున్నది, వ్యవహారము రుజువైనట్లే. నీవు దోషివైనట్లే. నీకు దండనపడును. నిన్నుం గావనైన మాకోరికలును కూలిపోవును.

తుల్యయోగితాలంకారము. 'వర్ణ్యానా మితరేషాంవా ధర్మైక్యమ్' ప్రకృతాప్రకృతముల ధర్మైక్యము - కశా మనోరథములకు.

చారు__

శ్లో. అపాపానాం కులే జాతే
మయి పాపం నవిద్యతే
యది సంభావ్యతే పాప
మపాపేనచ కిం మయా? 32

కొరడా ద్రెబ్బలు - 'సత్యం వక్తవ్యం' అని మాటిమాటికిం జెప్పుచున్నను - చారుదత్తుఁ డేమో తా నెఱింగిన సత్యమునే, అసత్యస్పర్శ ఖాయైనను లేక, చెప్పుచుండ, మఱి దానికి రుజువు అధికరణికులకు అగపడుట లేదు. పిర్యాదిమాటచే సత్యము లైనట్లు నేరము రుజువైనట్లు అధికరణికులకు తోఁచుచున్నది. ఆభరణములు అవెట్టివో తాను ఎఱుఁగను అన్నాఁడు; అవి వసంతసేనవి అని అన్నాఁడు - తన యింటినుండి, పుష్పకరండకమునుండి కాదు, వచ్చినవి అన్నాఁడు. అవి మైత్రేయుని సంకలోనికి ఎట్లు వచ్చినవి, ఇట్లు క్రిందపడుటకు? ఈవిషయములు ఈయాక్షేపణలు అధికరణికులకు తెలియనే లేదు. వారు వానింగూర్చి ఏమియు అనుకొనరు. 'మయా మారితా' అనుమాటలు - మఱొకనివిగానే, శకారునినోటనే పలికించును చారుదత్తుఁడు, తన నోట చెప్పఁడు. ఉచ్చరించుటకును ఏవ పడును.

శ్లో. 32. అపాపానాం = ఎంతయు పాపులు కాని - కేవలము పుణ్యులే ఐనవారి, కులే జాతే మయి = కులమునం బుట్టిన నాయందు, పాపం = పాపము, నవిద్యతే = లేదు. నేను నామనసున నిశ్చయముగా ఎఱుఁగుదును. యది పాపం సంభావ్యతే = పాపము (నాయందు) సంభావనచేయఁబడునేని, (ఇతరులచే) తలంపఁబడునేని, అపాపేన చ = మఱి పాపుఁడను కాని, మయా = నాచేత, కిం = ఏమి - లాభము?

ఇది కచ్చేరివ్యవహారము - నే నేమో గొప్పకులీనుఁడను. నాయందు ఏపాపమును లేదు. మఱి నాయందు మీరు పాపము సంభావింతురేని, (నామనసున) నేను అపాపుఁడ నగుటచేత ఏమి లాభము? అది కార్యకరము కాదుగదా - అది వ్యవహారనిర్ణాయకము కాదుగదా.

(స్వగతమ్) న చ మే వసన్తసేనావిరహితస్య జీవితేన కృత్యమ్. (ప్రకాశమ్) భోః, కిం బహునా?

శ్లో. మయా కిల నృశంసేన లోకద్వయ మజానతా
స్త్రీరత్నం చ విశేషేణ, శేష మేషో௦భిధాస్యతి. 30

శకా—వ్యాపాదితా. అరే, త్వ మపి భణ, మయా వ్యాపాది తేతి. [వావాదిదా. అలే, తుమం పి భణ, మఏ వావాదిదే త్తి.

చారు—త్వ యైవోక్తమ్.

శకా—శృణుత శృణుత భట్టారకాః, ఏతేన మారితా. ఏతే నైవ సంశయ శ్ఛిన్నః. ఏతస్య దరిద్రచారుదత్తస్య శరీరో

---

స్వగతమ్ - తనలో - మే చ = నాకును, వసన్తసేనా విరహితస్య = వసంతసేన నెడబాసినవానికి, జీవితేన = బ్రదుకుటచే, కృత్యం న = చేయవలసినది ఏమియు లేదు, దుర్జనుని మాట నమ్మి, సరిగా విమర్శింపక, నాపై పడవేసిన పాపమునకు, కలరూపు - సత్యము - మఱెవఁడో చంపినాఁ డన్న రుజువు చేయుటచే నాకేమియు లాభము లేదు. వసంతసేన యేమో చంపఁబడిపోయినది. ఇఁక లేదు. వసంతసేనా విరహితముగా నాకు బ్రదుకు అక్కఱలేదు.

అధికరణికుఁడు 'సత్యము పలుకు, కొరడా దెబ్బలు కొట్టవలసివచ్చును సత్యము చెప్పించుటకు' అను మాటలకు బదులు చెప్పుచున్నాఁడు చారుదత్తుఁడు - అయ్యలారా (= భోః), కిం బహునా = విస్తరమెందులకు? ఏలపలుమాటలు?

శ్లో. 30, = 30 శ్లో.

వ్యాపాదితా = చంపఁబడినది - అరే, త్వ మపి భణ, మయా వ్యాపాదితా ఇతి - ఓరి, నీవును చెప్పు, నాచేచంపఁబడినది అని.

త్వయా ఏవ ఉక్తమ్ = నీచేతనే చెప్పఁబడినదే - నే నెందులకు చెప్పుట? దాన ఇట నిర్ణయమునకు ఏమి ప్రయోజనము? నేను ఆమాట చెప్పను.

శృణుత శృణుత భట్టారకాః - వినుఁడు, వినుండు, దొరలారా, వీనిచే చంపఁబడినది. ఏతేన ఏవ సంశయః ఛిన్నః = వీనిచేతనే సందేహము తీర్పఁబడినది. (కావున) ఏతస్య దరిద్రచారుదత్తస్య శారీరః దణ్డః = శరీరసంబంధమైన దండన -

దణ్డో ధార్యతామ్. [శుణేధ శుణేధ భట్టారకా, ఏదేణ మాలిదా. ఏదేణ జ్జేవ శంశఏ ఛిణ్ణే. ఏదశ్శ దలిద్దచాలుదత్తశ్శ శాలీలే దణ్డే ధాలీఅదు].

అధి— శోధనక, యదాహ రాష్ట్రియః. భో రాజపురుషాః, గృహ్యతా మయం చారుదత్తః.

(రాజపురుషా గృహ్ణన్తి)

వృద్ధా— ప్రసీదన్తు ప్రసీదన్తు ఆర్యమిశ్రాః. ('జో దావ చోరేహిం అవహిదస్స' ఇత్యాది పూర్వోక్తం పఠతి.) తద్యది వ్యాపాదితా మమ దారికా వ్యాపాదితా. జీవతు మే దీర్ఘాయుః. అన్యచ్చ, అర్థిప్రత్యర్థినో ర్వ్యవహారః. అహ మర్థినీ. త న్ముఞ్చ తైనమ్. [పసీదన్తు పసీదన్తు అజ్జమిస్సా. తా జది వావాదిదా మమ దారికా వావాదిదా. జీవదు మే దీహాఊ. అణ్ణం చ. అత్థిపచ్చత్థిణం వవహారో. అహం అత్థిణీ. తా ముఞ్చధ ఏదమ్].

---

అనఁగా వధ, విధింపఁబడును గాక. దండనప్రకారముకూడ శారీరః అని వాఁడే చెప్పుచున్నాఁడు. అధికరణికుఁడు మఱుమాట ఆడక - యథా ఆహ రాష్ట్రియః - రాష్ట్రియుఁడు చెప్పినట్లు - అని ఉత్తరువు చేయుచున్నాఁడు. వాని రాష్ట్రియతను రాజునకు మఱఁదియగుటను రాణికి తోఁబుట్టువగుటను నిర్దేశించుచున్నాఁడు. గృహ్యన్తాం ఏష చారుదత్తః - ఈ చారుదత్తుఁడు పట్టుకొనఁబడును గాక, - తొలుత ఆసనమునం గూర్చుండ బెట్టినాఁడు, తర్వాత నేలం గూర్చుండఁ బెట్టినాఁడు, అధికరణికుఁడు.

ప్రసీదన్తు ... = మన్నింపుఁడు - అయ్యలారా. నా కూఁతురు చంపఁబడిన దేని చంపఁబడినదే. నా దీర్ఘాయువు చారుదత్తుఁడు బ్రదుకును గాక. మఱియొకటియు - వాదిప్రతివాదులకు ఫిర్యాదిముద్దాయీలకు - వ్యాజ్యము. (నిజముగా) వాదినిని నేను. (నాది వ్యాజ్యము), కావున వీనిని విడిచిపెట్టుఁడు.

శకా—అపేహి గర్భదాసి, గచ్ఛ. కిం తవైతేన. [అవేహి గబ్భదాశి, గచ్ఛ. కిం తవ ఏదిణా].

అధి—ఆర్యే, గమ్యతామ్. హే, రాజపురుషాః నిష్క్రామయతైనామ్.

వృద్ధా—హా జాత! హా పుత్రక! [హా జాద, హా పుత్తఅ].

(ఇతి రుదతీ నిష్క్రాన్తా.

శకా—(స్వగతమ్) కృతం మయైతస్యాత్మనః సదృశమ్. సాంప్రతం గచ్ఛామి. [కడం మప ఏదస్స అత్తణో శలిశమ్. శంపదం గచ్ఛామి].

(ఇతి నిష్క్రాన్తః.

అధి—ఆర్యచారుదత్త, నిర్ణయే వయం ప్రమాణమ్, శేషే తు రాజా. తథాపి, శోధనక, విజ్ఞాప్యతాం రాజా పాలకః -

---

అపేహి ... = పోవే పుట్టుదాసీ - బోగముదానా - కిం తవ ఏతేన = నీకేమి దీనితో [నేను పిర్యాదిని - నీవు పో]. ఆర్యే గమ్యతామ్ - అమ్మా, పోవచ్చును - పిలిపించినాను, ఆపని ఐనది, ఇఁక నీవు పోవచ్చును. నీతో ఏమియు ఇఁక పనిలేదు. నిష్క్రామయత = బయటికి కొనిపొండు.

హా జాత హా పుత్రక - అయ్యో బిడ్డా, అయ్యో అబ్బాయీ, చారుదత్తా ... = అని యేడ్చుచు బయటికి పోయినది.

కృతం మయా ఏతస్య (ఆత్మనః) సదృశమ్. = నాచేత వీనికి నేను చేయదఁగినది చేయఁబడినది. 'అథవా అనిర్యాతయతః మరణాన్తికం వైరం భవిష్యతి - అట్లుగాక అప్పగింపలేని మరణముతో తీఱు పగ కాఁగలదు' అని తొలియంకము కడపట బెదరించినాఁడు. అది వానికి నెగ్గినది. ఇఁక వాఁడు, తన పని ఐనది అని, వెడలిపోయినాఁడు.

చారుదత్తయ్యా - నిర్ణయే వయం ప్రమాణమ్ - శేషే తు రాజా - తప్పో అగును కాదు అను నిర్ణయము మాత్రమే మాయధికారము, మాచెల్లుబడి. శేషే తు - మిదిలినదానియందు అన్ననో-దండన ఫలానా అని విధించు విషయమున - రాజు ప్రమాణము - రాజుమాటయె చెల్లుబడి. తథా అపి అట్లయినను, శోధనక, రాజు పాలకుఁడు - మామాటగా - విన్నవింపఁబడును గాక.

శ్లో. అయం హి పాతకీ, విప్రో న వధ్యో మను రబ్రవీత్,
రాష్ట్రా దస్మాత్తు నిర్వాస్యో విభవై రక్షతైః సహ. 39

శోధ—యదార్య ఆజ్ఞాపయతి. (ఇతి నిష్క్రమ్య పునః ప్రవిశ్య) ఆర్యాః, గతో౽స్మి తత్ర. రాజా పాలకో భణతి - యే నార్థకల్యవర్తస్య కారణాద్ వసన్తసేనా వ్యాపాదితా, తం తాన్యే వాభరణాని గలేబద్ధ్వా డిణ్డిమం తాడయిత్వా దక్షిణశ్మశానం నీత్వా శూలె భఞ్జ్త’ ఇతి. యతః కో౽ప్యపర ఈదృశ మకార్య మనుతిష్ఠతి స ఏతేన సనికారదణ్డేన శాస్యతే.

---

శ్లో. 39. అయం హి పాతకీ = ఇతఁడేమో పాతకి - పాతకము - స్త్రీ హత్యాదోషము - చేసినవాఁడు. (అయినను) విప్రః = బ్రాహ్మణుఁడు. న వధ్యః = చంపఁదగినవాఁడు కాఁడు - ఇతనికి మరణదండన విధింపఁగూడదు - మనుః అబ్రవీత్ = (అట్లు) మనువు చెప్పినాఁడు. అక్షతైః విభవైః సహ = వాని విభవము లను - ఆస్తిపాస్తులను సేఁగిలేక, అన్నింటితో కూడ - అన్నియు వానికే ఉండ నిచ్చి, అస్మాత్ రాష్ట్రాత్ = ఈరాజ్యమునుండి, నిర్వాస్యః = బయటికి పంపఁ బడఁదగును. అంతే.

శోధనకుఁడు రాజుకు విన్నవించి రాజాజ్ఞం గొనివచ్చువాఁడు, వాఁడును, పాత్రసమ్_కన్నిళ్ళతో అందించుచున్నాఁడు రాజాజ్ఞను.

యేన అర్థకల్యవర్తస్య కారణాత్ ... = ఎవనిచేత డబ్బుసద్దికూటి కారణమువలన వసంతసేన చంపఁబడినదో, వానిని, ఆనగలనే మెడకు కట్టి, (డిండి మము = ) డప్పు కొట్టి (ప్రకటించి), దక్షిణశ్మశానమునకు కొనిపోయి, కొఱ్ఱున, చంపుఁడు. యః కః అపి ... = (మఱి) ఎవఁడైనను ఇతరుఁడు, ఇట్టి తప్పును చేయునేని వాఁడును ఈ డప్పుచాటు నవమానముతోఁ గూడిన దండనతో - (శిష్యతే = ) చంపఁబడును. ‘శిక్షింపఁబడును’ అనుమాటకు నేర్పఁబడును, నేర్పఁ బడును అనియే యర్థము గాని దండింపఁబడును అని యర్థము లేదు. మఱి యిపుడు తెలుఁగులలో నుండు ‘దండింపఁబడు’నను ప్రాయికార్థము, ఉత్త తప్పు. అది యీ శిక్షింపఁబడును - శేషింపఁబడును - అనుదానిభ్రాంతిచే కలిగినది కాఁబోలు.

[ జం అజ్జో ఆణవేది. — అజ్జా, గదమ్హి తహిం. రాఅ పాలఓ భణాది. — 'జేణ అత్థకల్లవత్తస్స కాలణాదో వసన్తసేణా వావాదిదా, తం తాఇం జ్జేవ ఆహరణాఇం గలె బన్ధిఅ డిణ్డిమం తాడిఅ దక్ఖిణమసాణం ణఇఅ సూలే భజ్జేధ' త్తి. జో కో వి అవరో ఏరిసం అకజ్జం అణుచిట్ఠది సో ఏదిణా సణిఆరగణ్ణేణ సాసీ అది ].

చారు—అహో అవిమృశ్యకారీరాజా పాలకః. అథవా,

శ్లో. ఈదృశే వ్యవహారాగ్నౌ మన్త్రిభిః పరిపాతితాః
స్థానే ఖలు మహీపాలా గచ్ఛన్తి కృపణాం దశామ్. ౪౦

అపి చ

శ్లో. ఈదృశైః శ్వేతకాకీయైః రాజ్ఞః శాసనదూషకైః
అపాపానాం సహస్రాణి హన్యన్తే చ, హతాని చ. ౪౧

అవిమృశ్యకారీ - ఎంత జాల్ముఁడు పాలకరాజు! తా నొక క్షణమైనను ఇంచుకయైనను సాంతముగా ఆలోచింపను (పునర్) నిర్ణయింపను పూనుకొననే లేదు. అథవా = అట్లన నేల. రాజు మంత్రిసలహాను అనువర్తించుట ప్రాయికముగా కలిగినదే కదా,

శ్లో. ౪౦. ఈదృశే = ఇట్టి - (చాల చిక్కు - సంకటము - ఐన,) వ్యవహారాగ్నౌ = వ్యవహారాగ్నియందు, మన్త్రిభిః = మంత్రులచేత, పరిపాతితాః = నెట్టఁత్రోయఁబడినవారై, మహీపాలాః = రాజులు, కృపణాం దశాం = దీనపు దశను, రాజ్యము తొలఁగుటో, శత్రువుచేతం బడుటో, అను దానిని - స్థానే ఖలు = న్యాయ్యముగానే గదా, గచ్ఛన్తి = పొందురు.

ధర్మము సూక్ష్మము నిశితముగా కనిపట్టవలసినది యగు వ్యాజ్యేముల గనగనని నిప్పులో మంత్రులచే త్రోయఁబడి చెడుటయుఁ మడియుటయు న్యాయ్యమే.

శ్లో. ౪౧. శ్వేతకాకీయైః - పొందుపడని పొసఁగని మాటలంజెప్పువారైన, తెల్లకాకులంబోనివారిచేత, ఈదృశైః = ఇట్టి, రాజ్ఞః శాసన దూషకైః = రాజాజ్ఞను చెఱుపువారు, రాజుచేత చెడ్డ - కూడని - న్యాయ్యముగాని ఆజ్ఞను

సఖే మైత్రేయ, గచ్ఛ. మద్వచనా దమ్బా మపశ్చిమ మభివాద యస్వ. పుత్రం చ మే రోహసేనం పరిపాలయస్వ.

---

చేయించువారిచేత, అపాపానాం = పాపముచేయనివారియొక్క సహస్రాణి = వేలు - పాపముచేయనివారు వేలువేలుగా, హన్యన్తే = చంపబడుచున్నారు, హతాని చ = చంపఁబడినారు - పూర్వమును చంపఁబడినారు, ఇప్పుడును చంపఁబడుచున్నారు.

తెల్ల కాకి వాలినది అను నట్టి అసంభావ్యార్థమును చెప్పువారిలో అగ్రేసరుఁడు శకారుఁడు. అట్టి వారల మాటను నమ్మి రాజు దండ్యులను విడిచి, అదండ్యులను వేలువేలుగా చంపినాఁడు, చంపుచున్నాఁడు.

ఇట్టివానిని, శకారుం బోనివానిని, స్యాలుఁడని రాష్ట్రియుం జేయఁదగునా? మఱియు, చారుదత్తుఁడు జగము నమ్మిన శీలవంతుఁడు, అతనియెడ శీలహీనుఁడు, దుర్జనము ఐన శకారుఁడు చెప్పినమాటను నమ్మవచ్చునా? వాఁడైనను వసంతసేనను చారుదత్తుఁడు చంపుచుండఁగా నేను చూచితిని, అని కంటితో తాను చూచినట్లు చెప్పినాఁడా? లేదే. బండి యెక్కి యున్నది వసంతసేన అని చందనకుఁడు చెప్పెనని, తన్ను చూడనీయలేదనియు వీరకుఁడు చెప్పెనే. వీరకునికే చందనకుని మాటలో నమ్మకము లేకపోయెనే. మఱి ఆమాటను ఎట్లు నమ్మఁదగును? చచ్చిన స్త్రీశవదర్శనము విన్నతర్వాత, అది వసంతసేన యగునా కాదా అని చక్కఁగా విచారించి తేల్చుకొనక, వసంతసేన మారణ ప్రస్తావము ఉన్నమాత్రకే అది తత్కళేబర మని యెట్లు నిశ్చయింపఁదగును? ఓనమాలలోనే హంసపాది యన్నట్లు, శకారుఁడు తన తొలిమాటలలో వసంతసేన తనచేత చంపఁబడినది - 'నను మయాఏవ మారితా' అని చెప్పెనే. దానిని అధికరణికుఁడు గుర్తింపనుగుర్తించి గుమాస్తాలను అట్లు 'ఫిర్యాదు' వ్రాయు మనెనే, తరువాత వాఁడు సగములో మొగము కప్పుకొనుట, దిద్దుకొని 'మయా దృష్టం' అనుటయు, వారు అంతలోనే కొంతకోలాహము చేయుటను వాఁడు కనిపట్టుటయు జరిగి యుండెనే - ఇంకను ఇట్లు ఎన్నియో పొరపాట్లుండెను. అధికరణికులు ఎటువలె చారుదత్తుని యందు తప్పు నిర్ణయింపఁ గలరు? మఱి నిర్ణయించినారు - రాజుకుం జెప్పినారు - రాజు కొఱుతం జంపుమన్నాఁడు. కావుననే చారుదత్తుఁడు అనుట - 'ఈదృశైః శ్వేతకాకీయైః -' ఇత్యాదిని. తా నేమో కొఱ్ఱుమానుకడకు నడపఁ

విదూ—మూలే ఛిన్నే, కుతః పాదపస్య పాలనమ్? [మూలే ఛిణ్ణే కుదో పాదవస్స పాలణమ్],

చారు—మా మైవమ్.

శ్లో. నృణాంలోకాన్తరస్థానాం దేహప్రతికృతిః సుతః
మయి యో వై తవ స్నేహో, రోహసేనే సయుజ్యతామ్. ౭౨

విదూ—భో వయస్య, అహం తే ప్రియవయస్యో భూత్వా, త్వయా విరహితాన్ ప్రాణాన్ ధారయామి? [భో వఅస్స, అహం తే పిఅవఅస్సో భవిఅ తుఏ విరహిదాఇం పాణాఇం ధారేమి?]

---

బడుచున్నాఁడు, ఇఁక నిమిషములలో చంపఁబడఁగలఁడు. తాను ఇల్లు కదలి వచ్చునపుడు తనకు ఇదేదియు తెలియదు. ఇట ఇట్లగునని తెలియదు. ఇంటిలో తన ముసలియమ్మ శిశువు రోహసేనుఁడున్నాఁడు, పతివ్రత యిల్లాలు ధూతమ్మ ఉన్నది. కావున మైత్రేయుని వారికడకు, వారికిం జెప్పుటకు, ఇంటికి పంపుచున్నాఁడు.

మద్వచనాత్ అమ్బాం పశ్చిమమ్ అభివాదయస్వ - నామాటవలన అమ్మకు కడపటినమస్కారము పెట్టుము. పుత్రంచ ... = నాకొడుకును రోహసేనుని కాపాడుము - అపశ్చిమమ్ - పా. - ఇఁక దాని తరువాత మఱొకటిలేనిది - అనుట - కడపటిది అనుట.

మూలే ఛిన్నే, కుతః పాదపస్య పాలనమ్ = వేరు తెగఁగొట్టఁబడఁగా, ఇఁక చెట్టును కాపాడుట ఎట్లు, ఎందులకు? నీవు వేరు, కొడుకు చెట్టు. వేరు తెగిన తర్వాత చెట్టును కాపాడుట దేనితో? అది యెండి పోక బ్రదుకునా? మా మా ఏవమ్ - కాదు కాదు, అట్లు కాదు,

శ్లో. ౭౨. లోకాన్తరస్థానాం నృణాం = పరలోకమున నున్న నరులకు, అనఁగా చనిపోయిన మానుసులకు, సుతః = కొడుకు, దేహప్రతికృతిః = దేహము నకు మాఱురూపు - ప్రతిమ. మయి = నాయందు, యః వై తవ స్నేహః - నీకు ఏస్నేహము గలదో, సః = అది, రోహసేనే = రోహసేనునందు, యుజ్యతామ్ = కూర్పఁబడవలసినది - గట్టిగా ఉంపవలసినది. అహం తే ప్రియవయస్యో భూత్వా ... = నేను నీకు ప్రియవయస్యుఁడనై యుండి, నీవు లేని (నా) ప్రాణాలను ధరింపఁజాలను. నీవు పోయినతర్వాత నీవు లేక నేను బ్రదికియుందునా?

చారు—శోభాసేన మపి తావ ద్దర్శయ.

విదూ—ఏవం. యుజ్యతే. [ఎవ్వమ్. జుజ్జది].

అధి—భద్ర శోధనక, అపసార్యతా మయం వటుః.

(శోధనక స్తథా కరోతి)

అధి—కః కో ఽత్ర భోః — చాణ్డాలానాం దీయతా మాదేశః.

(ఇతి చారుదత్తం విసృజ్య నిష్క్రాన్తాః సర్వే రాజపురుషాః.

శోధ—ఇత ఆగచ్ఛత్వార్యః. [ఇదో ఆ అచ్ఛదు అజ్జో].

చారు—(సకరుణమ్ - మైత్రేయ భోః కిమిదమద్య IX ౨౯. ఇత్యాది పఠతి.)

[ఆకాశే]

---

శోభాసేనం అపి తావత్ దర్శయ - శోభాసేనుని చూపనైనను చూపు వాఁడు. ఏవం - యుజ్యతే - అట్లే. అది సరిగానే ఉన్నది. ఆమాట యుక్తము గానే ఉన్నది. అపసార్యతాం అయం వటుః = ఈవడుగు - మైత్రేయుఁడు - అవతలికి పంపఁబడును గాక.

కః కః అత్రభోః - ఎవరురా అక్కడ ? ఇది నౌకరును ఎచ్చరించు తెలుఁగు. చణ్డాలానాం ఆదేశః దీయతామ్ = చండాలులకు - దండ్యులని నిశ్చయింపఁబడిన వారిని దండింపను సర్కారు ఏర్పఱచినవారు. ప్రాయకముగా చండాలజాతి వారుగా ఉందురు - మాదిగవారు. చారుదత్తు నొక్కని శోధనకునికి అప్పగించి, ఈయుత్తరువు చేసి, అధికరణమండపమున నున్నవా రందఱు వెడలిపోయినారు.

ఆకాశే - మింటఁజూచి చెప్పుచున్నాఁడు - మఱి అఖోఁజపత్షేపములలో చేరిన ఆకాశభాషితమువంటిది గాదు పాలక ఆకాశభాషితము - రాజుం గుఱిపెట్టి శపించుచున్నాఁడు. ఇది వే. వేం, శాస్త్రులవారి బొబ్బిలియుద్ధము II. లోని 'ఓరోరీ నానగండా' ఇత్యాది రంగారాయనియు, 'రంగారాయఁడు వేంగేశేంద్రుఁ డనుఁ గుల్' - ఇత్యాది. IX - లోని పాపారాయ భాషితముంబోనిది - అమర్షోన్మాదవా

శ్లో. విషసలిల తులాగ్నిప్రార్థితే మే విచారే
క్రకచ మిహ శరీరే వీక్ష్యదాతవ్య మద్య
అథ రిపువచనాద్వా బ్రాహ్మణం మాం నిహంసి
పతసి నరకమధ్యే పుత్రపౌత్రైః సమేతః. ౪౩

అయ మాగతోఽస్మి.

[ఇతి నిష్క్రాన్తాః సర్వే]

ఇతి వ్యవహారో నామ

నవమోఽఙ్కః

---

క్కగును - పాలకరాజుం గుటిపెట్టినది. కాపోక్తి - అట్లే ముద్రారాక్షసమున ఈ చాణక్య భాషితములును ఇట్టివే - I (27) ఆకాశే లక్ష్యంబద్ధ్వా - దురాత్మన్ రాక్షస, క్వేదానీం గమిష్యసి? ఇత్యాదియు (III - 31) - ఆకాశే లక్ష్యంబద్ధ్వా స్వగతమ్ - రాక్షస రాక్షస, ఏవ భవతః కౌటిల్యబుద్ధి విజిగీషోః బుద్ధేః ప్రకర్షః - ఇత్యాదియు. అర్థోపక్షేపక - ఆకాశభాషితము గాదు.

శ్లో. ౪౩. మే విచారే = నా విచారణ. విష సలిల తులాగ్ని ప్రార్థితే - నేరమును రుజువు చేయు దివ్యోపాయములు, విషము సలిలము తుల అగ్ని - ఇవి ఎందు ప్రార్థితములో - అట్టిది కాఁగా, ఇహ శరీరే = ఈ నాశరీరమందు, అద్య = ఇప్పుడు, క్రకచం దాతవ్యం = ఱంపము, కత్తి యీవలసినది - ప్రయోగింపవలసిన దని, వీక్ష్య = నీవు సొంతముగానే అట్టి దివ్యసాహాయ్యము లేకయే, చూచి నిశ్చయించి, అథవా - అట్లుకాకున్న, నీవు సొంతముగాఁ గాకున్న, రిపువచనాత్ వా = నాకు కాని (శకారుని నీమఱంది) - మాటవలనం గాని, బ్రాహ్మణం మాం = బ్రాహ్మణుని నన్ను - చంపఁగూడ దని మన్వాదులును, నీమంత్రులును చెప్పినవానినే, నిహంసి = చంపుచున్నావు. (కావున) పుత్రపౌత్రైః సమేతః = పుత్రులతోను పౌత్రులతోనుం గూడ - మూఁడు తరాలవారితో - నరకమధ్యే = నరకములో, పతసి = పడుదువు. ఇది కాపోక్తివలె ఉన్నది.

శకారుఁడు స్నానము చేసి ఉజ్జ్వలవేషము దాల్చి అధికరణమండపమునకు పోయి, అధికరణికుఁడు రాఁగానే తనదే నాఁటి తొలిఫిర్యాదుగా విచారింపకున్న బావతో చెప్పెదనని బెదరించి ఒప్పించి, దరిద్రచారుదత్తుఁడు తన పుష్పకరండక జీర్ణోద్యానమున వసంతసేనను, నగలు తీసికొని గొంతు పిసికి చంపినాఁడు, పీనుఁగుపై నగలు లేవు మెడ వాచియున్నది, నేను చూచితిని – అని పిర్యాదువ్రాయించెను. అంతట అధికరణికుఁడు వసంతసేనతల్లిం బిలిపించి 'నీకూఁతురు ఎక్కడ' అని యడుగఁగా చారుదత్తునింటికి పోయినదని చెప్పినది. అంతట చారుదత్తుఁడు పిలువఁబడినాఁడు – అతనికి లెక్కలేని యసాధారణపు దుఃశకునము లైనవి, మనస్సు వెతచెందినది. అధికరణమండపమునకు వచ్చినాఁడు. అతని యాకారముం జూచి. అతఁడేపాపమును చేయువాఁడు కాఁడే అని యనుకొని, వసంతసేనంగూర్చి యడుగ, ఆమె తనకు నేస్తురాలు, తన యింటికి వచ్చినది. మఱి తర్వాత తన యింటికి మరలినది. ఎట్లు పోయినదో తాను కంటితో చూడలేదు అని యనెను. ఆసయమునకు అచటికి వచ్చిన సర్కారుగుల్మాధికారి వీరకుఁడు వసంతసేన నిన్న చారుదత్తుని బండిలోనే పోయినది. తాను తన వారు బండిని చూచినారమని అన్నాఁడు. అంతట వానినే తటాలున వాకిట నున్న గుఱ్ఱముమీఁద పోయి ఆతోఁటకడ స్త్రీశవమున్నదా చూచిరమ్మనఁగా, అతఁడట్లే చూచివచ్చి, ఉన్నది శవము, స్త్రీదే, కుక్కలు నక్కలు పీఁకి తినుచున్నవి అన్నాఁడు. ఇంతలో మైత్రేయుఁడు, చారుదత్తునిచే వసంతసేనం జూచి, ఆపెనగలు ఆపెకు ఇచ్చి రమ్మని పంపఁబడి అటు పోవుచుండి ఇంతలో చారుదత్తుఁడు కచ్చేరికి పిలువఁబడినాఁడని విని, ఇటు కచ్చేరికి వచ్చినాఁడు. అక్కడ ఫిర్యాదు విని, మిత్రునిమీఁది ప్రీతిగౌరవములచేత అతని గుణముల నుగ్గడించి, అతనిపై ఈయసత్య వ్యవహారము చేయుదువటరా అని శకారుం దిట్టి కొట్టఁబోఁగా, అతఁడును బదులు కొట్టఁగా అజగడాన అతని సంకనుండి వసంతనేన నగలమూట క్రిందపడి, ఆనగలు వసంతసేనవే అని చారుదత్తుఁడే అనఁగా, ఆచూకితో పట్టుబడినట్లు ఫిర్యాదు గట్టిగా రుజువై పోయినది. చారుదత్తుఁడు తన తట్టు చెప్పవలసినదిగా ఏమియు చెప్పలేదు. నమ్మఁబడ దనియు ఆర్యకునిబండిమాట బయటికి పొక్క ననియు, అతనికి తా నభయమిచ్చితి ననియు ఊరకుండెను. శకారుఁడు జయాటోపముతో తన యింటికి మరలినాఁడు అంతట చారుదత్తుఁడు దోషియే యను నిర్ణయమును అధికరణికుఁడు పాలకరాజునకుం

దెలిపెను. దోషి బ్రాహ్మణుఁడైనను లెక్కసేయక రాజు అతనిని కొఱ్ఱునెక్కించి చంపవలసినదని యుత్తరువుపంపెను. అధికరణికుఁడు చారుదత్తుని చండాలుర కప్పగింపు మని ఆజ్ఞ చేసి వెడలిపోయెను.

చారుదత్తుఁడు తన తల్లికి తన కడనమస్కారము చెప్పుమనియు, రోహసేనుం దెచ్చి తనకు చూపుమనియు మైత్రేయునితో చెప్పి పంపెను.

వ్యవహారము అను

తొమ్మిదవ యంకము

ముగిసినది



# దశమోఽఙ్కః

(తతః ప్రవిశతి చాణ్డాలద్వయేనాను గమ్యమాన
శ్చారుదత్తః)

ఉభౌ—

శ్లో. తత్కిం న కలయ కారణం నవవధబన్ధనయనే నిపుణౌ
అచిరేణ శీర్షచ్ఛేదన శూలారోపేషు కుశలౌ స్వః. ౧

[తక్కిం ణ కలఅ కాలణ ణవవహబన్ధణఅణే ణిఉణా
అచిలేణ శీశచ్ఛేలణ శూలాలోవేశు కుశలవ్హ]

---

ఇందు వసంతసేన బ్రదికి లేచి వచ్చుటచే చారుదత్తుని మోక్షమును, ఆర్యకుఁడు రాజగుటయు, శర్విలకుఁడు కలసికొనుట మొదలగునది, నాటకము ముగింపు చెప్పఁబడును.

చణ్డాలద్వయేన అనుగమ్యమానః - ఇరువురు చండాలురచే వెంబడింపఁబడుచు - చారుదత్తుఁడు ప్రవేశించును.

శ్లో. ౧. తత్ కిం = మఱెందుకు? కారణం = కారణమును - ఎందుకు చంపుట అని - న కలయ = ఆలోచింపకు - కారణముతో మన కేమి పని? రాజాజ్ఞ. దానిని నెఱవేర్తుము. అంతే. నవ వధ బన్ధనే = క్రొత్త క్రొత్త విధాన చంపుట, కారాగారమున కట్టివేయుట - వీనిని జరుపుటలో, నిపుణౌ = నేర్పరులము! అచిరేణ = విలంబమే లేక, శిరశ్ఛేదన శూల ఆరోపేషు = తల నఱకుట, కొఱ్ఱు ఎక్కించుటలయందు, కుశలౌ స్వః = నేర్పరుల మగుదుము.

మాకు అనుకొనవలసినది ఏమున్నది? కారణమును ఆలోచింపము, దానితో మాకు పనిలేదు, సర్కారు ఉత్తరువు. క్రొత్త విధముగా చంపుట, క్రొత్తవిధముగా

అపసరత ఆర్యాః, అపసరత, ఏష ఆర్యచారుదత్తః, [ఓశలధ అజ్జా, ఓశలధ. ఏశే అజ్జచారుదత్తే]

శ్లో. దత్తకరవీరదామా
గృహీత ఆవాభ్యాం వధ్యపురుషాభ్యాం
దీప ఇవ మన్దస్నేహః
స్తోకం స్తోకం క్షయం యాతి. 3

[దిణ్ణకలవీలదామే గహిదే అమ్హేహిం వజ్ఝపులిసేహిం
దీవే వ్వ మన్దణేహే థోఅం థోఅం ఖఅం జాది].

చారు—(సవిషాదమ్)

---

కారాగారమునకు తెచ్చి పడవేయుట - వీనియందు నేర్పరులము. ఒక్క నిమిష ములో తల నఱికివేయుదుము. ఒక నిమిషములో కొఱు ఎక్కింతుము. (అందు) ఎంతయు నేర్పరుల మగుదుము.

అపసరత ఆర్యాః - అయ్యలారా, తొలఁగిపొండు - (దారినుండి) పొండు తొలఁగి - ఏషః ఆర్యచారుదత్తః = వీఁడుగో ఆర్యచారుదత్తుఁడు.

శ్లో. 3. దత్తకరవీరదామా = ఎఱ్ఱగన్నేరు పూలమాలలు వేయఁబడి నాఁడు - ఆవాభ్యాం వధ్యపురుషాభ్యాం = చంపు నౌకరుల మైన మాచేత, గృహీతః = పట్టుకొనఁబడినాఁడు. మన్దస్నేహః = చమురు తగ్గి పోయిన, దీప ఇవ = దీపమువలె, స్తోకం స్తోకం = కొంచెము కొంచెముగా, క్షయం యాతి = తాఱి పోవుచున్నాఁడు.

మెడలో ఎఱ్ఱగన్నేరుదండలు వేసినాము - ఘాతకుల మైన మేము పట్టు కొన్నాము. (మఱి మేము ఏమియుచేయకయే, ఆపాటికే) అయ్యొ, చమురు తగ్గి పోయిన దీపమువలె - తాఱిపోవుచున్నాఁడు. ఇంకేమున్నది?

సవిషాదమ్ = దుఃఖములో.

శ్లో. నయనసలిలసిక్తం పాంసురూక్షీకృతాఙ్గం
పితృవనసుమనోభిర్వేష్టితం మేశరీరమ్,
విరసమిహ రటన్తో రక్తగన్ధానులిప్తం
బలిమివ పరిభోక్తుం వాయసా స్తర్కయన్తి. 3

చాణ్డాలౌ—అపసరతార్యాః, అపసరత, [ ఓశలధ అజ్జా ఓశలధ ]

శ్లో. కిం పశ్యత ఛిద్యమానం సత్పురుషం కాలపరశుధారాభిః.
సుజనశకునాధివాసం సజ్జనపురుషద్రుమ మేతమ్. ౪

శ్లో. 3. మే శరీరం = నాదేహము, నయన సలిల సిక్తమ్ = కన్నీటితో తడుపఁబడినది. పాంసు రూక్షీ కృతాఙ్గమ్ = ధూళిచే కఱకువాఱిన యవయవములు గలదైనది, (అ దెంత కోమలము సుకుమారము - మఱి ఇట్లైపోయినది,) పితృవన సుమనోభిః వేష్టితమ్ = వల్లకాటి పూలచేత చుట్టఁబడినది. రక్తగన్ధానులిప్తమ్ = ఎఱ్ఱ గందము పూయఁబడినది - ఇవన్నియు ద్వితీయలు - అట్టిదానిని, బలిం ఇవ = పూజానివేదనము - కానుకం బోలె, విరసం = చెవికి వెగటుగా, రటన్తః = కూయుచున్నవై, వాయసాః = కాకులు, పరిభోక్తుం = పొడిచి మెక్కుటకు, తర్కయన్తి = కోరుచున్నవి.

బలి చల్లినప్పుడు, తొట్రుపాటుతో మిక్కిలియు కూయును, కాకులు - బలికిని పూజపువ్వులు కలయిక ధూళికమ్మట మేక కోడి మొదలైనవాని నెత్తురును, వాసనలును చేర్చి చల్లుదురు కదా. కావున ఇపుడు నావేసాన నేను అట్టి బవలిలె ఉన్నాను. అట్టి వారిని ఇటకు తెచ్చుటయు చంపిపాఱవేయుటయు, పీనుఁగుమీఁద తాము మూఁగుటయు అచోటి కాకులకు అలవాటుపడియున్నది. ఇపుడు వీనియొడను అవి అట్లు అచరించుచున్నవి.

శ్లో. ౪. కిం పశ్యథ = ఏమి చూచెదరు! సత్పురుషం = సజ్జనుని! కాల పరశు ధారాభిః = కాలమనెడు గొడ్డటికఱకు వాదచేత, అంచుచేత, ఛిద్యమానం = తెగఁగొట్టఁబడుచున్న, సుజన శకున అధివాసం = సుజనులు అను పక్షులకు ఉనికిపట్టైన, సజ్జనపురుషద్రుమం ఏతమ్ = సాధువను ఈ చెట్టును, కిం పశ్యథ = ఏమి చూచెదరు!

[కిం పేక్ఖధ ఛిజ్జన్తం శప్పులిశం కాలపలశుధాలాహిం
శఉణశఉణాధివాశం శజ్జణపులిశద్దుమం ఏదమ్]

ఆగచ్ఛ రే చారుదత్త ఆగచ్ఛ. [ఆఅచ్ఛ లే చాలుదత్తా, ఆఅచ్ఛ].

చారు—పురుషభాగ్యానా మచిన్త్యాః ఖలు వ్యాపారాః, య
దహ మీదృశీం దశా మనుప్రాప్తః.

శ్లో. సర్వగాత్రేషు విన్యస్తై రక్తచన్దనహస్తకైః
పిష్టచూర్ణావకీర్ణశ్చ, పురుషో ఽహం పశూకృతః. ౫

(అగ్రతో నిరూప్య) అహో, తారతమ్యం నరాణాం! (సకరుణమ్)

---

అందఱకు మీకు ఆశ్రయమైనవాఁడు పోయినాఁడు! ఇదిగో చచ్చినాఁడు! చచ్చినట్టే! ఇఁక నేమి చూచెదరు!

ఆగచ్ఛ రే చారుదత్త – ఓరి చారుదత్త, రారా. – తాము ఈపాగ్ద్దలు, తా మెఱిఁగిన జనవాక్యములు పలుకుచున్నను, తమ నాకరింబట్టియు – అతఁడిప్పుడు తమచే కొట్టున వేయఁబడవలసినవాఁ డగుటంబట్టియు. అట్టి రాజాజ్ఞయు ఉండరాబట్టియు – ఓరి – యనుట. నేరము ఋజువు కాక దండింపఁ బడఁడుగదా. ఇఁక గౌరవ మెక్కడిది? ఓరి – అనుటయే.

పురుషభాగ్యానాం = జనుని అదృష్టాలయొక్క వ్యాపారాః = పనులు, అవి యెప్పటికి ఏమి సేయునో, అచిన్త్యాః ఖలు = ఊహింపఁదగినవి కావుగదా.

శ్లో. ౫. పురుషః = మానిసినే, (నేను), సర్వగాత్రేషు = అన్నియవయవములందును, విన్యస్తైః = ఉంపఁబడిన, హస్తకైః = (ఐదువ్రేళ్ళు అగపడుచున్న) చేతుల ముద్రల – గుర్తుల – చేత – ఇట్టివానిని ఇట్లు అలంకరింతురు అనుట. పిష్టచూర్ణావకీర్ణః చ = అంతట పిండిపొడి చల్లఁబడినవాఁడను సయితము ఐ, అహం = నేను, పశూకృతః = (దేవతలకైన) వేఁటపోతుగా చేయఁబడితిని.

నాదేహాన ఈమాలలు పూఁతలు చల్లులు నన్ను వేఁటపోతుం జేసివేసినవి.

అగ్రతః నిరూప్య – ఎదుట పరికించి చూచి,

శ్లో. అమీహి దృష్ట్వా మదుపేత మేత
న్మర్త్యం ధిగ స్త్వి త్యుపజాతబాష్పాః
అశక్నువన్తః పరిరక్షితుం మాం
స్వర్గంలభ స్వేతి వదన్తి పౌరాః. ౬

చాణ్డాలౌ—అపసర తార్యాః, అపసరత. కిం పశ్యత?
[ఓశలధ అజ్జా, ఓశలధ. కిం పేక్ఖధ?]

శ్లో. ఇన్ద్రః ప్రవాహ్యమాణో
గోప్రసవః సంక్రమ శ్చ తారాణామ్
సు పురుషప్రాణవిపత్తి
శ్చత్వార ఇమే న ద్రష్టవ్యాః. ౭

శ్లో. ౬. అమీ పౌరాః = వీరుగో పౌరులు, మదుపేతం = నాచేపొందం బడిన, ఏతత్ = దీనిని – ఈదశను, దృష్ట్వా = చూచి, మర్త్యం ధిక్ – మృత్యువు నకు వశుఁడు మానిసి ఇసీ చీచీ ఏమి జన్మ అని, ఉపజాతబాష్పాః – పొడమిన కన్నీరు గలవారై, మాం పరిరక్షితుం అశక్నువన్తః = నన్ను కాపాడను అసమ ర్థులై, స్వర్గం లభస్వ ఇతి వదన్తి = స్వర్గమును పడయుము అని, పలుకు చున్నారు,

వీరుగో పౌరులు నన్ను చూచుచున్నారు. ఈనాదశను చూచి, చీచీ మర్త్యజన్మ యెందుకు, ఇట్లు చావుకు వసమగునది – అని కన్నుల నీరు కార్చుచు తాము నన్ను కాపాడ నశక్తులు అని తెలిసి (మఱి నన్నెంతయు ఎఱుంగుదురు గాన)పో స్వర్గము చేరు అని పలుకుచున్నారు.

కిం పశ్యథ = ఏమి చూతురు! పొండు, అవతలికి పొండు.

శ్లో. ౭. చూడకూడదు! ప్రవాహ్యమాణః = వలసపోవుచున్న – తన రాజ్యమునుండి తఱుముఁబడి బయటికి పోవుచున్న, ఇన్ద్రః = రాజు – న ద్రష్టవ్యః – చూడఁబడఁదగఁడు. అట్లే గోప్రసవః చ = ఆవుఈనుటయు – తారాణాం = నక్ష

[ఇన్దే ప్పవాహిఅన్తె
గోప్పశవే సంకమం చ తాలాణమ్
శుపులిశపాణవిపత్తీ
చత్తాలి ఇమే ణ దట్టవ్వా].

ఏకః—అరే ఆహీన్త, పశ్య పశ్య, [హణ్డే ఆహీన్తా, పేక్ఖ పేక్ఖ],

శ్లో. నగరీప్రధానభూతే వధ్యమానే కృతాన్తాజ్ఞయా
కిం రోదిత్యన్తరిక్ష మథ వానభ్రే పతతి వజ్రమ్. ౮

[ణఅలీపధాణభూదే వఝ్జీఅన్తె కదన్త అణ్ణాప
కిం లుఅది అన్తలిక్ఖే ఆదు అణబ్భే పడది వజ్జే]

త్రముల యొక్క, సంక్రమః = దాఁటుట, జరుగుట - జరిగిపడుటయు - అట్లే, సుపురుష ప్రాణ విపత్తిః చ = సజ్జనుని ప్రాణమునకు ఆపదయు - చంపఁబడుటయు - అనుట - ఈనాలుగును చూడఁగూడనివి - చూడఁగూడదు.

చండాలురను చారుదత్తుని సుపురుషుఁ డనుచున్నారు. మఱి తాము రాజు నౌకరులు, చంపవలసది తమ పని, వానిని చంపు మని రాజు పట్టియిచ్చినాఁడు; తాము పట్టుకొని పోవుచున్నారు. మీరు ఏమి చూతురు? కూడదు పొండు - అని చెప్పుచున్నారు.

ఓరి ఆహీంతా, చూడురా చూడు - ఆహీంతుఁడని వాని పేరు.

శ్లో. ౮. కృతాన్తాజ్ఞయా = విధినియోగముచేత, నగరీ ప్రధానభూతే = ఈయూరి కంతటికి ప్రధానుఁడైనవాఁడు, (చారుదత్తుఁడు) వధ్యమానే చంపఁబడుచుండఁగా, కిం అన్తరిక్షం రోదితి = ఏమి బయలు - ఆకసము - ఏడ్చుచున్నది! అనభ్రే = మబ్బులేకుండఁగా, వజ్రం పతతి = పిడుగుపడుచున్నది! ఈయుత్పాతములు తోఁచినవి.

గొప్పవారి చావున ఉత్పాతములు ఇట్టివి అగపడుట ప్రసిద్ధమే. కట్టిబయలులో ఏడ్పు, మబ్బు లేకయే పిడుగుపాటు! మఱి పాలక రాజు నాశనమును అర్యకుని

ద్వితీయః—అరే గోహ, [అలే గోహా.]

శ్లో. నచరోది త్యన్తరిక్షం నైవానభ్రేపతతి వజ్రమ్.
మహిళాసమూహమేఘా న్నిపతతి నయనామ్బుధారాభిః. ౮

[ణ అ లుఅది అన్తలిక్ఖే ణే అ అణబ్భే పడది వజ్జే
మహిలాశమూహమేహే నివడది ణఅణమ్బు ధారాహిం].

అపి చ, [అవి అ],

శ్లో. వధ్యే నీయమానే జనస్యసర్వస్య రుదతః
నయనసలిలైః సిక్తో రథ్యాతో నోన్నమతి రేణుః ౧౦

[వజ్ఝమ్మి ణీఅమాణే జణశ్శ శవ్వశ్శ లోదమాణశ్శ
ణఅణశలిలేహి శిత్తే లచ్ఛాదో ణ ఉణ్ణమఇ లేణూ].

---

రాజ్యమును సూచించునవియు అగునా? అవియే ప్రధానతరము లేమో ఎవరును ఇపుడు ఎఱుఁగరు, ఊహింపరు. అరే గోహ - ఒరి గోహ. ఆహీంత అనియు గోహ అనియు ఆ ఘాతకుల పేర్లు. ప్రవేశమున నే, పేరు చెప్పకున్నను, తామెవరో తామే చెప్పుకొన్నారు - నవవధబద్ధ నే నిపుణౌ - మొదలైనదిగా. ప్రేక్షకులకు వారెవరో తెలియుటకు - రంగాన ప్రవేశించినవారు ఫలానా అని తెలియుటకు వేఱు బాహ్యమార్గములు అపేక్షణీయములు కాకూడదు - నాటక మాడించు వారు ప్రకటించు కరపత్రములంబోనివి. ఇపుడు వారి యొండొరుల సంబోధనచే వారిపేర్లను తెలిసినవి.

శ్లో. ౮. అన్తరిక్షం న చ రోదితి = ఆకాశమును ఏడ్చుటలేదు. అనభ్రే వజ్రమ్ నైవ పతతి = మబ్బులేక పిడుగును పడుటలేదు. (అవి కాదు అవి - మతి) మహిళా సమూహ మేఘాత్ = స్త్రీలగుంపు అను మేఘమునుండి, నయనామ్బు = కన్నీరు, ధారాభిః = ధారలుగా, నిపతతి = పడుచున్నది.

శ్లో. ౧౦. వధ్యే నీయమానే = ఈచంపఁదగినవాఁడు కొనిపోఁబడుచుండఁగా, రుదతః = ఏడ్చుచున్న, సర్వస్య జనస్య = ఎల్లజనులయొక్క, నయనసలిలైః కన్నీళ్ళతో, సిక్తః = తడిసినదై, రథ్యాతః = బాటనుండి, రేణుః = దుమ్ము, న ఉన్నమతి = లేచుటలేదు.

చారు—(నిరూప్య సకరుణమ్)

శ్లో. ఏతాః పున ర్హర్మ్యగతాః స్త్రియో మాం
వాతాయనార్ధేన వినిఃసృతాస్యాః
హా చారుద త్తే త్యభిభాషమాణా
బాష్పం ప్రణాలీభి రి వోత్సృజన్తి. ౧౧

చాణ్డా—ఆగచ్ఛ రే చారుదత్త, ఆగచ్ఛ. ఇదం ఘోషణాస్థానమ్. ఆహత డిణ్డిమమ్. ఘోషయత ఘోషణమ్. [ఆఅచ్ఛ లే చాలుదత్తా, ఆఅచ్ఛ. ఇమం ఘోషణట్ఠాణమ్. ఆహణేధ డిణ్డిమమ్. ఘోశేధ ఘోశణమ్.]

---

నిరూప్య సకరుణమ్ = పరికించి, ఎంతయు దుఃఖముతో - జాలితోఁచునట్లుగా.

శ్లో. ౧౧. ఏతాః పునః = వీరుగో మఱి, హర్మ్యగతాః = మేడలం జేరినవారై, - ఆవీధిలోనంతయు మేడలే, అంత గొప్ప సంపన్నమైన నగరము ఉజ్జయిని - అనుటయు అనుషంగికముగా - మనకు తెలియవచ్చును - స్త్రియః = స్త్రీలు, మాం = నన్ను, వాతాయనార్ధేన = కిటికీ భాగముగుండా, వినిఃసృతాస్యాః = వెలికి వచ్చిన మొగములు గలవారై, హా చారుదత్త ఇతి అభిభాషమాణాః = అయ్యో చారుదత్త అని నన్ను పిలుచుచున్నవారై, నాకు తమ్ముం దెలుపుచు తమ దుఃఖమును అసహాయతను తలఁచుకొనుచు, బాష్పం = కన్నీటిని, ప్రణాళీభిఃఇవ = గొట్టాలతోనుం బోలె, ఉత్సృజన్తి = విడుచుచున్నారు - కన్నులే చేఁపల గీపల రూపపు మూతులు గల గొట్టములు - అనుట. ఆనీళ్ళతో వారి మనస్సునిండి అది యీ గొట్టములగుండ బయటికి పాఱుచున్నది.

ఇదం ఘోషణస్థానమ్ = ఇది చాటింపు చోటు - మొదటిది ? ఇట్లు వధ్యుం గొనిపోవునపుడు వాఁడు ఫలానా అనియు, వాని నేరము ఫలానా అనియు, దానికి ఈదండన యనియు మఱెవ్వరైనను అట్టిది చేసిన అట్లే కలుగుననియు, అట్టివి ఇఁక కలుగనీకుండుటకు దేశాన శాంతికి భద్రమునకు సర్కారు చాటింపు. ఆహత డిణ్డిమమ్ = కొట్టుఁడు రాయిడిగిడిగిడిని - డప్పును. ఘోషణాం = చాటింపును, ఘోషయత = చాటింపుఁడు.

ఉభౌ—శృణుతార్యాః, శృణుత. ఏష సార్థవాహవినయదత్తస్య నప్తా, సాగరదత్తస్య పుత్రక ఆర్యచారుదత్తో నామ. ఏతేన కిలాకార్యకారిణా గణికా వసన్తసేనా అర్థకల్యవర్తస్య కారణా చ్ఛూన్యం పుష్పకరణ్డకజీర్ణోద్యానం ప్రవేశ్య బాహుపాశబలాత్కారేణ మారితేతి ఏష సలోప్త్రో గృహీతః, స్వయం చ ప్రతిపన్నః. తతో రాజ్ఞా పాలకేన వయ మాజ్ఞప్తా ఏతం మారయితుమ్. య ద్యపర ఈదృశ ముభయలోకవిరుద్ధ మకార్యం కరోతి త మపి రాజా పాలక ఏవ మేవ శాస్తి.

[శుణాధ అజ్జా, శుణాధ. ఏశే శత్థవాహవిణఅదత్తశ్శ ణత్తికే, శాఅలదత్తశ్శ పుత్తకే, అజ్జచాలుదత్తే ణామ. ఏదిణా కిల అకజ్జకాలిణా ఘణిఆ వశన్తశేణా అత్థకల్లవత్తశ్శ కాలణాదో శుణ్ణం పుప్ఫకలణ్డఅజిణ్ణుజ్జాణం పవేశిఅ బాహుపాశబల్లక్కాలేణ మాలిదే త్తి ఏశే శలోత్తే గహిదే, శఅం అ పడివణ్ణే. తదో లణ్ణా పాలఏణ అమ్హే ఆణత్తా ఏదం మాలేదుమ్ – జది అవలే ఈదిశం ఉభఅలోఅవిలుద్ధం అకజ్జం కలేది తం పి లాఆ ఎవ్వం జ్జేవ శాశది],

---

ఏతేన కిల అకార్యకారిణా = కూడనిపని - పాపము - చేయు ఈతనిచేత నట, గణికా ... = భోగముది వసంతసేన డబ్బుసద్దికూటి కారణమువలన, ఎవరు లేని పుష్ప కరండక జీర్ణోద్యానము అనుతోటలోనికి కొనిపోయి, భుజములే త్రాళ్ళుగా చుట్టి బలవంతముగా గొంతుపిసికి చంపఁబడినది అని ఇతఁడు ఆదొంగిలించిన వస్తువులతో పట్టుకొనఁబడినాఁడు. తాను సొంతముగా (తప్పును) ఒప్పుకొన్నాఁడు. కావున(అంతట) పాలకరాజుచేత మేము ఆజ్ఞాపింపఁబడితిమి - వీనిని చంపుటకు. యది అపరః ఈదృశం ... = మఱియొకఁడేని, ఇట్టి యిహపరములకు రెంటికిం గాని అకార్యమును - చేయఁగూడనిపనిని - పాపమును, చేయునేని, వానిని సయితము రాజు పాలకుఁడు ఇట్లే దండించును. (కబడ్దార్).

చారు—(సనిర్వేదం, స్వగతమ్)

శ్లో. మఖశతపరిపూతం గోత్ర ముద్భాసితం మే
సదసి నిబిడచైత్యబ్రహ్మఘోషైః పురస్తాత్,
మమ మరణదశాయాం వర్తమానస్య పాపై
స్తదసదృశమనుష్యై ర్ఘుష్యతే ఘోషణాయామ్. ౧౨

(ఉద్వీక్ష్య, కర్ణౌ పిధాయ) హా ప్రియే వసన్తసేనే,

---

దుఃఖముతో, సనిర్వేదమ్ = (ఐహికములమీఁద) రోఁతపడుచునిరాశ.

శ్లో. ౧౨. పురస్తాత్ = మునుపు, మే గోత్రమ్ = నావంశము, మఖశత పరిపూతం = నూఱుల యజ్ఞములచేత, పవిత్రముచేయఁబడి, నిబిడచైత్యబ్రహ్మ ఘోషైః = తెంపులేక గట్టిగా బిగ్గరయైన (యజ్ఞా)గ్ని సంబంధమైన వేదధ్వను లతో, సదసి = యజ్ఞసదస్సునందు, ఉద్భాసితం = విరాజిల్లఁ జేయఁబడినది. మరణదశాయాం వర్తమానస్య = చావుదశలో ఉన్నవాఁడనైన, మమ తత్ = నాఅది, అట్టిది, గోత్రము - నాతాత పేరును నాయన పేరును నాపేరుతో కూడ చెప్పి, యాగోత్రము, అసదృశపురుషైః = నీచులైన చండాలులచేత. ఘోష ణాయాం = చాటింపులో, పాపైః = పాపములతో కూడినదిగా, ఘుష్యతే = చాటింపఁబడుచున్నది.

మునుపు మాతాత, నాయన, నేను లెక్కలేని యజ్ఞములు చేసినాము. యజ్ఞసదస్సు అవిరత - ఉచ్చైర్ - వేదఘోషములతో ధ్వనించినది. వానిచే వంశము ఎంతయో పవిత్రమై పోయినది. అట్టి పవిత్రతయు పొగడ్తయు గన్న ఆగోత్రము ఇపుడు ఈమాదిగవారిచేత దీనార్థ స్త్రీహత్యా దోషముతో చాటింపఁ బడుచున్నది.

ఘోషణముం దలంచుకొని ఉద్వేగము పొంది - వినఁగూడని మాటలు, పాపిష్ఠములు, అని చెవులుమూసికొని, హా ప్రియే వసన్తసేనా! హా ప్రేయసి వసంతసేన.

శ్లో. శశివిమలమయూఖశుభ్రదన్తి,
సురుచిరవిద్రుమసన్నిభాధరోష్ఠి,
తవ వదనభవామృతం నిపీయ
కథ మవశో హ్యయశోవిషం పిబామి. ౧౩

ఉభౌ—అపసర తార్యాః, అపసరత, [ఓశలధ అజ్జా, ఓశలధ],

శ్లో. ఏష గుణరత్ననిధిః సజ్జనదుఃఖానా ముత్తరణసేతుః
అసువర్ణం మణ్డనక మపనీయతే ఉద్యనగరీతః. ౧౪
[ఏశే గుణలఅణణిహీ శజ్జణదుక్ఖాణ ఉత్తలణ శేదూ
అశువణ్ణం మణ్డనలం అవణీఅది అజ్జ ణఅలీదో].

---

శ్లో. ౧౩. శశి విమల మయూఖ శుభ్రదన్తి = చంద్రుని పళపళని కిరణములవలె తెల్లనైన దంతములుగలదానా, సురుచిర విద్రుమ సన్నిభాధరోష్ఠి = ఎంతయు అందమై పవడమునకు సమానమైన అధరోష్ఠము గలదానా - తవ వదన భవ అమృతం నిపీయ = నీనోటపుట్టిన (యధరా) మృతమును ఆని, కథం = ఎట్లు, అవశః = నావసములో లేనివాఁడనై, ఇట్లు ఘాతుకులచేతం బడి, అయశోవిషం = ఈనిన్నుగొంతు పిసికితి నను అపకీర్తియను విషమును. పిబామి = త్రాగుదును!

మొన్న రాత్రి నీవు నవ్విన నవ్వులయా పండ్లవెన్నెలకు తనిసితిని. అంతట ఆయధరామృత మానితిని. (తోఁటలో కలసికొని కాలక్షేపము చేయుదమని సంకేతమేర్పఱిచి, మఱెంతెంతకో ఉవ్విళులూరితినే,) మఱి యిట్లు నీగొంతుపిసికి చంపితినను అపయశస్సు చెవులు నిండుచున్నదే, ఈఘోషణచే దానిని ఎట్లు త్రాగుమనే ప్రేయసీ!

శ్లో. ౧౪. ఏషః=వీఁడు ఈయన, గుణరత్ననిధిః=సద్గుణము లను రత్నములకు నిక్షేపము - పాతఱ, సజ్జన దుఃఖానాం ఉత్తరణ సేతుః - సజనులకు లేమిడిమొదలగు దుఃఖములకు, (సముద్రముం బోని వానికి) దాఁటుటకైన వంతెన, నగరీతః = పట్టణమునుండి (బయటికి వల్లకాటికి), అ సువర్ణంమండనకం = (బంగారముతో చేయంబడని) పురుషరూపమైన (ఈపట్టణపు) తొడవు, అపనీయతే = తొలఁగించి కొనిపోఁబడుచున్నది.

అన్యచ్చ, [అణ్ణం చ],

శ్లో. సర్వః ఖలు భవతి లోకే
లోకః సుఖసంస్థితానాం చిన్తాయుక్తః
వినిపతితానాం నరాణాం
ప్రియకారీ దుర్లభో భవతి. ౧౫

[శవ్వే క్ఖు హోఇ లోఏ
లోఏ శుహశంఠిదాణ తత్తిల్లః
విణివడిదాణం ణలాణం
పిఅకాలీ దుల్లహో హోది].

చారు—(సర్వతో ఽవలోక్య)

శ్లో. అమీ హి వస్త్రాన్తనిరుద్ధవక్త్రాః
ప్రయాన్తి మే దూరతరం వయస్యాః

---

సద్గుణశాలి సజ్జనోపకారి, ఊరికి తోడయైనవాఁడు వల్లకాటికి కొనిపోఁబడుచున్నాఁడు. పొండు, అవతలికి, మీరు పొండు.

శ్లో. ౧౫. లోకే సర్వః లోకః = లోకమున ఎల్లజనమును, సుఖసంస్థితానాం = సుఖములో నున్నవారికే, చిన్తాయుక్తః భవతి ఖలు – సాయపడు ఆలోచనతో కూడుకొన్నది అవునుగదా, వినిపతితానాం = సుఖము తొలఁగి విపత్తులం బడిన కష్టకాలము వచ్చిన, నరాణాం = మానుసులకు, ప్రియకరీ = ప్రియము చేయువాఁడు, దుర్లభః భవతు = అరుదు అగును.

కలవానికే దాన మిచ్చుటయు, బాగుగా – మంచిస్థితిలో – ఉన్నవానికే సాయపడుటయుంగాని, లోకాన లేనివానికి దానమిచ్చుటయు కష్టాలలో పడిన వానికి ఆదుకొనుటయు అరుదు.

సర్వతః అవలోక్య = అంతట కలయంజూచి.

శ్లో. ౧౬. అమీ మే వయస్యాః = వీరుగో నా మిత్రులు, సరివయసువారు, వస్త్రాన్త నిరుద్ధ వక్త్రాః = ఉత్తరీయపు కొస – చెరఁగుతో – మొగము చాటు

పరో ౽పి బన్ధుః సమసంస్థితస్య,
మిత్రం న కశ్చి ద్విషమస్థితస్య. ౧౬

చాణ్డాలౌ—అపసారణం కృతమ్, వివిక్తో రాజమార్గః. త దానయ త్వైనం దత్తవధ్యచిహ్నమ్. [ఓశాలణం కిదమ్, వివిత్తం లాఅమగ్గమ్. తా ఆణేధ ఏదం దిణ్ణవజ్ఝచిణ్హమ్].

(చారుదత్తో నిఃశ్వస్య 'మైత్రేయ భోః' IX ౨౯ ఇత్యాది పఠతి)

[నేపథ్యే]

---

చేసికొని, దూరతరం ప్రయాన్తి = ఎంతయు ఎడసిపోవుచున్నారు, సమసంస్థితస్య = మంచిస్థితిలో ఉన్నవానికి – దైవము అనుకూలముగా నున్నవానికి, పరః అపి = శత్రువును – పరాయివాఁడును, బన్ధుః = బంధుఁడగును, విషమస్థితస్య = దైవము ప్రతికూలించి యిబ్బందులలో నున్నవానికి, న కశ్చిత్ మిత్రమ్ = ఎవఁడును మిత్రము గాఁడు,

వీరుగో నావయస్యులే. మొగము కప్పుకొని, ఎఱుఁగనివారివలె, ఎడసి దూరముగా పోవుచున్నారు. నాకు కాలము ఇట్లు వచ్చినది. కాలము బాగుగా నుండి మంచిస్థితిలో నుండఁగా, పరాయివాఁడే లేఁడు – శత్రువు సయితము బాంధవము పాటించును. కాలము చెడి, ఆపదలలో పడిన, అప్పుడు ఒక్కఁడును మిత్రుఁడు కాఁడు.

అపసారణం కృతం = జనులను తొలగించుట ఐనది. దూరముగా తెచ్చినాము. ఇక్కడ రాజమార్గము, వివిక్తం = నిర్జనముగా నున్నది, తత్ = కావున, దత్తవధ్యచిహ్నం = చంపఁబడుటకైన గుఱుతు పెట్టఁబడినవానిని, ఆనయత = చేరఁగొని రండు – అట్లు చేరరావలసినవారు ఎవరైనను ఉన్న. ఇది రోహసేన మైత్రేయ ప్రవేశ సూచనయు.

చారుదత్తుఁడు మైత్రేయుని, ఇల్లాలిని, కొడుకును రోహసేనుని తలఁచుకొని యేడ్చును. చూ. IX – 29 శ్లో.

హా తాత, హా ప్రియవయస్య. [హా తాద, హాపిఅవఅస].

చారు—(ఆకర్ణ్య, సకరుణమ్) భోః స్వజాతిమహత్తర, ఇచ్ఛా మహ్యాం భవతః సకాశాత్ ప్రతిగ్రహం కర్తుమ్.

చాణ్డాలౌ—కి మస్మాకం హస్తాత్ ప్రతిగ్రహం కరోషి? [కిం అమ్హాణం హత్థాదో పడిగ్గహం కలేశి?

చారు—శాన్తం పాపమ్. నాపరీక్ష్యకారీ దురాచారః పాలక ఇవ చాణ్డాలః. త త్పరలోకార్థం పుత్రముఖం ద్రష్టు మభ్యర్థయే.

చాణ్డాలౌ—ఏవం క్రియతామ్. [ఎవ్వం కరీఅదు].

[నేపథ్యే]

హాతాత - అయ్యో నాయనా, హాప్రియవస్య, అయ్యో ప్రియవయస్యుఁడా - అని తెరలోపలనుండి రోహసేన మైత్రేయుల ఏడుపు - అఱపు - వినఁబడినది.

స్వజాతిమహత్తర - ఓ మాదిగదొరా, నీవలనను దానము గొనుటకు కోరెదను- కోరిక తీర్చుకొనఁ గోరెదను.

కిం అస్మాకం ... = ఏమి మాచేతినుండియు పుచ్చుకొందువా?

శాన్తమ్ పాపమ్ = ఆ (అట్లు ప్రతిగ్రహించు) పాపము శమించును గాక. న అపరీక్ష్యకారీ దురాచారః = సరి సరికాదు అని ఆలోచింపక పనిచేయువాఁడు కాఁడు - పాలక ఇవ = పాలకునివలె.

నేను తన్ను అడుగుటయు, అట్లు అడిగించుకొని తాను నాకు ఇచ్చుటయు అను కూడనిపనిని చేయఁడు మాదిగవాఁడైనను వీఁడు. అట్లు చేయువాఁడు రాజు పాలకుఁడు. తాన వెనుదీయుట - ఆప్రశ్న - కొందువా అనుట. నేను ఒక కోరికను యాచించితిని గాని మీవలన ఏదేని దానముంగాదు, తత్ = కావున, పరలోకార్థం పుత్రిముఖం ద్రష్టుం అభ్యర్థయే - కోరుచున్నాను. నాబిడ్డను నాకు చూపుఁడు.

ఏవం క్రియతాం = అట్లు చేయఁబడును గాక.

హా తాత, హా పితః. [హా తాద, హా ఆవుక].

(చారుదత్తః శ్రుత్వా సకరుణమ్. 'భోః స్వజాతి మహత్తర' ఇత్యాది పఠతి)

చాణ్డాలౌ—హే పౌరాః, క్షణ మన్తరం దత్త. ఏష ఆర్య చారుదత్తః పుత్రముఖం పశ్యతు. (నేపథ్యాభిముఖమ్) ఆర్య, ఇత ఇతః. ఆగచ్ఛ రే దారక ఆగచ్ఛ. [అలే పఉలా, ఖణం అన్తలం దేధ. ఏశే అజ్జచాలుదత్తే పుత్తముహం పేక్ఖదు. అజ్జ, ఇదో ఇదో. ఆఅచ్ఛ లే దాలఅ ఆఅచ్ఛ].

(తతః ప్రవిశతి దారక మాదాయ విదూషకః)

విదూ—త్వరతాం త్వరతాం భద్రముఖః. పితా తే మారయితుం నీయతే. [తువరదు భద్దముహో. పిదా దే మారిదుం ణీఅది].

దార—హా తాత, హా పితః! [హా తాద, హా ఆవుక!]

విదూ—హా ప్రియవయస్య, కుత్ర మయా త్వం ద్రష్టవ్యః? [హా పిఅవఅస్స, కహిం మఏ తుమం పేక్ఖిదవ్వో?]

---

క్షణం అన్తరం దత్త = ఒకనిముసము సందు - అవకాశము - ఇందు. ఆర్య ఇతః ఇతః - అయ్యా ఇటు, ఈతట్టు (చూడు అనుట. ఇటువచ్చును అబ్బాయి - అని) రా, ఓ అబ్బాయి, రా.

తతః ప్రవిశతి ... = అంతట బాలుంగొని విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు. త్వరతాం త్వరతాం భద్రముఖ = త్వరపడు త్వరపడు, ఓమంచియబ్బాయీ, మీనాయన చంపఁబడుటకు కొనిపోఁబడుచున్నాఁడు. హా తాత! హా ఆవుక! అయ్యో నాయనా, అయ్యో నాయనా. హా ప్రియవయస్య - కుత్ర మయా త్వం ద్రష్టవ్యః - అయ్యో ప్రియవయస్య, (ఇఁక) ఎక్కడ నిన్ను నేను చూడవలసినది?

చారు—(పుత్రం మిత్రం చ వీక్ష్య) హా పుత్ర, హా మైత్రేయ, (సకరుణం) భోః, కష్టమ్?

శ్లో. చిరం ఖలు భవిష్యామి పరలోకే పిపాసితః
అత్యల్ప మిద మస్మాకం నివాపోదకభోజనమ్. ౧౭

కిం పుత్రాయ ప్రయచ్ఛామి? (ఆత్మాన మవలోక్య, యజ్ఞోపవీతం దృష్ట్వా) ఆం, ఇదం తావ దస్తి మమ చ

---

సామాన్యముచే, సమవిషమస్థితుల విషయముచే చారుదత్తవయస్యుల విషయము సమర్థింపఁబడుటచే అర్థాంతరన్యాసము. శార్ఙ్గధరుని యీసూక్తి - సంవదించును.

ఇహ లోకేఽపి ధనినాం పరోఽపి స్వజనాయతే
స్వజనోఽపి దరిద్రాణాం తత్క్షణా ద్దుర్జనాయతే.

పుత్రం మిత్రం చ వీక్ష్య = పుత్రుని మిత్రముం గూడ చూచి. భోః కష్టమ్ - అయ్యో కష్టా!

శ్లో. ౧౭. చిరం ఖలు = చాలకాలము గదా, పరలోకే = పరలోకమున, చచ్చినతర్వాత చేరినచోట, పిపాసితః = దప్పిగొన్నవాఁడను, భవిష్యామి = కాఁగలను! అస్మాకం = నాకు, ఇదం నివాప ఉదకభోజనమ్ = తర్పణము విడుచు నీళ్ళు అను నీ ఆహారము, అత్యల్పం = చాలకొద్ది. పర్యాప్తము, చాలునది, కాదు.

ఒక్కఁడే కొడుకు, వాఁడును ఇంకను బాలుఁడు - అగుటచేత - కాఁబోలు ఇట్లనుట. ఇఁకను ఎన్నాళ్ళకో వీఁడు ఎదిగి నాకు పుడిసెఁడు నీళ్లు - తర్పణము - ఇయ్యగలుగుట - నోరెరుఁగని శిశువు. అదైనను నాకు చాలఁగలదా?

వల్లకాటికి కొనిపోఁబడు ఈకడపటి నిముసమున ఇట్లునాకడకు వచ్చిన కొడుకునకు ఇయ్యను నాకద్ద ఏమియు లేదే - ఏమియిత్తును? ఆత్మానం అవలోక్య ... = తన్ను చూచుకొని, యజ్ఞోపవీతం దృష్ట్వా-జందె మొకటి యుండుటం జూచి, అవును, ఇది గన ఉన్నది నాకు.

శ్లో. అహూ_క్తిక మసౌవర్ణం బ్రాహ్మణానాం విభూషణమ్
దేవతానాం పితౄణాం చ భాగో యేన ప్రదీయతే. ౧౭

(ఇతి యజ్ఞోపవీతం దదాతి).

చాణ్డాలః—ఆగచ్ఛరే చారుదత్త, ఆగచ్ఛ. [ఆఅచ్ఛ లే చాలుదత్తా ఆఅచ్ఛ].

ద్వితీయః—అరే ఆర్యచారుదత్తం నిరుపపదేన నామ్నా ఆలపసి. అరే పశ్య [అలే అజ్జచాలుదత్తం ణిలువవదేణ ణామేణ ఆలవేశి. అలే, పేక్ఖ]

శ్లో. అభ్యుదయే ఽవసానే తథైవ రాత్రిందివ మహతమార్గా
ఉద్దామేవ కిశోరీ నియతిః ఖలు ప్రత్యోషితుం యాతి. ౧౮

శ్లో. ౧౭. అహూ_క్తికం = ముత్తెములది కానిదియు, అసౌవర్ణం ... = బంగారుదియు కానిదియు; యేన = దేనిచేత – అనఁగా దీనిచేత, దేవతానాం = దేవతలకు (ఉపవీతముగాను) పితౄణాం = పితరులకును (ప్రాచీనావీతముగాను) భాగః – హవ్యకవ్యములు, ప్రదీయతే – ఒసంగఁబడుచున్నది.

ఇతి యజ్ఞోపవీతం దదాతి – అని జంధెమును ఇచ్చును.

రే చారుదత్త – ఓరీ చారుదత్త. ఆర్య చారుదత్తం నిరుపపదేన నామ్నా అహ్వాయసి. అరే, పశ్య. చారుదత్తయ్యను ఓరి చారుదత్త అని 'అయ్య'ను చేర్పక పిలుచుచున్నావు! ఓరి, చూడు,

శ్లో. ౧౮. అభ్యుదయే = సంపదయందును, అవసానే = ఆపదయందును, చావునందును – తథా ఏవ = అట్లే, రాత్రిందివం = రేబవలును, అహతమార్గా = అడ్డములేని దారిగలదై పోవుచునే ఉండునదై, ఉద్దామా = కట్టుత్రాఁడు తెగిన, కిశోరీఇవ = ఆడుగుఱ్ఱపుఁబిల్లవలె ప్రత్యోషితుం = (ప్రాణిని అనుట) వడివడిగా ఎదుర్కొనుటకు, ఆక్రమించుటకు, నియతిః = విధి, యాతి ఖలు = పోవుచుండును గదా.

[అబ్భుదఏ అవశాణే తహే అ లత్తిందివం అహఁదమగ్గా
ఉద్దామే వ్వ కిశోలీ ణిఅదీ క్ఖు పడిచ్ఛిదుం జాది],

అన్యచ్చ [అణ్ణం చ],

శ్లో. శుష్కాః అపి ప్రదేశా అస్య
కిం వినమితమస్తకే కర్తవ్యమ్,
రాహుగృహీతో ఽపి చన్ద్రో
న వన్దనీయో జనపదస్య? ౨౦

[శుక్ఖా విఅ దేశా శే కిం విణమిఅమత్థఏ ణ కాఅవ్వమ్
లాహుగహిదే వి చన్దే ణ వన్దణీఏ జణపదస్స].

దార—అరే రే చాణ్డాలాః, కుత్ర మమ పితరం నయత?
[అరేరే చాణ్డాలా, కహిం మే ఆవుకం ణేధ?]

---

సంపదయందు గాని ఆపదయందు గాని - అన్ని దశలయందును అనుట, రాత్రి కాని పవలు కాని, అన్ని కాలములందును అనుట. నియతి - వాని వాని విధి. కట్టుత్రాఁడు తెగిన ఆఁడు గుఱ్ఱపుపిల్లవలె అతిత్వరితముగా ఎగిరిదూకినట్లు - అందులకే ఆఁడుగుఱ్ఱపుఁబిల్లం జెప్పుట - (మానిసిని) ఎదుర్కొనం బఱచునుగదా.

శ్లో. ౨౦. అస్య వ్యపదేశాః శుష్కాః = ఇతని కీర్తులు - పేరుప్రతిష్ఠలు, శుష్కాః = ఎండిపోయినవి. - ఈ వ్యాజ్యము విచారణ తీర్పు - వీనిచే - అనుట. (ఐనను), వినమితమస్తకం = వంచినతల ( - నమస్కారము అనుట), అనఁగా తలవంచుట, కిం న కర్తవ్యం = చేయఁబడ నక్కఱలేదా? చన్ద్రః = చందురుఁడు, రాహుగృహీతః అపి రాహువుచే పట్టఁబడినను, జనపదస్య = గ్రామమునకు - తజ్జనులకు అనుటయే, న వన్దనీయః = మొక్కవలసినవాఁడు కాఁడా?

మఖశత పరిపూత తాది పేరు ప్రతిష్ఠలు ఎండిపోయిననే మాత్రము, ఇతనికి తలవంచి నమస్కరింప వలదా. గ్రహణముపట్టిన చంద్రునికి నమస్కరింపమా?

కుత్ర నయత? = ఎక్కడికి తీసికొనిపోవుచున్నారు?

చారు—వత్స,

శ్లో. అంసేన బిభ్రత్కరవీరమాలాం
స్కన్ధేన శూలం హృదయేన శోకమ్
ఆఘాతమద్యాహ మనుప్రయామి,
శామిత్ర మాలబ్ధు మివాధ్వరే ఽజః. ౨౧

చాణ్డాలాః—దారక, [దాలకా],

శ్లో. న ఖలు వయం చాణ్డాలా శ్చాణ్డాలకులే జాతపూర్వా అపి
యే ఽభిభవన్తి సాధుం తే పాపా స్తే చ చాణ్డాలాః. ౨౨

[ణ హు అహ్మే చాణ్డాలా చాణ్డాలకులమ్మి జాదపువ్వా వి
జే అహింభవన్తి శాహుం తే పావా తే అ చాణ్డాలా].

శ్లో. ౨౧. అంసేన = బుజాన - మెడలో అన్నమాటయే - అది బుజాలకు తగులుచు వ్యాపించుచు ఉండును, కరవీరమాలాం = ఎఱ్ఱగన్నేరులమాలను, స్కన్ధేన = మూపున, శూలం = కొఱ్ఱుమానును, హృదయేన = మనసున, శోకం = దుఃఖమును, బిభ్రత్ = మోయుచున్నవాఁడనై - కలవాఁడనై, అధ్వరే = యజ్ఞమున, అజః = మేఁక, ఆలబ్ధుం - ఆలంభమును - పొందుటకు, శామిత్రం ఇవ = చంపువాడుండు చోటికిం బోలె, అద్య = ఇప్పుడు, ఆఘాతం = కొలచోటును, అనుప్రయామి = కూచిఁ పోవుచున్నాను.

యజ్ఞాన యజ్ఞపశువైన మేక చంపఁబడుటకు చంపుచోటికిం బోలె నేను కొఱుత వేయఁబడుటకు అఘాతమునకు - చంపుచోటికి పోవుచున్నాను.

సంవాదమునకు - హితోపదేశమునుండి.

ఆసన్నతరతా మేతి మృత్యుర్జన్తో ర్దినే దినే
ఆఘాతం నీయమాస్య వధ్య స్యేవ పదే పదే

శ్లో. ౨౨. (అరేరే చణ్డాలా - అని పిలిచితివి.) ఆవాం = మేము చాణ్డాలకులే జాతపూర్వా అపి = చండాలకులమున పుట్టినవారమే ఐనను, న ఖలు చాణ్డాలా = చండాలురము కాముగదా. యే = ఎవరు, సాధుం = సాధువును, అభిభవన్తి = దూషించి తిరస్కరింతురో, తే పాపాః = ఆపాపాత్ములు, చాణ్డాలాః = చండాలురు,

దారః—తత్కిమర్థం మారయత పితరమ్? [తా కీస మారేధ ఆవుకమ్?]

చాణ్డాలః—దీర్ఘాయుః, అత్ర రాజనియోగః ఖలు అపరాధ్యతి, న ఖలు వయమ్. [దీహాఉ, అత్త లాఅణిఓఓ క్ఖు అవలజ్ఝది, న ఖలు అహ్మే].

దారః—వ్యాపాదయత మామ్. ముఞ్చత పితరమ్. [వావాదేధ మమ్. ముఞ్చధ ఆవుకమ్].

చాణ్డాలః—దీర్ఘాయుః, ఏవం భణంశ్చిరం మే జీవ. [దీహాఉ, ఏవం భణన్తే చిలం మే జీవ].

చారు—(సాస్రం పుత్రం కణ్ఠే గృహీత్వా)

శ్లో. ఇదం తత్స్నేహ సర్వస్వం సమ మాఢ్యదరిద్రయోః
అచన్దన మనౌశీరం హృదయ స్యానులేపనమ్. ౨౩

---

తత్ = అట్లేని, కుతో మారయథః మీ రేల చంపుదురు? దీర్ఘాయుః = ఓరి దీర్ఘాయూ, అత్ర = ఇందు, ఈవిషయమున, రాజనియోగః ఖలు = రాజాను త్తరువుగదా, అపరాధము చేయుచున్నది - తప్పు నియోగించుటలో నున్నది. న ఆవాం = మేము కాము అపరాధము చేయువారము.

వ్యాపాదయత మాం = నన్ను చంపుఁడు. ముఞ్చత ఆవుకం = నాయనను వదలుఁడు.

ఏవం భణన్ = ఇట్లు పలుకువాఁడవుగా, చిరం మే జీవ = నాకోసము చిరకాలము బ్రదుకు. చారుదత్తుఁడు - కణ్ఠే గృహీత్వా = మెడకౌఁగిలించుకొని.

శ్లో. ౨౩. ఇదం తత్ = ఇదే అది, స్నేహసర్వస్వం స్నేహసారము - పుత్రగాత్రాలింగనము - ఆఢ్య దరిద్రయోః = సంపన్నునికిని పేదవానికిని తుల్యమైనది - అది వాని కంటె వీనికిని అంత చల్లనైనది - హృదయస్య = మనసునకును - ఉరమునకును - లోపలికిని బయటికిని సమానమైనది, అచాన్దనం = గంధముది కానిదియు, అనౌశీరం = వట్టివేరుది కానిదియు - నగు, అనులేపనమ్ పూత.

(అంసేన బిభ్రత్ X - ౨౧, ఇత్యాది పునః పఠతి. అవలోక్య స్వగతమ్. అమీహి వస్త్రాన్త X - ౧౬ ఇత్యాది పునః పఠతి.)

విదూ.—భో భద్రముఖాః, ముఞ్చత ప్రియవయస్యం చారుదత్తమ్. మాం వ్యాపాదయత. [భో భద్దముహా, ముఞ్చధ పిఅవఅస్సం చాలుదత్తమ్! మం వావాదేధ].

చారు.—శాన్తం పాపమ్. (దృష్ట్వా స్వగతమ్) అద్యావగచ్ఛామి. (సమసంస్థిత X - ౧౬ ఇత్యాది పఠతి) (ప్రకాశమ్) (ఏతాః పున ర్హర్మ్యగతాః. స్త్రియో X - ౧౧ ఇత్యాది పునః పఠతి.).

చాణ్డాలః—అపసర తార్యాః, అపసరత. [ఓశలధ అజ్జా, ఓశలధ].

---

పుత్రునికౌఁగిలి ఉరమునకు బయటికిని చల్లగా ఆప్యాయముగా నుండును, అంతరంగమునకు లోపలికిని చల్లగా ఆప్యాయముగా ఉండును. ఆఢ్యునికిని దరిద్రునికిని సమానమైనది - ఉభయులు ఒక్క విధముగా ఒక్కింతగా అనుభవింపఁదగినది - మఱి అందు గందము లేదు - వట్టివేరును లేదు.

ఇందు వాత్సల్యము పొరలి పాఱుచున్నది. చూ. ఉ. రా. చ. III.

అన్తఃకరణతత్త్వస్య దమ్పత్యోః స్నేహసంశ్రయాత్
ఆనన్దగ్రన్థిరేకో ఽయ మపత్య మితి బధ్యతే.

భోభద్రముఖాః - ఓ మంచివాండ్రా, విడువుఁడు ప్రియవయస్యుని, చారుదత్తుని. మాం వ్యాపాదయ = నన్ను చంపుఁడు.

శాన్తం పాపమ్ - నిన్ను చంపు పాపము అడంగును గాక - అదేమి మాట? అద్య అవగచ్ఛామి = ఇపుడు ఎఱుంగుచున్నాను.

శ్లో. కిం పశ్యత సత్పురుష మయశోవశేన ప్రణష్టజీవాశమ్,
కూపే ఖణ్డితపాశం కాఞ్చనకలశ మివ మజ్జన్తమ్. ౨౮

[కిం పేక్ఖధ శప్పులిశం అజశవశేణ ప్పణట్టజీవాశమ్
కూవే ఖణ్డిదపాశం కఞ్చణకలశం వ్విడుబ్బన్తమ్].

(చారుదత్తః సకరుణమ్ 'శశివిమలమయూఖ' X - ౧౩
ఇత్యాది పఠతి)

అపరః—అరే, పున రపి ఘోషయ. (చాణ్డాల స్తథా కరోతి) [అలే, పుణో వి ఘోశేహి].

చారు—

శ్లో. ప్రాప్తో౽హం వ్యసనకృశాం దశా మనార్యాం
య త్రేదం ఫల మపి జీవితావసానమ్
ఏషా చ వ్యథయతి ఘోషణా మనో మే
శ్రోతవ్యం య దిద మసౌ మయా హ తేతి. ౨౯

---

శ్లో. ౨౮. అయశోవశేన = అపకీర్తికారణముగా - ప్రణష్ట - జీవాశం = నాశనమైన బ్రదుకునాసగలవానిని, సత్పురుషం = (ఈ) సజ్జనుని, కూపే = బావిలో, ఖణ్డితపాశం = తెగిన చేంతాడుగలిగి, మజ్జన్తమ్ = మునుఁగుచున్న, కాఞ్చనకలశం ఇవ = బంగారు కుండవలె, ఉన్నవానిని, కింపశ్యథ = ఏమి చూచెదరు - బావిలో చేంతాఁడు తెగిన బంగారుకుండ మునిఁగి అడుగునకు పోకుండునా - దానిని ఎవరు తప్పింపఁగలరు ? అట్లు మునుఁగుచున్నాఁడు చారుదత్తుఁడు, అపయశముచే జీవితాశ వదలుకున్నవానిని ఏమి చూచెదరు - తప్పింప ఉపాయమే లేదే - అపసరత - పొండు.

శ్లో. ౨౯. అహం = నేను. వ్యసనకృశాం = లేమిడిచేత హీనమైనదియు, అనార్యాం = పరువుమాలినదియు నగు, దశాం = గతిని, ప్రాప్తః = పొందితిని. యత్ర = ఎందు అనఁగా అందు, ఇదం జీవితావసానం అపి = ఈ చావుసయితము,

(తతః ప్రవిశతి ప్రాసాదస్థో బద్ధః స్థావరకః)

స్థావరకః—(ఘోషణా మాకర్ణ్య సవైక్లబ్యమ్) కథం! అపాప శ్చారుదత్తో వ్యాపాద్యతే. అహం నిగడేన స్వామినా బద్ధః. భవతు. ఆక్రన్దామి. శృణుత ఆర్యాః, శృణుత. అ స్తీదానీం

---

ఫలం = ఫలము (ఐనది) (అంతంబోక), అసౌమయామా తా ఇతి = ఈమె నా చేత చంపఁ బడినది, ఇతి = అని, యత్ ఇదం శ్రోతవ్యం = ఏయిది వినవలసిన వచ్చినదో, ఏషా ఘోషణా = ఈచాటింపు, మేమనః = నామనసును, వ్యథయతి = వెత పెట్టు చున్నది.

ఈ లేమిడిచే ఎంతయు హీనమైతిని, పరువుకోలుపోయితిని నాదశ అట్టిదిఐనది. తూదకుదానికి ఫలముగా ఈచావును వచ్చినది. అంతంబోక, ఈ మెను నేను చంపితిని అను ఈచాటింపు వినవలసి వచ్చినదే - దానికి ఎంతేని వెత చెందుచున్నాను.

తతః ప్రవిశతి ప్రాసాదస్థః బద్ధః స్థావరకః - అంతట బంగాళాలో ఉండువాఁడు, (చేతులకాళ్లు సంకెలం) కట్టఁబడినవాఁడు స్థావరకుఁడు - శకారుని చేటుఁడు ప్రవేశించుచున్నాఁడు. అనఁగా అట్టివాఁడుగా రంగాన ప్రేక్షకులకుం గనఁబడుచున్నాఁడు - అనఁగా ప్రాసాదమును అందు వాఁడు అట్లున్నట్లును అగపడవలెను - ఇప్పటి రంగ నిర్మాణ నిపుణులు అట్టి దృశ్యములను ఎంతయుం నిజమని తోఁచునట్లుగా అట్లే చూపఁగలరు. మఱి యాకాలమున శూద్రకకవి దీనిని భావించినపుడు ఎట్లు చూపఁబడెనో. మఱి అట్టివాఁడు ప్రేక్షకులకు అగపడుచు మాటలాడుచు ఉన్నాఁడు.

ఘోషణాం ఆకర్ణ్య = చాటింపును విని - ఇపుడు చారుదత్తుని శ్మశానమునకైన ఊరేగింపు చండాలురు జరుపుచుండునది, ప్రేక్షకపౌరజనముతో నిండినది సంస్థానకు నింటి చేరువునకు వచ్చినది.

సవైక్లబ్యం = దుఃఖముతో అవయవములు విలవిలపోవుచుండ, కథం = ఎట్లా - ఎట్లోకదా! అపాపః చారుదత్తః వ్యాపాద్యతే = ఏపాపము లేనివాఁడు చారుదత్తుఁడు చంపఁబడుచున్నాఁడే! అహం నిగడేన స్వామినా బద్ధః - నేను సంకెలతో (మా) దొరచే - శకారునిచే - కట్టివేయఁబడితిని. భవతు = కానీ - ఆక్రన్దామి = అఱచెదను - శృణుత ఆర్యాః = వినుఁడు అయ్యలారా, వినుఁడు -

మయా పాపేన ప్రవహణపరివర్తేన పుష్పకరణ్డకజీర్ణోద్యానం వసన్త సేనా నీతా. తతో మమ స్వామినా మాం న కామయస ఇతి కృత్వా బాహుపాశబలాత్కారేణ మారితా. న పున రేతే నార్యేణ. కథమ్ విదూరతయా న కోఽపి శృణోతి! త త్కిం కరోమి? ఆత్మానం పాతయామి. (విచిన్త్య) య ద్యేవం కరోమి, త దార్యచారుదత్తో న వ్యాపాద్యతే. భవతు. అస్యాః ప్రాసాద బాలాగ్రప్రతోళికాత ఏతేన జీర్ణగవాక్షే ణాత్మానం నిక్షిపామి. వర మహ ముపరతః, న పున రేష కులపుత్రవిహగానాం వాస పాదప ఆర్యచారుదత్తః. ఏవం యది విపద్యే, లబ్ధో మయా పర లోకః. (ఇ త్యాత్మానం పాతయిత్వా) ఆశ్చర్యమ్! నోపరతో ఽస్మి. భగ్నో మే దణ్డనిగడః. త చ్చాణ్డాలఘోషం సమన్విష్యామి హంహో, చాణ్డాలాః, అన్తర మన్తరమ్.

---

అస్తి – విషయము చెప్పఁదొడంగు వాక్యాలంకారపు మాట. ఇదిగో ఇపుడు ఇటు చూడుఁడు! మయా పాపేన ... = పాపుఁడనైన నాచేత, బండి మాఱుపాటు చేత, పుష్పకరండక జీర్ణోద్యానమునకు వసంతసేన కొనిపోఁబడినది. తతః మమ స్వామినా ... = అంతట నాదొరచేత, నన్ను కామింపవటే అని కారణము చెప్పి, పగ్గములంబోని బాహువులతో బలవంతముగా గొంతుపిసికి చంపఁబడినది. మఱి ఈ యయ్యచేత కాదు. కథమ్ = ఎట్లబ్బా! విదూరతయా ... = చాల దూరమగుటచే (నామాటలు) ఎవరును వినుటలేదు. కావున మఱి ఏమి చేయుదును? ఆత్మానం పాతయామి = నన్ను క్రిందికి త్రోసికొందును. (ఆలోచించుకొని) యద్యేవం ... = ఇట్లు చేయుదునేని చారుదత్తయ్య చంపఁబడకపోవును. భవతు = కానీ. అస్యాః ప్రాసాదబాలాగ్ర ... = బంగాళామిద్దెమీది క్రొత్త మందరితట్టున్న కొట్టునుండి, ఏతేన జీర్ణగవాక్షేణ = ఈ చివికిపొయిన పాతకిటికీగుండా, నన్ను క్రిందపడవేసికొందును – క్రిందికి పడెదను. వరం అహం ఉపరతః = నేను చచ్చినను మేలే – ఫర్వాలేదు. న పునః ఏషః ... = మఱి యితఁడు, గొప్పవారు – కులానపుట్టినవారు – అను పక్షులకు, వాసపాదపః = కాపురపు చెట్టు – ఎల్లరకు ఆశ్రయ మిచ్చువాఁడు, చారుదత్తయ్య (చావ) కూడదు. ఏవం యది విపద్యే ... =

[కధం! అపావే చాలుదత్తే వావాదీఅది. హగ్గే ణిఅలేణ శామిణా బన్ధిదే. భోదు. ఆక్కన్దామి. శుణాధ అజ్జా, శుణాధ. అత్థి దాణిం మప పావేణ పవహణపడివత్తేణ పుప్ఫకలణ్డఅ జిణ్ణుజ్జాణం వసన్తశేణా ణీదా. తదో మమ శామిణా మం ణ కామేశి త్తి కదుఅ బాహుపాశబలక్కాలేణ మాలిదా, ణ ఉణ ఏదిణా అజ్జేణ. కధమ్ విదూలదాఏ ణ కో వి శుణాది! తా కిం కలేమి? అత్తాణఅం పాడేమి. జఇ ఎవ్వం కలేమి, తదా అజ్జచాలుదత్తే ణ వావాదీఅది. భోదు. ఇమాదో పాశాదబాలగ్గపదోళికాదో ఏదిణా జిణ్ణగవక్ఖేణ అత్తాణఅం ణిక్ఖిపామి. వలం హగ్గే ఉవలదే, ణ ఉణ ఏశే కులపుత్తవిహగాణం వాశపాదవే అజ్జచాలుదత్తే. ఎవ్వ జఇ విపజ్జామి, లద్ధే మప పలలోఏ. హీ హీ! ణ ఉపలదమ్హి. భగ్గే మే దణ్డణిఅలే. తా చాణ్డాలఘోశం శమణ్ణేశమి. హంహో చాణ్డాలా, అన్తలం, అన్తలమ్.].

చాణ్డాలా—అరే, కో ఉన్తరం యాచతే? [అలే, కే అన్తలం మగ్గేది?]

(చేటః—శుణాధ ... ఇతి పూర్వోక్తం పఠతి)

చారు—అయే!

---

ఇట్లు నేను చత్తునేని నాకు (ఉత్తమ) పరలోకము కలుగును. ఇతి ఆత్మానం పాతయిత్వా = అట్లు తన్ను పడవైచికొని - క్రిందికి దుముకి - హీ హీ - సంతోషము! న ఉపరతః అస్మి = చావనైతిని. (అంతియ కాదు) నాకు దండనగా వేసిన సంకెల విఱిగిపోయినది - (కావున నడువఁగలిగితిని). తత్ చణ్డాలఘోషం = ఆచండాలుర చాటింపును వెదకెదను. ఓమాదిగలారా, సందు - సందు - దారి దారి. అని చేటుఁడు - వినుఁడు అయ్యలారా ... = ఇత్యాది, మునుపుచెప్పినదానిని మరల చెప్పుచున్నాఁడు.

అయే - అహో, ఆశ్చర్యము.

శ్లో. కో ఽయం ఏవంవిధే కాలే, కాలపాశస్థితే మయి
అనావృష్టిహతే సస్యే ద్రోణమేఘ ఇవోదితః! ౨౮

భోః, శ్రుతం భవద్భిః?

శ్లో. న భీతో మరణా దస్మి కేవలం దూషితం యశః
విశుద్ధస్య హి మే మృత్యుః పుత్రజన్మసమో భవేత్. ౨౭

---

శ్లో. ౨౮. కః అయం = ఎవఁ డితఁడు! ఏవంవిధే కాలే = ఇట్టి సమయమందు - మయి కాలపాశస్థితే = నేను యముని పాశమున (కట్టఁబడి) ఉండఁగా, అనావృష్టి హతే సస్యే = వఱపుచే పైరు చావఁగా, ద్రోణమేఘఇవ = (దోనెలుగా వానకురియు) ద్రోణము అను మేఘమువలె, ఉదితః = బయటికి వచ్చినాఁడే! లేచినాఁడే!

ద్రోణము అని ఒకానొక మేఘమునకు పేరు అని అందురు - కడవలు దోనెలుగా - కుంభవృష్టి ద్రోణవృష్టి అనియుం అందురు. దోనెతో కుమ్మరించినట్లు కురియు వాన. నేను వసంతసేనం జంపితి ననుటకు తృప్తికరమగు సాక్ష్యమే లేక, ఉన్నంతలో ఎన్నియో పొరపాట్లు సందేహాస్పదములును ఉండఁగా, నిర్ణయము అసాధ్యమే కాఁగా, అధికరణికులు అనిపుణముగా - రాజునకు రాజుమఱఁదికిని వెఱచి ఇట్లు నిర్ణయము చేయఁగా, వీఁడుగో, ఆహత్యను ప్రత్యక్షముగా చూచిన సాక్షి - ప్రత్యక్షపుమాటం జెప్పుచున్నాఁడు. వ్యభిచారము సందియము తప్పాట - లేని రుజువు - కావున వాని రాకను తన పాలిటికి, వాడి యెండిన పైరునకు ద్రోణవృష్టివోలె, సకలసందియములందొలఁచి శూలారోపణము తప్పించి బ్రదికించి వికసింపఁజేయున దగును అను ఊఱటమాట - కోఽయం - ఇత్యాది.

ద్రోణమేఘము - చూ. జ్యోతిషతత్త్వమున -

ఆవర్తో నిర్జలో మేఘః సంవర్తశ్చ బహూదకః
పుష్కరో దుష్కరజలో ద్రోణః సస్యప్రపూరకః.

భోః - ఓమాదిగలారా, (ఓపౌరులారా,) శ్రుతం భవద్భిః - విన్నారా) మీరు - (వినఁబడినదా మీచేత)

శ్లో. ౨౭. మరణాత్ న భీతః అస్మి = చావువలన భయపడినవాఁడఁగాను, కేవలం యశః = యశము - నా పేరొక్కటే - నిందపాలైనది - నాయశమం

అన్యచ్చ,

శ్లో. తేనా స్మ్యకృతవైరేణ క్షుద్రేణాత్యల్పబుద్ధినా
శరేణేవ విషాక్తేన దూషితేనాపి దూషితః. ౨౫

చాణ్డాలౌ—స్థావరక, అపి సత్యం భణసి? [ థావలఅ, అవి శచ్చం భణాశి? ]

తరయు మూసినది - అని దానికి భీతుఁడను ఐతిని. విశుద్ధస్య = నిందలేనివాఁడనైన, మే = నాకు, మృత్యుః = చావు, పుత్రజన్మసమో భవత్ హి = కొడుకుపుట్టుటతో సమానమగును గదా.

నేను చంపలేదు వసంతసేనను. చంపితి నన్న అపయశము వచ్చినది - అది తొలఁగిన నాకు చావు కొడుకుపుట్టుటతో సమానము. అంత సంతోషావహము. నన్ను వలచి, నాకై, ప్రాణము బలాత్కారమరణమున పోఁగొట్టుకొన్న వసంతసేన లేక నాకేల బ్రదుకు? అందులకైన, చావు మఱి పుత్త్రింగాంచినంత సంతోషకరము.

శ్లో. ౨౫. అకృతవైరేణ = నాచేత నేమియు తనకు వైర(కార్య)ము చేయఁబడనివాఁడును, క్షుద్రేణ = నీచుఁడును, అత్యల్పబుద్ధినా = చాలతక్కువ బుద్ధిగలవాఁడును - మంచిచెబ్బరలు ఎఱుంగు వివేకము లేనివాఁడును, దూషితేన = జాతిశీలాదిహీనుఁడును వసంతసేనను, తన చేతితో చంపిన దోషముగలవాఁడును - ఐన, తేన = వానిచేత - శకారునిచేత, విషాక్తేన శరేణ ఇవ = విషముపూసిన బాణముచేతంబోలె, దూషితః అస్మి = మలినము చేయఁబడినవాఁడను, చంపఁబడిన వాఁడను అగుచున్నాను.

నేను వానికేమియు కానిపని, అపకారము, చేసినవాఁడఁ గాను. వాఁడు నీచుఁడు అవివేకి, జాతిశీలహీనుఁడు, వసంతసేనం జంపినవాఁడును - (ఇపుడు చేటుని మాటచే రుజువు ఐనది), అట్టివానిచేత నేను మలినము చేయఁబడి చంపఁబడితిని. వాఁడు విషముపూసిన బాణమైనాఁడు. విషము దేహాన చొచ్చి మైకమును చావును కలిగించును కదా.

చేటః—సత్యమ్. అహ మపి మా క స్యాపి కథయిష్యసీతి ప్రాసాదబాలాగ్రప్రతోళికాయాం దణ్డనిగడేన బద్ధ్వా నిక్షిప్తః. [సచ్చమ్. హగ్గే వి మా కశ్శ వి కధఇశ్శశి త్తి పాశాద బాలగ్గ పదోళికాఏ దణ్డణిఅలేణ బన్ధిఅ ణిక్ఖిత్తే]

(ప్రవిశ్య)

శకారః—(సహర్షమ్)

శ్లో. మాంసేన తిక్తామ్లేన భక్తం
శాకేన సూపేన సమత్స్యకేన
భుక్తం మ యాత్మనో గేహే
శాలీయకూరేణ గుడౌదనేన ౨౯

---

అపి సత్యం భణసి - నిజము చెప్పుచున్నావా ? సత్యం = సత్యము! అహం అపి ... = నేనును 'ఎవ్వరికి చెప్పకుందువు గాక' అని ప్రాసాదబాలాగ్ర ప్రతోళికలో దండనకైన, లేక కాలిని ఇచ్చమెయి ముడువనీక చాపనీక కట్టిన కొయ్య సంకెలతో కట్టి పడవేసి పెట్టఁబడితిని.

చారుదత్తుని చావుటూఁరేగింపు రాజవీథిలో రాష్ట్రియుని యింటిచెంతకు వచ్చినట్లున్నది. చేటుఁడు చాటింపు విని దూకినాఁడు, శకారుఁడును తనకు సంతోషమును వినోదమును కలిగించునదైన గొప్ప భోజనముచేసి ఐన త్రేనుపులతో విచారించి చూచుటకు వచ్చుచున్నాఁడు.

శ్లో. ౨౯. మయా = నాచేత, ఆత్మనః గేహే = నాయింటిలో, మాంసేన = మాంసముతోను తిక్తామ్లేన = చేదును పులుసునైన, సమత్స్యకేన = చేపలతో కూడిన, శాకేన - పొట్లబెండ మొదలగు శాకములతో, సూపేన = పప్పుతోను, భక్తం = అన్నము - శాలీయకూరేణ = వరియన్నముతోను, గుడౌదనేన = బెల్లపు - అన్నముతోను - ఇవి అన్నమునకు శకారుని బడాయి పునరుక్తులు. భుక్తం = భోజనము చేయఁబడినది.

[ మంశేణ తికామిలకేణ భత్తే
శాకేన శూపేణ శమచ్ఛకేణ
భుత్తం మఏ అత్తణఅశ్శ గేహే
శాలిశ్శకూలేణ గుళోదణేణ. ]

భిన్నకాంస్యవత్ ఖజ్ఝణాయా శ్చాణ్డాలవాచాయాః స్వరసంయోగః. యథా చైష ఉద్ఘోషో వధ్యడిణ్డిమశబ్దః పటహానాం చ శ్రూయతే, తథా తర్కయామి, దరిద్రచారుదత్తకో వధ్యస్థానం నీయత ఇతి. త త్ప్రేక్షిష్యే. శత్రువినాశో నామ మమ మహాన్ హృదయస్య పరితోషో భవతి. శ్రుతం చ మయా — యో ఽపి కిల శత్రుం వ్యాపాద్యమానం పశ్యతి, త స్యాన్యస్మి ఞ్జన్మాన్తరే ఽక్షిరోగో న భవతి. మయా ఖలు విషగ్రన్థిగర్భప్రవిష్టే నేవ కీటకేన కి మ ప్యన్తరం మృగయమాణే నోత్పాదిత స్తస్య దరిద్రచారుదత్తస్య వినాశః. సాంప్రత మాత్మీయాయాం ప్రాసాదబాలాగ్రప్రతోళికాయా మధిరు హ్యాత్మనః పరాక్రమం పశ్యామి. (తథా కృత్వా, దృష్ట్వాచ) హీ హీ, ఏతస్య దరిద్రచారుదత్తస్య వధ్యం నీయ

---

నేను మాయింటి మాంసముతోను చేఁపలతోను పప్పుతోను కాయకూరలతోను బెల్లముతోను వరియన్నము తింటిని.

కర్ణాందత్వా = చెవియొగ్గి - నటునికి ఎచ్చరిక.

భిన్న కాంస్య ఖజ్ఝణాయాః=పగిలిన కంచువలె, ఖం ఖణ యను, చణ్డాలవాచః స్వరసంయోగః = చండాలుర మాటలగొంతుసవ్వడి - ఉత్తాలితః = ఉత్కటమైన - బిగ్గరయైన, వధ్యడిండిమశబ్దః = చంపుటకైన డప్పుమ్రోఁత, పటహానాం = తప్పెటలయు - మ్రోఁత, తథా చ ఏషః శ్రూయతే - ఇదిగో వినఁబడుచున్నందున (= యథా), తథా తర్కయామి = దాన ఊహింతును - దరిద్రచారుదత్తుఁడు కొలచోటికి కొనిపోఁబడుచున్నాఁడు అని, కావున దానిని చూతును. శత్రువినాశో నామ ... = శత్రువుయొక్క చావు అనఁగా, మమ మహాన్ ... = నాకు మనస్సునకు గొప్ప సంతోషము కలుగును. శ్రుతంచ

మానస్య ఏతావా జ్జనసంమర్దః, యస్యాం వేలాయా మస్మాదృశః ప్రవరో వరమనుష్యో వధ్యం నీయతే, తస్యాం వేలాయాం కీదృశో భవేత్ ? కథమ్! ఏష స నవబలీవర్ద ఇవ మణ్డితో దక్షిణాం దిశం నీయతే. అథ కిన్నిమిత్తం మదీయాయాః ప్రాసాదబాలాగ్ర ప్రతోలికాయాః సమీపే ఘోషణా నిపతితా, నివారితా చ (విలోక్య) కథమ్! స్థావరక శ్చేటో ఽపి నా స్తీహ. మా నామ తే నేతో గత్వా మన్త్రభేదః కృతో భవిష్యతి. త ద్యావ దేన మన్విష్యామి.

(ఇ త్యవతీ ర్యోపసర్పతి.

[ భిణ్ణకంశ ఖఙ్ఖణాఏ చాణ్డాలవాఆఏ శలశంజోఏజధా అ ఏశే ఉక్కాలిదే వజ్ఝడిణ్డిమశద్దే పడహాణం అ శుణీఅది, తధా తక్కేమి. దలిద్దచాలుదత్తాకే వజ్ఝట్ఠాణం ణీఆది త్తి. తా పేక్ఖిశ్శమ్. శత్తు విణాశే ణామ మమ మహన్తే హాలక్కేశ్శ పలిదోశే హోది. శుదం అ మఏ, జే వి కిల శత్తుం వావాదఅన్తం పేక్ఖది, తశ్శ అణ్ణశ్శిం జమ్మన్తలే అక్ఖిలోగే ణ హోది. మఏ క్ఖు విశగణ్ఠిగబ్భపవిట్ఠేణ

---

మయా - నేను వినియు ఉన్నాను. ఎవఁడు శత్రువును చంపఁబడుచున్నవానిని - చంపఁబడుచుండఁగా అనుట - చూచునో, వానికి రాఁగల జన్మాన కంటిరోగము రాదు అని. విషగ్రన్థిప్రవిష్టేన ... = విషపు ముడిలో - ముష్టినాభిగణుపులో - చొచ్చిన పురువు ఏదియో దారివెదకుచున్నట్లు నాచేత వాని వినాశమునకు ఏదియో సందు - దారి - కలిగింపఁబడినది - వసంతసేనహత్య - అధికరణక వ్యవహారము, నేరమురుజువు - దండన - అనునది. సాంప్రతం ఆత్మీయాయాం ... = ఇప్పుడు నాదైన ... = ప్రతోళికయందు, ఎక్కి, నా పరాక్రమమును - అది కావించినపనిని - చారుదత్తవధను - చూచెదను, హి హి హి - ఈదరిద్రచారుదత్తుని చంపంగొనిపోఁ బడువానికి, ఇంత పెద్ద జనులగుంపే. యాం వేళాం ... = ఏవేళలో నా బోఁటివాఁడు గన కొలచోటికి కొనిపోఁబడునేని, ఆవేళలో ఎట్టిది - ఇంకను ఎంత పెద్దగుంపు అగునో. కథమ్ = ఎట్టూ! ఏష సః నవ బలీవర్ద ఇవ ... = వీఁడుగో వాఁడు, కొత్త ఎద్దువలె అలంకరింపఁబడి దక్షిణపు దిక్కునకు కొనిపోఁబడుచున్నాఁడు, ప్రతోళికచెంత చాటింపు ఆఁగినది, వారింపను బడినది.

విలకీడఏణ కిం పి అన్తలం మగ్గమాణేణ ఉప్పాడిదే తాహ దలిద్ద చాలుదత్తాహ విణాశే. శంపదం అత్తణకేలికాఏ పాశాదబాలగ్గ పదోళికాఏ అహిలుహిఅ అత్తణో పలక్కమం పేక్ఖామి హీ హీ, దలిద్దచాలుదత్తాహ వజ్ఝం ణీఅమాణాహ ఏవడ్డే జణశంమదే, జం వేలం అమ్హాలిశే పబలే వలమణుశ్శే వజ్ఝం ణీఅది తం వేలం కీదిశే భవే. కథమ్. ఏశే శే ణవబలద్దకే విఅ మణ్డిదే దక్ఖిణం దిశం ణీఅది. అధ కింణిమిత్తం మమ కేలికాఏ పాశాదబాలగ్గపదోళికాఏ శమీవే ఘోశణా ణివడిదా, ణివాలిదా అ. ... కథమ్! థావలకే చేడే వి ణత్థి ఇధ. మా ణామ తేణ ఇదో గదుఅ మన్తభేదే కడే భవిశ్శది. తా జావ ణం అణ్ణేశామి].

చేటః—(దృష్ట్వా) భట్టారకాః, ఏష స ఆగతః. [భట్టాలకా, ఏశే, శే ఆగదే].

చాణ్డాలౌ—

శ్లో. అపసరత దత్త మార్గం,
ద్వారం పిధత్త, భవత తూష్ణీకాః
అవినయతీక్ష్ణవిషాణో
దుష్టబలీవర్ద ఇత ఏతి. 30

కథమ్ = ఎట్టా!...చేటుఁడును ఇక్కడలేఁడు. మా నామ తేన ఇతో గత్వా ... = వానిచేత ఇక్కడినుండి పోయి - మన్త్రిభేదః - రహస్యము వెలువరించుట చేయఁబడదు గదా. తద్యావత్ ... = కావున వానిని వెదకెదను. ఇత్యావతీర్య - అని దిగి (జనమును) సమీపించుచున్నాఁడు.

భట్టారకాః ఏష స ఆగతః = దొరలారా, వీఁడుగో అతఁడు వచ్చినాఁడు.

శ్లో. 30. అపసరత = తొలఁగుఁడు. మార్గం దత్త = దారి యిండు. ద్వారం = వాకిలి, పిధత్త = మూయుఁడు - తూష్ణీకాః = ఏమియు మాటలాడక ఊరకుండువారుగా, భవత = కండు. అవినయ తీక్ష్ణ విషాణః = పొగరు అను వాడి కొమ్ముగలది, దుష్టబలీవర్దః = పోకిరి యెద్దు, ఇత ఏతి = ఇటువచ్చుచున్నది.

[ఓశలధ దేధ మగ్గం
దాలం ధ కే్కధ హోద తుణ్హీఆ
అవిణ అతిక్ఖవిశాణే
దుట్ఠబఇల్లే ఇదో ఏది ].

శకా—అరే అరే అన్తర మన్తరం దత్త. (ఉపసృత్య) పుత్రక స్థావరక చేట, ఏహి గచ్ఛావః. [అలే అలే, అన్తలం అన్తలం దేధ. పుత్తకా ధావలకా చేడా, ఏహి, గచ్ఛమ్హ ].

చేటః—హీ హీ అనార్య, వసన్తసేనాం మారయిత్వా న పరితుష్టో ఽసి. సాంప్రతం ప్రణయిజనకల్పపాదప మార్యచారుదత్తం మారయితుం వ్యవసితో ఽసి. [హీ హీ అణజ్జ, వశన్తశేణిఅం మాలిఅ ణ పలితుట్ఠేశి. శంపదం పణఇజణకప్పపాదవం అజ్జచాలుదత్తం మాలఇదుం వవసిదేశి ].

శకా—న హి రత్నకుంభసదృశో ఽహం, స్త్రియం వ్యాపాదయామి.

---

శకారుఁడు తమ్ము సమీపించుటను చండాలురు చెప్పుచున్నారు - ఇట్లు ఆ యూరిలో అందఱికిని వాని పొగరు వాని యపకారము ఎంతయు అనుభూతచరము. చండాలురు అనుచున్నారు - తొలఁగుఁడు, దారియిండు, (అంతట) వాకిలి - దారి - మూయుఁడు. గప్ చుప్! ఊరకమాట పలుకక లేక ఉండుఁడు, పొగరు కొన్న వాడికొమ్ముల పోకిరియెద్దు ఇటు వచ్చుచున్నది!

ఇది చండాలుర అనుభవమైన శకారుని తెలుఁగు. పుత్రక స్థావరక ... = చాల బుజ్జగింపుతోఁ బోలె పలుకుట. మఱి వాఁడు చాలకాలపు నౌకరు వీనిని చక్కఁగా ఎఱుంగును, అనార్య, వసన్తసేనాం ... = దుర్జనుఁడా, వసంతసేనను చంపి తృప్తిపడినవాఁడవు కావు. ఇపుడు అర్థిజనకల్ప వృక్షమైన - కోరిన వారికి కోరినట్లు ఇచ్చు ఈవిప్రమూర్తియైన, చారుదత్తం మారయితుం వ్యవసితః - చారుదత్తుం జపింపఁబూనితివి. న హి రత్నకుమ్భసదృశః ... = రతనాలకుండం బోలిన వాఁడను నేను స్త్రీని చంపను.

సర్వే—అహో త్వయా మారితా, నార్యచారుదత్తేన, [అహో తువ మాలిదా, ణ అజ్జచాలుదత్తేణ].

శకా—క ఏవం భణతి? [కే ఎవ్వం భణాది?]

సర్వ—(చేట ముద్దిశ్య) న న్వేష సాధుః. [ణం ఏసో సాహూ].

శకా—(అపవార్య, సభయమ్) హన్త, కథం, స్థావరక శ్చేటః సుష్ఠు న మయా సంయతః. ఏష ఖలు మ మాకార్యస్య సాక్షీ. (విచిన్త్య) ఏవం తావత్ కరిష్యామి. (ప్రకాశమ్) అలీకం భట్టారకాః. అహో ఏష చేటః సువర్ణచోరికయా మయా గృహీత స్తాడితో మారితో బద్ధశ్చ. త త్కృతవైర ఏవ య ద్భణతి కిం సత్యమ్? (అపవారితకేన చేటస్య కటకం ప్రయచ్ఛతి. స్వైరకమ్) పుత్రక, స్థావరక చేట, ఏత ద్గృహీ త్వాన్యథా భణ.

---

పౌరులందరు అనుచున్నారు - అయ్యో, త్వయా మారితా ... = నీచేత చంపఁబడినది, చారుదత్తయ్యచేత కాదు. నను ఏష సాధుః = ఓయీ వీఁడుగో ఈ సాధువు. అపవార్య - ఇతరులకు తొలఁగి - వారు వినకుండ - ఆత్మగతము అనుటయే. హన్త = అయ్యో! కథం = ఎట్టూ! స్థావరకచేటః సుష్ఠు న మయా ... = చేటుఁడు స్థావరకుఁడు, చక్కఁగా గట్టిగా - నాచేత కట్టివేయఁబడ లేదు. ఏష ఖలు ... = వీఁడు కదా నాయకార్యమునకు (ఒక్కఁడే ఐన) సాక్షి. ఆలోచించి, సరి ఇట్లుగన చేయుదును. అలీకం భట్టారకాః ... = దొరలారా - అయ్యలారా, అసత్యము - అహో ఏష చేటః ... = ఆహా - ఈచేటుఁడు బంగారు దొంగతనముచేత - దొంగిలించినాఁడని - నాచేత పట్టుకొనఁబడి కొట్టఁబడి చంపఁబడి కట్టివేయఁబడినాఁడు. తత్ కృతవైరః ... = అందుచేత పగబూని వీఁడు ఏదిచెప్పునో అది సత్యమా? అపవారితకేన ... ఇతరులకు (రంగాన) తెలియనీకుండ చేటునికి మురుగు ఇచ్చుచున్నాఁడు. స్వైరకమ్ = నెమ్మదిగా, పుత్రక ... = అబ్బాయి స్థావరకచేటా, దీనిని తీసికొని వేఱువిధముగా చారుదత్తునిమీఁద చెప్పు.

[ అవిదమాదికే, అవిదమాదికే, కధం ధావలకే చేడే శుస్తుణ్ణా మప శంజదే - ఏశే క్ఖు మమ అకజ్జశ్శ శక్ఖీ. ఎవ్వం దావ కల ఇశ్శమ్. అలీఅం భట్టాలకా, హం హో, ఏశే చేడే శువణ్ణచోలి ఆప మప గహిదే పిట్టదే మాలిదే బద్ధే అ. తా కిదవేలే ఏశే జం భణాది కిం శచ్చమ్. ... పుత్తకా ధావలకా చేడా, ఏదం గేణ్హిఅ అణ్ణధా భణాహి ].

చేటః—(గృహీత్వా) పశ్యత పశ్యత భటారకాః. అహో సువర్ణేన మాం ప్రలోభయతి. [ పేక్ఖధ పేక్ఖధ భటాలకా, హంహో శువణ్ణేణ మం పలోభేది ].

శకా—(కటక మాచ్ఛిద్య) ఏతత్ తత్ సువర్ణకమ్, యస్య కారణా న్మయా బద్ధః. (సక్రోధమ్) హంహో చాణ్డాలాః, మయా ఖలు ఏష సువర్ణభాణ్డారే నియుక్తః, సువర్ణం చోరయన్ మారిత స్తాడితః. త ద్యది న ప్రత్యయధ్వం తదా పృష్ఠం తావ త్పశ్యత. [ ఏశే శే శువణ్ణకే, జశ్శ కాలణాదో మప బద్ధే. హం హో చాణ్డాలా, మప క్ఖు ఏశే శువణ్ణభణ్డాలే ణిఉత్తే శువణ్ణం చోల అన్తె మాలిదే పిట్టదే. తా జది ణ పత్తిఆఅధ, తా పిశిటం దావ పేక్ఖధ ].

---

చేటుఁడు దానిని పుచ్చుకొని, పశ్యత ... = చూడుఁడు దొరలారా - బంగారుతో నన్ను (నాకు అనుట) ఆసపెట్టుచున్నాఁడు. చేటుఁడు దానిం జూపి జనులకు ఆమాటచెప్పఁగానే - కటకం ఆచ్ఛిద్య = మురుగును పెఱుకుకొని, ఏతత్ తత్ ... = ఇదే ఆబంగారు మురుగు దేనికొఱకు నాచేత కట్టి వేయఁబడినాఁడో. సక్రోధమ్ = కోపముతో - హంహో చణ్డాలా ... = ఓహోయి చండాలులారా, నాచేత వీఁడు బంగారులు పెట్టు గదిలో (కావలికి) నియోగింపఁబడినాఁడు - ఉండుమని ఏర్పాటు చేయఁబడినాఁడు. బంగారు దొంగిలించుచో కొట్టఁబడినాఁడు, చంపఁబడినాఁడు. తత్ యది ... = అది నమ్మరేని అప్పుడు వాని వీపు గన చూడుఁడు. శోభనం భణతి = చక్కఁగా చెప్పినాఁడు - నిజమే. వాతలు వేయఁబడిన చేటుఁడు ఏమి పలవరింపఁడు ?

చాణ్డాలౌ—(దృష్ట్వా) శోభనం భణతి. విత్తప్త శ్చేటః కిం న ప్రలపతి? [శోహణం భణాది. విత్తత్తే చేడే కిం ణ ప్పలవది?]

చేటః—హన్త, ఈదృశో దాసభావః, యత్సత్యం క మపి న ప్రత్యాయయతి. (సకరుణమ్) ఆర్య చారుదత్త. ఏతావా న్మే విభవః. [హీమాదికే ఈదిశే దాశభావే, జం శచ్చం కం పి ణ పత్తిఆఅది. అజ్జచాలుదత్త, ఎత్తికే మే విహవే.]

(ఇతి పాదయోః పతతి.

చారు—(సకరుణమ్)

శ్లో. ఉత్తిష్ఠ భో పతితసాధుజనానుకమ్పిన్
నిష్కారణోపగతబాన్ధవ ధర్మశీల
యత్నః కృతే ఽపి సుమహా న్మమ మోక్షణాయ
దైవం న సంవదతి, కిం న కృతం త్వయాద్య. ౩౧

ఈదృశః దాసభావః = దాస్యము ఇట్టిది - దాసుని నిజమును అబద్ధము - దొరది అబద్ధమును నిజము! యత్ సత్య = నిజముగా నేను ఎవనిని నమ్మింపఁజాలను. దాసునిదని నామాట నమ్మఁబడదు. దొర ఒడుపుగా కాదు అనును - అంతే. ఏతావాన్ మే విభవః = ఇంతే నా శక్తి, అని చారుదత్తుని పాదములఁ వ్రాలును.

శ్లో. ౩౧. ఉత్తిష్ఠ భోః - లెవవయ్యా ఓయి - పతితసాధుజన అనుకమ్పిన్ =(ఆపదచేఁ క్రింద) పడిన సాధువులపై దయగలవాఁడా, నిష్కారణ ఉపగత బాన్ధవ = ఏకారణము లేకయే చేరవచ్చిన చుట్టమా, ధర్మశీల = సహజముగు ధార్మికుఁడా, ధర్మము చేయు స్వభావముగలవాఁడా - శీలము స్వభావము అనుటచే అది తోడబుట్టువు తెచ్చుకోలు కాదు అనుట, మమ మోక్షణాయ = నా విడిపించుటకు - నన్ను అనుట, సుమహాన్ యత్నః = ఎంతయు గొప్ప యత్నము, కృతః అపి = చేయఁబడినను, దైవం = విధి, న సంవదతి = కూడిరాలేదు, సరిపడదాయెను - అద్య = ఇపుడు, త్వయా కిం న కృతమ్ = నీవు ఏమి చేయలేదు - ఎంత చేయఁదగునో ఏమి సేయఁదగునో అంతయు అదియు చేసితివి - అనుట.

చాణ్డాలౌ—భట్టక, తాడయి త్వైతం చేటం నిష్కాసయ. [భట్టకే, పిట్టిఅ ఏదం చేడం ణిక్కాలేహి].

శకా—నిష్క్రామ రే (ఇతి నిష్క్రామయతి) అరే అరే చాణ్డాలాః, కి విలమ్బధ్వం? మారయ తైనమ్. [ణిక్కమ లే. అలే చాణ్డాలాః కిం విలమ్బధ? మాలేధ ఏదమ్].

చాణ్డాలౌ—యది త్వరయసే, తదా స్వయ మేవ మారయ. [జది తువలశి తా శఅం జ్జేవ మాలేహి].

రోహ—అరే చాణ్డాలాః, మాం మారయత. ముఞ్చత పితరమ్. [అలే చాణ్డాలాః, మం మాలేధ. ముఞ్చధ ఆవుకమ్].

శకా—సపుత్ర మే వైతం మారయత. [శపుత్తం జ్జేవ ఏదం మాలేధ].

చారు—సర్వ మస్య మూర్ఖస్య సంభావ్యతే. త ద్గచ్ఛ, పుత్ర, మాతుః సమీపమ్.

రోహ—కిం మయా గతేన కర్తవ్యమ్? [కిం మఏ గదేణ కాదవ్వమ్?]

---

భట్టక ... = నిష్కాసయ - దొరా, కొట్టి ఈచేటుని ఊరిబయటికి తఱిమి వేయుము. ఇతి నిష్క్రామయతి - అని బయటికి పంపు చున్నాఁడు. కిం విలమ్బధ్వే= ఏల ఆలస్యము చేయుచున్నారు. యది త్వరసే = తొందరపెట్టుదువేని, అప్పటికి (నీవే) సొంతముగానే చంపు. సపుత్రం ఏవ ఏతం మారయతం = పిల్లవానితోఁ కూడనే వీనిం జంపుఁడు - ఇరువురిం జంపుఁడు అనుట. సర్వం అస్య మూర్ఖస్య సంభావ్యతే - అంతయు (పిల్లవానిం జంపించుట సయితమును) ఈ ఈ మూర్ఖునకు - అనఁగా ఇతనియెడ జరుగుననియే తలంపఁదగును. నన్నుంగూడ చంపించినను చంపించును. తత్ గచ్ఛ - కావున పొమ్ము, మాతుః సమీపమ్ = అమ్మకడకు - కిం మయా గతేన కర్తవ్యమ్ = నేను పోయి ఏమిచేయఁదగును.

చారు—

శ్లో. ఆశ్రమం వత్స గన్తవ్యం గృహీత్వా ద్యైవ మాతరమ్
మా పుత్ర పితృదోషేణ త్వ మప్యేవం గమిష్యసి. ౩౨

తద్వయస్య, గృహీత్వైనం వ్రజ.

విదూ—భో వయస్య, ఏవం త్వయా జ్ఞాతమ్, త్వయా వినాహం ప్రాణాన్ ధారయిష్యా మీతి. [భో వఅస్స, ఎవ్వం తుప జాణిదమ్. తుప వినా అహం పాణాఇం ధారేమి త్తి.]

చారు—వయస్య, స్వాధీనజీవితస్య న యుజ్యతే తవ ప్రాణపరిత్యాగః.

విదూ—(స్వగతమ్) యుక్తం న్విదమ్. తథాపి న శక్నోమి ప్రియవయస్యవిరహితః ప్రాణాన్ ధర్తు మితి. తద్బ్రాహ్మణ్యై

---

శ్లో. ౩౨. వత్స=నాయనా, అద్య ఏవ=ఇప్పుడే, మాతరం గృహీత్వా=అమ్మను తీసికొని, ఆశ్రమం గన్తవ్యం=ఆశ్రమమునకు – తపోవనమునకు, పోవలసినది. పుత్ర = నాయనా, పితృదోషేణ = నాయనతప్పుచేత, త్వం అపి = నీవును, మా ఏవం గమిష్యసి = ఇట్లు పోవకుము – నావలె నీవును చావకుము. వీఁడు నిన్నును నాతోకూడ చంపుమనుచున్నాఁడు. నీవు వెంటనే వెడలిపోయి అమ్మను కలసికొని, ఆమెను పిలుచుకొని తపోవనమునకు పోవలసినది.

ముద్రారాక్షసమున కొఱ్ఱకి కొనిపోఁబడుచున్న చందనదాసుని కొడుకు బాలుఁడు 'నన్నేమి చేయుమందువు నాయనా, నీవు ఇట్లే లేకపోయిన తరువాత' అని యడుగఁగా చెప్పినాఁడు – 'చాణక్యవిరహితే దేశే వస్తవ్యమ్' అని.

ఏవం త్వయా జ్ఞాతం, త్వయా వినా అహం ప్రాణాన్ ధారయామి ఇతి – ఇట్లు నీవు తలంచితివి – నీవు లేక నేను బ్రదికియుండు నని.

వయస్య, స్వాధీనజీవితస్య న యుజ్యతే తవ ప్రాణపరిత్యాగః. – తన ప్రాణము తన యధీనములో నున్నవానికి నీవు ప్రాణములు విడుచుట – ఆత్మహత్య కూడదు. ప్రాణము, కాలము తీఱి తనంతట పోవలెను. ఎవఁడేని కొలచేసిన అప్పుడు పోవలెను కాని, నీస్వాధీనములో నుండఁగా ఆత్మహత్య ఉచితము గాదు.

దారకం సమర్ప్య ప్రాణపరిత్యాగేన ఆత్మనః ప్రియవయస్య మనుగమిష్యామి. (ప్రకాశమ్) భో వయస్య, పరానయామ్యేతం లఘు. (ఇతి సకణ్ఠగ్రహం పాదయోః పతతి. దారకో ఽపి రుదన్ పతతి). [జుత్తం ణేదమ్. తధా వి ణ సక్కుణోమి పుఅవఅస్స విరహిదో పాణాఇం ధారేదుం త్తి. తా బహ్మణీఏ దారఅం సమప్పిఅ పాణపరిచ్చాఏణ అత్తణో పిఅవఅస్సం అణుగమిస్సమ్. ... భో వఅస్స, పరాణేమి ఏదం లహుమ్].

శకా—అరే నను భణామి, సపుత్రకం చారుదత్తం వ్యాపాదయ తేతి. [అలే, ణం భణామి శపుత్తాకం చాలుదత్తాకం వావాదేధ త్తి].

(చారుదత్తో భయం నాటయతి)

చాణ్డాలౌ—న హ్యస్మాక మీదృశీ రాజాజ్ఞప్తిః, యథా సపుత్రం చారుదత్తం వ్యాపాదయ తేతి. త న్నిష్క్రామ రే దారక, నిష్క్రామ. (ఇతి నిష్క్రామయతః.) ఇదం తృతీయం ఘోషణా

యుక్తం ను ఇదమ్ - ఇది యుక్తమే గదా. తథా అపి - అట్లైనను న శక్నోమి ... = ప్రియవయస్యుఁడు లేనివాఁడనై ప్రాణాలు ధరింప - బ్రదికియుండ - శక్తుండగాను, తత్ బ్రాహ్మణ్యై ... = కావున ఇల్లాలికి కొడుకును అప్పగించి నేను ప్రాణములువీడి ప్రియవయస్యుని వెంట రాఁగలను. పరానయామి ఏతం లఘు - ఇతనిని శీఘ్రముగా దూరముగా కొనిపోవుదును. ఇతి సకణ్ఠగ్రహం పాదయోః పతతి - అని కంఠాలింగనము చేసికొని పాదముల వ్రాలును. కొడుకును ఏడ్చుచు (అట్లే) పడును. అరే నను భణామి - ఓరి చెప్పుచున్నాను గదా, కొడుకుతో కూడనే చారుదత్తుని చంపుఁడు అని.

న తు ఆవయోః ఈదృశీ రాజాజ్ఞప్తిః - మాకు ఇట్టి రాజునాజ్ఞ లేదు. - కొడుకుతోడం గూడ చారుదత్తుని చంపుఁడు అని. తత్ - కావున, రేదారక = ఓరిపిల్లవాఁడా, నిష్క్రామ - బయటికి వెడలిపోరా.

స్థానమ్. తాడయత డిణ్డిమమ్. [ణహి అమ్హాణం ఈదిశీ లాఆ ణ్ణత్తి జధా శపుత్తం చాలుదత్తం వావాదేధ త్తి. తా ణిక్క మ లే చాలఆ, ణిక్కమ. ... ఇమం తఇఅం ఘోశణ్ఠాణమ్ తాడేధ డిణ్డిమమ్, (పున ర్ఘోషయతః.

శకా—(స్వగతమ్) కథ! మేతే న ప్రత్యయన్తే పౌరాః! (ప్రకాశమ్) అరే చారుదత్తవటుక, న ప్రత్యయత ఏష పౌరజనః. త దాత్మీయయా జిహ్వయా భణ, మయా వసన్తసేనా మారి తేతి. [కధం! ఏశే ణ పత్తిఆఅన్తి పౌలా. ... హంహో చాలు దత్తావటుకా, ణ పత్తిఆఅది ఏశే పౌలజణే. తా అత్తణకేలికాఏ జీహాఏ భణాహి మఏ వశన్తశేణా మాలిదే త్తి].

(చారుదత్త స్తూష్ణీ మాస్తే)

శకా—అలే చాణ్డాలమనుష్య, న భణతి చారుదత్తవటుకః. త ద్భణయ తానేన, జర్జరవంశఖణ్డేన శఙ్ఖలేన తాడయిత్వా తాడ యిత్వా. [అలే చణ్డాలగోహే, ణ భణాది చాలుదత్తవడుకే. తా భణావేధ ఇమిణా జజ్జలవంశఖణ్డేణ శఙ్ఖలేణ తాలిఅ తాలిఅ].

చాణ్డాలః—(ప్రహార ముద్యమ్య) భోః చారుదత్త, భణ. [భో చాలుదత్త, భణాహి].

---

కథం! ఎట్లబ్బా! ఏతే న ప్రతియన్తి పౌరాః = ఈపౌరులు నమ్మకున్నారే! అరే చారుదత్తవటుక - ఓరిచారుదత్త వడుగ, న ప్రత్యేతి ... = ఈయూరిజనము నమ్మకున్నది. తత్ ఆత్మీయయా ... = కావున నీనాలుకతో చెప్పు, మయా వసన్త సేనా మారితా ఇతి - నాచేత వసన్తసేన చంపఁబడినది - అని. అరే చణ్డాల మనుష్య ... = ఓరి చండాలమనుష్యా, తత్ భణయత - కావున పలికింపుము, అనేన జర్జరవంశఖణేన శఙ్ఖలేన తాడయిత్వా తాడయిత్వా - జర్ - జర్ అని శబ్దించు చున్న తప్పెటకొట్టు వెదురుపుల్లతో కొట్టి కొట్టి - ఒక్కొక్కతూటికి ఒక్కొక్క దెబ్బ - చెప్పింపుము. చణ్డాలః ప్రహారం ఉద్యమ్య - దెబ్బ (కొట్ట) పూని - ఓ చారుదత్త - పలుకు.

చారు—( సకరుణమ్ )

శ్లో. ప్రాప్యైత ద్వ్యసనమహార్ణవప్రపాతం
న త్రాసో న చ మనసో ఽస్తి మే విషాదః,
ఏకో మాం దహతి జనాపవాదవహ్ని
ర్వక్తవ్యం య దిహ మయా హతా ప్రియేతి. 33

( శకారః పున స్తథైవ )

చారు—భోభోః పౌరాః. ( 'మయా ఖలు నృశంసేన' IX 30, 31. ఇత్యాది పునః పఠతి ).

శకా—వ్యాపాదితా. [ వావాదిదా ].

చారు—ఏవ మస్తు.

---

శ్లో. 33. ఏతత్ వ్యసనమహార్ణవ ప్రపాతం = ఈవధ దండన దుఃఖ మహాసముద్రమునందు నిట్టనదూకుటను - నెట్టనపడుటను, ప్రాప్య = పొంది, - అట్లు అందు మునిఁగియుండఁగా, మే = నాకు, త్రాసః = భయము లేదు, మనసః = చిత్తమునకు, న చ విషాదః = ఏదుఃఖమును, బంధువియోగమువలనంబోనిది, లేదు. ఏకః జనాపవాదవహ్నిః = జనులనింద - వసంతసేనంజంపినాఁడు అనునది - యను నిప్పు ఒక్కటి, మాం దహతి = నన్ను కాల్చివేయుచున్నది. ఎవ్వరు నమ్మనప్పుడు ఇఁక అపవాద మేమి యన, యత్ - ఏమియన - ఏలయన, ఇహ = ఇట, మయా హతా ప్రియా ఇతి - ప్రేయసి నాచే చంపఁబడిన దని, వక్తవ్యం = చెప్ప వలసియున్నది. ఇంతలోనే, శకారః పునః తథా ఏవ = శకారుఁడు మరల అట్లు చెప్పుచున్నాఁడు - కావున - చారుదత్తుఁడు చెప్పుచున్నాఁడు - ఓహోయి పౌరులారా,

'మయాఖలు ... = ఇత్యాదిని IX. 30 - మరల చెప్పుచున్నాఁడు. 'శేషం ఏషో ఽభిదాస్యతి' అని ముగింపఁగానే - శకారుఁడు - చెప్పుచున్నాఁడు - చంపఁ బడినది, ... అదియెల్ల శకారుని మాటగా శకారుఁడు తనచేతి చంపఁబడినది అనునట్లుగాను ధ్వనించును. చారుదత్తుఁడు - అట్లే అగుగాక - అనుచున్నాఁడు -

ప్ర. చాణ్డాలః—అరే తవాత్ర వధ్యపాలికా. [అలే, తవ అత్త వజ్ఝపాలిఆ].

ద్వి. చాణ్డాలః—అరే తవ. [అలే తవ].

ప్రథమః—అలే లేఖం కుర్మః. (ఇతి బహువిధం లేఖకం కృత్వా) అరే యది మదీయా వధ్యపాలికా, తదా తిష్ఠతు తావన్ముహూర్తకమ్. [అలే లేక్ఖఅం కలేమ్హ. ... అలే, జది మమ కేలికా వజ్ఝపాఆ, తా చిట్ఠదు దావ ముహుత్తఅమ్].

ద్వితీయః—కింనిమిత్తమ్? [కింణిమిత్తమ్?]

ప్రథమః—అరే భణితో ఽస్మి పిత్రా స్వర్గం గచ్ఛతా. యథా-పుత్ర వీరక, యది తవ వధ్యపాలికా భవతి, మా సహసా వ్యాపాదయసి వధ్యమ్. [అలే, భణిదో మ్హి పిదుణా శగ్గం గచ్ఛన్తేణ, యధా, పుత్త వీరఅ, జఇ తుహ వజ్ఝపాలిఆ హోది, మా శహశా వావాదఅశి వజ్ఝమ్].

ద్వితీయః—అరే, కింనిమిత్తమ్? [అలే, కింణిమిత్తమ్].

ప్రథమః—కదాపి కో ఽపి సాధు రర్థం దత్వా వధ్యం మోచయతి. కదాపి రాజ్ఞః పుత్రో భవతి, తేన వృద్ధిమహోత్స

---

ఆదియే కదా నిజము అని రహస్యము. అరే తవ అత్ర వధ్యపాలికా = ఓరి నీదిరా ఇందు _ చంపువంతు (నీ) కత్తివాదరరా ఈతూాటి. లేఖం కుర్మః _ వ్రా (గీ) యటం జేయుదము _ ఎవరు ఎన్ని (గీ) సార్లు నఱికినారు, ఎవరు ఎన్నిసార్లు నఱికినారు _ అని లెక్కవ్రాసి నిశ్చయింతము, యది మదీయా ... = వంతు నాదే యగునేని _ అప్పటికి _ రవంతసేపు ఉండనీ _ అగును గాక _ కిన్నిమిత్తం = ఎందుకోసము? అరే భణితః అస్మి పిత్రా, స్వర్గం గచ్ఛతా = (మా) నాయన స్వర్గమునకు పోవుచు నాకు చెప్పినాడురా _ కొడుకా చంపువంతు నీది యగునేని, తటాలున చంపకు, వధ్యుని. ఎందుకోసము? కదా అపి కః అపి ... = ఎప్పుడైనను ఒకవేళ, ఎవడైనను, సాధువు ధనము ఇచ్చి వధ్యుని విడిపించును.(లేక),

తేన సర్వవధ్యానాం మోక్షో భవతి. కదాపి హస్తీ బన్ధం ఖణ్డయతి, తేన సంభ్రమేణ వధ్యో ముక్తో భవతి. కదాపి రాజపరివర్తో భవతి, తేన సర్వవధ్యానాం మోక్షో భవతి. [కదా వి కో వి సాహూ అత్థం దఇఅ, వజ్ఝం మోఆవేది. కదా వి లణ్ణో పుత్తే భోది, తేణ వద్ధావేణ శవ్వవజ్ఝాణం మోక్ఖే హోది. కదా వి హత్థీ బన్ధం ఖణ్డేది, తేణ శంభమేణ వజ్ఝే ముక్కే హోది, కదా వి లాఅపలివత్తే హోది, తేణ సవ్వవజ్ఝాణం మోక్ఖే హోది.].

శకా—కిం కిం, రాజపరివర్తో భవతి? [కిం కిం లాఅపలివత్తే హోది?]

చాణ్డాలః—అరే వధ్యపాలికాయా లేఖం కుర్మః. [అలే, వజ్ఝపాలిఆఏ లెక్ఖఅం కలేమ్హః].

శకా—అరే శీఘ్రం మారయత చారుదత్తమ్. [అలే, శిగ్ఘం మాలిధ చాలుదత్తాకమ్].

(ఇత్యుక్త్వా చేటం గృహీత్వైకాన్తే స్థితః)

చాణ్డాలః—ఆర్యచారుదత్త, రాజనియోగః ఖల్వపరాధ్యతి-న ఖలు వయం చాణ్డాలాః. తత్స్మర యత్స్మర్తవ్యమ్. [అజ్జ

---

ఎప్పుడైనను, రాజ్ఞః పుత్రో భవతి ... = రాజునకు కొడుకు పుట్టును. ఆ (కుల) వృద్ధి మహోత్సవమున వధ్యుల కందఱికి విడుదల యగును. ఒకప్పుడు ఒకవేళ ఏనుఁగు కట్టు తెంపుకొనును, ఆతొట్రుపాటున వధ్యుఁడు ముక్తుఁడు అగును. కదా అపి రాజపరివర్తః భవతి ... = ఒకప్పుడు రాజు మాఱుట కలుగును, అప్పుడు దాన వధ్యుల కందఱికి మోక్షము కలుగును. కిం కిం ... = ఏమి, ఏమన్నావు, రాజు మాఱిపోవుటయా! ఆమాటకు వానిమనస్సున కళుక్కుమన్నది - 'నాబావపోవునా' అని. అరే వధ్యపాలికాయాం ... = ఓరి - చంపువంతుకు వ్రాసిచూతము. బహు విధం లేఖంకృత్వా. - లెక్కపెట్టక నేల పై గీతలుగీచి, అంతట ఒకటి వదలి యొకటిగా కొట్టివేసిన, కడపట మిగులునది కొట్టివేయఁబడినదో, పడనిదో చూచుట వంతును నిర్ణయించును, ఒక మూఢ విశ్వాసపు లెక్క. ఇతి ఉక్త్వా

చాలుదత్త, లాలణిఓఓ క్షు అవలజ్ఝది, ణ క్షు అహ్మే చాణ్డాలా. తా శుమలేహి జం శుమలివ్వమ్ ].

చారు—

శ్లో. ప్రభవతి యది ధర్మో దూషితస్యాపి మే உద్య,
ప్రబలపురుషవాక్యై ర్భాగ్యదోషాత్ కథంచిత్
సురపతిభవనస్థా యత్ర తత్ర స్థితా వా
అపనయతు కళఙ్కం స్వస్వభావేన సైవ. 38

... = అని పలికి చేటుని తీసికొనిపోయి ఏకాంతమున - కొంచెముదూరాన ఒంటరిగా రహస్యముగా నిలిచినాఁడు. ఆర్యచారుదత్త ... చారుదత్తయ్యా - ఇది రాజు నుత్తరువుతప్ప గాని, చండాలురమగు మాది కాదు. తత్ స్మర ... = కావున తలఁచుకో (నీవు) ఏది తలఁచుకొన వలయునో,

శ్లో. 38. భాగ్యదోషాత్ = (నా) విధిదోషము - ప్రాతికూల్యము - వలన, ప్రబలపురుషవాక్యైః - రాజు రాష్ట్రియుఁడు అధికరణికుఁడు మొదలగు ప్రబలులైన మానుసుల మాటలచేత, దూషితస్య అపి = నేరము మోపఁబడినవాని కైనను, మే = నాకు, అద్య = ఇప్పుడు, కథంచిత్ = ఎట్టకేలకు, ఎట్లో ఒకయట్లు ధర్మః = ధర్మము, ప్రభవతియది = ప్రాభవము - శక్తి - చూపునేని, సురపతి భవనస్థా = స్వర్గమున నున్నదియో. యత్ర తత్ర స్థితా వా = మఱి యెక్కడెక్కడ నేని, ఉన్నదియో, కళఙ్కం = (ఈ) మచ్చను - అపకీర్తిని, స్వస్వభా వేన = తన స్వభావముచేత తానుగానే, సా ఏవ = ఆవసంతసేనయేవచ్చి, వ్యప నయతు = తొలఁగించును గాక.

నాకు గ్రహచారము చాలమిచేత, ఈగొప్పవారందఱిచేతను నేను నేరము మోపఁబడినవాఁడనైనను - ఇఁక నీవిషయమున మఱి యేసాక్ష్యమును ఉపయోగ పడదు-ధర్మము ప్రాభవము చూపునేని ఆనుస్వభావమహత్తర యావసంతసేనయే- ఎందున్నదో - స్వర్గముననో మఱెక్కడనో - తాను సొంతముగానే వచ్చి నా యీమచ్చను తుడిచివేయును గాక - (అంతకన్న నాకిపుడు తలఁచుకొటకు ఏదియు లేదు.) మహానుభావుఁడు - మహాధార్మికుఁడు - అతనివాక్కు ఫలించునేమో, దైవ యోగమున. ఈనుక్తింగననగును - 'ధర్మ ఏవ హతో హన్తి, ధర్మో రక్షతి రక్షితః' అని. తన అదంభానుష్ఠిత ధర్మము సమయాన చారుదత్తుంగాచినది. అనునుగదా వాఁడు తన నమ్మకమును

భో॰ క్వ తావ న్మయా గన్తవ్యమ్?

చాణ్డాలః—(అగ్రతో దర్శయిత్వా) అరే ఏత ద్దృశ్యతే దక్షిణశ్మశానమ్, య త్ప్రేక్ష్య వధ్యా ఝటితి ప్రాణా న్ముఞ్చన్తి. పశ్య పశ్య. [అలే, ఏదం దీశది దక్ఖిణమశాణమ్, జం పేక్ఖిఅ వజ్ఝా ఝత్తి పాణాఇం ముఞ్చన్తి పేక్ఖ పేక్ఖ].

శ్లో. అర్ధం కలేబరం ప్రతివృత్తం కర్షన్తి దీర్ఘగోమాయవః
అర్ధ మపి శూలలగ్నం వేశ ఇ వాట్టహాసస్య. 31

తపసా మనసా వాగ్భిః పూజితా బలికర్మభిః
తుష్యన్తి శమినాం నిత్యం దేవతాః కింవిచారితైః.

చారుదత్తుఁడు ఎంతయు ధర్మపరుఁడు, దానపరుఁడు – మంచి చిత్త సంస్కారము గలవాఁడు. తన 'మీఁది' నేరము బొత్తిగా అబద్ధ మని యెఱుఁగును. మఱి అతని చిత్తమున నిర్వేదపు ఉడుకు ఎంత యుండదు! శకారునికిని తన బనాయింపు నెగ్గిన దని ఎంత సంతోషము! ఇంతలో శకారచేటుఁడును అగపడి అఱచి పోయి నాఁడు. అది తటాలున వినఁబడిన ధర్మ వాక్యమో అనియు తోఁచియుండును. తన ధర్మపరతయు దానపరతయు ఇట్లు ధర్మ ప్రభావమును శరణు జొరుమని ప్రేరించి యుండును.

అరే ఏతత్ దృశ్యతే దక్షిణశ్మశానమ్=ఓరి ఇదిగో అగపడుచున్నదే దక్షిణపు వల్లకాఁడు. యత్ – దేనిని = దానిని – చూచి, (ఇక్కడికి కొనితేఁబడు వధ్యులు, మఱి చంపబఁడకయే –) అంతకే చట్టున ప్రాణమువదలుదురు. చూడు, చూడు.

శ్లో. 31. పరివృత్తం = సుడిసిన – తలక్రిందైన, అర్ధం కలేబరం = సగము (పీనుఁగు) దేహమును, దీర్ఘగోమాయవః = ఎత్తైన – పెద్ద – ఎగిరినిక్కిన నక్కలు, కర్షన్తి = లాఁగుచున్నవి. అర్ధం అపి = మఱి సగము, శూలలగ్నం= కొఱ్ఱున తగులుకొనియే యున్నది – అట్టహాసస్య – శ్మశానముయొక్క బొబ్బనవ్వు యొక్క, వేష ఇవ – (తాల్చిన) రూపమో యన ఉన్నది. పై భాగము తలకదా. మెఱుగాన పండ్లయిగిలింత యుండును. అది వల్లకాటి బొబ్బనవ్వు!

[అద్ధం కళేవలం పడివుత్తం కట్టన్తి దీహగోమాఆ
అద్ధం పి శూలలగ్గం పేశం విఅ అట్టహాశశ్శ].

చారు—హా హతో ఽస్మి మన్దభాగ్యః. (ఇతి సావేగం ఉపవిశతి.)

శకా—న తావ ద్గమిష్యామి. చారుదత్తకం వ్యాపాద్యమానం తావత్ పశ్యామి. (పరిక్రమ్య దృష్ట్వా) కథం! ఉపవిష్టః! [ణ దావ గమిశ్శమ్. చాలుదత్తాకం వావాదఅన్తం దావ పేక్ఖామి. ... కధం ఉవవిశ్టే!]

చాణ్డాలః—చారుదత్త, కిం భీతో ఽసి? [చాలుదత్తా, కిం భీదో శి?]

చారు—(సహసోత్థాయ) మూర్ఖ, (న భీతో మరణాదస్మి X ౨౭ ఇత్యాది పునః పఠతి.)

చాణ్డాలః—ఆర్యచారుదత్త, గగనతలే ప్రతివసన్తౌ చన్ద్రసూర్యా వపి విపత్తిం లభేతే. కిం పున ర్జనా మరణభీరుకా మానవా వా, లోకే కో ఽప్యుత్థితః పతతి, కో ఽపి పతితో, ఽప్యుత్తి

---

పీఁకటకు అందని సగము, శూలమునకు తగులుకొని యుండునది శ్మశానపు నవ్వురూపముగా భయంకరముగా - అనుట ఉన్నది. హా హతః అస్మి - అయ్యో చచ్చితిని, నిర్భాగ్యుఁడను - అని సావేగం = దుఃఖపుఁ దొట్రుపాటుతో - కూర్చుండును, న తావత్ గమిష్యామి = నేను గన పోను. చారుదత్తుని చంపఁబడుచున్నవానిని - కొఱ్ఱు ఎక్కించుట వాఁడు బాధలుపడుట ప్రాణము వదలుట ఇది నాకు తమాషా, ఆమెత - ఇదంతయు చూచెదను. మఱి కథం ఎట్లూ - ఉపవిష్టః - కూరుచున్నాఁడే. చారుదత్త, కిం భీతః అసి? ... = ఏమి భయపడితివా? మూర్ఖ = మూర్ఖుఁడా, 'న భీతో మరణా దస్మి' X - 27 పఠించును. ఆర్య చారుదత్త - చారుదత్తయ్యా, గగనతలే ... = మింట కాపురముండు సూర్య చంద్రులు కూడ చావు పొందుదురు. కిం పునః ... = మఱి చెప్పవలయునా జనులు -

ష్ఠతే. ఉత్తిష్ఠత్పతతో వసనపాతికా శవస్య పున రస్తి. ఏతాని హృదయే కృత్వా సంధార యాత్మానమ్. (ద్వితీయ చాణ్డాలం ప్రతి) ఏతచ్చతుర్థం ఘోషణాస్థానమ్. తదుద్ఘోషయావః. [అజ్జ చాలుదత్త, గఅణదలే పడేవశన్తా చన్దశుజ్జావి విపత్తిం లహన్తి. కిం ఉణ జణా మలణభీలుఆ మాణవావా? లోఏ కోవిఉట్ఠిదోపడది, కోవి పడిదోవి ఉట్ఠేది. ఉట్ఠన్త పడన్తా హ వశణపడిఆ శవశ్శఉణ అత్థి. ఏదాఇం హిఅఏ కదుఅ సంధాలేహి అత్తాణఅమ్. ఏదం చఉటం ఘోశణట్ఠాణమ్. తాఉగ్ఘోశమ్హ.]

(పున స్తథైవోద్ఘోషయతః)

చారు—హా ప్రియే వసన్తసేనే, (శశివిమల మయూఖ X ౧3. ఇత్యాది పునః పఠతి)

(తతః ప్రవిశతి ససంభ్రమా వసన్తసేనా భిక్షుశ్చ)

---

మానుసులు చావుకు భయపడుదురు అని. లోకే కోఽపి ఉత్థితః పతతి ... = లోకమున లేచినవాడొక్కొక్కఁడును పడును, పడినవాఁడు ఒక్కొక్కఁడును లేచును. ఉత్తిష్ఠత్ పతతః శవస్య – లేచుచు పడుచున్న శవమునకు. పునః వసన పాతికా అస్తి = మరల గుడ్డ పడుట కలదు. అనఁగా గాలికి లేచిన గుడ్డ తనంతనే గాలి తగ్గగానే పడునుగదా. అట్లే కళేబరము పూర్వకర్మ లేపఁగా – పుట్టింపఁగా – లేచినది – అనఁగా పుట్టువుగన్నది. ఆకర్మ శాంతిపఁగా, తానే మరల వాలిపోవును. ఏతాని హృదయే కృత్వా = ఈ (నా) మాటలను మనసున ఉంచుకొని, నిన్ను నిలువరించుకో ( = సంధారయ ఆత్మానం). పునః తథైవ ఉద్ఘోషయతః – మరల అట్లే చాటుచున్నారు. ఆచాటింపున వసంతసేన బలాత్కారముగా చారుదత్తునిచేత గొంతుపిసికి చంపఁబడినది – అను మాటలే, అవి ఒక్కొక్కతూరి విన్నప్పుడును వసంతసేనం గూర్చి ఒక్కొక్క తెర ఏడ్పు చారుదత్తునికి ఒక్కొక్క విధముగా పొంగుచున్నది. ఇపుడు – శశిమలమయూఖ – ఇత్యాది పొరలివచ్చినది.

తతః ప్రవిశతి ... అంతట తొట్రుపడుచు వసంతసేనయుం భిక్షువును ప్రవేశించుచున్నారు. భిక్షువు తాను వసంతసేనను బ్రదికించి లేపినపుడు 'ఏతస్మిన్

వసన్త—(ససంభ్రమమ్) హా ధిక్, హా ధిక్! కథం! మమ మన్దభాగిన్యాః కృత ఆర్యచారుదత్తో వ్యాపాద్యతే. భోః త్వరితం త్వరిత మాదిశ మార్గమ్. [హద్ధీ, హద్ధీ! కధం మమ మన్దభాఇణీఏ కిదే అజ్జచాలుదత్తో వావాదీఅది. భో, తురిదం తురిదం ఆదేసేహి మగ్గమ్].

భిక్షుః—త్వరతాం త్వరతాం బుద్ధోపాసికార్యచారుదత్తం జీవన్తం సమాశ్వాసయితుమ్. ఆర్యాః, అన్తరం మన్తరం దత్త. [తువలదు తువలదు బుద్ధోవాశికా అజ్జచాలుదత్తం జీఅన్త శమశ్శాశిదుమ్. అజ్జా, అన్తలం అన్తలం దేధ],

వసన్త—అన్తర మన్తరమ్. [అన్తలం అన్తలమ్].

చాణ్డాలః—ఆర్యచారుదత్త, స్వామినియోగో ఽపరాధ్యతి. తత్స్మర యత్స్మర్తవ్యమ్. [అజ్జచాలుదత్త శామణిఓఓ అవలజ్ఝది. తా శుమలేహి జం శుమలిదవ్వమ్].

చారు—కిం బహునా? (ప్రభవతి X - 3౮ ఇత్యాది శ్లోకం పఠతి.)

చాణ్డాలః—(ఖడ్గ మాకృష్య) ఆర్యచారుదత్త, ఉత్తానో భూత్వా సమం తిష్ఠ, ఏకప్రహారేణ మారయిత్వా త్వాం స్వర్గం

---

అని చారుదత్తుఁడు చంపఁబడుటకు కొనిపోఁబడుచున్నాఁడు. కథం = ఎట్లూ! భాగ్యహీనసైన నాకోసము చారుదత్తయ్య చంపఁబడుచున్నాఁడు! భోః - ఓయి - త్వరితం ఆదేశయ మార్గం = త్వరగా దారి చెప్పు - త్వరతాం త్వరతాం ... త్వరపడునుగాక - ఉపాసిక - చారుదత్తయ్యను ప్రాణముతో నుండఁగానే ఊఱడించుటకు. ఆర్యాః అన్తరందత్త = అయ్యలారా - దారి యిండు. స్వామి నియోగః అపరాధ్యతి - దొరయుత్తరువు తప్పుచేయుచున్నది - బుద్ధిపూర్వకముగా నేను కాదు. తత్ స్మర యత్ స్మర్తవ్యమ్ - కావున తలఁచుకో నీకు ఏది తలఁచుకొనవలయునో - కిం బహునా = ఏల పలుమాటలు? 'ప్రభవతి' ఇత్యాది పఠించుచున్నాఁడు.

నయామః. [ అజ్జచాలుదత్త, ఉత్తాణే భవిఅ సమం చిట్ఠ. ఎక్కప్పహారేణ మాలిఅ తుమం శగ్గం ణేమ్హ ].

( చారుదత్త స్తథా తిష్ఠతి )

చాణ్డాలః—( ప్రహర్తు మీహతే. ఖడ్గపతనం హస్తా దభినయన్ ) హీ, కథమ్! [ హీ, కధమ్! ]

శ్లో. ఆకృష్టః సరోషం ముష్టౌ ముష్టినా గృహీతో ఽపి
ధరణ్యాం కిమర్థం పతితో దారుణకో ఽశనిసన్నిభః ఖడ్గః? ౩౬

[ ఆఅట్టిదే శలోశం ముట్ఠీఏ ముట్ఠిణా గహీదే వి
ధలణీఏ కీశ పడికే దాలుణకే అశణిశణిహే ఖగ్గే ].

యథైతత్ సంవృత్తమ్, తథా తర్కయామి, న విపద్యత ఆర్య చారుదత్త ఇతి. భగవతి, సహ్యావాసిని, ప్రసీద ప్రసీద, అపి నామ

---

ఉత్తానః భూత్వా = ఒళ్ళు పైకి చాపుకొని, నిట్రముగా వంపులేక సరిగా ఉండు - ఏక ప్రహారేణ ... = ఒక్క దెబ్బతో చంపి నిన్ను స్వర్గమునకు కొనిపోవుదుము - చేర్తుము. ప్రహర్తుమ్ ఈహతే - కొట్టఁగోరును - కత్తి యెత్తును - కత్తి చేతి నుండి పడును. హీహీ - కథం = ఏమి ఇట్లు! ఎట్టూ!

శ్లో. ౩౬. సరోషం - చంపుటకైన కోపముతో, ఆకృష్టః = లాఁగఁ బడినది, ఎత్తఁబడినది, ముష్టౌ ముష్టినా గృహీతః అపి = (కత్తి) పిడి యందు పిడికిటితో పట్టుకొనఁబడినప్పటికిని, దారుణకః = తీక్ష్ణమై, అశనిసన్నిభః = పిడుగుం బోని, ఖడ్గః = కత్తి, ధరణ్యాం = నేలపై, పతితః = పడినది - కిమర్థం = ఎందులకో!

యథా ఏతత్ సంవృత్తమ్ = ఎందులకు ఇది జరిగినదో, తథా - అందులకే, - ఇట్లు ఇది జరిగినందువలన, ఊహింతును, తలంతును, చారుదత్తుఁడు చావఁడు అని. దేవి సహ్యావాసిని - సహ్యమను కొండయందున్న దుర్గామ్మ - అది యీ మాదిగల కులదేవత - ప్రసీద - అనుగ్రహింపు - అపినామ ... చారుదత్తునికి విడుదల

భిక్షుః—ఆర్యచారుదత్త, కిం న్విదమ్. [అజ్జచాలుదత్త కిం ణేదమ్?] (ఇతి పాదయోః పతతి.

చాణ్డాలః—(సభయ ముపసృత్య) కథమ్! వసన్తసేనా! నను ఖ ల్వస్మాభిః సాధు ర్న వ్యాపాదితః. [కథమ్! వశన్తశేణా! ణం ఖు అహ్మేహిం శాహూ ణ వావాదిదే].

భిక్షుః—(ఉత్థాయ) అరే జీవతి చారుదత్తః! [అలే జీవది చాలుదత్తే].

చాణ్డాః—జీవతి వర్ష శతమ్. [జీవది వశ్శశదమ్].

వసన్త—(సహర్షమ్) ప్రత్యుజ్జీవి తాస్మి. [పచ్చుజ్జీవిద మ్హి].

చాణ్డాలః—త ద్యావ దేత ద్వృత్తం రాజ్ఞే యజ్ఞవాటగతస్య నివేదయావః. [తా జావ ఏదం వత్తుం రాఇణ్ణో జణ్ణవాడగదశ్శ ణివేదేమ్హ]. (ఇతి నిష్క్రాన్తౌ.

శకా—(వసన్తసేనాం దృష్ట్వా, సత్రాసమ్) ఆశ్చర్యమ్! కేన గర్భదాసి జీవనం ప్రాపితా. ఉత్క్రాన్తా మే ప్రాణాః. భవతు. పలాయిష్యే. [హీమాదికే! కేణ గబ్భదాశీ జీవావిదా? ఉక్కన్తాఇం మే పాణాఇం. భోదు, పలాఇశ్శమ్].

చండాలుఁడు చకితుఁడై తొలఁగి - ఏమీ! వసంతసేన! నను ఖలు సాధుః ... = పాపము, ఓరి (=నను) మనచేత సాధువు చంపఁబడలేదుగదా! (చంపియున్న ఎంతపొరపాటు, పాపము, చేయుఁబడినది ఐయుండునోగదా. అరే జీవతి చారుదత్తః - ఓరి, బ్రదికియున్నాఁడు, చారుత్తుఁడు. జీవతి ... = ఇఁక నూరేండ్లు బ్రదుకును - ఇఁక వానికి సేఁగి లేదు. ప్రత్యుజ్జీవితా అస్మి = బ్రదికింపఁబడితిని. రాజ్ఞః యజ్ఞవాటగతస్య - రాజు (పాలకునికి) 'జన్నవాడ'లో నున్నవానికి, హీమాదికే = అయ్యయ్యో - కేన గర్భదాసీ ... = ఎవనిచేత ఈపుట్టు తొత్తు బ్రదికింపఁబడినది? అస్యాః ప్రాణాః ... = ఈపై ప్రాణాలు పైకి లేచి పోయి

(ఇతి పలాయతే)

చాణ్డాలః—(ఉపసృత్య) అరే న న్వస్మాక మీదృశీ రాజాజ్ఞప్తిః — యేన సా వ్యాపాదితా, తం మారయ తేతి. త ద్రాష్ట్రియశ్యాల మేవాన్విష్యావః. [అలే, ణం అహ్మాణం ఈదిశీ లాఅణ్ణత్తీ — జేణ శా వావాదిదా, తం మాలేధ త్తి. తా లట్టిఅశాలఅం జ్జేవ అణ్ణేశహ్మ]. (ఇతి నిష్క్రాన్తౌ)

చారు—(సవిస్మయమ్)

శ్లో. కేయ మభ్యుద్యతే శస్త్రే మృత్యువక్త్రగతే మయి
అనావృష్టిహతే సస్యే ద్రోణవృష్టి రివాగతా. ౩౮

(అవలోక్య చ)

---

నవే - వచ్చినదే - భవతు ... = కానీ, పరారియయ్యెదను. ఇతి పలాయతి - అని పరువెత్తుచున్నాఁడు. ఉపసృత్య = సమీపించి - నను అస్మాకం ఈదృశీ రాజాజ్ఞప్తిః - మనకు ఇట్టిది గదా రాజునాజ్ఞ - ఎవనిచేత ఆపె చంపఁబడినదో వానిం జంపుమని. కావున రాష్ట్రియుని రాజుమఱఁదినే వెదకుదము. సవిస్మయమ్ = ఆశ్చర్యముతో.

శ్లో. ౩౮. కా ఇయం = ఈమె ఎవరు, శస్త్రేఅభ్యుద్యతే = కత్తి (నాపైకి) ఎత్తఁబడఁగా, మయి = నేను. మృత్యువక్త్రగతే = మృత్యువునోటిం జేరఁగా - నోటంబడఁగా అప్పుడే చావఁబోవుచుండఁగా, అనుట, సస్యే = పైరు, అనావృష్టి హతే = వఱపుచే (ఎండి) చావఁగా, ద్రోణవృష్టిః ఇవ = ద్రోణమను మేఘముయొక్క (దోసెల) వానవలె, ఆగతా = వచ్చినది!

పైరును చచ్చినదానిం బ్రదికింప అదెట్లో, అట్లే, పైరు వఱపువ ఎండియే గడ్డి ఐ పోయి నంతట వేరుకొనలో కొన ఊపిరి కూడకాని రవంత పచ్చి ఉండును. నన్ను మృత్యువాతనున్న వానిని బ్రదికింప ఈమె వచ్చినది - ఎవరోకదా!

అవలోక్య - పరికించి - చూచి.

శ్లో. వసన్తసేనా కి మియం ద్వితీయా ?
సమాగతా సైవ దివః కి మిత్థమ్ ?
భ్రాన్తం మనః పశ్యతి వా మ మైనాం
వసన్తసేనా న మృతాథ సైవ. 39

అథవా

శ్లో. కిం ను స్వర్గాత్ పునః ప్రాప్తా మమ జీవాతుకామ్యయా
తస్యా రూపానురూపేణ కిము తా స్యేయ మాగతా ? 40

వసన్త—(సాస్ర ముత్థాయ పాదయో ర్నిపత్య) ఆర్యచారుదత్త, సై వాహం పాపా, యస్యాః కారణా దియం త్వ యాసదృశ్యవస్థా ప్రాప్తా. [ అజ్జచాలుదత్త, సా జ్జేవ అహం పావా, జాఏ కారణాదో ఇఅం తుఏ అసరిసీ అవత్థాపావిదా ].

---

శ్లో. 39. ఇయం ద్వితీయా వసన్తసేనా కిము = ఈమె మఱియొక - రెండవ - వసంతసేనయా ? సా ఏవ = ఆమెయే, దివః = స్వర్గము (మింటి) నుండి, ఇత్థం సమాగతా కిం = ఇట్లు నన్ను చేర వచ్చినదా ? మమ మనః = నామనసు, భ్రాన్తం = భ్రమ - మిథ్యామతి - గొన్నదై, ఏనాం = ఈమెను, పశ్యతి వా = వసంతసేనగా చూచుచున్నదా ? అథ - ఇవేవియును కాక, ఇంక, సావసన్తసేనా ఏవ = ఆవసంతసేనయే, న మృతా = చావలేదా ? - కావుచే ప్రశ్న.

అథవా = అట్లు (నుం) గాదేని.

శ్లో. 40. మమ జీవాతుకామ్యయా = నన్ను మరల బ్రదికించుకోరికతో, స్వర్గాత్ = స్వర్గమునుండి, పునః ప్రాప్తా కిం ను = మరల వచ్చినదా ఏమి ? కిముత = అట్లుకాదేని, తస్యాః రూపానురూపేణ = ఆమెయొక్క రూపపుపోలికతో, ఇయం అన్యా ఆగతా = ఈమె మఱియొకతె వచ్చినదా ?

నన్నుం గావ స్వర్గమునుండి, అక్కడికి చేరిన వసంతసేన మరల వచ్చినదా. మఱెవ్వరైనను ఆమెపోలికతో వచ్చినదా ఈమె (ఎవరో) ?

పాదయోః నిపత్య - పాదాలలో వ్రాలి - ఆపాపాత్మునే నేను. - ఎవతె కోసము నీవు ఈ(యెంతయు నీకు) తగని యవస్థను పొందితివో - ఆశ్చర్యమ్

[ నేపథ్యే ]

ఆశ్చర్య మాశ్చర్యమ్. జీవతి వసన్తసేనా. [ అచ్చరిఅం అచ్చరిఅమ్. జీవది వసన్తసేనా ]. (ఇతి సర్వే పఠన్తి.

చారు—( ఆకర్ణ్య సహ సోత్థాయ స్పర్శసుఖ మభినీయ నిమీలితాక్ష ఏవ హర్షగద్గదాక్షరమ్) ప్రియే వసన్తసేనా త్వమ్.

వసన్త—సైవాహం మన్దభాగ్యా. [ సా జ్జేవ అహం మన్దభాఆ ].

చారు—( నిరూప్య సహర్షమ్ ) కథం! వసన్తసేనైవ! ( సానన్దమ్ )

శ్లో. కుతో బాష్పామ్బుధారాభిః స్నపయన్తీ పయోధరౌ
మయి మృత్యువశం ప్రాప్తే విద్యేవ సముపాగతా. ౪౧

ప్రియే వసన్తసేనే,

---

ఆశ్చర్యమ్ - ఆశ్చర్యము! వసంతసేన బ్రదికి యున్నది - (అని జనులు అందఱు తెరలోపల పలుకుచున్నారు.) ఆజనవాక్యము విని, (నమ్మి) తటాలున లేచి స్పర్శవలని సుఖముతో - వసంతసేన యొమ్మున వ్రాలియున్నది గదా - అభినయించి అనుట వేసగానికి ఎచ్చరిక. కన్నులు మూసికొనియే - ప్రేయసీ, వసంతసేనవా నీవు! సా ఏవ అహం ... = ఆమెనే నేను - అదృష్టహీనురాలిని.

నిరూప్య - కన్నులు తెఱచి చూచి పోల్చుకొని, హర్షముతో - కథం - ఎట్లూ! వసన్తసేనా ఏవ = వసంతసేనయే - ఆనందముతో.

శ్లో. ౪౧. బాష్పామ్బుధారాభిః = కన్నీటిధారలతో, పయోధరౌ = పాలిండ్లను, స్నపయన్తీ = తడుపు (స్నానమాడించు) చున్నదానవై, మయి = నేను, మృత్యువశంప్రాప్తే = మృత్యువునకు లొంగుటను పొందఁగానే - చావునకు అధీనమై పోఁగానే - (మఱి చేయునదిలేక) చావఁగానే, కుతః = ఎందుండి, విద్యా ఇవ = రూపుఁదాల్చిన సంజీవని విద్యవలె, దుర్గాదేవివలె - (అశ్రువులు ఆనందాశ్రువులు - వసంతసేనకు రాగస్నేహానందము - విద్యకు వాత్సల్యానందము - ) సముపాగతా = వచ్చితివి?

శ్లో. త్వదర్థ మేత ద్వినిపాత్యమానం
దేహం త్వ యైవ ప్రతిమోచితం మే
అహో ప్రభావః ప్రియసంగమస్య
మృతో ఽపి కో నామ పునర్ధ్రియేత. ౪౨

అపి చ. ప్రియే పశ్య,

శ్లో. రక్తం త దేవ వరవస్త్ర మియం చ మాలా
కాన్తాగమేన హి వరస్య యథా విభాతి.
ఏతే చ వధ్యపటహధ్వనయ స్తథైవ
జాతా వివాహపటహధ్వనిభిః సమానాః. ౪౩

---

శ్లో. ౪౨. త్వదర్థం = నీకోసము, వినిపాత్యమానం = పడఁగొట్టఁబడుచున్న - నాశనము చేయఁబడుచున్న - చంపఁబడుచున్న, మే దేహం = నాయొడలు, త్వయా ఏవ ప్రతిమోచితమ్ = నీచేతనే, - (బ్రదికి మరల వచ్చిన) నీచేతనే ధరింపఁబడినది - పునరుజ్జీవింపఁబడినది - మరల బ్రదికింపఁ బడినది. అహో - ఆశ్చర్యము - ఇంత యని చెప్పనలవిపడదు అనుట - ప్రియసఙ్గమస్య - ప్రియమైనదానిం గలసికొనుటయొక్క, ప్రభావః = మహిమ! ప్రియా - అని స్త్రీ లింగము వివక్షితము గాదు - ఆ ప్రభావమే కావున్న - మృతః అపి = చచ్చినవాఁడైనను, కో నామ - ఎవఁడు - నీవే చెప్పు - పునః ధ్రియేత - మరల బ్రదుకును ?

శ్లో. ౪౩. రక్తం తత్ ఏవ = ఎఱ్ఱనిది - వధ్యచిహ్నముగా నాకు కట్టినది, అట్లే - ఆయెఱ్ఱవస్త్రమే, వరవస్త్రం = పెండ్లికొడుకు (పసపు మొదలైనవానిలో తడుపఁబడిన) వస్త్రము. ఇయం మాలా చ = ఈ మాలయు - ఆయెఱ్ఱగన్నేరులదే, - కాన్తా ఆగమేన - పెండ్లికూఁతురైన కాంత (అందమైనవధువు) ఐన నీ యొక్క రాకచేత, యథా వరస్య = పెండ్లికొడుకునకు ఎట్లో - అట్లు - విభాతి = ప్రకాశించుచున్నది - ఒప్పారుచున్నది. ఏతే చ = ఇవియు, వధ్యపటహధ్వనయః - వధ్యుని (చంపుటం దెలుపుటకైన) తప్పెటమ్రోఁతలు, తథా ఏవ = అట్లే, వివాహ పటహధ్వనిభిః = మన పెండ్లికైన పటహధ్వనులతో. సమానా జాతాః = సమానములు - తుల్యములు - ఐనవి.

వసన్త—అతిదక్షిణతయా కిం న్విదం వ్యవసిత మార్యేణ. [అదిదక్ఖిణదాఏ కిం ణేదం వవసిదం అజ్జేణ].

చారు—ప్రియే, త్వం కిల మయా హ తేతి,

శ్లో. పూర్వానుబద్ధవైరేణ శత్రుణా ప్రభవిష్ణునా
నరకే పతతా తేన మనాగస్మి నిపాతితః. ౪౪

వసన్త—(కర్ణౌ పిధాయ) శాన్తం పాపమ్. తేనాస్మి రాజశ్యాలేన వ్యాపాదితా. [సన్తం పావమ్, తేన మ్హి రాఅసాలేణ వావాదితా].

చారు—(భిక్షుం దృష్ట్వా) అయ మపి కః?

వసన్త—తేనానార్యేణ వ్యాపాదితా. ఏతేనార్యేణ జీవం ప్రాపితాస్మి. [తేణ అణజ్జేణ వావాదిదా. ఏదిణా అజ్జేణ జీవావిదమ్హి].

---

నాకు (నీకోసమే ఐన) మృత్యుమండనమును వాద్యములును, నాకు (నీకోసమే ఐన) పెండ్లిసింగారింపులును, పెండ్లివాద్యములును ఐనవి! అతిదాక్షిణ్యతయా - అత్యంతమైనదయగలవాఁడవగుట చేత - (ఔదార్యము చేత -) ఇది (ఈ ఆత్మార్పణము) పూనఁబడినది?

త్వం కిల మయా హతా ఇతి - నీ వఁట నాచేత చంపఁబడితివి అని.

శ్లో. ౪౪. పూర్వానుబద్ధవైరేణ - విడువకుండ పూనఁబడిన ప్రాఁత వైరము - పగ - కలవాఁడైన, తేన శత్రుణా - అపగతుని చేత, ప్రభవిష్ణునా = తన రాష్ట్రియత రాజశ్యాలతలచే తా ననుకొన్నది చేయఁగల సామర్థ్యము గలవాని చేత, నరకేపతతా మనాక్ - సెట్టన కేవలము నరకమునం బడువాని చేత - అనఁగా అట్లు తప్పక నరకమునం బడుఫలముననే నిపాతితః అస్మి = పడఁగొట్టఁ - నాశనము చేయఁ - బడితిని.

కర్ణౌ పిధాయ - అ ట్లీతనిం జంపుటయను పాపము శమిల్లునుగాక.

అయం అపి కః - మఱి యితఁ డెవరు?

తేన అనార్యేణ వ్యాపాదితా ... = ఆయనార్యుని చేత చంపఁబడితిని, ఈయార్యుని చేత బ్రదికింపఁబడితిని. కః త్వం అకారణబన్ధుః - ఇటు నిర్వ్యాజముగా

చారు—క స్త్వ మకారణబన్ధుః?

భిక్షుః—న ప్రత్యభిజానాతి మా మార్యః. అహం స ఆర్యస్య చరణసంవాహచిన్తకః సంవాహకో నామ. ద్యూతకరై ర్గృహీత ఏత యోపాసిక యార్య స్యాత్మీయ ఇ త్యలఙ్కారపణనిష్క్రీతో ఽస్మి. తేన చ ద్యూతనిర్వేదేన శాక్యశ్రమణకః సంవృత్తో ఽస్మి. ఏషా ప్యార్యా ప్రవహణవిపర్యాసేన పుష్పకరణ్డక జీర్ణోద్యానం గతా. తేన చానార్యేణ న మాం బహుమన్యస ఇతి బాహుపాశబలాత్కారేణ మారితా, మయా దృష్టా. [ణ పచ్చభిజాణాది మం అజ్జో. అహం శే అజ్జశ్శ చరణసంవాహచిన్తఏ శంవాహకే ణామ. జూదిఅలేహిం గహిదే ఏదాఏ ఉవాశికాఏ అజ్జశ్శ కేలకే త్తి అలంకాలపణణిక్కిదే మ్హి. తేణ అ జూదణివ్వేదేణ శక్కశమణకే శంవుత్తేమ్హి. ఏశా వి అజ్జా పవహణవిపజ్జాశేణ పుప్ఫకలణ్డక జిణ్ణుజ్జాణం గదా. తేణ అ అణజ్జేణ ణ మం బహుమణ్ణేశి త్తి బాహుపాశబలక్కాలేణ మాలిదా, మఏ దిట్టా.]

---

బాంధవము సెఱపినవాఁడవు, నాప్రేయసిం బ్రదికించినవాఁడవు, నీవు ఎవరు? న ప్రత్యభిజానాతి = నన్ను గుర్తుపట్టలేదు ఆర్యుఁడు, అహం సః ఆర్యస్య ... = నేను వాఁడను - అయ్యను పాదాలు పిసుకుటయందు ఆసక్తుఁడయియుంచి యుండినవాఁడను, సంవాహకుఁడని పేరు. ద్యూతకరైః ... = జూదగాండ్రచేత (పణము కట్టమికై) పట్టుకొనఁబడినవాఁడనై. ఈ భక్తురాలిచేత, అయ్యను కావలసినవాఁడనని అలంకారమును పణముగా కట్టి విడిపింపఁబడినవాఁడను అయితిని. ఆ జూదముగొల్పిన ఐహిక జుగుప్స (= నిర్వేదము) చేత శాక్య (= బౌద్ధ) శ్రమణకుఁడను (= సన్యాసిని) అయితిని. ఆర్య యీ మేరయు బండ్ల తాఱుమాఱుచేత పుష్పకరండక జీర్ణోద్యానమునకు పోయినది, తేన చ అనార్యేణ ... = అనీచుని చేత - నన్ను ఒల్లవా - గౌరవింపవా - అని భుజములనే తాళ్ళుగా చుట్టి బలవంతముగా - గొంతు పిసికి - చంపఁబడినది. (అంతట) నాచేత చూడఁబడినది. కలకలః - అలబలము - తుములమైన శబ్దము.

(నేపథ్యే కలకలః)

శ్లో. జయతి వృషభకేతు ర్దక్షయజ్ఞస్య హన్తా
తదను జయతి భేత్తా షణ్ముఖః క్రౌఞ్చశత్రుః
తదను జయతి కృత్స్నాం శుభ్రకైలాసకేతుం
వినిహతవరవైరీ చారుకో గాం విశాలామ్. ౧౫

(ప్రవిశ్య సహసా)

శర్విలకః—

శ్లో. హత్వా తం కునృప మహం హి పాలకం భో
స్త్రద్రాజ్యే ద్రుత మభిషిచ్య చార్యకం తమ్,

శ్లో. ౧౫. జయతి – జయంచుచున్నాఁడు – తేజరిల్లుచున్నాఁడు – దక్షయజ్ఞస్య హన్తా = దక్షయజ్ఞధ్వంసకుఁడు – ఎద్దుజెండా దేవుఁడు – ఈశ్వరుఁడు! తదను = అంతట – అట్లే – జయతి, క్రౌఞ్చశత్రోః – క్రౌంచపర్వతము అను శత్రువును, భేత్తా = పగిల్చినవాఁడు చీల్చినవాఁడు, ఈతట్టునుండి ఆతట్టునకు ఓకేదెబ్బన ఒకేబొక్క కొట్టినవాఁడు. షణ్ముఖః = ఆఱుమొగాలదేవుఁడు. క్రౌఞ్చశత్రుః – అనిప్రథమగాగొన్న, 'భేత్తా' అని అంత నూటిగా ఏతివేసినదానికి కర్మలేక పోవును. కావున వే. వేం. గారు శత్రోః – అని షష్ఠిగా, క్రౌంచమను శత్రువు (యొక్క)ను పగిల్చినవాఁడు – అని పఠించిరి. ఒక్కటన్నైన ఆ పా. లేదు. తదను – అట్లు వారు తేజరిల్లినంతట – తత్ఫలముగా, వారి భక్తుఁడు – ఆర్యకః = ఆర్యకుఁడు, వినిహత వరవైరీ = చంపఁబడిన (బలాఢ్యుఁడగుటచే) శ్లాఘ్యుఁడైన శత్రువు – పాలకరాజుగలవాఁడు – కృత్స్నాం = సమస్తమైన, విశాలాం గాం = విశాలమైన – భూమిని – హిమాలయము మొదలు సేతువువఱకును, పూర్వసముద్రము నుండి పశ్చిమసముద్రమువఱకు వ్యాపించియున్నదానిని, (కావుననే) శుభ్రకైలాసకేతుం = తెల్లని కైలాసమే – (ఉత్తరపు కొనన తన తెల్ల తళతళయే జెండాగుడ్డగా ఎగురు చుండు) జెండాగా గలదానిని, జయతి = జయించినాఁడు – తన వసముచేసికొన్నాడు. ప్రవిశ్య సహసా = వడిగా ప్రవేశించి – చారుదత్తుం జంపుచున్నాఁడట నే దానిం దప్పింపవలదా – అను ఓడుపువడిలో – ప్రవేశించి.

శ్లో. ౧౬. అహం హి = నేనన్ననో, భోః – ఓహో! వినుఁడు – కునృపం = దుష్టరాజైన, తం పాలకం = ఆ పాలకుని, హత్వా = చంపి, తద్రాజ్యే = ఆతని

త స్యాజ్ఞాం శిరసి నిధాయ శేషభూతాం
మోక్ష్యే ఽహం వ్యసనగతం చ చారుదత్తమ్. ౪౬

శ్లో. హత్వా రిపుం తం బలమన్త్రిహీనం
పౌరా న్సమాశ్వాస్య పునః ప్రకర్షాత్
ప్రాప్తం సమగ్రం వసుధాధిరాజ్యం
రాజ్యం బలారే రివ శత్రురాజ్యమ్. ౪౭

---

(యా) రాజ్యమున, తం ఆర్యకం = ఆయార్యకుని, ద్రుతం = వడివడిగా, అభిషిచ్య- అభిషేకించి, - చారుదత్తుం గావ రాజాజ్ఞ కావలెను, లేకున్న ఆపని సరిగాకాదు - కావున అతని నభిషేకించుటను నిర్ణయించి, తస్య ఆజ్ఞాం = ఆతనియాజ్ఞను, శేషభూతాం=తల పూదండయైనదానిని, శిరసి నిధాయ = తలపై ఉంచుకొని మోసి కొని - ఆయాజ్ఞను శిరసావహించి. అనుట - వ్యసనగతం = ఆపదలోపడిన, చారుదత్తం = చారుదత్తుని, అహం మోక్ష్యే = నేను విడిపింతును.

చూ. కుమార - III - 22.

తథేతి శేషామివ భర్తు రాజ్ఞా మాదాయ మూర్ధ్నా మదనః ప్రతస్థే,
ఐరావతాస్ఫాలనకర్కశేన హస్తేన పస్పర్శ తదఙ్గమిన్ద్రః.

శ్లో. ౪౭. రిపుం తం = ఆ శత్రువును, బలమన్త్రిహీనం = బలము గాని - అనఁగా సేన గాని, మంత్రులు గాని, లేనివానిని, హత్వా = చంపి, పునః = మరల. ప్రకర్షాత్ - (ఇటు గల బలముయొక్కయు మంత్రులయొక్కయు ఇంకను ఇతరములయొక్కయు) ప్రకర్షాత్ = పెంపువలన, పౌరాన్ = పౌరులను, సమాశ్వాస్య = ఊఱడించి, ఒప్పించి, సమాధానపఱచి, ప్రీతివశవర్తులం జేసికొని, శత్రురాజ్యం సమగ్రం = శత్రుని రాజ్యముగానున్న దానిని, సమగ్రం వసుధాధిరాజ్యం = సమగ్రమైన వసుధయొక్క అధిరాజ్యముగా, బలారేః = ఇంద్రునియొక్క, రాజ్యం ఇవ = రాజ్యమువలె, ప్రాప్తం = పొందబఁడినది - వశీకరింపఁబడినది.

సేనలులేనియు, మంత్రులులేనియు ఆశత్రువు పాలకుఁడు అవలీలగా చంపఁబడినాఁడు. మరల (బలములయు మంత్రులయు) ఉత్కర్షవలననే - పురజనులను, (అంతలోనే) ఊఱడించి ఒప్పించి, శత్రువుచేతిలో నుండిన రాజ్యమే సకల

(అగ్రతో నిరూప్య) భవతు. అత్ర తేన భవితవ్యమ్, యత్రాయం జనపదసముదాయః. అపి నామాయ మారమ్భః క్షితిపతే రార్యక స్యార్యచారుదత్తస్య జీవితేన సఫలః స్యాత్ ? (త్వరితతర ముపసృత్య) అపయాత జాల్మాః. (దృష్ట్వా సహర్షమ్) అపి ధ్రియతే చారుదత్తః సహ వసన్తసేనయా. సంపూర్ణాః ఖల్వస్మత్స్వామినో మనోరథాః.

శ్లో. దిష్ట్యా భో వ్యసనమహార్ణవా దపారా
దుత్తీర్ణం గుణధృతయా సుశీలవత్యా
నా వేవ ప్రియతమయా చిరా న్నిరీక్ష్యే
జ్యోత్స్నాఢ్యం శశినమి వోపరాగముక్తమ్. ౪౮

---

వసుధాధిరాజ్యముగా బలారిరాజ్యమువలె పొందఁబడినది. శత్రువు ఏలుబడిలోనున్న రాజ్యముతో వసుధాధి రాజ్యము సముగ్రముగా - సామంతుల నందఱ చక్కఁగా జయించి ఒప్పించి అనుకూలురం జేసికొని ఇంద్రుని రాజ్యమువలె పొందఁబడినది.

అత్ర తేన భవితవ్యమ్ = ఇక్కడనుండవలయును, అతఁడు, యత్ర ... = ఎక్కడ ఈపల్లెజనులగుంపు - ఉన్నదో అనుట. అపినామ ... = అపినామ - ప్రశ్నయడుగువానికోరికం దెలుపును - అట్లైన అట్లున్న బాగుగానుండునే అన్నట్లు. క్షితిపతేః ఆర్యకస్య ... = ఈయారంభము - పాలక !హనన పౌరసమాశ్వాసాధిరాజ్యప్రాప్తియనునది, చారుదత్తుఁడు బ్రదుకుటతో సఫలమగునా? అనఁగా దాని కంతటికిని ఉద్దిష్టఫలము అది యనుట. అపయాత జాల్మాః = తొలఁగిపొండు మూర్ఖులారా - విమర్శింపకయే పనులుచేయువారలారా. అపి ధ్రియతే ... = వసంతసేనతోనుం గూడ చారుదత్తుఁడు బ్రదికియున్నాఁడా! (ఇరువురం జూచి అనుకొనుటయే ఇది - ఆశ్చర్య సంతోషములతో) సమ్పూర్ణాఃఖలు ... = మాదొర కోరికలు నిండినవి, తీఱినవి కదా.

శ్లో. ౪౮. దిష్ట్యా = సంతోషము సంతోషము! భో = ఓహోయి - వ్యసన మహార్ణవాత్ - (చావు ఆపద యను ఒడ్డులేని మహాసముద్రమునుండి, గుణధృతయా = పగ్గములతో పట్టుకొనఁబడినదియు - పయనములలో మంచి స్వభావము గలదియు, బొక్క ఓడు లేనిదియునగు, నావా ఇవ = ఓడచేతం బోలె, గుణధృతయా = గుణములచే వశీకరింపఁబడినదియు - గుణములను, ధనముం గాదు, వలచి

త త్కృతమహాపాతకః కథ మి మైన ముపసర్పామి. అథవా, సర్వత్రార్జవం శోభతే. (ప్రకాశ ముపసృత్య బద్ధాఞ్జలిః) ఆర్య చారుదత్త.

చారు—నను కో భవాన్ ?

శర్వి—

శ్లో. యేన తే భవనం భిత్త్వా న్యాసాపహరణం కృతమ్
సో ఽహం కృతమహాపాప స్త్వా మేవ శరణం గతః. ౪౫

---

వచ్చినదియు సుశీలవత్యా = చక్కనినడువడి స్వభావముగలదియునైన ప్రియతమ (వసంతసేన) చేత ఉత్తీర్ణం = దాటిన వానిని, చిరాత్ = ఎన్నాళ్ళకు - ఉపరాగ ముక్తం = గ్రహణముచే వదలఁబడినవాఁడును, జ్యోత్స్నాఢ్యం = వెన్నెలగలవాఁడును ఐన, శశినం ఇవ = చంద్రునివలె, నిరీక్షే = చూచుచున్నాను !

ఎటువంటి ఆపదలోపడినాఁడు చారుదత్తుఁడు - ఒడ్డులేని సముద్రమువంటిది. అందుండి ఈమె చేత దాటింపఁబడినాఁడు - ఈమెయో ఆతనిగుణములను వలచి వచ్చినదియు గొప్పశీలవతియు. మహాసముద్రమును పగ్గములతో పట్టుకొనఁబడిన ఓకు వాలు లేని ఓడచేత సులువుగా దాఁటుదురు గదా - అట్లే అన్నట్లు. ఇపుడు ఈమెతో గూడినచారుదత్తుఁడు గ్రహణము వీడి వెన్నెలంగూడిన చంద్రునివలె ఎన్నాళ్ళకు నేత్రపర్వము గావించుచున్నాఁడు !

తత్, మతః, కృత మహాపాతకః ... = గొప్ప పాపము చేసినవాఁడను. (ఈయనయెడ - ఇంటికి కన్నము వేసి బంగారునగలను దొంగిలించితిని కదా నాఁడు.) కథం ఇవ ... = ఎటువలె ఈయనను సమీపింతును ? అథవా = అట్లు గాదు. సర్వత్ర = అన్నియెడలను, ఆర్జవమ్ = కపటములేక సరిగా - చేసినతప్పును ఒప్పుకొనుట మొదలైనది. - నిష్కాపట్యము - శోభతే = రాణించును.

శ్లో. ౪౫. యేన = ఎవనిచేత, తే భవనం భిత్త్వా = నీయింటికి కన్నము వేసి, న్యాస అపహరణం కృతమ్ = ఇల్లడను దొంగిలుట చేయఁబడెనో, సః అహం = వాఁడను నేను, కృతమహాపాపః = గొప్ప పాపము చేసినవాఁడను, త్వాం ఏవ శరణంగతః - నిన్నే శరణు జొచ్చితిని.

చారు—సఖే, మైవమ్. త్వయాసౌ ప్రణయః కృతః.
(ఇతి కణ్ఠే గృహ్ణాతి.

శర్వి—అన్యచ్చ

శ్లో. ఆర్యకేణార్యవృత్తేన కులం మానం చ రక్షతా
పశువద్యజ్ఞవాటస్థో దురాత్మా పాలకో హతః. ౫౦

చారు—కిమ్?

శర్వి—

శ్లో. త్వద్యానం యః సమారుహ్య
య(గ.పా.)త స్త్వాం శరణం పురా

---

సఖే - మిత్రమా, మా ఏవమ్ = అట్లుగాదు. త్వయా = నీచేత, అసౌ ప్రణయః = ఈస్నేహము - కృతః - చేయఁబడినది - 'కృతమహాపాపః' - గొప్ప పాపము చేసినవాఁడ నంటివి - కాదు - 'కృతమహాస్నేహః' అనవలయును. గొప్ప స్నేహము చేసినవాఁడవు. అంతియ కాక వసంతసేనం గూడినవానికి నాకు, ఇది (ఏ సంగాతము అనుట) మఱియొక ప్రియమును అగును. నీవు కావించినవి - స్నేహమును ప్రియమును, కాని పాపము గాదు. ఇతి కణ్ఠే గృహ్ణాతి - అని మెడం గౌఁగిలించుకొనును.

న్యాసాపహరణమున స్నేహమే చేయఁబడినది, ప్రియమే చేయఁబడినది! అదియే వసంతసేనం గూర్చుటకు అవకాశమైనది. అపకారము ఇంచుకయు లేదు.

అన్యచ్చ - ఇది మఱియొకటి.

శ్లో. ౫౦. ఆర్య వృత్తేన = గొప్ప - గౌరవింపఁదగిన నడువడి గలవాఁడును. కులం = కులమును, మానం చ = గౌరవమును, రక్షతా = కాపాడువాఁడును ఐన, ఆర్యకేణ = ఆర్యకునిచేత, పశువత్ - గొఱ్ఱెవలెను మేకవలెను - యజ్ఞవాటస్థః = 'జన్నవాడ' యందున్నవాఁడైన, దురాత్మా = పాడు స్వభావముగల వాఁడైన - ఎంతయు ఖలుఁడైన, పాలకః = పాలకుఁడు, హతః = చంపఁబడినాఁడు.

కిం = ఏమి! (నిజమా?)

శ్లో. ౫౧. యః = ఎవఁడు, పురా = మునుపు, త్వద్ యానం సమారుహ్య = నీబండిని యెక్కి, త్వాం శరణంగతః = నిన్ను శరణుజొచ్చెనో, తేన = వానిచేత,

పశువ ద్వితతే యజ్ఞే
హత స్తే నాద్య పాలకః. ౫౧

చారు — శర్విలక, యో ఽసౌ పాలకేన ఘోషా దానీయ నిష్కారణం కూటాగారే బద్ధ ఆర్యకనామా, త్వయా మోచితః?

శర్వి — యథాహ తత్రభవాన్.

చారు — ప్రియం నః ప్రియమ్.

శర్వి — ప్రతిష్ఠితమాత్రేణ తవ సుహృ దార్యకే ణోజ్జయిన్యాం వేణాతటే కుశావత్యాం రాజ్య మతిసృష్టమ్. త త్ప్రతిమాన్యతాం ప్రథమః సుహృత్ప్రణయః (పరివృత్య) అరే రే ఆనీయతా మయం పాపో రాష్ట్రియశఠః.

(నేపథ్యే)

యథాజ్ఞాపయతి శర్విలకః.

---

అద్య = ఇపుడు, పాలకః = పాలకుఁడు, వితతే యజ్ఞే = చేయఁబడుచున్న యజ్ఞమందు, పశువత్ = మేకవలె, హతః = చంపఁబడినాఁడు.

శర్విలక, యః అసౌ పాలకేన ... = ఎవఁడుగన పాలకునిచేత, గొల్లపల్లె నుండి తెచ్చి, కారణము లేకయే, కూటాగారే = మేడపైకొట్టులో సంకెళ్ళు వేసి ఉంపఁబడినాఁడో, ఆర్యకుఁడు అని, నీచేత (అందుండి) విడిపింపఁబడినాఁడే - వాఁడే గదా.

యథాహ తత్రభవాన్ - అవును. అంతయు, పూజ్యుఁడవు నీవు చెప్పినట్లే - ప్రియం ప్రియమ్ నః = ఎంతయు ప్రియ మది నాకు.

ప్రతిష్ఠిత మాత్రేణ ... = అట్లు (రాజ్యమందు) ప్రతిష్ఠింపఁబడఁగానే, వెంటనే = క్షణమైనను కడవనీక, నీ మిత్రమైన ఆర్యకునిచేత, నీకు, ఉజ్జయిని యందు, వేణానదియొడ్డున (ఉన్న), కుశావతియందు - ఆ పేరుగల నగరమందు - రాజ్యము ఒసంగఁబడినది - నీవు కుశావతిరాజుగా చేయఁబడితివి. తత్ = కావున, ప్రథమః = తొలిదియైన, సుహృత్ప్రణయః = మిత్రునికోరిక - యాచన - దానిని అంగీకరింపుమనునది - ప్రతిమాన్యతాం = గౌరవింపఁబడునుగాక - (అంగీకారము

శర్వి — ఆర్య, న న్వాయ మార్యకో రాజా విజ్ఞాపయతి. — ఇదం మయా యుష్మద్గుణోపార్జితం రాజ్యమ్. త దుపయుజ్యతామ్.

చారు — అస్మద్గుణోపార్జితం రాజ్యమ్!

( నేపథ్యే )

అరే రే రాష్ట్రియశ్యాలక, ఏ హ్యేహి. స్వ స్యావినయస్య ఫల మనుభవ.

( తతః ప్రవిశతి పురుషై రధిష్ఠితః పశ్చా ద్బాహుబద్ధః శకారః )

శకారః — ఆశ్చర్యమ్! [ హీంమాదికే! ]

శ్లో. ఏవం దూర మతిక్రాన్త ఉద్దామ ఇవ గర్దభః
ఆనీతః ఖ ల్వహం బద్ధః కుక్కురో ఽన్య ఇవ దుష్కరః. ౫౨

---

చేత అనుట.) పరివృత్య - అటుతిరిగి - నేపథ్యము - తెరతట్టుగా - వేసగానికి ఎచ్చరిక - అరేరే - ఓరి - ఆనీయతాం ... = అపాపాత్ముఁడు - పాలకుని మఱఁది, దుర్మార్గుఁడు - ఇక్కడికి తేఁబడునుగాక - తెండు వానిని ఇక్కడకు. అయం ఆర్యకః రాజా = ఈయార్యకరాజు విన్నవించుచున్నాఁడు. ఇదం ... = ఈ రాజ్యము నాచేత నీగుణములచేత సంపాదింపఁబడినది - ఇది నీవిచ్చినది నాకు - నీదే - తత్ = కావున, ఉపయుజ్యతాం - నీకు తోఁచినట్లు ఉపయోగింపఁబడును గాక. అస్మద్గుణ ఉపార్జితమ్! = ఏమి నాగుణములచేత సంపాదింపఁబడినదా!

స్వస్య అవినయస్య ... = నీదుండగమునకు ఫలము అనుభవింపుము - రారా, రా. పశ్చాత్ బాహుబద్ధః = పెడకట్టుకట్టఁబడినవాఁడు - బాహువులను వెనుకకు విఱిచి కట్టఁబడినవాఁడు - దొంగలను ఖలులను దండనకై విచారణకు తెచ్చునపుడు అట్లు కట్టుదురు - చేతులను - దాన వారిని - వారివశములో ఉండనీకుండుటకు.

ఆయ్యో!

శ్లో. ౫౨. దూరం అతిక్రాన్తః = చాల దూరము తప్పించుకొని పరువెత్తినట్టివాఁడను, ఉద్దామః గర్దభ ఇవ = కట్టుత్రాడు తెంపుకొని పాఱిపోయిన గాడిదవలె, బద్ధః = (మరల) కట్టఁబడినవాఁడనై, దుష్కరః అన్యః కుక్కుర ఇవ - అఱపని పోకిరియైన ఒక కుక్కవలె, ఆనీతః = కొనిరాఁబడితిని.

[ఎవ్వం దూలమదిక్కన్తే ఉద్దామే విఅ గద్దహే
ఆణీదే క్ఖు హగే బద్ధే హుడే అణ్ణే వ్వ దుక్కలే].

(దిశో ఽవలోక్య) సమన్తత ఉపస్థిత ఏష రాష్ట్రియబన్ధః. తత్కమిదానీ మశరణః శరణం వ్రజామి? (విచిన్త్య) భవతు. త మేవాభ్యుపపన్నశరణవత్సలం గచ్ఛామి? (ఇత్యుపసృత్య) ఆర్యచారుదత్త, పరిత్రాయస్వ పరిత్రాయస్వ. [... శమన్తదో ఉవట్ఠిదే ఏశే లష్టిఅబన్ధే. తా కం దాణి అశలణే శలణం వజామి. ... భోదు. తం జ్జేవ అబ్భువవణ్ణ శలణ వచ్ఛలం గచ్ఛామి. అజ్జచాలుదత్త. పవిత్తాఆహి, పవిత్తాఆహి]. (ఇతి పాదయోః పతతి.

(నేపథ్యే)

ఆర్యచారుదత్త, ముఞ్చ ముఞ్చ. వ్యాపాదయామ ఏతమ్. [అజ్జచాలుదత్త ముఞ్చ ముఞ్చ. వావాదేమ్హ ఏదమ్].

శకా—(చారుదత్తం ప్రతి) భో అశరణశరణ, పరిత్రాయస్వ. [భో అశలణశలణే పలిత్తాఆహి].

చారు—(సానుకమ్పమ్) అహాహ, అభయ మభయం శరణాగతస్య.

---

నేను కట్టు తెగిన గాడిదవలెను అటుపని పోకిరిషుక్కవలెను ఎక్కడికో పరువెత్తితిని - మఱి నన్ను పట్టుకొని కట్టివేసి తెచ్చినారు - సమన్తతః - బన్ధః = ఇదిగో రాష్ట్రియునికి ఈకట్టు అంతటనువచ్చినది - ఎటును తప్పించుకొనుటకు శక్యముగాదు అనుట - తత్ కం ఇదానీం ... = కావున ఇపుడు ఇట్లు దిక్కుమాలినవాఁడనైతినే, ఎవరిని శరణుజొత్తును? భవతు = కానీ - తం ఏవ = అతనినే - అభ్యుపపన్నశరణవత్సలం - రక్షణఁగోరితఁటిని శరణుఅన్నవారియెడ వత్సలుఁడైన బిడ్డలయందు తల్లింబోలె ప్రీతిగలవాఁడైన - వానినే - గచ్ఛామి = తఱిసెదను - ఆర్యచారుదత్త - చారుదత్తయ్యా, కాపాడవయ్యా, కాపాడు. అని పాదముల వ్రాలుచున్నాఁడు. సానుకమ్పమ్ = కనికరముతో - అభయం శరణాగతస్య - భయము

శర్వి—(సావేగమ్) ఆః అపనీయతా మయం చారుదత్త పార్శ్వాత్. (చారుదత్తం ప్రతి) న నూచ్యతాం కి మస్య పాప స్యానుష్ఠీయతా మితి.

శ్లో. ఆకర్షన్తు సుబద్ధ్వైనం శ్వభిః సంఖాద్యతా మథ
శూలే వా తిష్ఠతా మేష పాట్యతాం క్రకచేన వా. ౫౩

చారు—కి మహం యద్బ్రవీమి, తత్క్రియతే?

శర్వి—కో ఽత్ర సన్దేహః?

శకా—భట్టారక చారుదత్త. శరణాగతో ఽస్మి. తత్పరి త్రాయస్వ. య త్తవ సదృశం తత్కురు. పున ర్నేదృశం కరి ష్యామి. [భట్టాలఅ చాలుదత్తా, శలణాగదే హ్మి. తా పలిత్తా ఽహి. జం తుహ శలిశం తం కలేహి. పుణో ణ ఈదిశం కలిశ్శమ్].

---

లేదు - రక్షణయే - శరణుపొందినవానికి. సావేగమ్ = సంభ్రమముతో - నను - అయ్యా, ఉచ్యతాం = చెప్పఁబడునుగాక - సెలవీయవయ్యా ఈపాపాత్మునికి ఏమి సేయఁదగునో.

శ్లో. ౫౩. ఏనం సుబద్ధ్వా = వీనిని గట్టిగా కట్టి, ఆకర్షన్తు = బడబడ ఈడ్తురు గాక. అథ - అట్లుగాకున్న, కాదా, అటుత వాఁత, శ్వభిః సంఖాద్యతాం= కుక్కలచే తినిపింపఁబడునుగాక. కుక్కలకు వేయఁబడునుగాక, తినుటకు - శూలే వా ఏష తిష్ఠతాం - కొఱ్ఱున నేని నిలంబడునుగాక ఇతఁడు; వా = కాదేని, క్రకచేన = ఱంపముచేత, పాట్యతాం = చీల్పఁబడునుగాక.

ఇట్టి దండనలం బొందింపఁబడునుగాక - అందులకు మాచేతులు కన్నులు - చేయింపను చూడను - పురపురలాడుచున్నవి - అనుట.

కిం అహం యద్ బ్రవీమి తత్ క్రియతే - ఏమి, నేను ఏమి చెప్పిన అది చేయఁబడునా? - నేను చెప్పినట్లు చేయుదురా వీనికి. కః అత్ర సన్దేహః? = ఆ విషయమున సందేహ మేమున్నది. యత్ తవ సదృశం తత్ కురు = నీకు (అనఁగా నీయౌదార్య ఘనతలకు ఏది తగునో దానిని చేయుము. (వీరిమాటలు వినకుము.

(నేపథ్యే)

పౌరాః, వ్యాపాదయత. కింనిమిత్తం పాతకీ జీవ్యతే? [పౌరాః, వావాదేధ. కింణిమిత్తం పాదకీ జీవావీఅది?]

(వసన్తసేనా వధ్యమాలాం చారుదత్తస్య కణ్ఠా దపనీయ శకార స్యోపరి క్షిపతి)

శకా—గర్భదాసీపుత్రి, ప్రసీద ప్రసీద. న పున ర్మ్మారయిష్యామి. తత్పరిత్రాయస్వ. [గబ్భదాశీధీఏ. పశీద పశీద. ణ ఉణ మాలఇశ్శమ్. తా పలిత్తాఆహి].

శర్వి—అరే రే, అపనయత — ఆర్యచారుదత్త, ఆజ్ఞాప్యతామ్ — కి మస్య పాప స్యానుష్ఠీయతామ్.

చారు—కి మహం యద్బ్రవీమి, తత్క్రియతే?

శర్వి—కో ఽత్రసన్దేహః?

చారు—సత్యమ్?

శర్వి—సత్యమ్.

చారు—య ద్యేవం, శీఘ్రం మయం-

శర్వి—కిం హన్యతాం?

చారు—నహి నహి - ముచ్యతామ్.

శర్వి—కిమర్థమ్?

---

కిన్నిమిత్తం పాతకీ జీవ్యతే = ఎందులకు పాతకి చంపక విడువఁబడుట? అని పౌరుల వాక్కు వినంబడినది. వసంతసేన వధ్యమాలను చారుదత్తుని మెడనుండి తివిచి శకారునిమీఁద పడవేసినది - పాఱవేసినది. గర్భదాని - పుట్టుతోత్తా- మన్నించు మన్నించు - మరల చంపను (నిన్ను) కావున-కాపాడుము - అపనయత - అవలికి కొనిపొండు. యది ఏవం = అట్లగు నేని, త్వరగా వీఁడు విడిచి పెట్టఁబడును గాక - కిమర్థమ్ = ఎందులకు?

చారు—

శ్లో. శత్రుః కృతాపరాధః శరణ ముపేత్య పాదయోః పతితః.
శస్త్రేణ న హన్తవ్యః

శర్వి—ఏవమ్. తర్హి శ్వభిః ఖాద్యతామ్

చారు—న హి -
ఉపకారహత స్తు కర్తవ్యః. ౫౮

శర్వి—అహో ఆశ్చర్యమ్, కిం కరోమి? వద త్వార్యః.

చారు—త న్ముచ్యతామ్.

శర్వి—ముక్తో భవతు.

శకా—ఆశ్చర్యమ్! ప్రత్యుజ్జీవితో ఽస్మి. [ హీమాదికే! పత్తుజ్జీవిదే హ్మి. ] (ఇతి పురుషైః సహ నిష్క్రాన్తః.

శ్లో. ౫౮. శత్రుః = పగతుఁడు, కృతాపరాధః = తప్పుచేసినవాఁడు, శరణం ఉపేత్య = శరణుపొంది, పాదయోః పతితః = పాదములం బడినవాఁడు, శస్త్రేణ న హన్తవ్యః = ఆయుధముతో - కత్తి కటారి కొఱ్ఱు - మొదలగువానితో, చంపఁబడఁగూడదు; తు = మఱేమన. ఉపకారహతః = ఉపకారముచే - కొట్టఁబడినవాఁడు - చంపఁబడినవాఁడు. కర్తవ్యః = చేయఁబడఁదగును.

కత్తితోఁ గొట్టిన - వాఁడు తీఱి పోవును, కొట్టిన వానికి కసి తీఱిపోవును - నిజముగా వాఁడేమో మనసా చావఁడు. దేహానసే. ఉపకారములచే చంపిన - ఇది వానిమనసుకు దండన యగును - దానికి చచ్చినంత యగును - దాన నిజముగా ఎంతయో సంస్కారము వానికిని లోకమునకుం గూడను కలుగును - 'హతః' - నిజముగావాఁడు ఆయుపకారముచే, మనసా, ఇక నెప్పటికిని లేకయుండునట్లు చచ్చును.

'పొసఁగ మేలు చేసి పొమ్మనుటే చావు'. (= ఉపకారహతః) వే. వేం. శరణాగత రక్షణ మానరానిది - చూ. రామా. - IV - 18.

బద్ధాఞ్జలిపుటం దీనం యాచన్తం శరణాగతమ్
న హన్యా దానృశంస్యార్థ మపి శత్రుం పరంతప.

( నేపథ్యే కలకలః )

( పున ర్నేపథ్యే )

ఏ షార్యచారుదత్తస్య వధూ రార్యా ధూతా పదే వసనాఞ్చలే విలగన్తం దారక మాక్షిపన్తీ బాష్పభరితనయనై ర్జనై ర్నివార్యమాణా ప్రజ్వలితే పావకే ప్రవిశతి. [ఏసా అజ్జచాలుదత్తస్స వహుఆ అజ్జా ధూదా పదే వసణఞ్చలే విలగన్తం దారఅం ఆక్ఖివన్తీ బాప్ఫభరిద ణఅణేహిం జణేహిం ణివారిజ్జమాణా పజ్జలిదే పావఏ పవిసది].

శర్వి—( ఆకర్ణ్య నేపథ్యాభిముఖ మవలోక్య ) కథం! చన్దనకః. చన్దనక, కి మేతత్ ?

చన్ద—( ప్రవిశ్య ) కిం న పశ్య త్యార్యః? మహారాజప్రాసాదం దక్షిణేన మహా ఞ్జనసమ్మర్దో వర్తతే. (ఏషా ... ఇత్యాది పునః పఠతి) కథితం చ మయా తస్యై, యథా — 'ఆర్యే, మా సాహసం కురుష్వ. జీవ త్యార్య చారుదత్తః' ఇతి. పరం తు దుఃఖవ్యాపృతతయా కః శృణోతి? కః ప్రత్యయతే?

---

ప్రత్యుజ్జీవితః అస్మి - అబ్బ - మరల బ్రదికినానురా బాబూ. ఏషా ఆర్యచారుదత్తస్య వధూః - ఇదిగో ఈమె, చారుదత్తయ్య భార్య, ధూతమ్మ, పాదమునందు (కదలనీకయు) వసనాంచలమున - చీరకొంగున (పోనీకయు), విలగన్తం = తగులుకొనుచున్న బాలుని అవలవ త్రోయుచు, కన్నీరు నిండిన కన్నులుగల జనులచే వలదని మాన్పఁబడుచున్నదై, మంటమండుచున్న నిప్పులో ప్రవేశించుచున్నది. - అని లోపలమాటలు - వినఁబడినవి. తెరవంక చూచి - కథం చన్దనకః! ఎట్లూ! చందనకుఁడు! (ఇదిగో వచ్చినాఁడే అనుట.)

కిం న పశ్యతి ఆర్యః - ఏమి అయ్య చూడలేదా - మహారాజప్రాసాదం దక్షిణేన ... = మహారాజు బంగాళాకు దక్షిణమున, ... పెద్ద జనుల గుంపు ఉన్నది, కథితం చ మయా తస్యై - నాచేత ఆమెకు చెప్పఁబడినది - ఆమెకు నేను చెప్పితిని - సాహసము చేయకమ్మ. చారుదత్తయ్య బ్రదికియున్నాఁడు అని.

[ కిం ణ పేక్ఖది అజ్జో. మహారాఅప్పసాదం దక్ఖిణేణ మహన్తో జణ సమ్మద్దో వట్టది. ... కధిదం అ మహ తీఏ జధా - అజ్జే, మా సాహసం కరేహి, జీవది అజ్జచాలుదత్తో త్తి. పరం తు దుక్ఖవావుడ దాఏ, కో సుణేది, కో పత్తిఆఅది ].

చారు__(సోద్వేగమ్) హా ప్రియే, జీవత్యపి మయి కి మేత ద్వ్యవసితమ్? (ఊర్ధ్వ మవలోక్య దీర్ఘం నిశ్వస్య చ)

శ్లో. న మహీతలస్థితిసహాని భవ
చ్చరితాని చారుతరితే యదపి
ఉచితం తథాపి పరలోకసుఖం
న పతివ్రతే తవ విహాయ పతిమ్. ౨౨

(ఇతి మోహ ముపగతః)

శర్వి__అహో ప్రమాదః!

---

పరంతు = ఐనను, దుఃఖవ్యాపృతతయా ... దుఃఖము పడుచున్నందున - అందు మునిఁగియున్నందున - ఎవరు వినుదురు, ఎవరు నమ్ముదురు? హా ప్రియే, జీవత్యపి మయి కిం ఏతత్ వ్యవసితమ్ - హా ప్రేయసి, నేను బ్రదికి యున్నను గూడ ఇదేల పూనఁబడినది?

శ్లో. ౨౨. చారుచరితే = ఓచక్కని నడవడి గలదానా, భవచ్చరితాని = నీ సద్వృత్తములు, మహీతలస్థితిసహాని = భూలోకపు ఉనికిని ఓర్చునవి - దేవతలకు తగినవి, యదపి భవన్తి యదపి న భవన్తి = తగినవైనను కాకున్నను, తథా అపి - అట్లయిననుంగూడ, పతివ్రతే = ఓపతివ్రతా, పతిం విహాయ = భర్తను విడిచి - తవ = నీకు ఒంటరిగా (ఒకతెకే, పరలోకసుఖం = స్వర్గసుఖము, న ఉచితమ్ = తగదు.

నీనడవడులు దేవతలకు తగినవి ఐనను. నీకు భర్తను విడిచి ఒంటరిగా పరలోక సుఖము తగదు. నన్ను విడిచి పెట్టి నీవు పోఁదగదు. ఇతి మోహం ఉపగతః - అనుచు మూర్ఛిల్లినాఁడు.

శ్లో. త్వరయా సర్పణం తత్ర మోహం మార్యో౽త్రచాగతః
హా ధిక్ ప్రయత్నవైఫల్యం దృశ్యతే సర్వతోముఖమ్. ౫౬.

వసన్త—సమాశ్వసితు ఆర్యః. తత్ర గత్వా జీవయత్వార్యామ్. అన్యథాధీరత్వే నానర్థః సంభావ్యతే. [సమస్ససిదు అజ్జో. తత్త గదుఅ జీవావేదు అజ్జామ్. అణ్ణధా అధీరత్తణేణ అణత్థో సంభావీఅది].

చారు—(సమాశ్వస్య సహసోత్థాయ) హా ప్రియే, క్వాసి? దేహి మే ప్రతివచనమ్.

చన్ద—ఇత ఇత ఆర్యః. [ఇదో ఇదో అజ్జో]

(ఇతి సర్వే పరిక్రామన్తి.)

---

శ్లో. ౫౬. తత్ర = అచటికి - ధూతాదేవికడకు, త్వరయా సర్పణం = వడిగాపోవుట!, అత్ర = (ఇంతలో) ఇక్కడ, ఆర్యః=అయ్య, మోహంచ ఆగతః = మూర్ఛనుపొందినాఁడు! (కావున) హాధిక్ - అయ్యో ఇసీ, సర్వతోముఖమ్ = అన్ని తెఱంగులను, ప్రయత్నవైఫల్యం = ప్రయత్నము నెఱవేఱకపోవుట, దృశ్యతే = కానవచ్చుచున్నది,

ధూతకడకుం బోవలెను, చారుదత్తునిం గోనిపోవలెను - ఈయనం జూచి ఆమెను మాన్పి రక్షించుటకు - రెండు పనులును - ఇదిగాని అదిగాని నెఱవేఱునట్లు అగపడలేదే!

సమాశ్వసితు ఆర్యః - ఊఱడిల్లును గాక, అయ్య. తత్రగత్వా ... = అక్కడికి పోయి అక్కను బ్రదికించును గాక. అన్యథా = లేకున్న - అట్లుగాకున్న, అధీరత్వేన = ఆమె యధైర్యముచేత, అయ్య ముందుపోయి తాను వెనుక చిక్కుదునేమో అను అధైర్యముచేత నిప్పులో దూకవలయునను తొందరచేత అనర్థము కలుగునని తోఁచుచున్నది. 'అన్యథా ...' = (నీవు) తాలిమి చేసిన చెలువుగలిగెడిని' - పా_ధీరత్వేన - వే. వెం. అంతట యథానిర్దిష్ట ధూతాదేవియు, చీరచెఱగులాఁగుచు రోహసేనుఁడును, వానివెంట వానింగావ విదూషకుఁడును, రదనికయు - ప్రవేశింతురు.

(తతః ప్రవిశతి యథానిర్దిష్టా ధూతా, చేలాఞ్చల మాకర్షక్ష విదూషకే ణానుగమ్యమానో రోహసేనో రదనికా చ)

ధూతా—(సాస్రమ్) జాత, ముఞ్చ మామ్. మా విఘ్నం కురుష్వ. బిభే మ్యార్యపుత్ర స్యామఙ్గలాకర్ణనాత్. [జాద ముఞ్చేహి మమ్. మా విఘ్నం కరేహి. భీఆమి అజ్జఉత్తస్స అమఙ్గళాకణ్ణణాదో. (ఇత్యుక్త్వా యాఞ్చల మాకృష్య పావకాభిముఖం పరిక్రామతి).

రోహసేనః—మాత రార్యే, ప్రతిపాలయమామ్. త్వయా వినా న శక్నోమి జీవితం ధర్తుమ్. [మాద అజ్జఏ, పడివాలేహి మమ్. తుఏ విణా ణ సక్కుణోమి జీవిదం ధారేదుమ్].

(ఇతి త్వరిత ముపసృత్య పున రఞ్చలం గృహ్ణాతి.

విదూ—భవత్యా స్తావ ద్బ్రాహ్మణ్యా భిన్నత్వేన చితాధిరోహణం పాప ముదాహరన్తి ఋషయః. [భోదీఏ దావ బహ్మణీఏ భిణ్ణత్తణేణ చితాధిరోహణం పావం ఉదాహరన్తి రిసీఓ].

ధూతా—వరం పాపాచరణమ్. న పున రార్యపుత్ర స్యామఙ్గలాకర్ణనమ్. [వరం పావాచరణే. ణ ఉణ అజ్జఉత్తస్స అమంగలాకణ్ణణమ్.]

---

జాత, ముఞ్చ మాం ... = బిడ్డా, విడువరా నన్ను. నాకు అడ్డము రాకు, అంతరాయము కలుగనీకు - ఆర్యపుత్రునింగూర్చిన యమంగళము వినుటవలన - విందునో అని - భయపడుచున్నాను. మాతః ఆర్యే - అమ్మా అమ్మా, ప్రతిపాలయ మాం = కనుపెట్టు నన్ను; రానీ నన్నుఁగూడ నీతో. నీవు లేక నేను బ్రదికియుండ లేను. అని త్వరగా సమీపించి, మరల కొంగు పట్టుకొనును, భవత్యాః తావత్ బ్రాహ్మణ్యాః ... = నీకుగనబ్రాహ్మణికి - ఒంటరిగా - భర్తతో కలియక, చితనెక్కుట పాప మని ఋషులు అందురు.

పృథక్ చితిం సమారుహ్య న విప్రాగన్తుమర్హతి
అన్యాసామేవ నారీణాం స్త్రీ ధర్మోఽయం పరః స్మృతః.

వరం పాపాచరణం - అపాపమునైనను చేయుట మేలు, ఆర్యపుత్రుం గూర్చిన యమంగళము వినుట మేలు గాదు. అహం అపి యథోపదేశినీ అస్మి

శర్వి—(పురో ఉవలోక్య) ఆసన్నహుతేవ హోర్వా. త త్త్వర్యతాం త్వర్యతామ్. ]

(చారుదత్త స్త్వరితం పరిక్రామతి)

ధూతా—రదనికే, అవలమ్బస్వ దారకమ్, యావ దహం సమీహితం కరోమి. [రఅణిఏ, అవలమ్బ దారఅమ్, జావ అహం సమీహిదం కరేమి. ]

చేటీ—(సకరుణమ్) అహ మపి యథోపదేశి న్యస్మి భట్టిన్యాః. [అహం పి జధోవదేసిణి మ్హి భట్టిణీఏ].

ధూతా—(విదూషక మవలోక్య) ఆర్య స్తావ దవలమ్బ్యతామ్. [అజ్జో దావ అవలమ్బీదు].

విదూ—(సావేగమ్) సమీహితసిద్ధ్యై ప్రవృత్తేన బ్రాహ్మణో ఽగ్రే కర్తవ్యః. అతో భవత్యా అహ మగ్రణీ ర్భవామి. [సమీహితసిద్ధిఏ పఉత్తే ణ బహ్మణో అగ్గదో కాదవ్వో. అదో భోదీఏ అహం అగ్గణీ హోమి].

ధూతా—కథమ్! ప్రత్యాదిష్టా స్మి ద్వాభ్యాం (బాలక మాలిఙ్గ్య) జాత, త్వ మేవ పర్యవస్థాప యాత్మాన మస్మాకం తిలోదకదానాయ. అతిక్రాన్తే కిం మనోరథైః? (సనిఃశ్వాసమ్) న

భట్టిన్యాః = నేనును అగ్నిపతనము ఎట్లు చేయవలయునో దానిని ఉపదేశించుదాన నగుదును భట్టినికి - దొరసానమ్మగారికి - నీకన్న ముందే నేను అగ్నిం జొత్తును అనుట. దానిం జూచి అట్లే అమ్మయు చేయును గాక అనుట. ఆర్యః తావత్ అవలమ్బతాం - అయ్యగన పట్టుకొనును గాక (బాలుని) 'సమీహితసిద్ధ్యై ప్రవృత్తేన - జనేన' అని శేషము - కోరికసిద్ధిం గోరి కడంగినవారికి, బ్రాహ్మణుఁడు ముందు ఉంచుకొనఁబడ వలయును. అతః భవత్యాః - ... = కావున అమ్మకు నేను ముందువాఁడ నగుదును.

ఖ ల్వార్యపుత్ర స్త్వాం పర్యవస్థాపయిష్యతి. [కధం పచ్చాదిట్ఠమ్హి దువేహిం. ... జాద తుమం జ్జేవ పజ్జవట్ఠావేహి అత్తాణాం, అమ్హాణాం తిలోదఅదాణాఅ. అదిక్కన్తే కిం మణోరహేహిం. ... ణ క్ఖు అజ్జఉత్తో తుమం పజ్జవట్ఠావిస్సది].

చారు—(ఆకర్ణ్య సహ సోపసృత్య) అహ మేవ పర్యవస్థాపయామి బాలిశమ్. (ఇతి బాలకం బాహుభ్యా ముత్థాప్య వక్షసాలిఙ్గతి).

ధూతా—(విలోక్య) ఆశ్చర్యమ్! ఆర్యపుత్ర స్యైవ స్వరసంయోగః. (పున ర్నిపుణం నిరూప్య సహర్షమ్) ది ష్ట్యార్యపుత్ర ఏ వైషః. ప్రియం మే ప్రియమ్. [అమ్మహే అజ్జఉత్తస్స జ్జేవ సరసంజోఓ. దిట్ఠిఆ అజ్జ ఉత్తో జ్జేవ ఏసో. పిఅం మే పిఅం.].

బాలకః—(విలోక్య సహర్షమ్) ఆశ్చర్యమ్! పితా మాం పరిష్వజతి. (ధూతాం ప్రతి) ఆర్యే, వర్ధసే. తాత ఏవ మాం

---

కావున ఎవరును బాలుంబట్టుకొని నిలుపుటకు అంగీకరింపలేదు. జాత, త్వం ఏవ ... = బిడ్డ నీవే నిన్ను నిలువరించుకోరా - సమాళించుకోరా నిన్ను, అస్మాకం తిలోదకదానాయ = మాకు నువ్వుల నీళ్ళువదలుటకు. అతిక్రాన్తే, కిం మనోరథైః - కాలము అతిక్రమించి పోయినతర్వాత, లేక 'దాఁటిపోయినదాని విషయమై' కోరిక లెందులకు? వే. వేం. ఏమిప్రయోజనము అనుట. ఆర్యపుత్రుఁడేమో ఇఁక నిన్ను కాపాడఁబోఁడు - ఆర్యపుత్రుఁడు పోయినాఁడు, ఆర్యపుత్రుఁడు పోయినందున నేనును పోయినదాననే - నిన్ను నేను కాపాడుట ఎక్కడిది? నీవు లేక నేను బ్రదికి ఉండలేనందులే - ఎట్లురా నాయనా - అనుట.

అహం ఏవ పర్యవస్థాపయామి ... = ఆమాటలు చెవింబడినవాఁడు చారుదత్తుఁడే తటాలున డగ్గఱి - నేనే నిలువరింపఁగలను - కాపాడఁగలను - అని బాలుని రెండు బాహువులతో ఎత్తుకొని రొమ్మున కానించుకొని కౌఁగిలించుకొనుచున్నాఁడు. అమ్మహే అర్యపుత్త్రస్య ఏవ ... = ఆహా! ఆర్య పుత్రునిదేగొంతు. మరల నిపుణముగా పరకాయించి చూచి - ఏమి భాగ్యము! ఆర్యపుత్రుఁడే

పర్యవస్థాపయతి. [అమ్మో! ఆవుకో మం పరిస్సజది. ... అజ్జఏ, వడ్ఢవీఅసి. ఆవుకో జ్జే మం పజ్జవట్ఠావేది.] (ఇతి ప్రత్యాలిఙ్గతి.

చారు—(ధూతాం ప్రతి)

శ్లో. హా ప్రేయసి, ప్రేయసి విద్యమానే
కో ఽయం కఠోరో వ్యవసాయ ఆసీత్ ?
అమ్భోజినీ లోచనముద్రణం కిం
భానా వనస్తంగమితే కరోతి. ౫౭

ధూతా—ఆర్యపుత్ర, అత ఏవ సా ఽచేత నేత్యుచ్యతే. [అజ్జఉత్త, అదో జ్జేవ సా అచేత ణేతి వుచ్చీఅది].

విదూ—(దృష్ట్వా సహర్షమ్) ఆశ్చర్యం భోః! ఏతాభ్యా మే వాక్షిభ్యాం ప్రియవయస్యః ప్రేక్ష్యతే-అహో, సత్యాః ప్రభావః!

---

ఈయన. నాకెంత ప్రియముగా ఉన్నది, ఆవుకః మాం ... = నాయన నన్ను కౌఁగిలించుకొనుచున్నాఁడు - అమ్మా - వర్ధిల్లుచున్నావు! నాయనయే ... అని బదులు నాయనను కౌఁగిలించు కొనుచున్నాఁడు.

శ్లో ౫౭. హా ప్రేయసి=నాయత్యంతప్రియురాలా, ప్రేయసి విద్యమానే= ప్రియుఁడను నేను ఉండఁగానే, కః అయం కఠోరః వ్యవసాయః = ఈ ఓర్వరాని కఠినమయిన - అగ్ని ప్రవేశారంభము - ఏమి ఎట్టిది, ఎందులకు, ఆసీత్ = ఆయెను. అమ్భోజనీ = తామరతీఁగ, భానా అనస్తంగమితే = సూర్యుఁడు అస్తమింపకుండఁగా, లోచనముద్రణం కరోతి కిం = కన్నులు మూసికొనుటం జేయునా?

ప్రేయసీ, ప్రియుఁడను నేను ఉండఁగా ఈభయంకరమైన ఖరముగు ఆరంభ పూనితివి? సూర్యుఁడు అస్తమించిన తర్వాత కదా తామర తీఁగ తామరపూలను- తనకనులను - మొగుడ్చుకొనును.

అత ఏవ = అందువలననే అది అచేతన మని యనంబడును. 'చేతనమైనచో భానుఁ డస్తమించువఱకు వేచునా? ముందుగానే కనులు మూసికొనును గాని' వే. వేం. అహో సత్యాః ప్రభావః = ఆశ్చర్యము పతివ్రతయొక్క ప్రభావము.

యయా జ్వలనప్రవేశవ్యవసాయే నైవ ప్రియసమాగమం ప్రాపితా. (చారుదత్తం ప్రతి) జయతు జయతు ప్రియవయస్యః. [హీహీభోః! ఏదేహి జ్జేవ అచ్ఛీహి పిఅవఅస్సో పేక్ఖీఅది. అహో సదీప పహావో! జదో జలణప్పవేశవ్వవసాఏణ జ్జేవ పిఅసమాగమం పావిదా. జేదు జేదు పిఅవఅస్సో].

చారు—ఏహి మైత్రేయ. (ఇత్యాలిఙ్గతి).

చేటీ—అహో సంవిధానకమ్! ఆర్య, వన్దే. [అహో సంవిధాణఅమ్! అజ్జ, వన్దామి. (ఇతి చారుదత్తస్య పాదయోః పతతి.)

చారు—(పృష్ఠే కరం దత్త్వా) రదనికే, ఉత్తిష్ఠ. (ఇత్యుత్థాపయతి).

ధూతా—(వసన్తసేనాం దృష్ట్వా) దిష్ట్యా కుశలినీ భగినీ! [దిట్ఠిఆ కుసలిణీ బహిణిఆ].

వసన్త—అధునా కుశలినీ సంవృత్తాస్మి. [అహుణా కుసలిణీ సంవుత్తమ్హి]. (ఇత్యన్యోన్యమాలిఙ్గతః).

శర్వి—దిష్ట్యా జీవితసుహృద్వర్గ ఆర్యః.

---

... వ్యవసాయేన ఏవ - పూనుఁదలమాత్రముచేతనే - పనిని నిర్వర్తింపకయే - అనుట. అహో సంవిధానకమ్ = ఎంత ఆశ్చర్యకరమైన సందర్భము - ఇది కవి తన నాటకముంగూర్చి పలికిన మాటయు అగును - భవభూతి అట్లే పాత్రభాషితములవశమున - తన యుత్తరచరిత సంవిధానమును మాలతిలోని సంవిధానమును తలఁచుకొని అలరినాఁడు - దిష్ట్యా = నాభాగ్యాన, చెల్లెలు - అని ధూతచే వసంతసేనకు నిర్దేశము - (వసంతసేన) కుశలిని - బ్రదికి క్షేమముగా ఉన్నది. అసూయ మందునకును లేదు - చెల్లెలిప్రీతియే.

దిష్ట్యా - సంతోషము సంతోషము - అయ్య బ్రదికింపఁబడిన సుహృత్తుల - చెలుల - వర్గముకలవాఁడు! యుష్మత్ప్రసాదేన - నీయనుగ్రహమున.

చారు—యుష్మత్ప్రసాదేన.

శర్వి—ఆర్యే వసన్తసేనే, పరితుష్టో రాజా భవతీం వధూశబ్దే నానుగృహ్ణాతి.

వసన్త—ఆర్య, కృతా ర్థాస్మి. [ అజ్జ, కధత్తమ్హి ].

శర్వి—(వసన్తసేనా మవగుణ్ఠ్య చారుదత్తం ప్రతి) ఆర్య, కి మస్య భిక్షోః క్రియతామ్ ?

భిక్షుః—ఇద మీదృశ మనిత్యత్వం ప్రేక్ష్య ద్విగుణతరో మమ ప్రవ్రజ్యాయాం బహుమానః సంవృత్తః. [ ఇమం ఈదిశం అణిచ్చత్తణం పేక్ఖిఅ దిఉణతలే మే పవ్వజ్జాఏ బహుమాణే సంవుత్తే ].

చారు—సఖే, దృఢో ఽస్య నిశ్చయః. త త్పృథివ్యాం సర్వవిహారేషు కులపతి రయం క్రియతామ్.

శర్వి—యథా హార్యః.

---

వధూశబ్దేన - కులవధువను పేరుతో - భోగమునతనము మాన్పి - యుథాశాస్త్రపు భార్యగా - అనుగ్రహించుచున్నాఁడు - పరితుష్టః - సంతోషించినవాఁడై - వసంతసేన శర్విలకునికి, దాన ఆర్యకునికి ఎంతయో సాయపడినది - వసంతసేనపేరుతో ఆర్యకుఁడు బండిలో చందనకునిచేత తప్పింపఁ బడినాఁడు. శర్విలకుఁడు లేకున్న ఆర్యకుఁడు లేఁడు, వసంతసేన లేకున్న శర్విలకుఁడు లేఁడు. అవగుణ్ఠ్య = మేల్ముసుగు వైచి - అది దొరసాని - కులవధువు, నేపథ్యమున ఆచారము. భిక్షో కిం తవ బహుమతమ్ = నీకు ఏమి యిష్టము ? ఈ జరిగిన దంతయు చూచి తలపోసికొనఁగా లోకమున సర్వము అనిత్య మనునది మఱియు గట్టిగా తోఁచినది. కావున - ద్విగుణతరో మమ ... = నాకు సన్న్యాసమున బహుమానము - గౌరవము - అది యెంతయు శ్లాఘ్య మను మతి రెండింత లైనది. పృథివ్యాం ... = ఈ భూలోకములో ఎల్ల విహారములకు - బౌద్ధసన్న్యాసాలయములకు, కులపతిగా ఇతఁడు చేయఁబడునుగాక. వసంతసేనయు తన కృతజ్ఞతం దెలుపుచున్నది - భిక్షువునకు చేసిన బహుమానముచే - ఇప్పుడు బ్రతికితిని - అనుచున్నది - అతనికి ప్రత్యుపకారము, తన్ను అట్లు బ్రతికించినదానికి ఏమి చేయఁ

భిక్షుః—ప్రియం నః ప్రియమ్. [పిఅం ణో పిఅమ్.]

వసన్త—సాంప్రతం జీవాపి తాస్మి. [సంపదం జీవావిదమ్హి].

శర్వి—స్థావరకస్య కిం క్రియతామ్?

చారు—సువృత్తః అదాసో భవతు, తే చాణ్డాలాః సర్వ చాణ్డాలానా మధిపతయో భవతు. చన్దనకః పృథివీదణ్డపాలకో భవతు. తస్య రాష్ట్రియశ్యాలస్య యథైవక్రియా పూర్వ మాసీత్, వర్తమానే తథైవా స్యాస్తు.

శర్వి—ఏవం, యథా హార్యః. పర మేనం ముఞ్చ ముఞ్చ, వ్యాపాదయామి.

చారు—అభయం శరణాగతస్య. (శత్రుః కృతాపరాధః X - ౫౨. ఇత్యాది పఠతి.)

---

గలనా అని కొదువ పడుచుండినది. ఇపుడు అది తీఱినది. స్థావరకస్య కిం క్రియతాం-శకారునిచేటునికి చారుదత్తుని బ్రదికింపప్రాణమునకు తెగి మిద్దెమీఁదనుండి క్రిందికి దూఁకి అట్లంతయు ప్రయత్నించినాఁడే, తన శక్తికొలఁది.

సువృత్తః - మంచినడువడి కలవాఁడు - అని చారుదత్తయ్య మెప్పు. ఇఁకను బానిసకాక, స్వతంత్రుఁడగునుగాక. తన పుట్టుబానిసతనమున కెంతయో దుఃఖించుచుండినాఁడు. తగిన బహుమానము. చందనకుఁడు - ఆర్యకునిబంట లోను అతఁడు రాజగుటలోను ఇంతంత యనరాని సాయముచేసిన వాఁడు - పృథివీ ... = ఈరాజ్యానికి - భూమికి అంతటికి (దణ్డపాలకః = ) ప్రధాన సేనాపతి యగునుగాక. 'Let శకార be happy and free as before, en-joying all his pleasures and possessions.' వే. వేం. ఆరాష్ట్రియునికిని-మునుపటి అతని పని ( = క్రియ), రాష్ట్రియత, ఇపుడు ఈరాజ్యానను అట్లే యుండును గాక. ఏవం - యథా ఆహ ఆర్యః - అట్లే - అన్నియు అయ్యఁడు చెప్పినట్లే జరుగును - పరం ఏనం ... = మఱి వీనిని మాత్రము విడువు, విడువుము - చంపుదును. అభయం శరణాగతస్య - వాఁడు శరణు అన్నాఁడు, నేను 'అభయం' అన్నాను, శత్రుః - ఇత్యాది చెప్పితిని కదా.

శర్వి—తదుచ్యతాం కిం తే భూయః ప్రియం కరోమి.

చారు—అతఃపర మపి ప్రియ మస్తి?

శ్లో. లబ్ధా చారిత్రశుద్ధి, శ్చరణనిపతితః
 శత్రుర ప్యేషముక్తః,
ప్రోత్ఖాతారాతిమూలః ప్రియసుహృ దచలా
 మార్యకః శాస్తి రాజా,
ప్రాప్తా భూయః ప్రియేయం, ప్రియసుహృది భవాన్
 సఙ్గతో మే వయస్యో
లభ్యం కిం చాతిరిక్తం య దపర మధునా
 ప్రార్థయే ఽహం భవన్తమ్? ౫౮

తత్ ఉచ్యతాం ... = మతి చెప్పఁబడును గాక - చెప్పుము అనుట. కిం తే భూయః ప్రియం కరోమి = నీకు ఇంకను ఏమి ప్రియము ఒనరింతును?

శ్లో. ౫౮. చారిత్రశుద్ధిః - యశోనైర్మల్యము, లబ్ధా = పొందఁబడినది - ఆఁడుదానిం జంపిన నింద చారిత్రమునకు ఎంత మచ్చ - అది తుడువఁబడి నిర్మలము చేయఁబడినది. చరణ నిపతితః = శరణు అని పాదాలలో వ్రాలిన శత్రువు సైతము ఇతఁడు (దాననే) విడిపింపఁ బడినాఁడు. - అదియు నా కొక పెద్దకోరిక తీఱుటయే. - ఇపుడు కూడ నీవు అడిగితివి, వీనిని విడువు - చంపెదను అని - కావున అదియు నాకు పెద్ద సిద్ధియే. ప్రియసుహృత్ = ప్రియమిత్రము, ఆర్యకః = ఆర్యకుఁడు, ప్ర ఉత్ఖాత అరాతిమూలః = అడుగంట త్రవ్విపాఱవైచిన శత్రువు వేరు కలవాఁడై - శత్రువును వేరూడఁబెఱికి, రాజా = రాజై, అచలాం శాస్తి = భూమిని ఇయం ప్రియా = ఈప్రేయసి, భూయః ... = చచ్చియు - చంపఁబడినంతయయ్యు - మరల ప్రాప్తా = పొందఁబడినది. ప్రియసుహృది - నాయొక్క - నీయొక్కయు - ప్రియమిత్రమందు (ఆర్యకునందు) ఎంతయు అనురక్తుఁడవుగా కూడినవాఁడవు, (నీవు) మే వయస్యః - నాకు మిత్రము వయితివి - మదనికను నీవును వసంతసేనను నేనును పొందుట చేతనంగూడ నీవు నాకు వయస్యుఁడవే అయితివి. యత్ అపరం = ఏ వేఱైన దానిని, అహం అధునా త్వం ప్రార్థయే = నేను ఇపుడు నిన్ను ప్రార్థింతునో - (తత్ = అది). అతిరిక్తంచ = ఇంతకు మించినది, లభ్యం = (నాకు) పొందఁదగినది, కిం = ఏమున్నది?

శ్లో. కాంశ్చి త్తుచ్ఛయతి ప్రపూరయతి వా
కాంశ్చి న్నయ త్యున్నతిమ్.
కాంశ్చి త్పాతవిధౌ కరోతి చ
పునః కాంశ్చి న్నయ త్యాకులాన్
అన్యోన్యం ప్రతిపక్షసంహాతి మిమాం
లోకస్థితిం బోధయన్
ఏష క్రీడతి కూపయన్త్రఘటికా
న్యాయప్రసక్తో విధిః. 38

నాకు కావలసినవన్నియు నీవు నాకు సంపాదించియిచ్చితివి. ఇంతకు మించి నేను కావలయునని కోరఁదగినది ఏ మున్నది?

శ్లో. 38. కాన్ చిత్ = కొందఱిని, తుచ్ఛయతి = ఏమియు లేనివారిం జేయును, (అట్లే) ప్రపూరయతి వా = పూర్తిగా నింపును – నిండినవారిం జేయును – కాంశ్చిత్ = కొందఱిని, ఉన్నతిం = అభ్యుదయమును, నయతి = పొందించును. కాంశ్చిత్ = కొందఱిని. పాతవిధే కరోతి చ = పడం జేయును. పునః = మరల, కాంశ్చిత్ = కొందఱిని, ఆకులాన్ = ఆకులపాటు చెందినవారిని, నయతి = అటునిటు కొనిపోవును. అన్యోన్యం = ఒండొంటికి, ప్రతిపక్షసంహాతిం = ప్రతిపక్షముల మొత్తము అయినది అని, ఇమాం లోకస్థితిం = ఈలోకమందలి – కాదా – లోకుల, దశను, బోధయన్ = తెలుపుచు, ఉపదేశించుచు, విధి, కూపయన్త్రఘటికాన్యాయ ప్రసక్తః = బావి యేతపు కుండల న్యాయమందు ప్రీతిగలవాఁడై, క్రీడతి = ఆడుచున్నాఁడు,

ఏతమును కొన్నికుండలను ఏమియు నీళ్ళులేని వానిం జేయును, కొన్నింటిని పూర్తిగా నింపును. కొన్నిటిని పైకి కొనిపోవును, కొన్నిటిని క్రింద పడునట్లు చేయును – పడవైచును – కొన్నిటిని – ఇటు క్రిందికి కాక అటు పైకి కాక – నడుమంత్రమున ఊఁచుచుండును. అట్లే విధియు క్రీడించుచున్నాఁడు – కొందఱిని గర్భదరిద్రులను – ఏమియు లేనివారిం జేయును – కొందఱిని ధనముతో నింపి అధ్యులం జేయును. కొందఱిని గొప్ప అభ్యుదయముం బొందించును, కొందఱిని చాలక్రింద, హీనదశలో ఉంచును. కొందఱిని ఇటు కాక అటు కాక, ఎప్పుడు వ్యగ్రులనుగా

త థా పీద మస్తు. ( భరతవాక్యమ్ )

శ్లో. క్షీరిణ్యః సన్తు గావో,
భవతు వసుమతీ సర్వసంపన్నసస్యా,
పర్జన్యః కాలవర్షీ,
సకలజనమనోనన్దినో వాన్తు వాతాః,
మోదన్తాం జన్మభాజః
సతత మభిమతా, బ్రాహ్మణాః సన్తు సన్తః,
శ్రీమన్తః పాన్తు పృథ్వీం
ప్రశమిత రిపవో ధర్మనిష్ఠా శ్చ భూపాః. ౬౦

---

అకులపాటు చెందినవారింగా – అటు పైకిపోవనో ఇటు క్రిందకు పడనో – అన్నట్లు ఉంచును. ఇట్లు లోకమును ఒండొంటికి కానివాని మొత్తములతో నింపును – రిక్తులుపూర్ణులు అని ఒక ప్రతిపక్షులజత, ఉన్నతులు అధఃపతితులు అని ఒకజత – పైకా క్రిందికా అని అకుల ప్రతిపక్షులజత – లోకాన జనులను ఇట్లు బావియేతము కుండలం బోలె, ఆడించుచు లోకతత్త్వము ఉపదేశించుచు ఆడుకొనును విధి.

ఈనాటకమున సర్వము విధియాటయే కాని పురుషకారపు మాట ఇంచుకయు లేదు – అది వట్టి బలహీనము – విధిముందు నిలువదు – భరతవాక్యము – భరతుఁడనఁగా నటుఁడు. ఇది చారుదత్తుఁడు చెప్పినను, చారుదత్తుఁడుగా చెప్పినది కాదు – ఆవేసము వేసిన నటుఁడు – తమ సమాజము తరపున చెప్పిన దగును.

శ్లో. ౬౦. గావః = ఆవులు, క్షీరిణ్యః = ఎప్పుడును ఎక్కువ పాలిచ్చునవి, సన్తు = అగుగాక; వసుమతీ = భూమి, సర్వసంపన్నసస్యా = అన్నిరకములయు ఫలవంతమయిన, పైరులు గలదిగా, భవతు = అగునుగాక – పర్జన్యః = మేఘుఁడు, కాలవర్షీ = కావలసినట్టియు కురియవలసినట్టియు కాలాన కురియువాఁడు (అగునుగాక.) సకలజన ... = ఎల్లజనుల మనస్సును సంతోషపెట్టునవై, వాతాః వాన్తు = గాలులు వీచునుగాక, జన్మభాజః – జన్మమెత్తినవారు – ఎల్ల జనులును అనుట, సతతం = ఎప్పుడును, అభిమతాః = కోరికలు కలవారు – అనఁగా తీఱిన కోరికల వారుగా, మోదన్తాం = సంతోషింతురుగాక – బ్రాహ్మణాః = బ్రాహ్మ

[ఇతి నిష్క్రాన్తాః సర్వే]

ఇతి సంహారో నామ

దశమోఽఙ్కః

---

ణులు, సన్తః = మంచివారుగా - సత్పురుషులుగా, సన్తు = అగుదురుగాక. భూపాః = రాజులు, శ్రీమన్తః = సిరిగలవారై, ప్రశమిత రిపవః = అడంపఁబడిన - జయింపఁబడిన శత్రువులుగలవారై, ధర్మనిష్ఠాః చ = ధర్మమందు నెలకొన్న వారుగా - ధర్మమే కాని అధర్మము చేయని పట్టుదల గలవారుగా, పృథ్వీం = భూమిని, పాన్తు = పాలింతురుగాక.

చారుదత్తుఁడు ఖజాన కొఱ్ఱుకఱ్ఱతో వధ్యవేషమున చండాలురచే రాజమార్గమున పటహావాద్యముతో పౌరులకు అతని నేరమును దండనను చాటుచు ఆజనులు ఏడుచ్చుం జూచుచు గుంపులువడి తమ వెంట వచ్చుచుండ, నడిపింపఁబడుచున్నాఁడు. కొన్ని ఘోషణాస్థానములు కడచినవి. మైత్రేయుఁడు రోహసేనుం దెచ్చినాఁడు. చారుదత్తుఁడు చండాలురను బతిమాలుకొన్నాఁడు, తన్నుం బాలుం జూడనిండని. అంతట పితృపుత్రసమాగమము ఎంతయు జాలిగొలుపుచున్నది. కొడుకుం గౌఁగిలించుకొని, వాని కిచ్చుటకు తన కేమియును లేదని తన జందెముం దీసి వాని కిచ్చి, నాయనా అమ్మతో ఆశ్రమమునకుం బొమ్మని చెప్పెను. ఇంతలో ఆ యూరేగింపు శకారునియింటి చెంగటికి వచ్చినది. అక్కడ స్థావరక చేటుఁడు, మిద్దెమీఁద సంకెలలతో కట్టియుంపఁబడినవాఁడు ఆచాటింపు విని, అయ్యో సాధువు చంపఁబడు చున్నాఁడే, తన దొర శకారుఁడు కదా వసంతసేనం జంపినవాఁడు అని ఆమాటను అక్కడినుండి క్రిందిగుంపుకు వినఁబడనీ అని అఱచినాఁడు. మఱి అది దూరమగుటచే ఎవరికిని వినఁబడలేను. మఱి యెట్లని, వాఁడు చావుకు తెగించి అక్కడి కిటికీనుండి తన్ను నేలమీఁదికి పడవైచుకొన్నాఁడు. ఎట్లో చావు తప్పినది. ఆ దెబ్బకు సంకెల విఱిఁగి వీడిపోయినది. అంతట పరువెత్తి గుంపులో దారి చేసికొని పోయి చండాలురతో నిజమును, తన దొర చంపినాఁడని, ఎల్ల జనులు వినుచుండఁ జెప్పినాఁడు, దాన చారుదత్తునికి మోక్షమగునని అనుకొనుచుండఁగా, ఇంతలో శకారుఁడును ఆ చాటింపు విని 'తమాషా' చూడను మిద్దెమీఁదికి వచ్చినాఁడు, చాటింపు ఆగుటం జూచి మిద్దెమీఁద స్థావరకుఁడు లేకపోఁగా, కొంపమునిఁగిన దని దిగులుపడి వచ్చి వెదకి వానిం బట్టుకొని 'నీకు ఈమురుగు ఇత్తును,

మాట వేలుగా చెప్పుమని, వాఁడు ఒప్పుకొననందున, వానిని తాను తన బంగారుల కొట్టుం జూచుకొమ్మనఁగా, వాఁడందుల బంగారు, ఇదిగో ఈసురుగును దొంగిలించి నాఁడు, చావఁగొట్టితిని, దాననా మీఁద ఈయబద్ధము చెప్పుచున్నాఁడని తెలియఁ జెప్పెను. చండాలురను ఇంకను ఆలస్యమెందుకురా, చంపివేయుఁడు త్వరగా చారుదత్తుని, ఆ కుమారునితో కూడనే చంపివేయుఁడు అనెను. చండాలురు తమకు అట్లుత్తరువు లేదనిరి. ఇంతలో మరల ఘోషణచోటు రాఁగా ఘోషించినారు. అంతట చండాలురు ఆదినము తమలో ఎవరిదో చంపువంతు నిర్ణయించుకొని, చారుదత్తునిఇఁక నీవు తలఁచుకో, దేనిం గడసారిగా తలఁచుకొందువో అనెను. అతఁడును 'ధర్మమే ప్రభావము చూపునేని, ఎందుండియేని ఎట్లో ఆవసంతసేనయే వచ్చి నా మచ్చను తుడుచునుగాక అని కోరుకొనెను. ఇంతలో మరల ఘోషణకు చోటు వచ్చెను, అప్పటికి వసంతసేన బౌద్ధమురాన తేలుకొన్నట్టిది, భిక్షునితోడున చారుదత్తునింటికే తరలినది. దారిలో పెద్ద జనులగుంపుం జూచి భిక్షువు విచారించి ఆచాటింపు సంగతి వసంతసేనకుం జెప్పినాఁడు. అంతట అయ్యో యని ఎంతేని సంభ్రమముతో జనముం ద్రోసికొనుచు వారిరువురు పోఁజొచ్చినారు. ఇంతలో చారుదత్తుని నఱుకఁజూచిన కత్తి చండాలుని గట్టిపట్టునుండియే తనంతట క్రిందపడినది. దాననెంతేని ఆశ్చర్యము తోఁచిన చండాలునికి చారుదత్తుఁడు ఇఁక చావఁడని తోఁచినది. అయినను రాజాజ్ఞ యని, కొఱ్ఱునాటి చండాలురు దానిమీఁదికి వాని నెత్తి వేయఁబూనిరి. ఇంతలో చారుదత్తుఁడు ఆతని కడపటికోరికను 'ధర్మము ప్రభావము చూపునేని' ఇత్యాదిం గోరుకొనెను. అప్పుడే వీడి విరిసి బుజాన పడిన కొప్పు వెండ్రుకలతో, వసంతసేన పరువున వచ్చి చారుదత్తువక్షమున వ్రాలినది. దానిం జూచి శకారుఁడు ఎంతేని భయపడి, తనకు ప్రాణాలు లేచిపోవుచున్నవని పరారియైనాఁడు. చండాలురు వానిం బట్టి తేర వెంబడించినారు. జనులును చారుదత్తుఁడు బ్రదికినాఁడు అనుచు మొగాన వికాసము చెందిరి. చారుదత్తుఁడు వసంతసేనం జూచి, పోల్చుకొని. సంజీవనివలె వచ్చితివే, 'ఆహా ప్రియసంగమప్రభావము!' అని యనుకొనెను-[ఒండెడ 'చావులు కూడ సాధుజన సంగభవంబులు తారకంబులో' ఉ. రా. చ. II - 2. అని శంబూకుఁ డనఁడా?] చారుదత్తుఁడు వసంతసేనతో శకారుఁడు ఆపూర్వవైరాన ఇంత చేసినాఁ డనెను. తాను తోఁటలో చూచి వసంతసేనం బ్రదికించితి నన్న భిక్షువుం జూచి ఫలానా అని తెలిసికొని చారుదత్తుఁడు సంతోషించెను.

ఇంతలో యజ్ఞవాటిలో పాలకుం జంపిన ఆర్యకుని యథావిధిగా అభిషేకించి, అతని యుత్తరువుం గొని శర్విలకుఁడు చారుదత్తు విడిపింప వచ్చి, అతఁ డప్పటికే బ్రదికి వచ్చిన వసంతసేనం గూడియుంటం గాంచి, సంతసించి, చారుదత్తునికి తన్నుం దెలుపుకొని ఆర్యకరాజు నుత్తరువుం గొనివచ్చితి నని, దాన చారుదత్తునికి కుశావతిరాజ్య మొసఁగి వసంతసేనకు వధూవగుంఠనముం బ్రసాదించి, ఇఁక తా నక్కడ అన్నియు చారుదత్తునియిచ్ఛయుత్తరువుల మెయి చేయుదు నన్నాఁడు. ఇంతలో పట్టి కట్టి తేఁబడిన శకారుని, తన పాదాలలో వ్రాలి శర ణన్నవానిని, అందఱు ఏకవాక్యముగా చంపవలసినదని యనుచుండఁగా, ఎవ్వరిమాటను వినక, పొసఁగ మేలు చేసి పొమ్మనుటే 'చావు' అని విడిచిపెట్టి, వాని రాష్ట్రియత యందు ఎప్పటియట్ల నిలిపెను. వాఁడు బ్రతికినానురా బాబూ అని తిరిగి చూడక ఇల్లు చేరఁబోయెను.

ఇంతలో మఱొకవంక ధూతమ్మ ఎవరిమాటను వినక చారుదత్తుని యమంగళము వినకముందే నిప్పుమంటలం దాఁకెద నని సంభ్రమించుచుండెనని చందనకుఁడు వచ్చి చెప్పెను. ఎట్లో వసంతసేనంగూడి చారుదత్తుఁడును శర్విలకాదులును అక్కడికి పోఁగా చారుదత్తుఁడు రోహసేను నెత్తి కౌఁగిలించుకొని వాత్తుకొని, ధూతమ్మను నిప్పువలన మాన్పి తేర్చెను. చారుదత్తుఁడు తన మిత్రుని పరిజనమును - అందఱిని కలసికొనెను. ఇట్లు ఇట్టి చావులు తప్పి కలసికొని అప్పుడే అభ్యుదయముం బొందిన వారిసంతోషమునకు మేరలుండునా! ఇక్కడ ఇందు గుఱుతు పెట్టఁబడిన ప్రభావములు - మూఁడు.

'అహో సత్యాః ప్రభావః
అహో ప్రభావః ప్రియసంగమస్య!
ప్రభవతి యది ధర్మో దూషితస్యాపి మేఽద్య.'

సంహారము - ముగింపు -

అన్నిటి నొక్కెడం గూర్చుట అను

పదియవ యంకము

ముగిసినది

# శ్లోకసూచి

Vedam Venkataraya Sastry & Bros, Madras - 1. 1974